12 గు॥పా॥౪౭-౫౪పుష్య౨౧-౪౫రా౧౨-౫త్యా౪-౩౨భో౨-౦
13 శు॥ద్వి॥౫౫-౩౦పుష్య౨౯-౪౮త్యా॥భా॥భో౧-౪౯
14 శ॥త॥౬౦-౧౦ఆశ్రే౩౮-౩౮ది౪-౧త్యా౪-౩౧భో౧-౩౯
15 ఆ॥త॥౧-౫౮మఖ౪-౫౮ది౧౧-౨౨త్యా౪-౩౦భో౧-౨౭
16 సో॥చ॥౮-౩౨పూ-ఫ౫౧-౨౫ది౮-౭త్యా౪-౨౬భో౧-౧౭
17 మం॥పం॥౧౨-౪ఉ-ఫ౫౬-౩౬ది౧౧-౨౧త్యా౪-౨౧భో౧-౮
18 బు॥ష॥౧౫-౧౭హ౬౦-౧౦ది౧౯-౫త్యా౪-౧౬భో౫-౫౮
19 గు॥స॥౧౬-౪౪హ౦-౪౦ది౨౧-౨౦త్యా౪-౯భో౦-౪౬
20 శు॥అ॥౧౬-౨౮చి౨-౩౫ది౧౬-౨౧త్యా౪-౧భో౦-౩౬
21 శ॥న॥౧౪-౧౬స్వా౨-౩౭ది౧౬-౧౩త్యా౩-౫౩భో౦-౨౫ [౦-౧౫
22 ఆ॥ద॥౧౦-౧౮విశా౦-౫౬అనూ౫౫-౫౬ది౧౦-౧౬త్యా౩-౪౫భో
23 సో॥ఏ॥౪-౩౩ఏష్యా౫౨-౧౩జ్యే౫౧-౪౩ది౯-౪౨త్యా౩-౩౯సింహ
రవిః౩౪-౫౮భో౦-౫వర్షఋతుప్రారంభము
24 మం॥త్ర॥౪౭-౩౫మూల౫-౩౧రా౯-౪౨త్యా౩-౩౫భో౫-౨౨
25 బు॥చతు॥౩౯-౩౦పూ-షా౩౭-౩౫ది౬-౪౨త్యా౩-౩౨రా౨౩-౫౮
త్యా౩-౩౧భో౫-౧౧
26 గు॥పూర్ణి॥౨౯-౫౮ఉషా౩౧-౧౮రా౮-౫౩త్యా౩-౩౧భో౫-౦
27 శు॥కృ-పా॥౨౦-౪౦శ్ర౨౩-౫౫ది౩౨-౪౫త్యా౩-౩౨భో౪-౫౦
28 శ॥ద్వి॥౧౧-౩౧ధని౧౮-౦రా౧-౨త్యా౩-౩౬భో౪-౪౦ [౪-౨౯
29 ఆ॥త॥౩-౨౪ఏష్యా౫౩-౩౦శత౧౧-౩ది౨౫-౪౮ త్యా ౩-౪౧భో
30 సో॥పం॥౫౧-౨౮పూ-భా౬-౧౨ది౯-౦త్యా౩-౪౭భో౪-౧౭
31 మం॥ష॥౪౮-౫౦ఉ-భా౩-౦రా౦-౧౦త్యా౩-౫౪భో౪-౮
1 బు॥స॥౪౫-౫౬రే౧-౩౭రా౨౦-౪త్యా౪-౨భో౩-౫౮
2 గు॥అ॥౪౫-౫౯అశ్వి౨-౧౫ది౨౮-౯త్యా౪-౧౦భో౩-౪౬
3 శు॥న॥౪౮-౫౮భర౪-౪౦రా౪-౩౬త్యా౪-౧౬భో౩-౩౮
4 శ॥ద॥౫౧-౨౦కృ౭-౪౩రా౨౦-౧౯త్యా౪-౨౨భో౩-౨౪
5 ఆ॥ఏ॥౫౫-౫౯రో౧౪-౯ది౨౯-౪౮త్యా౪-౨౮భో౩-౧౩
6 సో॥ద్వా॥౬౦-౧౦మృ౨౦-౫౪రా౧౨-౪౦త్యా౪-౨౯భో౩-౩
7 మం॥ద్వా౧-౪౦ఆర్ద్ర౨౭-౨౪త్యా॥భా॥భో౨-౫౨
8 బు॥త్ర॥౭-౫పున౩౬-౨ది౨-౧౩త్యా౪-౩౧రా౨౮-౨-త్యా౪-౩౨భో
9 గు॥చతు॥౧౪-౪౩పుష్య౪౪-౨౦శే౩-౨౧భో౨-౩౦ [౨-౪౧
10 శు॥అమా॥౨౧-౧౩ఆశ్రే౫౨-౩౧ది౨౦-౪౧త్యా౪-౩౨భో౨-౨౦

11 శ॥పా॥౨౮-౧౩మఖ౫౯-౪ది౨౬-౩త్యా౪-౨౯భో౨-౯
12 ఆ॥ద్వి॥౩౨-౨౮పూ-ఫ౬౦-౧౦ది౨౧-౧౫త్యా౪-౨౬భో౧-౫౯
13 సో॥త॥౩౬-౫౪పూ-ఫ౫-౩౩ది౨౫-౧౨త్యా౪-౨౨భో౧-౪౭
14 మం॥చ॥౪౦-౪ఉ-ఫ౧౦-౫౭రా౧-౪౭త్యా౪-౧౬భో౧-౩౨
15 బు॥పం॥౪౧-౫౪హ౧౪-౫౪రా౪-౧౪త్యా౪-౧౦భో౧-౨౬
16 గు॥ష॥౪౨-౫౩చి౧౮-౩౭రా౦-౨౫త్యా౪-౪భో౧-౧౬
17 శు॥స॥౪౧-౧౯స్వా౧౭-౫౭రా౧-౨౪త్యా౪-౦భో౧-౫
18 శ॥అ॥౩౭-౪౮విశా౧౭-౪౮ది౨౭-౩౧త్యా౩-౫౪భో౦-౫౫
19 ఆ॥న॥౩౪-౪౩అనూ౧౮-౨ది౩౦-౨౨త్యా౩-౪౮భో౦-౪౪
20 సో॥ద॥౨౯-౪౬జ్యే౧౩-౪౬త్యా॥భా॥భో౦-౩౪
21 మం॥ఏ॥౨౨-౩౫మూల౯-౩౫ది౫-౫౨ త్యా౩-౪౩రా౦-౩ త్యా౩-౩౭
భో౦-౨౩ [భో౦-౧౩
22 బు॥ద్వా॥౧౪-౫౧పూ-షా౪-౨ఉ-షా౫౩-౨౬ది౨౧-౫౨త్యా౩-౩౪
23 గు॥త్ర॥౬-౧౯ ఏష్యా౫౧-౧ శ్ర౫౦-౩౬ ది ౫-౪౦ త్యా౩-౩౨రా
౨౭-౧౦త్యా౩-౩౨కన్యాయాం రవిః౫౧-౧౨భో౦-౨
24 శు॥పూ॥౪౭-౨౫ధ౪౩-౪౬శే౩-౩రా౨౭-౩౩త్యా౩-౩భో౪౫-౧౨
25 శ॥పా॥౩౯-౫౫శత౩౮-౧౫శే౩-౨౩రా౨౦-౨౮త్యా౩-౩౮భో౫-౨
26 ఆ॥ద్వి॥౩౨-౭పూ-భా౩౧-౨౯రా౨౩-౨౫త్యా౩-౪౧భో౪-౫౧
27 సో॥త॥౨౫-౩౦ఉ-భా౨౬-౫౦రా౨౪-౩త్యా౩-౪౮భో౪-౪౧
28 మం॥చ॥౨౦-౨౩రేవ౨౩-౪౨త్యా॥భా॥భో౪-౩౧
29 బు॥పం॥౧౮-౯అశ్వి౨౨-౨౪ది౧౨-౩౫ త్యా౩-౫౫ రా౧౫-౪౦
త్యా౪-౩భో౪-౨౦
30 గు॥ష॥౧౫-౫౪భ౨౩-౧౪రా౨౩-౩౨త్యా౪-౧౧భో౪-౧౦
31 శు॥స॥౧౬-౪౭కృ౨౫-౫౭త్యా॥భా॥భో౪-౦ [భో౩-౪౯
1 శ॥అ॥౧౯-౩౫రో౩౦-౩౪ది౯-౦ త్యా౪-౧౭ రా౧౫-౪త్యా౪-౨౫
2 ఆ॥న॥౨౪-౪మృ౩౬-౪౫త్యా॥భా॥భో౩-౩౯
3 సో॥ద॥౨౯-౪౬ఆర్ద్ర౪౩-౫౭ది౦-౧౭త్యా౪-౨౯భో౩-౨౭
4 మం॥ఏ॥౩౬-౧౨పు౫౧-౪౮ది౧౮-౫౫త్యా౪-౩౧భో౩-౧౭
5 బు॥ద్వా॥౪౨-౪౮పుష్య౬౦-౦ది౧౪-౩౨త్యా౪-౩౨భో౩-౭
6 గు॥త్ర॥౪౯-౧౦ఆశ్రే౬౦-౧౦రా౫-౧౦త్యా౪-౩౧భో౨-౫౮
7 శు॥చతు॥౫౪-౫౨ఆశ్రే౮-౪౪రా౯-౪౮త్యా౪-౨౮భో౨-౪౮
8 శ॥అమా॥౫౯-౪౦మ౧౪-౧౪రా౫-౩౩త్యా౪-౨౨భో౨-౩౬

8 గు॥ ద్వి॥ ౬-౧౭ విశా ౩-౩౭ వి౧౩-౧౨ త్యా ౩-౫౦ భో ౨-౪౩ [భో ౨-౩౨
9 శు॥ త॥ ౨-౪౧ స్వా౫౫-౬ అనూ౧-౯ జ్యే౫౬-౫౧వి౧౪-౨౫త్యా ౩-౮౭
10 శ॥ చ॥ ౫౨-౫౫ మూ౫౪-౫౦రా౨౭-౪౫త్యా ౩-౪౬ భో ౨-౨౦
11 ఆ॥ పం॥ ౮౬-౫౨ పూ-షా౫౧-౧౬ వి౧౭-౨౪త్యా ౩-౮౫ భో ౨-౯
12 సో॥ ష॥ ౪౧-౮౫ ఉ-షా౪౭-౫౧వి౧౦-౭త్యా ౩-౮౬ రా ౨౯-౫౪
త్యా ౩-౪౭ భో ౧-౫౯ [భో ౧-౮౭
13 మం॥ స॥ ౩౬-౮౧ శ్ర౪౪-౩౭ శ ౦-౫౫ రా ౨౫-౫౮ త్యా ౩-౮౯
14 బు॥ అ॥ ౩౧-౪౪, ౭౪౧-౩౨ రా ౩౦-౩౦ త్యా ౩-౮౯ భో ౧-౩౬
15 గు॥ న॥ ౨౭-౧౫శ ౨౯-౩౯ శ౨-౨౯రా౨౫-౮౭ త్యా ౩-౮౯ భో ౧-౨౫
16 శు॥ ద॥ ౨౨-౪౬ పూ-భా ౩౫-౫౩ రా ౩౦-౫౨ త్యా ౩-౫౧ భో ౧-౧౪
17 శ॥ ఏ॥ ౧౯-౩౬ ఉ-భా ౩౩-౩౬ శ౧-౮౯ భో ౧-౩
18 ఆ॥ ద్వా॥ ౧౮-౮౯ రే-౩౭-౪౨వి౨-౩౯ త్యా ౩-౫౩ భో ౦-౫౨
19 సో॥ త్ర॥ ౧౧-౪౨ అశ్వ ౩౦-౩౪వి౨౦-౮౫ త్యా ౩-౫౫ రా ౨౬-౨౬
త్యా ౩-౫౯ భో ౦-౮౧
20 మం॥ చతు॥ ౯-౨౭భ ౩౦-౧౭ త్యా॥ భా॥ భో ౦-౩౦
21 బు॥ పూర్ణి॥ ౯-౧౯ కృ ౩౧-౯వి౦-౮౩ త్యా ౪-౩ భో ౦-౧౯
22 గు॥ పా॥ ౯-౩౦ రో ౩౩-౨౯వి౧౨-౮౨ త్యా ౪-౯రా ౨౦-౨౯ త్యా ౪-౧౫
ధనుషి రవిః ౫౯-౧౨ భో ౦-౯ హేమంతర్తు ప్రారంభము
23 శు॥ ది॥ ౧౦-౨౭ మృ ౩౭-౨౦రా ౩౨-౦ త్యా ౪-౨౧ భో ౫-౩౨
24 శ॥ త॥ ౧౩-౫౫ ఆర్ద్ర ౪౨-౪౧ శ౪-౧౦ భో ౫-౨౧
25 ఆ॥ చ॥ ౧౯-౫౩ పున ౪౯-౫౧వి౧౫-౫౬ త్యా ౪-౨౬ భో ౫-౯
26 సో॥ పం॥ ౨౮-౫౪ పుష్య౫౬-౩౯వి౧౧-౪౦ త్యా ౪-౩౦ భో ౪-౫౯
27 మం॥ ష॥ ౩౧-౩౯ ఆశ్లే౬౦-౧౦రా ౫-౪ త్యా ౪-౩౨ భో ౪-౪౬
28 బు॥ స॥ ౩౯-౨౦ ఆశ్లే౪-౩ ౩ రా ౧౦-౩౧ త్యా ౪-౩౧ భో ౪-౩౫
29 గు॥ అ॥ ౪౪-౨౯ మఘ౧౨-౧౩ రా౬-౩౪ త్యా ౪-౨౬ భో ౪-౨౩
30 శు॥ న॥ ౪౯-౧౪ పూ-ఫ౧౯-౪౬రా ౧౦-౩౦ త్యా ౪-౨౧ భో ౪-౧౨
1 శ॥ ద॥ ౫౧-౫౬ ఉ-ఫ౨౩-౫౯రా ౧౯-౨౦ త్యా ౪-౧౪ భో ౪-౦
2 ఆ॥ ఏ॥ ౫౩-౮౨హ౨౭-౨౦రా ౨౦-౫ త్యా ౪-౬ భో ౩-౮౯
3 సో॥ ద్వా॥ ౫౨-౮౯ చి౨౯-౫౩రా ౧౫-౪ త్యా ౩-౫౯ భో ౩-౩౭
4 మం॥ త్ర॥ ౫౦-౧౯ స్వా౨౯-౪౧రా ౧౪-౨౮ త్యా ౩-౫౨ భో ౩-౨౬
5 బు॥ చతు॥ ౪౬-౭విశా౨౬-౪౦రా ౯-౨౦ త్యా ౩-౪౭ భో ౩-౧౪
6 గు॥ అమా॥ ౪౦-౪౭ అనూ౨౩-౧౦ రా ౯-౩౨ త్యా ౩-౮౩ భో ౩-౩

7 శు॥ పా॥ ౩౪-౩౬ జ్యే౧౯-౪ త్యా॥ భా॥ భో ౨-౫౧ [౩౯ భో ౨-౮౦
8 శ॥ ది॥ ౨౭-౫౩ మూ౧౮-౧౫వి౧౦-౩౪ త్యా ౩-౮౧ రా ౯-౩౩ త్యా ౩-
9 ఆ॥ త॥ ౨౧-౫౯ పూ-షా౯-౯వి౨౭-౨౭ త్యా ౩-౮౦ భో ౨-౨౯ [౨-౧౭
10 సో॥ చ॥ ౧౪-౧౨ ఉ-షా౪-౪ శ్ర౫౫-౨౫వి౧౩-౧౯ త్యా ౩-౮౨ భో
11 మం॥ పం॥ ౭-౪౭ ధ౫౫-౨౨వి౯-౩౯ త్యా ౩-౪౪ భో ౨-౫ [౧-౫౮
12 బు॥ ష॥ ౧-౫౯ స్వా౫౫-౧౦ శత౫౨-౦వి౧౨-౨౧ త్యా ౩-౮౬ భో
13 గు॥ అ॥ ౫౨-౮౩ పూ-భా౪౯-౧౬వి౭-౧౬ త్యా ౩-౮౯ భో ౧-౮౨
14 శు॥ న॥ ౪౯-౧౯ ఉ-భా౪౭-౨౯వి౧౨-౩౩ త్యా ౩-౫౨ భో ౧-౩౧
15 శ॥ ద॥ ౪౬-౮౨ రే౪౬-౧౮వి౧౬-౫౧ త్యా ౩-౫౫ భో ౧-౨౦
16 ఆ॥ ఏ॥ ౪౫-౪ అశ్వ ౮౬-౧౬రా ౯-౮౦ త్యా ౪-౦ భో ౧-౯
17 సో॥ ద్వా॥ ౪౪-౨౪ భర౪౭-౯వి౦-౩౭ త్యా ౮-౮ భో -౫౭
18 మం॥ త్ర॥ ౪౪-౮౯ కృ౮౯-౩వి౧౯-౫ త్యా ౮-౯ భో ౦-౮౬
19 బు॥ చతు॥ ౪౬-౧౦ రో ౫౨-౭రా ౩-౩౨ త్యా ౮-౧౨ భో ౦-౩౫
20 గు॥ పూర్ణి॥ ౪౯-౧౯ మృ౫౬-౨౮వి౭-౭ త్యా ౮-౧౭ భో ౦-౨౮
21 శు॥ కృ॥ పా॥ ౫౩-౩౬ ఆర్ద్ర౬౦-౧౦వి౧౧-౮౧ త్యా ౮-౨౨ భో ౦-౧౩
22 శ॥ ది॥ ౫౯-౪౬ ఆర్ద్ర౧-౫౪ రా౭-౩౪ త్యా ౮-౨౬ మకరే రవిః ౩౦-౧౭
భో ౦-౩ ఉత్తరాయణ ప్రారంభము
23 ఆ॥ త॥ ౬౦-౧౦ పున౯-౧౭రా ౩-౧౩ త్యా ౮-౨౯ భో ౫౫-
24 సో॥ త॥ ౪-౫౧ పుష్య౧౫-౮౩ రా ౨౮-౨౮ త్యా ౮-౩౧ భో ౮-౫౮
25 మం॥ చ॥ ౧౧-౪౫ ఆశ్లే౨౩-౩౮రా ౩౦-౯ త్యా ౮-౩౧ భో ౮-౮౮
26 బు॥ పం॥ ౧౯-౩౬ మ౩౧-౨౮ శ౨-౧౦రా ౨౬-౨౦ త్యా ౮-౨౯ భో
గు॥ ష॥ ౨౪-౫౯ పూ-ఫ౩౯-౮౧రా ౩౧-౦ త్యా ౮-౨౮ భో ౮-౨౩ [౮-౩౩
27 శు॥ స॥ ౩౬-౧౫ ఉ-ఫ౪౪-౫౧ శ౨-౫౬ భో ౪-౧౨
28 శ॥ అ॥ ౩౪-౧౩ హ౪౯-౩౭వి౭-౮౬ త్యా ౪-౧౯ భో ౮-౨
29 ఆ॥ న॥ ౩౬-౧౩ చి౫౨-౩౩వి౧౦-౩౫ త్యా ౮-౧౨ భో ౩-౫౧
30 సో॥ ద॥ ౩౬-౨౦ స్వా౫౩-౩౦వి౬-౮౪ త్యా ౮-౮ భో ౩-౮౧
31 మం॥ ఏ॥ ౩౮-౧౯ విశా౫౨-౩౦వి౭-౧౬ త్యా ౩-౫౬ భో ౩-౩౦
1 బు॥ ద్వా॥ ౩౦-౩౦ అనూ౮౯-౮౮వి౨-౨ త్యా ౩-౮౯ భో ౩-౨౦
2 గు॥ త్ర॥ ౨౫-౭ జ్యే౪౫-౨౯వి౨-౮౪ త్యా ౩-౬౩ భో ౩-౯
3 శు॥ చతు॥ ౧౯-౨౦ మూ౮౦-౬రా ౯-౮౮ త్యా ౩-౩౯ భో ౨-౫౯
4 శ॥ అమా॥ ౧౦-౩౯ పూ-షా ౩౩-౫౭వి౧-౩౯ త్యా ౩-౩౬రా ౨౩-౫ త్యా
5 ౩-౩౪ భో ౨-౮౯

# తామర తైలము

డబ్బీ 1-కి 0-6-0. 12-కి 3-8-0.

తామర ఒకవిధమైన పురుగులవలన చర్మమును మీదగాని, లోనగాని, వెండ్రుకలలోని గాని, గోళ్లలో గాని, పుట్టవచ్చును. పురుగులలో భేదములబట్టి తామరలోను 2,3, భేదములు గలవు.

గుర్తులు:—దురద, ఉంగరములవంటి చుట్లు, పొక్కులు, రసికారుట, వెండ్రుకలు ఊడిపోవుట మొదలగునవి శరీరమందంతట వ్యాపించి జిల యేర్పడును.

SOVEREIGN-REMEDY AMRUTANJAN Best Indian Pain Balm Amrutanjan Depots BOMBAY MADRAS

# దంతచూర్ణము

12-కి 1-4-0 డబ్బీ 1-కి 0-2-0.

పంటిపోటునుబాపి, నోటిదుర్గంధమును బోగొట్టి పండ్లుతోముటకు బాగుండును. చిగుళ్లనుండి రక్తము కారదు. పండ్లు ముత్యములవలె తెల్లగానుండును.

డబ్బి 1-కి గజ్జికి తైలము వెల అ. 8.

ఈ తైలమును నాలుగుపూటలు రాచిన గజ్జి, చీడ, చిలుము, జిల మొదలగునవి నశించును.

అమృతాంజనం డిపో, బొంబాయి, మదరాసు, కలకత్తా, రంగూన్.

6 | బు॥వి॥౪౭-౩౧ఉ భా౪౯-౨౩ది౧౩-౫౨ త్యా౩-౩౩ భో౨-౮
7 | గు॥త॥౪౦-౨౧రేవ౪-౬ది౧౭-౦ త్యా౩-౩౯ భో౨-౧౦
8 | శు॥చ॥౩౪-౨౪ అశ్వ౪౦-౧౮౯౧-౧౬ త్యా౩-౪౫ నో౧-౫౨
9 | శ॥పం॥౩౦-౩౭ భర౩౮-౧౮ది౩-౩౦ త్యా౩-౫౨ నో౧-౪౪
10 | ఆ॥షు॥౨౮-౪౦కృ౩౮-౨౫ది౮-౨౧ త్యా౪-౦ నో౧-౩౬ [భో౧-౨౮
11 | సో॥స॥౨౯-౧౮రో౪౦-౨౫ది౯-౫౧ తా౪-౮౯౨౫-౩౧ త్యా౪-౧౬
12 | మం॥అ॥౩౧-౨౧మృ౪౪-౩౬ త్యా॥భా॥భో౧-౨౦
13 | బు॥న॥౩౫-౨౮ఆర్ద్ర౫౦-౧౯ది౭-౩౬ త్యా౪-౨౩ నో౧-౧౨
14 | గు॥ద॥౪౧-౦పున౭-౨౦ది౨౩-౪౯ త్యా౪-౨౮ నో౧-౪
15 | శు॥వి॥౪౭-౨౦పుష్య౬౦-౧౦ది౯-౫౩ త్యా౪-౩౧ నో౦-౫౬
16 | శ॥ద్వా॥౫౪-౮పుష్య౪-౫౯ ౧౭-౩౩ త్యా౪-౩౨ భో౦-౪౭
17 | ఆ॥త్ర॥౬౦-౧౦ఆశ్రే౧౩-౦౯౧౭-౮ త్యా౪-౩౧ నో౦-౩౯
18 | సో॥త్ర॥౧-౦మ౨౦-౪౫౮౩-౧౬ త్యా౪-౨౯ భో౦-౩౧
19 | మం॥చతు॥౭-౧౩ పూ౯౨౮-౦౮౧౮-౦ త్యా౪-౨౬ నో౦-౨౩
20 | బు॥పూర్ణి॥౧౨-౪౧ఉ౯౩౪-౨౪౮౨౭-౨౦ త్యా౪-౨౨ భో౦-౧౪
21 | వి॥కృ-పా॥౧౭-౧౧హ౪౦-౦ శే౧-౪౦ మేషరవి౩౨-౧౪భో౦-౫
విషువద్దినం వసంతర్తు ప్రారంభము
22 | శు॥వి॥౨౦-౨౭చి౪౪-౨౨ది౭-౨౪ త్యా౪-౧౮౯౨౯-౫ త్యా౪-౧౪
23 | శ॥త॥౨౩-౪స్వా౪౭-౫౨ శే౩-౨౪ భో౩-౫౨ [భో౮-౦
24 | ఆ॥చ॥౨౪-౨౬విశా౫౦-౨౦ది౨-౧౬ త్యా౪-౧౦ నో౩-౪౪
25 | సో॥పం॥౨౪-౪౪అనూ౫౧-౪౫ది౦-౩౪ త్యా౪-౬ భో౩-౩౭
26 | మం॥షు॥౨౩-౫౩ జ్యే౫౨-౦ది౫-౫౧ త్యా౪-౧ భో౩-౨౮
27 | బు॥స॥౨౧-౫౬మూ౫౧-౭౦ ౧౬-౫౩ త్యా౩-౫౬ నో౩-౨౦
28 | గు॥అష్ట॥౧౮-౪౮ పూషా౪౮-౫౬ది౧౪-౪౩ త్యా౩-౫౦ భో౩-౧౨
29 | శు॥న॥౧౪-౧౮ ఉషా౪౫-౩౯ది౭-౫౧ త్యా౩-౪౬౯౨౪-౩౨ త్యా౩-౪౨ భో౩-౪
30 | శ॥ద॥౮-౪౩ శ్రవ౧-౧౩౯౧౯-౫౩ త్యా౩-౩౮ భో౨-౫౬
31 | ఆ॥౧౧॥౨-౦ ధనిష్ఠ౫౦-౪౦ ధని౩౫-౫౧౯౨౧-౨౫ త్యా౩-౩౫ నో
1 | సో॥త్ర॥౪౬-౦శత౨౯-౪౫౯౧౩-౨౮ త్యా౩-౩౪ భో౨-౪౦[౨-౮౮
2 | మం॥చతు॥౩౬-౫౮ పూభా౨౩-౨౩౯౧౩-౧౭ త్యా౩-౩౫ భో౨-౩౨
3 | బు॥అమా॥౨౯-౩౨ఉభా౧౭-౫౯౧౩-౩౩ త్యా౩-౩౭ భో౨-౨౪
4 | గు॥శ్రీయువసం॥చైత్రశు॥పా॥౨౧-౫౬రే౧౧-౧౬ త్యా॥భా॥ భో౨-౧౬

# ఆంధ్ర గ్రంధమాలలోని పుస్తకములు

| | రు | అ. | పై. |
|---|---|---|---|
| శతకమంజరి | 1 | 8 | 0 |
| బసవపురాణము | 2 | 8 | 0 |
| బెల్గాము కాంగ్రెసు అధ్యక్షోపన్యాసము | 0 | 4 | 0 |
| ధమ్మపదము | 0 | 10 | 0 |
| జీర్ణవిజయనగరచరిత్రము | 1 | 0 | 0 |
| భీష్ముఁడు 1 0 0 కావ్యాత్మ | 2 | 0 | 0 |
| ఆత్మకథ (1-వ భాగము) | 0 | 12 | 0 |
| ఆత్మకథ (2-వ భాగము) | 1 | 0 | 0 |
| ఆంధ్రవాఙ్మయసూచిక | 1 | 0 | 0 |
| ఆంధ్రభారత కవితావిమర్శనము | 2 | 0 | 0 |
| భారతీయచిత్రకళ 1-0-0 ప్రార్థనగీతావళి | 0 | 4 | 0 |
| జీవనప్రభాతము | 1 | 8 | 0 |
| మేఘదూత 0 12 0 గీతాబోధ | 0 | 4 | 0 |
| తంజాపురాంధ్రనాయకరాజచరిత్రము | 2 | 0 | 0 |
| సబర్మతీ ఆశ్రమ నియమములు | 0 | 4 | 0 |
| అళియరామభూపాలుడు | 1 | 8 | 0 |
| నందనారు చరిత్రము | 0 | 8 | 0 |
| ఆత్మచరిత్రము | 1 | 0 | 0 |
| ఆంధ్రఋతుసంహారము | 0 | 8 | 0 |
| ఆంధ్రవిజ్ఞానసర్వస్వము సంపుటము 1-కి | 10 | 0 | 0 |

ఆంధ్ర గ్రంధమాల, 2, తంబుసెట్టివీథి, మద్రాసు.

# శ్రీ నాగేశ్వర జ్యోతిర్విద్యాలయము.

ఇందు విద్యార్థుల కుచితముగ జ్యోతిశ్శాస్త్రము స్కంధ త్రయమునూ నేర్పబడును ఇందు జాతక, ముహూర్త, ప్రశ్న, వాస్తు మొదలగు సర్వవిషయములగూర్చియు తగు శాస్త్రప్రమాణములతో సలహా లివ్వబడును

సందేహములసంతించి జాబు వ్రాయువారు తమ జాబుకు సరిపోయిన పోస్టుబిళ్లలను పంపవలెను లేనిచో జవాబు రానేరదు

ఇందు ధర్మశాస్త్ర సందేహములు సైతము తీర్చబడును

కుప్పా విశ్వపతి శాస్త్రి,

శ్రీ నాగేశ్వరజ్యోతిర్విద్యాలయం, పవరుపేట, ఏలూరు,
(పశ్చిమగోదావరిజిల్లా)

వర్తకులకు మంచితరుణము

# ఆంధ్ర పత్రిక

భావనామ సంవత్సర పంచాంగము

శ్రీ కుప్పావిశ్వపతి శాస్త్రి, శ్రీ చివుకుల వెంకటరమణగార్లచే గుణింపబడినది యిదివరకు యిందు ప్రచురించు మామూలువిషయములేకాక మాసగ్రహస్ఫుటములు, నక్షత్ర గ్రహయోగములు మొదలగు నూతనాంశములు దృగ్గణిత పంచాంగ సిద్ధాంతానుసారముగా చేర్చి ముద్రింపబడినది

**100 కి రు. 3-8-0 1000 కి రు. 30-0-0**

మరా — ఒకేదఫా 1 వెయ్యింటికి ఆర్డరిచ్చువారి చిరునామా ముఖపత్రమునందు ప్రకటించబడును నూటికి తక్కువ పంపబడవు, సొమ్ము అడ్వాన్సుగా పంపగోరెదము రైల్వేచార్జి, పోస్టుకర్చులు ప్రత్యేకము.

ఆంధ్రపత్రిక ఆఫీసు, మదరాసు

# వెంకటేశ్వర ఆయుర్వేద నిలయము

రిజిస్టర్డు.

## చింతలూరు, ఆలమూరు పోస్టు, తూర్పుగోదావరి జిల్లా.

| బ్రాంచి ఆఫీసులు | 1 కాకినాడ దేవాలయంవీధి | 2 రాజమండ్రి హైరోడ్డు | 3 విశాఖపట్టణం హైరోడ్డు | 4 అనకాపల్లి హైరోడ్డు | 5 పెద్దాపురం హైరోడ్డు | 6 ఏలూరు హైరోడ్డు |
|---|---|---|---|---|---|---|

ఢిల్లీ, మదరాసు, నెల్లూరు, తెనాలి, శ్రీకాకుళం, విజయనగరం, రాజమండ్రి, కాకినాడ, మొ॥ పట్టణములలో జరిగిన విద్వద్వైద్యసభలయందు స్వర్ణపతకములను, యోగ్యతాపత్రములను బహుమానములను పొందిన

## "వైద్యరాజ" ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి సుప్రసిద్ధౌషధములు

### వసంత కుసుమాకరము

మధుమేహము, అతిమూత్రము, రాచపుండ్లు, శుక్రక్షయము, శుక్రనష్టము, బలహీనత, చిరకాలపు తెల్లకుసుమ, సుఖవ్యాధులు జీర్ణించుటచే కలుగు సకలమూత్రనాళవ్యాధులకు ప్రసిద్ధికెక్కిన రాజౌషధము తులము 1 కి రు 20-0-0

### సిద్ధమకరధ్వజము

ఇందు బంగారుకలదు పూటీయిచ్చెదము

జగత్ప్రసిద్ధమగు బలవర్ధకౌషధము రక్తక్షీణము, వీర్యదోషము, నపుంసకత్వము, క్షయ, శ్వాసకాసలు, నరముల బలహీనత, జీర్ణజ్వరములు మొదలగు దీర్ఘవ్యాధులకు దివ్యౌషధము

తులము 1 కి 24-0-0 60 మాత్రలు రు 10-0-0

### ఏకోత్తరవృద్ధిమహాలక్ష్మీవిలాసరసము

### చ్యవనప్రాశము

క్షయరోగులకు అమృతోపమానములగు దివ్యౌషధములు

చిరకాలము క్షయవ్యాధిచే పీడింపబడుచు శల్యావశిష్టముగ నుండువారలకు నూతనయౌవనమును ఆరోగ్యమును కలిగించును క్షయ శ్వాసకాసలు దబ్బగను కఫముతో కలసి రక్తముపడుట రక్తహీనత శరీరకృశత్వము హృదయదౌర్బల్యము దీర్ఘకాలమునుండి బాధించు మొండిదగ్గులు, మొదలగువానిని జయించును బలము, కాంతి శుక్రమును వృద్ధిచేయును అన్నితత్వములకు సరిపడును

రెండు ఔషధములు కలిపి సేవించవలెను నెలకు రు 13-12-0

### రసరాజరసము

హిస్టీరియాను నివర్తింపజేయు ముఖ్యౌషధము

అతినిద్ర, నిద్రలేమి, నవ్వుట, ఏడ్చుట, అసంబద్ధప్రలాపము, అధైర్యము, భయము, తలతిరుగుట, పడిపోవుట, నోట నురుగు వచ్చుట, వెర్రిచూపు చూచుట మొదలగు హిస్టీరియా లక్షణములను నివర్తింపచేయును బలవర్ధకము తులం రు 10-0-0

### కామచూడామణి రసము

మన్మథ నపుంసకత్వమును పోగొట్టి క్రొత్తసుక్రమును పుట్టించి ఉత్సాహమును కలిగించును చిరకాలమువరకు శుక్రపాటవమును నిలుపును సంయోగశక్తిని బలమును కలిగించును సేవించినవారికిగాని దీనిగుణము చక్కగా తెలియదు తులం రు 10-0-0

### స్వర్ణక్రవ్యాదరసము

అజీర్ణనాశకౌషధములలోనిదియే మొదట పేర్కొనదగినదిమంగు

చిరకాలమునుంచి బాధించు అజీర్ణము, కడుపుబ్బరము, ప్రేవులరచుట, శూల, యకృత్ప్లీహవృద్ధులు మొదలగువానిని నివారింపచేయును బలవర్ధకము తులం రు 4-0-0

### రజితచంద్రోదయము

రక్తవృద్ధి పుంస్త్వము, కలిగించును దేహతాపము పిత్తభ్రమ శరీరము యెల్లపుడు వేడిగానుండుట, పాలబీపితనముచే చిక్కిపోయిన పిల్లలయొక్క అనారోగ్యము శుక్లమేహము నివర్తింపచేయును ఉష్ణదేహులకు మిగుల ఉపయోగకరము సమశీతోష్ణమయిన ఔషధము తులం రు 3-0-0

### ప్రదరారిలోహము

స్త్రీల తెల్లకుసుమవ్యాధులకు దివ్యౌషధము తెలుపు యెరుపు పసుపు నలుపు జాతులుగల కుసుమలు నివారింపును కుక్షిశూల కటిశూల దేహతాపాల సర్వాంగశూలలు నివర్తించును దీనిని అశోకారిష్టముతో సేవించుట అత్యంత గుణదాయకము 40 మాత్రలు రు 3

| | | |
|---|---|---|
| అశోకారిష్టము (కుసుమలకు) | పౌను | 1-8-0 |
| ద్రాక్షారిష్టము (బలహీనతకు) | ,, | 1-8-0 |
| ఋతుశూలసంహారి (ఋతుశూలకు) 18 మాత్రలు | | 2-0-0 |
| చందనాదితైలము (తలనొప్పులకు) | సీసా | 1-0-0 |
| బాలసంజీవి (శిశువ్యాధులకు) | తులం | 0-12-0 |
| మహానారికేళాంజనం (కంటిజబ్బులకు) | సీసా | 0-8-0 |
| మాదీఫలరసాయనం (పైత్యములకు) | ,, | 0-12-0 |

1934 సం॥ ఫిబ్రవరి 1-వ తేదినుండి కొన్ని ఔషధములకు ధరలు తగ్గించితిమి క్రొత్త కేట్లాగునకు వ్రాయుడు.

## 228 ఔషధములు గలవు. కేటలాగు, కేలండరు ఉచితము.




లంబాడి సుందరి

**(Gipsy Beauty)**

(Awarded First Prizes in Mysore & Madras Art Exhibitions)

— S. V. S. Rama Rao.

# ప్రస్తావన

శ్లో॥ ఓమ్ నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే,
నిర్మలాయ ప్రశాన్తాయ దక్షిణామూర్తయే నమః

శ్రీ సచ్చిదానందస్వభావస్వరూపపరిణామ మవాఙ్మానస గోచరము నిరపేక్షమైన సత్తు దేశకాలపాత్రావరణములందు సాపేక్షమై చిదానందపరిణామమును పొందుచు పరిస్ఫుట మగుచున్నది. సత్తు నిర్గుణము, నిరాకారము, నిరంజనము, నిరాశ్రయము, నిరపేక్షము, అవ్యక్తము అవ్యక్తమైన సత్తు చిద్యోగాశ్రయమునను, చిద్యోగ మానందయోగాశ్రయమునను నేకస్థాయియందు సచ్చిదానందయోగాశ్రయమునను పరిస్ఫుట మగుచున్నది సత్తు చిదానందయోగాశ్రయమునను సగుణము, సాకార, సాంజన, సాశ్రయ, సాపేక్షపరిణామమునను పరిస్ఫుట మగుచున్నది సత్తు సత్యము, సత్త్వము, భావరూపపరిణామమునను దేశకాలపాత్రావరణములందు విశ్వాధారమై విశ్వవ్యాప్తమై సచ్చిదానందస్వరూపస్వభావములను సర్వత్ర ప్రత్యక్ష మగుచున్నది. అవ్యక్తమైన సత్తు నాదమూలమునను, నాదము అక్షరరూపమునను, అక్షరముశబ్దరూపమునను, శబ్దము వాగ్రూపమునను, వాక్కు భాషారూపమునను, భాష భావరూపమునను, భావము అర్థమూలమునను అర్థము ఇచ్ఛాక్రియాజ్ఞానశక్తిమూలమునను ప్రపంచపరిణామమునం దనంతభావ రూపములను సువ్యక్త మగుచున్నది. అకారాదిక్షకారాంతముగల అక్షరామ్నాయము ప్రపంచపరిణామమునకు చిద్దర్శనము. అక్షరామ్నాయమునందు "అహమ్" సద్రూప స్వభావమును అహంకారపరిణామమున సువ్యక్తము చేయుచున్నది. నిరపేక్షమైన సత్తు సాపేక్షమైన ఓంకార రూపమునను బ్రహ్మాండావృతమై సకలార్థసిద్ధికిని సాధనముగ నున్న విధము మహాత్ముల యనుభవము. పిపీలికాదిబ్రహ్మపర్యంతముగల బ్రహ్మాండము సచ్చిదానందానుభవపరమైన ఆత్మోద్ధరణమూలమున ననవరతము బ్రహ్మాండపరిణామమునకు వినియోగపడుచున్నది చరాచర స్వరూపమైన సకలప్రపంచమునకును సగుణనిర్గుణమును, సాపేక్షనిరపేక్షమును, సాకారనిరాకారమును, సాశ్రయనిరాశ్రయమును "సత్యస్వరూపమైన" "ఆత్మ" బీజము, శక్తి, కీలకము సాపేక్షమైన ఆత్మ నిరపేక్షమైన ఆత్మపరిణామానుభవమును బడయుటకు కర్మయోగము బీజము, ధర్మయోగము శక్తి, బ్రహ్మయోగము కీలకము. సాపేక్షములైన దేశకాలపాత్రావరణములందు నిరపేక్షమైనఆత్మయొక్క, సంస్మరణపరిజ్ఞానములకు, దేశకాలపాత్రల సంస్మరణము, సంకీర్తనము పరిజ్ఞానము, సాధనములుగ నున్నవి.

అనంతమైన విశ్వప్రవృత్తియందు దేశకాలపాత్రములు, నిరపేక్షమైన ఆత్మప్రవృత్తియందు సాపేక్షములైన తరంగములు దేశకాలపాత్రములు నిరపేక్షమైన ఆత్మయందు ప్రతిబింబము నొందుచున్నవి. అనంతమైన విశ్వమునందు భూగోళ మొక పరమాణువు కాలమహాప్రవృత్తియందు భూగోళకాల మొకక్షణము అనంతములైన దేశకాలప్రవృత్తులందు దేశకాల పరిగణనములు సాపేక్షములు. జ్యోతిషశాస్త్రజ్ఞుల భూగోళకాలపరిగణనమునందు మఱియొక చాంద్రమానాబ్దము ముగిసినది. భూగోళమునందు కాలపరిగణనము చంద్రసూర్యనక్షత్రాదుల స్థితిగతుల ప్రమాణముల ననుసరించి నిర్ణయింపబడుచున్నది. చంద్రగ్రహము భూమికి ౨,౩౯,౦౦౦ మైళ్లదూరమున గంటకు ౨,౨౮౦ మైళ్లవేగమున నాకాశమార్గమునందు సంచరించుచున్నది. చంద్రుడు

ఒకరాశినుండి వేరొకరాశికిచేరుటకు ౨౯ దినములు ౧౨ గంటలు ౪౪ నిమిషములు ౩ క్షణములు పట్టును. అమావాస్యనుండి పాడ్యమివరకును చంద్రుడొక భూప్రదక్షిణముచేయుచు నొకరాశినుండి మఱొకరాశికి భూమితో పాటు చేరుచుండును. భూగోళము క్షణమునకు ౧౮½ మైళ్ల వేగముతో నాకాశమార్గమున ౨౩ గంటల ౫౪ నిమిషముల కాలమునందు సూర్యునకు నిత్యప్రదక్షిణము చేయుచున్నది. ఆకాశమార్గమునందు భూకక్షయందు దినమును, మాసమును, సంవత్సరమును, భూగోళమును, చంద్రుడును చేయు ప్రదక్షిణములు సామాన్యముగను కాలపరిగణనకు సాధనములు. చంద్రోదయాస్తమయములు, సూర్యోదయాస్తమయములు కాలగ్రహణనిర్ణయమునకు ప్రధానసాధనములైనను భూవ్యాక్షము, భూసంభ్రమణమార్గము, గ్రహాకర్షణగతులు, నిత్యప్రదక్షిణమునందు కాలభేదమును గలుగజేయుచున్నవి. అనంతములైన స్థలములు అనంతములైన కాలవిభేదములను గలుగజేయుచున్నవి.

అనంతమైన బ్రహ్మాండమునం దనేకములైన రవిమండలములును రవిమండలమునందు భూమి, చంద్రుడు, కుజుడు, బుధుడు, శుక్రుడు, గురువు, శని, యూరేనసు, నెప్ట్యూను, ప్లూటో మొదలగు గ్రహములును, అనేకములైన యుపగ్రహములును గలవు. నభోమండలమునందు గల నక్షత్రములు, తారలు, గణనాతీతములు. నభోమండలమునం దాకాశగంగాపథము కేంద్రస్థానముగనుండి నక్షత్రమండలముల నాకర్షించుచున్నది. అనంతములైన నభము లాకాశగంగామార్గము నాశ్రయించి సంచారము చేయుచున్నవి. నభోమండలమునందు ౫౦,౮౦,౦౦,౦౦,౦౦౦ నక్షత్రములు కలవు. నభములు భూమికి ౨౦,౦౦,౦౦౦ కాంతిసంవత్సరముల దూరమునందు గలవు. దూరస్థములైన నభములు, నభోగణములు భూమికి ౧౪,౦౦,౦౦,౦౦౦ కాంతిసంవత్సరముల దూరమునందు గలవు. (కాంతి క్షణమునకు ౧,౮౬,౩౨౫ మైళ్ల వేగముతో సంచరించును) కాంతి సంవత్సరమునకు ౧౮౬,౩౨౫ × ౬౦ × ౬౦ × ౨౪ × ౩౬౫ = ౮,౪౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦,౦౦౦ సామాన్య సంవత్సరములు. పరిపూర్ణమైన సత్తున కనంతములైన దేశకాలములు మహాతరంగములవలెను సాపేక్షములు. భూమండలము, చంద్రసూర్యమండలములు, గ్రహములు, నక్షత్రములు, తారాగణములు, నభోమండలములు సద్యోగాశ్రయములై విశ్వపరిణామమునకు వినియోగపడుచున్నవి.

సూర్యమండలము బ్రహ్మాండావృతము లయిన యనేక రవిమండలములం దొకమండలము. సూర్యమండలమునందు సూర్యాధారమున నితరగ్రహములు నియతమార్గములందు సంచారమును జేయుచున్నవి.

గ్రహములు

సూర్యుడు భూమికి ౯,౨౮,౯౭,౪౦౦ మైళ్లదూరమునందు గలడు. సూర్యుని అక్షము ౮,౬౪,౧౦౦ మైళ్లు. సూర్యగ్రహగోళము భూగోళమునకన్నను ౩,౩౩,౪౩౨ రెట్లు పెద్దది. నవగ్రహములు సూర్యునిచుట్టు ప్రదక్షిణము చేయుచున్నవి. నవగ్రహములందు గురుగ్రహము భూమికన్నను ౩౧౮ రెట్లు పెద్దది; సూర్యునకు ౪౮౩, ౩౦౦,౦౦౦ మైళ్ల దూరమునందు గలదు. శనిగ్రహము భూమికి ౯౫ రెట్లు పెద్దదై రవికి ౮,౮౬,౦౦,౦౦౦ మైళ్ల దూరమునందు గలదు. కుజగ్రహము సూర్యమండలమునందు భూకక్షకు బయటను సంచారము చేయుచు ప్రాణిపోషణరక్షణముల కనుకూలముగ నున్నదని శాస్త్రజ్ఞులన్వేషణమును జేయుచున్నారు. కుజునకు రేడియో శక్తి సందేశహారణము సాధ్యమని పండితాభిప్రాయము. నవగ్రహములును సూర్యమండలమునందు నియతమార్గమున సంచారముచేయుచు చిరకాలమునుండియును ప్రజాలక్ష్యము నాకర్షించినవి. ద్వాదశరాసులు, నవగ్రహములు, అశ్విన్యాదినక్షత్రములు, వారములు చిరకాలమునుండియును శుభాశుభనిమిత్తములందు కాలనిర్ణయమునకు వినియోగించుట యాచారమయినది. ఆ యాచారి

ములనే పంచాంగములు, జాతకములు, జ్యోతి శ్శాస్త్రములు, భిన్నరీతులను పరిస్ఫుటము చేయుచు ప్రజాలక్ష్యము నాకర్షించుచున్నవి. నిత్య కర్మానుష్ఠానమునందు తిథివారనక్షత్ర గ్రహయోగాదుల పరిజ్ఞానము యోగసిద్ధికి సాధనముగ నున్నది. నూతన సంవత్సరారంభమున పంచాంగశ్రవణమననములు భావి కార్యసంసిద్ధి కుత్సాహజనకములుగ నుండగలవు. అనంతములైనను ననిత్యములైన దేశకాల పాత్రావరణములు నిత్యమైన పురుషార్థసిద్ధికి సాధనములుగ నుండుటకు పంచాంగశ్రవణము ధర్మార్థసాధనముగ నున్నది నిత్యమైన ఆత్మజ్ఞానము ననంతములైన ప్రకృతి విలాసముల సాధనమునను పరిస్ఫుటము చేయుటకు దేశము, కాలము, పాత్రలు పరమార్థ సాధనములు.

యశ్శృణోతి మధుశుక్లపక్షకే వర్షనాథసచివాదికం ఫలమ్,
ప్రాప్నుయా ద్దురితముక్తవిగ్రహ శ్చాయు రర్థమతులం యశ స్సుఖమ్
రాజామంత్రీ సస్యనాథోరసానా మీశాస్సార్థంస్వామినో నీరసానామ్,
అర్ఘాధీశఃకించ మేఘాధినాథో దద్యుశ్శ్రేయశ్శృణ్వతాం తత్ఫలాని

ప్రభవాదిచాంద్రమానాబ్దములం దేడవయేడు శ్రీముఖ సంవత్సరము గతించి, ౮-వ యేడు భావసంవత్సర మారంభమైనది. నిత్యసత్యమైన ఆత్మసంస్మరణమునకును, సంకల్పమునకును ప్రాచీన సంప్రదాయసిద్ధమైన క్రింది సంకల్పము సాధనముగ నున్నది.

పంచాంగము

"శ్రీశంభో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయపరార్థే, శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరో ర్దక్షిణదిగ్భాగే, శ్రీశైలస్య ఆగ్నేయప్రదేశే, కృష్ణాకావేర్యోర్మధ్యదేశే, భావనామ సంవత్సరే, ఉత్తరాయణే వసంతఋతౌ, చైత్రమాసే, శుక్లపక్షే, ప్రథమ్యాం, ఉత్తరాభాద్ర నక్షత్రే, భార్గవవాసరే……… "

సద్యోగాశ్రయములైన దేశకాలములందు ద్వీపములు, వర్షములు, ఖండములు, గోళములు, మండలములు, విశ్వములు, సంవత్సరములు, శకములు, యుగములు, మన్వంతరములు, కల్పములు, పరార్థములు సాపేక్షములు. శ్రీముఖ సంవత్సర నిర్గమనమును, భావసంవత్సరారంభమును కాలమహార్ణవమునం దొక బిందువును పోలియున్నను ఆత్మజిజ్ఞాసకు పంచాంగ శ్రవణరూపమునను పరమార్థసాధనముగ నున్నది. కాలమహార్ణవమునందు శాలివాహన శకాబ్దములు ౧౮౯౬, విక్రమార్క-శకాబ్దములు ౨౦౩౧, హూణ శకాబ్దములు ౧౯౭౪, ఫసలిశకాబ్దములు ౧౩౮౩, భరతశకాబ్దములు ౫౦౭౬, కలియుగాది సౌరాబ్దములు ౫౦౭౫, సృష్ట్యాదిసౌరాబ్దములు ౧,౯౫,౫౮,౮౫,౦౭౫ లయమును పొందినవి. కలియుగాదినుండియును ౮౪ చాంద్రమాన చాంద్రాయణ పరివృత్తులు ముగిసి ౮౫ వ పరివృత్తియం దేడేండ్లు గతించి యెనిమిదవయేడు భావ సంవత్సర మారంభమైనది. బ్రహ్మకల్పమునందు, ద్వితీయపరార్థమునందు, ప్రథమవర్షమునందు, ప్రథమ మాసమునందు, ప్రథమపక్షమునందు, ప్రథమదినమునందు, ౧౩ ఘటికలు, ౪౨ విఘటికలు గతించినవి. అనంతమైన కాలచక్రమునందు గతించిన శ్రీముఖాబ్ద మొకక్షణముగను శ్రీముఖేతిహాసములు పరమాణువులుగ నున్నవి. నిరపేక్షమైన ఆత్మస్థితియందు సాపేక్షములైన దేశకాల సంకీర్తనలు క్షణమాత్రములైనను సత్యమైన ఆత్మపరిజ్ఞానమునకు సాధనములుగ నున్నవి.

చాంద్రమానభావాబ్దమునకు శుక్రుడు రాజు, మంత్రి, గ్రామపాలకుడు, మేఘాధిపతి, ఫలము: సస్యసంకులము, సుజలపూరితనదీనదములు, ఫలసహితవృక్షములు, గోకులాభివృద్ధి, పార్థివసౌఖ్యము, జలసమృద్ధి, ధాన్యసమర్ఘము, శలభమూషకమహిషరోహిషీకాభివృద్ధి, అతివృష్టి, సుభిక్షము, సస్యవృద్ధి, క్షీరసమృద్ధి, శ్వేతధాన్యసమృద్ధి. శుక్రుడు రాజును, మంత్రియు నగుటవలన జనులకు చోరాగ్ని శస్త్రబాధ. గురువు సేనాధిపతి, అర్ఘాధిపతి, దైవజ్ఞుడు, ఫలము: నయపాలనము, కరపాలనము, దేశసౌఖ్యము, ద్విజశాస్త్రాభ్యాస

నము, సువృష్టి, భూసురయజ్ఞపరాయణత్వము, నిత్యోత్సవము, మంగళతూర్యనిస్వనము, దైవజ్ఞబుద్ధికుశలత, నరాధిపుల నీతియుక్తత్వము, విప్రులమంత్రయుక్తత. చంద్రుడు సస్యాధిపతి, నీరసాధిపతి, పురోహితుడు, ఫలము : ప్రజాసౌఖ్యము, గోక్షీరాభివృద్ధి, వర్షాభివృద్ధి, ధాన్యధనౌఘపూర్ణత్వము, దేవద్విజారాధనతత్పరత, ముక్తాఫలరత్నసువర్ణబీజకాంస్యాదివస్త్రాభరణాదుల యభివృద్ధి, సర్వసస్యసమృద్ధి, విద్యాభ్యాసనిరతి. శని ధాన్యాధిపతి, ఫలము.—కృష్ణసూక్ష్మధాన్యాభివృద్ధి, కృష్ణభూమిసస్యాభివృద్ధి. బుధుడు రసాధిపతి, ఫలము — పప్పలి, శొంఠి, ఇంగువ, ఉల్లి, ఘృతము, తైలము, చెరుకు ఇత్యాదులు దుర్లభములు రవి పరీక్షకుడు; ఫలము.— ఎండ, రక్తసస్యాభివృద్ధి, సంగ్రామము. కుజుడు గణకుడు, ఫలము :— విషాగ్నిశస్త్రబాధ, పరస్పరవిరోధము, అంత్యసస్యవినాశము గోపాలకుడు పశుపాలకుడు, ఫలము :— పశువృద్ధి, సుభిక్షము, బహుసస్యార్ఘసంపత్తి, తృణవృష్టిసంపూర్ణత్వము. శ్రీకృష్ణుడు స్థానరక్షకుడు. ఫలము :— గోక్షీరాభివృద్ధి. భావసంవత్సర సామాన్యఫలము :—

భావాబ్దే ప్రచురా రోగాః మధ్యా సస్యార్ఘవృష్టయః.
రాజానో యుద్ధనిరతా స్తథాపి సుఖినో జనాః

భావసంవత్సరమునందు శుభగ్రహములైన శుక్రుడు రాజు, మంత్రి, గురుడు, సైన్యాధిపతియునైనను ప్రపంచ పరిస్థితులు భయంకరములై సంతాపకరములుగనున్నవి. సకలరాజ్యములును సంగ్రామసన్నాహములందు మునిగి తేలుచున్నవి ప్రపంచావృతమైన ఆర్థికదురవస్థ ప్రజాజీవనమును దుర్లభము చేసినది. మహారాజ్యములందు వ్యాపారపరిశ్రమలు క్షీణించి నిరుద్యోగసమస్య భయంకరముగ నున్నది. ప్రపంచమునకు పరిపాటియైన ఆర్థికసిద్ధాంతము లంతర్ధానములైనవి. సకలరాజ్యములును స్వప్రయోజన పరాయణత్వమును బూని ప్రళయకాలభైరవునకు బలిదానములను సిద్ధముచేయుచున్నవి. సంగ్రామదావానలదగ్ధములైన రాజ్యములు శాంతికిచేయుచున్న ప్రయత్నములు నిరర్థకములుగ నున్నవి. మాటలయందు శాంతియును, తలపులందు సంగ్రామము శాంతికి సాధనములు గావు. ప్రపంచేతిహాసములందు శ్రీముఖసంవత్సరేతిహాసములు విషాదపూరితములై భావిపరిణామ మంధకారబంధురముగ నున్నది.

అనంతమైన ప్రవృత్తియందు భూగోళోదంత మతిస్వల్పమైనను మానవుల యహంకారాభిమానములు ప్రముఖము చేయుచున్నవి.

**ప్రపంచ పరిస్థితులు**

భూగోళ విస్తీర్ణము, ౧౯,౬౯,౫౦,౦౦౦ చదరపుమైళ్లు జనసంఖ్య౧,౮౪,౯౫,౦౦,౦౦౦ ఆప్రదేశమునందు౫,౭౫,౧౦,౦౦౦భూప్రదేశము. ౧౩,౯౪,౪౦,౦౦౦ జలప్రదేశము. భూప్రదేశమునందు ఆఫ్రికా ౧,౧౫,౦౦,౦౦౦, ఉత్తర అమెరికా ౮౦,౦౦,౦౦౦, దక్షిణ అమెరికా ౬౮,౦౦,౦౦౦, యూరపు౩౭,౫౦,౦౦౦, ఓషియానియా౪౦,౦౦,౦౦౦, ధ్రువప్రదేశములు ౬౨,౦౫,౦౦౦, ఆసియా ౧,౭౦,౦౦,౦౦౦ చదరపుమైళ్లు భూప్రదేశమునందు సుక్షేత్రములు, ౩౩౦,౦౦,౦౦౦, ఎడారులు ౫౦,౦౦,౦౦౦, ఉన్నతప్రాంతములు ౧౯౦,౦౦,౦౦౦ చదరపుమైళ్లు.

ప్రపంచమునందుగల ౧,౮౪,౯౫,౦౦,౦౦౦ జనులందును మంగోలియనులు ౬౮,౦౦,౦౦,౦౦౦ కాకేషియనులు ౭౨,౫౦,౦౦,౦౦౦, నిగ్రోలు ౨౧,౦౦,౦౦,౦౦౦, సెమిటికులు ౧౦,౦౦,౦౦,౦౦౦, మలయనులు ౧౦,౪౫,౧౦,౦౦౦, అమెరికా ఇండియనులు ౩,౦౦,౦౦,౦౦౦ కలరు. మతముల ననుసరించి క్రైస్తవులు, ౬౯,౨౪,౦౦,౦౦౦యూధులు౧,౬౧,౩౦,౦౦౦మహమ్మదీయులు ౨౦,౯౦,౨౦,౦౦౦ బౌద్ధులు ౧౫,౦౧,౮౦,౦౦౦ హిందువులు ౨౩,౦౧,౫౦,౦౦౦ కన్ఫూషియనులు టావొయిస్టులు ౩౫,౦౬,౦౦,౦౦౦ షింటోలు ౨,౫౭,౦౦,౦౦౦, జంతుపూజకులు ౧౩,౫౬,౫౦,౦౦౦, ఇతరులు ౫,౦౮,౭౦,౦౦౦ కలరు.

ప్రపంచమునందలి వివిధ దేశము లందును గోధుమలు౬,౧౩౦,౦౦,౦౦౦,రాయిలు౧౯,౦౦,౦౦,౦౦౦,

ఖనిజములు పాడిపంటలు

ఓటులు ౪౪,౧౦,౦౦,౦౦౦, బార్లి ౨౨,౬౦,౦౦,౦౦౦ మొక్కజొన్నలు ౫౫ ౬౦,౦౦,౦౦౦ క్వార్టు లుత్పన్నములగుచున్నవి. బియ్యము౧౩,౦౦,౦౦,౦౦౦జొన్నలు ౩౦౦,౦౦,౦౦౦ బంగాళాదుంపలు ౨౦,౦౦,౦౦,౦౦౦ దుంపశర్కర౮౦,౦౯,౦౦౦ చెఱుకుశర్కర౧,౬౦,౦౦,౦౦౦, తేయాకు ౮,౨౦,౦౦౦, కోకో ౫,౫౦,౦౦౦ పెద్దచిక్కుడు ౬౫,౦౦,౦౦౦, అవిశలు ౨౯,౦౦,౦౦౦, ప్రత్తిగింజలు ౧,౧౦,౦౦,౦౦౦, దూది ౫౦,౦౦,౦౦౦, ఉన్ని ౧,౦౬,౫౦,౦౦౦, జ్యూటు ౧౦,౫౦,౦౦౦, పట్టు ౫౮,౦౦౦, మాయపట్టు ౨,౨౫,౦౦౦ రబ్బరు ౭,౨౦,౦౦౦, పెట్రోలియము ౧౮,౦౦,౦౦,౦౦౦, రాగి ౧౦,౦౦,౦౦౦, సీసము ౧౧,౦౦,౦౦౦, తగరము ౯౦,౦౦౦, తుత్తినాగము ౮,౦౦,౦౦౦, అల్యూమినము ౧,౫౦,౦౦౦, ఇనుము ౪,౦౦,౦౦,౦౦౦ ఉక్కు ౫,౦౦,౦౦,౦౦౦, పొగాకు ౨౦,౦౦,౦౦౦, అయస్కాంతము ౨౩,౫౦,౦౦౦, సున్నపు ఫాస్ఫేటులు ౧,౧౦,౦౦,౦౦౦, పొటాషులు ౧౪,౦౦,౦౦౦, లవణము ౨,౪౦,౦౦,౦౦౦, బొగ్గు ౯౫,౦౦,౦౦,౦౦౦, నిక్కెలు ౨౫,౦౦౦ టన్ను లుత్పన్నము లగుచున్నవి. విద్యుచ్ఛక్తి ౨౬౦,౦౦,౦౦,౦౦,౦౦౦, కిలోవాటులును, బంగారము ౨,౪౦,౦౦,౦౦౦ ఔన్సులు, వెండి ౧౬,౦౦,౦౦,౦౦౦ ఔన్సులు, ప్లాటినము ౨,౭౫,౦౦౦ ట్రాయిఔన్సులును పుట్టుచున్నవి.

ప్రపంచమున మేకలు ౯౦,౯౦,౦౦,౦౦౦, కోళ్లు ౮౯,౭౮,౬౫,౦౦౦, గుఱ్ఱములు ౭,౩౨,౫౮,౪౦౦, పశువులు ౪౧,౭౪,౦౭,౦౦౦, గొఱ్ఱెలు ౪౨,౭౩,౮౭,౦౦౦,పందులు ౧౨,౪౭,౫౦,౦౦౦ కలవు ప్రపంచమునందు గల పాడి పంటలు జంతువులు మానవుల జీవయాత్రకు చిరకాలము సరిపోవు నని పండితాభిప్రాయము. ప్రపంచమునందు జనాభివృద్ధి ౬౦౦ కోట్లకు పెరిగినను అన్నపానీయముల కభ్యంతరములు కలుగవని పండితుల యభిప్రాయము. ప్రపంచమునం దంతటను మానవపోషణమున కవసరమైన పాడిపంటలు, జీవజాలములు, నీటివసతులు, భూవసతులు సమృద్ధిగ నున్నను ప్రపంచము నావరించిన దురాశాపిశాచము పరమానర్థములకు మూలముగ నున్నది. శ్వేతజాతులు పూనిన పరాక్రమణవిధానము సర్వసంహారమునకు వినియోగపడుచున్నటులు ప్రపంచోద్ధరణమునకు వినియోగపడుట లేదు.

శ్వేతజాతులు

ప్రపంచేతిహాసములందు గతించిన ౧౫౦ ఏండ్ల చరిత్రమును యూరపురాజ్యముల చరిత్రముగ పరిణమించినది. శ్వేతజాతులు సాయుధపాణులై పరదేశముల నాక్రమించిన చరిత్రము దారుణాధ్యాయముగ నున్నది. పాశ్చాత్త్యులు పరదేశాక్రమణమును స్వప్రయోజనార్థమును, స్వీయవ్యాపారార్థమును చేసినను ప్రపంచోద్ధరణమునకు చేసినట్లు ఘోషించుట పరిపాటియైనది. శ్వేతజాతులప్రముఖులు నిరంతరము "తెల్లజాతుల భారధర్మమును" సకలదుర్ణయములకును కారణముగ పరిగణించుట వారి దురహంకారమునకు నిదర్శనము. ఆస్ట్రేలియారాజ్యము ౩౦,౦౦,౦౦౦ చదరపు మైళ్ల విస్తీర్ణమును గలిగియున్నను ౬౦,౦౦,౦౦౦ తెల్లవారికి స్వాస్థ్యముగ నున్నది. ఈవిశాలదేశమునందు పరజాతీయులు స్వదేశస్థులు ౬,౦౦,౦౦౦ మాత్రమెయున్నను శ్వేతేతరజాతులకు ప్రవేశము నిషేధింపబడుచున్నది. శ్వేతజాతులు అమెరికా, ఆఫ్రికా, ఆసియా మొదలగు ఖండములను బలవదన్యాయాక్రమణమును జేసి కలుగజేసిన దుర్ణయములు మానవ ధర్మేతిహాసములందు విషాదాధ్యాయములుగ నున్నవి. ఉత్తరదక్షిణ అమెరికాఖండములు ౧౪౮,౦౦,౦౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమును, ౨౧,౦౦,౧౦,౦౦౦ ప్రజలను గలిగియున్నను శ్వేతప్రజాధిపత్యమునకు నిలయములుగ పరిణమించినవి. అమెరికాసంయుక్తరాష్ట్రములవికాసము ప్రపంచపరిణామమునం దుద్యోగపర్వముగ నున్నను శ్వేతేతరు

లనుభవించిన దుఃఖపరంపరలు పరమ విషాదమును గలుగజేయుచున్నవి.

అమెరిక - సం రాష్ట్రములు

అమెరికా సంయుక్తరాష్ట్రములు ౩౭,౦౦,౦౦౦ చదరపుమైళ్ల విస్తీర్ణమును, ౧౧,౦౦,౦౦,౦౦౦ ప్రజలను కలిగి వికాసమును పొందుచున్నను నీగ్రో లనుభవించుచున్న నిర్బంధములు హేయముగ నున్నవి. గతించిన ౭౦ ఏండ్లయందు తెల్ల ప్రజల సంఖ్య ౨౬౯ లక్షల నుండి ౧,౦౮౯ లక్షలకును, నీగ్రోల సంఖ్య ౪౪ లక్షల నుండి ౧౧౮ లక్షలకును అభివృద్ధిని బొందినవి. ఆదిమవాసులైన ఇండియనులు ౩,౧౭,౨౩౪ మాత్రమె కలరు. పాశ్చాత్యసంఘర్షణమునం దాదిమవాసులు సకలదేశములందును సంపూర్ణవినాశనమును పొందిన విధమున కమెరికాచరిత్రము పరమప్రమాణముగ నున్నది. అమెరికాసంయుక్తరాష్ట్రములు సహజసంపదలకును, వ్యవసాయపరిశ్రమల యభ్యుదయమునకును, విద్యాభ్యాసమునకును, సంపదలకును నగ్రగణ్యములుగ నున్నవి. అమెరికాయందు వ్యవసాయము ప్రధానపరిశ్రమముగ నున్నది. పొలములందు ౧౦౦ - ౫౦౦ యకరములవి ౨౩,౧౪,౮౫౮, ౫౦ - ౧౦౦ యకరములవి ౧౩,౭౪,౯౬౫, ౨౦-౫౦ యకరములవి ౧౪,౪౦, ౩౮౮ మొత్తము ౬౨,౮౮,౬౪౮ క్షేత్రములు ౧౯౩౦ సంవత్సరాంతమునందు కలవు. వ్యవసాయ ఫలము ౧౯౩౧ యందు ౬,౯౧,౧౨,౬౬,౦౦౦ నుండి ౧౯౩౨ నందు ౫,౧౪,౩౨,౨౬,౦౦౦ డాలరులకు తగ్గినది. పంటలం దన్నివిధములైన పంటలును కలవు. పాడివిలువ ౧౯౩౧ యందు ౧,౬౬,౧౨,౭౩,౦౦౦ డాలరులు. ఖనిజముల విలువ ౧౯౩౧ నందు ౩,౧౬,౬౬,౦౦,౦౦౦ డాలరులు. వస్తువులందు పెట్రోలియము, దూది, ఇనుము, బొగ్గు, బంగారము, వెండిమొదలగు పదార్థము లన్నియును కలవు. దేశమునందు ౧౯౩౧ యందుగల ౧,౭౫,౩౨౫ పరిశ్రమాలయములందును ౪౧,౩౫,౦౪, ౬౪,౫౬౪ విలువగలపదార్థములు నిర్మింపబడుచున్నవి.

రెండేండ్లలో పరిశ్రమపదార్థములవిలువ ౭,౦౪౩ కోట్ల డాలరులనుండి ౪,౧౩౫ కోట్లకు తగ్గినది. అమెరికాయందు సంవత్సరమునకు ౨౨ లక్షల మోటారు కార్లు నిర్మింపబడుచున్నవి. ౩౨-౩౩ సంవత్సరమునందు అమెరికానుండి మోటార్ల యెగుమతులు ౧౪౪ కోట్ల డాలర్ల విలువగలవి. ౧౯౩౨-వ సంవత్సరమునందు ౨,౬౦,౪౩౮ మైళ్లరైలుమార్గములును ౨౭,౪౧౫ మైళ్ల నీటిమార్గములును ౩౦ లక్షల మైళ్ల గ్రామరోడ్డులను, ౩,౫౮,౨౧౦ పెద్దరోడ్లును గలవు. పెద్దరోడ్లకు ౧౯౩౨ నందు ౮౧,౬౭,౬౫,౦౦౦ డాలర్లు వ్యయము చేయబడినది. గతసంవత్సరమునందు ౫౦ వేల పోస్టాఫీసులు ౨,౬౫౪ కోట్లవస్తువులను ప్రజలకు అందజేసినవి. ౧౯౩౩-వ సంవత్సరమునందు ఆదాయము ౨౨౩ కోట్ల డాలర్లు, వ్యయము ౪౦౨ కోట్ల డాలర్లు. అమెరికా సంయుక్తరాష్ట్రములకు ౨,౨౫౩ కోట్ల డాలర్ల అప్పు గలదు. ఇతరరాజ్యములు ౧,౧౮౮ కోట్ల డాలరులు బాకీయున్నవి. తల ౧ కి స. ౬-౧-౧౧ పన్ను వసూలగుచున్నది. వ్యాపారము ౧౯౩౧ యందు ౪,౯౧ లక్షల సవరనులనుండి ౧౯౩౨ సం. ౨,౭౧౮ లక్షల సవరనులకు ౧౦౦ కి ౩౬ వంతునను తగ్గినది. అనేకదేశములకు ప్రతికూలవ్యాపారము కలిగినను అమెరికాకు అనుకూలవ్యాపారమే వర్తమానార్థికదుస్థితియందును కలిగినది.

విద్యావ్యాపనమునకు సంవత్సరమునకు ౨౩౧ కోట్ల డాలర్లు వ్యయము చేయుచున్నది. విద్యావ్యాపనమునకు ౨,౫౦,౦౦౦ సామాన్య పాఠశాలలు, ౧,౩౨౪ విశ్వవిద్యాలయములు, ౩౩౧ ఉపాధ్యాయశిక్షణశాలలు ౪౩౨ నర్సింగుశిక్షణశాలలు కలవు. సైన్యశిక్షణ పోషణములకు ౭౨౦ లక్షల సవరనులు వ్యయము చేయబడుచున్నవి. యుద్ధవిమానములు ౧,౮౧౪ గలవు.

గతసంవత్సరమునందు ప్రపంచమునకు సంప్రాప్తమైన ఆర్థికదుస్థితి అమెరికాకును సంక్రమించినది. బీదకుటుంబములకువలెను బీదదేశములకును ఆర్థికవ్యవహార

రూజువెల్టు

ములను సర్దుబాటు చేసికొనుట సాధ్యమైనను పెద్ద రాజ్యములకు సాధ్యము కాదు. ౧౯౩౦ - వ సంవత్సరమునందు గ్రేటుబ్రిటను బంగారపుప్రమాణమును విడుచుటవలనను లాభమును పొందినది. ఈ విధానము అమెరికాకు విశేషముగ నష్టమును కలుగజేసినది. గతసంవత్సరము నందు అమెరికాయును గ్రేటుబ్రిటనుమార్గము నవలంబించినది. అమెరికాసంయుక్తరాష్ట్రములకు ప్రెసిడెంటు రూజువెల్టుగారపూర్వమైన ఆర్థికవిధాన మవలంబించి అమెరికాపరపతిని వృద్ధిచేయుటకు చేసిన నిర్ణయములు నిందాస్తోత్రములకు మూలములైనవి. రూజువెల్టుగారు బంగారుప్రమాణమును విడుచుటయే గాక డాలరునందలి బంగారు ప్రమాణమునుకూడ తగ్గించెను స్వదేశము నుండి బంగారు ఎగుమతులను ప్రతిషేధించి బంగారు ధరను పెంచి విదేశములనుండి బంగారు దిగుమతులను ఆకర్షించెను. అర్బుదములను వ్యయముచేసి ప్రజోపయుక్తకార్యములను ఆరంభించెను దేశమునందు వ్యాప్తమైన నిరుద్యోగసమస్యను అంతరింపజేయుటకు ౫,౦౦౦ లక్షల డాలర్లను సహాయము చేయుటకును, ౩,౩౩,౦౦౦ లక్షల డాలర్లను ప్రజోపయుక్తకార్యములకు వినియోగపరుచుటకును ౩౦,౦౦౦ లక్షల డాలర్లను రైతులకు సహాయముచేయుటకును చేసిన నిర్ణయములు ప్రపంచమునందంతటను కలవరమునకు కారణమైనను విశాలమైన అమెరికా రాజ్యవ్యవహారములకు తగియున్నది. వ్యవసాయ పరిశ్రమలను నియమించి వస్తువులధరలను వృద్ధిచేసెను. రూజువెల్టుగారవలంబించిన ఆర్థికవిధానము ప్రపంచమునందంతటను గొప్ప కలవరమును గలుగజేసినను ఆర్థికపునర్నిర్మాణమునందు అపూర్వమైన సంవిధానమును సమకూర్చినది. రూజువెల్టుగారు అవలంబించిన వ్యాపారార్థికసంవిధానము డాలరు మారకపురేటు కంతర్జాతీయవ్యాపారపణ్యములందు నిలుకడను కలుగజేసినది. అమెరికా వ్యాపారము ఎగుమతులయందును, దిగుమతులయందును అభివృద్ధిని పొందినది.

ఆర్థికరంగమునందువలె నితరరంగము లందును రూజువెల్టుగారి రాజనీతి శ్లాఘాపాత్రము. సోవియటురష్యాతో వ్యాపారసంధిని చేసికొనుట యొకవిశేషము. చిరకాలమునుండి ఆశపెట్టుచున్న ఫిలిప్పైను ద్వీపములకు స్వాతంత్ర్య ప్రదానమును మహావిశేషము. రూజువెల్టుగారు రాజకీయార్థికవ్యాపార పరిశ్రమాదులం దవలంబించుచున్న నిరంకుశాధికార నిర్వహణము ప్రజాస్వామికమునకు స్థానమైన అమెరికా సంయుక్తరాష్ట్రములందును నితరరాష్ట్రములందును నాశాభంగకరమైనను కార్యనిర్వహణదక్షత్వమునకు ప్రమాణముగ నున్నది. గతించిన పదేండ్లనుండియు వాడుకయందున్న మద్యపాననిషేధన శాసనమును రద్దుచేయుట పాశ్చాత్య సంస్కారమునకు సహజమైనను మానవధర్మాభ్యుదయమునకు ప్రతికూలము. వర్తమానార్థికస్థితియందు పలుకుబడిగల ప్రభుత్వములు మీనమేషములను లాభనష్టములను గణనముచేయక ప్రజలయోగక్షేమములకు పాటుపడగల విధము రూజువెల్టుగారి కార్యవిధానము వెల్లడిచేయుచున్నది.

బ్రిటిషు సామ్రాజ్యము

ఐరోపామహాసంగ్రామానంతరము ప్రపంచమునకు గలిగిన వైరాగ్యము క్రమముగ నంతరించినవిధము గతించిన పదియైదేండ్ల వ్యవహారములును వెల్లడిచేయుచున్నవి. ప్రపంచమునందు పునర్నిర్మాణ భారము అమెరికామీద వలె బ్రిటిషు సామ్రాజ్యముమీదను కలదు. సూర్యాస్తమయము లేని బ్రిటిషుసామ్రాజ్యము భూమండల వ్యాప్తమై పునర్నిర్మాణమునకు సకలవిధముల ననుకూలముగ నున్నది. బ్రిటిషుసామ్రాజ్య విస్తీర్ణ జనసంఖ్యలు.

| | మైళ్ల విస్తీర్ణము | జనసంఖ్య |
|---|---|---|
| యూరపునందు | ౧,౨౧,౫౧౨ | ౪,౮౦,౦౦,౦౦౦ |
| ఆసియాయందు | ౧౮,౨౪,౫౫౦ | ౩౬,౫౦,౦౦,౦౦౦ |
| ఆఫ్రికాయందు | ౪౬,౫౨,౦౦౦ | ౬,౦౦,౦౦,౦౦౦ |
| ఉ.అమెరికా | ౩౮,౯౩,౦౨౦ | ౯౦,౦౦,౦౦౦ |

| | | |
|---|---|---|
| మధ్యఅమెరికాయందు | ౮,౬౦౦ | ౫౦,౦౦౦ |
| వెస్టు-ఇండీసునందు | ౧౨,౩౦౦ | ౨౦,౦౦,౧౦౦ |
| దక్షిణ-అమెరికా | ౯,౭౮,౦౦౦ | ౩,౨౦,౦౦౦ |
| ఓషియానియా | ౩౩,౦౦,౦౦౦ | ౯౦,౦౦,౦౦౦ |
| మొత్తము | ౧,౯౯,౧౯,౭౮౨ | ౪౯,౩౩,౭౦,౦౦౦ |

గ్రేటుబ్రిటనునందు అధినివేశరాజ్యములందు ౭ కోట్ల మంది తెల్లజాతివారును, శేషించిన ప్రజలందు ౩౫,౨౮,౩౭,౭౭౮ హిందూదేశీయులును, ఇతరులు ౭ కోట్లమందియు వివిధప్రాంతములందును గలరు ప్రజలందు హిందువులు ౨౧ కోట్లమంది, మహమ్మదీయులు ౧౦ కోట్లమంది, క్రైస్త్రవులు ౮ కోట్లమంది, బౌద్ధులు ౧,౨౦,౦౦,౦౦౦, శేషించినవారు ఇతరమతస్థులు. ఈ మహాసామ్రాజ్యమునకు గ్రేటుబ్రిటను మూలస్థానము సామ్రాజ్యాంతర్భాగములందు స్వపరిపాలనాధికారము గల అధినివేశరాజ్యములును, మధ్యమాధికారము గల క్రౌనుకాలనీలును, నిరంకుశాధికారము గల పరాధీన రాజ్యములును, వివిధములైన పరిపాలనవిధానములు గల ప్రదేశములును గలవు. తెల్లజాతులుగల ప్రదేశములందు స్వపరిపాలనమును తెల్లవారులేని స్థలములందు నిరంకుశ పరిపాలనమును బ్రిటీషు రాజ్యాంగములకు కీలకములు. బ్రిటిషుసామ్రాజ్యపరిపాలనము పూర్వమువలెనే బ్రిటిషు ప్రయోజనములకును, తెల్లవారిప్రయోజనమునకును వినియోగపడినటులు స్వదేశీయుల ప్రయోజనములకును, శ్వేతేతరజాతుల ప్రయోజనములకును వినియోగపడుట లేదు. ప్రపంచమునందు కాలక్రమమున మానవస్వాతంత్ర్యవికాసము సంప్రాప్త మగుచున్నను బ్రిటిషుసామ్రాజ్యనిర్వాహకులు పూర్వపరిస్థితులనే సంరక్షించుచు సామ్రాజ్యక్షేమమునకును, సామ్రాజ్యాంతర్భాగ వికాసమునకును ప్రతిబంధకములను కల్పించుట రాజనీతిగ పరిణమించినది.

ఐరోపాసంగ్రామ సమయమునందు సామ్రాజ్యాంతర్భాగములకు గలిగిన సంయోగము కాలక్రమమున శిథిల మగుచున్నది. సామ్రాజ్యసంరక్షణకును

రక్షణ వ్యాపారము

సామ్రాజ్యవ్యాపారమునకును సాధనము లైన సంయోగ సాహచర్యములు ప్రపంచావృతము లైన ఆర్థిక దురవస్థలందు దూరస్థము లగుచున్నవి. బ్రిటీషురాజ్యాధికారులు నిర్ణయించెడి ఆర్థికవిధానములును వ్యాపార సంరక్షణవిధానమును బ్రిటిషుయోగక్షేమములకు సాధన భూతములుగ గనుపడినను, ప్రతికూలపరిణామము నొందుచున్నవిధమును సామ్రాజ్య వ్యవహారములు బోధించుచున్నవి. ఒకకాలమునందు బ్రిటిషుద్వీపముల యోగక్షేమములకు వినియోగపడిన స్వేచ్ఛావ్యాపారము రక్షణ వ్యాపారముగ మారుట దురదృష్టము. బ్రిటీషు వ్యాపార పరిశ్రమలనిరోధమె రక్షణవ్యాపారనిర్ణయమునకు మహావ్యాఖ్యానము. బ్రిటీషుప్రభుత్వాదాయము ౧౯౨౨-౨౩ నందు ౧,౧౨,౪౮,౭౦,౦౦౦ సవరలనుండి ౧౯౩౩-౩౪ నందు ౬౯,౮౭,౭౭,౦౦౦ సవరనులకును, వ్యయము ౧,౦౭,౯౧,౮౭,౧౦౦నుండి ౬౯,౭౪,౮౬,౦౦౦ సవరనులకును తగ్గినది, అప్పు ౭,౬,౮౯,౭౦,౦౦౦ సవరనులకు పెరిగినది ఇతరరాజ్యములును సామ్రాజ్యాంతర్భాగములును, ౧,౦౬,౦౪,౩౫,౦౦౦ సవరనులు బాకీయున్నవి బ్రిటీషుసామాన్యవ్యాపారము ౧౯౨౭ నందు ౨,౦౫,౦౩,౭౫,౨౫౨నుండి ౧౯౩౨ నందు ౧,౧౧,౯౧,౧౪,౧౦౩ సవరనులకును, ప్రత్యేకవ్యాపారము పై సం॥లందే ౧,౮౦,౪౪,౬౯,౫౭౪ నుండి ౧,౦౨,౭౩,౫౬,౯౧౭ సవరనులకును తగ్గినది. గ్రేటుబ్రిటనునందు ప్రధానములగు బొగ్గు, ఇనుము, దూదిపరిశ్రమలు క్షీణించినవి. ౧౯౩౨ నందు గ్రేటుబ్రిటనుకు ౨౮,౭౦,౦౦,౦౦౦ సవరనులవ్యాపారము ప్రతికూలముగ నేర్పడినవి. గత సం॥మునందు సైన్యమునకు ౩,౭౯,౫౦,౦౦౦, విమానములకు ౧,౭౪,౨౬,౦౦౦ నౌకాదళమునకు ౫,౩౫,౭౦,౦౦౦, మొత్తము ౧౦,౮౯,౪౬,౦౦౦, సవరనులు సంగ్రామసన్నాహములకు వ్యయముచేయబడినది. ప్రపంచవ్యాప్తమైన, సామ్రాజ్యముగల గ్రేటుబ్రిటను నౌకా

దశమునందు వెనుకబడి ౮౩౮విమానములను మాత్రమె కలిగియున్నది. గ్రేటుబ్రిటనునందు పన్ను ౧౯౧౩ నందు తల ౧-కి ౩-౧౧-౦ నుండి ౧౯౩౩ నందు స. ౧౬-౮-౦ నకు హెచ్చినది ఒటావా యొడంబడికయును బంగారుప్రమాణ విసర్జనమును వ్యాపారాభివృద్ధిని కొంత గలుగజేసినను నది సంతృప్తికరముగాదు. గత సంవత్సరమునందు మద్యపానమునకు ౧౧,౨౪,౧౮,౦౦౦ సవరనులు వ్యయమైనవి. ప్రజలు తల ౧ కి మద్యమునకు స. ౫-౩-౦ ను పన్నులకు ౧౬-౮-౦ సవరనులును చెల్లించుట బ్రిటీషుభాగ్యస్థితికి నిదర్శనమైనను శుభస్థితికి నిదర్శనము కాదు. క్షీణించుచున్న బ్రిటీషువ్యాపార పరిశ్రమాదుల నుద్ధరించుట కాత్మవిశ్వాసమును స్వయంసహాయమును సాధనములు కావి వ్యాపారరక్షణమును పరాక్రమణమును సాధనములు కావు. కన్సర్వేటివుకవచమును ధరించిన జాతీయప్రభుత్వము పూర్వవాసనలను విడిచి అమెరికా సంయుక్త రాష్ట్రములందు రూజువెల్టుగా రవలంబించుచున్న పునర్నిర్మాణ విధానమును స్వస్థలమునందును సామ్రాజ్యాంతర్భాగములందును నిర్వహించుట కుపక్రమించుట వివేకమును, ధర్మమును

జాతీయ ప్రభుత్వము

జాతీయప్రభుత్వ నామమున ౧౯౩౧ సంవత్సరమునం దేర్పడిన బ్రిటిషు పార్లమెంటునందు ౪౭౨ కన్సర్వేటివులు, ౧౩ జాతీయ కార్మికులు, ౩౫ జాతీయ లిబరులు, ౩౩ లిబరలులు, ౩ జాతీయస్వతంత్రులును విజయమునొందిరి లేబరుసభ్యులు ౫౨, స్వతంత్రలిబరలులు ౪, స్వతంత్రులు ౩ మొత్తము ౫౯ సభ్యులు ప్రతిపక్షులును, ౫౫౦ ప్రభుత్వపక్షమువారును నేర్పడిరి. ౪౭౨ కన్సర్వేటివులుగలజాతీయపక్షము నామమునకుమాత్రమే జాతీయపక్షము కన్సర్వేటివులు జాతీయ ప్రభుత్వమును నడపుచు సామ్రాజ్యమునం దంతటను కన్సర్వేటివు పరిపాలనను వ్యాపింపజేయుచున్నారు లేబరు నాయకుడైన రామ్సే మాగ్డొనాల్డుగారు కన్సర్వేటివు పక్షాదేశములను శిరసావహించుచు కార్మికాదర్శములను కార్మికపక్షమును ధ్వంసము చేయుచున్న విధము కార్మికుల ఆగ్రహమునకు గురియగుచున్నను గత్యంతరము గనపడకున్నది జాతీయప్రభుత్వము, ప్రభుత్వము నుండి కొలదిమంది చీలిపోవుచున్నను,౧౯౩౬-వ సంవత్సరమువరకును ప్రభుత్వమును నిర్వహించుటకు నిశ్చయించినది. ప్రభుత్వము గత సంవత్సరమునందు నిర్ణయించిన, ఆయుధవిసర్జన సభానిర్ణయములు, ఆర్థికసభా నిర్ణయములు విఫలములైనవి. కన్సర్వేటివు నాయకులు బాల్డ్వినుగారును, ఇర్విన్ప్రభువు, శాంకీ,సైమన్, మొదలగువారలును నిస్సహాయులై కన్సర్వేటివు పక్షాదేశములను జాతీయప్రభుత్వ నామమున నిర్వహించుచున్నారు. చర్చిలు,పేజిక్రాఫ్టు, బీవరుబ్రూకు, రోథరుమియరు మొదలగు కఠిన కన్సర్వేటివు పక్షవాదులు సామ్రాజ్యమునందు కలుగజేయుచున్న సంక్షోభమును ప్రతిఘటించుటకు నాయకులకు శక్తి చాలకున్నది. జాతీయపక్షము చుక్కానిలేని నావవలె సామ్రాజ్యాభిమానార్ణవమునందు కొట్టుకొని పోవుచున్నది. కన్సర్వేటివు పక్షమునకు నిరంకుశాధికార నిర్వహణమునందును, స్వప్రయోజన పరాయణత్వమునందును, పూర్వాభ్యాసములందును గల విశ్వాసము ప్రజాస్వాతంత్ర్యమునందును, పరహితార్థమునందును, నూతనాదర్శములందును గలుగకున్నది. నూరేండ్లక్రిందట ప్రపంచము నిద్రావస్థయందు మునిగియున్న సమయమందు వలెనే నేడును సకల వ్యవహారములందును కన్సర్వేటివులు తామే లాభములను పొందగోరుట అవివేకము. సామ్రాజ్యాంతర్భాగములు వికసించి స్వయంపోషణమును, స్వాతంత్ర్యమును నభిలషించుచున్నపుడు, పారతంత్ర్యమును, పరావలంబనమును శాసించుట బ్రిటిషు ప్రయోజనములకును, సామ్రాజ్య ప్రయోజనములకును నిరుపయోగము. వ్యాపారపరిశ్రమలందు ప్రపంచమునందు గలిగిన యభివృద్ధిని వెనుకకు నెట్టుట యెవ్వరికిని సాధ్యముగాదు. క్షీణించుచున్న వ్యాపారాదాయములు,

పెరుగుచున్న పన్నులు, వ్యాప్తమైన నిరుద్యోగము, దిన దిన ప్రవర్ధమాన మగుచున్న విశ్వాసరాహిత్యము, ప్రచండమైన స్పర్ధ, బ్రిటిషు రాజ్య నిర్వాహకులకు వారి కర్తవ్యమును వ్యక్తము చేయుచున్నను జ్ఞానోదయము గలుగకుండుట దురదృష్టము.

హిందూస్థానము, సింహళము మొదలగు సామ్రాజ్యాంతర్భాగములందు రాజ్యాంగ సంస్కరణముల రూపమునను జాతీయ ప్రభుత్వము కల్పించుచున్న నిర్బంధ పాశములు జాతీయనామమునే పరిహాసపాత్రము చేయుచున్నవి. బలవంతులకు భయముకలిగినపుడు కలిగెడి బీభత్సము, బలహీనులవలనను కలుగజాలదు. చర్చిలు సోమరువెల్లువర్గము నావహించిన సామ్రాజ్య భయాభిమానములకు శ్వేతపత్రము పట్లను కరినాత్ములు పూనిన ప్రతిఘటనము ప్రమాణముగ నున్నది. బ్రిటీషు ప్రజలయందు జాతీయప్రభుత్వముపట్లను విశ్వాసము క్షీణించుచున్న విధమును లండను కౌంటి కౌన్సిలు ఎన్నికలందు లేబరుపక్ష విజయము వ్యక్తము చేయుచున్నది. ఎన్నికలందు మ్యూనిసిపలు రిఫారముపక్షము ౮౩ నుండి ౫౫ తగ్గినది. లేబరుపక్షము ౩౫ నుండి ౬౯కి హెచ్చినది. నామరూపములు లేని లిబరలు పక్షము ౬ నుండి నామరూపములు లేకను అంతరించినది. జాతీయోద్ధరణ నిర్మాణములందు దారితెన్ను తెలియకను గంతులు వేయుచున్న కన్సర్వేటివు పక్షమునకు సర్ ఆస్వాల్డుమోస్లిగారి ఫాసిటు విధానమాశాజనకముగనున్నది. బాల్డువినుగా రాస్వాల్డు మోస్లిగారి ఫాసిటు నిరంకుశవిధానమును నిరసించినను బీవరు బ్రూకు రోథరుమియరు ప్రభువుగారులును వారి యనుచరులును నాశీర్వదించుచున్నారు. ప్రపంచవ్యాప్తమైన మానవస్వాతంత్ర్య ధర్మపరివర్తనము నాపుట దుస్తరమై ప్రళయాగ్నివలెను వ్యాపించి సకలమును పరివర్తనమయము చేయుట సహజము.

ప్రపంచము నెదుర్కొనిన యపూర్వ పరిస్థితులను ప్రతిఘటించుటయం దెప్పటి నాటకములె మారురూపనామములను ప్రత్యక్షమగుచున్నవి. గ్రేటుబ్రిటనునందు స్త్రీపురుషుల కెన్నికహక్కు లున్నను శ్రీమంతులు, ప్రభువులు, మతగురువులు, పరిశ్రమాధిపతులును ప్రభత్వము చేయుచున్నారు. రాజరక్షణాచ్ఛాదనమునను పూర్వాచారవ్యవహార సంప్రదాయములు విజయమును పొందుచు నవీనాదర్శ వ్యవహారములు నిరాదరణమును బడయుచున్నవి రాజత్వము, కులీనత్వము, కుబేరత్వము, సామ్రాజ్యత్వము గ్రేటుబ్రిటనునందు లేబరు పక్షమును నిర్మూలము చేసినవి. బ్రిటిషుప్రజలకు క్షీణించుచున్నను సామ్రాజ్యభాగ్యభోగములను, గౌరవాభిమానములను, పరాక్రమణమును రక్షించుటయందుగల యభిమానావేశములు సాంఘిక పరివర్తనమునందును, కమ్యూనిస్టుపరివర్తనమునందును గలుగుట దుర్లభము. గ్రేటుబ్రిటనునందును, బ్రిటీషు సామ్రాజ్యాంతర్భాగములందును, ట్రేడుయూనియనులును, కార్మికపక్షమును సాంఘికపరివర్తనము నపేక్షించినను సంకల్పసిద్ధికి కర్మయోగము దుర్లభము. మోస్లిగారు స్థాపించి విరమించిన 'Action" "కర్మ" పత్రికోదంత మిందులకు నిదర్శనము. భాగ్యవంతమైన గ్రేటుబ్రిటనునందు కన్సర్వేటివులకును, కార్మికులకును ప్రవర్ధమానంబగుచున్న సాంఘిక సంరంభమునందు పురాతన నూతనసంస్కారములును, పక్షములును సామ్రాజ్య లాభాభిమానములును అంతర్ధానములై స్వప్రయోజనపరాయణములైన యుభయపక్షములకును ధర్మనిర్వహణము దుర్లభమైనను సాధ్యముగ నున్నది. సాంఘిక పరివర్తనరంగములైన యూరపు రాజ్యములకు సాహచర్య మసాధ్యమైనను గత్యంతరము గనుపడకున్నది సైమను ఈడెనుగారల శాంతియాత్రలు నిరర్థకములైనవి. సోవియటు రుష్యాతో వ్యాపార మనివారమైనది. ప్రపంచవ్యాప్తమైన రాజకీయార్థిక సాంఘికపరివర్తనమునందు బ్రిటిషుప్రజానాయకులకును అమెరికా ఫ్రాన్సు, ఇటలి, జర్మని, ఆస్ట్రియారాజ్యములందువలెను కార్యపరత్వముగలప్రభుత్వస్థాపనముశరణ్యముగనున్నది

ఫ్రాన్సు దేశము ఆదికాలమునుండియును యూరపు రాజ్యములందు రాజ్యాంగపరివర్తనమునకును, భాష

పరివర్తనమునకును నిలయము.

ఫ్రాన్సు

మానవ స్వాతంత్ర్య చిహ్నములైన "సమత్వము, స్వాతంత్ర్యము, సోదరత్వము" ఫ్రాన్సు దేశమునందు వికసించి ప్రసవించినవి. గ్రేటుబ్రిటను, జర్మను రాజ్యముల నడుమను చిరకాలమునుండియును పరాసుభూమి రణరంగముగను పరిణమించినది రెండు రాజ్యముల నడుమను చిక్కినను స్వాతంత్ర్య ధ్వజమును రక్షించి వ్యాపింప జేసినది జోఆఫ్‌ఆర్కు ఫ్రాన్సు విమోచనముచేసిన యితిహాసము దివ్యఘట్టము. గతించిన అయిరోపా మహాసంగ్రామ సమయమునందువలెను వర్తమానకాలమును నీ పరిస్థితులనే వెల్లడి చేయుచున్నది. ఆదికాలమునుండియును జర్మనీ ఫ్రాన్సురాజ్యములకు గల వైర ముపశమించుటకు సాధనములు దుర్లభములు. జర్మనీయందు గతవత్సరమునందు నాజీ పక్ష విజృంభణము తిరిగి ౧౯౧౪-వ సంవత్సర పరిస్థితులను సమకూర్చుచున్నది. ఫ్రాన్సుదేశము పూర్వము వలెనే సంగ్రామసన్నాహములను చేయుచున్నది గత సంవత్సరమునందు సైన్యములకు ౫,౯౦,౦౦,౦౦౦ నవరనులు వ్యయమైనవి. ౩౦౦౦ విమానదళమును గలిగి విమానబలమునందు మొదటిదిగనున్నది.

ఫ్రాన్సుదేశమునందు గత సంవత్సరాదాయము ౩౦,౦౦,౦౦,౦౦౦ నవరనులు, అప్పు ౩,౮౦,౪౦,౦౦, ౦౦౦ నవరనులు. ఇతరరాజ్యములందువలెనె ఫ్రాన్సు దేశమునందును గతసంవత్సరమునందు గలిగిన ఆర్థిక దుస్థితి కలవరమును గలుగజేసినను ఫ్రాన్సుప్రభుత్వము బంగారు పరిమాణమును విడువకను వ్యాపారపరిశ్రమలను రక్షించినది. పశ్చిమోత్తరదిశలందు అద్భుతముల ద్రవ్యమును వ్యయముచేసి దుర్భేద్యములైన దుర్గావళులను నిర్మించినది. గత సంవత్సరమునందు ౫ ప్రభుత్వములు మారిపోయినవి. డలాడియరు ప్రభుత్వ పతనానంతరము పారిసు నగరమునందు జరిగిన కొట్లాటలు పరదేశీయులకు సంశయములను గలుగజేసినను ఫ్రెంచి ప్రజల నిశ్చలదేశ భక్తిని స్వాతంత్ర్యప్రభుత్వమును చలింపజేయలేదు. పారిసు నగరమునందు సాంఘిక పక్షమునకును ప్రభుత్వపక్షమునకును గలిగిన సమరము, మంత్రాంగములను వెల్లడిపరచినను, ఫ్రెంచిప్రజల దేశాభిమానము ఆపత్సమయమునందు పూర్వమువలెనే స్థిరపడినది.

డొమర్గీగారు నిర్ణయించిన మంత్రివర్గము ఫ్రెంచి ప్రజలదేశభక్తికిని సంయోగశక్తికిని నిదర్శనము. మంత్రివర్గమునందు సాంఘికాభిమానులు, ప్రజాస్వామికాభిమానులు, వివిధపక్షములవారును కలరు. ఎనుబది యేండ్లు నిండిన డొమర్గీగారు ప్రధానమంత్రిగను, ౭౮ ఏండ్లుగల మార్షలు పేటన్‌గారు యుద్ధాంగమంత్రిగను, బార్తోగారు విదేశాంగమంత్రిగను, హెరియట్ టార్డూ మొదలగు ప్రసిద్ధనాయకు లితర మంత్రులుగ నేర్పడుటయును ఫ్రెంచి ప్రభుత్వమునకు స్వదేశమునందును విదేశములందును మహాబలమును సమకూర్చినది. ఫ్రెంచిప్రభుత్వ నిర్మాణము గ్రేటుబ్రిటను, జర్మనీ, ఇటలీ, రష్యా దేశములందును, చిన్న రాజ్యములందును కర్తవ్యాకర్తవ్య నిర్ణయములకు అవకాశములను గలుగజేసినది. ఫ్రాన్సురాజ్యము ౧౯౧౪-వసంవత్సరమునకు పూర్వమువలెనే ఇప్పుడును రష్యా రాజ్యముతో సంధిని జేసికొనుట ఫ్రెంచిప్రజల స్వభావమును యూరపురాజ్య తంత్రముల పరమార్థమును తెలుపుచున్నది. ఫ్రాన్సు స్వాతంత్ర్య రక్షణమునకు నిరంకుశాధికార నిలయమైన జారుప్రభుత్వమును, కమ్యూనిస్టులకు ఆకరమైన సోవియటు ప్రభుత్వమును సమానములు. రుష్యా ఫ్రాన్సు ప్రభుత్వముల మిత్రత్వము మధ్య యూరపురాజ్యములకును ఆత్మవిశ్వాసము గలుగజేసినది కమ్యూనిస్టు విధానమును నిర్మూలించుటకు సమకట్టిన నాజీ ఫాసిస్టుపక్షములకు జిజ్ఞాసకు కారణమైనది. ఐరోపాసంగ్రామమునకు పూర్వమువలెనే వర్తమాన కాలమునందును యూరపురాజ్యము లన్నియును పక్షములుగజేరి రాజ్యబలసంరక్షణమును ప్రబలరాజ్యభంజనమును జేయుటకు చేయుచున్నప్రయత్నములు సం

గ్రామ స్వరూపమును దాల్చుట సహజమైనను సంగ్రామఫలము మానవ స్వాతంత్ర్య ధర్మాభ్యుదయమునందు గోచరమగుచున్నది. పూర్వమువలెనే వర్తమానకాలమునందును వివిధ రాజ్యములును పక్షములుగ నేర్పడినను వివిధరాజ్యములందును నిరంకుశాధికార నిర్వాహకులు సర్వాధికారములను నిర్వహించుచున్న సమయమందు ఫ్రాన్సుదేశము వివిధపక్షముల సంయోగబలసాధనమునను ప్రభుత్వనిర్వహణము సేయబూనుట స్వాతంత్ర్య ధర్మాభ్యుదయమునకు శుభసూచకముగ నున్నది. దేశస్వాతంత్ర్యము, సామ్రాజ్య రక్షణము, మానవస్వాతంత్ర్య వికాసము, మానవ స్వాతంత్ర్య ధర్మపరిణామమునందు సమాన ప్రతిపత్తిని గలిగియుండుటకు చిరకాలమునుండియును ఫ్రాన్సుదేశమునందు సంప్రాప్తములైన రాజ్యాంగపరివర్తనములు సాధనములు గాగలవు.

ప్రపంచపరిణామమునందు ఆదికాలమునుండియు వ్యక్తులకును, సంఘములకును అధికారనిర్వహణమునందు సంరంభము సహజము. వ్యక్తులు గురువులైనను, ప్రభువులైనను, పండితులైనను, వీరులైనను, తత్త్వజ్ఞులైనను ప్రజాసంస్కారమున కనురూపముగ పరివర్తనమునకు అధికారదాసు లగుదురు. ప్రజల నిస్సహాయస్థితియును భయమును వ్యక్తుల నాయకత్వమునకు వినియోగపడుచున్నవి.

ముస్సోలిని

వర్తమానకాలమునందు ఇటలీయందు ముస్సోలినీ, జర్మనీయందు హిట్లరు, ఆస్ట్రియాయందు డోల్ఫస్, టర్కీయందు కెమల్ పాషా, రష్యాయందు స్టాలిన్, అమెరికాయందు రూజువెల్టు, హిందూస్థానమునందు గాంధీ మొదలగు ప్రముఖులు నిర్వహించుచున్న నాయకత్వము ప్రజాసంస్కారమున కనురూపముగ నున్నది. ఇటలీయందు నల్లషర్టుల నాయకుడు ముస్సోలినీ నిరంకుశధ్వజమును స్థాపించి నిర్వహించుచున్న వ్యవహారములు శస్త్రాస్త్రములకు పాత్రము లగుచున్నవి. పదేండ్లలో ముస్సోలినీనామము యూరపునందు మారుమ్రోగినది. యౌవనమందు సాంఘికవాదియైన ముస్సోలినీ మధ్యమదశయందు ఫాసిస్టుగ మారుటయును, ఇతరరాజ్యములకు మార్గదర్శకు డగుటయును విచిత్రము. ఐరోపామహాసంగ్రామానంతరము ప్రపంచమునందు కలిగిన ఉత్సాహనిరుత్సాహములు ఇటలీయందును వ్యాపించినవి. మతాధిపతి పోపు రాజ్యాధిపతి విక్టర్ ఇమాన్యుయల్ నడుమను ప్రజలు కాలయాపన జేయుచుండిరి. ఐరోపా మహాసంగ్రామమునందు ఇటలీరాజ్యమునకు ౧,౯౨,౦౦,౦౦,౦౦౦ సవరనులు వ్యయమైనవి. ప్రజలు మతాచారవ్యవహారములకును, దురాచారములకును దాసులై కాలయాపన చేయుచుండిరి. యువజన హృదయాంతర్గతమైన కార్యపరత్వమును సాధించుటకు ముస్సోలినీగారి కార్యదీక్ష వినియోగపడినది. ఇటలీయందువలెనే ఇతరరాజ్యములందును వ్యాపించియున్న నిస్సహాయస్థితి ఫాసిస్టువిధానము నాకర్షించినది గతసంవత్సరము ఇటలీ దిగుమతులు ౮,౯౦,౦౦,౦౦౦, ఎగుమతులు ౭,౪౦,౦౦,౦౦౦. ఆదాయము ౧౪,౮౩,౪౪,౦౦౦ సవరనులు. ఫాసిస్టు ప్రభుత్వము తలపెట్టిన అభ్యుదయము దేశమునకు సాధ్యముకాకపోయినను దేశమునందు క్షాత్రభావము విజృంభించినది.

గతసంవత్సరమునందు నౌకాదళమునకు సైన్యాదులకు ౨ కోట్ల౩౦ లక్షలు, సవరనులు వ్యయము చేయబడినవి. ఫాసిస్టువిధానము సాధ్యముచేయని ఆర్థిక పారిశ్రామికాభివృద్ధిని విదేశవ్యాపారాక్రమణమూలమునను, రక్షణవ్యాపారమూలమునను, సాధ్యము జేయుటకు ముస్సోలినీప్రభుత్వము యత్నించుచున్నది. ఇతరరాజ్యములందువలెనే ఇటలీయందును నీ ప్రయత్నము సఫలమగుటలేదు. ముస్సోలినీలక్ష్యము ఆస్ట్రియా, హంగరీ, జకోస్లోవాకా, రుమేనియా రాజ్యములను ఇటలీపక్షమునకు నాకర్షించుటకు వినియోగపడుచున్నది. కార్యశూరుడును ధీరుడును నైన ముస్సోలినీ నిరూపించిన ఫాసిస్టుకార్యవిధానము ప్రపంచలక్ష్యమును ఆకర్షించుచున్నది.

జర్మనీయందు నాజీపక్షమునకు గతసంవత్సరమునందు గలిగిన అపూర్వవిజయము యూరపునందు మహాసంచలనమును గలుగజేసినది నాజీపక్షము యూదులు, కమ్యూనిస్టులు, ట్రేడుయూనియనులు మొదలగువారిపట్ల చూపిన దురాగ్రహము ప్రపంచమునందు అసహ్యమును కలుగజేసినది. నాజీపక్షనాయకుడైన హిట్లరుగారు పార్లమెంటుసమ్మతిని జర్మనీయందు నిరంకుశాధికారమును వహించిరి. పార్లమెంటునందు నాజీపక్షము సంపూర్ణాధికారమును గలిగియున్నది. హిట్లరుగారు నిరంకుశాధికారనిర్వాహణమున కుపక్రమించిన ప్రస్థానము నాజీలకు పరమోత్సాహమును గలుగజేసినను యూరపు రాజ్యములందు కలవరమును గలుగజేసినది. సంగ్రామానంతరము జర్మని యవలంబించిన ఆర్థికవిధానము బ్రిటిషు రాజ్యతంత్రజ్ఞుల యామోదమును బడసినను నిరుపయోగము. సంగ్రామానంతరము జర్మని గ్రేట్బ్రిటను నితరరాజ్యములనుండి ౧,౦౦,౦౦,౦౦,౦౦౦ సవరనుల నప్పుచేసినది. అప్పునకు వడ్డీ ౬,౫౦,౦౦,౦౦౦ సవరనులనిచ్చుటకు జర్మని నిరాకరించినది. ఆయుధవిసర్జనము సకలరాజ్యములకును సమానముగ నుండవలయుననియును, వర్సైలుసంధి జర్మను సంహారమున కేర్పడినదనియును హిట్లరుగారు ప్రకటించిరి. అక్టోబరు మాసమునందు ఆయుధ విసర్జనసభను, నానాజాతి సమితిని జర్మని రాజ్యము విడిచినది. సంగ్రామానంతరము విషాదస్థితి యందు మునిగియున్న జర్మనులకు హిట్లరు నాయకత్వము క్రిందను నాజీమంత్రోచ్చారణము మహాశక్తినిసమకూర్చినది. నాజీశూర సైనికులు స్వదేశమునందు వివిధపక్షములను నిర్మూలముచేసినతరువాతను వారి లక్ష్యమును, ఆస్ట్రియా, పోలాండు, ఫ్రాన్సు మొదలగు రాజ్యములకు మరల్చిరి. జర్మనికి సహజసంస్కారమైన క్షాత్రశీలము నాజీపరిణామమును పొందినను యూరపురాజ్యములకు దుస్సహముగనున్నది. హిట్లరుగారు శాంతిమార్గమునను ఆస్ట్రియామొదలగు దేశములందు గల జర్మనుల సంయోగమును జేయుటకు పన్నినతంత్రమును ఇటలీ, ఫ్రాన్సు, గ్రేట్బ్రిటను, ఆస్ట్రియా మొదలగు రాజ్యములు ప్రతిఘటించినవి. జర్మనియందు నాజీపక్షము (Nationalist Socialist) నామమునను జేయుచున్న క్షాత్రవిజృంభణము గ్రేట్బ్రిటనునందు జాతీయ ప్రభుత్వము సంకల్పించిన క్షాత్రవిజృంభణమువలెను సాంఘికపక్షప్రయోజనవ్యాపనమును నిర్మూలము చేయుటకు వినియోగపడగలదు.

జర్మని హిట్లరు

వర్తమానకాలమునందు ప్రపంచలక్ష్యము సంయుక్త సోవియటు రష్యారాష్ట్రములమీదను ప్రసరించుచున్నది. సంయుక్తరష్యారాష్ట్రములు ౮౨,౪౧,౬౭౩ చదరపుమైళ్ల విస్తీర్ణమును ౧౬,౨౧,౪౩,౦౦౦ ప్రజలనుకలిగి యూరపు ఆసియాఖండములందు వ్యాపకమును గలిగియున్నది. రష్యారాష్ట్రములందు హిందూస్థానమునందువలెనే నూటికి ౮౦ మంది గ్రామసీమలందే నివసించుచున్నారు. సంయుక్తరష్యారాజ్యములందు స్వపరిపాలనముగల ౫౦ ప్రభుత్వములు గలవు. గ్రామమునుండి రాష్ట్రమువరకును వ్యాప్తమైన స్వపరిపాలనభాగములందు సోవియటుప్రాతినిధ్య పరిపాలనము వ్యాపించియున్నది. సోవియటుపరిపాలనావిధానము మొదట సందేహములకు మూలమైనను కాలక్రమమున నితర రాజ్యములకును విచారణయోగ్యమగుచున్నది. విద్యావిధానమునందును దేవాగారములందును సోవియటుప్రభుత్వము దేవతారాధనమును నిషేధించి మతగురువుల యాగ్రహమునకు గురియైనది. సోవియటుప్రభుత్వ మవలంబించిన పంచవర్ష నిర్మాణకార్యవిధానము రష్యారాజ్యవికాసమునకు వినియోగపడినట్లు విమర్శకు లభిప్రాయపడుచున్నారు. సోవియటు రష్యా జారు ప్రభుత్వము చేసిన అప్పులను నిరాకరించుటవలన యూరపురాజ్యముల యాగ్రహబహిష్కారములకు గురియైనది. కాని కాలక్రమమున యూరపురాజ్యములన్నియును రష్యా వ్యాపారమును తిరిగి ప్రారంభించినవి. ౧౯౩౧ నందు బ్రిటిషు

సోవియటు రష్యా

ద్వీపములనుండి ౯౦,౪౪,౦౦౦సవరనుల దిగుమతులును బ్రిటిషుద్వీపములకు౩,౨౧,౭౯,౦౦౦సవరనుల యెగుమతులును చేయబడినవి. రష్యానుండి యూరపు రాజ్యములకు ఖనిజములు, ధాన్యములు, కలప, పెట్రోలియమ్ మొదలగు పదార్థములు ఎగుమతి చేయబడుచున్నవి. ౧౯౩౨-౩౩ సంవత్సరమునందు దేశాదాయము ౩౫,౦౧,౦౯,౦౦,౦౦౦ వ్యయము ౩౩,౨౩,౦౯,౦౦,౦౦౦ రూబులులు సోవియటురష్యాప్రభుత్వము స్థాపించిన తరువాత ౮,౫౦,౪౫,౦౦,౦౦౦ రూబులులు అప్పులు చేయబడినవి. సైన్యశిక్షణ వ్యాపనమునకు సోవియటురష్యా యావచ్ఛక్తిని వినియోగించుచున్నది. సైన్యనిర్మాణముతోపాటు విమాననిర్మాణమును, నౌకానిర్మాణమును చేయుచున్నట్లు వ్యవహారములు తెలుపుచున్నవి. ౧౯౩౨ నందు మొదటి ౫ ఏండ్లవిధానము ముగిసినది. తిరిగి ౫ ఏండ్లవిధానము ప్రారంభింపబడినది.

రష్యాదేశమును స్టాలినుగారి ప్రభుత్వము రాజకీయార్థిక పారిశ్రామిక విషయములందు ప్రముఖదేశమును చేయుటకు యావచ్ఛక్తిని వినియోగించి బలవంతముగ ప్రజలచేత పనిచేయించుచున్నది. ఈ సంవత్సరమునందు రష్యాయందు ౯,౦౦,౦౦,౦౦౦ టన్నుల ధాన్యము పండినట్లు తెలియుచున్నది. పరిశ్రమలందువలెనే వ్యవసాయమునందును ప్రజలను బలవంతముగ పనిచేయించుచు లాభము నష్టము ప్రభుత్వము పొందుచున్నది. దేశమునందు గల అయిదింట నాల్గవవంతు భూమిని ప్రభుత్వము వ్యవసాయము చేయించుచున్నది. వ్యవసాయవిధానమునందు నవీనయంత్రసాధనములు వాడబడుచున్నవి. అనుభవమును, శాస్త్రపరిజ్ఞానమును గల పనివాండ్రు నాయకులుగ నేర్పడి వ్యవసాయపరిశ్రమలందు పనులను చేయించుచున్నారు. పరిణామ మెటులున్నను ప్రపంచమందు మానవస్వాతంత్ర్య పరివర్తనమునందు నూతనాధ్యాయమును నిర్మించుటకు సోవియటు ప్రభుత్వవిధానములు వినియోగపడగలవు. సోవియటు ప్రభుత్వము కమ్యూనిస్టుప్రచారము కొంతవరకు విరమించి కార్యరూపమున సోవియటువిధానమును ప్రపంచమునకు పరిపాటి చేయుటకు ప్రయత్నించుచున్నది. సోవియటు ప్రభుత్వము మతశిక్షణమునందు, దైవారాధనయందు, వివాహసంబంధమందు, విద్యాశిక్షణమునందు, వ్యవసాయ పరిశ్రమనిర్వహణమునందు, సంగ్రామసన్నాహములందు, యంత్రాద్యుపకరణోపయోగములందు, వైద్యసహాయమునందు చూపుచున్న సాహస ధైర్యములు, నిరర్థకములైన ప్రాచీనాచార సంస్కారములను విడిచి, ప్రయోజనకరములైన నవీనసంస్కారసాధనముల నవలంబించుటకు ప్రపంచమునకు వినియోగపడగలవు. సోవియటుపరివర్తనము భావికాలమునందెటులు పరిణమించినను మానవస్వాతంత్ర్యసంరంభమునందు నూతనశకనిర్మాణమునకు వినియోగపడగలదు.

ఆసియాఖండము భూభాగములందు విశాలమైన ప్రాచీనఖండము. ఆసియా భూతలమునందు మూడవవంతు విస్తీర్ణమును ౧,౧౧,౩౦,౦౦,౦౦౦ ప్రజలను కలిగి యున్నది. భూగోళమునందు ఆసియా గల ౧౮౫ కోట్ల ప్రజలందును ౧౧౧ కోట్లు ఆసియాయందు కలరు. చీనాయందు ౪౨, హిందూస్థానమునందు ౩౫, ఆసియా రష్యాయందు ౫, నెదర్లాండునందు ౬, జపానురాజ్యమునందు ౮ కోట్ల ప్రజలు కలరు. ఆసియాఖండము ప్రకృతిసంపదల కాకరమై ఆదికాలమునుండియును మానవాభ్యుదయమునకు వినియోగపడినవిధమును ప్రపంచేతిహాసములు వ్యక్తముచేయుచున్నవి. యూరపురాజ్యముల వ్యాపనాధిపత్యము లాసియాఖండవాసులను నిరర్థకులను నిర్వీర్యులను నిర్ధనులనుజేసినది. ఆసియా ఆఫ్రికా ఖండములయాధిపత్యము యూరపురాజ్యముల భాగ్యభోగములకువలెను విజ్ఞానమునకును మూలాధారము. ఆసియాయందు ౨౦ లక్షల విస్తీర్ణమును ౩౬ కోట్ల ప్రజలును గల బ్రిటీషుసామ్రాజ్యాంతర్భాగములు గలవు. బ్రిటీషు ద్వీపము ,లాసియాఖండమునందలి బ్రిటీషు సామ్రా

జ్యాంతర్భాగములకు 3౭ కోట్ల సవరనుల ఎగుమతులను, సామ్రాజ్యాంతర్భాగములనుండి 3౦ కోట్ల సవరనుల దిగుమతులను జేయుచు ౯౭ కోట్ల సవరనుల నప్పు నిచ్చినది. ఆసియాసామ్రాజ్యాంతర్భాగములందు హిందూస్థానము బ్రిటీషుసామ్రాజ్యశుభస్థితికి మకుటముగ నున్నది యూరపురాజ్యము లాసియాఖండభాగములను తాత్కాలికమైన బాహుబలముచేతను జయించినను ఆసియాఖండము యూరపు రాజ్యములను నిత్యమైన ధర్మబలముచేతను జయించినది. యూరపు రాజ్యముల విజ్ఞానమునకు మూలాధారము లైన యవన రోమక సంస్కారములును ఆసియా విజ్ఞాన ఫలములు యవనతత్త్వశాస్త్రమును రోమక ధర్మశాస్త్రమును ఆసియావిజ్ఞానసంస్కారఫలములు ఆసియాయందలి అలెగ్జాండరువిజయములును, రోమకసామ్రాజ్యవిజయములును నామరూపములు లేకను జీర్ణించినను ఆసియావైజ్ఞానికవిజయము లవిచ్ఛిన్నముగను పల్లవించి ప్రసవించుచున్నవి.

విజ్ఞానవిజయము

యూరపు మతధర్మ సంస్కారము నకు మూల బీజమైన క్రైస్తవమతమున కాసియాఖండము జన్మస్థానము. క్రైస్తవమతము పశుప్రాయులైన యూరపు ప్రజలను మానవధర్మ పరాయణులను చేసిన విధమును యూరపు దేశచరిత్రములు వెల్లడి చేయుచున్నవి యూరపు రాజ్యములు క్రైస్తవమతమును స్వీకరించినను క్రైస్తవ ధర్మవికాసము ప్రాచ్యదేశములందువలెను పాశ్చాత్య దేశములందు సాధ్యము గాని విధమును క్రైస్తవమత వ్యాపనము బోధించుచున్నది. ప్రపంచవ్యాప్తము లైన క్రైస్తవమహమ్మదీయమతములకును తత్త్వశాస్త్రములకును నాసియాఖండము జన్మస్థానము. ఆరంభమునందు యూరపురాజ్యముల పశుబల మాసియా ఖండవాసులకు సంభ్రమసమ్మోహములను గలుగజేసినను సహజమైన ధర్మసంస్మరణము సమ్మోహనాస్త్రములను శిథిలము చేయుట కుపక్రమించినది.

జపాను

జపానీయుల బాహుబల విజయములు ప్రాచ్యుల కాత్మ సంస్మరణమునకును, ఆత్మ విశ్వాసమునకును, వినియోగపడినవి. సంగ్రామరంగములందువలెను ఆర్థిక వ్యాపార పారిశ్రామిక రంగములందును జపానీయుల విజయములును పాశ్చాత్యుల పరాజయములును శ్వేత జాతుల యౌన్నత్య భ్రమను శ్వేతేతర జాతుల నీచత్వ భ్రమను తొలగించి ఆసియా వాసులకు ప్రత్యభిజ్ఞానము గలిగించినవి ఆసియాఖండవాసులకు ముఖ్యముగను జపాను ప్రజలకు గలిగిన ప్రత్యభిజ్ఞానము భయంకరమైన సంగ్రామపరిణామమును పొందుట సంభవము. కాలాంతరమునందైనను యూరపు పరాజయమును, ఆసియావిజయమును ధ్రువములైనను సన్నిహితభావిపరిణామము దారుణముగ నున్నది. మంచూరియారంగమునందు రుష్యా-జపానురాజ్యములు చేయుచున్న సంగ్రామసన్నాహములు పాశ్చాత్యరాజ్యముల యాదరణమునకు పాత్రములై భయంకర పరిణామమునకు బీజము లగుచున్నవి. మంచూకో స్వతంత్రరాజ్య స్థాపనమునకు, నానాజాతిసమితిరూపమునను యూరపురాజ్యములును, అమెరికా - సంయుక్త రాష్ట్రములును ప్రతిఘటించినను తన దృఢసంకల్పమును సార్థకము చేయుటకు జపానున కాయుధవిసర్జనసభను విసర్జింపవలసిన యవసరముగలిగినది. కైజరు 3౦ ఏండ్లకుపూర్వము నిర్ణయించినటులు శ్వేతజాతు లన్నియును జేరి పింగళజాతు లను నల్లజాతులను నిర్జింపబూనుట సహజము. శ్వేతజాతుల సంస్కారమె ప్రపంచేతిహాసములందు సుందోపసుందోపాఖ్యానముగను పరిణమింప గలదు. ఆసియాఖండవాసులకు ప్రాణ మాన ధన ధర్మ రక్షణముల కాసియాఖండవాసుల సంయోగ మత్యంతావసరము. ఆసియాఖండసంయోగమునకు చీనా హిందూస్థానముల సానుభూతిని బడసి జపాను నాయకత్వమును వహించుట సంకల్పసిద్ధికి సాధనముగ నుండగలదు. ప్రపంచమునందు శాంతిని ధర్మమును స్థాపించుట

కాసియాధర్మవిజయమునకు బలవిజయమును నవసరముగ నున్నది.

దూదిపరిశ్రమవ్యాపార నిర్వహణ విషయములందు జపాను హిందూస్థానములకును జపాను లాంకాషైరులకును జరుగుచున్న రాయబారపు వార్తలు భావిపరిణామమునకు ప్రస్తావనలు. బ్రిటీషు రాజ్యాధికారులు హిందూస్థానమునందు వలెను ప్రపంచమునం దంతటను వ్యాపార పరిశ్రమల పంపకమును జపానుకును స్వదేశములకును ప్రతికూలముగను గోరుచున్నారు. ఆసియాఖండసంయోగావసరమును జపాను ప్రకటించినవిధము మానవస్వాతంత్ర్యధర్మాభిలాషుల కభివందనపాత్రము. శ్వేతప్రజల స్వప్రయోజనపరాయణత్వమునకు ౧౦౧౦ కోట్ల ప్రజలను నిరంతరదరిద్రదాస్యావరణములందు నిలిపెయుంచుట మానవధర్మాభ్యుదయమునకును, విశ్వకల్యాణమునకును శ్వేతముఖులస్వప్రయోజనములకును నిరుపయోగము. నిస్సహాయస్థితియందున్న ఆసియారాజ్యములకు దైవమె శరణ్యముగ నున్నది.

చీనారాజ్యము

ప్రపంచరాజ్యములం దత్యంత ప్రాచీన సంస్కారము గల చీనారాజ్యోదంతము గజేంద్రమోక్షోదంతముగ నున్నది. పరమసాధువులైన చీనా ప్రజలు పాశ్చాత్యులకు పరిహాసపాత్రులైనవిధమునకు పాశ్చాత్య నవల లందలి వర్ణనలు ప్రమాణములు. ౪౧ కోట్లసాధుజనుల ప్రబోధము ప్రపంచ పరిణామమునందు మహోదయమునకు వినియోగపడగలదు. స్వదేశమునం దన్యోన్యకలహములు, జపాను విజృంభణము, రుష్యాప్రతిఘటనము చీనాభావిపరిణామమును దురూహము చేయుచున్నను చీనాప్రబోధవికాసములు విజయమును బొందుచున్నవి.

హిందూస్థానము

ప్రపంచవ్యవహారములందు దుర్భరమైన ఆసియాఖండ స్థితిగతులు హిందూస్థాన స్థితిగతులను దుర్భరతరము చేసినవి. బంకించంద్రుని "వందే మాతరం" గీతమును స్మరించిన భారతీయులకు హిందూస్థానము నావరించిన నిస్సహాయస్థితి . రమవిషాదమును గలుగజేయుచున్నది. సుజల పూరితములైన నదీనదములను, విశాలమైన సముద్రతీరమును, అపారమైన సహజసంపదలను, విశేషమైన పాడిపంటలను, ప్రాచీన సంస్కారమును, ౩౫ కోట్ల ప్రజలను గల్గియున్న హిందూస్థానము వర్తమానకాలమం దనుభవించుచున్న సందిగ్ధావస్థ వర్ణనాతీతము. వివిధమతములకును, భాషలకును, సంప్రదాయాచారములకును నిలయమైన హిందూస్థానమందు పారతంత్ర్య స్థితియందు సంయోగ సాహచర్యములు దుర్లభములుగ నున్నవి. హిందూస్థానము ౯ పెద్దరాష్ట్రములుగను, ౪ చిన్నరాష్ట్రములుగను, ౬౦౦ స్వదేశ సంస్థానములుగను విభజింపబడినది.

### హిందూదేశ ప్రధాన రాష్ట్రములు

| | విస్తీర్ణము (చదరపుమైళ్లు) | జనసంఖ్య | జనసంఖ్య ఒక్క చదరపు మైలుకు |
|---|---|---|---|
| బర్మా | ౨,౩౩,౭౦౦ | ౧,౪౬,౭౦,౦౦౦ | ౬౩ |
| మదరాసు | ౧,౪౨,౩౦౦ | ౪,౬౭,౪౦,౦౦౦ | ౩౨౯ |
| బొంబాయి | ౧,౨౩,౬౦౦ | ౨,౧౮,౦౦,౦౦౦ | ౧౭౬ |
| సంయుక్తరాష్ట్రములు | ౧,౦౬,౩౦౦ | ౪,౮౪,౧౦,౦౦౦ | ౪౫౫ |
| మధ్యరాష్ట్రములు, బీరారు | ౯౯,౯౦౦ | ౧,౫౫,౧౦,౦౦౦ | ౧౫౫ |
| పంజాబు | ౯౯,౦౦౦ | ౨,౩౫,౮౦,౦౦౦ | ౨౩౮ |
| బీహారు, ఒరిస్సాలు | ౮౩,౦౫౦ | ౩,౭౬,౮౦,౦౦౦ | ౪౫౪ |
| బెంగాలు | ౭౭,౫౦౦ | ౫,౦౧,౧౦,౦౦౦ | ౬౪౬ |
| ఆసాము | ౫౫,౦౦౦ | ౮౬,౨౦,౦౦౦ | ౧౫౭ |

రాష్ట్రములందు హిందువు లధికముగాగల రాష్ట్రములు ౭ మహమ్మదీయు లధికముగా గల రాష్ట్రములు ౪. ఉత్కళ సింధురాష్ట్ర నిర్మాణమువలన నొక మహమ్మదీయ రాష్ట్రమును నొక హిందూరాష్ట్రమును నేర్పడగలవు. హిందూ మహమ్మదీయ సమ్మేళనమునందు రాష్ట్రముల ఆధిక్యము సాంఘిక సంరంభమునకు

కారణమైనది. హిందూదేశమునందు ౩౫ కోట్ల ప్రజలు ౨,౫౭౫ పట్టణములందును, ౬,౯౬,౮౩౧ గ్రామములందును ౭,౧౦,౬౨,౨౨౮ గృహములందును నివసించుచున్నారు. ౩౧ కోట్లమంది గ్రామములందును, ౪ కోట్లమంది పట్టణములందును నివసించుచున్నారు. ప్రజలందు హిందువులు ౨,౩౯౧, మహమ్మదీయులు ౭౭౬, బౌద్ధులు ౧౨౭, క్రైస్తవులు ౬౨, సిక్కులు ౬౩, జైనులు ౧౨, పార్శీలు ౧, ఆరణ్యకులు ౮౨ లక్షలుగలరు. ప్రజలందు ౧౦౦ కి ౬౮ హిందువులు, ౨౨ మహమ్మదీయులు, క్రైస్తవులు ౧.౮, సిక్కులు ౧.౮, ఇతరులు ౬.౪ వంతున గలరు. హిందూదేశమునందు ౫,౦౧,౯౫,౭౭౦ విభిన్నజాతిప్రజలు కలరు. వీరు క్రమముగ క్రైస్తవ, మహమ్మదీయమతములను స్వీకరించుచు మహమ్మదీయ క్రైస్తవజనమతాభివృద్ధికి తోడ్పడుచున్నారు. ప్రజలలో ౧౦౦ కి ౬౬ మందికి వ్యవసాయపరిశ్రమజీవనాధారముగ నున్నది. మగ్గములపరిశ్రమ ౧౦౦ కి ౧౦ మందికి జీవనాధారముగ నున్నను క్షీణించుచున్నది. దేశమునందు ౨౬౫ భాషలు వాడుకలోనున్నను ఈక్రిందివి ప్రధానభాషలు :

| | |
|---|---|
| పశ్చిమహింది | ౭,౧౫,౪౭,౩౦౦ |
| బీహారీహింది | ౨,౭౯.౨౭,౩౦౦ |
| బెంగాలీ | ౫,౩౪,౬౯,౩౦౦ |
| ఆంధ్రము | ౨,౬౩,౭౪,౩౦౦ |
| మరాటి | ౨,౦౮,౯౦,౩౦౦ |
| తమిళము | ౨,౦౪,౧౨,౩౦౦ |
| పంజాబీ | ౧,౬౩,౯౩,౩౦౦ |
| రాజస్థానము | ౧,౩౮,౯౮,౩౦౦ |
| కన్నడము | ౧,౧౨,౦౬,౩౮౦ |
| గుజరాతీ | ౧,౦౮,౪౯,౯౮౪ |
| ఓఢ్రము | ౧,౧౧,౯౪,౩౬౫ |
| బర్మీసు | ౯౯,౬౦,౩౯౪ |
| మళయాళము | ౯౧,౩౭,౬౧౫ |
| ఇంగ్లీషు | ౨,౧౯,౦౦౦ |

హిందీహిందుస్థానీభాషలు క్రమముగ వ్యాపించుచున్న విధము దేశపరిస్థితులు విశదము చేయుచున్నవి. హిందీ భాషవ్యాపించుచున్నను హిందువులసంఖ్య యన్ని రాష్ట్రముల యందును క్రమముగ తగ్గుచు మహమ్మదీయ, క్రైస్తవుల సంఖ్య వృద్ధిని పొందుచున్నది.

హిందూదేశమునకు ప్రధానపరిశ్రమమైన వ్యవసాయపరిశ్రమ గత సంవత్సరమునందు దుర్గతిపాలైనది. హిందూస్థానమునందు వ్యవసాయమునకుతగిన ౪౩,౨౭,౫౦,౦౦౦ యెకరములభూమియందును ౨౬,౧౧,౧౫,౦౦౦ యెకరములు వ్యవసాయము చేయబడినవి. వ్యవసాయమునందు ౨౧ కోట్లయెకరములు ఆహారపదార్థములకును, ౫ కోట్ల యెకరము లితరపదార్థములకును వినియోగపడినవి. ఆహారపదార్థములందు బియ్యము ౩౩౦, గోధుమలు ౯౦, చెరుకు ౩౮, అవిశెలు ౫౫, ఆవాలు ౧౦, వేరుశనగ ౨౬, నువ్వులు ౪ లక్షల టన్నులుపండినవి. గత సంవత్సరమునందు ౪౦,౬౦,౦౦౦ దూది బస్తాలు ఉత్పన్నమైనవి. నాలుగేండ్లలో దూదిపంట ౧౧ లక్షలబస్తాలు తగ్గిపోయినది. విదేశవ్యాపారము తగ్గిపోవుటవలన వ్యవసాయదారుల ఆర్థికస్థితి దుర్దశనందినది. హిందూదేశమునందుగల వ్యవసాయ క్షేత్రములందు ౪,౯౬,౯౭,౦౦౦ యెకరములకు మాత్రమే నీటిపారుదల కలదు. వ్యవసాయాభివృద్ధికి నాల్గుకోట్ల యెకరముల భూమియున్నను తగిన సదుపాయములు లేకున్నవి. దేశమునందు గల జలాశయములను, ప్రవాహములను నీటిసదుపాయములను గల్పించుటకు వినియోగించుటవలన వ్యవసాయ వ్యాపనమున కవకాశములు గలవు. తోటపంటలను వ్యాపింపజేయుటకును దేశమునందంతటను నీటివసతులను కల్పించుట ప్రభుత్వధర్మము. రాజ్యాదాయమునందు ౩౮,౫౨,౮౫,౦౦౦ రూపాయలు భూమిసిస్తునుండి వచ్చుచున్నను వ్యవసాయాభివృద్ధికిని, రైతులక్షేమమునకును ప్రభుత్వము చేయుచున్న సహాయము స్వల్పము.

వ్యవసాయమువలె వ్యాపార పరిశ్రమలును ప్రపంచావృతమైన ఆర్థికదురవస్థవలన వెనుకబడుచున్నవి. గత సంవత్సరమునందు హిందూదేశపు ఎగుమతులు ౧౩౬ కోట్లు దిగుమతులు ౧౩౩ కోట్లు. దిగుమతులందు ౭ కోట్లు అభివృద్ధియున్నను యెగుమతులందు ౨౫ కోట్లు తగ్గినది. గతసంవత్సరమునందు ౨,౧౨౬ లక్షల విలువగల బట్టలును ౧౫౯ లక్షల పట్టును ౭౨ లక్షల మాయపట్టును ౧౩౮ లక్షల వున్ని సరకులు హెచ్చినవి. దిగుమతులందు అభివృద్ధికి జపాను పోటీయును లంకాషైరు బలవంతమును కారణములు. జ్యూటు, వేరుసెనగ, నూనెగింజలు, దూది, తేయాకు, నూలు, బట్టలు, తోళ్లు, లోహములు తగ్గుటవలనను పండిన పంటలకైనను తగిన ధరలు లేకను రయితుల యార్థికస్థితియును, దేశార్థికస్థితియును దుర్భరము లైనవి. ఎగుమతులందు ౧౦౦-కి ౧౫ వంతునను ౨౫ కోట్లు తగ్గినవి. ఎగుమతులు తగ్గినను హిందూస్థానమున కనుకూల వ్యాపారము ౬౮ కోట్లు గలిగినదని సర్. సామ్యుయలుహోరుగారును, షూస్టరుగారును నానందించుట పండిత లక్షణము. హిందూస్థానమునకు సహజమైన అనుకూల వ్యాపారము ౧౯౨౫-౨౬ నందు ౧౦౯ కోట్లరూప్యములది కలిగినది. అనుకూల వ్యాపారము క్రమముగను ౬౮ తగ్గినను మామూలు ఎగుమతులును దిగుమతులును ఉన్నపుడు విచారించవలసిన యవసరము గలుగదు. హిందూస్థానమునకు ౧౯౨౨-౨౩ నుండి ౧౯౩౦-౩౧ వరకును ౨౬౮ కోట్ల బంగారము దిగుమతియగుచుండినను గతించిన రెండేండ్లయందును హిందూస్థానమునుండి ౧౨౭ కోట్ల బంగార మెగుమతి చేయబడినది. గతసంవత్సరమునందు ఎగుమతియైన ౬౫౪ కోట్ల బంగారమును అనుకూల వ్యాపారమునకు మూలము. బంగారము ఎగుమతికి మారకము రేటు ౧శి ౬పె యనువిని యోగపడినది. మారకపు రేటు౧శి ౬పె యుండుట బ్రిటీషు దిగుమతులకు ప్రయోజనకరములైనను హిందూస్థానపు దిగుమతుల కనర్థకముగ నున్నది వ్యవసాయ పదార్థములు నెగుమతిచేసి అనుకూల వ్యాపారము గలుగుటకు ౧౬ మారకము రేటును, బంగారు ప్రమాణమును నుపయోగములుగ నుండగలవు. గ్రేటు బ్రిటను నిర్ణయించిన ౧శి ౬పె, మారకపు రేటును స్టర్లింగు విధానమును, బంగారపు టెగుమతులును దేశార్థికస్థితిని తారుమారు చేసినవి.

హిందూస్థానవ్యాపారమునందు చినాజపానుదూది బట్టలవ్యాపారము చిరకాలమునుండియునులాభప్రదముగ నున్నది. జపానుపోటీవలనను క్రమముగను చీనాదూది బట్టలవాప్యారము క్షీణించినది జపానుకు దూదిఎగుమతులు ౧౯౨౯-౩౦ నందు ౨౦ కోట్లనుండి ౧౯౩౧-౩౨ నందు ౧౧ కోట్లకు తగ్గినది. జపానునుండి బట్టల దిగుమతులును ౧౨ కోట్లనుండి ౫ కోట్లకు తగ్గినది. జపానుబట్టలమీదను వేసిన సుంకములు వ్యాపారము తగ్గుటకు గారణము. ఇండియాజపాను దేశములకు జరిగిన దూదిపరిశ్రమనిర్ణయములు ౧౯౨౯-౩౦ నందు గల స్థితిగతులను దూదిపరిశ్రమకు గలుగజేయునని విశ్వాసము గలుగుచున్నది. లాంకాషైరు బట్టలవ్యాపారము క్రమముగ క్షీణించినది. స్వదేశమిల్లులపోటీకిని జపాను మిల్లులపోటీకిని నిలువజాలని లాంకాషైరెన్ని మాయోపాయములనుపన్నినను ఎన్నిలీసుమోడి యొడంబడికలను జేసినను నిరుపయోగములు. లాంకాషైరుమిల్లుల నిర్వాహకులు దూదికొనుట విషయమై మాటలతో కాలయాపనముచేయకను క్రియారూపమునను సార్థకము చేయుట ప్రయోజనకరము.

జపాను వ్యాపారము

పరిశ్రమలు

పరిశ్రమలందు దూది, జ్యూటు, బొగ్గు, పెట్రోలియము, శర్కర, ఇనుము, వెండి, మాంగనీసు మొదలగునవి ప్రధానములు. దూదిపరిశ్రమ, లాంకాషైరు జపానుపోటీ లున్నను క్రమముగను స్థిరపడుచున్నది. దేశమునకవసరమైన ౮,౦౦౦ కోట్లగజములబట్టలందును రెండువంతులు

దేశమునందు తయారగుచున్నది. శేషించిన బట్టయును దేశమునందు తయారై గిట్టింపగుటకు సుంకములను వేయుట న్యాయసమ్మతము స్వదేశమునందవకాశము లున్నపుడు విదేశములనుండి ఒకగజముగుడ్డనుకొనుటయు న్యాయ్యముకాదు. కాని స్వాతంత్ర్య రహితమైన దేశమున కిది సాధ్యముకాదు శర్కరపరిశ్రమ అయిదేండ్లలో ౧౭,౭౮,౦౦౦ టన్నుల నుండి ౩౨,౪౫,౦౦౦ టన్నులకు పెరుగుట శుభకరమైనను సంతృప్తికరము కాదు. ఒక టన్ను శర్కరనుకూడ పరదేశమునుండి దిగుమతి చేయవలసిన యవసరము కనుపడదు. శాల్యమునందున్న శర్కరపరిశ్రమమీదను ఎక్సైసుపన్నును వేయుటయన్యాయము. శర్కరపంటను తగ్గించుటకై యూరపునందుజరుగుచున్న ప్రయత్నములను భారతప్రభుత్వమును ప్రజలును ప్రతిఘటించుట సకలవిధములను శ్రేయస్కరము. ఉక్కుపరిశ్రమయును రక్షణసాధనమునను వికసించుచున్నది టారిఫుబోర్డు నిర్ణయించిన రక్షణవిధాన మంతయును బ్రిటిషు ప్రయోజనములకువలెను భారతప్రయోజనములకు వినియోగపడజాలదు. స్వాతంత్ర్యము లేని రాజ్యములందు వర్తమానార్థిక దుస్థితియందు పారిశ్రామిక వికాసము దుర్లభము దేశమునందు ౧౯౩౦ యందు ౮,౧౪౮ పరిశ్రమాలయములందు ౧౫,౨౮,౩౦౨ ప్రజలు పనిచేయుచున్నారు.

హిందూస్తానముయొక్క ఆర్థికస్థితి ఒక శతాబ్దమునకైనను కుదుటబడుట దుర్లభము. సెంట్రలు బ్యాంకింగు విచారణసంఘము పల్లెటూళ్లఋణగ్రస్తత ౯౦౦ కోట్లుండునటులు నిర్ణయించినది. ఋణగ్రస్తత బీహారునకు ౧౫౫, మద్రాసునకు ౧౫౦ కోట్లును కలదు. బీహారు రాష్ట్రస్థితిని భూకంపము దుస్సహముచేసినది. పల్లెటూళ్లవడ్డిరేటు ౧౦౦ కి ౧౨ నుండి ౩౬ వరకునుండి అప్పలను తీర్చుట దుష్కరమైనది. భూమిధరలును పంటలధరలును పడిపోయినవర్తమానసంవత్సరమునందు సిస్తులె చెల్లనపు డప్పులమాటను తలపెట్టవలసినపనియే లేదు.

ఆర్థికస్థితి

దేశమునందు విదేశ బ్యాంకులు ౧౮, ఇండియను బ్యాంకులు ౮౪, కోఆపరేటివు బ్యాంకులు ౨౦౪, ఇంపీరియలు బ్యాంకుకలిసి ౫౦౦ కోట్లధనమునుకలిగియున్నను రయితుల కుపకృతి కొంచెమైనను కలుగకున్నది. షాహుకారులు ౨,౦౦,౦౦౦ మందివారిఇష్టానుసారముగనప్పుల నిచ్చుచు ప్రజలను పీడించుచున్నారు వడ్డీని అప్పులను నియమించుటకుపంజాబుమద్రాసురాష్ట్రములందేకాకను హిందూస్తానమునందంతటను శాసనమును నిర్మించుట యత్యంతావసరము ౧౯౩౦-౩౧ లందు ౯౦,౦౬౪ పరపతిసంఘములు ౩౮,౯౦,౭౬౮ సభ్యులను ౧౦౬౦లక్షల మూలధనమును ౬౧౩ లక్షల డిపాజిటులను గలిగి ౩౭ కోట్ల నప్పుల నిచ్చినవి. గతసంవత్సరమునందీ ప్రయోజనమును తగ్గినది. దేశావృతమైన ఆర్థికదురవస్థయందు పూర్వపు ఋణదాత లంతరించుటయును బ్యాంకులకు విశ్వాసము లేకుండుటయును రయితులస్థితిని పూర్తిగను ముంచివేసినవి. నూతనముగ నిర్మితమైన రిజర్వుబ్యాంకునియమములందును రయితుల కుపకృతిని గల్పించుటకు చేసిన ప్రయత్నములు విఫలములైనవి. కర్రెన్సీనోటులవ్యాపన మొత్తము ౧౭౭ కోట్లనుండి ౧౬౦ కోట్లకు తగ్గినది.

హిందూస్థానమునందుగల ౩౫ కోట్ల యందును ౫ ఏండ్లు దాటినవారియందు చదువనేర్చినవారు ౨,౮౧,౩౮,౮౫౬ మాత్రము కలరు. ౧౯౩౧ యందు ౧౮ విశ్వవిద్యాలయములందు ౮౫,౦౦౦ విద్యాభ్యాసము చేసిన విద్యార్థులందు ౧౧,౧౧౮ మాత్రము కృతార్థులయిరి. విద్యార్థులందు ౧౦౦-కి ౧౩మంది కృతార్థులగుట విద్యావిధానమునందలిలోపమునువిశదము చేయుచున్నది. విద్యార్థులందు ౧౦౦-కి ౮౭ మంది కృతార్థులుగాకను ననుభవించెడి వ్యయప్రయాసలు పరమానర్థములకు మూలములగుచున్నను విద్యాప్రవృత్తియందు మార్పు గలుగకున్నది. స్వభాషాపాండిత్యము గలుగకను పరభాషాముఖమున్నను విద్యాభ్యాసము చేయుట విద్యార్థు

విద్యావ్యాపనము

లకును విజ్ఞానవ్యాపనమునకును హానికరము. ఢిల్లీయందు గూడిన అంతర్విశ్వవిద్యాలయోప సంఘము స్వదేశ భాషలందు విద్యాభ్యాసమును జేయుట కేర్పడిన తీర్మానమును నిరాకరించుట పరసంస్కార ప్రభావమును వేనోళ్లను చాటుచున్నది. మదనమోహనమాలవ్య, అక్బరుహైదరిగారలవాదము లరణ్యరోదనము లైనవి. రికగ్నిపనుపొందినవి ౨,౭౭,౧౮౯ పొందనివి ౩౪,౮౭౯, విద్యాలయములందును పురుషులు ౧,౦౫,౯౮,౪౧౫ స్త్రీలు ౧౪,౫౮,౪౨౨, మొత్తము ౧,౨౬,౮౯,౦౮౬ విద్యాభ్యాసమును జేయుచున్నారు. విద్యాశిక్షణమునకు ౧౯౩౧ యందు ౨౮ కోట్లు వ్యయము చేయబడినది. వ్యయమునందు ౧౦౦-కి ౪౮.౧ ప్రభుత్వము, ౧౫.౫ స్థానికనిధి, ౨౧.౭ జీతములు ౧౪.౭ వంతులితరవ్యవస్థలు భరించుచున్నవి. సకుటున ఉన్నతవిద్యాలయములందలి బాలురకు సంవత్సరమునకు రూ. ౫౨, బాలికలకు ౯౧, మధ్యమ పాఠశాలలందలి బాలురకు రూ. ౨౦, బాలికలకు ౩౬ వ్యయ మగుచున్నది. మనిషికి రూ. ౧౦౦ ఆదాయము గల దేశమునందు విద్యార్థికి రూ. ౫౨ వంతున వ్యయము చేయుటయును, విద్యాభ్యాసానంతరము నిర్వ్యాపారత్వమును, నిస్సహాయత్వమును, విజ్ఞానరాహిత్యమును విద్యాప్రవృత్తియందు సంపూర్ణపరివర్తనావసరమును చెప్పక చెప్పుచున్నవి. రుష్యాయందు పదేండ్లయందు ౧౦౦-కి ౫౪ వంతునను విద్యావ్యాపనము గలిగినను హిందూస్థానమునందు ౧౦౦-కి ౧౮ మంది మాత్రమె విద్య నభ్యసించుచున్నది దేశములకును వెనుకబడియున్నది. అంతర్విశ్వవిద్యాలయోపసంఘము ప్రాథమిక మాధ్యమిక విద్యాభ్యాసము స్వదేశభాషలందు జరుగవలయునని నిర్ణయించుట గ్రుడ్డిలో మెల్లగ నున్నది. కాని తీర్మానము నాచరణమునందు బెట్టుట కెంతకాలము పట్టునో దేవున కెరుక.

మహాఖండమువలె నున్న హిందూస్థానమునందు గమనాగమనసాధనము లఘోమయముగ నున్న విధమనుభవైకవేద్యము. ప్రజలు విశేషభాగము గ్రామ

గమనాగమన సాధనములు

సీమలందు నివసించుచున్నను గమనాగమనసాధనములు దుర్లభములు. ౧౯౩౧-౩౨ సంవత్సరాంతమునందు ౪౨,౮౧౩ మైళ్ళ రైలుమార్గము ౮౭౬ కోట్ల రూప్యములు వ్యయముచేసి నిర్మింపబడినను గ్రామవాసులకు విశేషమైన ప్రయోజనము గలుగలేదు. రైలుమార్గాదాయము ౧౯౨౬-౨౭ లందు ౧౧౨ కోట్ల నుండి ౧౯౩౨-౩౩ లందు ౯౭ కోట్లకు తగ్గి ౯ కోట్లు నష్టముగలిగినది. దేశావృతమైన ఆర్థికదుస్థితి వలనను ప్రయాణికుల సంఖ్యయును ౭౦ కోట్లు తగ్గినది. ప్రయాణికులందు ౧౦౦ కి ౯౫ వంతున నున్న మూడవ తరగతి ప్రయాణికులకు తగినసౌకర్యములను గలుగజేయలేదు. రైల్వేశాఖయందు గల యుద్యోగస్థులందు చిన్నపనులు భారతీయులవశమునందున్నను పెద్దయుద్యోగములన్నియును యూరపియనుల యధీనమునం దున్నవి. మోటారులు, బస్సులు వెలసిన తరువాతను గ్రామస్థులకు కొంతవరకును గమనాగమనసౌకర్యము లేర్పడినను. రోడ్డులులేకను మోటారుబస్సుల వ్యాపనము సాధ్యము గాకున్నది. ౧౯౩౩-వ సంవత్సరమునందు ౧,౯౪,౦౨౧ మోటారుబస్సులు మాత్రమె వాడుకయం దున్నవి. అమెరికాసంయుక్తరాష్ట్రములందు ౨౫౮ లక్షలు, గ్రేటు బ్రిటనునందు ౨౦ లక్షలు మోటారుబండ్లు వాడుకయం దున్నపుడు హిందూస్థానపుసంఖ్య స్థిరత్వమునకు నిదర్శనము. ప్రభుత్వ యాజమాన్యమునందు గల రైళ్లకును వ్యక్తులయాజమాన్యమునందు గల మోటారుబండ్లకును పోటీకలిగినపుడు గ్రామముల కీస్వల్ప సౌకర్యములును సహజముగ నంతరించగలవు. ప్రభుత్వ ప్రజాలక్ష్యము రైళ్లనుండి రోడ్లకును మోటారులకును మరలవలసిన యవసరము గలిగినది. రైళ్లనష్టము రోడ్లను నిర్మించుటవలనను పూడునుగాని బస్సులను నిర్బంధించుటవలనను పూడజాలదు. వర్తమాన నార్థిక దుస్థితియందు అమెరికా - సంయుక్తరాష్ట్రముల వలెను హిందూస్థాన

ప్రభుత్వమును రోడ్ల నిర్మాణమునకు పూనుకొనుట రైల్ల ఆదాయయాభివృద్ధికిని, విదేశాదాయాభివృద్ధికిని, వ్యవసాయాదాయాభివృద్ధికిని, ప్రజాసౌకర్యాభివృద్ధికిని సాధనము గాగలదు. వర్తమానవిషాదస్థితియందు సకలరాజ్యములకును వలెను హిందూస్తానముకును ఆదాయమును పెంచుటయును వ్యయమును తగ్గించుటయును అవసరములు.

ఆదాయ వ్యయములు

హిందూస్తానమునందు ౧౯౩౨-౩౩ లందు కేంద్ర ప్రభుత్వాదాయము ౧౨,౪౫౯ వ్యయము ౧౩,౬౧౮ రాష్ట్రాదాయములు ౧౦,౦౪౦ వ్యయము ౯,౮౯౦ లక్షలు. వ్యయమునందు పరిపాలనము ౧౯౮, సైన్యము ౫౫౮౮ లక్షలు మ్రింగుచున్నవి రాబడి తగ్గినందునను శర్కర నిప్పుపెట్టెలమీదను ఎక్సైసుసుంకము నిర్ణయింపబడినవి. పన్నులనిర్ణయమునందు గ్రేటుబ్రిటనునకు గల ప్రతిపత్తి హిందూస్తానవ్యవహారములపట్లను గనుపడదు. ఆదాయమునందు ౧౦౦ కి ౪౨ వంతున సైన్యవ్యయమగుచున్నది. సైన్యవ్యయము ౧౯౨౧-౨౨ లందు ౬౮ కోట్లనుండి ౧౯౩౩-౩౪ లందు ౪౬౨౦ లక్షలకు తగ్గినను భాగ్యవంతములయిన యితర దేశముల వ్యయముతోను పోల్చినపుడు మిక్కుటముగ నున్నది. గ్రేటుబ్రిటను ౧౦౦ కి ౧౪, ఫ్రాన్సు ౧౦, ఇటలి ౧౦, జపాను ౧౦4, జర్మనీ ౫ వంతునను సైన్యవ్యయము చేయుచున్నపుడు హిందూస్తానము ౪౨ వంతునను జేయుట న్యాయముకాదు. వ్యయమునందు విశేష భాగము బ్రిటీషుసైనికులకు వినియోగపడుచున్నది. హిందూస్తానమునందుగల ౬౦,౦౦౦ బ్రిటీషుసైనికులకును సోల్జరునకు రూ. ౧౨౩౭ ల చొప్పునను ౧,౫౦,౦౦౦ హిందూస్తాన సోల్జరులకు రూ. ౪౩౩ చొప్పునను వ్యయముచేయబడుచున్నది. ౩౫ కోట్ల ప్రజలు గల దేశమునందు క్షాత్రతేజముగల జాతులెన్నియోయున్నవి. దేశరక్షణమునకు స్వదేశీయులను సిద్ధము చేయుట పుణ్యము, పురుషార్థమును. బ్రిటీషుసైన్య వ్యయవిషయమున చేసిననిర్ణయ మితరనిర్ణయములవలెనే హిందూస్థానమునకు ప్రతికూలముగ నున్నది.

మద్రాసు రాష్ట్రము

మద్రాసురాష్ట్రము హిందూస్థానమునందలి ౧౪ రాష్ట్రములందొక మహారాష్ట్రముగ నున్నది. రాష్ట్ర విస్తీర్ణము ౧,౪౩,౮౭౦ చదరపుమైళ్లు. రాష్ట్రమునందు గల ౪,౭౧,౯౩,౬౦౨ ప్రజలు ౩౫౦ పట్టణములందును ౫౧,౯౯౦ గ్రామములందును గల ౯౩,౪౧,౭౯౩ గృహములందు నివసించుచున్నారు. ప్రజలందు ౬౪ లక్షలు పట్టణములందు ౧౧,౫౨,౪౪౩ గృహములందును, ౪౦౭ లక్షలు గ్రామములందు ౮౧,౯౯,౩౪౬ గృహములందును నివసించుచున్నారు జనసంఖ్య ౧౮౯౧ యందు ౩౬౦ లక్షలనుండి ౧౯౩౧ యందు ౪౭౧ లక్షలకు వృద్ధినందినది. పురుషులు ౨,౩౩,౦౧,౧౪౫ స్త్రీలు ౨,౩౮,౯౨,౪౫౭. పురుషులసంఖ్యకన్న స్త్రీల సంఖ్య ౫,౯౧,౩౧౨ హెచ్చినది. గతించిన ౧౦ ఏండ్లయందును పట్టణములసంఖ్య ౩౩ హెచ్చినది. పట్టణస్థానము నుండి ౭ తగ్గినవి. క్రొత్తవి ౪౦ పట్టణములందు చేరినవి. పట్టణములందు జనసంఖ్య ౮,౬౦,౫౯౫ హెచ్చినది.

మద్రాసురాష్ట్ర ప్రజలందు

| | |
|---|---|
| బ్రాహ్మణమతహిందువులు | ౪,౧౬,౮౫,౧౮౮ |
| మహమ్మదీయులు | ౩౩,౩౨,౧౫౮ |
| క్రైస్తవులు | ౧౭,౭౪,౨౭౬ |
| అడవిజాతులు | ౩,౪౮,౭౬౩ |
| జైనులు | ౩౧,౨౩౭ |
| బౌద్ధులు | ౧,౩౫౯ |
| పార్శీలు | ౫౦౭ |
| యూదులు | ౨౩ |
| సిక్కులు | ౫౩౭ |
| ఆర్యసామాజికులు | ౧౨౨ |
| బ్రహ్మమతస్థులు | ౬౩౧ |
| రాధాస్వామిమతస్థులు | ౭ |
| ఇతరులు | ౬౫ |

మద్రాసురాష్ట్రప్రభుత్వము దుడుకులు లేకను చక్కగ సాగుచున్నవిధమును ౧౯౩౨-౩౩ పరిపాలన నివేదిక తెలుపుచున్నది. ప్రభుత్వశాఖలు రెండును, మంత్రివర్గమును, కార్య నిర్వాహక వర్గమును కలిసి రాజ్యాంగరథమును నడుపుచున్నవిధమును పరిపాలనోదంతము వెల్లడిచేయు చున్నది. ప్రధానమంత్రి శ్రీ బొబ్బిలి రాజాగారును, రివిన్యూమెంబరు సర్ ఆర్చిబల్డు క్యాంబెలుగారును కలిసి ల్యాండు యెస్టేటుశాసనమును, స్థానికసంస్థల శాసనమును నిర్మించిన విధము ద్వంద్వ ప్రభుత్వ నందలి రెండు శాఖలును కలసి పని చేయగల విధమును వెల్లడిచేయుచున్నవి ల్యాండు-ఎస్టేటు శాసనమునందు అగ్రహారములకును ఎస్టేటు నిర్వచనము చేయుటవలన అగ్రహారీకుల కన్యాయము గలిగినది

శాసన సభ

ప్రభుత్వశాసనములు ౧౭ నిర్మింపబడినవి. అనధికారసభ్యుల మరుమక్కటయ్యంశాసనము, నంబూద్రిశాసనము ఆమోదింపబడినవి. హోముమెంబరు సర్ మహమ్మదు ఉస్మాన్ సాహెబుగారును, లామెంబరు సర్ కృష్ణన్ నాయరు గారును కలిసి (లాను-ఆర్డరు) న్యాయశాంతి పరిపాలనమును కాపాడినవిధమును రాష్ట్రమునందలి ప్రశాంత స్థితి తెలుపుచున్నది కాంగ్రెసు ప్రచారము నాపుటకు ప్రభుత్వ నిర్బంధవిధానము సఫలమగుటయందు విచిత్రము గనుపడదు. వ్యక్తిశాసనోల్లంఘనము, శాసనోల్లంఘన ప్రస్థానధర్మమును సమర్థించుటకును, పరిపాలన విధానమును ఖండించుటకును శాంతిసాధనము ప్రయోజనము ధర్మనిర్వహణము కాని ఒటాటోపము కాదు. మద్రాసునందును నితరస్థలములందవలెను విప్లవోద్యమాంకురములు బయలుదేరుట దురదృష్టము. శాసనసభయందు ౫౨ తీర్మానములు ప్రతిపాదింపబడినను ౫ మాత్రమె చర్చింపబడినవి శాసనసభయందు సభ్యులు సూచించిన ౧౯౪ కోతమోషను లందును ౩౦ చర్చింపబడి ఒకటిమాత్రమె సభామోదమును బడసినది. సభ్యులు వేసిన ౧౧౪౦ ప్రశ్నలందు ౮౦౫ ప్రశ్నలకు జవాబు లొసంగబడినవి. శాసనసభాకాలము ౧౯౩౩ నవంబరు ౫వ తేది నంతము నొందినను మరొక సంవత్సరకాలము పెంచబడినది. సభ్యుల యభిప్రాయములను ప్రభుత్వము నిరాదరించెడి విధమును భూమిశిస్తు రిమిషను విషయమై సభ యామోదించిన తీర్మానమును ప్రభుత్వము చూపిన నిరాదరణము విశదము చేయుచున్నది. శాసనసభ వాగ్వివాదములకును, ప్రభుత్వావలంబనమునకును వినియోగపడినట్లు ప్రజోపయుక్త కార్యములకు వినియోగపడుటలేదని సభ్యుల యనుభవమును ప్రజానుభవమును విశదము చేసినవి సర్ మహమ్మదు ఉస్మాన్ సాహెబుగారు ౭ ఏండ్లు హోంమెంబరుగ నుండి మేమాసమునందు గవర్నరగుట యదృష్టము.

చెన్నరాష్ట్రమునందు ప్రజలకు వ్యవసాయము జీవనాధారముగనున్నది గతసంవత్సరమునం దతివృష్టి అనావృష్టిదోషములవలనను పంటలు చెడిపోయినవి. పంటలందు ప్రధానమైన వడ్లకు ధర తగ్గినది. ప్రభుత్వము రిసెటిల్మెంటు చేసి యనేకజిల్లాలందు భూమిశిస్తును పెంచినది జమీన్దారీ ప్రదేశములందును శిస్తు విశేషము వృద్ధిచేయబడినది. గతించిన రెండేండ్లయందును మద్రాసు రాష్ట్రమునందు భూమిశిస్తును తగ్గించుటకై గొప్పాందోళన మేర్పడినను ప్రభుత్వము నిరాదరణమును జూపుచున్నది. వ్యవసాయదారులకు జీవనమును గడపుటయే కాకను శిస్తులను చెల్లించుటయును సాధ్యముగాకపోయినది. రయితులు నగలనమ్మియును తాకట్టుపెట్టియును, భూమిని తాకట్టుపెట్టియును శిస్తులను చెల్లించిరి వడ్ల ధర ౧౦౦-కి ౬౦ వంతునను తగ్గినపుడు నిత్యదారిద్ర్యము ననుభవించెడి రయితున కష్టపుచేయుట తప్ప గత్యంతరము లేకున్నది. ధరలు తగ్గుటవలనను దేశమునందంతటను ధనము తగ్గి రయితున కష్టపుట్టుటయును నసాధ్యమైనది. చెన్నరాష్ట్రాదాయము ౧౯౩౨-౩౩లందు రూ. ౧౬,౪౦,౨౪,౭౦౪లు. ఆదాయమునందు భూమ్యా

వ్యవసాయము

దాయము సెస్సులు సహా రూ. ౮,౭౧,౩౮,౬౨౭ లు. రివిన్యూ మొత్తమునందు ౧౦౦-కి ౯౮.౦౪ వంతున వసూలు చేయబడినను వసూలు చేయుటయందు సేలు, అట్టాచిమెంటు నోటీసులు హెచ్చినవి. రూ. ౯౩,౪౧౪ సిస్తుబాకీకి రూ. ౬,౮౭,౯౬౭ విలువ గల స్థిరాస్తి రూ ౧,౧౩,౦౫౮ లకు విక్రయింపబడినది. వేలంపాటలందు పాటపాడినవారు లేనందునను ప్రభుత్వము ౧౦,౬౭౫ యకరములనుకొన్నది. ధరలు తగ్గుట వలనను వ్యవసాయప్రదేశమును ౩౯,౦౦౦ యకరములు తగ్గినవి. రిసెట్టిల్మెంటు రేటులందు తగ్గించినరిమిషనువలనను ౩౨ లక్షలు రిమిషనీయబడినది.

భూమిసిస్తు నిర్ణయము, వసూలు, రిమిషను మొదలగువ్యవహారమంతయును మారవలసినయవసరమును పై లెక్కలు తెలుపుచున్నవి. వ్యవసాయము ౧౦౦కి ౭౦ మందికి జీవనాధారమైన రాష్ట్రమునందుప్రభుత్వక్షేమ మంతయును రయితులక్షేమముమీద నేయాధారపడియున్నది. ప్రజల యార్థికదుస్థితి మద్యములవాడుకను తగ్గించినను మద్యాదాయము తగ్గలేదు. కల్లుఆదాయము రూ. ౧, ౯౭,౬౬,౦౩౦ల నుండి రూ. ౨,౦౬,౮౬,౧౩౧ లకుపెరిగినది. సారాయను ఆదాయము రూ. ౧,౫౬,౬౬,౦౦౦ లనుండి రూ. ౧,౪౩,౦౦,౦౦౦ లకును విదేశమద్యాదాయము రూ. ౧౫,౧౯,౮౭౩ నుండి రూ. ౧౪,౨౧, ౯౦౬ లకును తగ్గినవి. గంజాయినుండి రూ. ౨౦,౧౭, ౦౦౦ ను నల్లమందునుండి రూ. ౩౭,౫౨,౦౦౦ ను ఆదాయమువచ్చినది. కల్లుత్రాగుట పెరుగుటకు పికెటింగు లేకపోవుటయును, సారాయాదాయము తగ్గుట కార్థికదుస్థితియును కారణములగుటయునువిచిత్రవాదము. పిక్కెటింగులేనందున మద్యాదాయము పెరుగుటకు విచారము గలుగవలయును కాని సంతసము గలుగజాలదు స్టాంపుల ఆదాయము ౨౩౬ లక్షలు. గత సంవత్సరాదాయముకంటెను ౬ లక్షలు హెచ్చినది.

వ్యవసాయపరిశోధనలందు చెఱుకు, వరి, కొబ్బరి విత్తనములను పంటలను నభివృద్ధిచేయుటకు చేయుచున్న ప్రయత్నములు ఫలవంతము లగుచున్నను ప్రజలందు వ్యాపనము చేయుట యవసరము. చెఱకురసమును పాలబెల్లముగ చేయుటకును, శర్కరచేయుటకును చేయు ప్రయత్నములు ప్రజలయందు వ్యాపకమును పొందవలసియున్నవి. చేపలపరిశ్రమను తూర్పు పశ్చిమతీరములందు గల పట్టులందును, చెరువులందునువృద్ధిచేసి పల్లెకారులకు జీవనోపాధిని వృద్ధిచేయుట యవసరము. బోరింగు శాఖ చేయుచున్న పని కేవలము పురాతనమై సామాన్యరయితున కందుబాటునందు లేకున్నది. క్రొత్త పద్ధతుల నేర్పాటుచేసి వ్యయమును తగ్గించుటవలనను రయితునకును ప్రభుత్వమునకును లాభము గలుగగలదు పడమటితీరమునందుగల కేరళసబ్బుఫాక్టరివలెను తూర్పుతీరమునందును సబ్బుఫాక్టరిని పెట్టుటవలనను లాభము గలుగగలద. వ్యవసాయాభివృద్ధికిని రయితుల జ్ఞానమునకును ప్రతిజిల్లాయందును వ్యవసాయక్షేత్రములను, పశుశాలలను నిర్మించుట పశువృద్ధికిని పాడిపంటల యభివృద్ధికిని మూలము. పశుపాలనశాలను చింతలదీవి, గుంటూరులనుండి యెత్తివేసి హోసూరునందుమాత్రమె యుంచుటవలన నుపయోగము తగ్గిపోయినది. తూర్పు తీరమునం దొకశాలను స్థాపించుట పశుపోషణాభివృద్ధికత్యంతావసరము ప్రజలయోగక్షేమములకు మూలాధారములైన యీరెండు శాఖలందును అభివృద్ధిశాఖ చేయుచున్నపని స్వల్పమును, చేయవలసినపని యపారమును కలదు. అభివృద్ధిశాఖ గ్రామసీమలందు నివసించుచున్న రయితులకు మార్గములను, వైద్యసహాయమును, నీటిసదుపాయములను, విద్యాసౌకర్యములను, గృహపరిశ్రమల సౌకర్యములను గలుగజేయుట ప్రయోజనకరము కాని శాసనములను గల్పించుట ప్రయోజనకరముగాదు.

పరిశ్రమ వ్యవసాయశాఖలు

గతసంవత్సరమునందు విద్యాలయముల సంఖ్య ౫౩,౫౪౫ నుండి ౫౧,౦౭౩ లకును, విద్యార్థుల సంఖ్య ౨౮,౭౭,౫౦౪ నుండి ౨౮,౬౪,౫౯౭ లకును తగ్గినది.

**విద్యా - వైద్య సౌకర్యములు**

విద్యావ్యాపనము ౧౦౦ కి ౬.౩ నుండి ౬.౨ లకు తగ్గినది. విద్యావ్యయము రూ ౫,౬౭,౬౨,౦౦౦ ల నుండి రూ ౫,౩౧,౫౯,౦౦౦ లకు తగ్గినది. ప్రభుత్వ వ్యయము ౧౦౦ కి ౬౧ నుండి ౬౦ కి తగ్గుటయును ప్రజా వ్యయము ౩౯ నుండి ౪౦ కి హెచ్చుటయును సంభవించినది ఆదిఆంధ్ర, ఆదిద్రావిడ పాఠశాలల సంఖ్య ౧౧,౨౧౫ నుండి ౯,౫౭౭ లకు విద్యార్థులసంఖ్య ౩,౩౯,౭౮౯ నుండి ౩,౨౬,౬౫౩ లకును తగ్గినది. అభివృద్ధి శాఖపట్లను హరిజనులపట్లను దంద్వప్రభుత్వమునకు గల నిక్కమైనప్రేమకు ప్రభుత్వ నివేదికయందలి లెక్కలె ప్రమాణములు.

**వైద్య సహాయము**

గత సంవత్సరమునందు ౧౬,౨౭,౩౮౧ జననములు, ౯,౯౨,౦౨౪ మరణములు సంభవించినవి. జ్వరములు ౨,౯౧,౧౪౬, రక్తభేదులు ౮౦,౪౧౦, కలరా ౫,౨౭౮, మశూచి ౫,౩౬౩, శ్వాస కాసలు౯౪,౩౧౨,ఇతరములు౪,౯౦,౦౦౦ మరణ కారణములు. ప్రసూతి వలన ౧౦౦౦ కి ౧౫ తల్లులు, ౧౮౨ పిల్లలు మరణముల పాలైరి. జ్వరములచావులను, బాలింత చావులను తగ్గించుటకు వైద్యశాఖ చేయుచున్న ప్రయత్నములు స్వల్పములు. మన్యజ్వరములకేర్పాటుచేసిన వైద్యసంస్థయును తీసివేయబడినది ప్రతిజిల్లాయందొక బాలింతశాలనైనను నేర్పాటు చేయుటయును, మంత్రసానులను తయారు చేయుటయు జిల్లాబోర్డులకును ప్రభుత్వమునకును విధి కృత్యము. వైద్యసహాయార్థము గ్రామములందు ౧౩౩౭, పట్టణములందు౨౧౮ వైద్యాలయములు పనిచేయుచున్నవి. వైద్యాలయములసంఖ్య ౯౨ పెరుగుట సంతృప్తికరముకాదు. వైద్యసహాయ వ్యయమును ౮౧౨౦ వేలనుండి ౮౦౭౭ వేలకు తగ్గినది. ఆరోగ్యప్రదర్శనములును శిశుప్రదర్శనములును ౯౪౫౩ నుండి ౮౩౬౩ లకు తగ్గినవి. గ్రామసీమలందు ఆరోగ్యాభివృద్ధికి ప్రభుత్వము చేయుచున్నప్రయత్నములు స్వల్పములు. అభివృద్ధిశాఖ విద్యాభివృద్ధికివలెను వైద్యసహాయమునకును చేయుచున్న ప్రయత్నములు స్వల్పములు.

**వృత్తులు పరిశ్రమలు**

మద్రాసురాష్ట్రమునందు ౧౯౨౧ యందువలెను ౧౯౩౨ నందును ౧౦౦ కి ౭౧ మందికి వ్యవసాయము వ్యవసాయోపవృత్తులును జీవనమున కాధారములు. వ్యవసాయభూములందు వడ్లు, ౧,౧౬,౭౭,౫౨౯, వేరుసెనగ ౩౫, ౭౧,౯౭౮, ఆముదములు ౨,౮౩, ౨౩౮, కొబ్బరి ౫,౬౫,౯౭౧, చెఱకు ౧,౧౪,౮౭౭, ప్రత్తి ౨౦,౪౧,౨౮౪, పొగాకు ౨,౪౨,౬౪౪, నువ్వులు ౭,౪౫,౮౭౨ మొదలగుపైరులు ౩,౯౧,౯౩,౨౦౧ యకరములందు పండింపబడుచున్నవి. వ్యవసాయానంతరము నేతపరిశ్రమ ముఖ్యపరిశ్రమగ నున్నది. మద్రాసు రాష్ట్రమునందలి దూదియంత్రాలయములందు ౭౪౫ లక్షుల రతులనూలు, ౬౪౦ లక్షులగజములబట్ట, ౨౭౦ వేల డజనుల మేజోళ్లు తయారుచేయబడినవి. స్వదేశమిల్లులనూలు విదేశములమిల్లునూలును ౨౦ నుండి ౨౦౦ నంబరువరకును చేతిమగ్గములమీదనువాడబడు చున్నది. మద్రాసురాష్ట్రమునందు ౨,౦౦,౦౦౦ మగ్గములువాడుకయందున్నవి. లుంగీలను నేయుటకు ౪౦,౦౦౦ పట్టును నేయుటకు ౧౮,౦౦౦ వాడుకయందున్నవి. ఇతరపరిశ్రమలవలెనే చేతిమగ్గపుపరిశ్రమయును క్షీణించుచున్నది. మద్రాసునుండి ప్రతియేటను షుమారు మూడుకోట్ల చర్మములు నాలుగుకోట్లవిలువగలవి ఎగుమతిచేయబడుచున్నవి తోళ్లపరిశ్రమలను అభివృద్ధి చేయుటవలన దేశమునందు నిమ్నజాతులపనివాండ్రకు జీవనోపాధి కలుగగలదు. పెద్దపరిశ్రమలవలెను చిన్న గృహపరిశ్రమలును అంతరించుచున్నవి గాజులు, కాగితములు, కలంకారీఅద్దకము, జీలుగదండలు, సంగీతోపకరణములు, కొండపల్లి, నక్కపల్లిబొమ్మలు, లక్కసామానులు, జలతారు, కుండలు మొదలగుపరిశ్రమ లన్నియును క్రమముగ క్షీణించి దేశమునందంతట నిరుద్యోగ సమస్య వ్యాపించినది. చిన్నరాష్ట్రమునందు ౨౭

దూదియంత్రాలయములును, 3 జూటుయంత్రాలయములును పనిచేయుచున్నవి. ఇవిగాక ౧,౦౦౬ పరిశ్రమాలయములందు ౬౮,౪౬౮ మంది పనిచేయుచుండిరి. పరిశ్రమాలయములందు ౧,౩౨,౪౬౦ మంది పనిచేయుచుండిరి. ఖాదీపరిశ్రమయును ౧౦,౦౦౦ పనివాండ్రకు పని కల్పించినది. చెన్నరాష్ట్రమునందు గల ప్రజలకు యంత్రాలయములయందు ౨,౦౦,౦౦౦ మందికి మాత్రమే పనిగలదు. వ్యవసాయపరిశ్రమతోపాటు గృహపరిశ్రమలను, చేతిమగ్గములపరిశ్రమలను, ఇతరచేతిపరిశ్రమలను అభివృద్ధిచేయవలసినయవసరమును ప్రజలును ప్రభుత్వమును గ్రహింపవలసియుందురు. రూజువెల్టుగారు అమెరికాయందును,హిట్లరుగారు జర్మనీయందును నూతన యంత్రాలయనిర్మాణము నాపివేసిరి. ద్రవ్యములేని మద్రాసురాష్ట్రమునందు యంత్రాలయస్థాపనము దుర్లభము. పారిశ్రామికశాఖయును, వ్యవసాయశాఖయును గృహపరిశ్రమల యుద్ధరణాభ్యుదయము' కు పాటుపడవలసినయవసరమును దేశావృతమైన ఆర్థికదుస్థితి విశదము చేయుచున్నది. భగవంతుడు ప్రజాపోషణ కవసరమైన అన్నవస్త్రముల కవసరమైన వస్తుసముదాయమును దయచేసినను వానిని సద్వినియోగము చేయజాలకపోవుట ప్రజాప్రభుత్వములు నావరించిన క్లీబత్వమునకు నిదర్శనము.

హిందూస్థానపరిస్థితులును మద్రాసురాష్ట్రవ్యవహారములును ఆంధ్రరాష్ట్రవ్యవహారముల యవలోకనమునకును వినియోగపడుచున్నవి. హిందూస్థానచరిత్రమునం దాదికాలము నుండియును ఆంధ్రదేశము వ్యక్తిత్వముగలిగి వికసించినది. ప్రాచీనపు ౫౬ రాజ్యములందు నాంధ్రరాజ్య మొకరాజ్యము. ఆంధ్రరాజు లొకకాలమునందు దక్షిణపీఠభూమినుండి మగధవరకునుగల భూభాగము నప్రతిమానముగను పాలించినవిధము చరిత్రాంశము. ఆంధ్రభాష ద్రవిడభాషాకుటుంబమునందు మధ్యస్థకుటుంబమునకు చెందియున్నది. ఆంధ్రులు దక్షిణమునందున్న ద్రవిడులకును ఉత్తరమునందున్న ఆర్యులకును భిన్నములైన గుణశీలములను వేషభాషలను రూపవిలాసములను వ్యక్తిత్వమును గలిగి చిరకాలమునుండియును వర్ధిలుచున్నారు. చిరకాలమునుండియును వ్యక్తిత్వముకలిగివర్ధిలుచున్నజాతిని వర్తమానకాలమునందును కాపాడుటపురోభివృద్ధికిసాధనము. సంయుక్తహిందూస్థానరాజ్యములందు ప్రత్యేకవ్యక్తిత్వముగల రాష్ట్రములను కాపాడుట ప్రజాక్షేమమునకు సాధనము. పాశ్చాత్య రాజ్యాంగవేత్తలు లయొనలు కర్టిసు, సర్ థామస్ హోల్డర్నెసు సర్. బి. ఫుల్లరుగారులు మొదలగువారును హిందూస్థాననాయకులు గాంధి మహాత్ముడు, బాలగంగాధర తిలకు, సర్ తేజబహద్దరు సప్రూ, మోతిలాలు నెహ్రూగారులు మొదలగువారును భాషాప్రయుక్తరాష్ట్రవిభజనావసరమును నంగీకరించుచున్నారు. కాంగ్రెసువ్యవహారములం దాంధ్రరాష్ట్రము ప్రత్యేకముగను వ్యవహరింపబడినది. మద్రాసు శాసనసభ ఆంధ్రరాష్ట్రనిర్మాణ ప్రతిపాదనము నామోదించినది. భావిరాజ్యాంగమునకు కీలకమైన ఫెడరేషను విధానమునకు భాషాప్రయుక్తరాష్ట్రములు బీజములు.

ఆంధ్రరాష్ట్రము విస్తీర్ణమునందును, ఆదాయమునందును, కళావిజ్ఞానములందును, సంస్కారమునందును ప్రత్యేకరాష్ట్రనిర్మాణమునకు సకలవిధములను తగియున్నది. ఫెడరేషను రాజ్యాంగమును స్థాపించుటకు పూర్వమె దేశమునవసరములబట్టి భాషాప్రయుక్తరాష్ట్రములుగను విభజించుట రాజ్యాంగనిర్వహణమునకుసాధనము. ౭౫,౦౦౦ చదరపుమైళ్లవిస్తీర్ణమును ౧౮౦ లక్షల ప్రజలను ౮౦౦ లక్షల ఆదాయమును గల ఆంధ్రావని ప్రత్యేకరాష్ట్రనిర్మాణమునకు సకల విధములను తగియున్నది. సరిహద్దు ప్రాంతములందు సరిహద్దులను, జాతిని, భాషను, ప్రజాభిప్రాయసౌకర్యములను, పరిపాలనా సౌకర్యములనుబట్టి నిర్ణయించుటయును వెంటనే భాషాప్రయుక్తరాష్ట్రములను నిర్మించుటయును ప్రయోజనకరము. ఉత్కళరాష్ట్ర-సరిహద్దులను నిర్ణయించుట

యందును ప్రజాభిప్రాయ ప్రయోజనములను రక్షించుట ధర్మము. కాని జమీందారులయభీష్టములనుగమనించుట ధర్మముకాదు. పర్లాకిమిడిని రెండుభాగములుగను విభజించుటకు పర్లాకిమిడిరాజాగారి పక్షమునను నత్త్యమంగళంజమీందారు, డాక్టరు సుబ్బరాయనుగారును నితరులును గవర్నరుగారిని ప్రార్థించుట వారిపలుకుబడిని దుర్వినియోగముచేయుటయై యున్నది. గవర్నరుగారీ యన్యాయమున కొడిగట్టుకొనకుందురు గాత.

గంజాం విశాఖపట్టణ మండలము లందు ప్రజాభిప్రాయమునకు ప్రతికూలముగ నాంధ్రులను, నిస్సహాయులైన ఆరణ్యకుల నుత్కల రాష్ట్రమునందు జేర్చుటవలన నుభయులకును ప్రయోజనము గలుగదు. ఒకప్పు డాంధ్రరాష్ట్రనిర్మాణావసరమును రౌండుటేబిలు సమావేశమునందు వ్యక్తము చేసిన శ్రీ బొబ్బిలి రాజాగా రిపుడు ప్రతికూలురగుట దురదృష్టము. ఇది అధికారసింహాసన మాహాత్మ్యము. ఆంధ్రరాష్ట్ర మెపుడు సమకూడినను ౨౦ లక్షల యాంధ్రు లాంధ్రాభ్యుదయమునకై నిరంతరము పాటుపడుట ఆత్మసంరక్షణమునకును, దేశాభ్యుదయమునకును సాధనము. రాయలసీమవాసులం దుదయించిన యపోహలను తొలగించుటకు శాంతిమార్గమున నాంధ్రప్రజానాయకులు పనిజేయుట యవసరము. ప్రపంచవ్యాప్తమైన వర్తమాన సందిగ్ధావస్థయందు సంయోగసాహచర్యము లభ్యుదయమునకును, వియోగవిభేదములు విలయమునకును మూలములగుచున్న విధమును ప్రపంచేతిహాసములు బోధించుచున్నవి. ఆంధ్రులసంయోగబలమును సాహిత్యకళావికాసమునకును సాంఘికార్థిక ప్రయోజనములకునైనను వినియోగించుట వివేకము, శ్రేయస్కరము.

ఆంధ్రాభ్యుదయము వర్తమానపరిమిత సందర్భములందును పర్యాప్తమగుచున్న విధమును విషయావలోకనము విశదముచేయుచున్నది. ప్రజావికాసమునకు మూలాధారమైన సాహిత్యాభ్యుదయమును, భాషాభ్యుదయమును సంఘాభ్యుదయమును ఉచితరీతిని పర్యాప్తములగుచున్నవి.

ఆంధ్రాభ్యుదయము

గతసంవత్సరమునందు ౪౭ వార్తాపత్రికలు, ౬౪౧ గ్రంథములును ప్రచురింపబడినవి. గ్రంథములందు విశేషభాగము మతమునకు సంబంధించినవి. నవలలు నాటకములును ప్రజాదరణమునకు పాత్రములగుచున్నవి. సాహిత్యారాధకులైన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికిని, గిడుగు రామమూర్తిపంతులుగారికి నిజరిపిన షష్టిపూర్తిసప్తతిపూర్త్యుత్సవములు ప్రజలసాహిత్యాభిమానమును విశదచేయుచున్నవి. రాజమహేంద్రవరమునందు శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారి యాధిపత్యమునను జరిగిన అభినవకవితామండలి ప్రజలయందు ప్రవర్ధమానంబగుచున్న సాహిత్యోపాసనాభిలాషను సువ్యక్తము చేసినది. యువజనుల నూతనకావ్యకల్పన లాంధ్రహృదయమునందు గలిగిన సంచలనమునకు నిదర్శనములు. బెజవాడ కాకినాడలందు జరిగినచిత్రకళాప్రదర్శనములు, గ్రంథాలయప్రదర్శనములు, చిత్రకళారచనలం దాంధ్రుల వ్యక్తిత్వమును కళోపాసనానురక్తిని సువ్యక్తము చేసినవి. శ్రీ గోతా ఆనందమోహనుగారి "ఛాయలు", "సానపెట్టువాడు" లంపను చిత్రకళాప్రదర్శనమునందును, శ్రీ కేశవరావు, రామారావుగారల చిత్రములు మద్రాసు చిత్రకళాప్రదర్శనమునందును ప్రశంసలను బడసినవి. ఆంధ్రచిత్రకళోపాసకుల సంఖ్య దినదినప్రవర్ధమానం బగుచు కళాప్రపంచమునం దాదరమును బడయుచున్నది. డిసంబరు మాసాంతమునందు మద్రాసునందు శ్రీయుత రాఘవాచార్యుల వారి యధ్యక్షతక్రింద సమావేశమైన నాట్యకళాపరిషత్తు ఆంధ్రులకు నాట్యకళయందుగల యభినివేశాభిమానములను పరిస్ఫుటము చేసినది. నాటకకర్తలకు బహుమానము నేర్పాటు చేయుటయును, నాటకకళాభ్యుదయమునకు శుభచిహ్నము. స్త్రీలు నాటకరంగమునందు జేరి పాత్రధారణము చేయుటయును నభ్యుదయచిహ్నము.

సాహిత్యమునందు వలెను సంగీతము నందును ఆంధ్రులందు ప్రవర్ధమానం బగుచున్న అభినివేశాభిమానములను గాయకులు, గాన సభలు పరిస్ఫుటము చేయుచున్నవి. విజయనగరము, కాకినాడ, రాజమహేంద్రవరములందు స్థాపితములైన గానకళాశాలలు గానకళాభిరుచిని ప్రజ్వలింప జేయుచున్నవి. శ్రీ హరి నాగభూషణము, ద్వారం వెంకటస్వామి నాయుడు, పారేపల్లి రామకృష్ణయ్యగారులు మొదలగువారల గానాభినివేశము దాక్షిణాత్య పండితుల యాదరణగౌరవములకు పాత్రమైనది ఆంధ్రరస హృదయము సంగీతసాహిత్య కళాంగములందు వికాసమును పొందుచు నాత్మోపలబ్ధికి ధర్మయాత్రను చేయుచు ప్రపంచ పరిణామమునకు వినియోగ పడుచున్నది. స్త్రీలును పురుషులవలెను సాహిత్యసంగీత చిత్రకళాదులందు జూపుచున్న స్వాతంత్ర్యాభినివేశాభిమానములు పురోవృద్ధికి శుభలక్షణములు.

సాంఘిక వికాసము, హరిజనులు

ఆంధ్రాభ్యుదయము సాహిత్యకళారంగములందు వలెను సాంఘికరాజకీయరంగములందును స్వయంసహాయమునను సాంఘికవ్యవస్థలందును పర్యాప్తం బగుచున్న విధమును స్త్రీ పునర్వివాహములు, హరిజనోద్ధరణము మొదలగు విషయములు విశదముచేయుచున్నవి.

డిసంబరు మాసాంతమునందు గాంధిమహాత్ము డుపక్రమించిన హరిజనయాత్రాసందర్భములం దాంధ్రావని చూపిన యుత్సాహప్రోత్సాహము లాంధ్రుల సంస్కరణప్రియత్వమును వెల్లడిచేయుచున్నవి. హిందువులు వర్ణభేదములను పాటింపకను హరిజనులలో కలిసి గాంధిమహాత్మున కఖండమైన స్వాగతంబు నొసంగిరి. గాంధిమహాత్మునకు వివిధకులములవారును సమర్పించిన సన్మానపత్రములును, దక్షిణలును, ప్రజలకు మహాత్ముని పట్లగల గాఢభక్తిని వెల్లడిచేసినవి. వర్ణాశ్రమధర్మాభిమానులకు మహాత్ముని హరిజనయాత్ర జ్ఞానోదయమును గలుగజేయకపోయినను జిజ్ఞాస కైనను సాధనమగుట ధర్మము కోట్లజనుల నంటరానివారినిగ నుంచుట మానవప్రయోజనములకై నిరర్థకము మహాత్ముని శాంతము, సహనము, మందహాసము, కార్యపరత్వము నిరుపమానములు. నియతకర్మానుష్ఠానమునకు మహాత్ముని జీవయాత్ర పరమార్థప్రమాణము. మహాత్ముని హరిజనయాత్ర ఆంధ్రదేశమును పవిత్రముచేసి సవర్ణావర్ణులకు ధర్మనిర్వహణావసరమును ధర్మారాధన విధానమును వ్యక్తము చేసినది. అంటరానితనము పోవుటకు గాంధిమహాత్ము డపేక్షించునది పరిశుద్ధహృదయము. గాంధిమహాత్ముడు హరిజనయాత్రయందు జేసిన ధర్మప్రచారమును ఆంధ్రులు సార్థకము చేయుదురుగాత!

ఆంధ్ర విశ్వవిద్యాలయము

ఆంధ్రవిశ్వవిద్యాలయము వైసుచాన్సెలరు శ్రీ రాధాకృష్ణయ్యగారి నాయకత్వముక్రిందను, త్వరితగతి నభివృద్ధిని పొందుచున్నది శ్రీ విక్రమదేవవర్మ మహారాజాగారి యనుగ్రహమునను శాస్త్రకళాభవనముల నిర్మాణము పూర్తియైనది. విశ్వకళాపరిషత్తునందు ఆనర్సు తరగతు లారంభములైనవి. సామాన్యమైన భౌతికరసాయన గణితశాస్త్రములేకాకను సాంకేతిక విద్యలను, వాణిజ్యవిద్యను నేర్పుట కేర్పాటులు చేయబడినవి. కళాపరిషత్తునందు ప్యాసుతరగతులను నేర్పాటు చేయుట ఖండనమునకు మూలమైనను సముచితముగ నున్నది. సుప్రసిద్ధపండితులున్న స్థలములకు విద్యార్థుల నాకర్షించుట విజ్ఞానవ్యాపనోపలబ్ధికి సాధనము. ఆరోగ్యమునందును, శాస్త్రపరిజ్ఞానమునందును ఆంధ్రసాహిత్యమునందును ప్రజల కభిరుచిని గలుగజేయుటకు బహుమానముల నేర్పాటుచేయుటయును శుభసూచకముగ నున్నది. రాయలసీమయందలి కళాశాలల నాంధ్రవిశ్వవిద్యాలయమునందు జేర్చుటకును, విద్యార్థుల కుపవేతనముల నొసంగుటకును జేసిన నిర్ణయము శ్లాఘ్యముగ నున్నది. ఆంధ్రవిశ్వవిద్యాలయమును సాహిత్యాభ్యుదయమునకును, ఆంధ్రుల సంయోగసాహచర్యములకును వినియోగపడుటకు ప్రజలును విశ్వవిద్యాలయ నిర్వాహకులును పని బూనుట పరమావసరము.

రాయల సీమ విద్యార్థులును, ఉపాధ్యాయులును నా ఫలసిద్ధికి పాటుపడి విశ్వవిద్యాలయ ప్రయోజనమును సార్థకము చేయుదురు గాత! శ్రీ రాధాకృష్ణ పండితుని తిరిగి యుపాధ్యక్షులుగ నెన్నుకొని విశ్వకళాపరిషత్తు స్వధర్మనిర్వహణమును జేసి నందుల కభినందనపాత్రము. ప్రజాదేశ క్షేమములకు సాహిత్యముతోపాటు వ్యవసాయపారిశ్రామిక విద్యాభ్యాసము తత్త్వజ్ఞానమువలెను శాస్త్రకళాపరిజ్ఞానమును నవసరములు. ప్రజ్ఞావంతులైన రాధాకృష్ణయ్యగారును, విశ్వవిద్యాలయ నిర్వాహకులును, పండితులును విద్యావిధానమును నవయుగావసరముల కనురూపముగను నిర్ణయించి నిర్వహించుట సమంజసము. విద్యాప్రవృత్తిని దేశభాషాముఖమునను వ్యాపింపజేయవలసిన యవసరమును ఢిల్లియందుగూడిన అంతర్విశ్వవిద్యాలయసభ వ్యక్తము చేసినది. ఆంధ్రవిశ్వవిద్యాలయనిర్వాహకు లీసమస్యను సఫలము చేయుట యవసరము.

ఆంధ్రపత్రిక

ప్రపంచ పంచాంగశ్రవణానంతరము స్వీయపంచాంగశ్రవణము రుచింపకున్నను నియతకార్యము. బొంబయియందు కీలకసంవత్సరమునందు ప్రారంభమైన ఆంధ్రపత్రికకు శ్రీముఖసంవత్సరమునందు ౨౫ ఏండ్లు నిండి శ్రీయుత చల్లా శేషగిరిరావుగారి యాధిపత్యముక్రిందను రజతోత్సవము జరుపబడినది. శేషగిరిరావుగా రాంధ్రపత్రికకు చేసినసేవ యద్వితీయము శేషగిరిరావుగారి శాంతస్వభావము, సౌజన్యము, సౌహార్దము, కార్యపరత్వము, సాహిత్యప్రియత్వము, స్వరాజ్యాభిలాష, సహాయ నిరాకరణపరత్వము ప్రతికానిర్వహణమునకు సకలవిధముల వినియోగపడినవి. ఆంధ్రపత్రికానిర్వహణమే పరమార్థముగను నమ్మి ౧౭ ఏండ్లు పత్రికయందాత్మార్పణము చేసిరి. వర్తమాన క్లిష్టపరిస్థితియందు వారి యకాలమరణము పత్రికానిర్వహణభారమును దురారాధ్యము చేయుచున్నది. శేషగిరిరావుగారి నిరాడంబరసేవకు పత్రికానిర్వాహకులు పరమకృతజ్ఞులు. భావసంవత్సరాదిసంచిక ౨౫వ సంవత్సరాది సంచిక. ఇరువదియైదేండ్లయందు ప్రపంచ వ్యవహారములందు ప్రవర్ధమానంబైన భావరూపపరివర్తనములు భావ సంవత్సరాదిసంచికయందు వ్యక్తము లగుచున్నవి. కీలకప్రాంతములం దారంభమైన స్వదేశస్వభాషోద్యమాంకురములు పల్లవించి ప్రసవించి ఫలించుచున్నవిధమును భావసంచిక

భావసంచిక

యందలి విషయములు మనోగతము చేయుచున్నవి. శ్రీ గురజాడ అప్పారావుగారు ప్రారంభించిన ముత్యాలసరములు దేశమునందంతటను పూలసరములుగ పరిణమించినవి. భావాబ్దసంబోధకములైన భావగీతములును, పద్యములును సాహిత్యరంగమునందు గలిగిన భావపరివర్తనమును భాషాపరివర్తనమును వెల్లడిచేయుచున్నవి. భావసంచిక నలంకరించెడి వ్యాసములు, విమర్శనలు, కథలు ప్రజాసామాన్యమునందు ప్రవర్ధమానంబగుచున్న స్వభాషాభిమానమును వ్యక్తము చేయుచున్నవి. సంచికయందలి ఛాయాచిత్రములు, త్రివర్ణచిత్రములు చిత్రకళారచనలందు ప్రవర్ధమానంబగుచున్న వికాసమును తెలుపుచున్నవి. ముఖపటము గాంధిమహాత్ముని హరిజనోద్ధరణయాత్రకు చిహ్నముగ నున్నది. వేలమంది దర్శనమును జేయుచు హరిజనోద్ధరణమునకు కానుకలను సమర్పించుచున్నారు. హరిజనులు యథార్థముగను హరిజనులుగా గల విధమును శ్రీశంకరస్వాముల కాశీనగర చండాలోదంతమును, నందనారుని చిదంబర క్షేత్ర నటరాజోదంతమును చిత్రమునందు మనోహరముగను చిత్రింపబడినవి. మానవులందు నీచోచ్చదశలు స్వయంకృతాపరాధఫలములు. జన్మవలనను నీచులయినను, కర్మసంస్కారమువలనను తరించుటకు సకల జనులును నధికారులు. ముఖపట మీ పరమార్థమును గంభీరముగను ద్యోతకము చేయుచున్నది. మానవారాధన పరమైన భగవదారాధనమునందు సర్వ మతములును, ధర్మములును, సమన్వయమును పొందగలవిధమును మహాత్ముల ధర్మజీవయాత్రలు సార్థకము చేయుచున్నవి.

బీహారునందు సంప్రాప్తమైన, భయంకరమైన భూకంపార్తులు ధర్మపరాయణులైన ఆంధ్రులసహాయమునకు పాత్రులు. సకలదేశములవారును జాతిమతకులభేదములను పాటింపకను సహాయము చేయుట ప్రశంసనీయము. పెరునుండి పెకింగువరకు గల దేశములవారందరును దుఃఖార్తులకు సహాయమును జేయుచున్నారు. గాంధిమహాత్మ్మ డాపన్నులకు సహాయమును జేయుటకును జేయించుకొనుటకును బీహారునందు సంచారమును జేయుట కుపక్రమించెను ఆంధ్రమహాజనులందరును యధాశక్తిని నాపన్నులకు సహాయముచు జేయప్రార్థితులు.

భూకంప సహాయము

భగవదనుగ్రహామునను ఆంధ్రమహాజనులయాదరణసహాయమునను భావసంవత్సరాదిసంచికను ఉగాదిని ప్రచురింపగలిగినందులకు, ప్రచురణమునకు సహాయభూతులైన సకలజనులకు కృతజ్ఞులము. వ్యాసలేఖకులకును, చిత్రకారులకును, ఇతరవిధములను సహాయమును చేసిన మహాజనులకును ప్రత్యేకవందనములు.

గతసంవత్సరమునందు ప్రపంచావృతమైన ఆర్థిక దుస్థితిని తొలగించుటకు చేసినప్రయత్నములందు ఆర్థిక మహాసభ గణనీయము. ౧౯౩౩ జూను ౧౨ తేదీని లండనునందు ప్రధానమంత్రి అధ్యక్షుతక్రింద ఆర్థికమహాసభ కూడినది. సభకు ౬౬ రాజ్యముల ప్రతినిధులు హాజరైరి. హాజరైన సభ్యులందు ౨౦౦౦ విషయ పరిజ్ఞాతలు చేరియుండిరి. జూలై ౨౭ తేదీని ప్రయోజనము కలుగకుండ ఈసభ ముగిసినది. సభకు ౩౦,౦౦,౦౦౦ వ్యయమై యుండును. సభయందు సమావేశమైన ౬౬ రాజ్యముల ప్రతినిధులును వారివారి లాభములనే కోరునపుడు యెవ్వరిలాభములును సాధ్యములు కాకపోవుటయేగాక ప్రపంచ ఆర్థికలాభములును దుర్లభములు. మాగ్డొనాల్డు రున్సిమన్ చేంబర్లేన్ గార్ల సద్భావములు వారికి సంతృప్తిని కలుగచేసినను ప్రపంచార్థికప్రయోజనమునకు నిరర్థకములైనవి.

ఆర్థికమహాసభ వలె ఆయుధవిసర్జనమహాసభయును గతసంవత్సర వ్యవహారములందు గణనీయము. రెండేండ్లప్రయత్నముల తరువాత ఆయుధవిసర్జనమహాసభ ఈసంవత్సరారంభమునందు నిర్గమించినది. మొదట జపానురాజ్యమును, తదనంతరము జర్మనురాజ్యమును, ఈసభను విడచినపుడు సభాప్రయోజనమే యంతరించినది. జపాను శ్వేతరాజ్యముల నిర్బంధమును నిరాకరించినది. జర్మనీ విజయమును పొందినరాజ్యముల నిర్బంధముల నిరాకరించి స్వయంసహాయమున సంకల్పమును సాధించుటకు నిశ్చయించినది. స్వార్థపరత్వము ధర్మసంస్థాపనకు ఎప్పుడును ప్రయోజనకారి కాజాలదు.

ఆర్థికసభానిర్గమనమును ఆయుధవిసర్జనసభానిర్గమనమును నానాజాతిసమితిని నిరుపయోగము చేసినవి. ౧౯౨౦ సంవత్సరమునందు సంగ్రామానంతరము మహాశయములతో నారంభమైన నానాజాతిసమితి నిర్గమనము శాంతికాములకు విచారము కలుగజేయుచున్నది. నానాజాతిసమితి శ్వేతరాజ్యములప్రయోజనములకును, విజయమును పొందిన రాజ్యముల ప్రయోజనములకును యేర్పడినను సంగ్రామసంతప్తమైన ప్రపంచమునకు శాంతిసంస్థాపనమునందు ఆశకలిగినది. ప్రారంభమునుండియును అమెరికాసంయుక్తరాష్ట్రములు సమితియందు చేరలేదు. బలీయమైన సంయుక్త సోవియటు రష్యారాష్ట్రములును చేరలేదు. గ్రేటుబ్రిటను బ్రిటిషు సామ్రాజ్యాంతర్భాగములను బలవంతముగచేర్చి వోట్లబలమును సంపాదించినది. సైన్యసమరమునకు టారిఫు సమరము తోడ్పడినపుడు నానాజాతిసమితి సభ్యులకు అంతర్జాతీయ సంరంభమువలె సంయోగ సాహాచర్యములు సాధ్యములు కావు. యూరపురాజ్యాంగ చదరంగమునందు జాతీయాభిమానప్రియులైన స్టాలిన్, ముసోలిని, హిట్లర్, డాల్ఫస్, బాల్డ్విన్ గారలు మొదలగు నాయకులు ధర్మబలమునకు బదులు బుద్ధిబలమును వినియోగించినపుడు వివిధసభల ప్రయోజనములు నిరర్థకము లగుచున్నవి.

హిందుస్థానమునందు స్వరాజ్య సంస్థాపనకై పదేండ్లక్రితము గాంధిమహాత్ముని నాయకత్వముక్రింద కాంగ్రెస్ ప్రారంభించిన శాంతిసమరము నిర్బంధములకు పాలైనను యథాప్రకారము సాగుచునేయున్నది ప్రభుత్వము కాంగ్రెసుసమావేశమును ప్రతిషేధించినను ౪౭ వ కాంగ్రెసు మహాసభ కలకత్తానగరమునందు శ్రీమతి నెల్లీసేను గుప్తాగారి యధ్యక్షతక్రింద ఏప్రియల్ ౧ తేదీ సమావేశమైనది. నానాప్రాంతములనుండి ౨౫౦౦ ప్రతినిధులు సమావేశమైరి. రక్షకభటులు సభను నిలిపివేసిరి. కాంగ్రెసు అక్రమసంఘము కాకపోయినను అక్రమోద్యమములకును, అక్రమప్రచారములకును పూను కొనుటవలన కాంగ్రెసుసమావేశము నిషేధింపబడెనని సర్ హారిహైగ్‌గారు తెలిపిరి. పూనాయందు ఆనేగారి అధ్యక్షతక్రింద కూడిన నాయకుల సభయందు సమిష్టిశాసనోల్లంఘనము నిలుపుదల చేయబడినట్లు ఆనేగారు ప్రకటించిరి. కాంగ్రెసుసంఘము లన్నియును ఉపసంహరింపబడినవి. వ్యక్తిశాసనోల్లంఘనము, నియంతల నిర్ణయములను, ఆనేగారు ప్రతిషేధింపలేదు. ఆనేగారి నిర్బంధానంతరము వచ్చిన అధ్యక్షులు సర్దారు శార్దూల్ సింగుగారు నియంతల నిర్ణయమును సైతము ప్రతిషేధించెను. శాసనోల్లంఘన ప్రస్థానము తీవ్రరూపమునను పర్యాప్తము గాకపోయినను అవసరమయినపుడెల్లసాగుచున్నది. పశుబల సమరమునకు ఆద్యంతములు గోచరమయినను శాంతి సమరమునకు ఆద్యంతములు లేక ప్రవర్ధమాన మగుట ప్రకృతిధర్మము.

జాయంటు పార్లమెంటుకమిటి విచారణను ముగించి విషయవిమర్శనమున కుపక్రమించినది. శ్వేతపత్రముపట్ల నిదువుగలిగిన సంశయములె నేడును బాధించుటయే కాకను ద్విగుణీకృతములైనవి. కన్సర్వేటివుపక్షము చర్చిలుగారి నాయకత్వముక్రిందను సంస్కరణములను ప్రతిఘటించుటకు నిర్ణయించినది. ౧. రక్షణములు. ౨. కేంద్రప్రభుత్వబాధ్యత. 3. ఫెడరేషను. ౪. రాష్ట్రీయ స్వపరిపాలనము పర్వతముల నడుమను శ్వేతపత్రవిధానమైనను సాధ్యము కాదని రాజ్యాంగ పరిస్థితులు విశదము చేయుచున్నవి. ఆగాఖానుగారి రాయబారము సఫలమయినది. మహమ్మదీయపక్షము లన్నియును కలిసి సంస్కరణముల నుపయోగించుటకు నిశ్చయించినవి. సర్వీసులు, గవర్నరులు, గవర్నరు జనరలు, స్టేటు సెక్రిటరి, పార్లమెంటు మెట్టుకుపైమెట్టుగను నిర్బంధములను నిర్మించుట సంభవమైనపుడు సంస్కరణము లేవోటను స్వాతంత్ర్యమును గలుగజేయవు. అయినను శాసనసభల యాశాపాశము లిప్పటినుండియును సమ్మోహమును గల్పించుట బ్రిటీషు ప్రభుత్వరాజ్యనీతికి పరమార్థము నియంతల మమకారాహంకారములు సత్త్వమును నిరర్థకము చేయుచుండును. వ్యక్తులు, సంఘములు, జాతులు మమకారాహంకారములకు దాసులై మానవస్వాతంత్ర్య ధర్మాభ్యుదయమును దుస్తరము చేయుదురు. అశోకచక్రవర్తివలెను నియంతలు దండయాత్రలను విడిచి ధర్మయాత్రలను జేయవలసిన యవసరము గలిగినది. దండయాత్రలకు ప్రయత్నములను జేయుచు ధర్మయాత్రఫలము నపేక్షించుట నిరర్థకము.

ప్రపంచపరిస్థితులు సకలరాజ్యములందును సందిగ్ధముగనున్నవి. ఆర్థిక సాంఘికమత రాజకీయరంగములందు సంప్రాప్తమగుచున్న సంరంభమునకు పరమార్థము పరివర్తనము సకలదేశములందును సంప్రాప్తమైన ఆర్థికదుస్థితియందు ప్రథమమున నార్థికసంరక్షణమునకు ప్రయత్నములు జరుగుచున్నవి. వ్యాపార రక్షణము వ్యాపారవికాసమునకు బదులు వ్యాపారక్షయమునకు వినియోగపడుచున్నది. వ్యాపారక్షయము భయభ్రాంతులను గలుగజేయుచు నూతనాధికారము నభిలషించుచున్నది. నూతనాధికారము నిరంకుశాధికార నియంతరూపమును దాల్చుచు నూతనవిధానములను నిర్ణయించుచున్నది. భయంకరమైన పరధర్మము ప్రయోజనకరముగను గనుపడినను నిరర్థక మగుచున్నది. యూరపురాజ్యములందు ప్రజాస్వామిక మంతరించి

నియంత లేర్పడుటకు భయభ్రాంతులు కారణములు కాని విశ్వాసప్రయోజనములు కారణములు కావు. ప్రజలనిరాశయును నిస్సహాయస్థితియును వృద్ధిని జెందిన కొలదియును నియంతల బలాధికారములును వృద్ధిని పొందుచున్నవి. రుష్యాయం దారంభమైన కమ్యూనిస్టు విధాన మితరరాజ్యముల ప్రతిఘటనమునకు గురియైనది. ప్రతిఘటనము వివిధరాజ్యములందును వివిధ భావ రూపములను పరిణమించినది

పాశ్చాత్య సంస్కారమునకు జాతీయాహంకార ప్రయోజనములు పరమార్థములు. జాతీయాహంకారము సైన్యబలమునుండి ధనబలమునకును, ధనబలము నుండి సంఘబలమునకును సంక్రమించినవి సైన్యధనబల ప్రయోగములు దుర్లభములైన క్లిష్టపరిస్థితులందు నాయకుల లక్ష్యము సంఘబలమునందు లగ్నమగుచున్నది. సంఘబలనిర్మాణ నిర్వహణమునందు కార్యసిద్ధికి నియంతల నిర్ణయములు వెంటనే ఫలప్రదములగుచుండును. అమెరికా-సంయుక్తరాష్ట్రములును, బ్రిటీషు ప్రభుత్వమును ధనబలమునను సంఘబలమును నిర్జించుట కుపక్రమించినవి. ముస్సొలీని, హిట్లరుగారులు సంఘబలమునను ధన, సైన్యబలముల నరికట్టుటకు ప్రయత్నించిరి. ధనములేని దేశములందు సంఘబలము నియంతయె యుపయోగించుచు సంక్షోభమును గలుగజేయుచుండును ఈ విషమవృత్తమునం దాద్యంతములు గనుపడకను సంఘమునకును నియంతకును సంరంభము సహజముగను గలుగుచున్నది. సంరంభము బహిర్గతము కాకపోయినను నవసరమైనపుడు ప్రళయాగ్నివలెను ప్రజ్వలించును యూరపురాజ్యములందు నియంతల లక్ష్య మంతయును చిరకాలాభ్యస్తమైన స్వజాతీయాహ్యప్రయోజనారాదనములందు లగ్నమై నిరంతర సంరంభములకు సాధనంబుగ నున్నది. నియంత కమ్యూనిస్టయినను, నాజీయైనను, ఫాసిస్టైనను, కన్సర్వేటివైనను లేబరుపక్షావలంబనుడైనను ప్రయోజనము సమానము. నియంతలశ్రద్ధ వారి సత్త్వానురూపముగను పరిణమించుచు స్వప్రయోజనములకు వినియోగపడుచున్న విధమును నాజి, ఫాసిటు సంఘనిర్మాణములు విశదము చేయుచున్నవి.

గాంధిమహాత్ముని హరిజనధర్మయాత్ర నియంతలకు నియత ధర్మానుష్ఠానము నుపదేశించుటకు వినియోగపడుచున్నది. ధర్మారాధనమునకు ప్రయోజనము ఆర్థికమైనను, రాజకీయమైనను, సాంఘికమైనను లక్ష్యమాత్మగతమైనపుడు సుఖమును బాహ్యగతమైనపుడు దుఃఖమును గలుగజేయుచున్నది. సకలార్థములందును ధర్మారాధన మాత్మగతమగుటకు సత్యారాధనము సాధనముగనున్నది. ధర్మారాధనము స్వరాజ్యమునకైనను, హరిజనోద్ధరణమునకైనను, భూకంప సహాయనిధికైనను సత్యాధారమైనపు డాత్మగతమై సర్వజనామోదమును బడయగలదు. నియంతలు గాంధిమహాత్మునివలె ననాసక్తయోగారూఢులై కర్మయాత్రను, ధర్మయాత్రను జేయునపుడు ప్రపంచయాత్రయందు సకలార్థములును సార్థకములు గాగలవు.

శ్లో॥ సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత, శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధ స్స ఏవ సః

---


Andhra Province.
1. Red British India Andhra.
2 Green „ Utkal-Andhra mixed.
3. „ „ Karnata-Andhra mixed.
4. Yellow Nizam's Andhra.
5 „ Mysore Andhra.
6. Orange C. P Andhra.
CENTRAL PROVINCES
BIHAR & ORISSA
NIZAM'S DOMINIONS
GANJAM
VIZAGAPATAM
EAST GODAVARI
WEST GODAVARI
KISTNA
GUNTUR
NELLORE
CHITTOOR
CUDDAPAH
ANANTAPUR
KURNOOL
BELLARY
MYSORE
CHANDA
BASTER
ADILABAD
NIZAMABAD
KARIMNAGAR
WARANGAL
MEDAK
BIDAR
GULBARGA
ATRAF-I-BALDA
NALGONDA
MAHBUBNAGAR
RAICHUR
NANDER
GONDI
BEZWADA
Khurda
Ganjam
Berhampur
Ichchhapuram
Baruva
Parlakimedi
Naupada
Chicacole
Vizianagaram
Bobbili
Salur
Waltair
Vizagapatam
Tuni
Pithapuram
Cocanada
Rajahmundry
Ellore
Masulipatam
Tenali
Repalle
Guntur
Narasaraopet
Vinukonda
Bapatla
Chirala
Ongole
Kavali
Nellore
Gudur
Venkatagiri
Tada
Madras
Tirupati
Chittoor
Pakala
Vayalpad
Kadiri
Markapur
Cumbum
Giddalur
Nandyal
Kurnool
Adoni
Bellary
Gooty
Guntakal
Tadpatri
Anantapur
Mangapatnam
Cuddapah
Razampeta
Dharmavaram
Hindupur
Chik Ballapur
Devanhalli
Kolar
Hospet
Kottur
Rayadrug
Raichur
Gadwal
Wadi
Hyderabad
Secunderabad
Kazipet
Warangal
Dornakal
Singareni
Medak
Siddipet
Hassanparti
Karimnagar
Lingampet
Nizamabad
Korada
Balkonda
Nirmal
Bhaisa
Adilabad
Chinnur
Sironcha
Sunkam
Chintalnar
Jeypore
Koraput
Navarangpur
Bijapur
Kundli
Komatlapeta
Parvatipuram
76
78
80
82
84
20
18
16
14
ఆంధ్రరాష్ట్రము

# "భావా! స్వాగతమేవా?"




వాణుల్ దగఁ జామరాల్ విసరుచున్ సేవింపఁ జింతామణీ
శ్రీవిభ్రాజిత సింహపీఠమున సుశ్రీ మీఱఁ గూర్చుండి సద్
భావం బొప్పఁగ నెల్లవిష్టపములన్ బాలించు శ్రీదేవి యీ
భావాబ్దంబున నెల్లవారలకు సౌభాగ్యంబుఁ జేకూర్చుతన్.

శ్రీముఖాబ్దమునకుఁ జిన్నితమ్ముండంచు సహృదయుండంచుం బ్రశస్తిఁగన్న
భావసంవత్సరప్రభు వధికారియై లీలఁ గాలమును బాలించుకొఱకు
వచ్చె; నీవర్షాధిపతికి స్వాగతపూర్వకముగఁ జేయుదము సత్కారములను
సంతోషముగ నొక్కసంవత్సరము నిండుదాఁక నీతని పేరు దలఁచుకొనుచు
వర్తనంబుఁ జేయువార లెన్నో మహో
త్సవములకు సదా నిధాన మగుదు
రవలఁ దదనుజుండు యువ రాజుగా వచ్చి
ముదముఁ గూర్చు దేశమునకు శివము

స్వాగతము నీకు భావా!
స్వాగతము త్వదధికృతులకు నందఱకును నీ
స్వాగతము సకలజనులకు
స్వాగత మగు వర్షదేవ! స్వాగతమే వా

పురాణం — సూర్యనారాయణతీర్థులు.





వనితాభావము నిజ
భావముతోఁ గలియ, స్వప్రభావముచేతన్
భావభవుఁ గన్న కరుణా
భావుఁడు భావసమఁ దనస్వభావము నెఱుఁగన్

భావకవీశ్వరప్రతతి భాతిని మెండుగ నొండొకళ్ల సం
భావన చేసికొంచు, నవపద్ధతులం బికపాళి రమ్యశో
భావన వృక్షశాఖలను బాడఁదొడంగె నిగూఢభంగి • నీ
భావసమున్ సమంచితశుభంబుల మాధవుఁ డిచ్చుఁ గావుతన్.

శ్రీవనలక్ష్మీసతీవివాహమున ద్విజావళి పడసె సంభావనలను,
భానుండు పూర్వదిగ్భామావదనమధ్యమునఁ దోఁచెఁ గుంకుమబొట్టుపోల్కి-;
వలపు లూనెను బుష్పవతులైన లతకూన లీతఱిఁ జేతనాచేతనములు;
సంరంభమున భక్తజనులు శ్రీరామలీలామహోత్సవసమారంభు లైరి;
“వచ్చె! వచ్చెఁ గ్రొత్తవత్సరం! బిది మహో
త్సవదినం,” బటంచు జనములు నగ
రముల గ్రామములను, బ్రమదంబు నొందిరి
ముదముల పెనుగాది యిది యుగాది.

కవిభూషణ, సెట్టి - లక్ష్మీనరసింహము,
కవితా సమితి.












# ఆంధ్రౌన్నత్యము

పండిత సత్యనారాయణరాజు

ఆపస్తంబుని భట్టబాణకవివిశ్వామిత్రసంతానమున్
భూపశ్రేష్ఠుఁ బ్రతాపరుద్రనృపతిం బుట్టించె నేయాంధ్రి యా
చూపుంగోపులు గల్గు కాంత యెపుడున్ శుద్ధాత్మయై యాంధ్రులన్
రేపున్ మాపును గాచుఁగాత సుతులం బ్రీతిం బిసాళించుచున్.

వెళ్లఁబోయెద వేల విశ్వేశ్వరునిఁ గాంచి హంపీవిరూపాక్షు నరయరాదె
డంబువీడెద వేల టాజుమహాల్ గాంచి యమరావతీస్తూప మరయరాదె
భ్రాంతిచెందెద వేల వారణాసినిఁగాంచి దక్షవాటికఁ గాంచి తనియరాదె
కళలు పీడెదవేల కాళిఘట్టము గాంచి వైశాఖిపురిఁ గాంచి పరఁగరాదె
గాంగజలములఁ గనుగొని కలఁగెదేల - గౌతమీగంగ కనులారఁ గాంచరాదె
యఖిలసౌభాగ్యములు నీకు నమరియుండఁ - దెలివిమాలెద వేమోయి తెలుఁగుబిడ్డ!

శాతవాహనహేతి సప్తార్చికీలలు దండిగా నేఁటికి మండుచుండఁ
గాకతీయుల భుజాగర్వనర్తకి నేఁడు వాడవాడలయందు నాడుచుండ
వేఁగిదేశాధీశ విస్తారతేజంబు నలుగడ లందింక వెలుఁగుచుండ
తుళువరాట్పౌరుష జలరాశి యిప్పుడు మేరను మీఱుచుఁ బాఱుచుండ
నౌత్తరాహుల దోశ్శక్తి కబ్బురంబు - నందనేటికి నీవింక ముందు కరిగి
నడుము బిగియించి తొల్లిటి కడిఁదిశక్తి-నడరిపెంపొందు మాంధ్రుఁడా,దుడుకువిడిచి.

ఆఱిపోవఁగలేదు యాంధ్రరాజన్యుల పరికింపఁగారాని పౌరుషంబు
మాసిపోవఁగలేదు మనరెడ్డిరాజుల విజయాంకచిహ్నముల్ వేఁగినాటఁ
దొలఁగిపోవఁగలేదు వెలమరాజుల ధాటి యంతఃపురాంగనాస్వాంతములను
గరఁగిపోవఁగలేదు కమ్మరాజుల చేతి కత్తివ్రేటులఁ గాఱు గడ్డనల్ల
సమసిపోలేదు తెలగాల సాహసమ్ము - బ్రాహ్మణప్రతిభ యొకింత పాసిచనదు
ఇన్నిశక్తులు నీలోన నున్నవన్న - నిలిచి పరికించుకోవన్న తెలుఁగుజోద!

అగపర్చు మెందేని నఖిలసంతర్పియా విశ్వదాతను బోలు విమలయశునిఁ
గనుపర్చు మెందేనిఁగాని రాధాకృష్ణునంతటి నిఖిలవేదాంతవిదునిఁ
గాన్పించు మెందేని గాలించి పట్టాభి సాటియా రాజ్యాంగచతురు నితరుఁ
జూపింపు మెందేని శోధించి రామలింగారెడ్డివంటి విజ్ఞానఖనిని
ఔత్తరాహులె ఘనులనియాంధ్రులుత్త - రిత్తమానిసు లని యేల తత్తరింతు
వీరలందఱు నీవారు కారెయోయి - యాంధ్రపుత్రుఁడ, తెలిసికోవయ్య నిజము.

“దక్షిణాఫ్రిక” నేలి దక్షతఁజూపిన రెడ్డినాయఁడు తెల్గుబిడ్డ గాఁడె
యలప్రయాగక్షేత్రమందుఁ బెంపొందెడు చింతామణి తెలుఁగు జెట్టి గాఁడె
యఖిలప్రపంచవిఖ్యాతుండు శ్రీకోడి రామమూర్తి తెలుంగురడ్డి గాఁడె
మధ్యహిందూదేశ మాణిక్యమై వెల్గు రాఘవేంద్రుఁడు తెల్గు ప్రభువు గాఁడె
రామకృష్ణచౌదరి సాంటిరామమూర్తి - దిట్ట వేంకటపతిరాజుఁ దెలుఁగువారు
కారె ? యిట్టియోధులు తెలుంగాణమందుఁ-గలుగ నీ కేమి లోటోయి తెలుఁగుబిడ్డ !

ఆలించినావెందుఁ ద్యాగరాట్కీర్తన లాంధ్రభూమినిఁగాక యన్యభూమి
నాలకించితి వెందు నధ్యాత్మ కీర్తన లాంధ్రభూమినిఁగాక యన్యభూమి
రహివింటి వెచ్చోట రామదాస్కీర్తన లాంధ్రభూమినిఁగాక యన్యభూమి
మొగి వింటి వెవ్వెడ బొబ్బిలిపాటల నాంధ్రభూమినిఁగాక యన్యభూమి
వింటి వెచ్చటఁ బల్నాటివీరచరిత - మాంధ్రభూమినిఁ గాకున్న నన్యభూమి
నాంధ్రపద మెంతమధురమో యాంధ్రతనయ ! - తెలిసికొని, నేఁటి కేనియుఁగులుకవోయి !

భోజరా జెచ్చోటఁ బుట్టలే దందువా ? యాంధ్రభోజునిమాట యరయుమోయి !
రాణాప్రతాపుండు కానరాఁడందువా ? శ్రీరామరాజు విశేష మరయు
ఝాన్సిలక్ష్మీభాయి జనియింప దందువా ? మాంచాలచరితమ్ము నెంచవయ్య
తులసిదా సిచ్చటఁ గలుగలే దందువా ? పోతన్న కత తలపోయవన్న
యెందునుంగూడ లో టింత యేని లేదు - ముందునకు వచ్చి నిలబడి సందడిగను
నీదుశక్తిని నీవెంచి నెగడుమోయి ! - యమలగుణగణవార, యో యాంధ్రవీర

మాడర్న్ రివ్యూలు మనకు లే వందువా ? వెలుగొందుఁగాదె త్రివేణివాణి
మాధురీపత్రిక మనకు లేదందువా భారతిపత్రిక ప్రబలుఁగాదె
కవిసార్వభౌములు గానరా రందువా ? నాఁడును నేఁడునుంగూడఁ గలరు
దైనికపత్రికల్ దనరార వందువా? యాంధ్రస్వరాజ్యాల నరయరాదె
వారపత్రిక లుండె నవ్వారిగాఁగ - దేనఁగూడను గొఱంత యేమేని లేదు
నడుము బిగియించి ముంగలి కడుగువెట్టి-యాంధ్రరాజ్యమ్ము నార్జింపు మాంధ్రయోధ,

సంఘసంస్కర్తలు జనియింప రందువా ? వీరేశలింగముతీరు గనుమ
పరవతి నిలిపెడువారు లేరందువా ? నరసింహదేవర వరుస గనుమ !
జాతీయ నాయకుల్ జన్మింప రందువా ? సర్దారు ప్రభృతుల సరణిఁగనుమ !
జాతీయకవు లిందు జనియింప రందువా ? వేంకటశర్మ వివేకిఁగనుమ !
రైతునాయకులకుఁగూడ బ్రాతిలేదు-రంగనాయకుఁ గనుమ యభంగమతిని !
ఇన్ని సదుపాయములునీకునున్న యపుడె-యాంధ్రరాష్ట్రంబుసాధింపు మాంధ్రయోధ !

చిట్టివడాలను జేర్చినపోపుతోఁ గమ్మనైన పనసకాయకూర
అల్లముకరివేపయాకుతోఁ దాలింపుగా నొప్పు లంకవంకాయకూర

ఘ్రాణేంద్రియంబుతో రసనేంద్రియముఁ దన్పు పనస మామిళ్ళు విఱిచిన పాలకూర
గరమసాలాలతో గమగమవలచెడు వసలేని లే జీడిపప్పుకూర
బజ్జిగుం జూఁచబియ్యము పూఁతచుట్ట - లాదిగాఁగల దివ్యపదార్థవితతి
యాంధ్రులకె కాని మఱియేరికైనఁ గలదె - సేతుశీతాద్రిమధ్య విశేషభూమి.

కాలుసేతులును వంకరలువోవఁగఁజేసి వణఁకించు పెనుచలిబాధ లేక
బండఱాళులఁగూడ మెండుగా బీఁటలు వాఱించు నాతపబాధ లేక
ఏఱు లూళ్ళులుఁగూడ నేకమై ప్రవహించు వఱ్ఱోడుతతవర్షబాధ లేక
బండుగనాఁడైనఁ బట్టెఁడన్నము లేక రొట్టెలే తినియుండు రోఁత లేక
చూచితూచినయట్టుగాఁ దోఁచుచుండు - సీతు నెండయు వానయుఁ బూతమైన
యమలరాజాన్నమును గల్గునాంధ్రభూమిఁ-దలచికొని పొంగుమెటనున్నఁ దెలుఁగుబిడ్డ!

కాశ్మీరదేశంబుఁ గాలఁ దన్నఁగఁజాలు కోనసీమను మదిలోనఁ దలఁచి
ప్రాలేయగిరిమించు వాలాయమును మించు భద్రప్రదము మహేంద్రాద్రి నెంచి
మేరుధరాధరామేయసంపదఁ గేరు జయపురాచలముదౌ హాయలు నెన్ని
రాముని మాతులు రాజధానీపురి దక్షిణకోసల మత్కులఁ గని
గంగఁ గాళింది శారద భంగపఱచి - పాఱు గోదఁ, గృష్ణను,దుంగభద్ర ద్రొక్కి-
నిక్కి-పెంపెక్కి-యెల్లెడ నెగడుమోయి-యాంధ్రుఁడనుపేరు విజయాంక మాచుఁదనర!

---

## ఆంధ్ర ప్రబోధము

తిరుపతి వేంకటకవులు

వందేమాతర మార్యచుంబితపదా మాసేతుశీతాచల
ప్రఖ్యాతాం కమనీయశైలవిపిన స్వాదూదక ప్రాదినీమ్,
నైకస్వాదిమపూరపూరితఫల ఝుర్యాఙ్కుమేతోర్వరాం
నానాభాషితభూషితాం చ విదుషీం వీరప్రసూశేఖరామ్.

అభ్రచుంబితశిరోదభ్రంబులగు పూర్వ పశ్చిమోత్తరగిరి ప్రతతిచేత
మధురనిర్మలపయఃప్రధితంబు లౌచు సంతతముగఁ బ్రవహించు నదులచేత
తరులతాగుల్మకందవనౌషధీనిధానములచేఁ దగు కాననములచేత
సంపూర్ణ సర్వ సస్యప్రశస్యము లైన కమనీయభూమిభాగములచేత
నుప్పతోఁ దొమ్మిదింటి కింకొకప్రదేశ - మునకుఁ బోకుండ సంసారమును భరించి
శూరులును పండితులు నగు సుతులఁ గన్న-తల్లులకుఁ దల్లి భరతమాతకు జయంబు.

చాళుక్యభూపాల సర్వతోముఖరాజ్య పరిపాలనంబున గరిమవడసి
కాకతీయనరేంద్రకలితసింహాసన శాసనంబున సుప్రశస్తి గాంచి
ఆర్వీటివంశజాతోర్వీశ్వర ప్రాభవమున నిస్తులిత వైభవముఁ జెంది
విజయనగరరాజ్య విక్రమసాహచర్యంబుచే విఖ్యాతి నధిగమించి

రెడ్డిరాజులచేతఁగీర్తిని వహించి - వెలమసంస్థానములచేత వినుతికెక్కి-
నేఁటి కాంగ్లేయసామ్రాజ్య పాటవమునఁ-బ్రబలు మన యాంధ్రమాతకు వందనములు.

గోదావరీనదీపాదోదకము ద్రావి ఫలియించు కేదారవపతివలన
కృష్ణానదీ మహోత్కృష్ట నీరప్రయోగముచే ఫలించుభూగరిమ వలన
తుంగభద్రానదీతోయంబు సస్యసంపూర్ణంబు గావించు పుడమివలన
పెన్నాతరంగిణీ సన్నుతామల నీర నీరంధ్ర మగు పంటనేలవలన
మఱియు ఋషికుల్య మొదలైన ఝురులవలన-తనుజులనుకష్టపడిపెంచుకొనుచు నాత్మ
గౌరవముతోడఁ దనసరివారిలోనఁ - దనరు మాయాంధ్రమాతకుఁ బ్రణతిశతము.

రాజరాజనరేంద్రు తేజోవిభూతితో నెయ్యంబుఁ గన్న నన్నయ్యవలన
మనుమసిద్ధినృపాలు మహనీయకీర్తిచే మన్ననం గన్న తిక్కన్నవలన
అనవేమభూపాలు ఘనయశోలక్ష్మికిం బట్టైన శ్రీనాథభట్టువలన

కృష్ణరాయనికీర్తి కిరవులై పేరుచెందిన ఘనుల్ పెద్దనాదికులవలన
మఱియు సోమన పోతన మారనాది - కవులవలనఁ గవిప్రసూఖ్యాతిఁ గాంచి
ఆంధ్రభాషాప్రపంచ మేమఱక నేఁటి - దనుక నిలిపిన యాంధ్రమాతకు జోహారు.

మన భాషతోడనే మనతల్లికి సపర్య విసువులేకుండఁ గావింపవలయు
మన యింటిపెత్తనం బొనరించుచును మన యమ్మయే మనలఁ గాపాడవలయు
మనమండలంబున మనతల్లి వేఱవసింపఁగా గృహముఁ గట్టింపవలయు
మనసహోదరులు సామంజస్యమున నేర్పు చదువులే మనమెల్లఁ జదువవలయు
మనము గావింపఁ దగు ప్రయతనములెల్ల - సులభమగురీతిగా మనసోదరులకు
మాతృభాషనె వార్తఁ బంపంగవలయు - నాంధ్రదేశీయులైన మాయన్నలార!

ఆంగ్లేయ సామ్రాజ్య మధిపతిస్వాతంత్ర్యము నొసంగ మన కిది మొదటిమెట్టు
మనమెల్ల సస్యసంపదమీఱఁ గావించు మనపురోవృద్ధికి మనికిపట్టు
మనభాష కభివృద్ధి ఘనతయు సర్వశాస్త్రపరిపూర్తి వహింప రచ్చపట్టు
మాతృసేవ త్యజించి మనమన్యసేవకై దాఁటిపోనీయని ద్రాళ్లకట్టు
మొనయు సంఘదురాచారములను నెట్టు - రాజభక్తిని గూర్పని రాతిగట్టు
స్వీయగౌరవ మరికట్టు చెంపపెట్టు - మానకుం డాంధ్రజనులార మనలపట్టు.

విభజించియును బ్రజాభిప్రాయమునుబట్టి వంగదేశముగలుపంగలేదె?
కోరినమాత్ర బేహారురాష్ట్రం బది ప్రత్యేకముగఁ జేయఁబడఁగలేదె?
శాసనసభకుఁ బ్రజాప్రతినిధులను నెన్నుకో నధికార మీయలేదె?
అనుమతింపఁగలేదె హైందవం బగు విశ్వవిద్యాలయమ్మంబు స్థాపించుటకును
కోరికలు కోరినంతఁ జేకూరలేదు - మాకటంచుఁ బ్రయత్నముల్ మానరాదు
పట్టుదల మానకుం డాంధ్రభట్టులార! - తెగువఁ జూపింపుఁడీ! తెల్గుదిట్టలార!

కాకినాడ] [8-5-16



నరములకు శాశ్వతబలము కావలెనన్న సదాసర్వకాలము

గుజరాత్ ఫార్మసీవారి

# సువర్ణమిశ్రితజీవన్ను

ఉపయోగించుడు.

యుక్తిని, యోచనను బుద్ధిని అధికపరచి దేహసౌఖ్యమును ప్రసాదించును
అందరు వైద్యులున్ను దీనినే శిఫార్సుచేయుచున్నారు
ఒకసారి నుపయోగించిన దీనియొక్క మేలిమిని తెలియగలరు.

ధర 1 పౌను రు 5/-, ½ పౌను రు 2/8/-, ¼ పౌను రు. 1/5/-

**For Catalogue of Medicines write to**

సోల్ ఏజెంట్లు:—**సీతారాం మెడికల్ స్టోర్సు**

2/177 పైనాబజారురోడ్డు, పాత ఆనందభవనం హోటలువద్ద, మద్రాసు.

*Sub Agents*

1 Bellary C S Shastry Esq
Prop Aryavaidyalaya Brucepet

2. Nellore: K V Naidu & Co,
Chinna Bazaar

3 Narsapur Kakiletty Chinna Tammaya

4 Tirupati Y V Sabbaiah & Co,
General Merchants

N B —Wanted Agents and Stockists in every big Towns For terms write to Sole Agents.

# ROY & CO.,

## Homeopathic Chemists, Druggists and Publishers.

**PRINCESS STREET, BOMBAY No. 2.**

The premier and the leading house for Homeopathic and Biochemic Remedies Founded in 1889 From an humble beginning it has now grown to be an institution of the first rank of its kind in India

REVIEWED IN 10TH ALL INDIA MEDICAL CONFERENCE EXHIBITION GUIDE

*Scle Agents for* - **Boericke & Tafel.**

**(The world renowned Homeopathic Pharmacists & Publishers) PHILADALPHIA U S. A.**

**Their medicines are the best** (Literature supplied on request )



పి. కోదండరామపిళ్లె (లేట్ పి. యస్. పొన్నుస్వామి పిళ్లగారి పుత్రుడు)
౧౮54-వ సం లో స్థాపింపబడినది

పి. పొన్నుస్వామిపిళ్లె బిల్డింగ్సు, మేలైన గృహోపకరణ నిర్మాతలు, సప్లయిదారులు
39, వెస్టు ఎస్ప్లనేడ్, పార్కుటౌను, మదరాస్.

ఎంట్రన్సు హాలు, డైనింగు రూము, లైబ్రరీ, సాఫులు, ఇంక ఆఫీసులకుకావలసిన అన్నివిధముల ఫర్నిచరులు, టేకుసామానులు, నల్లమ్రాను, తెల్లమ్రానులతో అనేక రకములతో ఇత్తడి చట్రములు పొన్నుతో సహా, చక్కగచెక్కి, గట్టిగాను భద్రము గాను చేయబడును

కోరినవారి కేవిధమగు సామానున కైననుసరే కొయ్యపనులకైననుసరే ఎస్టిమేటు యివ్వబడును ఒకసారి మావస్తుప్రదర్శనహాలు చూచినచో మీకు తృప్తి కలుగును దూరపు స్థలమునుండి వచ్చు ఆర్డరుసామానుల కగురైల్వే చార్జీకిగాను వాని కిమ్మతులలో మూడవవంతు సొమ్మునంపినతోడనే శ్రద్ధగా వీ పి చేయబడును

**P. KOTHANDARAMA PILLAI,**
*Cabinet Maker 39 Esplanade MADRAS*



బాటసారి
**(Traveller)**

— A. Krishna Rao.




"ఘనజన్యంబగు నా తుపానుజడి యుగ్రంబౌటచేఁ బద్మినీ
మణి యాత్మేశకరోపగూహన విరామప్రాప్తి గర్హించి యిం
దనుకన్ నేఁడు ప్రశాంతి వాటిల నితాంతామోద భద్రాత్మయై
యినసౌవర్ణకరగ్రహోత్సవము హాయి న్బొందు నబ్జాననా!

కూటికి నోటికి న్నడుమఁ గోటివిఘాతము లన్నరీతి నా
నాఁటనె పెండ్లియానని యసంతమహోత్సవ మొందునంతఁ బో
రాటము వచ్చె నడ్డు ప్రచురంబగు నైధనతారవోలె, నీ
నాఁటికిఁ గాదె యీశుకృప నాపయి నీపయిఁ గల్గెఁ బ్రేయసీ!

కదనము సల్పి వచ్చితి నఖండపరాక్రమలీల నాజిలోఁ
గదిరినగాయము ల్గుదిరెఁగాని రణోర్వికి నన్నుఁ బంపున
య్యదనున నస్మదీయహృదయంబునఁ గల్గిన తావకోగ్రవా
క్ప్రదరవిదారణవ్రణనికాయము మానుటలేదు మానినీ!

అలనాఁ డీ వటులాడుచే మనకు శ్రేయంబయ్యెఁ గాకున్న నేఁ
గలన న్బోరుట కేఁగియుండ నిఁక జోకం బోయినన్ సంగర
స్థలమం దప్రతిమానశౌర్యమున యుద్ధంబు న్బొనర్పం జుమా
లలనా, నీదుప్రబోధనంబె యనిఁ బోరం గల్గెనా నబ్రమే?

రణరంగంబున కేఁగ కిండ్లఁ దగు వీరవ్రాతమున్ సంగరాం
గణము స్థితినిఁ బాసి పౌరజనమున్ ఖడ్గాహతిం జంపె భీ
షణరోషంబున రాయ, లాపగిది నన్ జానీక రక్షించె నీ
గణనాతీతసుబోధనంబు హరిచక్రప్రక్రియన్ గామినీ!

భీరుఁడు వీఁ డటన్న చెడుపేరును నేఁగొనకుండఁగాచి నా,
వారణసీమ సాహసబలాభినివేశము లూని పోరుస
ద్వీరునిఁ జేసినా, విపుడు పెండిలియాడి త్వదీయభర్తగా
మారిచినావు—దేశికుఁ, డమాత్యుఁడుఁ బ్రేయసి నీవ నాకిఁకన్. ”

ఇతి యీరీతినిఁ బల్కఁ బ్రేమలత మేల్వాల్చూపు తేం ట్లమ్మహీ
పతివంశోద్భవు పాదపంకజసుధాపానంబుఁ జాలించి య
ద్భుతహామాడ్కిఁ జకోరపక్షులయి సమ్మోదంబుమైఁ దత్ప్రియ
స్మితచంద్రాతపమున్ గ్రహించెఁ బ్రణయశ్రీమంత్రమూలంబునన్.

“ వలపున్, రాగము, సోయగంబు, సుమనోభావంబు, లేఁబ్రాయమున్
బాలుపారన్ లతకూన పూనికను తత్పున్నాగము న్గూడి ని
స్తులహా నాశ్రయ మొంది తద్ఘనతరుస్ఫూర్జన్మహాగౌరవం
బెలమి న్గోరుచు ద్వంద్వధర్మమును నెంతేఁ జాటు నీక్షించుమా !

అలనాఁ డీవు తురుష్కవేషమున డాయన్వచ్చి న న్జూచి ని
స్తులభీతావహవాక్యము ల్వలికి సంక్షోభంబుఁ జేకూర్చినా,
వలవాచాహతి నిప్పుడు న్వడఁకు మే నాపాదమ స్తంబు నో
చెలికాఁడా, బిగిఁ బట్టుకో ” మ్మనుచుఁ దాఁ జేర్చెన్ బతిన్ గౌఁగిటన్

“ ప్రియుఁడా, నీమదిఁ గల్గుగాయముల వేవేగన్ దగన్ మాన్ప నెం
తయు దక్షంబగు తత్సుధారసము మద్వశ్యౌషధంబౌట నీ
వయయో ! భీతిలనేల ? జాల మిఁకనేలా ?” యంచుఁ దా నిచ్చెఁ ద
త్ప్రియహా నయ్యధరామృతంబుఁ బ్రణయోద్రేకంబు దీపింపఁగన్.

చిత్తరువందు బొమ్మలటు చేష్టల నేది వధూవరుల్ సుధా
మత్తతచేత నొండొరుల మాటికిమాటికిఁ గౌఁగిలించికొం
చత్తుక కొంతసేపు తగి, యాపయి వీడ్వడి, హ్రీ నటించి త
ళ్కొత్తఁగఁ గూరుచుండి రొగి నొక్కరిప్రక్క నికొక్క రంతటన్.

సలలితమంత్రముగ్ధగిరిసర్పముల ట్లలదంపతుల్ నిజ
స్థలములనుండి వల్కక సుధామధురేక్షణరూపభాషణం
బులఁ బ్రణయైకవాదము లమోఘగతి న్బొనరించికొంచు వ
ర్తిలుసమయాన దాసరులు రింగునఁ బాడెడుపాట విన్పడెన్.

నైజగృహాంగణంబున వినంబడు దాసరిపాట విన్న యా
రాజనిభాస్య భర్తఁ గని రాజితవైఖరి రాయచూరుఘో
రాజినిఁ గూర్చి పాడఁగ రయంబున వారలఁ దెమ్ము లోని కే
నోజ వినం గుతూహలము నొందుదు నన్న నతండు నౌననెన్.

జలయంత్రపుత్రికలతోఁ - ఫలపుష్పభరాతినమ్రపాదపములతోఁ
గొలఁకులతోఁ గిలకిలమను - పులుఁగులతోఁ జంద్రకాంతపుం దిన్నెలతో.

చెలువౌ నుద్యానవన - స్థలి నంతట విడిచి నూత్నదంపతులు కళా
విలసద్భవనముఁ జొచ్చిరి - లలిఁగొని విన రాయచూరురణగీతంబున్.

మోములఁ బంగనామములు పూని, గులాబిరుమాళ్లు నెత్తిపై
గోముగఁ జుట్టి, ఖంజరులు గోలలు దట్టి, చితార్లు మీటి యా
ప్రేమలతాగృహాన నొకవేదిక నెక్కొని పాటగాండ్రు సం
గ్రామము గూర్చి యిట్లుచితరాగముమీఱఁగఁ బాడి రంతటన్:



(రణగీతము)

జయజయాంధ్రజన జననీ! దేవీ!-సకలరాష్ట్రరాజ్ఞీ!
జయజయభారత మాతృకుమారీ!-సద్యశోవిహారీ!

*   *   *   *

శ్రీరమ్యంబై, సింగారంబై, శ్రీకారాకృతిమై
సారాహారపదార్థసమృద్ధిస్వర్ధేనూపమమై
విజయనగరసామ్రాజ్యహృదయమై, విపులజలావృతమై
ప్రజాళిపాలితఁ బారిజాతమై, వైరిభీకరంబై
వివిధాయుధముల కగారవరమై, వీరనివాసంబై
యవనీతలాన నమరావతియై, యత్యంతోన్నతమై
హరులకుఁ గరులకు నాయతనంబై, యమరరక్షితంబై
తురకజోదులకు నురికంబంబై, దుర్గమదుర్గంబై
విజయాంధ్రపతాకాలంకృతమై, భేరీధ్వనితంబై
విజయనగరరాజులవశమయి, మును వెలయుచుండె బలమై
రాయలసీమకు రత్నమకుటమై, రమ్యశిల్పయుతమై
రాయచూరుదుర్గంబు చూపరుల కాయతాద్భుతంబై   జయ.

*   *   *

కటకట! కొండొకకాలంబునఁ దురకలవశమయ్యెఁ దదీ
యాద్భుతదుర్గం బాంధ్రుల దురదృష్టాతిశయంబున నాన్.
రాయచూరుఁ గోల్పడినవిజయనగరాధీశ్వరులౌరా!
తమబలంబు, సామ్రాజ్యము, సర్వస్వముఁ గోల్పడినట్లే
సంతతచింతాక్రాంతహృదయులై సరగున నాకోటన్
జయించి క్రమ్మఱ నాంధ్రుల సామ్రాజ్యంబునఁ గలుపంగాఁ
బరిపరివిధప్రయత్నములు సల్పంగఁజొచ్చి రాపైఁ
గాని యాంధ్రులకు స్వాధీనం బది కాకపోయెనకటా!
రాయచూరు గెలిచెదనాశనుగొని రాజువెన్క రాజై
యెంద రీల్గినను దుర్గమమాత్రం బందె నిలిచె నాహా! జయ

* * *

అంతట సాళ్వనృసింహరాజు పట్టాభిషిక్తుఁడై తా
నాంధ్రులసామ్రాజ్యంబున కంతకు నందఱఁ దనిపె నహో!
సాళ్వనృసింహుని బలసాహసదేశాభిమానముల నా
నలువకైన మఱచిలువ కైనను దెలుపఁగఁ దలమా!
గురుతుగ సాళ్వనృసింహరాయ లాకోటమరల నెట్లో
తాను జయింపఁగఁ బ్రతినఁబట్టి యుద్ధంబును సల్పె నహో!
కాని యాతనికి స్వాధీనం బది కాకపోయె నాపైఁ
బ్రాణ ముండునో నాదుర్గంబును బట్టకపోవుదు నా?
యనుచుఁ బ్రయత్నము లహరహంబుఁ దానొనరించుచు మన నా
క్ష్మాతలనాథుని నకాలమరణము కబళించెను కట్టా! జయ

* * *

ఆతనిమృతిచే సమరమహానల మార లేదు వినుఁడీ!
బ్రతికియుండి తా నెంతఁజేసెనో పగమపదించియు నా
క్షితీశుఁ డొనరిచె నంత కెక్కు డాప్రతిన సాగుటకునై;
మరణశయ్యఁ బడి యున్నపుడును దా మఱువకుండెనోహో!
రాయచూరుసంపాదనవిషయం బాయవనీశుఁ డహో!
మరణశాసనము నాతఁడు వ్రాసెను మరణమునకు మున్నే
యన్ని మరణశాసనముల కయ్యది మిన్నగుశాసనమా,
మరణశాసనం బేమని వ్రాసెనొ మనవిఁ జేతు వినుఁడీ!
"ప్రస్తుతాంధ్రసామ్రాజ్యరమాధీశ్వరవరుండ నగుశ్రీ
సాళ్వనృసింహనృపాలవరాళినాఁ జను నే రుగ్ణుఁడనై
యస్మజ్జీవితపరమాశయమై, యాంధ్రస్వప్నంబై
ప్రజ్వరిల్లు తద్రాయచూరు దుర్గావాప్తికి మున్నే
మిత్తివాతఁ బడనుంట నేనెఱిఁగి మేను విడకమున్నే
స్వస్థచిత్తమున, స్వాంతస్ఫూర్తిగ వ్రాయునదేమనఁగా—
"శ్రీయుతులారా! యాంధ్రవిజయలక్ష్మీకుమారులారా!
విజయనగరసింహాసనాసీనవీరవర్యులారా!
రాయచూరుదుర్గం బిల మనసామ్రాజ్యాంతర్గతమై
మనకు వశంబై మలయువరకు మీరనుపమబలధైర్య
స్థైర్యాభినివేశప్రతాపసాహసశౌర్యంబులతోఁ
బోరుసల్పుఁడీ! యాంధ్రమాతృసేవారతి మీ కగునో
విజయనగరసామ్రాజ్యక్షేమాభీష్టాన్వితు లగునో
గతసోదరజీవితసంస్మృత్యంచితమతు లీరగునో
నాంధ్రరక్తమే మీ నాడులలో నంతటఁ బర్విడునో
నాయాత్మ శాంతి నాకావాసావసమున్ గోనఁ గనునో"
నని యాజనపతి మరణశాసనంబందు వ్రాసె నాహా! జయ

* * *

నాటఁగోలె నాకోటకొఱకుఁ బోరాటం బసచుండెన్
రాయలు సింహాసన మెక్కుదనుక మాయురె! పదేపదే!
వాడుచున్న వరిచేనిపైని బడు వానసోనవలెనే
కడలిఁ బడిన జనకాండము గను రక్షకపోతమువలెనే
సేవివారలకు లభించు జాళ్వాపెన్నిధిగిధమునసే
తిమిరములోఁ దిరుగాడువారు గను దీపముతీరునసే
రాయలు రాజ్యము సేయవచ్చెఁ దత్ప్రజలు పొంగిపోవన్.
విజయనగరసామ్రాజ్యము నవనవవిఖ్యాతిని గొనఁగాఁ
గృష్ణుండేయన నేలుచుండె శ్రీకృష్ణదేవుఁ డౌరా! జయ

* * *

ఆంధ్రరాజ్యరమ నాగతి శ్రీరాయలు పాలింపంగాఁ
దురకలకుఁ దను నడిల్‌షాహ యాదుర్గ మేలుచుండెన్
తెనుఁగు కని కా తురకనవాబున కొనరె మైత్రి యెట్లో
యాకతమున రాయలు నవాబుతో ననిఁ దలఁపండోహో!
సంధిగావసను బడె శ్రీకృష్ణదేవరాయలహో!
వెనుకగోయి ముందుననూయి మహీశున కప్పుడయ్యె నయో!
సాళ్వనృసింహనృపాలుమరణశాసనమును గాదనునా?
తనమిత్రుండగు నవాబుతోడుత నని సల్పంజనునా?
పితరులయాజ్ఞకు వ్యతిరేకముగా హితునిఁగూర్చుకొనునా?
హితు ననిలో నోడించి పితరులకు హితవుగూర్పఁ గనునా?
యేమిచేయుటకుఁ దోఁచకయుండె మహీశున కెటులైనన్
గారణంబులే కడిల్‌షాహతోఁ బోరొనరించుటకై
మనసులేక రాయలు సమయంబును గని పెట్టుచు నుండెన్ జయ

* * *

అట్లుండఁగ సయ్యదుమర్కా రను నాప్లేచ్ఛుఁడు చేడ్పై
గుఱ్ఱంబులు గొనుమిషచే ధనమును గొంతఁ దీసికొని శ్రీ
కృష్ణరాయలను మోసగించి తా నేఁగె సరభసముగా
నడిల్‌షాహరాజ్యంబున కతిభీతాంచితచిత్తుండై
రాయలకోపమునుండి తన్నెటులో రక్షింపవేఁడఁగా
"అల్లా" సాక్షిగ నడిల్‌షాహ సయ్యదు గాచెద ననియెన్.
సయ్యదుమర్కా రడిల్‌షాహరాజ్యమున నుంట వినఁగాఁ

గోరె రాయ లా గుడిల్ షాహా నపు డారాటము మీాఱన్
మర్కొరయను దన కప్పగించుమని మాసముదినములలో
నడిల్ షాహా యట్లొనర్పకుండె మతాభిమానయుతుండై
కాఁగలకార్యము నాగంధర్వులు గావించినయట్లే
యుద్ధకారణము గల్గెఁగదా యని యుబ్బి రాయ లాపై
శత్రుతతిని నిశ్శేషంబుగఁ దా జయించుమాహను శ్రీ
రాయ లనంతప్రయత్నంబు లీరణమునకై చేసెన్.　　జయ.

*　　*　　*

మించియుండెఁ బదిలక్షల కలనాయిాతుని సైన్యమహో !
వయసుఁగొన్న ప్రతి పౌరుఁడుఁ దదీయవాహినిలోఁ జేరెన్
రథగజతురగపదాతిసైన్యములు రాయలు విడివిడిగా
విభాగించి సైన్యాధిపులుగ రణశూరుల నుంచెన్
నదమూడెను కొండలపింకులునా నాగము లుండె నహో !
సాంద్రారణ్యసమానముగా రథసమూహ మొప్పెనహో !
కంధితుంగభంగంబులవలెఁ దురగంబు లెసంగె బలే !
నేల యీనిన ట్లుండెను వీరభటాళి చాలభళిరా !
హరులకుఁ గరులకు నరసైన్యంబున కాహారార్థంబై
మార్గమధ్యమున సౌకర్యము లమ్మహీశుఁ డొనరించెన్.
చలువపందిరులు, సత్రంబులు, శస్త్రాగారాదు లహో !
తినుబండారము లుప్పులతో నించినబజారు లెన్నో
నించి మార్గమధ్యంబునఁ గన్నులపండువొచుఁ జనఁగాఁ
దద్వాహిని విడిసిన ప్రతిసీమయు ద్వారావతి యయ్యెన్. జయ.

*　　*　　*

అతిసంరంభముతో వచ్చెడు రాయలనుచుఁ దా నెంతో
జాగరూకుఁడై యడిల్ షాహ తన సైన్యము బలపఱచెన్
రాయచూరుదుర్గమునకుఁ దగినమరామత్తులు చేసెన్
రణకోవిదులగు సైనికులను దుర్గంబున విడియించెన్
బో రొకసంవత్సరమైనను సరిపోవునూహ నెన్నో
యాహారపదార్థంబులు దుర్గమునందుఁ గూర్చి యాపై
దద్దుర్గోపరిశతఘ్నితతి నిడి తద్ద్వారము మూసెన్.
తనదుర్గంబును రాయలసైన్యము దరియరాకమునుపే
త్రోవ నెదుర్కొన నడిల్ షాహ యుద్యుక్తుండై వడిగాఁ
దా నొకసైన్యంబును దీసుక కృష్ణానదిదరి దరియన్
రాయలసైన్యం బంతట నటకు బిరాన వచ్చి చేరెన్
ఒకవాహిని నింకొకవాహిని చలమూని యెదుర్కొనఁగా
సాగరసంగమసీమ నెసంగెడు సంరంభంబౌరా !
ప్రళయకాలభీషణనిర్ఘోషలు ప్రబలఁజొచ్చె వినుఁడీ !
యా సంరంభము నభివర్ణింపఁగ నజుఁ డశక్తుఁ డనఁగా
భూలోకకవీశ్వరుల కద్దానిఁ బొగడ శక్యమగునా ?

కరులను గరులును, హరులనుహరులును, నరులునరుల నాహో !
ఢీకొని, చేకొని, మేకొని, పైకొని, వీఁకను బోరంగా
గడగడగడమని పుడమి వడఁకెఁ బదికడలు వలికె నోహో !
ధైర్యసాహసాభినివేశబలస్థైర్యశౌర్యములతో
నిరువాగులవా రహీనవిధమున దురము సల్పి రంతన్.　జయ

*　　*　　*

అటులు కొంతవడి కాహవాగ్నికీలాతపతప్తులుగాఁ
దురకలధాటికి నిలువలేక యాంధ్రులసైనికు లకటా !
వెన్నుఁజూపి పరువెత్తుట కారంభించిరి సనసనగాఁ
బిల్లికూనలే బెబ్బులులై తగువేళను దనవారా
వీరసింహు లాపిల్లికూనలటు బెదరిచనుటఁ గని శ్రీ
కృష్ణదేవరాయలు సమయస్ఫూర్తిజ్ఞత మెరయంగా
నానాఁ డాహవరంగమువిడువా రాంధ్రులు గారనుచున్
సమరతలము విడిచను ప్రతిసైనికుఁ జంపవలయు నని స్వీ
యాజ్ఞను జాటించెను సైనికు లాహాకారము లూనన్
భళిభళి ! రాయలసమయస్ఫూర్తినిఁ బ్రస్తుతింపఁ దరమే ?
ప్రసనము సేసినఁ బారిపోయినను బ్రాణము లేదుఁగదా !
పిరికిపంద లనిపించుకొన్నపయి మరణించుటకన్నన్
దురమునఁ బోరుచు నరిఖడ్గంబుల కెరయగుటే మేలౌ
జయమొందుటయో, సంగ్రామంబునఁ జచ్చుటయో కాదే
యాంధ్రక్షత్రియధర్మాశయ మీయఖిలాంధ్రావనిలోఁ
బ్రాణంబులపైఁ దీపిచేత నిజరాజద్రోహముపై
దేశద్రోహముఁ దా మొనరించుట నాశహేతు వనుచున్
ఘనగర్జారావము లొనరుచు మేఘవ్రాతంబట్లే
విషాగ్నితీవ్రార్చులు గ్రక్కెడు నహివితాన మనునట్లే
యాఁకలిచే గుహ వెడలి వీఁకఁ జను నలసింగములట్లే
యొరఁ దీసిన పెనుతరవారులవలె నౌరపుమెఱపులట్లే
ద్విగుణీకృతపౌరుషసాహసబలతేజంబులు మెఱయన్
బరుగిడుసైన్యంబంతయుఁ గ్రమ్మరె భండన మొనరింపన్ జయ.

*　　*　　*

బ్రహ్మాండంబులు దలఁక జండతరభండన మంతట నా
తురకజోదులకు నాంధ్రయోధులకు జరిగెఁ దిరుగ భళిరా !
వారిని వీరును వీరిని వారును మారిమసఁగునట్లే
చేరిపోరి వరవీరులఁ జెండుట కారంభింపంగా
క్షణకాలములో రక్తాంభోధిగ సమరతలము మాఱెన్
హరులహేషలునుఁ, గరులఘీంకృతులు, వరవీరస్వరముల్
ఖణేల్ఖణేల్మను ఖడ్గనివహసంఘర్షణశబ్దంబుల్
పతితయోధజనవర్గ వినిర్గత ప్రబలార్తారవముల్
ప్రళయకాలభీషణనిర్ఘోషప్రకార మెసగంగా
మృత్యుదేవి యారణరంగంబున నృత్యమాడె నోహో !

బుసకొట్టెడుపాములవలె జోదులయసులు కసిమసంగంగా
లెక్కకుమిక్కిలి యక్కదనంబునఁ బెక్కురు గ్రుక్కిరహో!
జయ

*  *  *

ఆంధ్రులబల మది యప్రతిహతమై యభివృద్ధినిఁ గొనఁగాఁ
దురకసిపాయిలదోర్బల మంతటఁ దరుగఁజొచ్చె వినుఁడీ!
తమసైన్యం బంతకునంతకు నొగిఁదగ్గుటఁ గనఁగానే
వ్యాఘ్రరాజములముందటఁ భయపడి పాఱు లేళ్లవలెనే
చండభాను తేజంబున కోడుచుఁ జనుచీఁకటులట్లే
ఝంఝామారుతజవమును సైపక జనుమబ్బులవలెనే
యాంధ్రుల యప్రతిహతశౌర్యమున కాఁగలేక భళిరా!
తురుష్కసైన్యము పటాపంచలయి దురము మాని పాఱెన్
దశదిశలం దాంధ్రుల జయవిజయధ్వానంబులు నిండెన్ జయ

*  *  *

సంపూర్ణజయోత్సాహంబునుగొని చనియె రాయ లాపై
రాయచూరుదుర్గంబును బట్టఁగ రౌద్రమూర్తియగుచున్.

"కృష్ణానదిదరి మననవాబు తా నెప్పు డోటువడెనో
యప్పుడే యీదుర్గంబును రాయల దయ్యె నవంజనదే?
యంతటిసైన్యము నతఁ డవలీలగ నంతంబొనర్పఁగా
మనమనఁగా నేపాటివార మమ్మనుజేశున కౌరా!
రాయలతోఁ బోరాటము సేయుట మాయురె మనవశమా!
సాళువంబుతోఁ గోడిపిల్లలకు నాలము మేలగునా?
యందనిద్రాక్షలపండ్లకు నక్కల నాశఁ జాఁచనేలా?
యేటికి సూటిగ నెదురై యెవరే నీఁదుటసాధ్యంబా?
యంబుధి పొంగిపొరలివచ్చెడుతఱి నరికట్టంపరమా?"
యని యాదుర్గమదుర్గరక్షకులు ననిసేయక రేరే!
దుర్గద్వారములు దెఱచి చని చేతులు మోడిచికొని శ్రీ
కృష్ణరాయలకు వశులై ఘోఘురి కృష్ణాజినములు నాన్

కృష్ణానదిదరి నోడినందులకె కింకిరిఁ దాఁబడఁగా
రాయచూరు దుర్గస్థసైనికులు రాయవశంవదులై
పోవుట వినఁగా వివర్ణముఖుఁడై పోయె సర్వ మని తాఁ
దనప్రాణంబుల నడిల్ షాహ రక్షణము సేసికొనఁగాఁ
బ్రథనసీమ విడి పిఱికిపందయై పాఱిపోయె నెటకో. జయ.

*  *  *

కాందిశీకుఁ డాయడిల్ షాహ యను కబురును వినఁగానే
దయామయుండగు కృష్ణరాయభూధవుఁడు శాంతియుతుఁడై
శస్త్రవిసర్జన మొనరిచి హతశేషసైన్యతతి కాహా!
యభయదాన మిడి శత్రుసైన్యమున కాప్తుఁడు తానయ్యెన్.

పౌరులయిండ్లను దోచుకొన్నతనఫౌజు దండించి తా
నెవరిసొత్తు వారల కిప్పించిన యవనిపుఁ డితఁడొకఁడే!
యిట్టిసద్గుణగరిష్ఠుం డిల జనహితుఁ డౌటబ్రంబె?
కృష్ణదేవరాయల యౌదార్యముఁ గీర్తిఁ జెప్పఁ దరమే?
యతఁడు ధర్మరాజావతారమే యను టాశ్చర్యంబె?
యాంధ్రులయదృష్ట మతినిరూపమున నవతరించెఁ గాదే?
శత్రుశిబిరమున లభించె శ్రీకృష్ణరాయులకు వహ్వా!
యనంతధనధాన్యరాసులును గజహయశస్త్రము లెన్నో
హతశేషసైన్యచితతియుఁ బ్రజలును నతనివశులు కాఁగా
సార్వభౌముఁ డవ్వారలఁ గని విస్తారగౌరవముతో. జయ.

*  *  *

సౌమ్యం బగు నాసార్వభౌముఘనచర్యలు వినఁగానే
రాయల నభినందించుచు నవాబు రాయబారం పెన్
రాజీపరతు లవేవో వినుఁడీ! రాజితమతులారా!
తనకు రాయచూరు నొసంగెడునో నెనయం బడఁకువతో
కృష్ణరాయలకు సామంతుఁడుగా నెసఁగుదు ననఁగానే
యడిల్ షాహ తన పాదాక్రాంతుం డైన నట్లకానీ
యనుచు రాయ లాయడిల్ షాహకడ కాచారుఁ బంచెన్.

రాయలపాదాక్రాంతుం డౌటకుఁ బ్రయత్నించెఁ గానీ
యడిల్ షాహ శ్రీకృష్ణుని దరియం జడిసిపోయె నౌరా!
యెంతచెప్పినను బులిచెంతకు నొకయిఱ్ఱిపిల్ల చనునే?
యల్పుఁ డధికు నెడ స్వాభావికభయ మందకుంట కలదే?
తానుగోరినటు లానవాబు పరితప్తమానసుండై
బతిమ లినను రాయ లతనియెడఁ బ్రసన్నుఁ డగునేమో?
కాని నవాబున కతనిదరియ స్మృతి కలుగకుండె నాహా!
ఆకారణమును బురస్కరించుక యాంధ్రవిజయలక్ష్మీ
నాథుండౌ శ్రీకృష్ణరాయభూనాథుఁడు కుపితుండై
నవాబురాజ్యధ్వంసంబును హా నవారిగాఁ జేసెన్
రాయచూరుదుర్గోపరివిజయాంధ్రధ్వజంబు నాటెన్
సాళ్వనృసింహుని యాత్మశాంతికై జలాంజలుల నిడియెన్
తల్లీ! రాజ్యరమా! నీఋణమిదె చెల్లించితి ననియెన్

ఆ నాఁటిజయధ్వానంబును విని యంతకుఁబూర్వమహో!
రాయచూరుదుర్గావాప్తికిఁ దమప్రాణంబుల నేయే
వీరు లొసంగిరొ వారల సూక్ష్మాకారంబులు రోదోం
తరమున నశాంతితోఁ దిరుగాడుట విరమించుచు నపుడే
యాంధ్రరాయలను దీవించి ప్రసన్నాంతరంగులై తా
మూర్ధ్వలోకమున కేగిరి బిరబిర నొదవె కామ్యమనుచున్. జయ.

*  *  *

ఆంధ్రరాజ్యలక్ష్మిసేవను దా నటులొనర్చి భళిరా!
తనవారును శాత్రవు లొక్కపగిదిఁ దన్ను నుతింపంగా
జయవిజయధ్వని సైన్యము సేయఁగ జయదుందుభు లులియన్
మంగళగానము చెంగలింపఁ గవిమండలి భణింపఁగా
నవుగడయున కాయశోనితంబిని హారతు లొసఁగంగా
విజయలక్ష్మి నుద్వాహంమాడి తా వేవెలుంగువలెనే
శ్రీవీరవరప్రతాపబిరుదుఁడు కృష్ణరాయ లోహో!
విజయముచే సార్థకనామకమగు విజయనగరిఁ జేరెన్ జయ

* * *

శత్రువులకు సింహస్వప్నంబై, సచ్చరితాన్వితమై
సకలతురుష్కుల హృదయశల్యమై, శ్లాఘాపాత్రంబై
పేదలపాలిఁటి పెన్నిధానమై, వీర్యోపాదకమై
యాంధ్రకృతజ్ఞత కాలవాలమై, యరుల కంటినలుసై
యాంధ్రచరిత్రాలంకారంబై, యమలయశోన్వితమై
రాయలనామము నెలయుఁగాక శ్రీరామరక్షితంబై
జయ, జయ, జయ, దిగ్విజయీభవ! కృష్ణరాయభూపాలా!
జయజయజయజయ, జయవిజయీభవ! జయాంధ్రజనపాలా!

**జయ, జయాంధ్రజనజననీ! దేవీ! సకలరాష్ట్రరాజ్ఞీ!**
**జయ, జయ, భారతమాతృకుమారీ! సద్యశోవిహారీ!**




ఔరా! శ్రీహరి! బాపురే! కటకటా! యాహాహా! యిస్సీ! బలే!
రేరే! యంచొగి రేవగల్ పగిది నార్తిన్ రక్తిఁ దా మొందుచున్
బోరన్ నిల్చుచుఁ జప్పటుల్ జఱచుచున్ భూషించుచున్ దూరుచున్
బారావారము లట్లు పొంగి విని రాపాటన్ దగన్ దంపతుల్.

పాట ముగించునంతనె సెబాసని దాసరులన్ నుతించి, యీ
పాటను విన్న యాంధ్రజనవర్గము శౌర్యము నొందకుండ దే
నాఁటికి నంచుఁ గానికలు నచ్చఁగ నిచ్చి సగౌరవంబుగాఁ
బాటకులన్ దగం బనిచి ప్రస్తుతి కెక్కిరి నూత్నదంపతుల్.

ఆసదనంబులో నపుడు హాటకపంజరమందు నిల్చి యో
హో సఖి! యోసఖా! యనుచు నొండొరుఁ బిల్చుక కీరదంపతుల్!
భాసిలుచుండ వాని దయవారఁగఁ జేరి వధూవరుల్ సుధా
హాసమెలర్ప నున్బలుకు లాడి యొసంగిరి తేనెతేటలన్.

---

# ౧. సారస్వతము

## తిక్కనద్రౌపదీసౌందర్యవర్ణనము

నండూరి బంగారయ్య

ద్రౌపదీసౌందర్యమును కవిబ్రహ్మ విరాటపర్వములో పోతపోసియున్నాడు. ఇట్టిచిత్రరచనము మన వాఙ్మయమునకేకాదు, ప్రపంచవాఙ్మయమునకెల్ల నపురూపమే. వ్యక్తివర్ణనమందు కవులుచూపు శిల్పనైపుణి ద్వివిధము. రవివర్మచిత్రపటములవలె ఆపాదమస్తకస్థూల రూపవర్ణన మొకవిధము. దీని క్రిందిపద్యము మనోహరమగు నుదాహరణము:

కర్ణావతంసిత కర్ణికారప్రభ
　　గండభాగద్యుతి గడలుకొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో
　　వామభాగానతవదన మొప్ప
అపసవ్యకరమృదులాంగుళీచాతురి
　　షడ్జధ్వనికి మర్మసరణి జూప
డాకాలిమీద నడ్డముసాచునపసవ్య
　　పదనఖద్యుతి భూమి బ్రబ్బికొనగ
పూళిఫించము గంరదామమును మెఱయ
విలసితగ్రావముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వగీతంబు బరగజేసె
చతురనటమూర్తి గోపాలచక్రవర్తి.

ఇది వేణుగాన మొనర్చునప్పటి కృష్ణునిఫోటో! కృష్ణునిముఖము కుడివైపున కెన్నిడిగ్రీలు వంగినదో కూడ చూపినాడా యనునంత 'తుచ' లు తప్పకుండ నాతనిస్థూలవిగ్రహము చిత్రింపబడినది. కాని కొందరు కవు లీపద్ధతి నవలంబింపరు. వారికి ఆత్మతేజమే ప్రధానము. అందుచే నాత్మతేజమును, వ్యక్తిత్వమును పోషింపజాలిన లక్షణములనుమాత్రము వారు చిత్రించి స్థూల విగ్రహవర్ణనమును వెనుకకు ద్రోసివేయుదురు. మహాకవి యగు రవీంద్రనాథ టాగూరు గ్రంథములనుండి భావప్రధాన మగు నిట్టి చిత్రముల కుదాహరణములు పెక్కులు లభించును.

"In the hushed shade of mango grove beyond the city-walls Sudas stood before Lord Budha on whose lips sat the silence of love and whose eyes beamed peace like the morning star of the dew washed autumn."

(Fruit Gathering, XIX)

ఇందు కవి రెండు మూడు పంక్తులలో బుద్ధుని విగ్రహమును చిత్రించినాడు. బుద్ధునివిగ్రహము నాపాదమస్తకము నీతడు వర్ణింపలేదు. కాని బుద్ధుని తేజోమూర్తి యిందు ప్రత్యక్ష మగుచున్నది. బుద్ధభగవాను నెదుట నిలువబడినపుడు మన కాతనియెడల నెట్టి గౌరవ ముదయించునో అట్టిగౌరవము నీవర్ణనమూలమున నుదయించుచున్నది. చిత్రించిన back ground ను బట్టికూడ బుద్ధునిప్రభావము వెల్లడియగుచున్నది. hushed mango grove అనుటవలన బుద్ధుని తేజమునకు మామిడితోపుకూడ వెఱగంది నిశ్శబ్దత వహించిన దని ధ్వనించుచున్నది. ఆపెదవులు మౌనముద్రను ధరించినవట. కాని యీ మౌనముద్ర మాధ్యమువలన జనించినదా? కాదు. అంతరంగము ప్రేమపూర్ణమగుటచే నిండుకుండవలె బుద్ధుడు తొణకకుండ నున్నాడు. ఆకన్నులు శుక్రజ్యోతివలె శాంత తేజమును గుఱియుచున్నవట! మహాకవి ఈతీరున బుద్ధుని ప్రత్యక్షపఱచుచున్నాడు. భాగవతమునందలి కృష్ణవిగ్రహము గ్రాహ్యమయినంత సులభముగ నిది

కీ॥ శే॥ చల్లా శేషగిరిరావుగారు



(ఆంధ్రపత్రికా సంపాదకులు)

# కీ॥ శే॥ ఎ. రంగస్వామయ్యంగారు



(హిందూపత్రికా సంపాదకులు)

# స్వరాజ్యము

అనుభవమైన రాజనీతిశాస్త్రముయొక్క యుద్దేశ్యము స్వదేశీపరిశ్రమలను నిర్మించి వృద్ధిపరచుటయే. అట్టిపరిశ్రమలే యున్నప్పుడు, "స్వదేశీయుత్పత్తుల"ను మాత్రమే కొనుట ప్రతియొకదేశీయుని విధియైయున్నది. మన విద్యావంతులయందు అట్టిసంకల్పము లోపము కాలేదు. "దేశభక్తి" యనుపదము ప్రతిభారతీయుని పెదవుల చివరను గలదు. కాని అన్ని విషయములందువలెనే, యిందును కూడ నోటి పొడిమాటలవలని ప్రయోజనము లేదు. ఆచరణలో పెట్టవలెను. ఇంత యెందులకు? ఒక్క యుదాహరణమును చూడుడు. సబ్బుల దిగుమతులమీద భారతదేశమునుండి విదేశములకు ప్రతిసంవత్సరము రు. 1 66,68,406 లు పోవుచున్నవి. భారతదేశముననే యీపరిశ్రమనభివృద్ధిపరచినయెడల, మనసొమ్మంతయు మన దేశముననే యుండునుగదా.

## బెంగుళూరులో యుండు గవర్నమెంటు సోప్ ఫ్యాక్టరీ

ప్రపంచమునకెల్ల గొప్పవగుసబ్బుల కొన్నింటిని తయారుచేయుచున్నది. ఒక బిళ్ల మైసూరుచందనసబ్బును వాడి పరీక్షింపుడు. మైసూరు శ్రేష్ఠమైన చందనపుమ్రానులకు సుప్రసిద్ధమైనది. మైసూరు చందనసబ్బునందు బ్రిటిష్ఫార్మకోపియా రకపు చందననూనె గ్యారంటీగా కలిసియున్నది. ఇట్టి గ్యారంటీ ప్రపంచములో నెవ్వరును యివ్వరు. మైసూరుచందనసబ్బుయొక్క పరిమళము యింపై, అసమానమై, అద్భుతమై యుండును.

**మైసూరు చందనసబ్బు నుపయోగింపుడు.**

ప్రతిచోటను దొరకును

## మైసూరు గవర్నమెంటు
## సోప్ ఫ్యాక్టరీ,

బెంగుళూరు.

గ్రాహ్యము కాదు. కాని ఈవర్ణనమువలన నెక్కుడు భావౌన్నత్యప్రకటనము,రసప్రచారము సిద్ధించుచున్నవి. ఇది నిశితతరమును, ప్రౌఢతరమును, ధ్వనిప్రధానమును అగు శిల్పము. తిక్కన ద్రౌపదీవర్ణనమున నీ రెండు శిల్పములును సమన్వయమొందినవి. మొదటివర్ణనము లోని విస్పష్టతయు, రెండవ వర్ణనములోని గాంభీర్యమును గూడ నాతడు తన చేతలో నేకీభవింపజేసినాడు. ద్రౌపదిని ఫోటోతీసినట్లుగ ఆమెస్థూలవిగ్రహమును మనయెదుట బెట్టినాడు. కాని అంతటితో నాగక జగన్మోహనమూర్తి యగు నామె యాత్మతేజమునుగూడ మనము కనులార సందర్శించి "ధన్యోస్మి" యను కొనగలుగునట్లు ప్రత్యక్షపఱచియున్నాడు. ఈ సందర్భమున ననుకూలమగు నవకాశమునుసహితము కవి యెట్లు తన కనుకూలముగ మార్చుకొనియున్నాడో గమనింపవలసియున్నది. ద్రౌపదీవివాహమును తిక్కన వ్రాసియుండినయెడల అచ్చట ద్రౌపదీసౌందర్యవర్ణనమును తనయిష్టమువచ్చినంత ప్రౌఢిమముతో కొనసాగించుట కవకాశ మేర్పడియుండును. కాని ప్రచ్ఛన్నవేషమును ధరించి తన "మూర్తియుజ్జ్వలత్వము" ను బ్రకాశింపకుండ జేయవలెనని యామె ప్రయత్నపడుచున్న వేళములో నామెను వర్ణింప సంకల్పించినాడు. కీచకు డామెను జూచి మోహవివశుడగుట కొంత కవికి తోడ్పడినది. కాని కీచకుడు కేవలము నీచుడే! అట్టికష్టాత్ముడు తలపెట్టినపరదారాపహరణమునందు ద్రౌపదీసౌందర్యవర్ణనము నుదాత్త రసోదంచితము గావించుట యెట్లు? ఈ క్లిష్టసమస్యను బూరించుటలో కవిబ్రహ్మ చూపిననేర్పు కొనియాడదగినది. ఆతడు కీచకునకు వైదగ్ధ్యమును బ్రసాదించినాడు. సామాన్యసౌందర్యవతు లాతని కొకపట్టున నచ్చరు. ఆతడుచూచిన చేతులు వందలకు మిగిలి యున్నవి. స్త్రీసంభోగ మొకలలితకళగ నభ్యసించిన మహాపురుషు డాతడు. అందుచే వివిధస్త్రీలసౌందర్యము నందలి తారతమ్యమును, విశేషములను గ్రహింపగల నిపుణుడు. ఇంతయేల? కీచకుడు కవివలె సౌందర్యోపాసకుడు. ఈతీరుగ కీచకునిపాత్రమునకు వ్యక్తిత్వమును గల్పించి విరాటపర్వమున రత్నము లనదగిన పద్యరాజములను కవి కీచకునినోట నుంచినాడు. ద్రౌపదీసౌందర్యవర్ణనమునందు ప్రౌఢిమము జెలకొల్పుటకును, కీచకునకు వ్యక్తిత్వమును స్థాపించుటకును "ఏకక్రియా ద్వ్యర్థకరీ" అనునట్లుగ కవి యొక్కటే సూత్రము నవలంబించినాడు. సృష్టిరహస్యములవలె మహాకవుల కళారహస్యములుగూడ అద్భుతములు! మొత్తముమీద పరికించినచో కవి ద్రౌపదిని బ్రత్యక్షపఱచుటకై ఆయాసందర్భముల ననుసరించి మూడు సూత్రముల నవలంబించినట్లు కానవచ్చుచున్నది. అందు మొదటిది పూర్ణవిగ్రహవర్ణనము,

ఎలదీగ గప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీరేణు వొప్ప
జంపకంబున నవసౌరభం బెసగెడి
కరణి నాసిక వేడిగాడ్పు నిగుడ
దోయజదళముల తుది మంచుదొరగెడు
గతి కన్నుగవ నశ్రుకణము లురుల
నిందుబింబముమీది కందుచందంబున
గురులు నెమ్మోమున నెరసియుండ
సర్వజనవంద్యయైన పాంచాలి సింహ
బలునిచే నివ్విధంబున భంగపాటు
దనకు వచ్చిన నెంతయు దైన్యమొంది

* * * *

సాధారణముగా తెనుగుకవులందరు నీపద్ధతినే యవలంబించిరి కాని తిక్కనపనివానితనములోనున్న సన్నదనము, నాజూకుదనము వారిలో గానరావు. ఇదిగాక, ఒక్కొక్కరేఖచేతనే విగ్రహమునంతను స్ఫురింపజేయు చిత్రకారునివలె పూర్ణవిగ్రహవర్ణనమునకు గడంగక తిక్కన ఒక్కొక్కలక్షణముచేతనే విగ్రహమునంతను ధ్వనింపజేయుచు వచ్చినాడు. ఈ యంశము నొకటిరెండుదాహరణములు విస్పష్టపఱచును. వేషయోజన సందర్భమున ధర్మరాజు,

మనవంశంబున వృత్తం
బును బెంపును గావజాలు పుణ్యసతివి దు
ర్జనులగు తులువల తలపులు
గనుగొని యేమరక మెలగగావలయుజుమీ.

అని ద్రౌపదిని హెచ్చరించినపు డామె "అనాదరమంద
స్మితసుందరవదనారవింద యయి" న దట. ఇక్క డ
'ననాదర' యను నొక్కపదముచేత నే యాత్మవిశ్వాస
మాకారము గైకొనినట్లున్న ద్రౌపది మూర్తియంతయు
మనకు బ్రత్యక్షమగుచున్నది. ఇట్లే,

తనతలచీర యరసికొని య
వ్వనితారత్నంబు వినయ వైభవము సతీ
తనువొందినచందంబున
జనియెం గేకయసుతానుచారికలబడిన్.

అనుపద్యములో "తలచీరయరసికొని" యనుటవలననే యామెవినయవైభవమెల్ల మనకు గరతలామలకమగుచున్నది. ఇదిగాక ఆమెను బ్రత్యేకముగ వర్ణింపకుండ ఆమె చొచ్చినప్రదేశములందును, ఆమెను సందర్శించిన జనులయందును ఎట్టిసంచలనము కలిగినదో దానినిబట్టి యామెను, స్వరూపమును బ్రత్యక్షపఱచుట మూడవ పద్ధతి.

పదతలంబునకెంపు పరగినతలము కుం
కుమలిప్తమైనచందము వహింప
నంగంబు నునుగాంతి యడరినగోడలు
వేదులు మణిమయవిధము నొంద
గనుగవ మెఱుగులు గదిరినముందర
బుష్పోపహారంబు పొలుపుదాల్ప
వేనలికప్పు పర్విన మీదు నీలదు
కూలంబు మేల్కట్టు కొమరువడయ
తానుజొచ్చినకతన మత్స్యక్షితీశు
నింట నిమ్మెయి క్రొత్తయొప్పెసకమెసగ

*   *   *   *   *

ఆమెస్వరూపము సన్నిహితమగుటవలన నచేతన పదార్థములం దిట్టిమార్పు కలిగినది. ఇక చేతనపదార్థములందో? సుదేష్ణ యామెను జూడగనే ఆమెయెవ్వరో, ఏకులముస్త్రీయో తెలిసికొనకుండనే యవశముగ నాసనమునుండి లేచి చేతులు ముందుకు సాచి యామెపట్ల నమ్రతను, గౌరవమును బ్రకటించుటను కవి యీతీరున వర్ణించుచున్నాడు:

కనుగొని గారవంబును మొ
గంబున గేలు బురఃప్రసాదముం
దనువున నమ్రభావమును
దంతమరీచులు సామినిర్గమం
బును దనలో గడల్కొనగ
భూరితరాదరరేఖ నిందుర
మ్మనవుడు నంతనంత ద్రుప
దాత్మజ చేరి వినీతి నిల్చినన్.

సుదేష్ణ ద్రౌపదియెడల నిట్టి గౌరవము జూపిన దనుట కంటె ద్రౌపదీసౌందర్య మామెచే తనకు జోహారు చేయించుకొన్న దనుటయే యుక్తముగా నుండునేమో. ఇక పౌరజను లేమనుకొనుచున్నారు?

ఇయ్యింతిప్రాపున నయ్యనంగుడు పార్వ
తీశునైనను దక్క నేలకున్నె
యిన్నాతిచెలువంబు గన్న శచీప్రియుం
డైనను గనుకలి నవయకున్నె
యిత్తన్వికెనలేమి కెదిరి పన్నిదము భా
షావిభుతోనైన జఱవరాదె
యిత్తలోదరి జీవితేశున కిందిరా
పతినైన మెచ్చక పలుకవలదె
కుసుమబాణుని బాణముల్ గూడ నైదు
గరగి నేరిమి వాటించి కరుపుగట్టి
పోసి చేసి చైతన్యసంపుటము దగ ఘ
టించిరో కాక యిట్టి చేడియలు గలరె!
దీనిజన్మంబున తేజంబునందిన
యింతియు బతియును నెవ్వరొక్కొ!
దీనినామాకృతిగా నోచి పడసిన
యింపగువర్ణంబు లెవ్వియొక్కొ!

(ఎదుటిపుటలో 'ఇయ్యంతి ప్రాపున' పద్యమునకు పూర్వము ఈరెండుపుటలును చదువుకొనవలసినది.)

రోహిణియొండె నొండెను న
రుంధతి కాక మనుష్యజాతియే
యీహరిణాక్షి చెల్వమున
నేడ్తెఱచూడ్కుల నాచికోలగా
దాహితగౌరవం బగు శు
భాంగము దేజము చూడబుద్ధి సం
దేహము బొందుచున్నది స
తీజన మిట్టిదె యెజ్జగంబులన్.

స్త్రీవర్ణనములేని తెనుగుప్రబంధమే లేదు. అందు ప్రతివారికన్నులు కలువరేకులే, ఊరువులు రంభాస్తంభములే, వేణి నల్లత్రాచే, శరీరము కుందనమే. ఇట్లు పుంఖానుపుంఖముగ గానవచ్చు ప్రబంధములయందలి స్త్రీవర్ణనకును, తిక్కనస్త్రీవర్ణనకును ఏమైన తారతమ్యమున్నదా? అను ప్రశ్నమునకు మనము సమాధానమీయ వలసియున్నది. ఆతనిపదివాలితనములో నున్న నైశిత్య మితరులకు లేదని యిదివరకే సూచించియున్నాము. ఇదిగాక ద్రౌపదిసౌందర్యమునం దాతడు మూడు ప్రత్యేకలక్షణముల బ్రతిష్ఠించియున్నాడు. ఇవి తెనుగువారు వర్ణించిన తక్కినస్త్రీలయందు మృగ్యములు.

అందు మొదటిది కాంతిసమృద్ధి. ఇప్పటిచిత్రకారుల చిత్రములలోని పరివేషములు దేవకాంతలను మనుజకాంతలనుండి వేఱుచేయుచున్నట్లే అతిలోకలావణ్యవతియగు ద్రౌపదితేజస్సు ఆమెను తక్కిన తెనుగు ప్రబంధనాయికలనుండి వేఱుపఱచుచున్నది. జనులకనులను మిఱుమిట్లుగొనజేయు సూర్యబింబమువలె వెలుగుచున్న యామె దేహకాంతిని "చూడ్కులనాచికోల" కాక పౌరులు 'వెక్కస' మంది చూచుచున్నారట! పరమనీచమగు కీచకులులాయముసహిత మీకాంతిప్రవాహమున నెట్లు స్నానమాడినది, కవి యీతీరున వర్ణించుచున్నాడు:

పొలతుకకాంతి యింతపొలి
వోవగ నీ కెసల్గార తార ని
శ్చలత గడంగి క్రోలికొన
జాలుట గీచకముఖ్యలోచనం
బులు 'నయనంప్రధాన' మను
పూర్వవచస్థితి దప్పకుండగా
నెలమి వహించె దక్కగల
యింద్రియవర్గము ధిక్కరించుచున్.

తన్వంగి మవ్వంపు తనులత నెసగెడు
నునుగాంతివెల్లువ మునుగబాఱి
గిసలయహస్త కెంగేల నేపారు క్రొ
మ్మించను లేయెండ మిగులబర్వ
గమలాస్య ముద్దుమొగంబు లేమెఱుగుల
మొత్తంబు పరిచుట్టు ముట్టుకొనగ
ధవళాక్షితొంగలి తఱచు ఱెప్పలచెన్ను
కప్పను చీకటి గలియుదేర
దెగ్గలం బంతకంతకు నగ్గలింప
నదవుచెమతతో జిత్తంబు సెదరి యెందు
మెలగ దలపేది యాసింహబలుడనంగ
పట్టియాడెడు జంత్రంబుపగిది నుండె.

ఈ సౌందర్యమునందలి రెండవలక్షణము పవిత్రత. ఇన్ని తెనుగుకావ్యములను జదువుచున్నాము కాని ఎంతటి పవిత్రతను వర్ణించినను సరే, సౌందర్యవర్ణనము వచ్చుసరికి మొగము మొత్తునట్లు దేహసౌష్ఠవమును వర్ణించుటయే కాని, యాదేహకాంతియందు బ్రతిఫలించు నాత్మను ధ్వనిప్రధానముగ జిత్రించి మనస్సును పవిత్రభూమికకు గొనిపోజాలినవా రెందరున్నారు? పరమనీచుడగు కీచకునినోట నుంచబడినను ద్రౌపదీసౌందర్యవర్ణనమును కవి యెంతయందముగ, నెంత పవిత్రభావోద్దీపకముగ జిత్రించుకొనివచ్చినాడు! సాధ్వీమణుల శీలము నందేకాక వారి సౌందర్యమునందుగూడ నొకవిధమగు పవిత్రత వెలుగొందుచు, నపరిచితులకయిన వారియెడల గౌరవప్రపత్తుల నుదయింపజేయును. విరాటనగరమున

నున్న ప్రజలు సైరంధ్రీవేషమున నున్న ద్రౌపదిని జూడగనే

రోహిణియొండ నొండెను న
రుంధతిగాక మనుష్యజాతియే
ఈహరిణాక్షి చెల్వమున
నేత్త్రచూడ్కుల నాచికోలగా
దాహితగౌరవం బగు శు
భాంగము తేజముజూచి బుద్ధిసం
దేహము బొందుచున్నది స
తిజన మిట్టిదె యొజ్జగంబులన్.

అనుకొనిరట' ఈపద్యమునందలి మొదటిపాదమున నరుంధతిప్రసక్తినిబట్టియు,మూడవపాదమునుబట్టియు ద్రౌపది పవిత్రత లెస్సగ ద్యోతమాన మగుచున్నది. అత్యంత కలుషాత్మయగు సుదేష్ణకునయిత మీమెయెడ నెట్టి గౌరవప్రపత్తు లుండెనో వెనుక నుదాహృతమగు "కనుగొనిగౌరవంబును మొగంబును" అనుపద్యమువలన దెలియవచ్చుచున్నది. ఇంతయేల? పరమనీచుడగు కీచకుడు కూడ ఆపవిత్రమూర్తినివర్ణించుపట్ల నశ్లీలోక్తికిగాని, యసభ్యవర్ణనమునకుగాని గడంగక ఆసౌందర్యమును మైలపడనీయకుండ నెంతో జాగరూకతతో గాపాడుచున్నాడు.




ప్రతీక్షణము

—యస్. వి. యస్. రామారావు.

దీనివల్ల భుడనగా నిల సొబగుసొం
పెసగ వర్తిల్లువా డెవ్వడొక్కొ!
దీనివసించుట దా నొప్పి పెంపున
నేపారు మందిరం బెద్దియొక్కొ!

* * * * *

ఇందు మొదటిపద్యములోని తేటగీతిలో నొకవిశేషము గానవచ్చుచున్నది. కుసుమబాణుని బాణములను గరగించిపోసి చేసిరేమో యనుటలో సామాన్యకవి యాగును. కాని యట్లాగినచో నా చిత్రరచనమున నాత్మతేజము లోపించును. అందుచే తిక్కన అంతటితో నాగక 'చైతన్యసంపుటము' దగ ఘటించిరో కాక యనికూడ పలుకుచున్నాడు.

ఇందు రెండవపద్యములో దీని నామమెద్ది, దీని మందిరమెద్ది అనుటకు మారుగా వక్రోక్తులకు గడం గుటవలన సమకూరిన కళానైపుణ్యమును గమనించు నది. మొదటిపద్యములో త్రిమూర్తులను, దేవేంద్రుని మాత్రమే తలపెట్టుచుండుటచే నామెదర్శనమువలన సంభోగవ్యసనపరాయణు డగు నాతని యాత్మయందు కూడ నెట్టి పవిత్రభావములు సంచరించినవో మనకు స్పష్ట మగుచున్నది. రెండవపద్యమున ప్రభారాశి యగు నామెను జూచుటవలన నామెయం దుదయించిన గౌరవముచే 'నీకు నామ మెద్ది?' యని కుఱచగ ప్రశ్నింపలేకుండ నున్నాడు.

అనేకవిశేషములం దీ సన్నివేశమునకు సరి పోల్పదగిన సీతారావణుల సంవాదమునుండి రావణుడు సీతాసౌందర్యమును వర్ణించినవిధమును బరికించితిమేని సీతయందుగూడ నీ కాంతిసమృద్ధిని, పవిత్రతను వాల్మీకి చిత్రించినట్లు మనము జూడగల్గుదుము.

తా ముత్తమాం స్త్రియంలోకే పద్మహీనామివ శ్రియమ్,
విభ్రాజమానాం వపుషా రావణః ప్రశశంసహ.
కా త్వం కాంచనవర్ణాభే, పీతకౌశేయవాసిని,
కమలానాం శుభాం మాలాం పద్మినీవహి బిభ్రతీ.
హ్రీః శ్రీః కీర్తిః శుభా లక్ష్మీ రప్సరా వా శుభాననే,
భూతి ర్వా త్వం వరారోహే, రతిర్వా స్వైరచారిణీ.
సమాః శిఖరిణః స్నిగ్ధాః పాణ్డురా దశనా స్తవ,
విశాలే విమలే నేత్రే రక్తాన్తే కృష్ణతారకే.
విశాలే జఘనం పీన మూరూ కరికరోపమౌ,
ఏతా వుపచితౌ వృత్తౌ సంహతౌ సంప్రవల్గితౌ.
పీనోన్నతముఖౌ కాన్తౌ స్నిగ్ధౌ తాళఫలోపమౌ,
మణిప్రవేకాభరణౌ రుచిరౌ తే పయోధరౌ.
చారుస్మితే, చారుదతి, చారునేత్రే, విలాసిని,
మనో హరసి మే కాన్తే, నదీ కూల మివామ్భసా.

(౧౮-౨౦ సర్గ. ౪౬. అరణ్యకాణ్డ)

ఇందు రావణుని రాక్షసస్వభావమునకు, కామాతురతకు అనుగుణముగ పయోధరవర్ణన మెక్కుడుగ జేయింప బడినను రావణుడుసైతము సీతను పవిత్రస్త్రీలతో బోల్చుటనుబట్టి యామెసౌందర్యమున బవిత్రత వ్యక్తీ కరింపబడినది. "విభ్రాజమానాం వపుషా" అని యిందు సూచింపబడిన యామెశరీరకాంతిని కవి యిట్లు విశ దీకరించుచున్నాడు.

పూర్ణచంద్రాననాం సుభ్రూం చారువృత్తపయోధరామ్,
కుర్వంతీం ప్రభయా దేవీం సర్వా వితిమిరా దిశః.

(సుందరకాణ్డ, సర్గ ౧౫, శ్లో. ౨౮)

ఆమెశరీరప్రభదిక్కులనుండిచీకట్లను తరిమివేయు చున్నదట! సుందరకాండలో వర్ణింపబడిన సమావేశ మును బట్టికూడ పైరెండంశములే ప్రకటమగుచున్నవి.

ఏకవేణీధరా శయ్యా ధ్యానం మలిన మంబరమ్,
అస్థానే ప్యుపవాసశ్చ నైతా న్యౌపయికాని తే.

(సుం. కాం. సర్గ ౨౦, శ్లో. ౮.)

దీనినిబట్టి సీతాదేవిపవిత్రతయు,

త్వాం కృత్వోపరతో మన్యే రూపకర్తా స విశ్వసృట్,
నహి రూపోపమా త్వన్యా తవాస్తి శుభదర్శనే.
య ద్యత్ పశ్యామి తే గాత్రం శీతాంశు సదృశాననే,
తస్మిం స్తస్మిన్ పృథుశ్రోణి చక్షు ర్మమ నిబధ్యతే.

(సుం. కాం. సర్గ. ౨౦. శ్లో. ౧౩,౧౫.

అనుశ్లోకములనుబట్టి యామెరూపాతిశయమును గోచరించుచున్నవి.

కాని సీతాసౌందర్యమునకును ద్రౌపదీసౌందర్యమునకును ఒకగొప్పభేదము గానవచ్చుచున్నది. స్వభావమునందుగాని, సౌందర్యమునందుగాని సీత ద్రౌపదియంతటి గంభీరురాలు కాదు. ఆమెమనస్సులో నున్న భావ మేదోముఖమున గోచరింపవలసినదే. అట్లే ఆమెసౌందర్యముకూడ ప్రౌఢకవులకావ్యమువలె ధ్వని ప్రధానము కాదు. కాని తరచినకొలది ద్రౌపది సౌందర్యమునకు నూత్నవైదగ్ధ్య మేర్పడుచుండును. ఆమెసౌందర్యమునందు కవిబ్రహ్మ ప్రతిష్ఠించిన ఛాయాభేదములు, భావగాంభీర్యము నిరుపమానములు. దానిని బట్టి తిక్కనచేసిన సౌందర్యతత్త్వమథనము లోకోత్తరమని మనకు స్పష్టపడుచున్నది.

గండుమీలకు బుట్టి కాముబాణములలో
గలసియాడెడునట్టి కన్నుగవయు
బిసకాండములశిక్ష బెళికి లేదీగల
మెచ్చకయున్నట్టి మృదుకరములు
చివురులతో సంధి సేసి యంబుజముల
పై నెత్తి చనునట్టి పదతలములు
గలకంఠములయొద్ద గఱచిన విద్య వీ
ణల కిచ్చునట్టి తిన్ననియెలుంగు
నత్తెఱంగున రేఖయు నవ్విధంబు
గఱువచందంబు నమ్మెయి కలికితనము
నట్టిచెన్నును సైరంధ్రియందకాక
కలవె యొరులకు నెఱుగక పలికితబల!

వామాక్షి రుచిరలావణ్యంబు భావించు
దన్వంగిరూపు చిత్తమున నిలుపు
గంబుకంధర చెన్నుకైవడి దలపోయు
నంగనసౌకుమార్యము దలంచు
భామిని సహజవిభ్రమ మెద గీలించు
బడతిచెయ్వులు మది బట్టికొలుపు
మానిని గరువంపుమాటపొం దూహించు
దళితాబ్జముఖితిన్నదనము మెచ్చు.

* * * * *

ఈ పద్యములను బట్టి ద్రౌపదీసౌందర్య చిత్రలేఖన మెంత భావప్రధానమైనదియు విస్పష్ట మగుచున్నది. క్రింద గీటుగీచిన మాటలనుబట్టి ద్రౌపదీసౌందర్యమున నెన్ని విశేషములు ప్రదర్శింపబడినదియు తెల్లమగుచున్నది. విషయమునుబట్టి మాత్రమేకాక విధానమునుబట్టికూడ తిక్కనకు వాల్మీకికి తారతమ్య మేర్పడుచున్నది. "నీ కన్నులు విశాలములు. నీదంతములు శుభ్రములు, శితాగ్రములు" అని సూటిగ వాల్మీకి సీతను వర్ణింపజేసినాడు. కాని కీచకుడో, వక్రోక్తులకు గడంగినాడు. "దీనిపేరెద్ది?" అనుటకును, "దీనినామాకృతిగా నోచి పడసిన యింపగు వర్ణంబు లెవ్వియొక్కొ" అనుటకును గలతారతమ్యము రసజ్ఞు లూహించుకొందురుగాక! కీచకుడు చేసిన వర్ణనమందు నాజూకుదనము, నగిషీపని యెక్కుడుగ నున్నది. ద్రౌపదీసందర్శనమువలన కీచకుడు కాముకు డగుటయే కాక తాత్కాలికముగ కవికూడ నైనాడు. అందుచే నాతనివాక్యములలో రసప్రచార మెక్కువగ నున్నది. వక్రోక్తి పేరు చెప్పి ప్రబంధకవులవలె నస్వాభావికవర్ణనలకు గడంగకుండ, అట్లని సూటితనము,పేరుచెప్పి నీరసముగ వ్రాయకుండ గావ్యరసమనిన నేమో సరిగా గ్రహించిన కవిత్వతత్త్వవేత్త తెనుగులో నొక తిక్కనయే కానవచ్చుచున్నాడు. ఉజంతాశిల్పములకైనను శైథిల్యమున్నది కాని వాఙ్మయమైన తిక్కనద్రౌపదీచిత్రమునకు శైథిల్యము లేదు. అజరామరంబైన యాదివ్యసుందరమూర్తి ననుగ్రహించి యాత డాంధ్రులను శాశ్వతముగా ఋణగ్రస్తులను జేసివైచినాడు.

# తెనుఁగు శైలి

కవి ' కవికొండల వేంకటరావు

పురాణములనుండి —

### నన్నయ

జగంబులు పుట్టింపను మనుపను సమయింపను గర్తలైన దేవతలకు నెట్లు నడచిన నెగ్గులేదు. నేను గర్మ భూమిని జనియించి కర్మరుండ నైతి.

### తిక్కన

ఈరెండుదెఱంగులవారును బంచి కుడిచి సుఖంబున్న నఖిలభూప్రజకును బ్రమోదం బగుంగావున నట్లు సేసి యందఱచేత దీవనలు వడయవయ్య.

### ఎఱ్ఱాప్రగడ

నీ గౌరవంబంతయు నెఱింగికాదె వహ్నిసమానుండైన యీమహాముని నారాధించుటకు నీయందు భారం బెక్కించెద.

ప్రబంధములనుండి —

### మనుచరిత్ర

అనిన నత్తెఱవ యక్కఱకరిపలుకుల కులికి గఱిగఱిం గఱవ గరకరిం జెఱకువిలుకాడు పరగించు విరిదమ్మిగొంకతలు.

### పారిజాతాపహరణము

ఇవ్విధంబున నభీష్టఫలసిద్ధిసంతోషితస్వాంతులును, నిఖిలలోకైకసంస్తూయమానమహామహిమోదాత్తులు నై నిరంతరసౌఖ్యవర్ధిష్ణులగు నాసత్యాకృష్ణులను జూచువేడుకం బ్రమ్మఱునొక్కనాఁడు.

### శృంగారనైషధము

ఇట్లంతర్హితుండై రాజమార్గంబున నిరర్గళవేగంబునం జని యారాజకుంజరుండు మదకుంజరఘటాసుందరంబగు రాజమందిరంబు డాసి.

### విజయవిలాసము

ముముక్షుజనహృదయంగమంబగు త్రివేణీసంగమంబున దానంబులుం దానంబులు గావించి, యచ్చట మాధవు నారాధించి, భవరసానుభవభీరుసానుక్రోశంబగు పంచక్రోశంబు బ్రవేశించి.

### ప్రభావతీప్రద్యుమ్నము

దానవేంద్రా, నీపలికినట్ల మన మిరుదెగలవారము గశ్యపుసంతానం బగుటంజేసి మనయెల్లవివాదంబులు నతండ తీర్ప నర్హుండు.

పదములు, కీర్తనములు, కథలునుండి —

### రామదాసు చరిత్ర

ఓభద్రాద్రీశ్వరా! నేను పూర్వజన్మంబున జేసిన కర్మశేషమో, లేక మీకరుణకు పాత్రుండను గాననియో, యీదుర్మదులచే గొట్టించుటకు మనస్సుగలిగియో యివ్విధంబుగా నన్నుఁ జేయించుట తగునా యని స్తుతి చేయుచున్నాను.

### మైరావణచరిత్ర

ఓతల్లి, అనేకకోట్లరాక్షసులు యుద్ధముగోరివచ్చుచున్నారు. వారల నందరిని నీకు బలియివ్వబోవుచున్నాను. యీరామసౌమిత్రులను. . . .

### భారతసావిత్రి

విష్ణుభక్తిలేనివాడు శూద్రుం డనబరగు. నాయెడ భక్తిగలిగిన చండాలునైన నవమానించుట బుద్ధిమంతులకు నుచితంబు గాదు.

### సర్వాయిపాపడుకథ

పన్నెండుమంది నేస్తులాతో శకునమెల్లి వస్తువుంటె చాకల లొక్కయెల్లయైన చిక్కుతీసి కొప్పబెట్టి శ్రీగంధపుచుక్కబెట్టి హంసలామొగ్గాలరవికెరీకు

మీద తొడిగినాది. కండ్లకు కాటికవేసీ పండ్లకు దాసీనా వేసి బోర్ మెట్ల వేసుకోని బొమ్మంచు చీరె గట్టి పిల్లవాణ్ణి చంకపెట్టి కూటిబుట్ట యెత్తుకోని యెదురుగుండ తాను వొచ్చి పెళ్లుపెళ్లున తుమ్ముతు న్నాదీ ఆ యెల్లమ్మ.

నేటియొకనాటకము

తరువాత నోప్రభూ, మున్నుమూర్ఛిల్లిన ముని బాలుండు నిద్దురనుండి లేచినట్లు లేవ నాసోదరులిద్దఱు నితాంతసంతోషక్రాంతస్వాంతులై.

నేటియొకనవల

ఆనలువురు నానూతనపురుషునితో లోన ప్రవేశించి మందిరద్వారంబులను మూసివైచిరి. లోన నేమి జరుగునో వినుట కామెకు కుతూహల ముదయించెను.

నేటి మఱికొన్ని విధముల రచనలనుండి :—

లండనుపన్యాసములు

వేశ్వేరుసంఘముల ప్రతినిధులతో సంప్రతించి అందరికిని సమ్మత మగునట్లుగా సాంఘికసమస్యను పరిష్కరించు ఏర్పాటేదియు చేయలేకపోతినని ప్రకటించుట కెంతోవిచారమును చిన్నదనమును కలుగుచున్నది.

పల్లెటూరికథలు

కరణం సంకురాత్రిపండుగకు అల్లుణ్ణి తీసుకు రావడానికి వెళ్లాడు. పడవదగ్గిరకు రాలేదనేకోపంతో అల్లుడు పండగకు రానన్నాడు.

చిత్రాంగి

కాని మీరు పోడుంకాయతోటే సహజంగా పుట్టార్టగా ?

ఏమమ్మా, మీ మామగారు వొచ్చారు. అందర్నీ యింట్లోకి రమ్మంటున్నారు. మాకు రాణీవి కాబోతున్నావు. ఇదేం వేషం, ఆయనముందే ?

నలభీమపాకశాస్త్రము

అయిదు శేర్లనీళ్లు పట్టే కళాయిపాత్రలో నాలుగు శేర్ల మంచినీళ్లు పోసి పొయ్యిమీద కాచవలెను.

నేటిపత్రికలనుండి.—

ఆంధ్రభూమి

బైబిలునందు ఒకకథ కలదు. ఇసుకమీద నొకటియు, రాతిమీద నొకటియు రెండుఇండ్లు కట్టబడినవి.

గృహలక్ష్మి

దేశారాధకుల 'మనుకొనుచున్నవారు' లెస్సగ యోచించి యీమహాతరుణమందు దేశాభ్యుదయము అట్టి యమాయికుల యోగక్షేమములపై నాధారపడి యుండు ననుసత్యము.

ఆంధ్రపత్రిక

వాయువిమానములనుండి బాంబులను విసరు పద్ధతి హిందూదేశమునందే గాక ఇంగ్లండులోగూడ ఏహ్యత గలిగించె ననుటకు సందియము లేదు.

కృష్ణాపత్రిక

బర్మావిభజనమున కన్నియు అమారగుచున్నవి. బర్మాప్రజలు విభజనమున కంగీకరింతురో లేదో తెలియకపూర్వమే.

వాహకనుండి —

రైతుమాటలు

ఎందుకండి ఈవానలు. బుడంక్రలు కోసుకునే వాళ్లకి నష్టం. కొన్నికట్టేతమీదుంటాయి. కొన్ని కోతకు సిద్ధంగా వుంటాయి. ఉడుపుచేలకు కొంచెం నయమనుకోండి. తాటాకు తెగులుపట్టిం దంటారు. దాని క్కాస్తమెఱుగు. కందిచేలు ఊఁటెక్కిచస్తాయి.

ఒక ఇల్లాలుమాటలు

చంటిపిల్లల పోట్లాటలు. ఎందుకంటాం మనం - అవసరంమాలినపుల్లలకు అగ్గిపెట్లగుల్లలకు. అవిమెంతో పనిముట్లు అవివాళ్లకు.

ఒకకూలివానిమాటలు

పొద్దున్నే అబద్ధమాడుకుంటే నా కేం వస్తుంది ? పనిచేసేవోణ్ణి నే నబద్ధమాడుకుంటానా ?

ఈప్రకారముగ యాథాలాపముగఁ జదివినపుస్తకమునుండి, చూచినపత్రికనుండి, విన్నమనిషినుండి

మనము భాషను సేకరించి గమనించి చూచితిమా, ఎంత మంది తెనుఁగుభాషను వ్రాయుచున్నారో, ఎంతమంది వాడుచున్నారో అన్నివిధముల తెనుఁగున్నట్టగపించు.- తెనుఁగుజాతికిఁ జెందినవా రెవరోయి యన్న 'నేను నేను' అని కొన్ని కోట్లమంది మాఱువలుకునట్టు.

కాని తెనుఁగుజాతినిగుఱించి తెలిసికొనవలయు నన్న మూఁడుకోట్లమంది తెనుఁగువారిని వరుసగ నిలువఁ బెట్టి వారిముఖవర్చస్సు గమనించుచున్నామా? గమ నింపఁగలమా? తెనుఁగుజాతియని యనుకొనుటలో నేవో కొన్నిలక్షణములు హృదయావలంబనము గొను చున్నవి. ఆలక్షణము లున్నజనుల నందఱిని తెనుఁగు వారినిగ గుర్తించుచున్నాము. ఆలాగుననే తెనుఁగు శైలినిగుఱించి తెలిసికొనుటలన్నను. మనకు తెనుఁగువా రందఱును మాటలాడు, వ్రాయు సమస్తమును సేక రించి విమర్శించుటలు సాధ్యమా! ఒక్కనాఁటికిఁ గాదు. కాని తెనుఁగుశైలి యని యనుకొనుటలో మన కేదో యొకవిధమగు మాటలపొందిక, ఏప, నడక, నాలుకపైఁ దాండవించుచుండును. నిజముగ నాయుద్దేశ్యమం దది నిర్వచింపఁబడనేరనిది, అనుభవించవలసినది. 'పంచ దార తీపి' యనియన్న, పంచదార తినుటలో మనకుఁ దట్టు తీయందనమనికదా యర్థము. అట్లే తెనుఁగుశైలి యన్నఁ దెనుఁగును వాడుటలోఁ దట్టు నొకానొక యొయ్యారపు టుచ్చారణ. కావున నాయీవ్యాసము యొక్క యభిప్రాయమును బూర్తిగ నెఱుఁగవలతురేని తెనుఁగున మాటలాడుచు నందలియుచ్చరించు పొందిక యిట్టిదని స్మరణకుఁ దెచ్చుకొన్నఁగాని బోధపడదు.

తెనుఁగునకును సంస్కృతమునకును నవినాభావ మున్నది. తెనుఁగునకుఁ దురకమునకుఁ, దెనుఁగునకు నాంగ్లేయమునకు సంపర్క మున్నది. తెనుఁగునకు నరవమునకుఁ గన్నడమునకు మైత్రి యున్నది. తెనుఁగు బంగాళీ, తెనుఁగుహిందీ, తెనుఁగుమరాటీ,—యివి యన్యోన్యపరిచయము లేనివి కావు. కాఁబట్టి కేవలము తెనుఁగుదృష్టి యలవరచుకొనవలెనన్నఁ, దెనుఁగుశైలి కనిపెట్టవలెనన్న మనము ఎట్టిదృక్పథమున నిలువ వలెను? సంస్కృతసంబంధములేని, తురకము, ఆంగ్లే యము, కన్నడము, అరవము, మరాటీ, హిందీ, బం గాళము—వీనిసంపర్కము లేని యొకానొకనైజపుఁ బోకడఁ బోవుదానిని గ్రహించుకొనవలసియుండును. అదెట్లని పెక్కుమందికి సంశయము వొడమవచ్చును.

ఒకయావుపాలును మఱియొక యావుపాలును గలసిపోయినట్లు కలసిపోయినవే తెనుఁగుసంస్కృత ములు, వానిని విడఁదీయుటెట్లు? పంచదార కాఫీ కషా యము పాలు కలసిపోయినట్లు కలసిపోయినవే తెనుఁగు తురకము ఆంగ్లేయము. వీని నొకదానినుండి యొకదానిని విడఁదీయుటెట్లు? అని యీవిధముగ నందఱు కన్నిసర్గపుఁ దెనుఁగుదెలిసికొనుట యసాధ్యముగఁ బొడగట్టవచ్చును.

అయినప్పటికిని నిదానించి చూడవలతును. మనము హఝాణభాషను మాటలాడుచు నడుమనిట్టె తెనుఁగునకు దిగుచుందుము. చటక్కన వలవైచిపట్టు కొన్నట్టా తెనుఁగుముక్కలను నాల్గింటిని గొనుఁడు. బజారులందు గుద్దులాటల, సరాగాల, ఇండ్లకబుర్ల, పొలాలమీఁదఁబడాల, దెనుఁగునుడికారము సమయో చితముగ బయల్వెడలునప్పుడు హృదయ మాంధ్రోద్దీపి తమై "ఇదితెనుఁ" గనిపించును. అది మీమనంబుల కెక్కించుకొనుఁడు. దాని నాధారభూతముగఁ జేసికొని తెనుఁగుశైలి యేమొకో యని యోజించుఁడు. అది నా మనవి.

అట్లు విమర్శించునప్పుడు ముఖ్యముగ నాకు గోచరించున దిది—"మన కింకను దెనుఁగుభాష యున్నది. అది పోలేదు. అది యప్పటప్పట బయల్వెడలి భావమును బ్రకటించుచున్నది." అని. "ఎల్లప్పు డట్లనే మాటలాడి యట్లనే భావమును బ్రకటింపఁగల వార మైతిమా!" అనికూడ నూహపోవుటయును గద్దు. భూమి నేప్రకారముగ నిరంతర మాంధ్రభూమిగ నుండఁ దలపోసికొనుచున్నారమో మన నాలుకకూడ నిరంతరము తెనుఁగునాలుకగ నుండవాంఛింతు,

కాని యొకప్పు డాంధ్రరాష్ట్రమనుకొను భాగము ఉత్కళరాష్ట్రమునఁ గలసిపోయినదో నది యాంధ్రరాష్ట్ర మెట్లు కాదో, యొకప్పు డంతయును దెనుఁగై యున్న మనయీనాలుక యాంగ్లేయమును బరించి, సంస్కృతమును నేర్చి, హిందీగఱచి, తెనుఁగుచవికి వెలియగుచున్నా మంతోయింతో. అయినప్పటి కుత్కలరాష్ట్రమన్నంత, తెనుఁగుమనిషిని గుర్తించుట మాని నామా? అట్లే ఎన్నెన్నిభాషలఁ గలగలపైనను 'ఇట తెనుఁగుశైలి కలదు' అని స్ఫురింపక మానదు. అది నిర్వక్రముగఁ జూఱఁగొనవలెనన్న నొకటే సాధనము. తెనుఁగువారిని జూచుచు, తెనుఁగుదేశమం దభిమానము వహించుచు, తెనుఁగువచ్చినవారితోఁ బదేపదే తెనుఁగున మాటలాడుచు, తెనుఁగుపుస్తకములను విరివిగఁ బరించుచు, వల్లించుచు, 'తెనుఁగు తెనుఁగు తెనుఁగు' అని దానిని శ్రద్ధాభక్తులతోఁ బ్రత్యక్ష మొనరించుకొందుమేని తెనుఁగుశైలి యూరక కర్ణపుటంబుల నినదించు.

అప్పుడు మీరు మఱచిపోదురు నారికేళపాకము, ద్రాక్షాపాకము, కదళీపాకము అనుమాటలు, గ్రామ్య గ్రాంధికవిభజనములు. అప్పుడు మీకుఁ దట్టఁగలవు తెనుఁగువారి పురాణశైలి, తెనుఁగువారి ప్రబంధశైలి, తెనుఁగువారి గేయశైలి యనునవి.

నారికేళపాకమన్న నదియొక తెనుఁగునుడికారము యొక్క పొందికను సూచించుమాట కాదు. అది తెనుఁగుపదములు తక్కువపెట్టి, సంస్కృతసమాసముల నెక్కువ జొనిపి తెనుఁగువారి కర్థముగాకుండ వ్రాసిన పుస్తకములయొక్క గుణసంకీర్తనసందర్భమున వెలువడినపదము. అట్లనే ద్రాక్షాపాక కదళీపాకశబ్దములును. ఆపదములు తెనుఁగువారు పుస్తకములు వ్రాయుటలోఁ గాని, తెనుఁగునిజగమనము సూచించుటలోఁగాని యుపకరించవు. సంస్కృతము బాగుగవచ్చిన తెనుఁగు వానికి నారికేళపాకగ్రంథము లేతగుంజునే యిచ్చి దిగమ్రింగుట కనువుపడును. సంస్కృతమురాక యాంగ్లేయ మెక్కుడువచ్చినవానికిఁ 'గురిడీ' కావచ్చును. భాషాజ్ఞానమునుబట్టి యొకానొకగ్రంథము సులభముగ నర్థమగుట, కాకపోవుట యనునది తెనుఁగుశైలిని నిర్వచింపనేరదు.

శైలియన మాటలపొందిక, వాక్యములకూర్పు ఒకమానవుఁ డొకమానవునికి తనభావమును ఊతముగ వెల్లడించుట. తెనుఁగుశైలియన్న తెనుఁగుమాటల పొందిక, తెనుఁగుకూర్పు, తెనుఁగుఊతము. పురాణపఠనమందుఁ దెనుఁగువారి మాటలపొందిక, ఏస, నడక వేఱు, ప్రబంధపక్కి వేఱు, పదములు పాటలు విన్నప్పుడు వేఱు.

ఎంతటిమార్పు చెందినను నాయామాటలు తెనుఁగువారిచే నిరంతర మాయాసందర్భములందు వాడఁబడుచు "ఇది తెనుఁగునుడికారము" అని తట్టఁ జేయుచుండును. కావున ప్రతితెనుఁగువానిని నేను నేఁడు హెచ్చరించునది, "ఇందు సంస్కృతము హెచ్చా, తెనుఁగు హెచ్చా? ఇందు సంస్కృతము దెనుఁగుకలగలపు లెట్లున్నవి? వీ రితరభాషల నేర్చి వ్రాయుచున్నారా, నేర్వక వ్రాయుచున్నారా?" అను స్తనశల్యపరీక్షకుం దగక, మాటమాట, నక్షరమక్షరము విడదీసి చదువక నేకముగ గుర్తించి 'ఇది తెనుఁగు పురాణశైలియా? ఇది తెనుఁగుప్రబంధశైలియా? ఇది తెనుఁగుగేయశైలియా?' అని ప్రబోధించుకొనుట శ్రేయస్కరము" అని.

అందుల కర్హత యెవరికిఁగలదన్న నెవ రెన్ని తెనుఁగుపురాణములను బరించి యెవ రెన్ని తెనుఁగు ప్రబంధములను జదివి, ఎవ రెన్ని తెనుఁగుగేయములను బాడి యానందించుచు ఎం దాయానంద మున్నదో గ్రహింపఁదొరకొందురో వారికే యాయర్హతకలదు.

---



హిజ్ ఎక్సలెన్సీ లార్డు
విల్లింగ్డను
(రాజప్రతినిధి)



హిజ్ ఎక్సలెన్సీ లెప కాల్ ది రైట్ ఆనరబిల్
సర్ జార్జి ఫ్రెడరిక్ స్టాన్లీ, ప సి, జి సి ఐ, ఇ, సి యం జి
(మద్రాసు గవర్నరు)



ఆనరబిల్ ఖాన్ బహాదూర్
సర్ మహమ్మద్ ఉస్మాన్ సాహెబ్ బహద్దూరు, కె సి. ఐ. ఇ
(ఆక్టింగు గవర్నరు)



శ్రీ బొబ్బిలి మహారాజుగారు
(ప్రధానామాత్యులు).



కృతికర్త
కొడాలి వెంకట సుబ్బారావు



# 'హంపీక్షేత్రము'

చిరుమామిళ్ల
శివరామకృష్ణప్రసాదు, బి, ఏ.,





వ్యాసకర్త
చిరుమామిళ్ల శివరామకృష్ణ ప్రసాదు

భావికాలమున చక్కగా కొనలుసాగి పుష్పించి లోకమున కమేయానందమును గూర్పవలసిన కుసుమవల్లరి, చండభానుని కిరణములు సోకకపూర్వమె, ఏమికారణముననో తలవంచి నేలరాలి నది పరాత్పరుడు దానిగుణసంపదను గాంచి మరులుగొని, దొంగిలించుకొనిపోయి తనవీట నాటుకొనినాడు నిర్గుణుడగు విశ్వమయుని వింతచెయిదముల నెవరు ప్రశ్నింపగలరు?

అచిరకాలములోనే సరస్వతీదేవిచేత పట్టుసెల్లాలు కట్టించగల డీకవియని మిత్రు లనుకొనుచున్న సమయముననే కొడాలి సుబ్బారావుగా రీలోకమును వదలి చనిరి అతడు మృతజీవి. చిరునగవు పెదవులపై చిందులుద్రొక్కుచుండ, కల్మషరహితమగు వాత్సల్యమును విరజిమ్మ వారిపలుకు లింకను వినబడుచునేయున్నవి. వెనుకచూపు లేని సాహసము, సాహసమునకు తగినసామర్థ్యము, సామర్థ్యమునకనువగు సౌజన్యము వారికి విలువనుగూర్చిన భూషణములు. నిరాడంబరమగు వేషము, సంతృప్తిని వెలువరించుకనులు మిత్రుల నాకర్షించుటకు వారికి సమకూర్పబడినవి. గృహమునందుండినను, వెలుపలకు వచ్చినను చుట్టును మిత్రులె .. ... అందులకే యాదుర్దినమున, ఆశ్మశానవాటికకడ వేలకొలదివిద్యార్థులు, పెద్దలు గుమికూడిరి .. అత డొకమహారాజా? కాడు; దేశనాయకుడా? కాడు; హృదయమొసగి హృదయముల వశపరచుకొనిన సద్గుణాకరుడు. ఆశచే తుదివర కంప కచ్చట నిలిచియుండిరి; రిక్తహస్తములతో గృహములకు తిరిగివచ్చిరి

కవి :

శ్రీ కొడాలి సుబ్బారావుగా రొక విచిత్రమైనవ్యక్తి ఆయనతో కొలదిదినములు - దినములేకాదు, కొలదిమాసములు - స్నేహమొనర్చినను, ఆయననిజస్వభావ మెంతవానికిని గోచరముకాదు. ఆయనపలుకులను వినినచో పాశ్చాత్యనాగరకతాప్రపంచమున బడిపోవు నేటి యువకులవరుసలోనివారే యని ప్రథమున తోపకపోదు. కాని వారిహృదయ మట్టిదిగాదు. మాతృభూమియందలి భక్తిచేతను, ఆంధ్రోద్యమమునందలి యాసక్తిచేతను అది నిండియున్నది. జ్యోతిశ్శాస్త్ర మనిన వీరి కెంతయో నమ్మకముండెడిది. చిన్ననాటనుండియు వీ రీ విషయమున కృషిసల్పిరి. అందులకే తమతల్లిగారి మృతినిగూర్చి కొలదివత్సరములక్రింద 'భారతి' యం దొకగేయము వ్రాయుచు

"మాతృకారకుడు చంద్ర
మామ రాహువు గూడ
కుంభాన కేతువుతో
కూర్చుండె నారింట
 నని జోస్యులంటారురా
 అందుకే యనుభవం బంటారురా."

అని నుడివియున్నారు. వీరు చనిపోయిన దినమున వీరి చొక్కాజేబునందు, చనిపోవుకాల మొకకాగితముపై సరిగా వేసియుండెనట.

"కానేపు కాసేపు
కాదు యీ యనుభవము
కడ తేరి నీలోన
కలసిపోయేదాక
 కలకవేయు దనుండురా
 దైవమా—కడ ప్రయండుచునుండురా"

అని సుబ్బారావుగారు తమతల్లిగారి మరణమునుగూర్చి తల్లడిల్లిపోవుచున్నారు. తమబాహువులనీడలయందు కాపురముండి, సర్వకాలము లందు తమ్మే నమ్మియుండి, నే డెట్టియండయు లేక లోకమున నిలచియున్నవ్యక్తు లిట్లు తలపోయవలసినవారేకదా! నేటికి తమహృదయము శాంతివహించినది .. తమ్మాశ్రయించియున్నవారల హృదయములో ?

## గ్రంథస్వరూపము, మూలము :

ఈగ్రంథమునకు మాగురువర్యులగు శ్రీ విశ్వనాథసత్యనారాయణ (యం.ఏ.)గా రొకయమూల్యమైనపీఠికను వ్రాసియున్నారు. కావున

నురల నీవిమర్శనమును వ్రాయదొరకొనుట సాహసము కాకపోదు. శ్రీ సుబ్బారావుగారును మాకుగురువులగుటచే, వారి కళాప్రతిభలను పత్రికా ముఖమున ఆంధ్రాక్షరాస్యుల కెఱుకపరుపదలచి, నాకొలదికి తెలియక నే నీప్రయత్నమునకు గడంగితిని. మాగురువర్యులు రచియించినపీఠిక నా కీవ్యాసముపట్ల చాలవరకు సాయపడినది

ఈహంపీక్షేత్రమను గ్రంథము ఆశ్వాసములుగా విభజింపబడలేదు. దీనిని ఖండకావ్యములసంపుటమని యనవచ్చును. హంపే స్థాపింపబడినదాది హంపివినాశమునుగురకు జరిగినవిషయము లీగ్రంథమున ప్రస్తరింపబడినవి.

ప్రథమమున హంపీక్షేత్రముయొక్క నేటిస్థితి వర్ణింపబడినది. శ్రీసుబ్బారావుగా రచ్చటకేగి ప్రతివిషయమును తిలకించి, తమకు గలిగిన యావేశమునే యీపద్యములందు వెలువరించిరి. హంపీస్థాపనమును వివరించునపు డచ్చటిజను లనుశ్రుతముగ జెప్పుకొనుకథ నాధారముగాగైకొనిరి. తరువాత హంపీయందు నేటికిని నిలచియున్న విద్యారణ్యులవారి శిలావిగ్రహమును గాంచినంతనే కల్గినయావేశము నాధారపరచుకొని, కొన్నిపద్యములను వ్రాసియున్నారు మఱియు 'రాజ్యప్రదానము', 'పశ్చాత్తాపము' మొదలగువిషయముల కనుశ్రుతముగా వచ్చుచున్నకథలే యాధారము. 'కనకాభిషేకము', 'తళ్లికోటయుద్ధము', 'ఆనెగొందెకాపు' అనువిషయముల కొకింత చరిత్ర నాధారముచేసికొనియుందురు. 'పాణిగ్రహణము' అను విషయమున కాధారము 'కూతు రాయలకును గూర్చునాడు' అను పెద్దన్నగారిచాటువు. మఱియు, ఆముక్తమాల్యద చదువగా కలిగిన యావేశమే 'కృష్ణరాయలు' అనుశీర్షికక్రింద నున్నపద్యముల కాధారమని వివరించియున్నారు.

## కథావస్తువు-కూర్పునేర్పు :

హంపీక్షేత్రముయొక్క నేటిస్థితి ప్రథమమున వర్ణింపబడినది గ్రంథములందు హంపీవిభవమును పఠించి కవి యది యతిశయోక్తి యనుకొనినాడు. కాని 'కల్ల నిజమయ్యె నీవు సాక్షాత్కరింప' అని తాను హంపీ కేగివచ్చినతరువాత నాశ్చర్యమును వెల్లడించుచున్నాడు. హంపీక్షేత్రమునం దాత డెన్నియో క్రొత్తవిషయములను గాంచి యానందించినట్లు విశదమగుచున్నది. అచ్చటికొండలు సహితము 'మానవులచేష్టలం దోనమాలు దిద్దు' చున్నవట! ఈగ్రంథమునందు గల కొండలవర్ణనను చదువుచున్నప్పుడు శ్రీవిశ్వనాథసత్యనారాయణగారు 'కొండవీటి పొగమబ్బులు' అను శీర్షికక్రింద 'భారతి' లో వ్రాసినపద్యములు జ్ఞప్తికివచ్చును. హంపీక్షేత్రము చుట్టునుగల యున్నతమైన పర్వతపంక్తులను గాంచి కవి, శత్రురాజుల కవి యభేద్యములైనవని తొలిసారి సంతసించెను గాని వెంటనే నేటిస్థితిని తలచుకొని "అచలము లంచెలంచెలుగ నల్లినకోటల దాట . .. .. ......తెగింపలేక చకితులైనమూఢులు వికర్తన కర్తలచే తురుష్కనృపుల్" అని వాపోవుచున్నాడు. 'సొగసులో' 'పొరువలలోన' 'చుట్టుపట్లు చిందుశీకరములలోన' 'జీవనముల లోన' 'పంపాప్రవంతిక, సానువులను వ్రేలుమేఘప్రవాహాల నేలు కొను'నని నుడివి, యచ్చటనున్న పంపాసరస్సుయొక్క యుత్కృష్టతను వెల్లడించి, తెలుగునుడికారమునందలి యొకయొయ్యారమును ఆభావమునందు కవి సమకూర్చెను హంపీక్షేత్రమునందలి రమ్యమైన కట్టడములను గాంచి కవి తన్మయుడైనాడు. ఆంధ్రవైభవలక్ష్మి సర్వసౌభాగ్యములతో నలరారినదినములలో, తమ్మిమాలిసైనను నిర్మాణకౌశలమున గెలువగల మేటిశిల్పు లుండెడివారని మన మెఱుగుదుము. అట్టివారి శిల్పనైపుణ్యమునకు నిదర్శనముగా మనదేశమునం దచ్చటచ్చట కొన్నిశిథిలములయిన దేవాలయములు గలవు. వీనిని గాంచి నేటికిని ఆంధ్రుడు కంటతడివెట్టుచున్నాడు. హంపీక్షేత్రమునందు 'మరలులేకుండ యంత్రాలమహిమలేక', 'కొక్కెముల్ రాతినొక్కులుగాగ ఉయ్యాల సలిపెనా డొకకొండపలక తొలిచి', 'సోపానముల్ రాతిసుల్లుగాగా నుయ్యికొట్టెనా డొకకొండగుట్ట తొలిచి', 'మాలముల్ గాతిబాదులెగాగ హర్మ్యము కట్టెనా డొక కొండగుట్ట తొలిచి' 'వేదు లెల్లను రాతివిరుపులుగా రచ్చదిద్దెనా డొకకొండదెబ్బతొలిచి' 'ఆమహాశక్తికిని హేతు వరయలే'మని సర్వజ్ఞుడగు కవియే ఆశ్చర్యమును వెల్లడించుచున్నాడు. 'ఈపెనుకొండబండ లెటులెత్తిరో ఆకసమంట లాఘవప్రాపితకార్యమాయిది' అని ప్రశ్నించుచున్నాడు. తిమ్మరుసుకచ్చేరిని వర్ణించు సందర్భమున కవి పాఠకునియెదుట రానున్న విషాదసంఘటనమును, మంత్రిశేఖరుని కొలదెయిడరాని ప్రతిభను ఎట్లు ప్రదర్శించుచున్నాడో తిలకింపుడు :

"తిండికి లేక ఎంగిలి జితించిన మేనున తెల్గురాజమా
ర్తాండుని తేరుపై ప్రణవతత్త్వము దెల్పెడి బాలకృష్ణుడై
యుండిన మంత్రితిమ్మరుసు ఊహల పావనమైన రచ్చలో
మండినమంటతో నదియు మారె మసీదుగ మాచరిత్రలో."

రామరాజు సకలాంధ్రావనిని పరిపాలించి మ్లేచ్ఛులను పెక్కుసారు లోడించి వారిపట్టణములను కొల్లగొనినవీరుడు. పోర్చుగీసు వారితోడను, ఇతర మహమ్మదీయసుల్తానులతోడను సంధి యొనరించుకొని, వారిలోవారికి కలహములను బెంచి తనశక్తిసామర్థ్యములను చాటిన రాజ్యతంత్రప్రవీణుడు. తుదకు తళ్లికోటయుద్ధమునం దహంకారమువలన సర్వమును గోల్పోయిన దురదృష్టవంతుడు. అట్టి ప్రతిభాశాలి, ఒక చాకలికన్నెవాలుచూపులయందు చిక్కుకొనినాడు. దాని కొక దివ్యభవనమును గట్టించినాడు మహమ్మదీయులు బ్రద్దలుకొట్టినను దాని పూర్వవైభవము నశింపలేదు. అందులకే కవి యాభవనమును వర్ణించునపుడు, 'శిల్పవిద్యాకృషిలోన శిల్పికి సతం బొకభావము లూరువ్యాఖ్యయా' నని దానియం దలరుచున్న శిల్పనైపుణ్యమును ప్రశంసించుచున్నాడు 'చాకలిమూటలో మురికిచాలులు'యందు 'శాంతి, సేవ, ఓర్పు' గలవని నమ్మి ఆ

'చాకలికన్నె లేనగవుచాలున ముత్తెపుపంట మానసవ్యాకులమైన తచ్చరణవాతరయోద్ధతధూళిధూసర స్వీకృతమస్తకుండయి వసింపగ నాదివ్యభవనమును నిర్మించెనట. లోకప్రవృత్తిని, మానవుల స్వభావమును ఎఱిగిన కవిచంద్రు డెంతచక్కగా సమర్థించెనో యూహింపుడు

ఈప్రశస్తమకావ్యమునందు 'దురంత స్మృతి', 'దేవాలయములు', 'మహార్ణవమిశాల', 'స్నానాలచెరువు', 'నర్తనశాల' అనుశీర్షికలక్రింద మఱికొన్ని సీసపద్యములు గలవు ఈపద్యములను వ్రాయుసందర్భమున కవి తన్ను దామరచిపోయి, భావోన్మాదమున లేఖినిని నడపియుండవచ్చును. ఒకపద్యమునందున్న కూర్పునేర్పు వేరొకదానియందు గన్పట్టక, వింతరీతులతో నలరారుచున్నవి. పాఠకుని పరుగెత్తుమేఘముల గములలోనికి గొనిపోయి, వానికి వింత దృశ్యముల జూపి వాని డెందమునం దవ్యయానందమును గూర్చుచున్నవి తనహృదయమునందలి యాందోళనమును పాఠకునిహృదయమునం దుత్పన్నమగునట్లు చేయగలుగుటయే మహాకవికి కావలసినది. తానే కన్నులతో లోకమును జూచుచున్నాడో, ఏహృదయముతో లోకమును భావించుచున్నాడో, ఏపలుకులతో లోకమును అలరించుచున్నాడో, ఆకన్నులనే, ఆహృదయమునే, ఆపలుకులనే పాఠకున కొకత్రుటికాలమైనను సమకూర్పవలయును. పాఠకుని వశపరచుకొని, సమయానుకూలముగ, కథావస్తువున కనుగుణముగ తన కూర్పునేర్పువలన అతనిహృదయమునం దానందమును, దుఃఖమును, ఆశ్చర్యమును, భయమును ఆతని కెఱుకలేకయే సమకూర్పవలయును తనతో వెంటగొనిపోయి, పుష్పవాటికావిహారములందు విహరింపజేసి, చలువసెలయేటినీట జలకమాడించి, కోకిలగానమధురలయం దుయ్యాలలూగించి, తనగ్రంథము ముగించి తలయెత్తుసరికి బాహ్యప్రపంచమును గని త్రుళ్లిపడి, పాఠకుడు భావనాప్రపంచమునందలి మాధుర్యమున కచ్చెరువుపడునట్లు చేయగలవాడే సుకవి; అతడే ధన్యుడు. వానిగ్రంథము లాంధ్రవాణికి మిగుల యలంకారమును గూర్చు భూషణములు. ఆధునికాంధ్రకవిప్రపంచమునం దట్టికవులు లేకపోలేదు వారిలో సుబ్బారావుగా రొకరు.

> "బాకుపోటున చిమ్మబడిననెత్తురుజల్లు
> వెల్లవేసెనె రాజవీథి నిచట"

* * * *

> "అంత్యసందేశగాఢాలింగనంబుల
> కలియనొత్తెనె చురకత్తి యిచట"

* * * *

> "శిరము తెగి మొండెమై కోటబురుజుమీద
> పడకనిలిచిన 'కాపలా' భయముచేత
> శాత్రవులు కోట కెగబ్రాక జంకి సమయ
> మునకు వేచుక తలదాచుకొనిరె యిచట."

* * * *

ఈపలుకులు వినినంతనే పాఠకునిహృదయమునం దింతవరకు వసించియున్న ప్రశాంతత కరగిపోయెను. వివరింప వీలులేని యావేశమేదియో, ఆతనియం దుద్భవించుచున్నది. అతనికనులయెదుట గన్పట్టుచున్నదృశ్యము లొకత్రుటికాల మతని నెచ్చటికో గొనిపోవుచున్నవి.. ఆ నెత్తురుజల్లు బాకుపోటున చిమ్మబడినదట! ఆచురకత్తి, ఆలింగనసమయమున, అందును 'అంత్యసందేశగాఢాలింగన' సమయమట.. కలియ నొత్తెనట! కోటబురుజుమీద శిరము తెగిపోయినను అట్లే నిలచియున్నాడట కాపలావాడు!. ఎంతటి రాజభక్తి! ఎంతటి యకుంఠితమగు కార్యదీక్ష! .. .. అచ్చటే,హారతిపొగల తావికి కత్తు లెగయుచున్నవట, .... ఏమి కోలాహలము! .. ఈ పలుకులకు, దాస్యశృంఖలములచే బంధింపబడియున్న ఆంధ్రునిహృదయము కట్టతెగినచెరువువలె, నురుగులు గ్రక్కుచు కదలిపారుచున్నదే!

* * * *

విట్ఠలాలయముకడ, తెలుపుచుక్కలతో రమ్యముగానున్న శిలావేదులను గాంచి,

> 'ఏదేవి చిలికెనో ఈపాలమీగడ
> విట్ఠలాలయశిలావేదులందు'

అని నుడివి, ఎన్నియో భావములను హృదయమునం దుత్పన్నమగునట్లు చేయుచున్నాడు. "ఏరాజుతూగెనో ఈతులాడోలలో తులసి బంగారుమొక్కలకు మ్రొగ్గి" అని యచ్చటనున్న 'రాజుగారిత్రాసు' అను రాతిస్తంభములను గాంచి నుడివి, తనతో పాఠకునకుగూడ విషాదమును గల్పించుచున్నాడు

స్నానాలచెరువును వర్ణించుటయందు కవి ప్రదర్శించినచాకచక్య మపారము ఆంధ్రవైభవము క్షీణించుటకు ప్రారంభించినది మొదలు, తెలుగువాని యానంకము, ధైర్యము ఏరీతి సన్నగిలెనో విచిత్రముగ కవి చిత్రించినవిధము నొకింత తిలకింపుడు

> "అతిఘనలస్నానాలకై త్రవ్వినారటో పనిబూని యీరాతిపలకచెరువు
> పాడిపించినారటో మడిబట్ట తగిలింప రకరకంబుల గుబ్బరాతిమేకు
> జపతపంబులకయి సమకూర్చినారటో పుణ్యాంగనలు రాతిపూలపీట
> కరగించినారటో గంధాక్షతద్రవ స్ఫటికశోణిత రాతిపాలనురుగు
> వానతడసినభూమియై పానవడిన
> ఇనుపకమ్మియునై కోతగనినకొయ్య
> ముక్కయై నీటిబొట్టులమొనలు కరుగు
> చందనంబయ్యె తెల్గువజ్రాలగుండె
> నాడు, తురకలు భేదించునాడుకూడ."

ఈపద్యమునందలి క్రమాలంకారమువలన, కవి పాఠకునిహృదయమునం దెంతటిభావములను రేపప్రయత్నించుచున్నాడో కనుగొనుడు. ఈపద్యమును చదువునపుడు వైజయంతీవిలాసమునందలి

"ఆ విప్రోత్తము వజ్రపంజరనిభంబై నిశ్చలంబైన స
ద్భావం (బంగనసాహచర్యగుణసంపర్కంబునన్) లోహమై
గ్రావంబై దృఢదారువై తరుణవృక్షంబై ఫలప్రాయమై
పూవై తన్మకరందమై కరగెబో బోనీళ్ళకుంబల్చనై"

అనుపద్యము జ్ఞప్తికివచ్చును. తెలుగువజ్రాలగుండె, ఇనుపకమ్మియునై కోతగనిన కొయ్యముక్కయై, తుదిని నీటిబొట్టులమొనలుకరగు చందనం బయ్యెనట. ఇందు సీసపద్యమునందలి 'రాతిపలకచెరువు', 'రాతిమేకు', 'రాతిపూలపేట', 'రాతిపాలనురుగు' అనుశబ్దములకును, గీతమునందలి 'వానతడసినభూమి', 'సానవడినఇనుపకమ్మి', 'కోతగనినకొయ్యముక్క', 'నీటిబొట్టులమొనలుకరుగుచందనము', అనుపదములకును గలసంబంధమునందలి యౌచిత్యము పాఠకుల కమేయానందమును గూర్చునటలో నాశ్చర్యము లేదు. ఈకూర్పునందలి క్రొత్తపద్ధతి మిగులప్రశంసింపదగినది. మఱియు నర్తనశాలను వర్ణించుచు,

"కాళ్లపారాణి చిక్కన నృత్యవేళలచెమటలో కరగిపోసిన—'చార'
చక్రభ్రమణవేళ జలతారుతలకట్టు తెగినముత్యాలుదిద్దిన—'ముగ్ధ'
విశ్రామకేళికావేళ వాదించి పచ్చిసులో నెంచి కచ్చిన—'పావు'
నృత్యగానపరీక్ష నెఱిగి దినాభ్యాసమునకు ధరించి విప్పిన—'గజ్జె'"

నేటికిని 'కిన్నరాంగనానిచయ మాంధ్రరాజకన్యానుసరణపరత్వమందు తెలుగునర్తనశాలలో తిరుగుకతన రేగిపోలేదు, చెరగలేదు, పంటగడితప్ప లేదు. సప్తస్వరాల కనుగుణంబుగ మానినదిలేదని కవి క్రమాలంకారసహాయమున పాఠకున కిప్పటికిని ఆంధ్రవైభవము నశింపలేదని ధైర్యమును గఱపుచున్నాడు.

మనస్విత మహామేధావుల కుండులక్షణములలో నొకటి. వారియూహ లత్యున్నతములై సామాన్యులకు చేరువలో నుండవు. ఒకవస్తువును తిలకించునపుడు మనము గ్రహింపనేరనివిషయముల నెన్నిటినో వారు గ్రహింపగల్గుదురు వారియూహలను గుర్తించుటయే మనకు కష్టము ఈపద్యపాదములందలి భావము ను తిలకింపుడు

"ఈజీర్ణకుగ్రామ మేమిచూపించును తెనుగురారాజుపండినయశస్సు"
"ఈపాడుగుళ్లలో నేమిశేషించెను తెలుగుభక్తుడు కత్తితెగినయెరువు"

ఆధునికకవికుమారులయం దిట్టిలక్షణములుకలవా రుండుట ముదావహము.

కొంతవర కిట్లు హంపీక్షేత్రముయొక్క నేటిస్థితిని వర్ణించి, కవి సర్వసౌభాగ్యముల కాకరమై వెలసినపట్టణ మీరీతిని నిర్మూలమగుటకు కారణము నూహించుచున్నాడు. ఎన్నియో సంశయములు వచ్చినవి:

"గురుపూజలో తృప్తి కుదురని సన్యాసిచిరునవ్వుమొలక వంచించెనేమొ
సిరిగర్వమున దృష్టి చెదరిన సిద్ధాంతి గుణకారలబ్ధి సంకుచితమేమొ
కవిరాజుపద్యసంకల్పహర్షంబున విషమాక్షరంబు కన్పింపదేమొ
దాసియయ్యు పతివ్రతాత్వభంగముకోడి నిట్టూర్పులోనగ్ని నిలిపెనేమొ
తెలుగురాజుకు పుట్టిన తెగులుపురువు
తొలిచెనో యేమొ ఆంధ్రుల తొలకరిసిరి
కానిచో ఎన్న డనుకోని దీనచరిత
కాస్పదంబయిపోవునే ఆంధ్రమాత!"

అని వాపోవుచున్నాడు శ్రీసుబ్బారావుగారి కళాప్రతిభలను చాటుటకే ప్రథమకావ్య మన్నివిధముల తగియున్నది. ఇందొక కథ వర్ణింపబడలేదు. ఒకరాజచంద్రుని చరిత్ర ప్రస్తరింపబడలేదు. కాని ప్రకృతిసౌందర్యము శిథిలమైన రమ్యహర్మ్యములవర్ణనలుమాత్రమే యిందు పొందుపరుపబడినవి ప్రకృతి నారాధించు కవివర్యుని ప్రతిభ వెలువడుట కిట్టివే మిగుల తగినస్థలములు. హంపీవైభవమును తాము తలచినట్లు శ్రీసుబ్బారావుగారు పాఠకుని కన్నులయెదుట గన్పరచి ధన్యులైనారు.

## హంపీ స్థాపన :

హంపీస్థాపనమును గూర్చి ఎన్నియోకథలు వాడుకలో గలవు. ఆనెగొందెప్రభువగు జంబుకేశ్వరరాయలు మొగలుచక్రవర్తి మహమన్ తుఘ్లఖ్ సేనాని యగు బహఉద్దీన్ అనువానికి అభయహస్త మిచ్చెనట. తనపై తిరుగుబా టొనరించినవానికి సహాయమొనరించిన జంబుకేశ్వరరాయలపై గోపించి మొగలుచక్రవర్తి పెద్దసైన్యమును వానిపైకి బంపెను. కంపిలానగరముకడ జరిగినయుద్ధమునందు జంబుకేశ్వరరాయలు మృతు డయ్యెను ఆనెగొంది తురుష్కులవశముకాగా, మల్లిక్ సాహెబు అనువానిని, సుల్తాను, తన ప్రతినిధిగ నేర్పఱచి స్వదేశమునకు వెడలిపోయెను వెంటనే ప్రజలు తిరుగబడిరి. ఇది గాంచి, కారాగారమునం దుంచబడిన సోదరుల నిరువుర వదలియందు హరిహరునకు సుల్తాను రాజ్యమునొసగెనని యొకకథ గలదు. "హంపీక్షేత్రము"నందలి కథకును, ఈపైకథకును చాలభేదములు గలవు మొత్తముమీద శా. శ. ౧౨౫౮ ధాతృనామసంవత్సర వైశాఖశుద్ధసప్తమినాడు పుష్యమీనక్షత్రయుక్తసింహలగ్నమున నంకు స్థాపనము గావింపబడెను నూనిజ్ అనుచరిత్రకారు డీవిషయమును బలపరచుచున్నాడు. కాపలూరుశాసనమునందు పైవృత్తాంతమంతయు కలదు.

ఓరుగల్లు ఢిల్లీపాదుషాలవశముకాగా, హరిహరబుక్కరాయలను జామీనుగానుంచుకొని యుద్ధములో తనకైనఖర్చునంతయు నొసగినవారిని వదలివేసెదనని ఢిల్లీపాదుషా పలికెనట. కాని తెలుగువారు డబ్బు పంపలేదు. కొన్నిదినములవరకు వేచియుండి, తుదిని లాభము లేదని తలచి పాదుషా వారిని విడిచి వెళ్లిపోయెననియు, అన్నదమ్ములు సిగ్గువలన అడవులలో తిరుగుచుండగా, విద్యారణ్యస్వామి వారిరాజలక్షణములను గాంచి హంపీలో వారిని ప్రభువులుగా నిలిపినట్లు వేరొకకథ గలదు. అనాదరణవలన కోపించి, విద్యారణ్యస్వామి

చినవిషయ మిచ్చట మార్పుచేయబడినది ఈపైకథనే శ్రీరావుగారు గైకొనిరి

ఈ కావ్యమును ప్రారంభించుటయందు కవి మిగుల చతురిమ చూపియున్నాడు సోదరులను విడచుటకు పాదుషా ధనముకోరి నపుడు, తెలుగుతల్లు లోరుగల్లుపురవీథులందు నిలచి,

"ప్రారంభోదయ నైజతేజలును పారంపర్యశౌర్యాగ్నికే
లారక్తాక్షులు దీనులై తురకసమ్రాడ్వృద్ధులై, వాంచినా
రా రత్నార్పితశీర్షముల్ ? జలదధారాభిన్నమై మేరువే
నీ రైపోయెన? చూతురా తెలుగురాణీగర్భనిర్భేదముల్ ?"

అనిఘోషిల్లి పలికినారట హృదయములను తాండవింపజేయగల పలుకులను తెలుగుతల్లులు పురవీథులందు నిలచి పలికినను 'కాసుగూడ బందీకృతమోక్షయత్ననిరతిన్ వ్యయపెట్టలే'దట తెల్గువారు అందులకే వదలివేయబడిన సోదరులు,

"సిగ్గుపడిపోయి శక్తిలో క్రుగ్గిపోయి
కారడవులందు తిరుగుచున్నారు జాలి
బ్రహ్మవిద్యాఫలప్రాప్తి ప్రభలజిమ్మ
మాధవస్వామి కరగి సన్మానమిచ్చి"

అపుడు, 'కుందేళ్లుబోయల ననుకరించు వేంకుక్కల తరుము పవిత్ర దేశ మరసి' అచ్చట తన పేర నొకపట్టణము నిర్మించి, హరిహరుని రాజుగా జేసెనట విద్యారణ్యులు

"విష్ణువర్ధను డపుడు నవ్వేనుం, హర్ష
బాష్పపులకితశంపాభవంబు నూత్న
తేజ మొక్కటి ఆంధ్రభూదేవు నొసట
తోచినది యంట దేవదుందుభులు మొరయ"

ఆశుభసమయమునం దరుదెంచిన భూసురులలో నొకరు 'తృప్తిం జెందగాలేక కోపించె' నట!

"ఆకోపమె శాపంబై
కాకోలవిషాగ్ని రేచి కాల్చినదట సు
శ్రీకము విద్యారణ్యగు
హైకము హంపీపురీమహాశ్శేఖరమున్"

విజయనగరవినాశనమును వర్ణింపవలసివచ్చినందులకు దుఃఖించి, కవి, చేయునది లేక, ఒకసారి దాని పూర్వవైభవమును నెమరువేయుచు తుద కెట్లు హృదయమున శాంతిని నెలకొల్పుకొనుచున్నాడో తిలకింపుడు

"నిలిచినన్నాళ్లు నొకతీరు వెలిగినదియు
వెలిగినన్నాళ్లు మిరుమిట్లు గొలిపినదియు
విజయనగరమ్ము చరితలో విస్మృతమయి
కవిసువాక్చిరజీవితాంకము వహించె"

విద్యారణ్యులు

"తెల్గుభువనప్రళయంబున కడ్డుకట్టవేసిన మహనీయమూర్తి" యగుటచే విద్యారణ్యస్వామిని కవి మిగుల గొనియాడెను ఓరుగల్లు పురము మహమ్మదీయులవశము కాగా, ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి నిలువ నీడలేక, అల్లాడుచున్న సమయమున చేరజీరి, విజయనగరమున నివసింపతగు పరిస్థితులనుగూర్చిన విద్యారణ్యస్వామి ప్రతి యాంధ్రుని వలనను పూజింపబడవలసినవాడేకదా! అందులకే

"చెరచినదాని బాగుపడచేయుట దుర్లభ, మట్టితెల్గురా
జ్యరమను, ఓరుగల్లునిలయంబున కోటలుపడ్డ రాళ్ల పెన్
బరువుల క్రుంగుదాని సులభంబుగ పైకి తెరల్చి దివ్య సుం
దరరుచిమూర్తి చేసితివి తల్లి ఋణంబును తీర్చినావుపో"

అని పలికి విద్యారణ్యుని యశస్సునకు మరింత వన్నెగూర్చుచున్నాడు పైన, గీటుంచినపద్యభాగమునం దెంతటికావు గలదో పాఠకులు గ్రహించి యానందించెదరుగాక ఇట్టివియే గొప్పపోకడల వరుసలోనికి వచ్చును సామాన్యులగుకవుల కిట్టివి యలవడుట కష్టము

నేడు మహాత్మునియందు గన్పట్టుచున్న మానవాతీతమగు స్వభావ మొకటి విద్యారణ్యునియందును కలదని సర్వజ్ఞుడగు కవి కనుగొనినాడు అందులకే,

"ఇహపరంబుల మతరాజకీయములను
ఒకటికొక్కటి పొసగని వికటవస్తు
జాలముల నైక్యపరచి నిస్సంగమందు
సంగివై, సంగమందు నిస్సంగివైతె?"

అని ప్రశంసించుచున్నాడు మఱియు,

"అపుడు పురాణకాలమునయందు వసిష్ఠుడు, రాజ్యవేత్తలన్
నిపుణుడు సాధుపుంగవుడు నేడు మహాత్ముడు గాంధి, తెల్గుభూ
మిపతిచరిత్రవేళను సుమీ యుగమధ్యమునందు నీవు, మా
తృపదనితాంతపూజకు విధించినబ్రహ్మము మూడుమూర్తులా?"

యని పురాణకాలము, యుగమధ్యకాలము, వర్తమానకాలములందలి రాజనీతివేత్తల ముగ్గురను పేర్కొనెను వీరు ముగ్గురును భారత దేశపూజకొరకు మూడుమూర్తులుగా నవతరించిరట వీరికాకర్త లని నట్లు 'ఒకమాటవెంట, ఒకపోలికవెంట, ఒకభావమువెంట చేయబడెడు పాత్రపోషణ మహాకవియే చేయగల్గును మహారసజ్ఞుడే దానిని తెలిసికొనగల్గును ఇందు గాంధీవిద్యారణ్యుల రాజకీయవేత్తృత్వము, తపోనిష్ఠ మన మెరిగినవే వసిష్ఠుని తపోనిష్ఠనే మన మెరుగుదుము ఆయన రాజనీతివేత్తృత్వము మన కేమియు తెలియదు ఇచ్చట కవి దానినిగూడ మన మనస్సునెదుట విచిత్రముగ సాక్షాత్కరింపజేసినాడు ఈరీతి ఒకమాటతో ఎంతోపూర్వకథావిషయము ధ్వనించుట కొద్దిమంది చేయగలరు

"యయాతేరివ శర్మిష్ఠా భర్తుర్బహుమతా భవ"

అన్నమాటలో శర్మిష్ఠయెడల యయాతికి గల బహుమానము ఎంతో ఊహాకందరానిదిగా నున్నది దానిని కణ్వుడు పోలికతెచ్చుకొనెను, అట్లున్నది యిచ్చటి యీవసిష్ఠశబ్దప్రయోగము.

విద్యారణ్యుని శిలావిగ్రహమును గాంచి భావనాప్రపంచ మునం దుద్భవించిన పిల్లగాలితరగలపై కవి యేరీతి తేలిపోవు చున్నాడో చూడుడు

"ఆకన్నుమూతలో నంతర్విలీనపంచానిల స్తంభనాత్మార్చి వెలుగ
ఆబొమ్మ మోడ్పులో వసమాత్తుసెగ కన్నుమంట రేగిన సుల్లుమాటు మణుగు
ఆకన్ను విప్పులో నఖిలరాజన్య శిక్షాదక్షమైన వర్చస్సు మెరయు
ఆచిరునవ్వులో నాంధ్రసామ్రాజ్య శ్రీనవ్య జీవనశ్రీ మిసుమిసు
ఈ శిలావిగ్రహమునందె యింతగొప్ప
కుగురుకొనియుండ ఊహలు గుములుకొనిన
ఎంతవాడవొ నిను స్తుతియింప గలమె?
విజయనగరాంధ్రదేవుడవే నిజంబు"

కనకాభిషేకము

కవి కదలో తన్మయుడై కదలో నావేశముకలచోట, ఆ యావేశములో తానొకడై కథను నడుపుపట్టుల నిర్వహించగల్గియుం డుట అప్రతిమానమైన మహాకవిలక్షణము సూరన్న మొదలగు మహా కవు లిట్టిలక్షణములను తమగ్రంథములయందు వెలువరించియున్నారు ఈగ్రంథమునందు 'కనకాభిషేక' మనుకావ్య మట్టిదానికి ప్రబల నిదర్శనము ఈకనకాభిషేకమునుగూర్చి పీఠికాకర్తలు, "శిల్పమను మాట కున్న అర్థములలో కొంతభాగము బీజనిర్వహణముల ఐక్యమని చెప్పవచ్చును ఇది చాలగొప్పకావ్యగుణము కావ్యమునకేకాదు నాట కమునకు గుణము విశాఖదత్తమహాకవి ఆరవయంకములో సిద్ధార్థకు నిచే ననిపించెను

'తా కిం కుకవికిదణాడఅస్స విఅ అణ్ణం
ముహే, అణ్ణం ణివ్వహణే'

('కుకవి వ్రాసిన నాటకమునందువలె ముఖమునం దొకటి, నిర్వహణమునందొకటి')

ముఖనిర్వహణముల యైక్యము సాధించలేని కవి కుకవి యన్నాడు ఈఐక్యము మహోత్కృష్టముగా నిర్వహించెనా అతడే మహాశిల్పి, అతడే మహాకవి ఈకావ్యమునందు ప్రతిచిన్నికావ్యమును ఇట్టి శిల్పమునకు ఉదాహరణముగా నున్నది కనకాభిషేకము చూడుడు భాషావాదవిషయమైన డిండిముని ఢక్కాప్రశంసతో కావ్య మారంభింపబడినది తెల్గుభాషాసరస్వతి 'పైడిటంకాలకట్టుల తోడినగలు' విలుచుకొనుటతో నవసానమైనది కథావస్తువునకు చెం దని అనవసరమైన ఒక్కయక్షరము లేదు కావ్యమువెనకి చూచినను ప్రత్యక్షరము, ప్రతిశబ్దము, ప్రతివాక్యము, ప్రతిఅలంకారము, కావ్యరసోన్ముఖముగానే పరుగెత్తును ఇది మహాశిల్పము మిక్కిలిగా మాట్లాడినచో ఇంతకన్న శిల్పము లేదని నుడివియున్నారు

ఉన్నయూరివా డన్న ప్రతివానికిని అభిమానమే పొరు గూరివా డెంతప్రజ్ఞావంతుడైనను, వానియెడ ప్రజలు గౌరవమును జూపరు వానివేషమును గాంచి పెక్కురీతుల బల్కెడ ప్రవృత్తి నెరిగిన కవిశేఖరు డందులకే, శ్రీనాథు 'తలపై గోష్పాదమంతయు లేదనియు, 'శైవమతాచారసారాస్వాదుండటు, రాదు పోలింగకాయ మెడను' అని ప్రజ లెన్నియోవిధముల పలికి నట్లు వివరించియున్నాడు ఈ పలుకులను విని, కవిరాజు తనవెంట వచ్చు శిష్యులను గాంచి నవ్వెనట ఇంతలో 'తెలుగుకవిరాజు రాయల కొలువునందు చర్ణమును మోపె సభయు నిశ్శబ్దమయ్యె' గీటుంచిన వింతపదములపొందికతో శ్రీ సుబ్బారావుగారు పాఠకునియెదు జరుగుచున్న విషయమునంతయు కన్నులకు గన్పడునట్లు చేయు చున్నారు రాబోవుకావ్యములందును, ఇట్టివానివలన పాఠకునిహృద యమునం దాసక్తిని గల్పించుచున్నారు మం దేమిజరుగనున్నదో యని పాఠకుడు తన్ను దామరచిపోయి కడయందు విమర్శించుట కును, ఎంతపెద్దవిషయము నైనను విసుగులేక చదువుటకును ఇట్టి వింతపదముల పొందిక సాయపడును ఇట్టిస్థలములనే ఆంగ్లమునందు dramatic గా నున్న వనెదరు

శ్రీనాథుడు దక్షిణకరము పైకెత్తి అవనిపతికి 'ఆశుధారల నాశీస్సు లాడినాడు' తనప్రతిభావిశేషములను రాజుగారికి విన్న వించినాడు తరువాత 'కవివరుండు తెలుగురేడు చూచె డిండిమభట్టును చూచెతిరిగి, రణమువారుకలలో విజృంభణము పెరిగె ఒక్కటిప్పుకో వీలులేకుండె సభకు'

శ్రీనాథకవిసార్వభౌముని ప్రతిభ సభ్యులందరకు విదిత మయ్యెను ప్రథమమునందు

"డిండిమభట్టుకీర్తిని గడించుటలో మదికేరినాడు తి
త్పాండితి దక్షిణాపథకవిభావరి నెల్లల లారవోసె మా
ర్తాండునితేజ మట్టిపగు తన్ముఖమండల నుమహాత్మపై
దండుకువచ్చినాడు ఫలితం బనుభూతవుకాదె వీనికిన్"

అని సభ్యులందరు గుంకయించిరి కాని శ్రీనాథుని పాండిత్య ప్రకర్షమున కచ్చెరువుపడి, తన్మయులై, ఐకకంఠ్యమున "బాగోయీ కవిరాజ, యింతటిప్రభావం బున్నదం చెంచనేదే గర్వం బనుకొన్న నీపలుకులన్ని సత్యమున్ జేసితా"

"అనిరి పండితసభ్యు లందంద లేచి
జయజయార్భటులందు వర్చస్సు డింది
పాలిపోయిన డిండిమభట్టుబిరుద
కంకణములెల్ల తెగగొట్టగాన్పు"

ని యనుమతిని బడసి తదుపరి డిండిముని ఢక్కను పగులగొట్టిరి ఆ ఢక్కను పగిలించునపుడు 'వలయంబులునై విరళీకృతంబులై కదలెను శబ్దముల్' ఈపద్యపాదమునందలి రచన కాళిదాసునకు సన్నికృష్టమైన శక్తికలది

ఓడింపబడిన డిండిమభట్టుసహితము తనయోటమికి చింతపడ లేదు తనకు గౌరవమే జరిగినదని తలచెను అందులకే,

ఎన్నుమించినవానిగా నెన్నుకొందు
బిరుదములు తీసివేతును భేరి నిచట
పగులగొట్టింతు"

ని పల్కెను, తదుపరి

"నృపు డెవరి నెట్లుగా సత్కరించునో యని
ప్రక్కలను బ్రింకకొనుచును గూరుచుండి,
నవ్యకవితాసనాథ శ్రీనాథసుకవి
యూహ లంభోధివీచులై యూగ"

చుండిన సమయమున

"                సభలోన పైకిగ
ద్దె నిలిపి హేమటంకముల గవ్చిరి రాసులు పోసినారు రా
జును తనగద్దె డిగ్గి పిలుచున్ కవిరాజును చేలుపట్టి లే
చెను పరిపూర్ణహర్ష వివశీకృతుడై కవిరాజుపూజకై"

కొంతతడవునకు పూజ సమాప్తికాగా, తెలుగుప్రజలను దీవించుచు, తెలుగురాజును దీవించుచు సింహాసనమునండి కవిసార్వభౌముడు 'సువర్ణతేజుడై లేచెను'

పూజించినది పండితప్రభువు పూజింపబడినది కవిరాజు పోషింపబడినది కవి ఈ దృశ్యమును వర్ణించునది కవి రసము చిప్పిలునదియై పాఠకుని హృదయ మీఘట్టము చూరగొనుననుటలో నతిశయోక్తి లేదు ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి పసుపుకుంకుమలతో నలరారుచున్న దినములలో నొకమహారాజొకమహాకవిని పండితులముందు పేరోలగంబున కనకాభిషేక మొనరించె నని విని నంతనే అవ్యయానందమునం దోలలాడుచున్న మనమే యాకాలమునందు బ్రతికియున్నచో నెట్లుండెడిదో యని పాఠకు డూహాప్రపంచమున కొంతవరకు విహరింపకపోడు

"విజయనగరాంధ్రలోక మావేళకవిత
కన్నకానుపు ముత్యాలకాంతులందు
తెలుగుభాషాసరస్వతి నిలుచుకొనియె
పైడిటంకాల కట్టులతోడి నగలు"

సుబ్బారావుగారు శ్రీనాథుని సీసపద్ధతిని చక్కగా నమర్చుకొనగల్గిరి కవిసార్వభౌముని సీసపాదములు తెచ్చి తమవానియందు కలిపి తెలిసినవారినే భ్రమింపజేయుచున్నారు ఇది వీరి ఘనమగు కవితారీతి కొకనిదర్శనము

## రాజ్యప్రదానము

శ్రీకృష్ణదేవరాయలు దక్షిణదేశ దిగ్విజయసన్నాహములో నుండెను చోళరాజులు, పాండ్యులు, ఇదివరకే పెక్కుసారులు రాయలపైకి దండెత్తివచ్చిరి చోళులది తంజావూరు పాండ్యులైదుగురు అన్నదమ్ములు, ఏకోదరులుకారు, తల్లులు ముగ్గురు, ఒక కులమునకు చెందినివారు పాండ్యజ్యేష్ఠునిది మధుర అది రాజధాని కొంతకాలమువరకు అన్నదమ్ము లొకటిగానే యుద్ధముచేసిరి కాని చోళరాజువల్ల కులమున తక్కువతక్కువ అనే ద్వేషము లేర్పడినవి ఇది యందుచేసుకొని చోళరాజు పాండ్యసోదరులను నలుగురిని ఖైదు పట్టుకొన్నాడు మొదటిపాండ్యుడుమాత్రము కృష్ణరాయని శరణుజొచ్చెను

దేశమునం దెల్లెడల నశాంతి ప్రబలియుండెను "దక్షిణదేశమల్లకల్లోలములో స్పృశించుటకు రోసిన దన్నము నీళ్లు వేళకున్" ఇట్టి యల్లకల్లోలము నణచివేయుటకును, తనసాయము గోరినవానిని రక్షించుటకును సేనానిని బిలచి,

"నాగమనాయడా! సమరనాట్యము సల్పుము మాకు న
భ్యాగతుడైన యీతనినృపత్వము నిల్పుము, గొల్పు మాశలన్"

అని కృష్ణరాయ డానతిచ్చెను

"త్రైలోక్యశ్రీ దేవర కృతకృత్యుడైతి
కాదనువాడనే? కంపింపచేతు
చోళభూపతి మీకు జోహారుసేయ
సెలవీయు డనిపోయె సేనాధిపుండు"

కొలదిదినములు గడచెను చోళులు, పాండ్యులు, నాగమనీనిచే నోడింపబడిరి కాని నాగమనీడు స్వార్థపరుడు తాను సంపాదించిన రాజ్యమును తానే యనుభవింపదలచెను ఈయుద్దేశ్యమును ఆంధ్రసమ్రాట్టునకు జాబుమూలమున తెలియజేసెను ఈజాబు కృష్ణరాయనికొలువునకు వచ్చినప్పుడు, అచ్చటిదృశ్యమును కవిచంద్రు డతిరమ్యముగ నీక్రిందివిధమున వర్ణించెను ఇచ్చట వృత్తము మార్చబడెను అంతులకై యంతచక్కదన మాఘట్టమునం దలరారుచున్నది. ఆసమయమునం దున్నశోభ, గంభీరత (Grandeur and seriousness) క్రొత్తవృత్తమును ప్రవేశపెట్టుటచే కలిగినవి రసపుష్టికి సమయానుకూలముగ తగినవృత్తము నుపయోగింపవలసినవిధ మెల్లరకు తెలిసినవిషయము కాదు

జాబుచేరినంతనే,

"కృష్ణరాయలమోము కెంజాయ మొలిచి
అతిరోషవృత్తతామ్రాక్షు డైనాడు
కోప మెన్నడురాని గుణరత్నజలధి
నడిరేయివలె శబ్దనష్టమై కొలువు,
మనుజులే లేనట్లు మాటుమణంగ
సభ్యులు జీవచ్ఛవంబుల ట్లొకట
కొయ్యబారినవారు, కొసకన్నులందు
ప్రాణాలతో నల్లబడిపోయినారు,
మంత్రితిమ్మరుసయ్యమాత్ర మారేని
ప్రక్కను కేల నొకపత్రికన్ పూని
నిశ్శ్వాస మూదుచు నిల్చియున్నాడు
దీర్ఘచింతామగ్నధీ శక్తియుతుడు."

పైన, గీటుంచినపలుకు లెంతటియానందమును పాఠకునకు గల్గించునో యూహింపుడు తన కన్నతండ్రి యేని నేరీతి వంచించెనో సర్వము గ్రహించినాడు, నాగమనీనిపుత్రుడగు వీరమనీడు

తిమ్మరుసుమంత్రి నాగమనీనిజాబును 'నిలువునీరైన వీరమనీని' కందించినాడు అతడు

“ నేత్రములు లేఖమీదనే నిలిపినాడు
కాని చూపాత్మలోనె విలీనమయ్యె
తండ్రి—రాజు—సేవాధర్మతత్పరతయు
హృదయమును ముట్టనుంటల నెగయుచుండె ”

'అంతలో రాజు సభికలయంగజూచి',

'ఆ నృపద్రోహిశిరమైన, అతనినైన
బహుమతిగ మాకు నీగలవాడొకండు
కొలువులో నున్న యీకత్తిగొనుతండు'

అని పలికెను

ఏమి యీ ఆవేశము! ఏవీరుడా కత్తిని గోరుకొనును? పాఠకుని హృదయము తత్తరపడుచున్నది తండ్రిచేసినద్రోహమువలన కుమారుడగు వీరమనేనికి నిందుకొలువునగలిగిన యవమానమునకు పాఠకుడు చింతపడుచున్నాడు కాని నల్లనిమేఘముల గములమాటునుండి వెలువడిన సౌదామినివలె, దుఃఖతిమిరముతో నిండియున్న పాఠకుని హృదయమునం దెంతటిహర్షజ్యోత్స్నను, చతురుడగుకవి వెలయించుచున్నాడో తిలకింపుడు రాజారీతి కత్తిని చూపినంతనే,

“ వీరమనీడు జాబునటు వీచి మహోద్ధతశాంతలోచనారి
భోరుహముల్ జ్వలింప నృపమూర్తికి నంజలిబద్ధుడై అసిన్
కోరెను కృష్ణభూవిభునకున్ రిపుడై మనతెల్గునాటికిన్
దూరగుడైన నాదుపిత దూరగుడేసుమి సాకు నంచునున్ ”

ఈపలుకులను విని రాజు, 'దేశభక్తులలోటు తెల్గుదేశంబున చూపట్టదని' పంతసించెను 'నిజమైనభృత్యుడు నృపచూళి' కని తన్జ్ఞులు మెచ్చుకొనిరట, అప్పాజ 'ఇత డీపనికి చాలు నని తలయూపెనట శత్రువులైన పాండ్యులుమాత్రము సంశయమును వెల్లడించిరట ఎంతయౌచిత్యము! సభ్యులం దెవ్వరును వీరమనీని రాజభక్తిని అనుమానింపలేదు అట్లనుమానించుట రాయలకుగాని, అప్పాజీకిగానీ, పండితులకుగాని తగనివిషయము రాజ్యతంత్రప్రవీణుడగు తిమ్మరుసు (అప్పాజి) అట్లు కలనైన తలంచడు తనపాలనాసైన్యమునందు నమ్మకముగల రాజు అట్లనుకొననేరడు తన్జ్ఞులగు పండితులుసైత మట్లు తలంపరు ఎటువచ్చి శత్రువులును శరణుజొచ్చిన పాండ్యసోదరులే అట్లు తలంచుట కర్హులు వారట్లనుకొనుటలో నెంతయో యౌచిత్య మున్నది శ్రీ సుబ్బారావుగారి యౌచిత్యమున కిది పరమోత్కృష్టమైన యుదాహరణము వీరమనీనిప్రవిమలమగు రాజభక్తి కిది ప్రబలనిదర్శనమై వెలయగలదు ఈతనిపాత్రనిర్మాణ మత్యంతమనోహరముగ నున్నది

రాజుకడ నిలిచియున్న వీరమనీని'చేత కత్తి నిడె, రక్తములు పొంగె'

తుదకు వీరమనీడు యుద్ధమున జనకు నోడించి రాజసన్నిధి కొనివచ్చెను రాజు నాగమనీని క్షమించి 'నీకొడుకుతో సుఖియింపుము పుత్త్రివైభవాభోగములోననే మరచిపొమ్మిక పూర్వపునీదు వర్తనన్' అని నుడివెను

ఇంతలో అప్పాజి “ గొంతెత్తి సభకు
'తంజాపురీ రాజ్య దానోత్సవంబు
జరుగు నాయత్తమై చనుదేరు' డనుచు
ఆహ్వాన మిచ్చినా డానందమొకటె,
నాటి సభాస్థలి నాట్యంబొనర్చె ”

తంజనగరపువీథులవెంట కృష్ణవిభుడు సకలపరివారసమేతుడై చనుచున్నకాలమున సౌధగవాక్షాంతరాంతరముల నిలిచి, ద్రావిడీవిచయము పలికిన పలుకులు, కళ్యాణమంటపమునకు నలు డేగుసమయమున స్త్రీలు వానిని గాంచి పలికినవాక్యములను, మనుచరిత్రలో నిట్టిదే మరియొకఘట్టమును జ్ఞప్తికిదెచ్చును

వీరమనీనికి తంజనగరమహారాజ్య మొసగబడెను “పెద్దన గళ్ళత్తి ఆశుకవితామధువర్షరి నించి, నవ్యరాజ్యనియతుడైన వీరుని ప్రశంస యొనర్చెన, నాటిమాట నేడును కనవచ్చు తంజపురిలోని సరస్వతిమంటపప్రభన్ ”

## తళ్లికోటయుద్ధము.

ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి కవి తుదిదినములు నిజాంషా కల్యాణదుర్గమును గోల్పోయినతరువాత దానిని తిరిగి సంపాదింపదలచి, ఇబ్రహింకుతుబ్‌షాతో సంధిచేసికొని వానిసహాయమున ఆలీఆదిల్‌షామీదికి దండునడలి, కళ్యాణదుర్గమును ముట్టడించెను ఆదిల్‌షా రామరాజుయొక్క సాయమును గోరెను 'బదివేల యశ్వములతో నేగ శత్రురాజుల నోడించి కళ్యాణదుర్గమును విడిపించెను ఈకడపటియుద్ధమునందు హైందవసైనికులు పెక్కుదుండగము లొనరించిరి మహమ్మదీయస్త్రీలను పరిభవించి, మసీదులను నేలమట్ట మొనరించి, అమాయకులగువారిని సంహరించిరి రామరాజున కీవిషయము తెలిసియు మిన్నకుండెను మహమ్మదీయరాయబారులు తనకడకు వచ్చినపుడు వారిని తూలనాడెను ఈకారణములవలననే మహమ్మదీయరాజులయం దైకమత్యము కుదిరెను ఆంధ్రభూనాయకుని వారు నాశన మొనరింపదలచిరి తళ్లికోటయుద్ధమునందు రామరాజు తానొనరించిన యక్రమములకు తగుశిక్ష ననుభవించెను కవిచంద్రుడందులకే రామరాయలపట్ల నొకింత కటువుగ నున్నాడు ఇట్లుండకను తప్పదు రామరాయలు రాజనీతివేత్త, మహాసమర్థుడే కావచ్చు పరాత్పరు డొకింత తనకనుకూలుడుగా నున్నదినములలో, నొరుల నీరీతి హింసించుటపాడియా? 'రామరాయల పాత్రపోషణమును





1. శ్రీరాజా మాణిక్యారావు వెంకటగోపాలరావు బహద్దరువారు (రేపల్లె సంస్థానాధిపతులు)
2. దివాన్ బహదూరు యం. బాలసుందరం నాయడుగారు, మదరాసు నూతన షరీపు.



1. కొమ్మూరి సంగమేశ్వర కవిగారు. 2. డా. జి. తిమ్మారెడ్డిగారు. 3. డా. పి. గోవిందరాజులుగారు. 4. నెల్లూరు కృష్ణయ్యగారు.
5. డా. యస్. వి. రాఘవన్‌గారు. 6. వల్లూరి సూర్యనారాయణరావుగారు. 7. విన్నకోట దుర్గారావుశ్రేష్ఠిగారు.

# సరియైనధరకు శ్రేష్ఠతరమైన యింజను...

# క్రాస్లీ

## హారిజంటల్ డీసెల్ యింజను.



Type HD of 10, 12, 14, & 16 B- H P

క్రాస్లీకంపెనీవారి గొప్ప ఆయిల్ యింజనులలో ముఖ్యమయిన యీ క్రొత్తచేరిక తయారు చేయబడెను. చాల తక్కువధరలలో, బాగుగా పనిచేయు తక్కువహార్సు పవరుయింజనులను ఉపయోగించుకొనజాలువారికై ప్రత్యేకముగా యీ క్రొత్తక్రాస్లీ హారిజంటల్ డీసెల్ యింజను తయారుచేయబడినది.

ఇంజనుకోల్డు స్టార్టింగ్ గలది. కొద్దిపవరుతో పనిచేయుకార్యముల కన్నిటికిని బాగుగా నక్కరకువచ్చును. ఎట్టిచౌకరకము నూనెలను వాడినను యీ యంత్రము బాగుగా పనిచేయును

పూర్తి వివరములకు వ్రాయుడు:

**CROSSLEY**
*High Grade* **OIL ENGINES**

## బిన్నీ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్.

సోల్ ఏజంట్లు —

**క్రాస్లీ బ్రదర్సు లిమిటెడ్,**
ఆర్మీనియన్ వీధి, మద్రాసు.

ఉత్తరసర్కారులకు సబ్ యేజంట్లు:—

**పైడా చిన్న వెంకట్రామన్న బ్రదర్సు,**
మిల్ స్టోర్సు, కాకినాడ.

విన్న వారికి కొంతకష్టముతోచినది కూడను' అని పీఠికకర్తలు నుడివి యున్నారు. అట్లైనవారికి తోచునో వారికి రామరాయలయొక్క చరిత్ర సమగ్రముగా తెలియదనుట సాహసము కాఁబోదేమో! అయినను, కవి రామరాయల కెట్టియగౌరవమును చూపియుండలేదు.

తల్లికోటయుద్ధప్రారంభముననే కవి పాఠకునియందు భయమును, అనుమానమును, దుఃఖమును రేపుచున్నాడు.

"ఆనాఁడే ద్విగుణీకృతంబులట, ఆంధ్రాంతఃపురస్త్రీజన
ధ్యానంబుల్, పరిపంథి వీరవరఘంకారారావముల్, బహ్మనీ
భూనాథైక మతాగ్ని దీప్తులును శంభుస్వామిపై రాజ్యదీ
క్షానాట్యంబులు తెల్గుభూములను జ్యేష్ఠాదేవిసంచారముల్."

మఱియు నిష్పక్షపాతియగు కవి యేమనుచున్నాడో వినుడు విని— తల్లికోటయుద్ధమట్లు ముగియుటకు కారణము నూహింపుడు. ఊహించి —మన యాంధ్రరాజునే వెనుకవైచుకొని మాటలాడగలరా?

"అది విక్రమత్యసాధ్యంబైనదే గెల్పు ఒప్పుకోరా నిజమున్నమాట
అది రామరాడ్దుర్ణయాభివర్ధితమగ్ని అనినవో అభిమానమున్నమాట,
అది మతావేశమం దంకురించిన వాంఛ లేకున్న చరితమే లేనిమాట
అది పురాతనముగా నవతరించిన యీర్ష్యకాదందురా చేతకానిమాట

ఇవి భ్రమలెయైన, పాదుషా లేవు రొకట
కూడు టదియేల? తెల్గుశక్తులకు జాలి
తూలు టేల? కుట్ర లొనర్చుజోలి యేల?
పూత మదియేల తురకలు పొందుజయము"

పైన, గీటుంచిన భాగమునందలి కవియొక్క నిర్మలమైన హృదయ ప్రకటన మెంతయానందజనకమై యలరారుచున్నదో తిలకింపుడు.

యుద్ధము జరుగుచున్నకాలమున రామరాజు మధ్య బంగారు గద్దెపై ఆసీనుడై యుండెనట ఇది యెంతటివిరుద్ధచర్య! అందులకే యావేశమున హృదయమునందలి యాంధ్రాభిమానము నణచివైచుకొననేరక, సత్యసంధుఁడగు కవి

"ఆపదాత్యశ్వసైనికాభ్యంతరమున
నిజకిరీటద్యుతులు రీవి నెరప, రామ
రాజు బంగారుగద్దెపై రణమునందె
కొలువు కుదిరె మాయాంధ్రుల కొంపకాల్ప"

అని మెచ్చుకొనుచున్నాఁడు. యుద్ధమునకు పూర్వమే పెక్కుశకునములు తోచెనట 'గజరాజు వెంటరాక వెనుకాడె'నట, 'పంచకల్యాణిగుఱ్ఱము సకిలించి మోరనెత్తె'నట, 'కృష్ణవేణీతరంగిణి స్తబ్ధమైపోయి కదలమానినదట' కాని 'నైజపరాక్రమంబు ముసలిమేధస్సులోపల ముడుతలుపడు' టచే రామరాజు తెలిసికొనలేదు పోరు ఘోరముగ సాగెను. హైందవసైనికులు తురుష్కులఫిరంగులవలన క్రమముగ నశింప దొడగిరి. తనసైనికులకు తగినయుత్సాహమును పురికొల్పదలచి, రామరాయలు యుద్ధభూమియందు బంగారునాణెములను పంచిపెట్టెను. ఇది ప్రశంసార్హమగు విషయమా? అందులకే,

". నిధుల్ విరజిమ్మట, తెల్గుసైనికో
త్కర మతిలుబ్ధమై ధనరతంబయియుండుటగాంచి, శత్రువుల్
తురగబలంబు నొక్కపరి దూకగజేసిరి కాలమూర్తికిం
కరులటు చెక్కుచుండ్రి తురకల్ చలదాంధ్రపదాతివర్గమున్"

అని కవి వాపోవుచున్నాఁడు తుదకు రామరాయలు,

"ఆరిపోవుదీపము గప్పుమనెడిరీతి'
గద్దెపైనుండి దగ్గరగా నిలచిన
అశ్వమునకయి లంఘించునంతలోన
శిరముత్రెంచిరి తెగియించి తురకబంట్లు"

కవిచంద్రుడు తనకు చేతనైనంతవరకు తగినగౌరవమునే రామరాజునకు జూపించెను అందులకే,

"ఎనుబదియేండ్లవృద్ధు, డసినేనియు చాల్పనిగర్వి, ఆహవంబున కొలువున్న సాహసుడు, పూజ్యుడు పూర్వము, అంత్యవర్తనంబున మతిలేనివాడయి, విమూఢుడునై, సతతంబు గెల్పె న
మ్మినస్థిరచిత్తు డిప్పుడు సుమీ గ్రహియించె స్వకీయదోషమున్."

అనినుడివి, పైన, గీటుంచినస్థలములం దాతనియెడ తనకుగల యభిమానమును విశదపరచెను రామరాజుమృతితో "మహదాంధ్రరాజ్యసన్మానము మానముల్ కథలుమాత్రము నిల్చిన వల్లిబిల్లిగన్"

రామరాజు పల్లకీపై నధిరోహించి యుద్ధమధ్యమున నున్నకాలమున, బీజపూరునవాబగు అదిల్‌షాకు చెందినగజ మొకటి బెదరి, పల్లకీపై వచ్చి పడుటచే రామరాజు క్రింద బడెననియు, అంతట శత్రురాజులు వానిశిరము నఱికి, యొకబల్లెమునకు గ్రుచ్చి సైనికులందరకు జూపించిరనియు చరిత్రయందు గలదు ఇట్లు వర్ణించుట యసభ్యముగా నుండునని తలచి, కవి యొనరించినమార్పు మిగులచక్కగా నున్నది డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారు రీవిషయమునుగూర్చి కొన్నిపరిశోధనలు జరిపి, కొలదిమాసములక్రింద నొక వ్యాసమును హిందూపత్రికయందు బ్రకటించిరి అందు రామరాయల శిరము నఱుకబడలేదనియు, అతడు ఖైదీగా పట్టుకొనిపోబడెననియు, మొదలగుమార్పులను సూచించియున్నారు మొత్తముమీద తల్లికోటయుద్ధములో 'ఆంధ్రసామ్రాజ్యనాటకాభ్యంతరమున చివర తెర జారిపోయిన' దనియే చెప్పకతప్పదు

ఆనెగొందెకాపు:

రామరాజు తల్లికోటయుద్ధమున కేగకపూర్వము తిరుమలరాయని ఆనెగొందెసంరక్షణకు నిలిపిపోయెను కాని తల్లికోటలో రాజుమృతివిని, తిరుమలరాయడు పారిపోయెను. ఇతడు పారిపోక నిలచినట్లయిన, ఆంధ్రసామ్రాజ్యమున కిట్టి దురదృష్టము కలుగకుండెడిదటు. ఈకావ్యమును వ్రాయునపుడు కవి మిగుల నిరుత్సాహ

పూరితుడై యున్నాడు. ప్రతిపద్యమునందును నిరాశ నిండియున్నది.
"తెల్గుభువి రక్తంబందు వ్రాయింతె మ్లేచ్ఛుని దౌర్జన్యము నీదు పందతనమున్ శుద్ధాంధ్రచారిత్రమున్" అని రోషము వెల్లివిరియ ప్రశ్నించుచున్నాడు. మఱియు,

'రాజ్యరక్షణ కాదు, సంగ్రామమందు
కలబడుట కాదు, గొందెను కాచుకొనుట
యింతమాత్రము చేయలేవేని మొదట
రేనితో నేల చెప్పగాలే వశక్తి '

అని తిమ్మరాయని పందతనము పాఠకునకు విదిత మగునట్లు ప్రశ్నించుచున్నాడు కొలదిసేవ చేయనేరక, తిమ్మరాయడు బహుళాంధ్రావని కేరీతి తీరని యప్రఖ్యను దెచ్చిపెట్టెనో తనపాకులియొదుట బెట్టి కవి తనశిల్పనైపుణ్యము నేరీతి ప్రదర్శించెనో చూడుడు

'రెండువందలగజముల కొండగొందె
విపులసామ్రాజ్యచక్రము విరిగిపడును
ఒకపిరికిపందచేతలో నొరగిపోవు
బహుళమహాదాంధ్రజనవైభవముల రథము '

ఈపైపద్యమునందలి ప్రతియక్షరము, ప్రతిశబ్దము, ప్రతిపాదము భావోద్రేకమున నుయ్యాలలూగుచున్నవి. ఎన్నియోపుటలలో వ్రాయవలసినవిషయ మొక తేటగీతియందిమిడ్చినకవియొక్క వైశారద్యము మిగుల కొనియాడదగినది ఆశాభంగమువలన కవి యీరీతి, తిరుమల రాయని చిత్రించుటయందలి యౌచిత్యము ప్రశంసింపదగినది

పాణిగ్రహణము :

ఈగ్రంథమునకు తుదిని వ్రాయబడిన 'పాణిగ్రహణము', 'పశ్చాత్తాపము' అనురెండుకావ్యములందును శ్రీసుబ్బారావుగారి లేఖిని భావోన్మాదమున తాండవించినది వీనియందు దూటలూరుచున్న భావములు, పాఠకుని హృదయకమలమునందు ఆనందమకరందము నుద్భవింపజేయుచున్నవి

ఈపాణిగ్రహణ మనుకావ్యమునందు వాడుకభాషశబ్దములు విరివిగ ప్రయోగింపబడి, వృత్తమచ్చుటచ్చుట మూర్చబడెను తిమ్మరుసునోట నిందను సూచించుటకొరకును, రాయలనోట వినయము సూచించుటకును వాడుకభాష ప్రయోగింపబడెను

కళింగరాజు కృష్ణరాయని వంచింపవలయునని కంకణము ధరించినవారిలో నొకడు, కాని కృష్ణరాయలచే యుద్ధమున నోడింపబడెను. ఇందులకు ప్రతీకార మొనరింపదలచి, కూతును రాయలకొసగి, ఆమెచే నాతని జంపింప యత్నించెను. కృష్ణరాయల కీవివాహవిషయముమాత్రము జాబుమూలమున తెలియజేసెను ఆలోచింపకయే ఆత డంగీకరించెను ఈవిషయము తిమ్మరుసునకు తెలియవచ్చెను. అందులకే కృష్ణరాయనికడ కేగి,

"సమరములోన నోడియును శత్రుడు మామగమారి శాశ్వత
ప్రమదము కూర్చునం టిహపరంబుల భేదము లేకయుండగా
సమదగజేంద్రకేసరియు చారుకురంగ విలోకనప్రభా
భ్రమితముగా నృపా బిడియపడ్డది ముందరిచూపు లేకయే."

అని చమత్కారముగ మందలించుచున్నాడు తెల్లబోయిన రాజునకు, 'సన్నాహం బొకయింత లేకరికె వస్త్రా మంతయున్ చూచియే' అని సలహానిచ్చుచున్నాడు తనపొరపాటును గ్రహించుకొని 'తప్పో, ఒప్పొ, తలంపలే దది ప్రమాదంబేమొ చింతింపలే దప్పాజి కల దన్నియున్ సరిగ నేయన్ తోడ నెల్లప్పుడున్' అని కృష్ణరాయ డప్పాజీయెడ తనకుగల గాఢాభిమానమును వెలువరించెను తగిన కట్టుదిట్టములతో రాయలు "గజపతిపురి, జొచ్చినాడు పెండ్లికి సర్వశోభనముగ."

గజపతి తనకూతునకు ముందే జాగ్రత్తచేయదలచెను కాని తన భర్తను చంపుట కామె యంగీకరింపలేదు ఆశాభంగమున గజపతి తన కూతు నొకప్రశాంతస్థలమునకు గొనిపోయి.

"గజపతియింటిలో పులిముఖంబున గోవుజనించె నేటి కక్కజముగ, నిన్న నే మగడుకట్టినతాళికి తండ్రిమాట కేగుజగుజవోవు నీరకపుకూతురు పుట్టునకంటె రాయొ, రప్పా జడము లేకయినపుట్టిన సంతస మందియుందునే!"

అని తనమూఢత్వమును వెలువరించినాడు ఆతనిహృదయమునం దలజడి కలిగెనని 'నేపడిన యుద్ధపరాభవ గోష పే తిమచ్చండతరార్చులార్తునని సంబర మందితిగాని యింటిలో నుండినశత్రువుగా తెలియనోపని యంఘుడనైతి నేటికిన్' అని యున్మాదమున కలువరించెను. కృష్ణరాయ డనిన, ఆతనికి, ప్రక్కలో బల్లెమైనాడు మీదుమిక్కిలి కూతురిపలుకు లాతనిహృదయమునం దంతులేని యాందోళనము నుద్భవింపజేసెను తనపుత్రిక తనకడ కేరీతి రావలయునట

"నాయన తీర్చుకొంటెని ఋణం బిదె శత్రుని మస్తకం బిదే
తీయనివెచ్చనెత్తురులు తెస్టెలుగట్టినచేతిప్రేళ్లిదే
కాయపుసందుసందున వికావికచేసినబాకు దీనితో
పోయినప్రాణముల్ తమకమూల్యపుకానుక లంచు పల్కగన్."

తనకడ కారీతి పుత్రిక వచ్చి తన కానందమును గూర్పవలయునట ఎంతటి ఘోరకృత్యమున కాయబలను ప్రోత్సహించెనో తిలకింపుడు. అట్టిబెట్టితపుపలుకులు తనచెవిని బడినంతనే, చేయునది లేక,

"మొగము త్రిప్పెను రాయలమోజుకత్తె
క్రొత్తపెండ్లికూతురు, శాంతిగుణము రూపు
వోలె నిల్చి, తండ్రికరము మునిచి పట్టి
నట్టి చురకత్తి తనచేత నట్టెలాగి"

"మగడను ప్రేమభావ మభిమానము నీకయి వీటిబుచ్చి నీ
పగ యడగింతు ఆపయినపట్టినిచూడవు నేడె బంధముల్
తెగియెను నీకు నా కనుచు దీవ్యదఖండ తటిల్లతాదగ
ద్ధగల వెలింగిపోయె ప్రమదామణి తండ్రియె అద్భుతంపడన్."

పైన, గీటుంచిన పద్యపాదము లెంతరమణీయముగ పొందుపరుప బడినవో పాఠకులే యూహింపవలయును గజపతిపుత్రిక యప్రతిష్ఠకు గురికాకుండునట్లు కవి ప్రయత్నించెను ఆమెయందలి సౌజన్యమును నిరూపించి, మరల కొంతవరకు పితృభక్తియుతురాలని నిరూపించుటకే తండ్రియాజ్ఞ నెంతయో కష్టముమీద నెరవేర్చుట కొప్పుకొనినట్లు ప్రదర్శించెను ఆకేళికామందిరమున, 'ప్రేమస్థానకాళింగసూతదయాపాంగవిలోకన ప్రసరమాత్రత్యక్తకాఠిన్య' డగు రాజు, పాన్పుపయి పరుండియుండినపుడు, జనకుని యభిమతమును నెరవేర్ప ఎట్టులో లేచి, కాటిబిగించి, 'అంతరవ్యథన్ మొద్దయినట్టిలో ప్రణయమోహములన్ దిగజార్చు' కొనినది, గజపతిరాజుపుత్రిక 'నిద్దురమంపులోన శయనించెను రా 'జనుకొనినది, 'తలకడమున్నె సుప్తముగ దాచినకత్తిని తీసికొన్న 'ది, 'దోసిలియొగ్గి ప్రియాంఘ్రి పద్మముల్ తలపయి హత్తు' కొనినది, ఒకనిమేషము ధ్యానమొనరించినది . 'మరునిముసంబులోన పడిమాత్రము నిల్చినకత్తి రాజువేరురమున నాటుకోవలసియుండెను '—కాని

"కత్తిపోటులతో చంపగా నదేల
కుపితతావకాలోకనకుంతములనె
గ్రుచ్చి హింసింపలేకయ్యకొరకు పడిన
శ్రమము వృథయయ్యె అప్పాజిశక్తి యిద్ది"

అని పలుకుచు రాజు లేచి కూర్చుండెను . అనుకొనినట్లే యైనది—చేసినది మహాపరాధము—భారతనారీలోకమునం దిట్టిపనికి సమకట్టినవారు మందునకేని లేరు ఆమె ప్రియుని వదనారవిందమెట్లు తిలకింపగలదు? అందులకే "పార్థివుకరద్వంద్వంబునన్ మూర్ఛవోయెను కాంతామణి పాపపంకిలకళంకీభూత సౌహార్ద్రితన్"

ఈఘట్టమునందు, కవి, పాఠకుని ప్రతిక్షణము తన్మయునిగానొనరించెను పైన, గీటుంచినవాక్యములు హృదయము నుఱ్ఱూతలూపుచున్నవి శ్రీ సుబ్బారావుగారు తమమనస్సువెంట తమపాఠకునిగూడ పరుగెత్తింతురు ఈరీతి వారుచేయగల్గుటకు వారివిచిత్రపద సామగ్రియే వారికి సాయపడుచున్నది

కొన్ని దినములకు రాయలును, గజపతిపుత్రికయు సాయంవాహ్యాళి కేగినపుడు తిమ్మరుసు నోటినుండి 'గజపతియింటిలో పులిముఖంబున గోవుజనించె నేటి కక్కజముగ అందుకే తెలుగుకాంలుని నవ్వులలేత తెల్వుటంబుజములు మోముపై విరియపూచిన' దంచు వినబడెను ఆపలుకులు దంపతులచెవులబడెను ఆత్మకథను మరువ దికజనమంచు ఆంధ్రరాయలు, రాణియు మురిసికొనుచు పోయిరి వారి యప్పటితన్మయత్వ మెట్టిదో, పాఠకుని తన్మయత్వ మెట్టిదో!

పశ్చాత్తాపము:

కృష్ణరాయనికుమారుని తిమ్మరుసు చంపినందున, రాయలు తిమ్మరుసుకండ్లు తీయించి, తిండి నీ రీయక చంపినట్లు, తరువాత రాజునకు నిజముతెలిసి, పశ్చాత్తాపపడి మనోవ్యాధితో మరణించినట్లు అనుశ్రుతముగా వచ్చుకథయే దీని కాధారమని నుడివియున్నారు 'ఆంధ్రచారిత్రచతురానన' బిరుదాంచితులగు శ్రీచిలుకూరివీరభద్రరావుగారి 'తిమ్మరుసు' అనుగ్రంథమునందును ఈవిషయమునకు తగినయాధారము లున్నట్లు గన్పరచలేదు 'జీర్ణవిజయనగరచరిత్ర'కారులగు కుంమారి ఈశ్వరదత్తు (బి ఏ.) గారీవిషయమును కేవలము పుక్కిటిపురాణ మనుచున్నారు కొందరు చిన్నాదేవిసోదరుడే కృష్ణరాయనిసుతుని పరిమార్చి తిమ్మరుసుపై నేరము మోపెనని తలచుచున్నారు ఈచర్చతో ప్రస్తుతము మనకుపని లేదు. కవిచంద్రు డిచ్చట ప్రస్తరించినవిషయమే మనపరిశీలనమునకు వేచియున్నది ఇందు తిమ్మరుసుమంత్రియొక్క సుశీలము, కృష్ణరాయని యమాయకత్వము కరతలామలకమువలె గన్పట్టుచున్నవి ఇరువురకెట్టి యప్రతిష్ఠయు లేకుండ, కవి తనరచనాచాతుర్యమును విశదపరచెను

ఈకావ్యారంభము మిగుల రమ్యముగ నుండి, పాఠకుని చకితునిగా జేయుచున్నది ఆంధ్రసామ్రాజ్యనియంతయగు తిమ్మరుసు రాయల పేరోలగమున, న్యాయమూర్తులమ్రోల బందీగా తీసికొనిరాబడి విచారింపబడుచున్నాడు అతడు సామాన్యమానవుడు గాడు.

"తనమోచనామగ్నతను మాపుమౌనము పరరాజుహృది నాటు
[బాకుపోటు,
తనహర్ష వివశత్వమును మాపు చిరునవ్వు తెనుగురాజుకిరీటమునకు
[వన్నె,
తనసంశయమ్ముకీతిని మాపు తలయూపు తత్కాలజయవిరుద్ధమ్ము
[ఫలము
తన నిరుత్తరభావమును జూపుమాంద్యము అవసరానవసర మరయు
[చర్చ

తనమహామూర్తి తెల్గుమేధావి శేష
పరిణతిశ్రీని పండిన పంటగాగ
వెలుగు సచివుడు"

నేడు తనకొలువుముందు 'రాజశిశుహత్యకై అపరాధిగా కొనితేబడినాడు ఇట్టిమహామహుని నేరీతి శిక్షించునో యని వేలకొలది ప్రజలు సభాభవనమున కరుదెంచిరి

విచారణ ముగిసెనది న్యాయమూర్తులు,
'తిమ్మరుసు హత్యచేసినదే నిజమ్మ
టంచు సాక్షులు మమ్ము నమ్మించినారు
రాజశిశుహత్య క్షమియించరాని నేర
మందు కగు శిక్ష బలవంతమైన చావు'

అని తీర్పుచెప్పిరి. 'తెలుగురాజదె శిక్షవిధించినాడు.' కారాగారమునకు గొనిపోబడుచున్న మంత్రిని గాంచినపుడు జనులు 'కావలయునన్న రాజ్యముకై నిసుంగుప్రాణముల తీయగానేల? పార్థివునకె

నీళ్లతోడడా ?' అని పెక్కువిధముల తలపోసినట్లు లోకప్రవృత్తి నెరిగినకవి వర్ణించుచున్నాడు

కారాగారమున తిమ్మరుసుపడిన పశ్చాత్తాప మపారము. ఇచ్చట పాఠకుడు కంటతడిపెట్టకపోడు కవివర్యుడు తిమ్మరుసు ఆంధ్రసామ్రాజ్యమున కొనరించిన మహోపకారమును చిత్రమగురీతిని అతనిచేతనే పలికించుచున్నాడు. "పెంచితి, పెద్దజేసితి, అభీప్సితసిద్ధికి జీవవాయు లర్పించితి మొన్నదాక" అను తిమ్మరుసుపలుకులు చెవిని బడినంతనే, కృష్ణరాయనిపై పాఠకున కెంతయోకినుక కలుగకపోదు.

"మాటికి నీటికిన్ వదలుకొంటి ఋణంబు, కనుల్ కృపాణదు
ష్పాటితముల్, మనస్సు వివశం బొకచేయనిచేరపున్ విధిన్
మాటలు తొట్రిలున్ తలపుమాత్రము నీపయి లగ్నమైన దీ
పాటికిసైన ప్రాణములు బాపుము గోపకులాంగనా స్మరా !"

అనుపలుకులు హృదయమును త్రుంగదీయుచున్నవి తనకు గలిగిన యప్రతిష్ఠకు వగచి కుడువ కూడులేక, త్రాగ నీరులేక, చూడ కనులు లేక, కారాగారమున,

"　.. తిమ్మరుసయ్యవైదు
కటకటాలకు చేతులు కలియ బట్టి
మొండివారిన దేహమునుండి వెలికి
ప్రాణములుపోనిదురవస్థ పరితపించి
నాల్గురోజులు చెరలో ననాథవోలె
చితికి కృశియించి మాల్గి త్యజించె తనువు"

కన్నుల నీరుగ్రమ్మ పాఠకుడు తలయెత్తుచున్నాడు. 'తనహర్ష వివశత్వమును చూపు చిరునవ్వు తెనుగురాజుకిరీటమునకు వన్నె' యని ప్రశంసింపబడిన రాజనీతివేత్తయు, సర్వజ్ఞుడును అగు మంత్రిశేఖరునకా యిట్టిదురవస్థ తుదినికలుగుట !

తిమ్మరుసుమరణానంతరము, ఏదియో వ్యక్తి రాయలకనుల ముందు తిరుగుచు "క్షేమమ నీకు నీప్రజల్ తిన్నగ సుందురా ? సరిగ దిద్దుదువా నృపనీతిధర్మముల్ ?" అని ప్రశ్నింపదొడగెను. కూలిపోవుచు, మనోవ్యాధిచే కృశించిపోవుచున్న రాజును,

"ఈరక్తపుంబొట్టు నెవరు పెంచి రటన్న 'అప్పాజి' యనురోజు లరసికొనుము,
చనిపోవు తండ్రి యెవ్వని కప్పగించె నాకా 'అప్పాజి' కనుమాట లరసికొనుము,
ఆమహాసామ్రాజ్య మంతనీ కెల్పనాన్ 'అప్పాజి' శక్తియం టరసి కొనుము,
ఆమహారాణిపెండ్లాడినదెట్లన 'అప్పాజి'యుక్తియం టరసికొనుము"

అని యామూర్తి ప్రశ్నింప మొదలిడెను రాజు మంచముపట్టెను ఇంతలో నిజము బయటపడెను, తిమ్మరుసు నిరపరాధి యని తెలియ వచ్చెను. రాజు జీవృత్తాంతమును వినెను ; పాన్పుపైనుండి లేచి, కనుల ముందు నటించుచున్న మూర్తివైపునకు తలత్రిప్పి, "తండ్రి ప్రమొక్కుకొనెద, నన్ క్షమింపు మిక కోపము మానుము, దోషమున్న వారికి తగుశిక్ష నీవె పొనరించితి వాత్మను చీల్చినావు పో" అని వినయము వెల్లివిరియ వాపోయెను

మనోవ్యాధిచే రాజు గతించెను చనిపోవుటకు కొలదినిముసములకు పూర్వము,

"బాకీచెల్లిన దీనుమహోకథను చెప్పంజాలువా రెవ్వరున్
నాకేతప్పును కట్టిపెట్టరు, సమానంబై నశిక్షొగతిన్
నీకున్ నాకును చావు సంఘటిలె"

నని అతడు తృప్తిపడినాడు

ఎవరికిని అప్రతిష్ఠ లేదు పరులపలుకులే ఇట్టిసంఘటనమును గూర్చెను ఇట్టివిషయము నీరీతి ముగించిన కవివర్యుని సామర్థ్యము మపారము

"హంపీక్షేత్రము" లో సుబ్బారావుగారు.

ఒకగ్రంథమును వ్రాయునపు డందలికథావస్తువున కనుగుణముగ తనహృదయము నుద్దీపింపజేయుచు అందు కలిగెన యావేశములో తానొకడై కథను నడపుపట్టుల నిర్వహించగల్గినవాడే మహాకవి ఒకే కథావస్తువును, ఇరువురు కవులు వేరువేరుగ్రంథములుగా వ్రాసినచో, రెండు గ్రంథములును, కొంతవరకు కూర్పునేర్పునందును, పదసామగ్రియందును తప్ప తక్కిన విషయములయం దొకేరీతిగ నుండిన నేమిలాభము ? అట్లుండనేని కవులు తమ వ్యక్తిత్వమును తమగ్రంథములందు జొప్పించుటకు లోకమునకు విరచిరని యనవలసివచ్చును తమ వ్యక్తిత్వమును వెల్లడించుటకు కథావస్తు వెప్పుడును అడ్డు రానేరదు. తమ నిజోద్దేశ్యములను వెలువరించుటకు, కవి కం దవకాశము లభింపక పోదు మొత్తముమీద మన తెలుగునాటియందు, ఆధునికకాలమునందు వెలువడుచున్న గ్రంథములలో రచయితయొక్క వ్యక్తిత్వప్రదర్శన మంతగా కనబడుటలేదు అట్లు వ్యక్తిత్వమును తమకవనమునందు పాదుకొల్పినవారు ముగ్గురు నల్గురుకన్న నెక్కువగా లేరు.

ఆంగ్లవాఙ్మయముయొక్క ప్రోద్బలమువలన నెన్నియోక్రొత్త విషయములు మనభాషలోనికి వచ్చియున్నవి ఏకారణమువనో, ఆంగ్లవాఙ్మయమున వీనుమిగిలిన పండితప్రకాండుల గ్రంథములందు తొణకియాడుచున్న Individualism, అనగా వ్యక్తిత్వమును (లేక మూర్తిమత్త్వము, లేక పృథక్త్వమును) మనవార లెందులకో యల వరచుకొనలేదు. ఈ Individualism ప్రథమమున ఫ్రెంచిదేశమునకు చెందిన టిల్లేయనువానిచే ప్రతిపాదింపబడెను క్రీ. శ ౧౬-వ శతాబ్దమునుండి వ్రాయబడిన గ్రంథములం దిది కావవచ్చుచున్నది. ఆంగ్లకవిపుంగవులగు మిల్టను, స్పెన్సరు, షేక్స్పియరు మొదలగువారి రచనములయందు కరతలామలకమువలె నిది గన్పట్టుచున్నది. ఫ్రెంచిదేశమునకు చెందిన మాన్టజిన్ (Montaigne) వ్యక్తిత్వముయొక్క యుత్కృష్టతను పెక్కువిధముల ప్రశంసించియున్నాడు.

"నన్ను నేనే వర్ణించుకొనెదను. నా విజ్ఞానచక్షువును నాలోనికే త్రిప్పుకొని నన్ను నేనే పరిశీలించుకొనెదను. నాగ్రంథములు నాతో నేకీభూతమైయున్నవి. నేనును, నాగ్రంథములును ఒకేబాటవెంట నొక్కరీతిని నడయాడెదము. లోకము నన్ను తెలిసికొనదలచిన నా గ్రంథములను తెలిసికొనిన చాలును. తన్ను దానే తెలిసికొని, తన్ను దా చిత్రించుకొనుట మానవుడు ప్రపంచమునందు చేయు ఘనమగు పనులలో నొకటి నేను లోకమున జీవించియుండునది కొలదికాలము మాత్రమే. ఈకాలమునందు నాజీవితానుభవమును గ్రంథములందు వెల యించి, దానియమూల్యతను లోకమునకు వెల్లడింతును" అని యతడు నుడివియున్నాడు అందులకే Individualism న కంతగౌరవము చేకూరినది. మనపూర్వకవులకు తిక్కనమొదలగువారియం దిది గన్పట్టు చున్నది. ఇప్పటికవులకున్న యవకాశములు వారి కప్పుడు లేవు. వారు, అనువాదముల త్రోవలో పడిపోయినను సమయముదొరకిన నొ తమ నిజాభిప్రాయములను వెలువరింపకపోలేదు.

ఆధునికాంధ్రకవుల కెన్నియో విధములగు నవకాశములు గలవు. తమవ్యక్తిత్వము (Individualism) ను తమరచనములందు వెలువ రించుటకు వెనుకంజ వేయకుండుటయే సమంజసము.

'హంపీక్షేత్రము'ను చదువువారు, కర్త నెపుడెఱుంగకున్నను అది యొకయువకునిచే వ్రాయబడినదని తప్పక గ్రహింతురు. గ్రంథము నంతయు పరిశీలించిన ప్రతిపద్యమునందును, ప్రతివాక్యమునందును ఏదియోయుత్సాహము వెలువరింపబడినట్లే తోచును. గ్రంథకర్త తన వ్యక్తిత్వము నీగ్రంథమున చక్కగా వెలువరించెను అతడు లోక మే మనుకొనునో యని వెనుకాడలేదు అతడు కవి; నిరంకుశుడు. అతని కలమున కేదియు నడ్డురానేరదు. సుబ్బారావుగారిని తెలిసికొనవలయు ననిన 'హంపీక్షేత్రము' నొకింత విమర్శకదృష్టితో చదివిన చాలును.

సుబ్బారావుగారు ఆంధ్రోద్యమముపట్ల మిగుల నభిమానమును జూపెడివారు. ఆంధ్రదేశమనినను, ఆంధ్రభాషయనినను వారి కొరవ ప్రాణము.

"పొంగిపోయినయెడదలో పుటముపెట్టి
రగులజొచ్చెను మాదుసామ్రాజ్యనాశ
నంపు తలపులు"

అని ప్రథమముననే వాపోవుచున్నారు. పూర్వకాలమునందలి యాంధ్ర శిల్పులు నిర్మించిన 'నుడిగోపురంబులు సభాస్థలులైనవి కొండతుచ్చు గుంపుల' కని వ్యాకులతను విశదపరచుచున్నారు. ఆంధ్రవైభవము పూర్తిగ నశించినట్లు వారికి నమ్మకము లేదు. ఏనాటికైనను మరల నాంధ్రాభ్యుదయమునకు తగినవసతులు గలవనియే వారినమ్మకము. ఈయుద్దేశ్యమును సూచించుటకే తెలుగున రత్నశాలలో నేదియు రేగిపోక, చెరగిపోక నేటికిని నిలచియున్నవని వచించియున్నారు విద్యారణ్యస్వామివారిని వీరు ప్రశంసించుట కాదికారణము 'తెల్గు భువనప్రళయంబున కడ్డుకట్టవేసిన మహనీయమూర్తి' యనియేకదా! ఇట్టిది వీరి యాంధ్రాభిమానము.

వీరు, ఆంధ్రుల కపకీర్తి వచ్చిన సహింపజాలరు. రామ రాయలు తళ్ళికోటకడ ప్రవర్తించినవిధము వీరికి నచ్చలేదు. అందులకే హృదయమునందలి యావేశము నణచికొనజాలక, ఆంధ్రాభిమానమును చంపుకొన నేరక, తళ్లికోటయుద్ధమువలన విపులాంధ్రావనికి గలిగిన యపారనష్టమును మరచిపోనేరక "రామరాజు బంగారుగద్దెపై రణ మునందె, కొలువుకుదిరె మాయాంధ్రుల కొంపకాల్ప" అని భావో న్మాదమున పలికిరి.

శ్రీ సుబ్బారావుగారు యువకులు. వారిదేహమునందు వెచ్చని రక్తము ప్రవహించుచున్న దినములందే వారీగ్రంథమును వ్రాసిరి. తిరుమలరాయడు రెండువందలగజముల వెడల్పుగల కొండగొందెను కాపాడనేరక పారిపోయి, ఆంధ్రరాజ్యరామ కంతులేనివైధవ్య మునుగూర్చినాడని వినినంతనే, వారిహృదయము పొంగిపొరలినది. తామే యాదినములలో బ్రతికియున్నచో తా మానెగొందెను కాపాడి యుండుమని సుబ్బారావుగారు తలచిరి నిజముగా నాత డట్టిశౌర్య వంతుడే! ఒకసారి బందరుహోస్టలులో, హోస్టలుగేటుమూసి, మడత మంచపు ఇనుపచువ్వ చేగొని నాలుగువందలరౌడీల నడ్డగించిన శూరుడు. ఒకవైపాంధ్రరాజ్యమునకు కలుగుచున్న స్థితి, వేరొకవైపు తెనుగువీరుడు పారిపోయినాడే యనెడి నిరుత్సాహము, వేరొకదిక్కు ఆనెగొందెను రక్షించుటలో నున్నచులుకదనము సుబ్బారావుగారి హృదయము నొక్కసారి కలచివైచినవి. అందులకే,

"రెండువందల గజముల కొండగొందె
విపులసామ్రాజ్యచక్రము విరిగిపడును."

అని యుద్రేకముతో పలుకుచున్నారు. 'మొదట రేనితో నేల చెప్పగాలే వశక్తి?' 'చావకయే క్షతమైనలేకయే' ఏల పారిపో వలసివచ్చెనని తిరుమలరాయని ప్రశ్నించుచున్నారు. 'వేయికి చాలుపో తెలుగువీరు డొకం' డని వారిధైర్యము.

ఒకింతప్రాయముమిగిలినకవినోటివెంట నిట్టిపలుకులువచ్చునా? తరుణప్రాయమునందలి హృదయావేగమునకిది చక్కని నిదర్శనము.

సుబ్బారావుగారికి భారతీయకర్మలయందు నమ్మకము, అభి మానము కలవు 'వైదికకర్మలౌకికప్రేరణమయ్యె మంత్రవిధులే గద నిత్యము వృద్ధిమూలముల్' అని 'రాజ్యప్రదానము' న నుడివి యున్నారు శ్రీనాథుడు, 'హిందూమతోద్ధరణోందూదయవికాస చాలితాధ్యాత్మప్రచారములకు' మనసుపడియే ప్రౌఢరాయల మంది రమున నడుగుపెట్టెనట. మరియు తిరుమలరాయడు ఆనెగొందెకడ పారిపోయినందులకు, కవి, 'శాపంబుచేత నాశనమైన దనరోయి అటువంటిశక్తి నేడరుదుగాన', 'గ్రహచారవశము సంగతి నమ్మ జాలరు, కలికాలమందు రిక్తమది గాన' అని పలికి వానియందు తమకుగల యభిమానమును, నేటికాలమున నవి పరిగణింపబడనందులకు దుఃఖమును వెలువరించిరి.

పురాణములకు, చరిత్రలకు విశేషభేదము లేదనియే వీరిమతము. వీరికి పురాణములు కల్పితములు గావు.

"రామయ్య మర్కటరాజుతో భాషించుగుట్ట రాయలవారి కోటకొమ్మ"

. .. ... .

"ఈజీర్ణకుగ్రామ మేమిచూపించును తెనుగురాజు పండిన యశస్సు"

అనుపద్యములు వీరు పురాణములకును చరిత్రకును వింతగా సమన్వయమును గూర్చుపద్ధతిని విశదముచేయుచున్నవి.

"ద్రోణులు లేరు భీష్ములును తోచరు "
"బభ్రువాహను డయ్యపై నెత్తిగెల్చుట
యాగాశ్వమునకు పోరాడుకొనుట
. .. . ..."

మొదలగుపద్యములు వారికి పురాణములందలి యభిమానమును వ్యక్తపరచుచున్నవి.

శకునములనిన వీరికొకింత నమ్మికము లేకపోలేదు.

"కృష్ణవేణీతరంగిణి స్తబ్ధమై పోయి
కదల మానిన జాడ గాంచలేదు"

అనుపద్య మిందులకు నిదర్శనము.

కొలదివయస్సునందే భూదేవికి భారమైపోయినను, సుబ్బారావుగారు లోకప్రవృత్తిని అప్పుడే చక్కగా గ్రహించిరి. అందులకే 'ఈ మనుజకోటి స్వభావము మార్చుకోదు; దుర్భరముగ దెప్పిపోయును ప్రపంచక వైఖరులెల్ల చిత్రముల్' అని నుడివియున్నారు వేరొకచోట, తిమ్మరుసుచే పరాత్పరుని ధ్యానింపజేయునపుడు, "విధిన్ తలక్రిందొనరించలేవు నీవైనను, మంచిచెడ్డలు స్వయంకృతముల్ అనుభూతిముక్తముల్" అని పలికించి తనువిజ్ఞానమును వెలువరించియున్నారు.

ఇన్నివిధముల సుబ్బారావుగారు తమపాఠకులకు తమయుద్దేశ్యములను వెలువరించిరి

'హంపీక్షేత్రము' నందు పాఠకులచే మేలు మేలనిపించుకొనగలవారిలో వీరమనీ డొకడు. తిమ్మరుసు, కృష్ణరాయలు మొదలగువారి పాత్రపోషణలు మిగులచిత్రముగ నున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానిని ప్రస్తుతము విడువవలసివచ్చినది.

ముగింపు :

శ్రీసుబ్బారావుగారు మరికొన్నివత్సరములు జీవించియున్నచో నెట్టి యుద్గ్రంథములను వెలువరించియుండెడివారో యని పాఠకుడు గ్రంథమంతయు చదివినతరువాత వేడినిట్టూర్పు విడువకపోడు

సుబ్బారావుగారికవితకు రీతియున్నది అది వైదర్భియని పీఠికకర్తలు నిర్ణయించిరి. అందులకే వీరికావ్యము తక్కువరకములోనిది కానేరదు.

ఈగ్రంథమునందు శబ్దాలంకారము లచ్చటచ్చట గలవు. అర్థాలంకారములును గలవు. అవి శ్రమపడితెచ్చినవి కానందున కావ్యమున కలంకారమును గూర్చుచున్నవి; అవి యావేశమువెంట కవి కెరుక లేకయే వచ్చుటచేత మిగుల రమ్యముగ నున్నవి.

"వైరికుంతములు వైరి, కాంతలకుంతలములు
కృత్తములుగా గణించి పొంగిరట ప్రజలు"
"ప్రపంచకవైఖరులెల్ల చిత్రముల్."

మొదలగువానిని ఉదాహరణములుగా తీసికొనవచ్చును పీఠికవనమునందు క్రమాలంకారములు చాల గలవు మరియు

"దుర్గపట్టణం బెండినయేటిదిబ్బవలె
నెట్లిటు బీటలు విచ్చిపోయెనో!"
"నీలిమబ్బుల నిగనిగలాడు సాయగము"
"తెలిమబ్బుల గబగబనడచులాఘవము"
"మబ్బుదివ్వెలకు తళతళ గాడెడి తళుకు"
"వర్షాభ్రములకు జలుజిల్లు మరిపించు చలువ"
"పంపాసరస్సులోపల లేతతరగలో విరుపుకన్పింప నీవేళగూడ"

మొదలగు పద్యపాదములు ధ్వనిసహితములై, కవివర్యుని ప్రకృతిపరిశీలనానైపుణ్యమును తెలియజేయుచున్నవి

ఈ కావ్యమునందు,

"తెలుగుకవిరాజు రాయలకొలువుముందు
చరణమును మోపె సభయు నిశ్శబ్దమపుడు"
* * * *
"తెల్గుభువి రక్తమందు ప్రాయింతె మ్లేచ్ఛుని దౌర్జన్యము?"
* * * *
"గౌతమీగర్భపంకం బెండబెట్టినచాళుక్యశౌర్యవర్చస్సువెలుగు"
* * * *
"తెలుగురా జద శిక్షవిధించినాడు
తిమ్మరుసు మోము రాజుకై త్రిప్పలేదు"
* * * *
"మొగము త్రిప్పెను రాయలమోజుకత్తె"
* * * *

మొదలగు వాక్యములు హృదయము నుద్దీపింపజేయగల్గునవి చాలగలవు.

'అనేకగుణము లీచిన్నిపొత్తములో నున్నవి ఇందందు శబ్దగతదోషములును కలవు అవి చాలస్వల్పములు మహరాజు, కలబడె, హార్తికుడు మొదలైనవి పరంజాయనుశబ్ద మీయనప్రయోగించెను ఇది అన్యదేశ్యము దీనినే శిష్టుకృష్ణమూర్తికవి పరందాయని ప్రయోగించెను. ఇది పుర్దాశబ్దభవము. ఈదోషములు బహుగుణకమైన ఈకావ్యములో పట్టింపుకు రావు. 'ఏకోహిదోషోగుణసన్నిపాతే నిమజ్జతి' అనుపీఠికకర్తలవాక్యములు పేర్కొనదగియున్నవి.

ఏమనుకొనిననేమిలాభము? రిక్క రాలిపోయినది. దానికై పరితపించుచు వెదకినను మరల దొరకుననునాశ లేదుకదా!



# గురులఘు స్వరూపము



జాస్తి వేంకటనరసయ్య

గురులఘునిర్ణయము ఛందశ్శాస్త్రమునకెల్ల మూల మనువిషయ మందఱికిఁ దెలిసినదే. గణముల కూడి కచే బద్యము లుత్పన్నమగుననియు, గణములుకూడ గురులఘుసంయోగముచేతనే యేర్పడుననియుఁ దెలిసియేయుండును. ఇట్లు ఛందశ్శాస్త్రంబునకు మూల భూతంబు లగు గురులఘువుల స్వరూపమును గూర్చి విమర్శించునపుడు శీఘ్రముగా విషయములు గొన్ని బుద్ధిగోచరములు కామింజేసి చిక్కులు సంభవించుచుండుట సహజము. కొంచెము లోతుగా నాలోచించినచో యథార్థస్వరూపము తెలియకపోదు. గురులఘుస్వరూపంబును గూర్చి నాకుఁ దెలిసినవిషయములఁ గవిజనాశ్రయలక్షణప్రకారము గొన్నింటి వివరించెద.

"ఒక్కమాత్ర లఘువై ద్విమాత్రకము గురువయ్యెన్" అని కవిజనాశ్రయంబున భీమకవిగారు గురులఘువులకు లక్షణముఁ జెప్పిరి. అనఁగా నొక్కమాత్ర గల వర్ణము లఘువనియు, రెండుమాత్రలుగల వర్ణము గురువనియు నర్థము. కడవ, తలుపు, వనిత- ఇత్యాది పదంబులందలి వర్ణములెల్ల నేకమాత్రకంబులై పైలక్షణముచొప్పున లఘువు లగుచున్నవి. ఇట్లే బాలుఁడు, కాయ- ఇత్యాదిపదంబులందలి దీర్ఘాక్షరంబులు ద్విమాత్రకంబులై గురువు లగుచున్నవి. కాని చెలఁగున్, వనితన్ ఇత్యాదులందలి గున్, తన్ అను నక్షరంబులు సంయుక్తాక్షరపూర్వవర్ణతుల్యంబులే కావున గురువులైనను ద్విమాత్రకములుమాత్రము కాకున్నవి; వ్యంజనమర్ధమాత్ర యను న్యాయంబున సార్ధమాత్రకంబు లగుచున్నవి. మఱియు 'అనఁగాన్' అనుచో 'గాన్' అను గురువు సార్ధద్విమాత్రక మగుచున్నది. ఇట్లే ప్లుతముగూడ త్రిమాత్రక మైనను గురువే యగుచున్నది. కావునఁ గవిజనాశ్రయలక్షణముప్రకార మేకమాత్రకము లఘువనుటలో దోషంబులు గనుపింపకున్నను ద్విమాత్రకము గురువనుటలో నవ్యాప్త్యతివ్యాప్తులు పెక్కులు గనఁబడుటంజేసి పైలక్షణము సర్వత్ర వర్తింపనేరదనియు, ఒక్కమాత్ర గల యక్షరము లఘువనియు, నంతకంటె నధికముగల యక్షరము గురువనియుఁ జెప్పనొప్పునని జయంతి రామయ్య పంతులుగారు కవిజనాశ్రయపీఠికలో వివరించియుండిరి.

కాని యీనిర్ణయముకూడ సరిపడుచున్నట్లు తోఁచదు. పంతులుగారి నిర్ణయముప్రకారము చెలఁగున్, వనితన్-ఇత్యాదులందలి గున్ - తన్ అనునవి సార్ధమాత్రకంబు లెట్లగునో తెలియకున్నది. వ్యంజనమర్ధమాత్ర యను న్యాయమున గున్ (గ్, ఉ, న్.) అనుదానిలోని వ్యంజనద్వయ మేకమాత్రకమయినను ఉకారముకూడ నేకమాత్రకమై, యయ్యది మొత్తము మీఁద ద్విమాత్రక మగుచున్నది. ఇట్లే తన్ (త్, అ, న్.) అనునప్పుడుకూడ ద్విమాత్రకమనియే గ్రహింపవలయు. మఱియు 'అనఁగాన్' అనుదానిలో 'గాన్' అనునదియు,దీర్ఘమునకు రెండుమాత్రలు, వ్యంజనద్వయమున కొకమాత్రయుఁ గలిసి త్రిమాత్రక మగుచున్నది. కాని పంతులుగారు చెప్పినట్లు సార్ధద్విమాత్రక మగుట లేదు. ఇట్లే యేకమాత్రకములగుటచే లఘువులని నిర్ణయించిన వనిత, కడవ-ఇత్యాదులందలి వర్ణములుగూడ వ్యంజనమర్ధమాత్ర యను న్యాయమున సార్ధమాత్రకము లగునుగాని యేకమాత్రకములు గానేరవు.

వీనినిబట్టిచూడఁగా నజ్విశిష్టములుకాని వ్యంజనము (పొల్లుహల్లులు) లర్ధమాత్రకము లనియు, నజ్విశిష్టములయినచో నావ్యంజనములకు మాత్రాగణన

యుండదనియుఁ బంతులుగా రభిప్రాయపడినట్లు తోఁచుచున్నది లేకున్న 'వనితన్' అనుదానిలో వకార మేకమాత్రకమనియు, 'తన్' అనునది సార్ధమాత్రకమనియు గ్రహించుటకు వీలుండదుగదా?

"ఒక్కమాత్రలఘువై ద్విమాత్రకము గురువయ్యెన్" అనులక్షణముచొప్పునను, వ్యంజన మర్ధమాత్రయను న్యాయమునను గురులఘుస్వరూపము నిర్ణయింపఁదలఁచినచో నవ్యాప్త్యతివ్యాప్తిదోషంబులు రాకమానవు ఏకమాత్రకము లఘువని చెప్పినచో వచ్చు నవ్యాప్త్యతివ్యాప్తు లేవన,

అతఁడు, ఇతఁడు-ఇత్యాదులం దేకమాత్రకంబులయిన అకార, ఇకారములు లఘువులే యగుచున్నవి కాని 'అప్పుడు' అనుపదమున నేకమాత్రకమైనను అకారము గురువగుచున్నది ఒక్కమాత్ర లఘువను లక్షణమిచ్చటఁ (లక్ష్యమునందుఁగూడ) బ్రవర్తించుట లేదు కావున నవ్యాప్తిదోషము గలదు

ఆపదమునందే వ్యంజనద్వయమునకు నొకమాత్రయు, నచ్చున కొకమాత్రయుఁ గలిసి రెండు మాత్రలుగల 'ప్పు' అనునక్షరము లఘువగుచున్నది ఒక్కమాత్ర లఘువనులక్షణము లక్ష్యేతరమునందుఁ గూడఁ (రెండుమాత్రలుగల 'ప్పు' అనుదానియందు) బ్రవర్తించుచుండుటచే నతివ్యాప్తిదోషము గలదని యెఱుంగవలయు ఇట్లే 'కార్త్స్న్యము' అనుపదములోనున్న 'ర్త్స్న్య' అనునది సార్ధత్రిమాత్రకమైనను లఘువే యగుచున్నది ఈవిధముగా నెన్నిహల్లులున్నను మాత్రాసంఖ్య పెరుగునేకాని సంయుక్తాక్షరము గురువు మాత్ర మగుటలేదు కావున నిట్టిపదములందెల్ల యెడల నతివ్యాప్తిదోషము గలదని తెలిసికొనవలయును ఇట్లేకమాత్రకమగు నక్షరమే కొన్నిచోట్ల లఘువనఁబడుటయు, మఱికొన్నితావుల గురువనఁబడుటయు, నెన్నిమాత్రలుగలిగియున్నను సంయుక్తాక్షరము లఘువే యనఁబడుటయుఁ జూడ నేకమాత్రకము లఘువనుట పొసఁగనేరదు ఇఁక ద్విమాత్రకము గురువనిచెప్పినచోఁ గలుగు నవ్యాప్త్యతివ్యాప్తుల విచారింతము.

ఆతఁడు, ఈతఁడు - ఇత్యాదులందలి ద్విమాత్రకంబులయిన ఆకార, ఈకారంబులు గురువులే యగుచున్నవికాని, 'అప్పుడు' అనుచో 'ప్పు' అనునది ద్విమాత్రకమైనను లఘు వగుచున్నది ద్విమాత్రకము గురువను లక్షణ మిటఁ (క్వచిల్లక్ష్యేఽపి) బ్రవర్తించుటలేదు గావున నవ్యాప్తిదోషము గలుగకమానదు

అదేపదమునందు నేకమాత్రకమైనను అకారము గురువగుచున్నది రాముడిత్యాదులలో సార్ధద్విమాత్రకమగు 'రా' అనునదియు, 'అనఁగాన్' ఇత్యాదులలోఁ ద్రిమాత్రకమగు 'గాన్' అనునదియు గురువులే యగుచున్నవి ఇట్లు లక్ష్యేతరమునందుఁ గూడ నీలక్షణము ప్రవర్తించుచుండుటంజేసి యతివ్యాప్తిదోష మిట ననివారిత మగుచున్నది పైరీతిని రెండుమాత్రలకంటెఁ దక్కువగానున్నను, నధికముగానున్నను గూడ గురువే యగుచుండుటంజేసి ద్విమాత్రకము గురువనుట సరిగాదు.

ఇట్లీగడబిడయంతయు మాత్రలఁబట్టి గురులఘు నిర్ణయము చేయఁబూనుటవలన సంభవించుచున్నది హ్రస్వ, దీర్ఘ, ప్లుతత్వములనునవి యజ్ధర్మములేగదా! ఈవిషయమునే పాణిన్యాచార్యులవా రజ్భేదముల నిరూపించునవసరమున "ఊకాలోఽజ్ఝ్రస్వదీర్ఘప్లుత" యని (అష్టాధ్యాయి ౧ అ ౨ పా ౨౭ సూ) హ్రస్వదీర్ఘప్లుతభేదములచే నచ్చుల త్రైవిధ్యమును జెప్పచు సూచించిరి కాని హల్లులకుమాత్ర మీహ్రస్వదీర్ఘప్లుత భేదముల నిరూపింపలేదు హ్రస్వదీర్ఘప్లుతభేదముల సులభముగాఁ దెలిసికొనుటకుఁగాను సంస్కృతవైయాకరణులే మార్గాంతరములఁ జూపిరి "ఏకమాత్రో భవేద్ధ్రస్వ ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే, త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయ" అనఁగా హ్రస్వ మొక్కమాత్రగలదనియు, దీర్ఘము రెండుమాత్రలుగలదనియు, నట్లే ప్లుతముగూడ మూఁడుమాత్రలుగలదనియు నర్థము. హ్రస్వ మొక్క-

# కేరళ సబ్బులు

## సబ్బు లన్నిటిలోను శ్రేష్ఠతరమైనవి



### నా ముఖమువలెనే మృదువైన ముఖము!

ప్రియసఖీ! ఔను కారణమేమన, క్షౌరపుసబ్బే క్షౌరమునకు ఉల్లాసము కలిగించి, చర్మమునకు మృదుత్వము నిచ్చును. స్టిక్‌గాను లేక గిన్నెరూపమునందును దొరకును

### కోల్‌తార్ సబ్బు

ఇది వ్యసనముతో నుండుబిడ్డలకు ఆనందమును చేకూర్చును క్రిములను నాశన మొనర్చి సొగసును గలిగించును గజ్జి, గడ్డలు, వాళ్ళు, గీరలు, చమటపొక్కులు మొదలగు చర్మవ్యాధులను హతమొనర్చును చాల్‌మ్రగనూనె యిందులో చేరియున్నది మిక్కిలిసున్నితమగు శరీరమున కిది వాడతగినది

### కేరళ చందనసబ్బులు

చల్లదనము నిచ్చును మంచి సువాసనను వెదజల్లును ఉల్లాసమును గలిగించును.

### శరీరముయొక్క అందము వృద్ధియగుటకు కేరళ వేపసబ్బుల నుపయోగింపుడు

ఔషధసంబంధమైన టాయిలెట్ వేపనూనె సత్తువ యిందులో పూర్తిగా చేరియున్నది దీనితో స్నానము చేసిన మిక్కిలి ఆనందముగా నుండును

### ఇతర మేలైన టాయిలెట్ రకములు

గోల్డ్‌క్రీమ్, మల్లె, వట్టివేరు, రోజా, లవెండర్ వగైరా

## కేరళ సోప్ ఇన్‌స్టిట్యూట్, కల్లికోట.

ఇండియా రాజప్రతినిధియు, గవర్నరుజనరలు నగు శ్రీశ్రీశ్రీ అరల్ ఆఫ్ వెల్లింగ్‌టన్‌గారికిని, శ్రీశ్రీశ్రీ మద్రాసు గవర్నరుగారికిని సబ్బులను తయారుచేసి, సరఫరా చేయువారు

# ర్యో స్పీడ్‌వాగెన్సు అండ్ ట్రక్కులు

**1, 1½** టన్నుల క్రొత్తమాడల్సుతో సరుకులు రవాణా చేయుము.
తక్కువధరలతో ఎక్కువ లాభము గూర్చు ట్రక్కులు.



ఈ రెండు రకముల ట్రక్కులును ర్యో కంపెనీవారి **30** సంవత్సరముల యింజనీరింగు పరిశ్రమ ఫలితము. మిక్కిలి నిర్దుష్టమయిన యంత్రనిర్మాణము. ప్రజామోదము బడసినవి. అధిక వేగముగలవి. కొలది ఖర్చుల తగులుబాటు మున్నగునవి యీ ర్యో క్రొత్తమాడల్సుయొక్క అపూర్వ లక్షణములు.

డిస్ట్రిబ్యూటర్లు —

రాణే (మద్రాసు) లిమిటెడ్,

మౌంటురోడు, మద్రాసు





1 ఆంధ్రనాటకకళాపరిషత్తు తృతీయ సమావేశము, చెన్నపురి—అధ్యక్షులు టి రాఘవాచార్యులుగారు

2 కోయంబత్తూరు ఆంధ్రవిద్యార్థి నాటకసమాజమువారి 'రాణాప్రతాపు' ప్రదర్శనము





1 కవిసార్వభౌమ రవీంద్రునకు విశాఖపట్టణ కవితాసమితి సమ్మానపత్ర సమర్పణము 2. గుంటూరు సాహిత్యమండలి



మార్కండేయ సంరక్షణము
**(Siva Saving Markandeya)**

— A. Venkatasubba Rao.







1 చెన్నపురి విశ్వకళాపరిషత్తు నూతనపట్టభద్రులు, 2 అఖిలభారత మహిళా విద్యావిషయక పరిషత్తు, చెన్నపురి





1 నరసారావుపేట మహిళాసారస్వతసమాజపు వార్షికసమావేశము, అధ్యక్షురాలు రాయసము రత్నమ్మగారు
2 రాజమండ్రి వీరేశలింగ శరణాలయ విద్యార్థినులు

మాత్రగలదియనఁగా నొక్కమాత్రకాలములో నుచ్చరింపఁబడుననియు, నట్లే దీర్ఘము రెండుమాత్రలకాలములో నుచ్చరింపఁబడుననియు, ప్లుతము మూఁడుమాత్రల కాలములో నుచ్చరింపఁబడుననియు, నిట్లు కాల నిర్ణయముఁ జేసి తద్ద్వారా వారికు లాభేదముల సుభముగ గ్రహించునట్లు చెప్పఁబడినదని గ్రహింపవలయు అచ్చుల నుచ్చరించుటకుఁ గావలసిన కాలమును నిర్ణయించిచెప్పుటచేఁ బ్రసంగవశమున హల్లులకుఁగూడఁ జెప్పవలసియున్నందున "వ్యంజనం త్వర్ధమాత్రకమ్" అనఁగా వ్యంజన మర్ధమాత్రకలదని (అర్ధమాత్రకాలములో నుచ్చరింపఁబడునని) చెప్పఁబడెను ఇట్లాయావర్ణములయొక్క పరస్పరభేదములఁ దెలిసికొనుటకుఁగాను మాత్రాభేదము కల్పింపఁబడినదే కాని వేఱుగా దానివలన సాధింపఁదగిన ప్రయోజనము లంతగాఁ గానరావు కావున హ్రస్వాదిసంజ్ఞ లచ్చుల కనిన్నే తెలియనగును ఈ హ్రస్వాదిసంజ్ఞలఁబట్టియే గురులఘునిర్ణయము చేయఁబడినది

"హ్రస్వంలఘు" (అష్టా ౧ అ ४ పా ౧౦ సూ) అనఁగా హ్రస్వమైనయచ్చు లఘువని యర్థము. దీనికిఁ గాలనిర్ణయము చేయవలసివచ్చినచో "ఏకమాత్రో భవేద్ధ్రస్వ" యనుటచే నొక్కమాత్రకాలములో హ్రస్వ ముచ్చరింపఁబడునని నిర్ణయింపఁబడుట చేతను, హ్రస్వమే లఘుసంజ్ఞగలదియని చెప్పఁబడుట చేతను, లఘు వొక్కమాత్ర కాలములో నుచ్చరింపఁబడునని తెలియుచున్నది అనఁగా లఘువు నుచ్చరించుటకు నొక్కమాత్రకాలము పట్టునని యర్థము

"సంయోగే గురు" (అష్టా ౧ అ ४ పా ౧౧ సూ) సంయుక్తాక్షరమునకుఁ బూర్వమందుండు వర్ణము (అచ్చు) గురువని యర్థము "దీర్ఘంచ" (అష్టా ౧ అ ४ పా ౧౨ సూ) దీర్ఘవర్ణము (అచ్చు) గూడ గురువని యర్థము ఈగురువునకుఁ గాలనిర్ణయము చేయవలసివచ్చినచో "ద్విమాత్రో దీర్ఘ ఉచ్యతే" అనుటచే రెండుమాత్రలకాలములో దీర్ఘ ముచ్చరింపఁబడునని చెప్పుట చేతను, దీర్ఘమునకు గురుసంజ్ఞ గలదనుటచేతను గురువు రెండుమాత్రలకాలములో నుచ్చరింపఁబడునని తెలియుచున్నది గురువు నుచ్చరించుటకు రెండుమాత్రలకాలము పట్టునని నిర్ణయింపఁబడినదికదా? సంయుక్తాక్షరపరకమగు పూర్వవర్ణము (హ్రస్వాచ్చు) గురువేకావున నదికూడ రెండుమాత్రలకాలములో నుచ్చరింపఁబడునని గ్రహింపవలయు ఇంతకుఁదేలినదేమనఁగా ఛందశ్శాస్త్రప్రకారముగా నచ్చులు గురులఘుభేదముచే ద్వివిధములుగా నుండుననియు, గురువు రెండుమాత్రల కాలములో నుచ్చరింపఁబడుననియు, లఘు వొక్కమాత్రకాలములో నుచ్చరింపఁబడుననియుఁ దెలియుచున్నది ప్లుతమగునచ్చు మూఁడుమాత్రలకాలములో నుచ్చరింపఁబడునని యెఱుంగవలయును గణములఁ గూర్చునప్పుడు ప్లుతమునకుఁగూడ గురుత్వవ్యవహారమే కనుక గురులఘుభేదముచే నచ్చులు ద్వివిధములని పైనిజెప్పఁబడినది (సంస్కృతవైయాకరణమతానుసారముగ నాంధ్రవైయాకరణులచే దూరాహ్వానాదులయందుఁ ద్రిమాత్రకమగు ప్లుత మంగీకరింపఁబడినదేకాని దీర్ఘము నంగీకరించుటయే లఘుమార్గమని తోఁచుచున్నది) ఇట్లే వ్యంజన మర్ధమాత్రకాలములో నుచ్చరింపఁబడునని తెలియుచున్నది వ్యంజనములలో హ్రస్వాదిభేదములు లేవు గావున వానికి విధించిన గురుత్వాదిభేదములుకూడ హల్లులకు లేవని యెఱుంగవలయు కాఁగా వ్యంజనములఁబట్టి గణభేదములు గలుగుటలేదనియు, గురులఘుభేదములుగల యచ్చులను బట్టి గణభేదము లేర్పడుచుండుననియు విశదమగుచున్నది గణభేదము లేర్పడుటలో వ్యంజనములతో బొత్తుగాఁ బనిలేదని తలఁపఁగూడదు గురులఘుభేదములఁబట్టి గణభేదములు గలుగుటచేతను, గురుత్వలఘుత్వము లజ్ధర్మములగుటచేతను నట్లు చెప్పఁబడినదే కాని హ్రస్వాచ్చులకు గురుత్వము నాపాదించుటలో వ్యంజనములేకదా హేతువులగుచుండును పైవిషయములవలనగురులఘుభేదమునుబట్టి మాత్రానిర్ణయము

చేయవలెఁగాని మాత్రాభేదమునుబట్టిమాత్రము గురు లఘునిర్ణయము చేయరాదని వ్యక్తమగుచున్నది గదా? ఈవిధమగు దృష్టితోఁ బరికించిన బూర్వోక్తలక్ష్యము లన్నియు సరిపడఁగలవు

గురులఘువు లేవో నిశ్చయించుకొని పిమ్మట నుదాహరణంబులఁ బరికింతము ఆంధ్రభాషయం దచ్చులలో దీర్ఘాక్షరములు, జడ్డక్కరముల బొట్టుల పెఱుందకడ నూఁదినయక్కఅములును గురువులనియుఁ, దక్కినవి లఘువు లనియుఁ దెలియవలయును ఇట 'నూఁదిన' యను విశేషణసామర్థ్యముచే నుత్తరపదాదియందు సంయుక్తాక్షర ముండి పూర్వపదాంతమున హ్రస్వాక్షర ముండినచో నా హ్రస్వాక్షరము లఘువేయని గ్రహింపవలయును నెఱసున్నకుఁ బూర్వమందున్న యక్షరము లన్నియు నూఁదిపలుకఁబడునని తెలిసికొనవలయును పీరల్, అనిరꣳ - ఇత్యాదిపదములందుఁ బొల్లులతోఁ గూడిన హ్రస్వాక్షరములుగూడ సంయుక్తాక్షర పూర్వ వర్ణతుల్యములుగానే గ్రహింపవలయు నని తెలిసియే యుండును ఇఁక నుదాహరణములఁ బరికింతము

అతఁడు, ఇతఁడు-ఇత్యాదులందలి అకార, ఇకారములు లఘువులు కనుకను, లఘువు నుచ్చరించుటకు నొక్కమాత్రకాలము పట్టునని నిర్ణయింపఁబడుటచేతను నావర్ణము లేకమాత్రకములని గ్రహింపవలయును అప్పుడు, ఇప్పుడు ఇత్యాదులందలి అకార, ఇకారములు సంయుక్తాక్షరపరకము లగుటచే గురువు లయినవి కావునను, గురువు నుచ్చరించుటకు రెండుమాత్రలకాలము పట్టునని నిశ్చయింపఁబడుటచేతను నావర్ణములు ద్విమాత్రకము లని చెప్పవలయును ఆపదములందే యున్న 'ప్పు' అను నక్షరమునందలి ఉకారము దీర్ఘాక్షరముల లోను, జడ్డక్కరముల బొట్టుల పెఱుందకడ నూఁదిన యక్కరములలోను జేరకుండుటంజేసి గురువుకాదు గావున లఘువే యని గ్రహింపవలయు. దీనికిఁ గాలనిర్ణయము చేయవలయునన్న నొక్కమాత్రకాలములో నుచ్చరింపఁబడునని యెఱుంగునది ఇట్లే మంచము, వనితన్ ఇత్యాదులందలి మకారతకారములయం దున్న యచ్చులు పైలక్షణముప్రకారము గురువులనియు, వాని నుచ్చరించుటకు రెండేసిమాత్రలకాలము పట్టుననియుఁ దెలిసికొనవలయు మఱియు నాపదములందలి చ, ము, వ, ని అనునక్షరములందున్న యచ్చులు లఘువులే యగును గావున వాని నుచ్చరించుటకు నొక్కొక్కమాత్ర కాలము పట్టునని యెఱుంగునది

ఇదియంతయుఁ జూడ లఘు వేకమాత్రకమనియు, గురువు ద్విమాత్రకమనియుఁ జెప్పుట సమంజసమని తోఁచెడిని అట్లుకాక యేకమాత్రకము లఘువు, ద్విమాత్రకము గురువు అనిచెప్పినచో మాత్రలఁబట్టి గురులఘు నిర్ణయము చేయవలయునని యపార్థస్ఫూర్తి గలుగుచుండును దీనికే (ఈభీమనగారి లక్షణమునకే) యన్వయక్రమమునఁ బదవిపర్యాసముచేసి చెప్పినచో సరియైనయర్థము లభింపఁగలదు అనఁగా నర్థముచెప్పుకొనునప్పుడు లఘువొక్కమాత్ర,గురువుద్విమాత్రకమని పదక్రమము మార్చుకొనవలెనని గ్రహించునది భీమనగారు పద్యములోఁ జెప్పునప్పుడీపదములనే క్రమము మార్చి చెప్పిరి పాణినీయసూత్రపరిచయ మేమాత్రమున్నను బ్రతివారికి నయ్యది స్పష్టముగా నర్థము కాకపోదని తోఁచెడిని.

---

# పాలకురికి సోమనాధకవి - అక్షరాంక పద్యములు

బండారు తమ్మయ్య

గతసంవత్సరాదిసంచికలోఁ బ్రకటితమయిన సోమనాథుని యక్షరాంకగద్య యవతారికలో నీ యక్షరాంకపద్యములఁ గూర్చికూడ నించుక ప్రశంసించి నా యొద్దనున్న ప్రతిలోఁ గవి పాఠములను సరిగా గుర్తింప నేరనంతయెక్కువగా లేఖకదోషములు దొరలియున్నవని వ్రాసియుంటిని చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకాలయములో దీనికిఁ బ్రత్యంతరము లుండుననని యెఱింగి యచ్చటి యొండురెండు ప్రతులతో సంప్రతించి వ్రాసిన ప్రతినొకటి నా మిత్రులు బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్య(M A)గారి ద్వారమునఁ బడసి దానిని నా ప్రతిని బర్యాలోచించి యతికష్టముతో లేఖకదోషములను జాలవఱకు సవరించి యిప్పు డీపద్యముల నిట్లు ప్రకటంచుచున్నాను నాయొద్దనున్న ప్రతి కర్నూలుజిల్లా, కంబముతాలూక, అర్ధవీడుగ్రామములో నామిత్రులు శ్రీయుత చిమిరేల వీరభద్రయ్యగారి యింటనున్న తాళపత్రగ్రంథమునుండి నేను వ్రాసికొనినది అదియుఁ, జెన్నపురినుండి యిప్పుడు పడసిన ప్రతియు రెండునుగూడ లేఖకదోషములలో నొకదానికొకట తీసిపోవునవికావు పద్యములు సంస్కృతపదభూయిష్ఠము లగుటను, లేఖకులు సంస్కృతభాషా జ్ఞానము లేనివారగుటను సామాన్యలేఖకదోషములకుఁదోడు పలుతావులందుఁ గవిపాఠములు మఱుగువడి దుర్గమార్థములగు సందిగ్ధపాఠములు నెలకొనినవి కావున వెనుకటిసంచికలోఁ బ్రకటితమయిన గద్యకృతులలోవలెనే యిందుఁగూడ నర్థసౌకర్యమునకయి నేఁజేసిన సవరణలను గుండలీకరణములలోఁ గనఁబఱుచుచు నట్టియెడ నా ప్రతులలోని సందిగ్ధపాఠములను, తక్కినతావులందలి ప్రధానపాఠాంతరములను దిగువను బ్రదర్శించితిని

గతసంచికలోఁ బ్రకటితమయిన యక్షరాంకమాలికయు, నీ యక్షరాంకపద్యములు రెండును గలిపి సోమనాథుఁ డక్షరాంకగద్య యని పేరిడినట్లు కానవచ్చును అట్లగుటనేకాఁబోలు నీపద్యములచివరఁ గూడ "అక్షరాంకగద్యసంపూర్ణ"మని యున్నది అంతమందలి "లక్షణపద్య" అనుపద్యముగూడ నీయంశమును స్ఫురింపఁజేయును బసవపురాణపీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు, అక్షరాంకగద్య పేరితో నక్షరాంకమాలికలోని యాద్యంతములఁ గనఁబఱుచుచు "అక్షరాంక శ్లోకములునుగలవు" అని లిఖించినారు వారుద్దేశించిన శ్లోకములీపద్యములే యైయుండునని నాయభిప్రాయము కాని యిందలి సంబోధనములన్నియు సంస్కృతపదభూయిష్ఠములయినను "(క)కారనుతంబసవేశపాహిమాం" అను పద్యమకుటము కేవలము సంస్కృతభాషారచితమయినను, ఈ పద్యములను సంస్కృతశ్లోకములుగా గణింపరాదని నాయాశయము ఆద్యంతములందలి కందపద్యములు రెండును, షట్పదిభేదములుగాఁ గానవచ్చు చివరరెండుపద్యములును గాక యిందలి పద్యములన్నియు ఉత్పలచంపకమాలికావృత్తములు సంస్కృతశ్లోకములందు విశ్రమస్థానమున్నను మనతెలుఁగుపద్యములలోని యతినియమముంబోలిన వర్ణనియమ మందులో లేదు ప్రాసనియమ మసలే లేదు కర్ణాటభాషలోఁ బ్రాసనియమ మున్నదికాని తెనుఁగులోవలె యతినియమము లేదు విశ్రామవిషయమున నది సంస్కృతభాషామర్యాదనే యనుసరించును "కోణకెక్కమతియిల్ల, కన్నడకెయతియిల్ల" (దున్నపోతునకుమతి లేదు, కన్నడమునకు యతిలేదు) అను సామెత సుప్రసిద్ధము ఈ యక్షరాంకపద్యములలో యతినియమము పాటింపఁబడక యొక్క ప్రాసనియమముమాత్రమే పాటింపఁబడినది ఒండురెండుచోటుల "కరుణిసు" (కరుణింపుము), "రవణిసు" మున్నగు కన్నడపదము లుపయోగింపఁబడినవి ఆద్యంతకందములలోను, చివరనున్న రెండుపద్యములందునుగూడఁ గన్నడపదములు వాడఁబడినవి కొన్నిచోట్ల, అకారాంత సుబంతశబ్దసంబోధనములు కొన్నిటికి దీర్ఘములు గూర్పఁబడినవి ఈ కారణములచే వీనిని సంస్కృతశ్లోకములనికాని, తెలుఁగుపద్యములనికాని తలంచుటకంటె సంస్కృతపదభూయిష్ఠములగు కన్నడపద్యములని యెంచుటయే సమంజసము "లక్షణపద్య " అనుచివరిపద్యములో సోమనాథుఁడు వీనిని పద్యములనియే యుదాహరించినాఁడు ఈతని శిష్యప్రశిష్యుఁడును, పద్యబసవపురాణకర్తయు నగు పిడుపర్తి సోమనాథుఁ డీతనికృతులను బేర్కొనుచు వ్రాసిన "బసవపురాణంబు పండితారాధ్యులచరితంబు ననుభవసారమును " అను సీసపద్యములో "అక్షరాంకగద్యపద్యముల్" అనివ్రాసి వీనిని పద్యములనియే యుగ్గడించినాఁడు కావున నేను వీని నక్షరాంకపద్యములనియే పేర్కొంటిని పేరికిఁ గన్నడపద్యములయినను సంస్కృతపదజటిలములగుటచే సంస్కృతభాషాజ్ఞానముగల తెలుఁగువారికిఁ గన్నడులకుఁగూడ నివి సమానముగనే పఠనీయములు కాఁదగును?

అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడగు పరమేశ్వరుఁ డక్షరుఁడు, అక్షరస్వరూపుఁడు ఈ భావమునే సోమనాథుఁడు మొదటి పద్యములో "అక్షరకాయస్థనె" అను సంబోధనముచే సూచించి

నాఁడు కావుననే యక్షరాంకుఁడగు నీశ్వరున కక్షరాంకస్తుతియే సముచితమని సోమనాథుఁ డీయక్షరాంకగద్యరచనమునకు దొరకొనెనని తలంపనగును. సంస్కృతములో "సాంబసదాశివ, సాంబసదాశివ, సాంబసదాశివ, సాంబశివ" అనుమకుటముతో పరమేశ్వర మాతృకావర్ణమాలాస్తోత్రమను పేరితో నొకప్రాచీనస్తోత్రము విన వచ్చుచున్నది. అచ్చులు పదునాఱు, హల్లులు ముప్పదినాలుగు, లకార భిన్నమగు ళకారము కలిపి మొత్తమేఁబదియొక్కటి వర్ణములకు నేఁబదియొక్కటిపాదము లందుఁ గూర్పఁబడినవి. కాని యొండురెండు పాదములలోఁదప్ప నక్షరాంకనియమ మాపాదములపొడుగునను నిర్వహింపఁబడినట్లు కానరాదు. మఱియు నందులోఁ గేవల మావర్ణమునే, యొక్క అకారస్వరముతోఁగూడినదానినే కైకొనవలెననెడి నియమముగూడఁ బాటింపఁబడలేదు. అదియునుంగాక ఌ, ఞ, ఙ, మొదలగువర్ణములతో నారంభింపవలసిన పాదములు ళికారసన్నిహితమగు లకారముతోను, ఞ, ఙలతోఁగూడిన సంయుక్తాక్షరములతోను గ్రమముగ "లింగస్వరూప", "జ్ఞానాజ్ఞాన వినాశక నిర్మల" "స్థావర జంగమభువనవిలక్షణ" అని ప్రారంభింపఁబడినవి. ఆవర్ణమాలాస్తోత్రస్వరూపము తెలియుటకయి మచ్చునకు నాలుగైదుపాదముల నుదాహరించుచున్నాను.

"అద్భుతవిగ్రహ, అమరాధీశ్వర అగణితగుణగణ, అమృతశివ,
సాంబ "

"ఇందుకళాధర, ఇంద్రాదిప్రియ, సుందరరూప సురేశశివ
సాంబ "

"ఉరగాదిప్రియభూషణ, శంకర, నరకవినాశ, నటేశశివ,
సాంబ "

"దుఃఖవినాశన, దళితమనోభవ, చందనలేపిత చరణ శివ,
సాంబ "

"ఫాలవిలోచన, భానుకోటిప్రభ, హాలాహలధర, అమృతశివ,
సాంబ "

సంస్కృతభాషలోనున్న యిట్టి యొకటిరెండు స్తోత్రములే, మనసోమనాథుని యీ యక్షరాంకస్తోత్ర రచనమునకు మార్గదర్శకములు కానోపును. కాని యాతఁడు నియమముల నెక్కువచేసికొని యాయక్షరాంకరచనము నతినిపుణముగ నిర్వహించినాఁడు. గత సంచికలోఁ బ్రకటితమయిన యక్షరాంకమాలికను, ఈ యక్షరాంక పద్యములను బాగుగాఁ బరికించిన యీ విషయము తేటపడఁగలదు. అక్షరాంకమాలికలోవలె నీపద్యములలో, అ, ఆ, మున్నగుస్వరాక్షరములన్నిటికి వేర్వేఱు పద్యములను గూర్పక సోమనాథుఁడు స్వరాక్షరములతో నారంభించు సంబోధనముల నన్నిట నొక్క చంపకమాలికావృత్తములోనే యిమిడ్చినాఁడు. వ్యంజనాక్షరములకుమాత్రము వేర్వేఱుపద్యములను వ్రాసినాఁడు. మఱియు వీనిలో ఆయావ్యంజనాక్షరములపయి, ఆ, ఇ, ఈ, మున్నగు నితరస్వరముల నేమియు గూర్చక, ఆదిస్వరమగు అకారముతోఁ గూడిన వ్యంజనములతోడనే సంబోధనముల నన్నిటని గావించినాఁడు. ఙ, ఞ, ణ, అను వర్ణములతోఁ బ్రారంభింపవలసిన సంబోధనములలో నీవర్ణములను గేవల మూఁతకయినిల్పిన జల్లివర్ణములుగనో, లేక అజ్ఞానచిహ్నకములుగనో సోమనాథుఁడు గైకొనినటు కానగును. అనన్యసామాన్యమగు సోమనాథుని యత్యద్భుతప్రతిభ నాతని యితరకృతులతోపాటు యీయక్షరాంకపద్యములుగూడ బాగుగా బ్రకటింపఁగలవు. పద్యములన్నియు బసవాంకితములయినను నంపలి సంబోధనములన్నియు శివపరములే. ఈతని యితరగద్యకృతులలోని సంబోధనములుగూడ జాలవఱకిట్టివే. ఇందుకుఁగారణము వివరింపనక్కఱలేదు. బసవేశ్వరుఁడు నందికేశ్వరావతారమని వీరశైవుల విశ్వాసము. సోమనాథుఁ డాతని నట్లే తనకృతులలో వర్ణించినాఁడు. నందీశ్వరుఁడు ద్వితీయశంభుఁడని శైవాగమపురాణప్రసిద్ధము. కావున సోమనాథునిదృష్టిలో శివునకు బసవేశ్వరునకు భేదమేమియు లేదు. చివరికందములోని "ఉమాపతినిమగ" అనుదానియందలి భావమిదియే. పద్యమకుటమందలి "(క) కారనుతం" అనునొక్కన్ని తావులందును "నుతం" అనుపదము ప్రతులన్నిటిలో తకారదీర్ఘముతో "నుతాం" అనియున్నది. ఒకటి రెండు చోటులమాత్రము బిందువు లోపించి "నుతా" అని యున్నది. "నుతా" అనునదియే కవిపాఠమయినచో దానిని "బసవేశ" యనుసంబోధనమునకు విశేషణముగ గ్రహింపవచ్చును. కాని దీనిని సోమనాథుఁ డాత్మపరముగ షష్ఠ్యర్థద్వితీయైకవచనమగు "మాం" అనుపదమునకు విశేషణముగ "(క) కారనుతం" (కకారముచే నుతించువానిని) ఇత్యాదిగా వ్రాసియుండునని నాయభిప్రాయము. నుతుఁడనఁగా "నుతింపఁబడినవాఁ"డనియే కాని "నుతించువాఁడ"ను నర్థము పొసఁగనేరదు. కాని సోమనాథున కిట్టి కర్మార్థకవిశేషణములను (Past Participles) కర్త్రర్థకములుగఁగూడ నుపయోగించుట చాలవఱకుఁ బరిపాటి. ఈపద్యములలోనే "వందితామరాసుర" "నర్మవిజితేంద్రసుతా", "నమస్కృతభావపరంపరావసానమహితదేశ", "ధరితధరాధరాధిప", "యమోదరశిక్షితశూల" మున్నగు ప్రయోగములను జూచునది. కావున "నుతం" అనునదియే కవిపాఠమయియుండునని తలంచి సర్వత్ర దానినట్లే ప్రకటించితిని. ఈపద్యములలో టవర్గాక్షర పద్యములన్నియు శివుని తాండవలీలలను వర్ణించునవిగా నున్నవి. అట్టిపద్యములను రచించుట సోమనాథునివంటి "సంగీతశాస్త్ర పారగు"నకే తగును. వ్రాఁతప్రతులలో నీపద్యములు భిన్నపాఠములతో నున్నవి. సరియైన కవిపాఠములను గుర్తింప ననువుగాకున్నది. కావున వానిని ఛందోబద్ధమొనర్చి యేదోయొకరూపమునఁ బ్రకటించితిని. ఈయక్షరాంకపద్యములందలి సంబోధనములన్నియు "ఛదాంకమృగాంకవిగ్రహా", "ఛత్రయపత్రయాధిక" అనురెండు తప్ప దక్కిన వన్నియు నేదోయొకవిధముగ నర్థముచేసికొంటిని. పయి రెండు

సంబోధనములందును గలి యుద్దేశించిన యర్థము విస్పష్టముగ లేదు ధనశబ్దమునకు శకలమనునర్థము నైఘంటికము కాకున్నను గౌణముగ నట్టియర్థమును సోమనాథుఁడు గ్రహించియుండునేమో యని తలంచి "శకలమంకముగాఁగలిగిన చంద్రుని ధరించినవాఁడు" అని యీ సంబోధనమున కర్థము చేసికొని యర్థసౌకర్యమునకయి "విగ్రహా" అనునది "కల్పకా" యని మార్చితిని ఇఁక రెండవదానిమాట విచారింతము 'ధ' శబ్దమునకు గృహమను నర్థమున్నది దానినిబట్టి యాశబ్దమునకు "లోకము" అనునర్థమును గౌణముగ గ్రహించి "ధత్రయము = లోకత్రయము, దానిని బాలించు మూర్తిత్రయము ధత్రయపత్రయము, ఆత్రిమూర్తులకు నధిపుఁడు ధత్రయపత్రయాధిపుఁడు" అనునర్థము పొసఁగునేమో విజ్ఞు లాలోచింతురుగాక సంస్కృతవ్యాకరణసూత్రములచే సాధింపరాని, "కద్రువాత్మజా", "జగజ్జనయిత్రికల్పిత", "వరపారిషన్నిచయ", "ధరిత" మన్నను ప్రయోగము లీపద్యములలో నచ్చటచ్చట గానవగును అవి లేఖకదోషములనుటకు వీలులేదు సోమనాథుఁడే వాని నట్లు వాడియుండునని నాతలంపు కేవలము సంస్కృతపదజటిలములయిన యిట్టిపద్యములను సంస్కృతాంధ్రకర్ణాటములలోఁ గలిపయక్షరజ్ఞానమయినను లేని నావంటివాఁడు పరిష్కరింపఁబూనుట సాహసమేయగును కాని సంస్కృతాంధ్రకర్ణాటాదిభాషలలో నపూర్వము నిట్టియక్షరాంకనియమముతో నప్రమేయప్రతిభావిలసితములగు నిట్టిపద్యములు దిక్కుమొక్కులులేక మూలలఁబడి ఖిలముగుటచూచి సహింపలేక వాని నేదోయొక రూపమున నిట్లు ప్రకటింప సాహసించితిని విజ్ఞులు నాయజ్ఞానమును మన్నించి యీ పద్యములను బరిశుద్ధముగఁ బరిష్కరింతురుగాక యని ప్రార్థించెదను

అక్షరాంక పద్యములు

క శ్రీయుత నమశ్శివాయే
త్యాయుత పంచాక్షరీప్రణవసంభూత
స్వాయత్తభావ, అక్షర,
కాయస్థనె, నిం పొగళ్వె నాన్ బసవేశా! ౧

ఉ శ్రీతుహినాద్రిజాధిప,
అకార ఉకార మకార బిందునా
దాతిశయాత్మకప్రణవ
పూర్వసమాకలితోన్నమశ్శివా
యేతి భవన్ముఖోద్భవ
షడక్షరసంభవ తద్విలీన వి
ఖ్యాతపరా స్వరాద్యఖిల
వర్ణనుతం,[2] బసవేశ పాహి మాం ౨

చ అమితయశస్క, ఆద్యయన,[3]
ఇద్రుచి, ఈశ్వర, ఉగ్ర, ఊర్జిత
క్రమ, ఋషభాంక, ౠజహార
ఌస్థిత, ౡస్మిత, ఏకరుద్ర, ఐం
ద్రమహితరూప, ఓమితిప
దద్యుతి, ఔజ్జ్వలభాల,[4] అంబికా
సమరసభావ, అంకలిత
వర్ణనుతం బసవేశ, పాహిమాం ౩

చ కరుణిసు, కర్తృకప్రణుత
కల్మషదూరగ కద్రువాత్మజా[5]
భరణ, కనత్కళానిధి క
శంకకపర్ద, కపాలమాలికో
త్కరధర, కల్పితాంబుజభ
వాండకరండకదంబ కర్మసం
హార విషకర్మకర్మర, క
కారనుతం బసవేశ పాహిమాం ౪

చ. ఖరకరకోటితేజ ఖగ
రాడ్ధ్వజవంద్య ఖలాతిదూర, ఖ
స్ఫుర (దసమాంబకాంక)[6] ఖము
ఖాఖిలతత్త్వశిరోంత, ఖప్రవా
హరుచిరజూటకూట,[7] ఖమ
రుచ్ఛిఖితోయధరాత్మసోమభా
స్కరజనయిత్రివిగ్రహ! ఖ
కారనుతం, బసవేశ, పాహిమాం ౫

చ గణనికురంబసేవిత, గ
తిప్రదనైజ, గరిష్ఠపుష్టష
డ్గుణ, గళితప్రపంచ, గణ
నాధికతేజ, గవీశకేశవ

౧ భవోన్నతోద్భవ ౨ నుతాం, నుతా ౩ ఆస్య, ఇనఇద్రుచి ౪ లలామ ౫ కద్రవా ౬ దశమాంచితాంగ దశమంబరాంక ౭ జూట

ప్రణుత, గరాంకకంఠ, గమ
నాగమనేత్ర, గర్వితారిబ
ర్హిణ, గతకాయమాయక, గ
కారనుతం, బసవేశ, పాహిమాం ౬

చ ఘటితజగత్ప్రఘుర్ఘణఘు
రట్ట, ఘనాఘుఘునాఘనౌఘదు
ర్ఘటపవమాన, ఘర్మజవి
రించిముకుంద, ఘనేభ౮ శుభ్రది
క్తటయశ, (ఘుస్రక)౮ త్రిపుర
ఘుస్మర, ఘట్టిత (గాంగ)౧౦ వీచిసం
ఘటఘనచారుమస్తక, ఘు
కారనుతం, బసవేశ, పాహిమాం ౭

చ జతిమిరకర్కశార్క, జగ
జ్జేంద్రమృగేంద్ర, జసూత్రదాత్ర, జ
(స్థిత)౧౧ ఘనజాతవాత, జధ
ర్త్రిఖనిత్ర, జదావదావ,౧౨ జ
క్షితిజకురారధార, జస
రోజమదేభ, జకాలకాల, జ
క్షితిధరశంబడంబర, జ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౮

చ చతురకళావిధిజ్ఞ, చతు
రాగమవేద్య, చతుర్ముఖాచ్యుతా
ర్చిత, చరితార్థిసేవిత, చతు
ర్దశలోక (భృదం)౧౩ తరంగ, చ
ర్చితసతతోపలాలన, చ
రాచరలింగనిజాంగ, ౧౪ చతురు
ద్గత౧౫రవిచంద్రమోనల, చ
కారనుతం, బసవేశ, పాహిమాం ౯

ఉ ఛత్రపతాకముఖ్యసితలక్ష్మ, ఛ
దాంకమృగాంక (కల్పకా)౧౬
ఛత్రయపత్రయాధిక, ఛ
ల (ద్విపరూపకదిత్యపత్యహా
జైత్ర)౧౭, ఛటచ్ఛటోద్భట, ఛ
టాటనతాండవమూర్తి, ఛద్మదై
త్యత్రిపురాఘహారక, ఛ
కారనుతం బసవేశ, పాహిమాం ౧౦

చ. జలజజమస్తహస్త, జల
జాంబకదృగ్జలజాంకపాదుకా
జలజ, జరారుజాపహార,
జన్మవివర్జిత,౧౮ జహ్నుకన్యకా
సలిల (కణాభిషిక్తజటి
లాంగ),౧౯ జగజ్జనయిత్రికల్పితా
సులభజడాతిదూరగ, జ
కారనుతం, బసవేశ, పాహిమాం ౧౧

చ ఝగుణనిరాకులాత్మ,౨౦ ఝష
కేతనచేతనభస్మసాత్కృతి
ప్రగుణిక్షఫాలనేత్ర, ఝుడి
తిగ్రసనాగ్నినిభస్ఫురన్మహో
గ్రగరళకాలకంఠ, ఝష
మస్తకకూర్మకపాలకోలదం
(త)౨౧గతవిభూషణోద్ధుర, ఝ
కారనుతం, బసవేశ, పాహిమాం ౧౨

చ ఞవిరహితాత్మవేద్య, ఞత
(మస్తత)౨౨ విష్ణువిరించిమధ్యసం
భవమహితో౨౩ రులింగ, ఞమ
దాందసముద్ధతదండభృన్మనో
భవముఖదుష్టనిగ్రహా, ఞ
పూర్వక తత్త్వసముద్భవస్థితి
ప్రవిలయనాదికారణ, ఞ
కారనుతం, బసవేశ, పాహిమాం ౧౩

---

౮ ఘనాభ్ర ౯ పుష్కర, ఘస్మర ౧౦ ఘూంక, ఘూంకు ౧౧ స్మిత. ౧౨ వహ్ని ౧౩ ద్రుతాం, ధృతాం, వ్యాదం ౧౪ దృఢాంగ, ౧౫ గ్ధుత ౧౬ విగ్రహా ౧౭ ఛలద్విపికుప్యదదిత్యహత్యహాఛత్ర, ఛలద్విపినస్య దదిత్యపత్యజిజ్జైత్ర ౧౮ దురగ ౧౯. జటాభిషేక జనిమాంగ, జలాభిషిక్తజతిమాంగ ౨౦ నిరాసకాత్మ ౨౧ ష్ట్రి ౨౨ తమస్తమ, తమస్తక ౨౩ రహితో

చ. టటకిట టట్టకిట్టటట
కిట్టటటట్టట కట్టటట్టకి
ట్టటకిటటట్టకిట్టటకి
టట్టటటోన్ముఖటంకృతిస్ఫుటో
త్కటపటహాదినిస్వనవి
యత్తలదిక్తటతాటితార్భటో
ద్భటపటుతాండవాటన, ట
కారనుతం, బసవేశ, పాహిమాం. ౧౪

చ. రవణిసు, వాయజాయ,[౨౪]
అనుజాయనవాయమహాయ[౨౫]ముఖ్యరా
యవిరచనాను మధ్యవిలు
రద్గతిపూరిత శుధసాళగో
(త్థవి)[౨౬] విధరాగయోగరవ
ణాంగతదంగ మృదంగసుప్రభం
ధవహనతాండవాటన ర
కారనుతం, బసవేశ, పాహిమాం ౧౫

చ డమరుగజాత డండడమ్మ
డండమ్మ డండమ్మ డండమ్మండమ్మం
డమ్మణ మ్మడండ డండమ్మణ
డండడ డండమ్మ డండమ్మండమ్మం
డమ్మణమ్మడండ డంకృతివి
డంబితఘూర్ణిత విస్ఫురజ్జగ
త్ప్రమథన తాండవాటన డ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౧౬

చ ఢణఢణ ఢంమ్మఢంమ్మఢణ
ఢంమ్మణ ఢంమ్మణ ఢంఢణోద్ధణం
ఢణనటనత్వదీయడమ
రూత్థమదార్భట ఢంకృతిప్రజృం
భణనటితాభ్రతారగణ
రాజదినేశముఖగ్రహప్రఘు
ర్ఘణగుణతాండవాటన, ఢ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౧౭

ఉ ణణ్మ్రణ ణత్తణణ్మ్రణణ
ణణ్మ్రణ ణణ్మ్రణ ణత్తణణ్మ్రణ
ణ్ణణ్మ్రణనృత్తత్వదీయసుగ
విక్రమజృంభణ సంచలన్నభో
ణ్ణణ్మ్రణ దిక్కవణణ్ణణ్మ్రణణ
ణణ్మ్రణణణ్మ్ర ణణ్మ్రణ స్వన
ణ్ణణ్మ్రణ తాండవాటన,ణ
కారనుతం, బసవేశ, పాహిమాం ౧౮

చ తరుణశశాంకలక్ష్మ, తరు
ణార్కసహస్రకసత్కిరీట, త
త్పురుషముఖాంక తన్ముఖము
ఖోగ్ర[౨౭]ముఖాసమతత్త్వసాత్కృతో[౨౮]
త్పరిగత తత్త్వనాయక, త
(రత్తమ)[౨౯] తత్త్వవిశేషశబ్దవి
స్తరకరకీర్తిసత్తమ, త
కారనుతం బసవేశ, పాహిమాం ౧౯

చ ధగుణవిరక్తసక్త, ధవి
కారవిహీనహృదిస్థ ధప్రపం
చగతతమోవికార, ధన
ముక్తచరాచరధాత ధక్రియా
వగతవిచారదూర ధము
ఖాఖిలసౌమ్య సమర్పితప్రసా
దిగణమనోరథప్రద, ధ
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౦

చ. దమితదశాంతరాంకుర[౩౦] ద
శాస్యశిరోదశకార్చితోద్ధత
ప్రమథ దయామయాపఘన
దర్పకదర్పకదేహదాహ ద
క్షమఖనిరాసదక్ష దశ
పుష్టిసమగ్రపరిగ్రహాంగ ద
త్తమహితలక్షణాక్షర ద
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౧

౨౪ ఘాయిజాయి ౨౫ అనుజాయినపాయి మహాయు ౨౬ ధ్రువ ౨౭ ఖోగ్ర ౨౮ తాత్వికా ౨౯ తరత్తమ, తరచ్యు తమప్ర విశేష ౩౦. రాతుర.

చ ధరితమరుద్ధరాధరధ
నుద్ధరణీధరకాండదోర్ద్వయా!
ధరితధరాధరేంద్రతన
యార్ధవపు కలితార్ధవిగ్రహా!
ధరితధరాధరేంద్రధర
వాగ్ధరభూధరమస్తమాలికా!
ధరితధరాధరాధిప, ధ
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౨

చ నమదమరేంద్ర నర్మ (విజి
తేంద్రసుతా)[౩౧] నతబభ్రు (వాగ్భవ[౩౨])
ప్రముఖ (సురాధిపస్తుత)[౩౩] న
మస్కృతభావపరంపరావనా
నమహిత దేశ నవ్యనట
నద్వయలోల నవీనగానసౌ
ఖ్యముదితలీనమానస న
కారనుతం బసవేశ, పాహిమాం ౨౩

చ పరమపరంపరాపర పర
ప్రకృతిప్రకృతి ప్రపంచవి
స్తర పరమస్వతంత్ర పర
మేశ్వర పశ్వధిపా పరంతపా
పరపరతత్త్వభాసురత
దీయపరాపరకారణత్రయా
పరపరమాంబరాపర ప
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౪

చ ఫలితభవత్పదాంబుకణ
మిశ్రితశీతలవాయుభు (క్ష్ణా[౩౪])
కలితఫణీంద్రహార ఫణి
రాడ్జటిలాంక ఫణీశ్వరోరుకుం
డల, ఫణినాధకంకణ, ఫ
ణీశఫణామణిముద్రముద్రితాం
గుళ ఫణిరాజపూజిత ఫ
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౫

చ బహుళయశస్సమగ్ర, బల
వత్పురబర్హణ బద్ధపాతకా
పహ, బలసూదనార్చిత, బ
లిప్రహరస్తుత, బ్రహ్మచూళికా
వహన (భయ్య)[౩౫] ప్రవాహ బహు
మాన్యగుణాఢ్య బలాఢ్యపారిష
ద్బహుళగణనాయకప్రియ బ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౨౬

చ భవ, భసితాంగ, భర్గ, భగ
వర్గణ భక్తభటార్పితాపున
ర్భవపద, భర్మవీర్య, భరి
తాఖిలలోక, భయాపహార్త, భ
క్తవివశ, భక్తిభావ, భవ
వర్జిత, భావభవప్రభావిభా
భవసుఖదుఃఖదూరగ, భ
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౭

చ మఖహర మర్దితాధ్వర, మ
హేశ్వర మన్మఖ (దివ్యదీశ)[౩౬] మ
త్కులగురుదేవ, మత్తమద
వారణవారణ,[౩౭] మస్తమాలికా[౩౮]
వలయ, మహానుభావ, మరు
దర్చితపాద, మహీధరాత్మజా
మలినమనోనురంజన, మ
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౮

చ యమిజనసంస్తుతక్రమ య
మోదర (శిక్షిత)[౩౯] శూల యక్షవి
ర్దమన యశస్సమగ్రతర,
యక్షవరప్రియ, యక్షగేయ, య
జ్ఞముఖ (మరున్మునీంద్రనుత)[౪౦]
యజ్ఞవిధిజ్ఞ యథేష్టచర్య య
జ్ఞమధనవీరవిగ్రహ, య
కారనుతం, బసవేశ, పాహిమాం ౨౯

---

౩౧ విజితేంద్రియతా ౩౨ బాధవ ౩౩ విరోధిసంస్కృత, నరాధిపసంస్కృత ౩౪ కృపాలా ౩౫ వయః, వయత్ ౩౬ దివ్యదీన, దివ్యదీన ౩౭ చర్మధరాస్థి ౩౮ మౌక్తికా ౩౯ భిక్షిత ౪౦ మరుత్ప్రియః ప్రవర, మరున్మునిప్రవర

చ. రజతనగాధివాస, రజ
నీకరజూట, రమా (వరాక్షినీ
రజపరిలక్ష్య)[౪౧] పాద, రజ
నీచరరాట్సుర (రాట్స్ఫురత్పదాం)[౪౨]
బుజ, రచితాఖిలాండ, రమ
ణీరమణైకశరీర, రక్షిత
త్రిజగదఘాపహారక, ర
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౦

చ. లసితదృగంచలాంచలవి
ధూతమలత్రయ లక్ష్యలక్షణో
ల్లసితగుణాలవాల లకు
లీశగణేశ లయాఽ (గమాఽతుర[౪౩])
ప్రసరవిపల్లతౌఘలఘు
నైకలవిత్ర లతాంతమార్గణ
గ్రసనలలాటదృచ్ఛిఖి, ల
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౧

చ. వరద, వరేణ్య, వర్య, వరి
వస్యితవత్సల, వందితా (మరా)[౪౪]
సుర, వరపారిషన్నిచయ
వల్లభ, (వర్ణిత)[౪౫] వర్గభృద్వచో
వర, వసుధా (ధవాదిసుర
వర్ణ్య)[౪౬] వసుద్యుమణీందుకోటిధి
క్కరణ, వశీకృతాంగజ, వ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౩

చ. శమిత (సమస్తపాప),[౪౭] (శమ
నోన్మదనుచ్ఛమన)[౪౮] త్రిశూల, శ
మ్య[౪౯] మనియమాదిమాలయ, శ
రద్ఘనసన్నిభభాస్వదంగవి
భ్రమ, శశలక్ష్మలక్ష్మ, శబ
రేశ్వర, శర్వ, శమాత్మకార్చిత
క్రమ, శరభోగ్రవిగ్రహ, శ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౩

చ. షడధికతత్త్వమస్యపర,[౫౦]
షట్త్రికషట్త్రికతత్త్వపీఠ, ష
డ్జడ(రహితప్రభామహిత
జన్మ)[౫౧] (షడష్ట)[౫౨] దళాబ్జమాళికా
షడృతుసవర్ణ, షడ్గుణస
మగ్ర, షడక్షరపూర్వమూర్తిమన్
షడహితతత్ప్రభాఽమయ,[౫౩] ష
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౪

చ. సరసిజనేత్రనేత్రసర
సీరుహసంగత సౌమ్యపాదుకా
సరసిజ, సస్మితాననస
రోజ, సరోరుహగర్భమాళికా
సరసిజ సఖ్యహస్తకర
సారస, సత్యసమేతభక్తహృ
త్సరసిజపద్మసంచర, స
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౫

చ. హర, హరిణాంక (హవ్యవహ
హర్యతిభాసురదృక్త్రియోజ్జ్వలా)[౫౪]
హరిహరిదేహతక్షక, హ
తాఖిలదైత్య, హరిప్రియాశ్రయా
హరివపురర్ధమర్త్యవపు
రర్ధతదీయ నృసింహరూపసం
హర, హరివందితక్రమ, హ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౬

చ. ళలితకళావిలాసమృగ
శక్మవిలక్ష్మ, ళసత్సదాఘనో
జ్జ్వలగళకాళిమాంక, ళల
(నాంకకళాలలితార్థ)[౫౫] దేహకో

౪౧. రమాక్షిజలజరమ్య. ౪౨. రాట్కగ్రశమాం; రాట్కతంత్రమాం ౪౩. భయంకర; గయాతుర. ౪౪. సురా. ౪౫. దుర్లభ. ౪౬. వదిరిశరవర్గ. ౪౭. దశాంతరాంకుర. ౪౮. శమోన్మదనీశమన. ౪౯. సద్యమ. ౫౦. తత్త్వమాన్యప(వ)ర. ౫౧. జముఖాదివినవికజన్మ. ౫౨. సహస్ర. ౫౩. నయ. ౫౪. హవ్యజశిరోరుహ హవ్యమునీంద్ర చంద్రమా. ౫౫. శలనాంచళ నాళనార్థ;శలనాజలనార్థభక్త..

మల, ళలయోరభేదవచ
న ప్రతిపాద్య ళలప్రయోగసం
కలితపదోపలాలన, ళ
కారనుతం, బసవేశ, పాహిమాం. ౩౭

చ. క్షరదురితక్రమా క్షయజ
నిస్థితికారణకారణా, (క్షతా)౫౬
ధ్వరగణనాయకా, క్షయభ
వక్షయరోగభిక్షుమా, క్షపా
కరశకలాంకజూట, క్షపి
తప్రతిపక్షసురాసురా, క్షమాం
కురితకటాక్షవీక్షణ, క్ష
కారనుతం, బసవేశ! పాహిమాం. ౩౮

క. ఇతిభావన్నక్షరసం
స్తుతిసంకలితాక్షరాంకితస్తోత్రవుమా
పతి నిమ గర్పిసిదెం సం
తృప్తియిం పాల్కురికి సోమ కృతి, బసవేశా!

ప. లక్షణపద్యయతిప్రాసవిలక్షణ పూర్వస్వరాద్యక్షర కాదిక్షాంతాక్షర మాలాద్యక్షరస్థల రక్షిసెన్నువం బసవేశా!

ప. శివమస్తుభక్తివిభవోద్భవోస్త్వక్షరాంక పరనశ్రవణ స్తవనాసక్తరిగె మహోత్సవోస్త్వక్షరాంక పరన శ్రవణస్తవనా ద్వాక్సిద్ధిరస్తు శివ బసవేశా!

అక్షరాంకగద్య సంపూర్ణమ్.

అలవాటు ౧




౨౬. క్షయా:




జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి, యం. ఏ., బి. యల్.,

శైలివాదమున అధునాతనయుగమున పృథ్వీజాతులందు ఆంధ్రు లగ్రగణ్యులని నొక్కిచెప్పవచ్చును శైలికలహ మొక్క ఆంధ్రావనిలోతక్క నింకెక్కడను లేకుండుటే యిందులకు హేతువు శైలిరణముగాక, శైలి ఆంధ్రులదృష్టి నాకర్షించియుండినయెడల, ఆంధ్రభాష యీవఱలోనే ముకుటముదాలిచి, అవనియందలి సారస్వతాచార్యుల ముత్తెపుసేసల నందియేయుండెడిది.

దృష్టి ఆంతరంగికమైనది, మనసునందు ధగధగజ్వలించు జిజ్ఞాసానలమునుండి వెడలు నెరసులే దృక్కులై వెడలును లోఁగల శక్తి పురికొలిపినపుడే మనుజుఁ డేవస్తువునైనను పరీక్షించును. లోఁగల శక్తి జిజ్ఞాస. జిజ్ఞాసలేని చూడ్కి వెఱ్ఱిచూపు—చూపుగాని చూపు. అసంతృప్తినుండి వెడలి, మనసునందు సలసలఁగాఁగి, మనుజునిఁ గూర్చుండనీక, మానవసులభమైరాళ్యమును, అలసదనమును తన యావిరిచే బాహ్యవాతావరణమున చెదరఁగొట్టి, కర్మపథమున జిజ్ఞాస నరుని వడివడిగ నడపుచుండును. సంతృప్తిజీవనము కాంక్షించు ఆంధ్రులం దిట్టి జిజ్ఞాస, ఇంధనములేక చల్లవడియుండుటచే భాషాహృదయమును వీరంతగా నెఱుఁగలేకున్నారు.

ఆత్మజిజ్ఞాస లేకున్నను, అంగవ్యాయామము ఆంధ్రులలో నెక్కుడుగ నున్నది. శైలివాదమున తెలుఁగులను ముందు పేర్కొనవలెనని తెలుపుటకు కారణము భాషావ్యాయామమున వా రాఱితేఱిన మల్లులగుటయే. ఆరోగ్యమునకు ముఖ్యమైన వ్యాయామ మందఱికిని ఆవశ్యకమే. ఆత్మనుగాని, అంతరంగమునుగాని తలఁపనేతలఁపక, కండలను పెంచి, జెబ్బగొట్టువాఁడు జెట్టికావచ్చునుకాని ఆత్మోన్నతి నందిన ఆదర్శపూరుషుఁడు కానేరఁడు. దండెములందును, బస్కీలందును, మాటలను క్రిందుమీఁదులుచేసి, ముచ్చెమటలందు ముంచివేసితిమేని, వానియందు స్థూలమైన మాఱుపు కానంబడవచ్చును. కాని పెటిగినకండ, లోనిదివ్వెకు గాజుకుప్పెగాక దానివెలుఁగు నణఁచు కావరపు ఆవరణము కావచ్చును. సేవాదర్శముగాని, కళామరీచిగాని ఆత్మజ్యోతినుండి ప్రసరించునుగాని మాటలప్రోవునుండికాదు. మాటలందు పైల్మానుగంతులు ప్రదర్శించుటగాక, మాటలందలి భావమందు మనసునిలిపి, దృష్టినింపి, బుద్ధిని ముంచి, ఆత్మనిడి, సారస్వతాశయములు పూర్ణమగుటకును, ప్రజాభ్యుదయము చేకుఱుటకును మానవుఁడు సేయు పరిశ్రమయే భాషాసేవ యనిపించుకొనును.

గ్రామ్యవాదులును, గ్రాంథికవాదులును చాలకాలమునుండి ఆంధ్రసీమయందు కురుక్షేత్రకదనమును సాగించుచున్నారు. గ్రామ్యవాదులు వాడుమాటలు గ్రాంథికవాదులకు కానిమాట లగుచుండెను. గ్రాంథికవాదుల భాషాప్రయోగములు గ్రామ్యవాదులకు క్రూరాస్త్రప్రయోగము లగుచుండెను. తెలుఁగున నిపుడు తోఁచు వ్యాకరణనిబంధనములును, లక్షణసూత్రములును ఇటీవలఁ బుట్టినవేయనియు, జాతిమతనిరంకుశత్వములవలె భాషానిరంకుశత్వము విజృంభించెవనియు, రాజులను మెప్పించి పొట్టలను పూరించుకొనుటకు ప్రబంధకవు లేమేమో వ్రాసిరికాని ప్రజల కుపయోగించు వ్రాఁతలకై తమ కలములను పురికొలుపలేదనియు నేఁటి గ్రామ్యవాదు లందురు. "సభ్యతకును, సౌందర్యమునకును, నాగరికతకును, నాజూకునకును విరుద్ధములైన 'ఆడు', 'ఈడు' మొదలగు పదములను ప్రయోగించి, నియమబాహ్యక్రియకుఁ గడంగి భాషకు వికృతరూపుఁదెచ్చువారు మీ" రని గ్రాంథికవాదు లెదుటివారిని జూచి హుమ్మనుచున్నారు. వీరు వజ్రాయుధమును చేఁబూనిరి; వారు బ్రహ్మాస్త్రమును ప్రయోగించిరి! వీరు కాఱుమాటలు విడిచిరి; వారు బండమాటలు వదలిరి. వీరు మాటలను వెలివెట్టినకొలఁది వారు వానిని మెలివెట్టి మలిద్రిప్పుచుండిరి. "'ఆడు', 'ఈడు' అనుపదములు 'చేయగలాడు', 'మొక్కలీడు' అనుపదములం దుండ వానిని గ్రాంథికవాదులు ప్రయోగించుచునేయున్నారు. ఉన్నవానినిగుఱించి కానిపెనగులాటకు మన ప్రముఖులు డీకొనుచున్నా"రని ప్రసంగవశమున గతవత్సరము విశాఖపట్టనమున శ్రీసాంఖ్యాయనశర్మగారు పలికి, యీవాక్కలహము వ్యర్థమైనదని తేల్చిరి. ఇది వ్యర్థమైనదని నేఁటి భాషాశూరు లింకను గుర్తింపలేదు. కన్నెఱ్ఱలును, కానిమాటలును పెఱుగుచునేయున్నవి. నన్నయకుముందునుండియు తోఁచిన తెలుఁగును తఱచితఱచి "వాడుకమాటలు పుస్తకముల కెక్కలేదనువా రెవ" రని పర్లాకిమిడిపంతులుగారు సవాలుచేయుచున్నారు; త్యాగయ్యకీర్తనలందు గ్రామ్యభాష లేదాయని గొంతెత్తి పలుకుచున్నారు. దేవమందిరమైన ఆంధ్రభాషయందు అస్పృశ్యమైన శబ్దములకు ప్రవేశము లేదని స్వంతస్మృతుల నుదాహరించుచు, సనాతనవాదులు మఱింత బిరుసెక్కుచున్నారు. ఈవిగ్రహమున సంధిగోచరించు చిన్నెలు కానవచ్చుటలేదు.

భాష సంఘమువంటిది. సంఘస్థజాతులపై నేఁడు ధూళి క్రమ్ముచున్నను, ప్రకృతులును, ప్రవృత్తులును, అక్కఱలును, వాంఛ

లును వేఱైయున్నంతకాలము వేఱువేఱువృత్తు లవసరము. అన్నిఁటికిని దానే తగుదునని సర్వవృత్తుల నొకఁడే తలకుఁ గట్టుకొనుచో, అభివృద్ధి అందిరానిపం డగును. సంఘచలనమునకు వృత్తిపరిచాలన మెట్లవసరమో, భాషాచలనమునకు విభిన్నభావసంచలన మవసరము. ప్రకృతినిబట్టి వృత్తి గోచరించులాగున భావము ననుసరించి భాష పుట్టును.

సృష్టినుండియు, జీవనమునుండియు భావ ముద్భవించును. సృష్టిచిత్రములందును, మానవజీవనమందును భేదమున్నంతకాలము భావమందుఁగూడ భేదము తోఁచుచునే యుండును. అవ్వలచిగిరించు జీవనము తన లేనవ్వును, తన చక్కఁదనమును అంతరంగమునుండియే అందును. కనులపండువొనరించు పూలతలు తమ లావణ్యమును లోఁగల భావపూరమునుండియే తోడుకొని, బాహ్యావనియందు విరజిమ్మను. మృదులమైన తీవలు మధురములైన పద్యపంక్తులు. చక్కని పూగుత్తులు రూపుదాలిచిన లలితభావపుంజములు. గురుగంభీరభావము మహోన్నతమైన వటవృక్షమై పెక్కుజీవుల చేమోడుపుల నందును. ఉన్నతోర్వీరుహమందలి భావము బక్కమహాశయునివంటిది. లలితలతికలందలి భావము వెన్నెసనుచామకూరకవుల మనసువంటిది. ద్విజేంద్రుని మనసునంటిన తాళవృక్షము అలంకారరహితమై, సహజరూపున గోచరించు తొయ్యలివంటిది. ఆడంబరములేని తిన్ననిజీవనమున సహజసౌందర్యము సుధాభాండమగునని తాటిమ్రాఁకు తెలుపుచున్నది. ఏదృశ్యమైనను తేటయైన కనులందు ప్రతిఫలించునుకాని బండబారిన తోలునందుఁగాదు. ప్రభాతనభమును, గానబంధురవాతూలమును కమలకాసారమునఁ దేలునుగాని నల్లఱాళ్లగుట్టయందుఁగాదు. చల్లనై చక్కనైన చంద్రికలు చకోరములందును, కైరవములందును ప్రస్ఫుటించునుగాని బోడిమాటలందును, బొమ్మరాళ్లయందును గాదు. మధ్యందినమార్తాండుని ప్రతాపము, సైనికులను సమరమునకు పురికొలుపు శూరుని వాక్కులందు మంటలుజిమ్మనుగాని, కౌముదీస్నాతశర్వరిపగిది సీమంతినిసుధామధురోక్తులందుఁగాగు. టక్కుటక్కున నుఱుకులెత్తు వాక్కులు, రణోర్వినుండి వెడలు ఘోటకపదశబ్దములను తెలుపుటకు పనికివచ్చును గాని పతివియోగమున పొగులు పడతియార్తెలుంగును వినిపించుటకుఁగాదు. కలస్వనశైలి మధురకంఠరయగు వరూధినికే చెల్లినదిగాని వట్టిగొడ్డువలె నార్చు మోటుగయ్యాళికి కాదు. ఱాళ్లును, అప్పలును, అంకెలును, ఆర్పులును సౌందర్యసౌష్ఠవసంపన్నయైన సారస్వతమునకుఁగాక మందరవంటి కార్కశ్యమునకును, పూతనవంటి దౌష్ట్యమునకును నని ఎవ్వరెఱుఁగరు? తాడకిక్రౌర్యమును వర్ణించు కవి లలితలతికాసంకాశములైన పదములను ప్రయోగించినయెడల, అగ్గినోటనుండి సుగంధమును వెడలింపఁదలఁచినవాఁడగును. తాటకికథఁ దెలుపు కలమున తాటకి లేకున్న, అది కలమనిపించుకొనుటకు తగదు. రామబాణముఁ జూపు కలము రామబాణము గాకున్న, తాటకిగొంతుకయందే యది అదృశ్యమైపోయెడిది. తాడకి శైలి తాడకియంతరంగము. రక్తమును త్రావునది రక్తధారలవంటి భయదపదములనే ప్రయోగించునుగాని, ఉడురాశివంటిగాని, నన ప్రోవుపగిదిగాని జిలిబిలిపలుకులను గాదు. గులాబియధరమునుండి స్వర్గసామ్రాజ్యము స్రవించునుగాని విషవాయువుగాని, బొగ్గుపులుసుగాని కాదు. సుగంధమయమైన సూనభావము సుకోమలమైన దళములందే వ్యక్తమగును. పుష్పభావమును తెలుపు చక్కని అక్కరములు పుష్పదళములు. గులాబిరేకలు దొలిచివైచి, కాకియీకలను గులాబిహృదయమున పాతిపెట్టఁగలవాఁడు మధురమైన భావమును వికృతమైనమాటలందు వ్యక్తీకరింపఁగలఁడు. కోకిలకంఠమున తోడేలును స్రువ్వఁగలవాఁడు గీతవంటి తియ్యనితలఁపును పెడబొబ్బవంటి శైలియందుఁ దెలుపఁగలఁడు. మందానిలమున అల్లనల్లన స్రవించు గుసగుసలు మహానిలమును కురిపించు పిడుగులకు సహజమైననాఁడే మృదులభావము నిర్ఘోషశైలియందు తోలుకొఁగును. శీతవర్షధారలట్లు కురియు శైలిపంక్తులు ఆశీస్సులనుండుఁగాని శాపాయుధుని క్రోధకంపితస్వరమ ట్లుండునా? సెలయేరుపోలు శైలి చల్లనైన రాధాకృష్ణుని హృదయమునుండియే అవిరళానందమున పలుమాఱు ప్రవహించెనుగాని, న్యాయస్థానములందు వ్యాఘ్రమట్లుఱచిన రసవిహారి యెడఁదనుండి వెడలెనా?

ప్రకృతియందలి భేదము, భావమందలి భేదము శైలియందలి భేద మగును. ఒకేగమ్యస్థానముగల ప్రకృతియందుఁగూడ ప్రకృతివ్యక్తిత్వమును వ్యక్తీకరించు శైలియే గోచరించును. కోయిలకంఠమును తుమ్మెదగొంతుకందును, పుష్పంధయకంధరమును కోకిలగళమందును చొప్పించుట ఈవికిరమును, ఆకీటకమును పుట్టించిన సృష్టికర్తకే సాధ్యముకాదు. ఉన్నతకుజములందు తీవలను పుట్టింపఁగలిగిననాఁడును, కుంజవాటియందు దీర్ఘశాఖలను వెడలించిననాఁడును మానవుఁడు ప్రసూనశైలిని కోకిలకును, కోకిలహృదయమును భృంగికిని, కుజశైలిని షట్పదమునకును, షట్పదశైలిని కుజమునకును, పుష్పహృదయమును కోయిలకును, కోయిలయెద నిందిందిరమునకును నొసఁగఁజాలును.

శైలిభేదము ప్రకృతిభేదముల ననుసరించియు, ఒకేయుద్దేశసిద్ధికై వేఱువ్యక్తులనుండి వేఱుతెరువుల నడచు నొకేప్రకృతి ననుసరించియుమాత్రమే కాక విషయప్రకృతి ననుసరించియు, స్థలకాలపరిస్థితుల ననుసరించియు మాఱుచుండును. విషయప్రకృతి అనుకూలమైన మనుష్యప్రకృతియందే యిముడును. సహజగుణమునకు వేఱైన బాహ్యగుణము నలవఱచికొనుట సుసాధ్యముకాదు. అట్లలవఱచికొన నొరులయుద్బోధనమువలన నొకఁడు ముందంజవేసినయెడల, తప్పక బోరలపడును. రాధాకృష్ణుఁడు భౌతికశాస్త్రమును, రామను తత్త్వశాస్త్రమును పరిశీలించుటకుఁ గడంగియుండిరేని నేఁ డిరువురును మహామేరువులుగాక అణువులై ఎందో యణఁగియుండువారు. ఇరువుర వృత్తులును, ఇరువుర మానసికప్రవృత్తులును వీరిశైలియందు తోఁచి

నుండియు గోచరించుచునేయున్నవి. ఎట్లో శ్రమించి బారిష్టరు పరీక్షయం దుత్తీర్ణుఁడైన స్కాట్‌మహాశయుఁడు న్యాయస్థానమెఱుఁగక నవలారచనయందే తనతనువును గడపెను; వర్తకమునకుఁ గడఁగి, వెలికిలపడి దురంతకష్టములందుఁ గూలెను. గ్రంథరచనయందైన నాతని ప్రకృతి ప్రత్యేకమైనది. కవిత్వసంపదయందు బైరనుతో నెగ్గలేక Lady of the Lake, Lay of the last Minstrel మున్నగు కొలఁదిమాత్రపు రచనలతో పద్యములకు తిలోదకములు వదలి గద్యరచనకుఁ గడంగి అందే యాతఁ డనర్ఘమగు ప్రతిభనందెను. నవలారచనయందైన నీతనిప్రకృతికిని జేన్ ఆస్టిన్ ప్రకృతికిని, యీమె శైలికిని స్కాట్‌శైలికిని భేద మున్నది. కొండొకవిషయవర్ణనయందుఁ దన కామెశక్తి లేదని వాల్టర్‌స్కాట్, ఆస్టినునకు స్పష్టముగ వ్రాసెను. ఒకేమార్గము ననుసరించి చనినను, వీరిరుచులు వేఱని వీరివ్రాఁతలే తెలుపుచున్నవి.

ఆంగ్లసారస్వతచరిత్రయం (Romantic Period) దొకే సమయమున వర్ధిల్లిన వర్డ్స్‌వర్తు, షెల్లీ, కీట్సు, బైరన్, కోలెరిడ్జి, సౌదేల శైలులం దెంతేని భేద మున్నది డ్రైడనుపోపుల కాలమందలి ఎండువరుగవంటి శైలి కడచినపిదప, వీరిశైలి కుసుమించినది ప్రాతయాకులు రాలినంతన, వీరిశైలి ఆంగ్లసారస్వతమున వసంతోదయప్రభలు చిమ్మినది. ఉత్సాహపూరితమును, రాగరంజితమును, సౌందర్యవంతమును, ఆనందపూరితమును నైన రచనయందే యీకవులు వర్ధిల్లిరి అయినను వీరిశైలియం దెంతేని వ్యత్యాసమున్నది. వర్డ్స్‌వర్తులోఁగల తత్త్వసంపద బైరనులో సున్న. చిత్రరచనమందును, అలంకారశోభయందును బైరనునకు బైరనే సాటి. గ్రీకుకవులను దిగమ్రింగి, సౌందర్యకామియై, 'శబ్దములయెడల నెంతేని మక్కువఁ జూపి', షేక్స్పియరుప్రజ్ఞ కొంత నూపఁగలిగి (Vide. Matthew Arnold's Criticism on the genius of Keats) న కీట్సు, తెవులుగొంటైన కీట్సు, యిరువదాఱేండ్లకుపూర్వమే తనయద్భుతశక్తిని జూపఁగలిగిన కీట్సు, కీట్సునకే యెనయై యుండెను ఇఁక షెల్లీ చూడుఁడు. మిత్రుఁడు కీట్సుకంటె నాలేం డ్లధికముగను, బైరనుకంటె నాలుగేండ్లు తక్కువగను మనఁగలిగిన యీతఁడు, ముప్పదిరెండవయేఁట దివంగతుఁడు కాకమున్నే, పెక్కుమాఱులు దివిదెస పరుగులెత్తెను. షెల్లీయందలి భావోద్రేకము, ఉత్సాహము, చక్కనైన గమనిక మఱొకనికి లేదు. పాండిత్యమందు కోలెరిడ్జి సమకాలికులను మించెను. ఈతఁడు వేదము వేంకటరాయశాస్త్రి వంటివాఁడు. పండితప్రకాండుఁడైన కోలెరిడ్జియందు కవితాసంపద అంతగా గోచరింపదు. షేక్స్పియరునుగుఱించిన యీతని విమర్శనలు భావబంధురమైనవి. మహనీయుల సఖ్యమందు (Lake Poets) మసలి సౌదే సాంగత్యవాతూలమును కొంత తనరచనయందుఁ జూపఁగలిగెను. నెల్సన్‌గుఱించి యీతఁడు వ్రాసిన గద్యగ్రంథమమాత్రము గణనీయమైనది. విభిన్నప్రకృతులుగల వీరిశైలి, విభిన్నమై యున్నగి. వర్డ్స్‌వర్త్, షెల్లీ, కీట్సులు ముగ్వురునుగూడ శకుంతములపై పద్యములు వ్రాసిరి. (Vide: "The Sky Lark", "A Sky Lark", "The Nightingale") వర్డ్స్‌వర్తుకవి వృద్ధుఁడు, యోచనాపరుఁడు. ప్రకృతిసౌందర్యమున మునిఁగియుండువాఁడయ్యు, కట్టెమోపునందును, ఱాళ్లగుట్టయందునుగూడ నీతఁడు లోతుతలఁపులను గనుగొనును. ఈతని మానసమే శకుంతమై, అవనిపై గభీరయోచనాగర్భితదృష్టిని పఱపుచు, దివియం దొప్పెను ఈపక్కిచూడ్కి ఐహిక, ఆముష్మిక, భౌతిక, ఆధ్యాత్మిక ప్రపంచములను గలుపు అద్భుతమైనతీవ ("True to the kindred points of Heaven and Earth"). టెన్నిసనువలెనే మిల్టనుపై నీతనికెంతేని మక్కువ కలదు మిల్టనుతత్త్వమును గొంత నీతఁడు తనదిగావించుకొనెను—ఈతనిపక్షి భావమయ మైనది. ఇఁక షెల్లీపక్షిని చూడుఁడు. గానకళయట్లు చరచర నిది వాతూలపథమున వినువీథికెగసెను. షెల్లీహృదియందలి ఉద్వేగమును, ఉత్సాహమును, ఉద్వేలమును శకుంతమై ముక్తినందిన పరమహంసవలె, గగనసీమయందు నృత్యమొనరించెను. సత్యము సౌందర్యమనియు, సౌందర్యము సత్యమనియు ("Truth is Beauty, Beauty is Truth") వచించు కీట్సుకవివిహంగము, పక్కియై యెగసిన ఆతని మానసమే కాని ("The Viewless wings of Poesy") వేఱుగాదు. ఈ కవిపుంగవులశైలి, వీరి ప్రకృతులుదాల్చిన దువ్వలువ.

షెల్లీ వాతూలకాంక్షి—ఈతని మనసు చిఱుతప్రాయమునుండియు వాతూలమై వీచుచుండెడిది. తుద కది వాతూల సంక్షుభితవార్ధియందే యీతని ముంచివేసినది. హిల్లోలమున నెగసిన ఈతని పక్షికిని, ఆకుమూఁకకును, (Vide "Shelly's Ode to the Western wind") మేఘమునకును (Vide Shelley's "Cloud") ఒకే ప్రకృతి కలదు. భారతషేక్స్పియరు మేఘమునకును, షెల్లీ మేఘమునకును నెంతేనిభేదము కలదు.

భిన్నదేశములవారలయ్యు కాళిదాసుషెల్లీలు ఒకేవిధమైన సారస్వతమునఁ గ్రుంకులిడిరి. మరుభూమిమాడ్కి భావమునుగాని, వట్టి గడ్డిపరకలఁబోలు మాటలనుగాని కాళిదాసు అభిలషింపలేదు. రాగరంజితములైన చూపులను, మధురమైన మాధవీలతలను, తియ్యనితీవలకెనయగు గీతకళలను, పట్టుదారములను, పొందామరలను, కుసుమకేసరములను, జాబిలిరేకలను, కన్నీటిదొంతరలను, చిక్కగములను, రవికిరణములను, మధురోక్తులను, ముత్తెపుఁజేరులను, పైఁడితమ్మలను, వినీలకేశములను కైతనెలంతకు జడగా నల్లి, ఆమెసోయగమునకు మురియుచు, తనహృదయసీమ నామెను జేరిచి, కాళిదాసు స్వర్గసామ్రాజ్యము నేలెను. షెల్లీకూడ శృంగారము నభిలషించిన కవిశేఖరుఁడు. వ్యర్థమైన మెకాలే (Lays of Ancient Rome తక్క తక్కిన యీతనిపద్యములు రసరహితము లైనవి) కవిత్వమువలెఁగాని, పాడిమాటలందు పొరలు తన పూర్వశతాబ్దపు సారస్వతమువలెఁగాని

యీతని కవిత వెల్లనై యుండదు. ఈతని వీణాయంత్రము ( Vide ; Shelley's "Guitar" ) ఈతని హృదయము. ఈతని వచనములు సురపురవారాంగనలట్లు నృత్యముసలుపును. అయినను కాళిదాసునందలి సింగారముగాని, మధురకవితాసలిలముగాని షెల్లీ మొగులులో లేదు. ప్రకృతిసౌందర్యమున కెందును దీసిపోని కాళిదాసుహృదయము పాఠకుల హృదయములందు ప్రకృతివిభూతిని గుమ్మరించును. ఈయద్భుతప్రజ్ఞయందు భారతకవిసమ్రాట్టు కేవలము షెల్లీనేకాక, షేక్సిపియరుమహాకవినిగూడ మించెను కాళిదాసు కేవలము శృంగారపూరుషుఁడే కాఁడు. ఒక్కొకసందర్భమునందు సభ్యతకు విరుద్ధముగా నున్నట్లు తోఁచు ఆతని రచనలందు గభీరతత్త్వముకూడ ఇమిడియున్నది ఇది కాళిదాసుప్రజ్ఞయో, కాళిదాసును గనిన సంస్కృతసారస్వతముయొక్క ప్రజ్ఞయో పాఠకులే యూహింపవలెను. సంస్కృతమున కెనయైనభాష పృథ్వియందు లేదు. దీనియందలి ప్రత్యక్షరము—ప్రత్యక్షరమే యననేల, ప్రత్యక్షరప్రత్యంగము-బహుళ భావబంధుర మైనది. లేటిన్, గ్రీక్, ఏంగ్లోశాగ్సన్, ఐస్‌లాండిక్ ధాతువులను ఆంగ్లపదములనుండి వెల్లగించిచూచినను, సంస్కృతమందుఁ జిక్కినట్లు అద్భుతభావమూలము లందు మాపట్టవు పండినచేనువలె సంస్కృతమున నత్పత్తియగు భావకేదారము ఆంగ్లమున కానంబడదు. శ్లేషకవిత్వము నవలీలగ చేఁజిక్కించు సంస్కృతమున కాళిదాసు తనకైతను వ్రాయుట కాళిదాసు భాగ్యము. కాళిదాసు భారతీయుఁడు లోఁతుయోచనయు, గభీరతత్త్వమును భారతీయుని సహజలక్షణములు వర్ధనవర్తు, ప్రాణింగులందు వేఱువేఱుతీఱుల నీగుణ మించుక తోఁచినను తక్కినఆంగ్లకవులందు చూపట్టలేదు. గోల్డుస్మిత్ మన హైడాస్‌పిస్‌నదిని ( Vide "Traveller"), మిల్టన్ లక్ష్మీయుతమై ఒకప్పుడు వరలిన లాహోరునగరమును ( Vide . Paradise Lost ) ప్రాచీవిభవమును కొలఁది మాటలలో పొగడినట్లు, షెల్లీ మనచంపకము నొక్కమా ఱుల్లేఖించినను, మన గభీరతత్త్వము నీతఁ డెఱుఁగఁడు. అందుచే నీతఁడు మన కాళిదాసునకుఁ దీసిపోయెను. ఈశక్తిభేదము వీరిశైలియందలి గుణభేదమును తెల్లమొనరించుచున్నది.

కాళిదాసు నటుంచి అధునాతనభారతమహాకవియగు రవీంద్రుని షెల్లీతో పోల్చిచూడుఁడు. తన కవితాజీవనమున తొలుత రవికవి, షెల్లీని ఆదర్శపురుషునిగాఁ జేకొనెను. చెప్పనేల, రవీంద్రుని వంగపద్యములను కొన్ని యేఱి వెలుపలఁబెట్టితిమేని, వీని నీతఁడు షెల్లీనుండి దొంగిలింపలేదా యని తోఁచును. నకలుపని కవిపనికాక మకిలిపని యనిపించుకొనును. కాని యీనకలు రవీంద్రుని నకలుకాక రవీంద్రుని ప్రకృతియందలి షెల్లీనకలని విమర్శకులు గుర్తింపవలెను. షెల్లీహృదయము వీణాయంత్రము—రవీంద్రుని హృదయమును వీణాయంత్రమే. సంగమేశ్వరుఁ డీవీణెను మీటినపుడు రవికవిమనసు షెల్లీమనసువలె అద్భుతముగ నృత్యముసలిపెడిది. ఒకేప్రకృతిగల వ్యక్తుల భావములును, శైలివిధములును ఒకేరీతి నుండును. దొంగయొరవడికిని ఎనటిడానియం దాత్మజ్యోతిని గాంచిన ఒరవడికిని ఎంతేనిభేద మున్నది. స్కాట్‌కవి " ఐవేన్హో "ను చూచి యెఱుఁగని బంకించంద్రుని " దుర్గేశనందని " యం " డైవేన్హో " భావములు నిండియున్నవి. ప్రకృతియైక్యత రవికవిని షెల్లీకవియందు ముంచినది.

రవీంద్రుఁడు వంగీయుఁడు. వంగీయుఁడు ఉత్సాహము. వంగవాసిసహజ గుణమునకు, వంగసారస్వతమును తూగుటుయ్యాలలందూపిన వంగవైష్ణవమతము తోడై రవీంద్రుని మనసునఁ జొచ్చెను. చైతన్యుని వైష్ణవము తన్మయమై, ఆనందమయమై యుండును. తాండవనృత్యమునకు గౌరాంగుఁడు వేఱుపేరు. వంగవైష్ణవతత్త్వమును రవీంద్రుఁడు తనివారఁ గ్రోలెను ఆనందకామియగు షెల్లీ నీతఁడు ప్రేమించుట కిదియే కారణము

చైతన్యుని వైష్ణవమతమునకును, రామానుజమతమునకును వ్యత్యాసము కలదు. తురక యొకఁడు చైతన్యదాసుఁడై, హరిదాసు కాలేదా ? అక్బరు ఊహించివిడచిన మతమును తనది గావించుకొని, మూఢాచారములను తెగనఱికిన రామమోహనుని బోధనలను దిగమ్రింగి, స్వాతంత్ర్యకాంక్షియైన రవీంద్రునకును, స్వాతంత్ర్యాభిలాషియైన షెల్లీకిని పోలిక కుదిరెను. చెప్పనేల, ఇరువురును కవలలై వర్ధిల్లిరి.

కాని రవీంద్రుఁడు భారతీయుఁడు-మహర్షినందనుఁడు- గభీరతత్త్వసింధువు యువకుఁడైన రవికవి, ఉత్సాహమందే తేలి భారతషెల్లీ యాయెను వయసు పెఱిఁగినకొలఁది భారతమహత్త్వ మాతని హృదయమందు సమధికమై పెంపొందినది. నిజవ్యక్తిత్వమున శోభిలు రవీంద్రుఁడు తన తరువాతికవనమున బాహ్యప్రకృతిచిత్రములనేకాక, అంతరంగప్రకృతిచిత్రములనుగూడ ప్రదర్శించెను. గభీరములైన సత్యములను వ్యక్తీకరించెను లేఁతపిందెయై యున్నపుడు షెల్లీయై, పరిపక్వమైనపుడు తానయై రవీంద్రుఁడు నేఁడు పృథుకవీంద్రుఁడాయెను. నేఁటి రవికవిశైలి షెల్లీశైలికి ప్రతిబింబ మనరాదు.

కాలపరిస్థితులకును, శైలికిని సంబంధ ముండు నంటిమికదా. దేశచరిత్ర సారస్వతమున మార్పులుపుట్టించుట ప్రసిద్ధవిషయము. జిజ్ఞాసయు, విమర్శయు విశేషముగా పెంపొందుకొలఁది, ప్రాఁత తలఁపులు నేలరాలి, నూతనభావములు తలయెత్తును. తలఁపులనుబట్టియే సారస్వతమును, శైలియు మాఱుచుండును. ప్రపంచచరిత్రలను పరికించితిమేని, ఎన్నేని దృష్టాంతములు కనులఁబడును. గ్రీకురాజకీయములందు ప్రజల నుత్సహించుటకు చల్లని ఫోసియన్ స్వరము గాక డెమస్తనీస్-జలదగంభీరస్వర మవసరమాయెను. రోముపరిస్థితులు సిసేరోను పుట్టించెను. డెమస్తెనీసు, సిసేరోల యుద్దేశములును, ప్రకృతులును వేఱుకావున వారిశైలియందు భేదముండెను. గ్రీకుప్రకృతికి సహజమైన కళాసౌందర్యము డెమస్తెనీస్‌శైలియందు కుసుమించెను. సిసేరోశైలియందు రోమనుప్రకృతికి సహజమై, నిబంధనశాస్త్రమున కనుకూలమైన స్పష్టోచ్చారణ మున్నది. లూయిూ

నిరంకుశత్వమును చీల్చు కత్తిపోటువలె వాల్టేరురూసోల శైలి వాడియై, ఫ్రాన్సుసీమయందు విప్లవమును రేకెత్తించెను అమెరికనులపై వ్రాలిన సుంకముల (Tax on Tea, Glass and Paper) నెదిరించుపట్ల బర్కుమహాశయుఁడు తన కేసును స్పష్టముగ బోధింపఁదలఁచిన న్యాయవాదివలె సాధారణశైలినే ప్రయోగించెను (Vide Burke's speech on American Taxation). అమెరికనులయెడ నిర్బంధవిధానముఁ జూపినయెడల, దలపడు ముప్పును దెలుపుచు తదుపరి యీతఁడు కావించిన మహోపన్యాసమును, వారన్ హేస్టింగ్సు నిరంకుశత్వమును బయటబెట్టుచు నీతఁ డొనరించిన ఉపన్యాసమును (Vide Burke's speeches on Conciliation with America and Impeachment of Warren Hastings) ఉద్వేగసంభరితమై, గంభీరభావబంధురమై యున్నవి. ఫ్రాన్సువాసుల చిక్కుల నంతగా గుర్తింపక, వారి నాతఁడు దూషించుచు వెల్వరించిన గ్రంథము ఆంగ్ల సారస్వతముయొక్క పటుత్వమును ప్రదర్శించు మహాద్భుతగ్రంథమయ్యు క్రోధోజ్జ్వలమై, అనుచితవాక్కులతో నిండియున్నది (Vide: Burke's "Reflections on the French Revolution") అన్నిటియందును నొక్కే వ్యక్తిశక్తి గోచరించినను, విషయభేదమును బట్టియు, విషయము ననుసరించిన వ్యక్తియభిప్రాయము ననుసరించియు శైలి మాఱినది. ఆటితేరిన షిల్లరుశైలి గేటేశైలికి పోలకపోవుటకు కారణము, గేటేయందలి తత్త్వచింతగాని, గభీరతగాని షిల్లరులో లేకపోవుటే. గేటేహృదయము అలంకారముల ఊట! లోఁతునకును అందమునకును గేటే గేటేకే సాటి. ఈతనిశైలి జర్మనీదేశమునకు నూతనజన్మమును, నూతనరూపును ఒసఁగెను.

ఎలిజబెత్ రాజ్ఞికాలమున ఆంగ్లసారస్వతము అద్భుతతేజమును దశదిశలఁ జిమ్మినది ప్రాతసిలుగులు కడతేఱ యుద్ధాంగణములందును, వాణిజ్యసీమలందును, నేలయందును, నీటిమీఁదను ఆంగ్లేయులు అద్భుతక్రియలను నెఱపుటచే—ఆంగ్లచరిత్రమున అపూర్వసంఘటనలు తోఁచుటచే ఆంగ్లసారస్వత మపూర్వరూప మందినది. తొంటిపద్ధతులు ఈఁగిపోఁ దొడఁగినవి. గ్రీకుకవులును, రోమనుకవులను ఆంగ్లేయుల కాచార్యులై యుండువారు తనకాలమందు ప్రవించు భావధునియందు మునిఁగి షేక్స్పియ రీయాచార్యుల కంజలెత్తఁదలఁచుకొనలేదు. ఒరులవ్రాఁతల (Holinshed's Chronicle and (Menaechmi of Plautus) నాధారముగాఁగొనినను, ఈతఁడు తన పుంతను తాను త్రొక్కెను. ఎరువుయీకలను గొని మురియువాఁడని యీతని గేలిచేసిన గ్రీనున కీతని పద్ధతి నచ్చలేదు. బెన్ జాన్సన్, బ్యూమంట్, ఫ్లెచర్ మున్నగువారి శైలికిని షేక్స్పియరుశైలికిని భేద ముండుటకు కారణము స్థలకాలనిబంధనలను, (Unities of Time and Place) ఇతరప్రాచీననియమములను (Classical Rules) ఈతఁడు పాటింపకపోవుటని ఆంగ్లసారస్వతవిద్యార్థు లెఱుఁగుదురు. ఆంగ్లచరిత్రయందు నానాఁటఁ దోఁచు మాఱుపులు ఆంగ్లశైలియందు తోడ్తోడనే తోఁచుచున్నవి. వివిధసమయములందలి (The Early period, the Chaucorian age, The Spencerian and Shakesperian period, The Miltonic age, The Restoration period The Augustine age, The Romantic Period, The Ninteenth century and Twentieth century literary periods) కాలపరిస్థితుల ననుసరించి ఆంగ్లసారస్వతమున గోచరించిన మార్పులను, శైలిభేదములను చర్చించుట కీవ్యాసమున చోటుచాలదు అధునాతనయుగమున రాజైనది భౌతికశాస్త్రమగుటచే నేఁటిసారస్వతము భౌతికనియమముల ననుసరించి యుండవలెనని మానవప్రపంచమంతయు ఘోషించుచున్నది. భౌతికశాస్త్ర వృద్ధివలన, మానవదృష్టి—బాహ్యదృష్టియే యనుఁడు—అధికమాయెను భేదరాహిత్యభావమును, స్వాతంత్ర్యకాంక్షయు, ప్రజాపాలనమును, ప్రత్యేకవ్యక్తిస్వత్వమును దలయెత్తి ఏమినుడిగినను అది స్పష్టమై, ప్రజలకు గ్రాహ్యముకావలెననియు, ఏకొలఁదిమంది ప్రత్యేకవిభూతియో కాకుండవలెననియు వాకొనుచున్నవి శైలి సులభమై యుండవలెనని నేఁటి ప్రజాసేవకులును, ప్రజాసేవకుల అడుగుజాడలందు తమకలములను నడపు సాహిత్యసేవకులును పలుకుచున్నారు.

ఎడ్గరువాలెస్, హెచ్. జి వెల్సు, గాల్సువర్దీ, బెర్నార్డ్‌షాలు అధునాతనయుగ ఆంగ్లసారస్వతాచార్యులలో ముఖ్యులు. బ్రౌనింగుయుగమునుండి వీరు వేఱైరి ఇబ్సెన్‌మార్గమునుబట్టి చనిన గాల్సువర్దీ మున్నగువారు సాంఘికసేవకై కలమునెత్తి, సంఘదురాచారములను కనులెదుటఁ బెట్టి సంఘజీవనమందే మనసు నిలిపిరి. (Vide Galsworthy's Social Drama "Justice") ఎడిసన్ మున్నగువారి క్లబ్ యుగమందలి సారస్వతమునకును, రమారమి రెండు శతాబ్దముల సైన్సుసామ్రాజ్యమును, సైన్సుచెడుగులను జూచిన నేఁటి సారస్వతమునకును ఎంతేనిభేద మున్నది తనముందరివారి గోడుగాని, గొప్పగాని కన్నెత్తిచూడని బెర్నార్డ్‌షా తన తెన్ను తాను త్రొక్కెను స్పష్టమై, తీవ్రమైన ఉచ్చారణమును కాంక్షించు ప్రజ లీతని Apple Cart ను నమలిమ్రింగిరి నేఁటి Adventures of a Black Girl ను దోసెయట్లు దవుడలందు మెలివెట్టుచుండిరి.

నేఁటి భావవాతావరణము పృథ్వియం దన్ని సీమలందును నొకేతీఱున వీచుచున్నది. నేఁడు భారతసీమయందు గణనీయమై యున్న వంగసాహిత్యము నించుక పరిశీలింపుఁడు. స్వదేశమన్నను, స్వరాష్ట్రమనినను చెవిగోసుకొను వంగీయులు ఆంగ్లసాహిత్యము ననుసరించియే తమ సారస్వతమును నడపిరి. ఇది వంగేతరులకు విరుద్ధముగ చూపట్టవచ్చును. అభివృద్ధిగోరువారు అవసరమగుపట్ల అనుకరించుటకు వెనుదీయరు. వీరి యనుకరణము అంధానుకరణము కాదు. ఒరుల యాదర్శము ననుసరించి కొంతదూర మరిగి, వీరు తమవ్యక్తిత్వమును తాము తేటపఱచు

కొందురు. ఆంగ్లసారస్వతమును వెలివెట్టని వంగసాహిత్యము, నేఁడున్నతినందినది. బంకించంద్రుని యుగము అద్భుతములను, విద్యూరములను, ఉన్నతాశయములను, గంభీరభావములను, సౌందర్యమును, సౌఖ్యమును, ఆనందమును, ఆర్తిని, ఆశాభంగమును వ్యక్తీకరించెను కావున నాఁటి వంగసారస్వతము గంభీరమై, సౌష్ఠవసంపన్నమై యుండెను. దేశదారిద్ర్యమును, ప్రజాదుఃఖమును విజృంభించుచుండ కళాకౌశల్యమునకును, కవితాసైపుణ్యమునకును, ప్రకృతిసౌందర్యమునకును తావేలయని నేఁటి వంగీయు లనిరి. అందుచే నాఁటి యుత్సాహమును, చిత్రవిచిత్రరచనమును నేఁటి వంగీయునకు రుచింపవు ఇపుడు వంగసీమయందు బంకించంద్రునిగాని, పాంచకడీదేనుగాని ఆదరించువారు లేరు. "కపాలకుండలి"ని గాని, "నీలవసనసుందరి"ని గాని, "చంద్రశేఖరు"ని గాని, "ప్రతిజ్ఞాపాలనము"నుగాని నేఁడు తెలిసిచు వంగీయుఁడు లేఁడు. వంగసంఘస్థితిని ఉన్నదున్నట్లు తేటమాటలందు తెలుపుగ్రంథములే నేఁటి వంగసాహిత్యప్రపంచమున ప్రసిద్ధి నందుచున్నవి. శరశ్చంద్రచట్టోపాధ్యాయుఁడు వంగనభమున శరశ్చంద్రుఁడై నేఁడు వెలుఁగొందుటకు కారణ మిది శరశ్చంద్రునందలి కవిత శరశ్చంద్రచటర్జీయందు లేదు. చటర్జీ శరశ్చంద్రుఁడు సంఘసేవను ఆదర్శముగాఁ గొనియే తనకలమును సాగించుచున్నాఁడు. పల్లెవాసులపై నీతనికిఁ గల ప్రేమ ఈతని "పల్లీసమాజ్" వల్లను, నిరంకుశత్వముపెడల నీతనికిఁ గల క్రోధము "పథేర్ దాబీ" వల్లను గుర్తింపఁబడును. ఇపు డీరెండవగ్రంథముయొక్క పీకి నొక్కఁబడెను. ఇది జీవింపరాదని ప్రభువులు శాసించిరి. ఈతని "బిందూర్ ఛెలే", "రామేర్ సమితీ", "దత్త", "బడోదిది" "మేజదిది" "బిరాజ్ బౌ", "పరిణీతా", "చంద్రనాథ", "పండితమహాయి"లు ఆమూలము సంభావణలతో నిండియుండును ఈతని "చరిత్రహీన్" "శ్రీకాంత"లు ఉద్గ్రంథములుగా నెన్నఁబడుచున్నవి. ఈతని "గృహదహనము" నిఘంటువువలె నుండును. ఈగ్రంథములందు కథాచమత్కారము సున్న. అధునాతనవంగసంఘమును ప్రతిబింబించు దర్పణము లీపుస్తకములు. శరశ్చంద్రుఁడు వాడుకమాటలనే ఉపయోగించును. నూతియందుఁ బడిన ఱాలవలె నీమాటలు చివాలున చదువరిహృదయమునఁ బడిపోవును. వంగదేశమందలి పండితపంచాస్యులు, శరశ్చంద్రుని మాటలకు ఆంక్షపెట్టక "దిగ్విజయమందితి"వని యీతని నాశీర్వదించిరి. "నాపని ముగిసినది—నీ వింకను చేయవలయు సేవ యెంతేని యున్నది. అభివృద్ధి నందుము" అని రవీంద్రుఁడు, గతవత్సరము, వంగసీమ, శరశ్చంద్రోత్సవము సలుపునవసరమునఁ దన యాశీస్సు నంపెను. ఏకగ్రీవముగ వెడలిన ఈయాశీస్సులు, వంగసీమయందు నేఁడు పట్టాభిషేకమందిన వాడుకమాటకే యని ఆంధ్రసోదరులు గుర్తింతురుగాక.

వంగసోదరిచెస ఆంధ్రసోదరి దృక్కులు పఱపుచునేయున్నది. సంస్కృతమును పఠించినట్లు, మన పండితపంచాస్యులు వంగపఠనమునకుఁ గడంగిరి. కొంద ఱనువాదములకు పూనుకొనిరి. వంగసీమయందలి వాడుకమాటకుఁగాని, వాడుకమాటయందలి జాతీయమునకుఁగాని అవగతులుగాని తెలుఁగుసోదరులు కొందఱు అనువాదములకు సాహసించి 'తప్పులతడకలు' ఆంధ్రసీమయందు వదలుచున్నారు. వంగసారస్వతహృదయమును గుర్తింపని వీరి వ్రాఁతలవలన ఆంధ్రసోదరులు మోసపోకుందురుగాక. వంగసాహిత్యమును రుచిచూచిన శ్రీ శివశంకరశాస్త్రిగారు వంగీయుల ననుకరించుచుండిరి. వెనుకటి పద్ధతులను, పురాతననిబంధనలను వెలికిఁద్రోయవలె ననుచుండిరి. ప్రజాసేవ చేయవలెనన్న, వాడుకమాటలనే ప్రయోగింపవలెనని వర్తమానాంధ్రసారస్వతోద్యమాచార్యులు, మహోపాధ్యాయులు శ్రీ గిడుగు వేంకటరామమూర్తిగా రనుచున్నారు. సారస్వతము సంపూర్ణముగ ప్రజాసేవయే అగుచో, వీరి యుద్దేశము మహత్తరమైనదని చెప్పకతప్పదు.

ప్రజాసేవ విపులభావసమన్వితమైనది. ప్రజలదుస్థితిని పాపుటే ప్రజాసేవ చేయుటని పల్వురు నేఁ డభిప్రాయపడుచున్నారు. సారస్వత మొక్క సేవమాత్రమేకాక కళకూడయని వీరు గ్రహింపవలెను. టాల్‌స్టాయిజీవనమున సారస్వతోద్దేశములు ప్రస్ఫుటించెను. పల్లెవాసులును, నిరుపేదలును, కూలివాండ్రును, అభాగులును టాల్‌స్టాయ్, అస్సెసీసన్యాసి, రస్కిన్, గాంధులఁబోలు యోగుల గుండె పేగులైరి. సన్యాసికాకమున్న టాల్‌స్టాయ్‌హృదినుండి వెడలిన శైలికిని, యోగియైనపిదప ఆతనికలమునుండి స్రవించిన శైలికిని ఎంతేని భేదమున్నది తొలిశైలియందలి సౌందర్యలహరి మలిశైలిలో లేదు నీతిప్రబోధమును, సాంఘికాభ్యుదయమును స్పష్టోచ్చారణమునఁగాని ప్రజలను జేరవు నిరుపేదలైన రష్యన్‌వాసుల కష్టనిష్ఠురములను చూచి, రష్యాయోగి, పేదరికమును కవుంగలించుకొనెను. న్యాయస్థానములందును, ఉన్నతసౌధములందును దోఁచిన అనుచితవిధానములను వెల్లడించెను. ఐశ్వర్యమందు పొరలాడు దురాచారములను బయటఁబెట్టెను. ఈతనియుద్దేశమును గ్రహింపఁజాలక సుప్రసిద్ధమైన యీతని "Resurrection" నీతిబాహ్యమైయున్నదని John Bellows టాల్‌స్టాయిని వెక్కిరించెను. వినీతభావమున ప్రత్యుత్తరమొసఁగుచు (౩-౧౨-౧౯౦౧) రష్యాయోగి తనయుద్దేశమేమో ఆతనికిఁ దెలిపెను. యుద్ధమువలని అరిష్టముజూపిన పాశ్చాత్య మహనీయులలో రస్కిన్ మొదటివాఁడు. ఈతని వ్రాఁతలే ఆంగ్లేయసంఘసంస్కరణమునకు పునాదు లాయెను. గాంధిశైలి గాంధివలెనే యుండును. ఈశైలియందు పట్టుపుట్టముకాక అంగవస్త్రము తోఁచును. భూగోళమునంతను గుప్పగలిఁగిన యీచిన్నిగుడ్డవలె, చులకనైన ఈతనిశైలి అధునాతనపృథ్విని సత్యాగ్రహభావములచే నింపివైచెను. గాంధిచేతియందు దనారతము సాగుకండెకును, కదురునకును, కలమునకును భేదము లేదు. గాంధిశైలి మృదులమైన ఖద్దరువంటిది.

దరిద్రనారాయణులను కొలుచువారు దైవభక్తులు. భక్తియోగుల శైలికిని వీరి శైలికిని భేద ముండదు. తులసీరామాయణమును







1. ఆంధ్రజనసంఘము, పంచమవార్షికోత్సవము—కల్యాణి, అధ్యక్షులు: ప్రతాపగిరి రామమూర్తిగారు; 2. ఆంధ్రజనసంఘము సభ్యురాండ్రు.







1 మైలాపూరు శ్రీ వేంకటరమణ ఆయుర్వేద కళాశాల విద్యార్థులు, పండితులు 2 ఆంధ్రభక్త యువజనసంఘము, పెరియాం

తెఱచిచూడుఁడు. అక్కరములు చదువఁగలిగిన ప్రతివానికిని, అద్దమందలి నీడవలె, అందలి భక్తిభావము స్పష్టమైయుండును. భక్తుని వలెను, భగవంతునివలెను, రెండేసిపంక్తులు తియ్యనైన యమకమున నడచుచు, తిన్నఁగఁ బోయి హృదయపీఠమునఁ జేరుకొనును ఏసు కథలు చులకనై యుండునని బైబిలువిద్యార్థి తెలియఁగలుగు. మహమ్మదు వాడుకమాటలందే మతప్రబోధముఁ గావించి, జనసామాన్యముయొక్క దృష్టి నాకర్షించెను. భక్తిప్రూరితములైన పోతనపద్యములు సులభశైలియందుఁ దేలియాడును. నిర్మలనీతిగర్భితములైన వాక్కుల నుచ్చరించుటం దాతిశ్రేష్ఠుని మార్కస్ యురేలియస్ శైలియును, ఇటీవల గతించిన హాల్డేన్ శైలియునుగూడ సులభమైయుండును. తత్త్వశాస్త్రవేత్తలును, జ్ఞానయోగులును క్లిష్టమైన భావములతోను, జటిలసమస్యలతోడను పెనఁగులాడుదురు కావున వీరిశైలి కూడ సాధారణముగ జటిలమయ్యే యుండును శంకరాచార్యుని శైలి సామాన్యులకు బోధపడదు శంకరునిబోలు మేధాసంపన్నుఁడు పృథ్వియం దేకడనైనను, ఏకాలమందైనను పుట్టియుండ లేదు. ఈతని వైదికధర్మప్రతిభ పామరులకు దురూహ్యమైయుండెను పోతనశైలియందు భేదములు చూపట్టుటకు కారణము భాగవతము వ్రాయుతఱి సందర్భానుసారమైన భిన్నభావములు ఆతనిమనసునఁ దోఁచుటయే. సాధారణముగా స్త్రీలకు బోధపడునది భక్తియోగము గాని జ్ఞానయోగముకాదు ప్రౌఢకావ్యములు వీరికి బోధపడవని యెఱిఁగి భక్తిబంధురములైన ఉత్తమాశయములను కొందఱు కవులు ద్విపదలందే వెదఁజల్లిరి. రంగనాథ రామాయణము, సిద్ధేశ్వరచరిత్రము, నలచరిత్రము, రాజయోగసారము, హరిశ్చంద్రోపాఖ్యానము, పరమయోగి విలాసము మున్నగు గ్రంథము లిట్టివి. ప్రాకృతభక్తుల మహితచరిత్రలను విశదమొనరించు బసవపురాణమును తెఱచిచూడుఁడు జాతిభేదములను పాటింపక, జనసామాన్యమునకు మతప్రతిభను దెలుపఁదొరఁకొనిన వీరశైవమును దోలుకాడించు ఈపురాణశైలి మిగుల సులభమై యున్నది. ఆళ్వారుల నుడువును, శైవుల లింగమును పోలినదే పాల్కురికిసోమనాధకవి కల ముండెను. రామదాసుకీర్తనలును, యక్షగానములును, భక్తిరసముతో నిండిన పాటలును ప్రతినిరుపేదకును బోధపడును భక్తునకు ఏమఁగడ దృఢవిశ్వాసముగాని గభీరయోచన గాదు అంతయు రామమయమని రామస్మరణ మొనరించు భక్తున కేవిమర్శనలును, ఏ మీమాంసలును గిట్టవు. తర్కశాస్త్రమును, తత్త్వశాస్త్రమును ఈతనికి బోధపడవు తరంగములును, పదములును ఈతని తారకమంత్రములు. సులభభావమును కాంక్షించువానికి సులభశైలిగాక కఠినశైలి యెట్లు బోధపడును? కఠినభావబంధురములైన వేదాదిగ్రంథములు పామరుల కెట్లు బోధపడును? పతంజలి, జైమిని, యాజ్ఞవల్క్య, పాణినులు సాధారణులను బెదరింతురుగాని ఆదరింపరు. ఇఁక పాళీ గ్రంథములను తెఱచిచూడుఁడు.

పాళీభాష బౌద్ధమతప్రబోధమునకు సాధనమైనది. బౌద్ధమతము జాతిభేదములను పాటింపదు. సర్వజనులకు నుద్దేశింపఁబడిన బోధనము సులభమైయుండును పాళీభాష పల్లెవాసుల మాటవలె నుండును సంస్కృతమందలి కఠినవర్ణక్రమ మిందు కత్తిరింపఁబడెను. దృష్టాంతము చూడుఁడు:

"అతీతే బారాణసియామ్ బ్రహ్మదత్తే రజ్జంకారెంతే, బోధిసత్తో కపియోనియామ్, నిబ్బతిత్వా,—నాగబలో, థామసంపన్నో, హిమవంతపదేసే వాసంకప్పేసి ("సుంసుమారజాతకము"ను చూడుఁడు) "నమోతస్సఅరహతో భగవతోసమ్మాసమ్బుద్ధస్స" (Prayer)

కఠినసంస్కృతపదములు పామరులకు వాడుకమాటలగుటకై మార్పులందెను. "భద్రే" "భద్దే" యాయెను "స్తోకమ్" "థోకమ్" ఆయెను ("థోకమ్గన్త్వా" సుంసుమారజాతకము) "మృగ" "మిగ" యాయెను ("నిగ్రోధమిగ" జాతకమును చూడుఁడు.) "వస్తు" "వత్థు" ఆయెను "స్థవిర" "థేర" ఆయెను. "స్నాయువు" "నాహారు" ఆయెను. "అద్భుతము" "అబ్బుత" మాయెను. "దృష్టి" "దిట్ఠి" ఆయెను. (Buddha's Eight fold Path)

"సుత్తం గెయ్యం గాతు ఇదాని ఇతివుత్తకం
జాతకబ్బుతవేదల్లం నవాంగం సత్తుశాసనం."

"విద్యుల్లతవిద్యోతమానములు" "విజ్జుల్లత విజ్జోతమానము" లాయెను ("వానరింద"జాతకము చూడుఁడు) సంస్కృతధాతువు "కర్" నుండి పాళీయందలి "కారేసి", "కప్పేసి", "కప్పతి" పుట్టెను "ప్రతిష్ఠతి" నుండి "పతిట్ఠతి" పుట్టెను—"సుమేరు వాసుప్పతిట్ఠతి" ("దీపవంశ"చూడుఁడు) సంస్కృతసమాసములు మార్పుచెందియే పాళీయందు ప్రవేశించెను. "ధనవస్సాపనకనక్ఖత్త యోగే లద్ధే" ("వేదబ్బ" జాతకము చూడుఁడు) "నిమ్మక్ఖికమధు పటలసదిశమ్", "మజ్జపానపమత్తో" మొదలగునవి గమనింపదగును. "అబ్భంతరమ్ తే అట్ఠిగహనమ్" ("ధమ్మపదము"), "కప్పుతిసింగి లోనకప్పో, కపతిద్వంగులకప్పో", "పానాతిపాతవేరమని", "పరి నిబ్బుతంహి బుద్ధస్స", "వరమ్మయమ్ ఉదంబరమ్", "అనాథపిండికస్స ఆరామే" ("మంగళసూత్తమ్"), "మతకభత్తమ్" మొదలగునవి పాళీభాషయందు మార్పుతోఁ బ్రవేశించిన సంస్కృతపదసముదాయము. వాడుకమాటలను నిర్మించుపట్ల మనపూర్వుల కున్న సాహసము నేఁడు మనకు లేదని నిరూపించుటకే కొలఁదిమాత్రపు పాళీమాటల నిం దుదాహరించితిని. చోద్యమేమన, పాళీలోని వాడుకమాటలకును మనతెలుఁగునందలి వాడుకమాటలకును అచ్చటచట పోలికలు కలవు. బౌద్ధయుగమున నాంధ్రులు భరతభూమి నేలినందున, బౌద్ధప్రచారమునకు ఆంధ్రమహీపతులు పూనుకొనిరి. కావున, నాకాలమున తెలుఁగుపాళీలు సైదోడులట్లు మసలియుండును,

తెలుఁగుశాసనములందలి ప్రాచీనాంధ్రమును గుర్తించుటకు లక్ష్మణరావుగారును, మిత్రులు సోమశేఖరశర్మగారును పాళీపండితుల సాహాయ్య మపేక్షించియుండిరి. తెలుఁగుపదములందలి తీఱునందును, పాళీశబ్దములందలి పొందికయందును పోలిక చూపినపుడు నాకు మిగులఁగూర్చు నాచార్యులగు పున్నానందసిద్ధార్థులను భిక్షుకసన్యాసులు అచ్చెరువొందువారు. జనసామాన్యమున కనుకూలించు సారస్వతములందు పోలికయుండుటకు హేతు వవి వాడుకమాటలతో నిండియుండుటే. బౌద్ధయుగమున తెలుఁగుపాళీల సమ్మేళన మున్నట్లు నిదర్శనములు తోఁచుచున్నను, ఆకాలమున ప్రత్యేకాంధ్ర మెట్లుండెనో స్పష్టముగ నెఱుఁగుటకు తగు నిదర్శనములు కానవచ్చుటలేదు. ఆంధ్రము ఋగ్వేదమునాఁటిదయ్యు, ("ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక" ఆశ్వయుజకార్తీకమాసముల సంచికయందు ప్రచురింపఁబడిన మహాకవి కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగారి 'ఆంధ్రి-తద్విశిష్టత' అనువ్యాసమును చూడుఁడు) అత్యంతప్రాచీనవాఙ్మయములగు పాళీప్రాకృతములతోడను, వేదభాషలతోడను సంబంధముఁగలదయ్యు, శ్రుతి స్మృతిపురాణేతిహాసాదు లన్నింటియందును, ఖండాంతరసీమలందును ప్రశంసనందినను, క్రమమగు నాంధ్రభాషాచారిత్రము కానరాకుండుట దుఃఖకరము.

ఆంగ్ల వంగసారస్వతచరిత్రలనుబోలు చరిత్రలు మన తెలుఁగున లేవు. చిలుకూరివారును, భావరాజువారును, మల్లంపల్లి వారును ప్రశంసనీయమైన పరిశోధనము చేయుచునే యున్నారు. కాలక్రమమున నాంధ్రసీమయందు ఒక రికెట్‌గాని, సునీతికుమార ఛటర్జీగాని తలయెత్తి ఆంధ్రభాషయందలి ఈలోపమును దీర్చివేయుదురు గాక.

బహువర్షములనుండి తెలుఁగును సంస్కృతము పూర్తిగ నాక్రమించివైచినది. తెలుఁగువ్రాయుతఱి సంస్కృతైశ్వర్యమును చూపు పండితుఁడు గొప్పగ్రంథకర్తయని గణింపఁబడుచుండెను. ఏభాషయందును లేని వ్యాకరణనిబంధనములును, ఛందోనియమములును మన తెలుఁగునఁ బ్రవేశించినవి. తన నిరంకుశత్వము తన్నే చెఱచినట్లు, నిరంకుశభాషాశాసనమునకుఁ దలపడిన ప్రముఖులనే ముప్పుతిప్పలు పట్టివైచినవి. వ్యాకరణసూత్రములనుబట్టి చూచినయెడల, సాధారణుల మాటటుండ పండితుల వ్రాఁతలే 'తప్పులతడిక'లై యున్నవని ఋజువాయెను. తాము గుర్తింపని తప్పులున్న వ్రాఁతలను సాహిత్యమనియు, కొంతవఱకు ఛందోనియమములను పాటించి, ఒకఁడు వడవడ నాలుగుమాటల నుచ్చరించినంతన నతఁడు కవికంఠీరవుఁడనియు, మూలిఁగినను, నీలిగినను ఆతఁ డాశుకవనమునే ప్రయోగించుననియు, ఛందోనియమముల నెఱుఁగనిదికావున గద్యము ఎన్నఁదగినది కాదనియు, గద్యమువ్రాయువాఁడు పద్యమువ్రాయువానివలె పూజనీయుఁడు కాఁడనియుఁ దలఁచు మహనీయులు నేఁడును మన ఆంధ్రసీమయం దున్నారు. హానంజేసియే తెలుఁగుసారస్వతమున గద్యగ్రంథములు మిక్కిలితక్కువగా నున్నవి. ఆంగ్లవంగసీమలందు గద్యగ్రంథకారులు మూర్ధాభిషిక్తులైయున్నారు. గద్యమందు కవనముండునా యనియు, గద్యలేఖనమున గొప్పందన మేమున్న దనియు తెలుఁగులు పెదవివిఱుచుచు, భావశూన్యమయ్యు నాలుగుపంక్తులను పద్యమువలె పేర్చి, దీర్ఘముదీసి, చవుకబిరుదములు మెడదాల్చి యొకఁడు ప్రత్యక్షమైనంతన నాతనికి 'జయమంగళ' మనుచున్నారు! సారస్వతమేమో, సారస్వతహృదయమేమో యెఱిఁగినవా రాంధ్రసీమయందు మిక్కిలితక్కువగ నున్నారని బిగ్గఱగ పలుకుటకు నేను జంకను. సారస్వతముగాని సారస్వతమును విడఁగొట్టుట, భాషాసేవకులను తప్పుగొప్పులనుండి తప్పించుట యగును.

నిరంకుశత్వము రాజ్యములను, రాజన్యులను నేలఁగూల్చునట్లే భాషాచక్రవర్తులనుగూడ కూల్చును. పాలనము ప్రజాక్షేమమును చేకూర్చునట్లు సాహిత్యప్రరోభివృద్ధిని పెంపొందించును. మితిమీఱిన నిబంధనములు పెచ్చిల్లినపుడు నిరంకుశత్వము తలయెత్తును. అక్కఱగల నియమములు లేకున్నయెడల, నరాజకము విజృంభించును. ఎవరికివారే రాజులైన, విప్లవము పుట్టునట్లే, ఎవరికివారే భాషాశాసనమునకుఁ గడంగిన, భాషావిప్లవ ముద్భవించును. ఎదుటివాని స్వాతంత్ర్యమును పాటించి, నడచు స్వాతంత్ర్యమే స్వాతంత్ర్య మగునుకాని విచ్చలవిడిగా త్రాగుబోతువలె గంతులిడ దలఁచు ప్రవృత్తి స్వాతంత్ర్య మనిపించుకొనదు. నిరంకుశత్వ మెట్లనర్థదాయకమో, నియమరహితాచరణమును నట్లే యనర్థదాయకము. శైలిపెనగులాటయందు అరిష్టగర్భితములైన ఈ రెండు క్తులును మనసీమయం దొకదానితో నొకటి డీకొని ఘోరరణము సలుపుచున్నవి. కట్టుత్రాళ్లను దెచ్చి, భాషాసతికి కట్టఁబెట్టు పండితులును, భాషాయోషశరీరగఠనమునకు వలయు ధమనిస్నాయువులను తెగవమెయి తెంపుటకు సంశయింపని ఇష్టవిహారులునుగూడ దోషులనియే నాయభిప్రాయము. తెలుఁగుభాషపై పూర్తిగ సంస్కృతమును దాడివెడలనిచ్చు టెంత దోసమో, సంస్కృతమునుండి తెలుఁగునకు రాఁగల సొంపును తుడిచివేయుటయు నంతదోసమే. ప్రబంధములనాఁటినుండియు నెట్టిప్రతిఘటనము నెఱుఁగని నిరంకుశత్వమునకు గొప్పదెబ్బ నేఁడు తగులుట శుభదాయకమే; కాని, యీదెబ్బ సమయించునదిగాక, ఉద్ధరించునది యైయుండవలెనని నాయుద్దేశము.

అన్యభాషాచరిత్రలందలి మార్పులను సంక్షేపముగ విమర్శించుపట్ల, తోఁచిన శైలిభేదములు మనభాషయందు అంతగా లేవు. డ్రైడను, బైరనుయుగములుగాని, బంకించంద్రశరచ్చంద్రయుగములుగాని మన భాషాచరిత్రయందు లేవు. సాహితీహృది నెఱిఁగిన శంకరకవి, వేంకటకవి, తిక్కన మున్నగువారు కొందఱు గోచరించినను, బండ్లకొలఁది సంస్కృతపదములను దెచ్చి విసరివైచినవారే బహువర్షములనుండి పూజనీయు లగుచుండుటచే ఒక బంకించంద్రుఁడుగాని, ఆతని కెదురై నిలుచు నొకశరచ్చంద్రుఁడుగాని మనసీమయందుఁ

దోఁచలేదు. ఏభాషయందును దోఁచని అపూర్వగ్రంథకర్తలు, కాలనేమిపై తమ స్యందనమును నడుపుచు, అపూర్వయుగమును మన భాషయందుఁ బుట్టించిరి.

ఇపుడు మనకన్నులెదుటఁ దోఁచిన శైలిభేదములు నాలుగు అలెగ్జాండరుపోప్‌శైలి, కీట్సుశైలి, భట్టుమూర్తిశైలి, నేఁటి స్వచ్ఛంద శైలి. పోప్, స్విఫ్టుల ప్రకృతులును, వారి కాలపరిస్థితియు వారిశైలిని నిర్దిష్టమొనరించినవి. కీట్సుషెల్లీల ప్రకృతులును, వారి కాలపరిస్థితులును వారి శైలిని వారియట్లు కావించెను. "ఆమాటలు వల దీమాటలు వ్రాయు" మని వీరిలో నెవ్వరినైన నిర్బంధించినను, వారు వేఱు తీఱున వ్రాయఁజాలరు. డ్రైడను వర్డ్సువర్తు కాఁగలుగునో, అతని శైలియందు వర్డ్సువర్తు Pantheism ప్రవేశింపఁజాలును. త్రివ్విహాతర వేయుదునని జోనాథన్ స్విఫ్టును నిలువంబెట్టినను అతఁడు షెల్లీవలె వ్రాయఁజాలఁడు. నిలువునఁ జీల్చివేయుదునని కీట్సును అడలించినను, అతఁడు లేంగలండ్ వలెఁగాని, లాంగు ఫెలోవలెఁగాని వ్రాయలేఁడు. "నీ మచ్చ మాపుదును; నీవు షేక్స్పియరువంటిపాత్రను తయారుచేయు"మని మారిస్ మెటర్లింకును జడుపెట్టినను, అతఁడు డ్రైడనుదెసఁ దొంగి యైనఁ జూడఁడు. "డొక్క వాలికలుచేయుదును; నీవు రాసెలీస్‌ను మార్చి Junius Letters శైలిలోనికి దిగు"మని స్థూలకాయుఁడగు జాన్సనును భయపెట్టి సంకెలుతీయించినను అతఁడు తన శైలిని మార్చుకొనలేఁడు. షెప్పిసును నిలువంబెట్టి, "నీబ్రదు కీడ్చ—ఆసీ యన్ లెటర్సును ఎందుల కనుకరింపలే"దని అతని గూబను గుటిజూచిన "నమ్మో!" యని అతఁడు పాఱిపోవును గాని చెప్పినట్లు వినఁడు. "డివైన్ కమిడియా" గ్రంథకర్త "త్రిమస్కిట్యేర్సు" గ్రంథకర్త కాలేఁడు. "హేమ్లెట్", "వెండెట్టా"లను వ్రాసిన కలము, "లామిసర్‌బుల్సు", "కెనెల్‌వర్తు"లను బుట్టించిన కలముల కెనరాదు. న్యూమేన్ జెరేమెటేలరు కాఁజాలఁడు. స్విన్‌బర్న్ ఏమియర్ కాఁజాలఁడు. జార్జియలియట్, జేన్ ఆస్టిన్ కాఁజాలదు. మిసెస్ బ్రౌనింగు, మిసెస్‌కార్లైలు కాఁజాలదు. Miracles, Mysteries, Interludes నాఁటి ఫుంతను ప్రవేశింపుమని మార్లో నెవ్వరైనను నిర్బంధింపఁగలిగిరా? టెన్నిసను తన ప్రిన్సెస్‌ను చెఱిపివేసి, ఇలియడ్‌ను వ్రాయఁగలఁడా? ఒకరి శైలి యింకొకరి కలవడకపోవుటకు కారణము, ఒకరు వేఱొకరు కాఁజాలకపోవుటే. ఒకరి శైలి అధికమైనదనియు, వేఱొకరి శైలి అల్పమైనదనియుఁ దెలుపఁ జెల్లదు. పోప్‌యొక్క "Dunciad," "Rape of the Lock"లును కీట్సుయొక్క "Hyperion," "Endymion" లును, బైరనుస్విఫ్టుల "Childe Harold", "Gulliver's Travels" ను, టెన్నిసను షెల్లీల "In Memorium," 'Prometheus unbound" లును, బెన్‌జాన్సన్ గోల్డుస్మితుల "Valpone", "The good natured man" లును విభిన్నశైలియం దున్నను, ఆంగ్లసారస్వతమునకు సరిసమముగ వన్నెఁదెచ్చిన లేఖనములు. స్విఫ్టుశైలిలో నొక్క అలంకారమైన నుండదు. ఈతని గద్యశైలి అద్భుతమైనదని పల్వురు సాహిత్యాచార్యులు వ్రాసిరి. ("Swift is one of the greatest masters of English prose" Vide: History of English Literature by Saintsbury.) షెల్లీ "Defence of Poetry" యును, మిల్టన్ "Areopegatica"యును, ఎడ్మండుబర్క్ ఉపన్యాసములును, వ్యాసములును, లేఖలును అలంకారభూయిష్ఠములైన గద్యరచనలు. మరల వీరల రచనలకును కార్లైలుడీక్విన్సీల (Vide: Carlyle's "Sartar Resartus", "Heroes and Hero worship" "Frederick the Great of Prussia", "Cromwell", "Life of Schiller", Etc. and Dequincey's Famous Essays on "The Mail Coach", "Confessions of an English Opium-Eater" Etc) అద్భుతగద్యరచనలకును ఎంతేని భేద మున్నది. కార్లైలు ఎమర్సనువలె తత్త్వమయుఁడు. కార్లైలుతనరచనలం దన్నెనిజర్మ్మనుమాటలను గలుపుటకు సంశయింపలేదు. నేఁటి సరోజినిగద్యరచనలును, రవీంద్రుని గద్యరచనలును అలంకారములతో నిండియుండును. రాధాకృష్ణ శ్రీనివాసులు సులభశైలినే కాంక్షింతురు. వీరిశైలి కవితాగర్భితమై యుండును. అరవిందుని శైలి సులభముగాక వీర్యవంతమై, తేజోవంతమై యుండును. వ్యక్తిప్రకృతి ననుసరించి వ్యక్తిహృదినుండి అల్లుకొని వచ్చు శైలిని మార్చుటకు భాషాశాసన మొనరించు మనుష్యమాత్రునకేకాదు, సర్వశక్తిమంతుఁడైన జగదీశునకైనను తరముకాదు.

తక్కిన రెండు తెలుఁగుల శైలి విడ్డూరమైనది. రామరాజభూషణుని శైలి సహజమై, ప్రకృతి ననుసరించిన శైలికాదు. ఈతని వసుచరిత్రముతోఁ బోల్పఁదగు శ్లేషకావ్యము ఆంధ్రమున మఱియొకటి లేదనుట నిక్కము. ఆదికవులు ప్రయోగింపని పదముల నెన్నిని యీతఁడు తన వసుచరిత్రయందు ప్రయోగించి, ప్రశంసనీయమైన స్వాతంత్ర్యము గొంతజూపెను. హరిశ్చంద్రనలోపాఖ్యానములు వ్రాసి యీతఁడు ప్రసిద్ధినందెను. ప్రజ్ఞాధురీణుఁడయ్యు నీతఁడు తన శైలిని కటికిరాళ్లతో నింపివైచెను. రామకృష్ణపెద్దన్నల మీఁది పంతమును, రాజసమ్మానమునెడల ఆశయు, భావనుగుఱించిన వెఱ్ఱిఅపోహయు నొండొంటితోఁ గలిసి, మోటుజడవంటి శైలిగా నల్లుకొనియెను. తన్నుఁబోషించు ఱేఁడు తనను తరుమగొట్టియుండినయెడల, గిడుగుమెతుకులను నములుటకై, యీతఁ డేపల్లెకిమిడినో చేరి, వాడుకమాటలలోనికి దిగియుండును. తానుగానివాఁ డెట్లయినను గాఁగలఁడు. తనశైలిగాని శైలి నెన్నితీఱులనైనను మనుజుఁడు మార్పఁగలఁడు.

నాలవశైలి నేఁటి స్వచ్ఛందశైలికాదా? ఇది యొక్క ఆంధ్రసీమయందే నేఁడు ప్రబలఁదొడఁగినది. దీని గాథ మిగులఁ బెద్దది. వాడుకమాటలు వెలికూడదనువారికి వందనములు. వాడుక మాటలను తెలుఁగునుండి బహిష్కరించుట దోషమని నేను బిగ్గఱ

నటతురు. ఇరువదియవ శతాబ్దమున మసలుచు, నెనిమిదవ శతాబ్దసాంప్రదాయమును పునశ్చరణ మొనరించుట అవివేకమని తెలుపుటకు సంశయింపను. వాడుకమాటను త్రోసిరాజనఁజెల్లదనినంతన నే సాదనైనను, ఏరోదనైనను భాషలో గుప్పుటకు నే నొల్లను. వాడుకమాటలకై వాదించు గిడుగురామమూర్తిగారు రవీంద్రుని దృష్టాంతమును తఱచుగ పేర్కొందురు. రవీంద్రుని మూలమున వంగభాష నొరవడిగ నుదాహరింతురు.

వంగీయుల వాడుకమాటకును, ఆంధ్రుల వాడుక మాటకును ఎంతేని భేద మున్నది. ఆంధ్రులందువలెనే, తోడిహిందువులగు వంగీయులందు జాతిభేదము లున్నను, ఆంధ్రులందలి ఆచారభేదములును, వారివాడుకమాటలందలి వ్యత్యాసములును వంగీయులందు లేవు.

వంగబ్రాహ్మణులు మత్స్యమాంసములను తినువారైనను, సనాతనాచారములను పాటింతురు. వంగశూద్రులింట బ్రాహ్మణుల యిండ్లయందువలెనే దేవతార్చనాదినిత్యక్రియలు జరుగుచుండును. వివాహాదిక్రియలందుఁగూడ వంగశూద్రులు బ్రాహ్మణులట్లు వర్తింతురు. రజస్వలానంతరవివాహములపట్ల సాధారణవంగబ్రాహ్మణుల కెట్టి నిరాదరణమో, బ్రాహ్మణేతరులకును నట్టినిరాదరణమే. ఆచారములం దగ్రజాతులతో నైక్యముఁ జూపు వంగశూద్రులు, బ్రాహ్మణులయెడల విశేషభక్తిశ్రద్ధలు చూపుదురు. బ్రాహ్మణబ్రాహ్మణేతరులయిండ్లు పల్లెలందుఁగూడ నొక్కతీఱున నుండును. ఆచారములందు భేదములేని వంగసంఘమందు భాషాభేదము లేదు. మాటను బట్టి యితఁడు బ్రాహ్మణుఁడో, బ్రాహ్మణేతరుఁడో ఆంధ్రసీమయందు గుర్తింపఁజాలుదుముగాని, వంగసీమయందు గుర్తింపలేము. వంగనిమ్నజాతులమాటయం దించుకభేదమున్నను, వీరిమాట నిర్దుష్టమైన వాడుకమాటగా వంగసంఘీయులు తలఁపరు. వంగవాతావరణమున మసలి, బంగాళీవాడుకమాటయం దేకత యున్నదనినొక్కిచెప్పఁగలము. తెలుఁగువాడుకమాట తెన్నే వేఱని తెలుఁగు లెఱుఁగుదురు.

వేఱువేఱు జాతులందేకాక జాతులందలి వేర్వేఱు తెగలందు, వేర్వేఱుచోటులందు తెలుఁగున తేడాలున్నవి. వైదికబ్రాహ్మణులు 'ఏవంటావు?' అనక 'ఏమంచావు?' అందురు; 'అన్నాడట' అనుటకుమాఱు 'అన్నాడవ' అందురు. జాతులందలి భాషాభేదములందరికిని దెలిసినవే. "కూకో, లెగు, రేత్తిరి, బిరికి, గిని, లేదుగందా, కిందమడేసి" అను పదములను వాడువారనేకులు మనసీమయందున్నారు. సాలిపేటలను, చాకలిపేటలను, గమళ్లగూడెములను, ఈడిగగుడిసెలను, మాలపల్లెలను తిరిగి చూచితిమేని ఎన్నేనిరీతుల నుడువులు చెవిఁబడును.

స్థానస్థానములందలి భాషాభేదములు ఆంధ్రసీమయందు మెండుగా నున్నవి. గంజాముదిశాఖపట్టణజిల్లాలందు "అన్నదమ్ముడు" "అక్కచెల్లెలు" "వెళ్లిపోయివచ్చేశాడు" "పుల్లలావు" "పొత్తుపంచి" అనుమాటలు వాడుకయం దున్నవి. భూతకాలమునకుమాఱు వర్తమానకాల మొక్కొకపుడు తలయెత్తును. 'రాలేదు' అనుటకుమాఱు 'రావడంలేదు' అని యచటివా రందురు. బాగుగ నుత్తరపల్లెలందు ఒరియాగాలి సోకుచుండును. గోదావరిజిల్లావాసుల ఆంధ్రము పరిశుభ్రమైనది. అయినను వీరు దీర్ఘములుదీసి మాట్లాడుదురని ఇతరమండలములందలి తెలుఁగు లందురు. వీరిమాటకును, బందరుగుంటూరు ప్రాంతములందలివారి మాటకును కొంత తేడా యున్నది. 'ఆలా అనిరి' అని గోదావరితీరవాసు లందురు. 'అట్లా అన్నారు' అని పల్నాడు మున్నగుచోటులందలివా రందురు. "నాకు సరిపడదు" అనుటకుమాఱు "నాకు పట్టదు" అనువా రున్నారు. ఇఁక నెల్లూరు చిత్తూరు మండలములనుగుఱించి తెలుపనక్కఱలేదు. వీరు తెలుఁగు కూడునందు అరవసాంబారు కలుపుదురు! వీరి తెలుఁగున ఆంధ్రరసముగాక అరవరసము పొంగుచుండును! దత్తమండలములందలి తెలుఁగు వేఱుతీఱున నడచుచున్నది. బొంబాయిరాజధానియందును, ధార్వారుమున్నగు చోటులందును, కేరళమందును దెలుఁగు లున్నారు. వీరి వాడుకమాట వేఱొకరీతియం దున్నది. రంగము తెలుఁగు రంగు దేటియుండును. అన్యదేశములకువలసపోయిన తెలుఁగులమాట చిత్రరీతి నుండును. ఆంధ్రసాహిత్యమున వాడుకమాటలు చేరవలెనన్న, నెన్నితీఱుల మాటలో ప్రథమసంభావనకై ముందులకు పర్వెత్తుకొని వచ్చును. వంగసీమయందు వాడుకమాటల ప్రయోగమున కష్టమే లేదు. ఆంధ్రభాషయందు ఇచ్చవచ్చినరీతిని వాడుకమాటలను ప్రయోగింపవలెననిన, తలకు బొప్పికట్టుట తథ్యము.

పాకీవానినిగుఱించిన వంగపద్యమును రవీంద్రుఁ డింగ్లీషులోనికనువాద మొనరించెనని ఇటీవలజరిగిన కవితాసమితిసభలో శ్రీ గిడుగురామమూర్తిగా రనిరి. పాకీపని పాకీవానికి దైనికక్రియయే యయ్యు, మహాభక్తుల కాదర్శమైన మహత్క్రియ యని నేఁటి మహాపురుషులు గుర్తించుచుండిరి. తలవెండ్రుకలు పాకీచీపురుకావలెనని రామకృష్ణపరమహంస పలికెను. ఒకప్పుడు చాకలిపనియందు గోఖలేమెప్పుఁబడసిన గాంధిమహాత్ముఁడు పాకీపనియందు పాకీవాండ్రు తనకు సాటిరారని నిన్నగాక మొన్నఁ బలికెను. గాంధిగారి జర్మనీ శిష్యురాలు (స్పిజిల్) పాకీవీథులు తుడిచి, మద్రాసుపౌరులకు అబ్బురముఁ గొలిపెను. పాకీచీపురునకు నేఁడు గల గౌరవము వింజామరకు లేదు. వింజామరనంటిన వెండికంటె, చీపురునుగూర్చిన కూరిమిసూత్రమగు తడపయే నేఁ డెక్కుడాదరము నందుచున్నది. కావుననే, తళుక్కులనీను శైలికంటె తడపవంటి శైలికే నేఁ డధికాదరము చేకుఱుచున్నది.

తడపపై రవీంద్రున కాదరమున్నను, రవీంద్రుఁడు తడపను తలఁదాలపలేదు. ఈతని శిరోజములు వింజామరకేశములట్లును, వెండితీవలట్లును నుండును. గాంధిజీవలె నీతఁడు పురీషభాండమును తలపైఁ దాల్చి, శాంతినికేతనమున కవ్వలఁ బాతిపెట్టలేదు. ఈమహాత్కార్యమునఁ దాను గాంధిమోల నేమియుఁగానని పృథుకవీంద్రుఁ డొప్పు

శాసైను. తనపాదరేణువుల నొరుల కిచ్చు రవికవి, కాంతివంతమగు శైలి సులభశైలి నేర్పరతినట్లు గాంధిప్రేమాల పలుమాఱు సాగిలపడెను. గాంధి క్రియాకాముఁడు, రవి భావకాముఁడు. భావము క్రియకు తొలిపుట్టువు. మఱిజన్మమునఁగాని రవికవి గాంధి కాఁజాలఁడు. రవీంద్రుని శైలియందు గాంధి యాదర్శములు ప్రతిబింబించిననాఁడే, యిది శుద్ధఖద్దరువలె నుండును. రవీంద్రుఁడు ఖద్దరుధారి కాఁడని ఆచార్య రాయి మొరపెట్టెనుకదా! భావపోషణ కనువగు శైలిని రవీంద్రుఁ డుపయోగించును. పసిబాలుర కేడేండ్లు పాఠములు చెప్పుతఱి మిల్టను కవి Paradise Lost శైలిని ప్రయోగించెనా? సందర్భమునుబట్టి రవీంద్రుని హృదయ మవసరమగు శైలి నల్లుకొనును. రవీంద్రుఁ డొక్క వాడుకమాటలకే అంజలి ఘటించెనని తెలుపుట పొరపాటు. తనకు మిగులఁ బ్రియమైనకథ "ఏమకథ"లందలి హైమంతినికథయని యాతఁ డొకప్పుడు వచించెను. ఇందలి గభీరభావ మందఱికిని ఒలిచిన అనటిపండని తెలుపరాదు. చోకేర్ బాలీ, నౌకాడుబి, గోరామున్నగు నాతని నవలలను—నవలారచనమున రవీంద్రుఁడు విజయుఁడుకాలేదు—తెఱచిచూడుఁడు. వాడుకమాటలును, వాడుకమాటలుకానిమాటలును వీనియం దున్నవని చదువరు లెఱుఁగకపోరు. రవీంద్రుని "Creative unity", "Personality", "The Fugitive", "King of the Dark Chamber", "Crescent Moon", "Stray Birds", "Lover's Gift", "Broken Ties", "Sadhana", "Garden", "Cycle of spring", "Fruit Gathering", "Chitra", "Mashi", "The Home and the World". "Red Oleanders", "Hungry Stones", "Post Office." "Sacrifice", "Reminiscences", "Gitanjali", "Letters addressed to C.F. Andrews", "Essay on Nationalism", "Religion" Etc. ప్రతివానికిని అర్థమగునని పలుకుట కల్ల. ఈతనిగీతాంజలిలో నేమియు లేదని, వాసిగాంచినఆంధ్రకవులు—కవులని పేరొందఁబడు కవులుపలికిరి. పృథ్వీతలమందలి అధునాతన మహోత్కృష్ట గ్రంథములలో నొక్కటియని ప్రసిద్ధినందిన గీతాంజలియం దేమున్నదో యీయాశుకవు లెఱింగిరా? రవి వాడుకలో నేయున్నాఁడు. రవిఅంచటిని చేరుచునేయుండును రవినిచేరఁగలిగినవారెందఱున్నారు? ముక్తికి రవి ద్వారమని మన తత్త్వశాస్త్రము తెలుపుచున్నది. రవియందుఁ బ్రవేశించి, రవి-తత్త్వముగ్రహించి, సారస్వతమందలి ముక్తియానందము నెందఱు గోరిరి? వట్టిమాటల పెనగులాటతోఁ గాలముఁబుచ్చు నేఁటి శైలివాదులు, భావగభీరతలోనికి తొంగిచూడని నేఁటిశైలివాదులు, వాడుకయగుట, వాడుక కాకపోవుటే భాషాతత్త్వమని యూహాపోహలు నేఁటి శైలివాదులు, భాషాపునరుద్ధరణమున భావపునరుద్ధరణ మవసరమని గుర్తింపని నేఁటిశైలివాదులు హుమ్మనుచు రవిదెస నెగిరి మూఁతులు కాల్చుకొననేల?

వాడుకమాటయందు వంగసీమలో రెండువిధము లున్నవని చదువరులచెవిలో చెప్పవచ్చును. ఈ వాడుకమాటలు రెండుభాషల వాడుకమాటల ట్లుండునుగాని, తెలుఁగువాడుకమాటలవలె నొకేభాషయందలి వేఱుతీఱునుడువులవలె నుండవు. పడమరబంగాళమందలి భాషకును, తూర్పుబంగాళమందలి భాషకును ఏపోలికయు లేదు. తూరుపువంగవాసి మాటలాడుచుండ పడమటి వంగీయుఁడు, బంగాళ మెఱుఁగనివానివలెనే నోరుతెఱచుకొని నిలువంబడును! తూరుపు వంగీయులు తాము వ్రాయు పొత్తములందు పడమరవంగీయుల వాడుమాటనే ఉపయోగింతురు. అందుచేతనే వాడుకమాటపెనగులాట వంగసాహిత్యమున నుండనేరదని వాకొనియుంటిని. చిత్తరంజనదాసు తూర్పువంగీయుఁడని వింటిని. దాసు, కవచమల్లువాఁడు. పశ్చిమవంగమునే యాతఁడు వాడెను. తద్భవములందును, తత్సమములందును, దేశ్యములందును, గ్రామ్యములందును, వికృతులందును, పెక్కురీతుల వాడుకమాటలందును ఎగుడుదిగుడునడకలు నడచు తెలుఁగులు, ఒరులకు లేక తమకే సంక్రమించియున్న యిబ్బందులను గుర్తించి, ఒరుల యొరవడి ననుకరించుతఱి, వీనిని తొలఁగించుకొనుటకు పూనుకొనరేని ప్రాతపుంతలును, ముండ్లపొదలును, కటికిగొప్పులును, బురదగోతులును తెలుఁగురచనకు తప్పవు.

భావప్రకాశమునకు సముచితమైన భాష సాధనము. భాషాగమనికకు వ్యాకరణసూత్రము లవసరములు. ఇవి కట్టుత్రాళ్లుకాక, పట్టుదారములట్లు మృదులములై, అనురాగసూత్రములట్లు అదృశ్యములై యుండవలెను. తెలుఁగక్కఱములు ముత్తెములవంటివి. ముత్తెపుసరములోనిదారము వెలుపలికి తోఁచనట్లు, తెలుఁగులోని లక్షణసూత్రములు బట్టబయలుకానప్పుడే తెలుఁగుశైలి చక్కనిదై యుండును. పగ్గములను, ఉరిత్రాళ్లను తెలుఁగమ్మకంఠమునుండి పండితులు తొలఁగించుటపాడి. ఆంధ్రభాషాప్రపంచమున ద్వంద్వయుద్ధమునకు తొడరియున్న ఇరుపక్షములవారును తమదోసములు గుర్తించి, ఉత్తమసారస్వతోద్దేశములకు తోడుపడు సూత్రములను శాసించుపట్ల నిరువురు చేతులుగలుపుకొని, విశ్వవిద్యాలయముల సాహాయ్యమందవలెను. ఇట్లొనరించిరేని, ఎన్నెనిబాధలు తొలఁగిపోవును. వాడుకమాట నంగీకరింపని విశ్వవిద్యాలయములును, వాడుకమాటలనే అంగీకరించు గ్రంథాలయములును, విఱుగుడుమాటలను త్రుంపుడుమాటలను కాంక్షించు భాషాసమితులును, వాడుకమాటలని చెప్పి వంకరమాటలను దెచ్చి సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి చుట్టును రామభజనముచేయు అపూర్వభాషాభక్తులును పెడమొగములను బెట్టుకొనక, ఒకరిమొగముల నొకరు పరికించుకొని, వెక్కిరింతలకును, పండ్లపటపటలకును, కాఱుమాటలకును, కన్నెఱ్ఱలకును స్వస్తిచెప్పి, సొమ్మసిలియున్న భాషాసతికి శాంతియు, జ్ఞానందమును ప్రసాదించిరేని, దాతితెన్ను లేక అల్లాడు పాఠకులును, విద్యార్థులును ధన్యులగుదురు.

ప్రముఖులందఱునుగూడి, తెలుఁగురూపును మాపుచేయు సంస్కృతపదజాలమునకు త్రోసిరాజనుట చెల్లును. తెలుఁగువ్రాయుతఱి విభక్తిప్రత్యయములనుమాత్రము తెలుఁగునుండి తెచ్చి, తక్కిన

భాషనంతయు గీర్వాణమునుండి దిగుమతిచేయు నలవాటును రూపఱుఁ జేయు సెక్షనును ఇండియన్‌పీనల్ కోడ్‌లో వీరు ప్రవేశపెట్టించినను పెట్టింపవచ్చును. ఇట్లనిన, నోం బ్రెత్తు బ్రదుకు బ్రదుకుఁడనియుఁ తెలుఁగును చీకటికైదునం దుంపుఁడనియు నేను పలుకను. భారవహము లైన నగలుదాల్చి, నేలఁగూలిన టార్పియనుకన్యగాక తెలుఁగు తనకుఁ గాని, తాను తాల్పఁజాలని సంస్కృతభారమును తలపైఁజేర్చుకొనక, అవసరమగుపట్ల సొంపుఁగూర్చు భూషలను ధరింపవలెననియే నా తలంపు. ఒక్క సంస్కృతమేగాక, అన్యభాషలుకూడ తెలుఁగునకు తోడ్పడినచో, మనతల్లిమాట గమనికకలదై యుండును. బంగాళ మును పరికింపుఁడు. Chain, Table, Bracket మున్నగు మాటలకు వంగానువాదములు లేవు. ఆంగ్లపదములే వంగమందుఁ గలిసిపోయి నవి. ఒకప్పుడు కొంతస్వేచ్ఛయొసఁగిన తెలుఁగున నుర్దూమాటలు చేరినను, ఇటీవల నన్యభాషాపదములను మనపండితులు వెలివెట్టు చున్నారు. విశాలదృష్టిగల వీరేశలింగముగారుకూడ కలెక్టరుపద మునువాడుట కిష్టపడక "మండలకరగ్రాహి" యని కటికితాలివంటి ముక్కను విసరి, సామాన్యులకు బొప్పిగట్టించిరి. ఈకలెక్టరుపదము నకుముందు టికట్ అనిగాని, మఱికొన్ని విశేషణములుగాని ఉన్న యెడల, ఇనుపదారివలె తెలుఁగుశబ్దము పొడవెక్కును. భాషాశాసన మునకుఁ గడంగుమహనీయులు ఛాందసపుఁవ్రాఁతలందలి కష్టనిష్ఠురము లను గుర్తింతురుగాక.

పదప్రయోగములనుగుఱించిన శాసనము సాధ్యముగాని, శైలిని గుఱించినశాసనముకాదు. పదప్రయోగమే శైలియని ఊహించువారు పెక్కుండ్రగుటవలనను, శైలియనఁ బదప్రయోగముగాకున్నను, పద ప్రయోగము శైలిలోనిది కావునను, త్రుప్పుపట్టిన కొన్ని ప్రాతకట్టు బాట్లు నేఁడు ఆంధ్రవాఙ్మయప్రపంచమున నెంతేని అనర్థమును దెచ్చుచుండుటచేతను, అధునాతనపరిస్థితుల ననుసరించిన భాషాశాసన మవసరమని తెలిపితిని. ప్రజాసేవకు ఒక్కవాడుకమాటయే అక్కఱ కలదనువారి యుద్దేశము మహత్తరమైనదని వాకొనియేయుంటిని. ప్రజా సేవకై కావింపఁబడు నుపన్యాసములును, వ్రాయఁబడువ్రాఁతలును మనమపేక్షింపకయే వాడుకమాటలందు వ్యక్తమగును. ఆర్థికపునరుద్ధ రణమని యెంచఁబడు ప్రజాసేవకుమాత్రమే సాహిత్యము ఉపయోగ పడదు.

ప్రజాసేవ సారస్వతమందలి ఉద్దేశములలో నొక్కటైనను, సారస్వతము ప్రజాసేవమాత్రమే కాదు. సారస్వతము ఆధ్యాత్మిక మైన కళ. సారస్వతము నిష్కామకర్మవంటిది. ఫలితమును మందిడి కొనియే అది తన సౌందర్యమును గుమ్మరింపదు. కళయొక్క సహజ ప్రకృతి ఆత్మవికాసము. ఇది యాత్మవికసనమునఁ బెంపారుతఱి ఒరులు అనంతానంద మందుదురు. కళయన కాంతికాదా! దీని నారగించుతఱి ప్రకృతి తన్మయనృత్య మొనరింపదా! కళయు నానందమును హేతుఫలితములట్లు తోఁచుచున్నను, ఫలితము నభిల షించి హేతువు, తనహృదయమును విప్పుకొనదు. తన యైశ్వర్య మును తనయెడఁదయందు బిగించుకొనియుండుట కళాప్రకృతికి ప్రతి కూలము. సహజగుణప్రకాశమున కళ శోభిలునుగాని, తనగుణఫలము లను తానూహించి, ఒరులప్రశంసను గాంక్షించికాదు. అడవిని వెన్నెలకాయదా! ఆత్మహృదిని వెడలించుట కౌముదిసహజగుణము. మానవుఁడు కనివిని యెఱుఁగని తావులందు చక్కని పూవులు కుసు మించుటలేదా? ('Full many aflower is born to blush unseen. Vide: Gray's Elegy) సుందరివదనము కవితావిభూతి నొప్పదా? తనదెస నొకరు చూచినను, చూడకున్నను ఇంద్రధనువు నభోసీమం తినికటిసీమయందు వివిధరాగరంజిత విచిత్రమేఖలయట్లు కాంతిలదా? తమ్మొకరుచూచినను, చూడకున్నను తమ కొఱకు చేఁబు తెచ్చినను తేకున్నను, శిశిరబిందుసందోహములు ప్రభాతసమయములందు ప్రభాకరమరీచులనుగూడి, పచ్చికపానుపులపై పరితోషక్రీడలఁ దేలవా? ప్రాణులన్నియు నిదురించువేళ మిణుగురుపుర్వులు కాఱు చీఁకటులపై వింతకాంతులను విరజిమ్మవా? కవితాసంపదఁ గల హృదయము తన సహజసౌందర్యమును నలుకెలంకులందును కలువ డింపదా? సారస్వతహృదయమగు కవిత్వము పుస్తకములు చదివినందు వలనఁగాని, ఆచార్యప్రబోధమువలనఁగాని అలవడదు. బోధవలనఁగాని, కృషివలనఁగాని, పూవులను, జాబిలిరేకలను, మంచుతుంపురులను, ముత్తియపుదొంతరలను పుట్టింపఁగలవా రుందురో, పాఠమువలనను, శిక్షణమువలనను వారొరులకు కవిత్వము నలవడఁజేతురు. ఈనుడువు కవిత్వమునకును, సారస్వతమునకుమాత్రమే కాక, సోదరకళలగు సంగీతచిత్రలేఖనములకుఁగూడఁ జెల్లును.

భాష భావముయొక్క బాహ్యరూపమై యుండ, సుందర మైన భావమును వెలువరించుభాష సుందరమైయుండక వేఱుతీఱున నుండునా? కవి, తనమాటలను తానెన్నుకొనఁడు. వాడుకమాటేమో, వాడుకమాటకానిదేమో ఆతఁడు లక్షింపఁడు. కవివాక్కు, కవిది కాక, కవియెవండదని కవిత్వ మెఱిఁగినవారెఱుఁగుదురు. ఒకవిధమైన శైలివ్రాయవలెనని గట్టిగఁ గూర్చున్నవాఁడు కవియేకాఁడు. గణముల నుపేర్చి, అక్కఱములను లెక్కించి, యతిస్థానమును కన్గొని, ప్రాస యతి నూహించి, వచ్చిన పదములకు పంక్తులం దిరికించి, పద్యములు వ్రాయు మహనీయునికైత సహజమై, ఆత్మవికాస మొందు నెమలి పింఛముకాక, కాకియాకలకట్ట యగును.

కవిశైలిని నిర్దిష్టమొనరించునది కవియంతరంగముకాని, కవి యెన్నఁడో వర్ణించిన అమరకోశముకాదు. వ్యాకరణమునుండి కొల బద్దనుదీసి కొలిచితిమేని, ఈతనిశైలియందు భాషాస్ఖాలిత్యములు తోఁపవచ్చును. ఇవి దోషములని వైయాకరణులు కనులెఱ్ఱఁజేసినను, నిరంకుశత్వము నల్లేరుమీఁదిబండియై కవిపైపడినను, కవి, కన్నెత్తి చూడక తనభావమున తాను మునిఁగియుండును. సింధువుమీఁదిఅలలను, చారలను, భీషణవాతూలములలోఁగల గభీరశాంతిఎన్నఁడైన కన్నెత్తి

చూచునాఁటికాలుచున్న కరుకోలను మీఁదికెత్తినను, కవి తనప్రకృతిని తానుమార్చుకొనఁజాలఁడు తనప్రకృతిని మార్చుకొన్నకవి, తనమాటల నొరులు చేఁబూనిన రెక్కడలందుంచి, మొగ్గఁబూచుకొని, వాని నేలుకొనుట కిచ్చగింపఁడు కవియనఁ బద్యకవియే కాక గద్యకవియని కూడ తెలిసికొనుట కలవాటుపడని ఆంధ్రభాషాశాసకులు సహజభావ విభూతి నొప్పులేకునకు శైలిని చెప్పసాహసించుట దుడుకుదనము నకుఁ దలపడుటనియు, వ్యర్థపాండిత్యమును చలాయించుటనియు, తలదిరుగుడు నిరంకుశత్వమును విజృంభించుటనియు, సాహితీహృది నెఱుఁగక మాటలగుట్టపైఁ బోరాడి, ఒరులను పోరాడించుటనియు' తమసామర్థ్యమును తామెఱుఁగక ఒరులతలకు తప్పులుకట్టుటనియు, తమసంఖ్య అధికమై, తమశక్తి మిన్నయై, తమపలుకుబడి గొప్పదై, తమనోరు పెద్దదై, తమయచ్చుయంత్రములును, తమప్రయోగాస్త్రములును ఒరులకు బహిష్కరణాస్త్రములై తమ్ముఁ గట్టెక్కించి ఒరులను లోఁతుగోఁతిలోఁ ద్రోయునని విఱ్ఱవీగి తెయ్యిమనుట తమ కరుణావంధ్యత్వమును, తమ యసూరనిష్ఠురతను వెల్లడించుటనియు గుర్తించి, యీక్రమమందు తప్పుడుబ్రదుకునుండియు, తాలుమాలు తెరువులనుండియు తొలఁగి, విశాలదృష్టిఁగలిగి, యుక్తాయుక్తవిచక్షణదక్షులై మెలఁగుదురుగాక! శైలినిబంధించిన నేఁటికయ్యము ఆంధ్రసీమనుండి అచిరములో నంతర్హితమై, సాహిత్యమోహపు స్వాతంత్ర్యమును, సౌందర్యమును, సౌష్ఠవమును చేకూర్చుటకు భాషాసేవకులను, ప్రజాసేవకులను, కళాసేవకులను పురికొలుపు నుత్సాహమునకు తావొసఁగునుగాక!! ఆంగ్లవంగసారస్వతములట్లు ఆంధ్రసారస్వతము అధునాతనయుగమున అపూర్వతేజమును విరజిమ్ముగాక!!! తెలుఁగుశైలి, జ్ఞానశైవలినియై ప్రవహించి, జిజ్ఞాసులను తేనుపుఁగాక!!!!

---

## ప్రబంధములలోని విరహము






దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డి

"అనవుడుఁ బాండురాజతనయాగ్రణి సంజయుఁ జూచి యి
ట్లను నదియేల నీపలికినట్టిద ధర్మువు ట్లయుండి బో
ధను లరయంగ వచ్చిన నధర్మములై చెడుఁ గొన్ని ధర్మవ
ర్తనములు గాక తోఁచి తుదిధర్మములై చనుఁ గొన్నికర్మముల్"

—ఉద్యో ౧ ఆ ౩౩౫

ఈ భీష్మప్రతిజ్ఞ శిఖండి విషయమైనది ఈ సందర్భమున పైపద్యార్థము సార్థకమైనది

ఈ వ్యాసమున చూపు అసందర్భములు ఆంధ్రభారతము లోనివగుటచే పూజ్యులగు కవిత్రయమువారి నాక్షేపించుటకుగా తలంపకుందురుగాత ఇవి సంస్కృత జయ భారత మహాభారత ముల సంపుటీకరణములోని వ్యత్యాసములుగా తోచుచున్నవి ఆంధ్రభారతమున చూపిన పరస్పరభేదములు సంస్కృతభారతమున కలవా, లేవా? అని సంస్కృతభాషాకోవిదులు పరిశీలింతురుగాక యని ప్రార్థన తిక్కనాదులు వారి యుగాచారముల ననుసరించి, భావము చెడకుండ మూలకథానువాదమును చేసిరి

"శిఖండిని నొక్కరునిఁ జంపగాని కుమారా!"

—ఉద్యో ఆ ౪-౨౬౫

శిఖండిపూర్వజన్మవృత్తమగు అంబోపాఖ్యానము భీష్ముడు దుర్యోధనునకు, సభాసదులకు జెప్పునపుడు చేసిన ప్రతిజ్ఞలలో ఇతరములు విడచి శిఖండివిషయమైనదిమాత్రమే కైకొనెదము.

"అంగనాపూర్వుండగు శిఖండి నాకు భండనంబునం గోదండ పాండిత్యంబు మెరసి నన్ను జంపను నోంపను గడంగినను నేను బ్రతిగా గడంగితినేని నింతకంటెను దుర్యశంబు గలదె యే నెట్టులైన నగుదుం గాని భగ్నవ్రతుండ నగుట కోర్వను"

—ఉద్యో ౪ ఆ ౪౦౬

ఇదియే నిజమైన భీష్మప్రతిజ్ఞ. దీనినే ముందు యుద్ధాలాపములుగా వివరించి, ఆచరించియుండెను కాని రహస్యప్రకారమున ధర్మజాదులకు భీష్ముడు తన వధోపాయము చెప్పుటలో వ్యత్యాసమును చూడుడు,

"అంగనాపూర్వుని గని యెటుఁ బోటుఁదక్కి సమరంబు చేయమానుదు విశేషించి మంటఁబుట్టువున నంగనయగుట వాని (శిఖండి) కెదురీయకుండుదు నర్జునుండు వానిం బురస్కరించుకొని వచ్చి యే నేయుట మానినయెడ నొప్పించి పడవైచునది"

భీష్మ ౩ ఆ ౩౦౨

ఇది మధ్యకల్పితము గనుకనే పూర్వప్రతిజ్ఞానుకూలముగ యుద్ధము చేసెను

ఇక ప్రతికూలములు గమనింపుడు:

రాయబారిగా వెళ్లిన సంజయుని ధృతరాష్ట్రుడు 'అర్జునుడేమనియె' నని అడుగగా నతడు అర్జునునిమాటలుగా నిట్లనియె

(భీష్ముడు శిఖండివిషయమైన తన ప్రతిజ్ఞను దుర్యోధను సభలో వెల్లడించుటకు పూర్వము)

తఱిమి శిఖండి దన్నొరులు దాఁకఁగ నెవ్వరిదిక్కుఁ జూడ కే
డ్తెఱఁ దనపూన్కి పై మనము దీరత నిల్పి రథంబు బల్విడిం
బఱపి కురుక్షితీశుఁడను బ్రహ్మకు వేయును నిండ భీష్ముపై
కుఱికినఁగాక మాకు నగ మూరక యిత్తుర మీరు మేదినిన్"

—ఉద్యో ౨ ఆ ౧౪౯

మరియు,

సుయోధనుడు సంధివిషయమై చెప్ప సంజయు నిట్లు ప్రశ్నించెను

"నావుడు నక్కియో సంజయ, వ్యవహారము సేసె దీవు కౌంతేయుల వా
రేవి రణసాధనమ్ములుగా వెరవక నడచువారు కౌరవులపయిన్"

—ఉద్యో ౨ ఆ ౨౨౭

సంజయుడు అతనితో వారు యిట్లు నిశ్చయించి రని పలికెను

"గంగాసుతుండు శిఖండిపాలతనికిఁ బ్రాపుమత్స్యేశ్వరుబలముగుంభ
భవుడుధృష్టద్యుమ్నుపాలతనికిఁదోడుపడుద్రౌపదీపుత్త్రపంచకంబు"

—ఉద్యో. ౨ ఆ. ౨౨౯







1 పాకాలబోర్డు మాధ్యమిక పాఠశాలా జీవకారుణ్యసంఘము  2 తెనుకుతాలూకా గ్రంథాలయసంఘము.







1 తణుకుతాలూకా వేలలి శ్రీరాజేశ్వరగ్రంథాలయ కార్యనిర్వాహకవర్గము

2. సదరు గ్రంథాలయపు ప్రథమవార్షికోత్సవము, అధ్యక్షులు కా. నాగేశ్వరరావు పంతులుగారు.

శిఖండివృత్తాంతము రాయబారములనాటికే అర్జునాదులకు తెలిసియుండ, భీష్మయుద్ధప్రారంభమునను, తొమ్మిదవనాడు రహస్యముగను భీష్ముని మరణోపాయ మడుగవలసిన ఆవశ్యకత లేదుకదా! 'కైవారము చేసెదీవు కౌంతేయుల' అని సంజయుని దుర్యోధనుడు ఆక్షేపించినాడుగనుకను, ఉపప్లావ్యమున అర్జునాదులు సంజయునితో నీవృత్తాంతము చెప్పకపోయిరి గనుకను ప్రమాణములు గావని అంగీకరింపకపోవచ్చును. కాని,

ధర్మజుడు ఇట్లు సంజయుని మందలించెను:

"........అని వారలగెలువ నరిదియని పొత్తుగఁ జె
ప్పినమాటకు నేనోడఁబడ విను సంజయ, పక్షపాతవృత్తి విడువుమీ!"

—ఉద్యో. ౧ ఆ. ౩౧౩

ఇట్లు రెండుపక్షములవారిచేతను మాటలుపడినవాడు సంజయుడు. విశ్వాసపాత్రుడు గానివానిని రాయబారిగా బంపరుగదా! కాన ఆతడు పరస్పరముగ పాండవుల మర్మములు తెలిసికొని చెప్పినాడనుటయే సమంజసము.

మరియొకసాధనమును ఆలోచింతము భీష్మప్రథమదివసయుద్ధానంతరమున ఆరాత్రి ధర్మతనయుండు విషణ్ణచిత్తుండై తమ్ములం దగువారల గూర్చుకొని గోపాలదేవుపాలికిం జని యతనితో నిట్లనియె:

"నరపతులనెల్ల భీష్మున కెరగా నొప్పింపఁజాల నే నడవులకుఁ
మరలం బోయెద నచటం దిరిగెదఁ గూరాకుఁగోసితినియెద ననఘా!"

—భీష్మ. ౨ ఆ. ౮

దానికి పద్మనాభుండు పాండవాగ్రజున కిట్లనియె:

"నెవ్వగ ఇంతయేల విను నీ కెదురెవ్వరు నీదుతమ్ములం
దెవ్వరు సూచినఁ జగము లిన్నియు గెల్వఁగలారు లావునం
గ్రొవ్విన భీష్ము నోర్చు రణకోవిదుఁడైన శిఖండి యేను నీ
కొవ్వనివారినెల్లఁ గ్రమయుక్తి లయంబొనరింతు నెమ్మెయిన్."

—భీష్మ. ౨ ఆ. ౧౧.

శ్రీకృష్ణుడు భీష్మునికి శిఖండిని ప్రతియోధునిగా నిర్ణయించినాడు. దీనినిబట్టి సంజయుడు వెనుక అర్జునునిమాటలుగా చెప్పిన విషయము పాండవవీరుల నిర్ణయముగా దోచుచున్నది. పునరుక్తిదోషము లేకుండుటకు ఉపప్లావ్యమున అర్జునాదులచే కవిబ్రహ్మ చెప్పింపలేదని కాని, పాండవరహస్యరక్షణార్థము చెప్పకపోయిరని కాని తలంచవచ్చును. వీరిమతమును సంజయుడు పరస్పరము కనుగొనినాడనుటకు బాధకము లేదు. లేక ముందుతెల్పబోవునటులు కృష్ణుడు చారులవలన తెలిసికొనియుండును.

వెనుక ఉద్యోగపర్వమున భీష్ముడు పాండవవీరులం దతిరథమహారథుల నిరూపించి చెప్పుటలో

"శిఖండిని నొక్కరునిఁ జంపఁగాని కుమారా!"

—ఉద్యో. ౪ ఆ. ౨౬౫

అను ప్రతిజ్ఞను సభలో భీష్ముడు చెప్పెను. దానిని చారులవలన ధర్మజుడు తెలిసికొనియుండెను. చూడుడు:

"ఇవ్విధంబున నీకొడుకుకడం బుట్టినవిశేషములు ధర్మతనయుండు
చారులవలన విని తమ్ముల రాఁబనిచి వారలతో నిట్లనియె"

—ఉద్యో. ౪ ఆ. ౪౨౪

శిఖండివృత్తాంతమున నీవాక్యము గలదు.

"కొలువునం గల యందఱు సమరవిషయంబులైన సల్లాపములు
చేయుచుండ"

—ఉద్యో. ౪ ఆ. ౪౦౬

ఒకేసభలో జరిగిన మహారథుల నిర్ణయమును శిఖండిప్రస్తావమును ధర్మజుడు చారులవలన తెలిసికొనియుండెగదా! కృష్ణునకు దీనిచేతనే తెలిసియుండియుండును. ధర్మజుడు కాతరుడైనాడు గాన శిఖండివృత్తాంతము మరచియుండును. దానినే కృష్ణుడు జ్ఞప్తిపరచినాడు. లేక శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడుగాన ప్రభావమువలన తెలిసికొని చెప్పినా డందమనుకొనిన బాధకము గలదు.

"అయ్యజాతశత్రుఁ డనుజులు నతఁడును
దాను (కృష్ణుఁడు) సౌమ్యవేషధరణమొప్ప
నతినిగూఢవృత్తి నాపగాసుతు మంది
రమున కరిగి సముచితముగఁ జొచ్చి"

—భీష్మ. ౩ ఆ. ౨౫౨

భీష్మవధోపాయము నడుగుటకు తానుకూడ వెళ్లుటెందులకు? మరియు ఏతత్పూర్వమే క్రొవ్విన భీష్ము నోర్చురణకోవిదుడైన శిఖండి యని తెలిసినవాడుగాననా?

"........చనుదేక తక్కిన శాపమిత్తు
వచ్చితి మేలయ్యె వైరులనిర్జింపు మిదిగాకయును వర మిద్దియైన
నడుగుమునీకుఁగానని సేయుటొక్కటి దక్కంగ"

—భీష్మ. ౧ ఆ. ౧౨౮

భీష్మశాపమునకు వెరచికాబోలు!

ఇంతకంటెను మరియొకయుక్తి గలదు. ద్రుపదమహారాజు ద్రౌపదీధృష్టద్యుమ్నశిఖండుల తండ్రి, పాండవులమామ. పాండవపక్షమున ప్రబలుడు. భీష్మద్రోణులపై విరోధము తీర్చుకొనుటకు శిఖండిధృష్టద్యుమ్నుల వరపుత్రులుగా బడిసియుండెనుగదా! ధర్మజుడు తనమామకు తెలిసిన రహస్యమునకుగా భీష్మద్రోణాదుల దేబరించుట ఎందులకు? భీష్మద్రోణులకు మహిమలు తగిలించి పూజ్యులగువారిని భ్రష్టులుగా జేయుటకు కాబోలు!

ఇక తొమ్మిదవనాటిరాత్రి ధర్మరాజాదులతో చెప్పిన రహస్యప్రతిజ్ఞాపాలనము నేమాత్రము భీష్ముడు నెరవేర్చినాడో చూడుడు:

"శిఖండిని నొక్కరునిఁ జంపఁగానికుమారా!" అని భీష్ముడు తన్ను వధించి పాండవులు జయము గొందురుగాక అని దురుద్దేశ్యముతో చెప్పినా డనుకొనినను,

"పాండవులకుఁ గలుగుబలము లన్నియు సమ
యింప నీకు దినములెన్ని పట్టు—" —ఉద్యో. ౪ ఆ. ౪౦౨

అని ప్రశ్నింప కుతూహలియగు సుయోధనుడు, భీష్ముని వధోపాయమగు అంబోపాఖ్యానము ఏకాంతముగ నైననుగాక, సభలో నడిగినా డనుటకంటె అసందర్భ మేమికావలయును? శత్రువులు చారుల వలన తెలిసికొనెద రను భయములేకనా? ఈసభావృత్తాంతమునే ధర్మజుడు చారులవలన తెలిసికొనెను. భీష్ముడు చెప్పదలచినను వారించవలసిన సుయోధనుడు ఈప్రశ్న వేయజాలడు. శిఖండి జన్మవృత్తాంతమగు అంబోపాఖ్యానము శివవరములపై నాధారపడినదిగద! శిఖండిచే భీష్ముడు చావవలసియుండ అర్జునునిచే బడెను. అంబోపాఖ్యానము శివుని వ్యర్థవరప్రదాతనుగా చూపి కళంకము నాపాదింపజేయుచున్నది. ఇది అపచారము.

ఇక శిఖండిపూర్వవృత్తమగు అంబోపాఖ్యానములో అంబను సాల్వుడు తిరస్కరించినపిమ్మట పరశురాముడు మరల విచిత్రవీర్యునకే అంబ నిచ్చి వివాహము చేయించుటకు భీష్మునివద్దకు తీసికొని వచ్చి విఫలుడై పట్టుదలతో యుద్ధముచేసి ఓడిపోవుటవరకు నిజమైన కథగా నుండవచ్చును. మిగతభాగము క్రిందిగాథపై కల్పితము.

పాండవులచే తనకు ప్రతియోధుడుగా నిర్ణయింపబడిన శిఖండి యుద్ధమునకు తలపడి ప్రోత్సహించినపుడు మగతనము, పూన్కిగల భీష్మునకు తనశపథవృత్తాంతము చెప్పక తప్పినది కాదు. ఇదియథార్థ శపథమేగాని, ఆచెప్పుదానినైనను పరిహాసముతో గూడిన యుద్ధాలాపములుగా జెప్పినాడు. చూడుడు:

"కనుఁగొని శిఖండి వెసమూఁడ్కొని భీష్మునిసేసె మూఁడు బ్రహ్మాస్త్రములన్
గని యతఁడు మరలిచూడక తని నుద్దేశించిపలికె దరహాసముతోన్.

ఎవ్వతెనేని ధాత సృజియించెఁ దగన్ మగవానిఁగాఁగ నా
కొవ్వమిఁజేయ నట్టినిను నుగ్గలి నేయఁగనొల్ల నాపయిం
గ్రొవ్వెసలార నీవు శరకోటి వెసం బరఁగించితేని నే
నవ్వుదుఁగాని కోపము మనంబునఁ బుట్టదు సూ శిఖండినీ!

అనినం గోపించి శిఖండియు నతని కి ట్లనియె:

గెలిచితి రాజులనెల్లను, బలియుండగు పరశురాము ప్రతివీరుఁడవై
యలవుకలిమి నెఱపితి నీ,చలముబలము నాకుఁజూపఁ జాలవుకంటే.

ఏయు మొకనేర్పుమై ని,ట్లేయక క్రేడించియరుగు మెట్లయినను మ
త్సాయకములనినుఁగూల్చెదఁ,జూయెవ్వతనైతి నేమిసూచెదునన్నున్.
నేఁడెమ్మెయినైన ననునీ,పోడిమి సెడఁదోన తవిలి పొదువుదునిన్నున్
వాఁడి మగఁడనుట యుదుపుదు, వేఁడిమి సాం పెసఁగ నస్త్రవిద్య మెఱయుదున్."

—భీష్మ. ౩ఆ. ౩౨౦-౩౨౫

ఈప్రతిజ్ఞను శిఖండి నెరవేర్చలేదు. (మరియొకచో చూపెదను.) భీష్ముడు ఈప్రతిజ్ఞను పాలించినాడు. ఇక ధర్మజునకు భీష్ముడు వధోపాయము చెప్పలేదా? ఈగాథ అంతయు కల్పితమా? అని విచారించిన యీక్రిందికథాబీజము కలదు. కాని అదియు ఒకఉపాయముగా నుద్దేశించియే భీష్ముడు చెప్పెను. తాను కురుపితామహుడుగాన తన్ను చంపమని చెప్పినను ధర్మజుడు చంపడనియు, పశ్చాత్తాపపడి యుద్ధమునే మానుననియు విశ్వాసముగలవాడగుటచేత చెప్పినా డనుకొనుటయే సమంజసము. ఏలయన సంజయుడు చెప్పినఅభిప్రాయముకలవాడగుటచేతనె చెప్పెను.

"తుదిఁబోయి క్రూరకర్మా,స్పదమగు తెఱఁగునఁదొడంగి బంధులగురులన్
వెదకి వధియించు సౌఖ్యం,బదియేటికి నార్యనింద్యమస్థిరమర్థయన్"

—ఉద్యో. ౧ ఆ. ౩-౩౩

కాన భీష్ముడు అదియొకసాధనముగా ప్రయోగించినాడు. ఆచెప్పుటలో అధర్మయుద్ధమును చెప్పినాడు. తనహితముకోరి చేయమనెను. చంపమనిన చంపరుగదా! పరిశీలింపుడు:

భీష్ముడు:

"డొల్లెడు సూతులుఁ బెలుచం, ద్రెళ్లెడు తురగములుఁగా నతిక్రూరగతిం
బెల్లేయుచు సత్వరముగ,నెల్లెడలం దానయగుచు నేట్టెఁబొదివెన్."

"ఇట్లు పెద్దయుం బ్రొద్దు విహరించి యపరాహ్ణంబగుటయు నతం డాత్మగతంబున,"

"ఉత్తమక్షత్రియులనెల్లను గ్రవృత్తి, నేఁడుపదివాఱులేనినానిశితశరచ
యములఁగూల్చితి వేసరినట్టులయ్యె మేనితోడిపొత్తింకిటమానుటొప్పు"

"అని తలంచి తొలంగి బలంబులం దెరల్చికొనుచుం గయ్యంబునేయు చందంబునం గొంతేయాగ్రజుంగదిసి యల్లనయతనితో నిట్లనియె"

"జనియించి నంతనుండియు,జనపతులన్ గ్రూరవృత్తిఁజంపుచునుండం
జనియెం గాలము విసివితి, నఘా, నేనింకఁజాల నాసురవిధికిన్"

"మీరు నాహితంబుఁ గోరుదురేని శిఖండిమున్నుగాఁగఁ గడఁగియంత
వట్టువారునొక్క పెట్టకాఁబైఁబడి,యేయుఁడింకఁదడవు సేయవలదు"

"అని పలికి సమరప్రకారంబునం దేరు మరలం దోలించి పాంచాల బలంబుల పయి నడరె నప్పు డయ్యజాతశత్రుండు సమీపవర్తి యగు ధృష్టద్యుమ్ను నాలోకించి,"

"దేవవ్రతు పలుకులువిం,టే వేగమపనుపు మొక్కటిగఁ దఱుమఁగయో
ధావళినెల్లనుభీముఁడు,నీవునరుతోడఁగూడినిగుడుఁడు పెలుచన్."

—భీష్మ. ౩ ఆ. ౩౬౧-౩౬౮

అని ధర్మజునితో చెప్పుటలో దొమ్మిగా తనపై బడవలయు నని చెప్పినాడేగాని శిఖండిని చూడగనే తాను శస్త్రసన్న్యాసము చేసెదనని నుడువలేదు. ఈఘట్టము నీవిధముగ సమన్వయించుకొనక పోయిన భీష్ముడు నవమదివసనిశీథమున తనవధోపాయము తాను రహస్యముగ చెప్పియు ప్రతిజ్ఞాపాలనము గావింపలేరు. చూడుడు:

"అట్టియెడ శిఖండి యాపగాసుతునిపైవాలుటమ్మ లేయ వానినేయ
నొల్లకతఁడు గెలనియోఘవీరావళి నేయుచుండె శౌర్యమెసక మెసఁగ"
—భీష్మ. ౩ ఆ. ౩౬౪

దీనిచే ఉపాయాంతరముగ జెప్పి ధర్మజుని యుద్ధపుపూనికను గ్రహించి శత్రువులపైకి వెడలెననుటయే యుక్తియుక్తము. మరియు తొమ్మిదవనాటిరాత్రి తన మరణరహస్యమును తెల్పి దానికి విరుద్ధముగ తానుబట్టిన ఆయుధము వీడలేదు. ఇప్పుడు యుద్ధములో ధర్మజునితో చెప్పిన మరణోపాయముగూడ నవమదివస రహస్యార్థము గలదేని ఇప్పుడును యుద్ధమును మానలేదు. ఉపాయాంతరముగ భీష్ముడు రెండవసారియు మరణోపాయము పాండవపక్షపాతిగనుక చెప్పినాడేమో ననుకొందమనినను, ఒకటికి రెండుమారులు బాసతప్పినవాడగుటయే ప్రతిఫలము కాని, ఊపిరియున్నంతవరకు యుద్ధమున పోరిన వీరుడు స్వామిద్రోహి కాదుగదా! చూడుడు:

శపథము శిఖండియొక్కనిపై బాణము ప్రయోగించననియేకాని యుద్ధము మానుటకు గాదు కాన

"అరిబలంబుపై నొక్కదివ్యాస్త్ర మేయఁ దలఁచి యరిఁబోసి తిగిచి
యుదగ్రవృత్తిఁ, గవిసి ముందటనున్న శిఖండిచూడ్కి దొడరు
టయుఁ దాల్మిమై నేయుటుడిగె నధిప."—భీష్మ. ౩ ఆ. ౩౭౬.

"ఇవ్విధంబున శతానీకుంజంపిన"

"మొనలెల్ల విఱుగమధ్యందినమున నినుమాడ్కి మెఱయు తేజోనిధిశం
తనుసూనుఁడొప్పెనప్పుడుగనుఁగొనియిట్లనియె శౌరి గాండివితోడన్"

'మన మోహరములు సెడికను కనిఁబాఱెడునిప్పుడాపగాసుతునకు గ్ర
క్కున నీవు మార్కొనక తక్కినఁ గార్యము దప్పుఁ బొదివి గెలు
వుము కడఁకన్."        —భీష్మ. ౩ ఆ. ౩౯౧-౩౯౩

అని శివవచమునకు ప్రతికూలముగా శ్రీకృష్ణుడు ప్రోత్సహించినాడు. అర్జునుడు కడపట భీష్ముని పడవైచెను.

".........సురక్షితుండైన శిఖండిం బురికొల్పికొని మీఁతండ్రి నేయించుచు నతం డెన్నివిం ల్దెత్తిన నన్నింటిం దోడ్తోన తునుమాడుచుండె నా క్రీడిపై నతం డుగ్రశక్తి ప్రయోగింప నదియునుం ద్రుంచి నూతునిం గేతనంబునుం గూల్చిన."        —భీష్మ. ౩ ఆ. ౩౯౪

ధర్మజునితో ఒకటికి రెండుమారులు రహస్యము చెప్పియు ధనుస్సులను త్రుంచినను అంగనాపూర్వుడగు శిఖండి ప్రక్కనుండి వేయుచుండినను, యేటుబోటు దక్కి సమరంబు మానలేదు. యుద్ధావేశమువలన నిటుల చేసినాడేమో ననుకొందము. కాని తనశపథము జ్ఞప్తికి దెచ్చుకొనియు దేవతలుచెప్పినను యుద్ధమును వీడలేదు.

"మనమున భీష్ముఁ డిట్లని వితర్కించుఁబాండవుల నాయొక్కవింట
న కడంగి
గెలువనే వీరికిఁ గృష్ణుండు ప్రాపుగాకున్నని నదియట్లుండనిమ్ము
కృష్ణుఁ దోడుగఁగొని కీడ్పడి వీరలు వచ్చినఁ జెప్పితి వధవిధంబు
సమర ముపేక్షించి శాంతిమై నుండెద నడిచిపాటేటికి ననఁగ నెఱఁగి
చదల సురలిట్లు మేలిది సమ్మతంబు
మాకు నని ప్రీతిమైఁ జెప్పుమాట లాతఁ
డొక్కరుండును వినియె నే నొకఁడ వింటి
మునిమహానుభావంబున మనుజనాథ"—భీష్మ. ౩. ఆ. ౩౯౫

ముందుయుద్ధమున "అమ్మహాత్ముం డూరకున్నం గెలని కొకభంగియై తోఁచుననితలంచి" కపటయుద్ధము చేసినవాడగును. ఇవి మహిమలపుట్టలోనివి. ఔచిత్యమేమో అడుగంటినది. ఇక శాంతనవుండు సముల్లాసంబున చేసినయుద్ధమును జూడుడు:

"ఒక్కవి ల్లెక్కువెట్టంగ మఱక వేస శి
ఖండి పటుమార్గణంబులఁ గడఁగి యేయ
నతఁడు మిసిమింతుఁడును గామి కల్ల నవ్వి
పఱపెఁదనయమ్ము లతనిపై ఫల్గునుండు."—భీష్మ. ౩. ఆ. ౩౯౬

"......వెఱఁగుపడి చూచుచుం.........కెలంకులం గలయం గనుంగొని మీతండ్రి రారాజుతో నిట్లనియె:

అని దేవాసురకోటికైనను నశక్యం బిమ్మహావీరు మా
ర్కొన వీఁడల్గిన మర్త్యులే యెదు రుదారుండైన యాక్రీడి ద
క్కిన నిప్పాండవసైన్య మింతయును గ్రమ్గింపంగ నేఁజాలుదున్
విను సత్యం బిది వీనివింటి కెదురన్ వి ల్లెత్తలేఁ డెవ్వఁడున్."
—భీష్మ. ౩ ఆ. ౪౦౦-౪౦౧

ఇంతకుపూర్వము "పాండవుల నాయొక్క వింటనకడంగి గెలువనే కృష్ణుండు ప్రాపుగాకున్నని" అని కృష్ణమహిమగా వీరాలాపములాడినవాడిపుడు "యాక్రీడిదక్కిన" అని దీనాలాపములాడుట తిలకింపుడు. ఇంతకు పాత్రౌచిత్యమైనను గమనింపక మహిమలు తగిల్చిరి.

"అనునెడ శిఖండిచాపమువెనుకం దనవిల్లు నిల్పి వెస నాతం డే
సినభంగిగ నరుఁ డేసెను జననాయక, దొడ్డనారసంబుల భీష్మున్"

"అప్పుడు దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి,"

"అశనికల్పములివి యర్జునబాణముల్ గాని శిఖండివిగావు కుమ్మ"
—భీష్మ. ౩ ఆ. ౪౦౩-౪౦౪

ఇపు డీవితర్క మెందులకో! దుర్యోధనుచే దెప్పించుటకు శివవరమునకు గతి కల్పించుటకు! ఇంతకుపూర్వము శిఖండి బాణములు వేయలేదనియా? వేసినాడు. చదివితిరికదా!

"అనుచుఁ బటుశక్తి నప్పార్థునిపై చిననదియతండుదునుమాడుడుశాం
తనవుఁడువాలుం బలకయుఁగొనియరదముడిగ్గఁజూచుకొలఁదిం బెలుచన్.

ఏసి యారెంటిఁ దునియలు చేసి యెలుఁగు
సూపి యేనుండ వెఱపేల నాపగాత
నూజుఁబొదువుఁడు మీరని యోజఁ జెప్పె
శక్రతనయుండు దనయోధజనులకెల్ల. ౪౦౪

అప్పలుకు లాకర్ణించి,

ఏయుం డడువుఁడు పొడువుఁడు
వ్రేయుఁడనుచు వారు జాహ్నవీతనయుఁగదున్
డాయుడు మనసైనికులుం
గోయని తలపడ్డఁ జోరు ఘోరంబయ్యెన్.

అప్పుడు,
ఏచి గాండీవి కురుసేన నెగవ నతని
వారు వెఱవక భీష్మునిఁ జేరి యొడల
వ్రేలెఁ డెడలేనియట్లుగ వివిధభంగి
నిష్ఠురాస్త్ర శస్త్రంబుల నినిచి రధిప.

అంత నంశుమంతుండు శాంతుండగుచు వచ్చెనట్టియెడం గదిసి కవ్వడి గాంగేయుపైఁ గ్రూరనారాచనికరంబులు నిగిడించి పడంద్రోచిన—

తూర్పుతలగాఁగ నీసుతు లేర్పడ గనుఁగొనుచునుండ నిలగంపింపన్
దశోర్జ్వలుఁడాభీష్ముఁడహర్పతి యస్తాద్రిచేరునట్లుగఁ బడియెన్."
—భీష్మ. ౩ ఆ. ౪౦౫-౧౨

పాండవులు భీష్ముని అధర్మయుద్ధములో పడవైచిరి. కావున పద్మవ్యూహములో కౌరవులు అభిమన్యునిగూడ దొమ్మిగా వధించినారు. భీష్ముడు వ్యంగ్యోపదేశకుడు, మార్గదర్శకులు పాండవులు, దుర్యోధను తూలనాడుట పక్షపాతము.

ధృష్టద్యుమ్నుడు మృతుండైన ద్రోణుని కంఠంబును దునిమి తన జన్మను సార్థకము గావించుకొని తనతండ్రి ద్రుపదునిపగను సాధించెనుగదా! భీష్ము వధించుటకై తపస్సుగావించి శివప్రసాదమున జన్మించిన శిఖండి శివవరమును సార్థకము గావించుటకైనను భీష్ముని వధింపక ఉత్తరాయణమువరకు బ్రతుకనిచ్చుటయా?

ఇట్లు బొందిలో ప్రాణములుండువరకు పోరి వీరస్వర్గమును చూరగొన్న భీష్ముని మహిమలచే స్వామిద్రోహిగా జేసివైచినారు. ఇదుగో వేరొకటి చదువుడు:

కర్ణుడు భీష్మునిపై రోషముచే నస్త్రసన్యాసము చేసిన పిమ్మట శాంతనవుండు దుర్యోధనుతో నిట్లనియె:

"అంతకుఁ జాలఁడె కర్ణుం డింతకుమును బాసయిచ్చి యెన్నఁడుబొంకం, డింతటిమానిసి యలిగినఁ గొంతేయుల కెట్లు బ్రతుకఁగావచ్చు ననిన్.

అని వెండియు నిట్లను నాతనిమాటల కెట్లుఁ గడఁగిధర్మతనయుతోఁ, నని సేయక తక్కువు నీవనుమానము పాయఁజూడుమతనిని నన్నున్."
—ఉద్యో. ౨ ఆ. ౨౯౧-౨౯౨.

అని శపథము చేసినవాడు తన వధోపాయమును శత్రువులకు చెప్పినాడనుటకంటె పాపము కలదా! కల్పితగాథలను విడచిన, భీష్ముడు ఈబాసనాటినుండియు కౌరవపక్షమున పాటుపడెను.

"......గాండీవి మున్నుగాఁ గవిసినం గౌరవసేన దెరలి మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ నీవు గలుగ మనసైన్యంబు దైన్యంబునొందనగునే యనవుడు రారాజుతో నతండు
మను పదివేవురఁజంపుదు నని యిచ్చినబాసవచ్చె నవనీశ్వర నీ
మనిచిన ఋణంబుఁ దీర్చితినిమ లా నిటమీఁదఁ దఱుగుపథమైతోఁచెన్."
—భీష్మ. ౩ ఆ. ౩౨౮-౩౨౯

ఇవి ధర్మరాజుతో తొమ్మిదవనాటిరాత్రి రహస్యము చెప్పిన పిమ్మట చెప్పినమాటలు. ఇట్లు భీష్ము ననుమానించని రారాజుతో భీష్ముడు చెప్పుట అసత్యదోషము కదా! కాని బలము క్షీణించుట యథార్థము. భీష్ముడు తన వధోపాయము రహస్యముగ జెప్పినది తెలియని ద్రోణుడు అశ్వత్థామను భీష్మునకు సహాయముగా బంపుచు చెప్పినసాక్ష్యము పరికింపుడు:

"తడఁబడె దివ్యబాణముల తంత్రము మంత్రముఁ దప్పెడుం గడు
న్వడఁకెడుఁజాపదండము మనంబును నాకు వశంబుగాదు వీ
డ్వడియెను చెయ్యు లంగము గడంక దొఱంగెను నేఁటిభంగి క
వ్వడి తనపూన్కి దీర్చుట ధ్రువంబని బుద్ధి జనించెఁ బుత్రకా!"
—భీష్మ ౩ ఆ. ౩౫౦

భీష్ముడు విశేషించి బాస నుల్లేఖించి యుండెను. నమ్మకుండు డెట్లు? లావు తరిగిన వృద్ధుడయినను శూరుడు, స్వామిభక్తి పరాయణుడుగాన

"నేఁటిభంగిచూడ నృపవర పాండవులొండె నన్ను వారినొండె నేను
సమయఁజేఁతగలుగుసమ సెదరేయొకమర్త్యచేతవారమర్త్యబలులు''
—భీష్మ. ౩ ఆ. ౩౩౦

ఇచట తాను మానవుడననియే నిరూపించెను.

"ఐనను నాచేతిబలువు నూడుమీయని పలికి పేర్చి పటుతరశరార్చులం...బొదివి పాండవులకుం దేరిమాడరాక వారిం బడలువడ జేయ దొడంగిన''
—భీష్మ. ౩ ఆ. ౩౩౧

బలహీనుడైనను బాసతప్పనిశూరుడు, చూడుడు.

"ఏనునా చాలెడికొలంది సెప్పెదఁ దక్కటివారు తమతమ చాలుటలు దారచెప్పెద రదియెల్లను బిదప విందుగాని మున్ను నీకొక్కబాస యిచ్చెద నాకర్ణింపుము:

"మీఁటుగల రాజరథికుల నాఁటికి వేవుర వధింతు నరుశరములనో
నాఁటి పడవైచునంతకు వేఁటాడెదఁ బ్రతిబలంబు వీరులనెల్లన్,

"అట్లు నాకయ్యంబు సేయు దివసంబులలోన
"పదివేలఁ జంపఁగానోపుదు నే నని నెత్తికోలు పుట్టినయది నీ
పదునొక యక్షౌహిణులను జదురుననడపింతు నెదిరిసైన్యముగలఁతుఁ

..............................

నీవడిగినపని యేర్పడఁగా విను మేనొక్కనెలఁ దెగంజేయుదు నా
నావిధ దివ్యాస్త్రంబుల లావున నప్పాండవుల బలంబుల నెల్లన్"
—ఉద్యో. ౪ ఆ. ౪౧౧-౪౧౬.

ఈశపథములలో ఒక్కనెల తెగంజేయుదునని చెప్పినది పూర్ణము కాలేదు. తాను తనశక్తిని ఉజ్జాయింపుగ చెప్పెను. మానవుడుగాన మధ్యనే మృత్యువు సంభవించినది.

"ఏను ముదిసినవాఁడ మహీశ, యెట్టులయిన నోపినభంగి నీయనుఁగుఁదాత
సాలినన్ని దినంబులఁ జాలవచ్చు నబ్బలంబులవని సమయంగఁజేయ."
—ఉద్యో ౪. ఆ. ౪౧౭

ఇట్టివాడు స్వామిద్రోహియా ?

ఇట్లుగాక ధర్మరాజాదులకు తన వధోపాయము చెప్పినది వాస్తవమని తలంచునెడల ఒక్కనెల తీరినపిమ్మటనె చెప్పి తన శపథమును నెరవేర్చుకొనియే యుండును.

భీష్ముడు కౌరవపక్షమున కెంతటివిశ్వాసియో అవధరింపుడు.

కర్ణుడు భీష్మునిపై రోషముచేత నస్త్రసన్యాసము చేసినపిదప

".....దుర్యోధనుండు గర్ణపక్షపాతియు నవినీతుండును నగుటం జేసి సహింపక పితామహుతో నిట్లనియె:

"ఎఱిఁగియెఱింగియుండె మది నేదియెఱుంగక యుండె నెప్డు నం
దఱు వినఁ బాండునందనులు దర్పితులై యని గెల్తు రంద్రు ముం
దఱ నిను బాహ్లికున్ గురునిఁదక్కటివారిని నమ్మి యొక్కయే
డ్తెఱ ననిసేయఁబూనితిఁగ డిందిమగంటిమతోడఁ జాలదే!

"కర్ణుఁడు దుస్ససేనుఁడును గల్గఁగ నాకొరులేల సద్భటా
కీర్ణ విరోధిసైన్యముల గెల్వఁగఁజాలుదు మేము మాకు నీ
యర్ణవవేష్టితక్షితి యనర్గళవిక్రమమొప్పఁ దక్కుమా
నిర్ణయమెల్ల నిట్టి దవినీతియొ నీతియొ చూడుమీ తుదిన్.

"అనుపలుకులకు విషాదము దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు దననందను నేమనియుంబలుకఁగఁజాలక వెనుఁబాటున నిట్టులనియెవిదురునితోడన్."
—ఉద్యో. ౨ ఆ. ౨౯౩-౬

ఇట్టులు బడియు వారి నాశ్రయించియుండుటయే భీష్మాదుల స్వామిభక్తిని ప్రకటించెను. నిజముగా వీరు పాండవపక్షపాతులైన ఇపుడు యుద్ధప్రయత్నము చేయుపాండవులలో చేరిన వారు పోషించెదరుగదా!

ధృతరాష్ట్రుడు భీమసేనాదుల పరాక్రమము దలంచి దుఃఖించుచు సంజయునితో భీష్మాదులయందు చూపి చెప్పిన స్వామిభక్తి చూడుడు :

"భీమార్జునుల కోలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ రెఱుంగుదురు. ఎఱింగియు మానుషంబు పాటించి సేనమొగంబున నిలుతురు కీర్తి పట్టి ప్రాణంబులు విడుతురు. ఇంతియకాని చేయునదిలే దదియునుంగాక పౌత్రులగుటయు శిష్యులగుటయు గాంగేయునకు గురునకు సామాన్యంబగుటం జేసి రెండు దెఱంగులవారికి వీరొక్కరూప మనకడనున్న తప్పునకు మనముందర నిలువవలయునను చునుండుదురు. ఇంతమాత్రకుంగా వీరల కింతవలసె నేను దైవాధీనతకతంబున బిడ్డల నొత్తిచెప్పను నియమింపనుంజాల"—ఉద్యో. ౨ ఆ. ౧౯౭

కాని యుద్ధమునకు పూర్వము రాయబారములలో భీష్మాదులు పాండవపక్షమున మాటలాడి యుద్ధము లేకపోవునటుల చేయుటకు ప్రయత్నించి విఫలులైరి. పిమ్మట కౌరవపక్షమున శక్తివంచన లేక పాటుపడినయోధులు కావుననే,

శరతల్పగతుడగు భీష్ముడు (శస్త్రసన్యాసముచేసిన) కర్ణునితో "ఒక్కకరంబు మలంచి కౌఁగలించుకొని యచ్చటనున్న రక్షకాదిజనంబుల నవలం బోవంబనిచి యతనితో నిట్లనియె:

"నీ దెసఁ గోపింతునె కుల భేదముగాఁ బలుకుటయును బిడ్డలఁ జెఱుపం
గాదని కినియుదు లేదన,........
"అది శిక్షగాని రోషంబుగాదట్లుంగాక"—భీష్మ. ౩ ఆ. ౪౪౦-౨

"........ఏను గురుపాండవుల వైరం బుడిపి పుచ్చితి నీవును
నొండు తలంపు దక్కి యక్కౌంతేయులం గలసియుండుః మనినం
గర్ణుం డతని కిట్లనియె" భీష్మ ౩ ఆ. ౪౪౪

"దైవాధీనము సర్వమున్ మనమతిం దప్పింపఁగా వచ్చునే
నీ వింకన్ నను నొండుపల్కక పరానీకంబుపైఁ బంపు మ
త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబు సం
భావింపన్ విహరించెదన్ మురరిపుం బార్థుం దలంకించెదన్."—౪౪౫

స్వామిభక్తి ఇట్లుండవలదా!

"అనుటయు భీష్ముఁ డిట్టులను నంతకుఁ జాలు దెఱుంగనే సుయోధనునకు నెప్డు నీదుభుజదర్పము కాదె సహాయ మెద్ది యా
తనికి హితంబు దానిన యుదాత్తమతిం దగ నాచరింపు నీ
మనమున సంతసింపు మనుమానము దక్కు మనుజ్ఞ ఇచ్చితిన్"—౪౫౦

భీష్ముడు తనచావునకు వెరచి కర్ణుడు పాండవుల కలియునేమో యని పరీక్షింపదలచి పాండవపక్షముగా బలికెను. కర్ణునిర్ణయము వినినపిమ్మట "అనుమానము దక్కు మనుజ్ఞ ఇచ్చితిన్" అని చెప్పుటలో తన చావునకు శస్త్రసన్యాసము చేసిన శత్రువగుకర్ణుని యెటుల గౌరవించెనో తన జీవితపరమార్థము నేమనిచెప్పెనో చిత్తగిం

పుడు. దుర్యోధనుని హితము కోరనివాడైన "గురుపాండవులవైరం బుడిపినవాడు" చావుతరువాతను పక్షపాతమహాపాతకమునకు పాల్పడునా? సామాన్యుని మరణవాఙ్మూలము విలువగలసాధన మగుచుండ పూజ్యుని యెడ భిన్నాభిప్రాయ మెందులకు? ధర్మరాజు పాదచారియై భీష్ముని యొద్దకు వచ్చినపుడు

"...అక్కట నీవిట్లు సనుదేక తక్కిన శాపమిత్తు,
వచ్చితి మేలయ్యెవైరుల నిర్జింపు, మిదిగాకయును వర మెద్దియైన
నడుగుము నీకుఁగానని చేయుటొక్కటి దక్కంగ"—భీ ౧ఆ.౧౫౯

శాపాధికారియగు భీష్ముడు తన చావుకోరిన కర్ణుని ఇపుడైనను శపించక "ఆతనికి హితంబు దానిన యుదాత్తమతిం దగ నాచరింపు" మనుటలో వారి స్వామిభక్తి విశదమగుట లేదా?

ధృతరాష్ట్రుడు ఆశ్రమవాసమున కరుగుటకు పౌరసమ్మతికోరం శంభువను విప్రుడు పౌరజనసమ్మతి నిటుల నుపన్యసించెను. ప్రజా ప్రభుత్వసాక్ష్యము పరమప్రమాణముగదా!

"ధాత్రి శంతనుఁడు విచిత్రవీర్యుఁడు బాండు
రాజు నెట్టు లట్ల రాజరాజు
ప్రజకు సంతసముగఁ బాలించె నీయందు
నతనియందుఁగలదె యధిప యెగ్గు?" —ఆశ్రమ ౧ ఆ. ౧౦౦

కావుననే వీరిని భీష్మాదులు విడువజాలక యుద్ధకారకులైరి. ఇంకను చూడుడు:

"భీష్మద్రోణకృపద్రౌణి కర్ణకృతవర్మశల్యు లొక్కదిక్కనుభీమార్జునకులసహదేవ ద్రుపదసాత్యకు లొక్కదెసయునై విధిప్రేరణంబునఁ బోరిరి వారివలన నఖిలక్షత్రియ సంక్షయంబావహిల్లె నది యొక్క దుర్యోధను నిచేతనే యయ్యనే......" —ఆశ్రమ ౧ ఆ. ౧౦౧

భీష్మద్రోణాదులు యుద్ధమునకు పూనక బలరామునివలె తీర్థయాత్రకు వెళ్లిన భారతయుద్ధమే జరిగియుండదని పౌరులసాక్ష్యము గాదా!

ఇక వరముల ప్రాతికూల్యమును సంగ్రహముగ చర్చించెదను.

"యువరాజగు గాంగేయునకు తండ్రి శాంతనవుడు అతిమానుషంబైన యాభీష్మసత్యవ్రతంబునకు సంతసిల్లి యాతనికి స్వచ్ఛందమరణంబుగా వరమిచ్చెను." —ఆది ౪ ఆ. ౯౧

ఇది యోగసాధనోపదేశముగా నుండును. దీనికి విరుద్ధముగ దక్షిణాయనమున భీష్ముడు మృతుడగునని అనిమిషులు వగబొందుచుండ వారితో తనతండ్రి ఇచ్చినవరమును చెప్పుచు భీష్ముడు "అవధ్యత్వమును" కలిపి చెప్పెను చూడుడు:

"సత్యవతీవివాహం బొనర్చుటకు మాతండ్రిమెచ్చి,అవధ్యత్వంబును, స్వచ్ఛందమరణంబును నిచ్చినవాఁడు గావున తద్వరప్రభావంబున నావధంబున కెనోడంబడక కానేరదయ్యె ప్రాణంబులు నాశంబ........." —భీష్మ ౩ ఆ. ౪౧౫

ఈ వరములకు ప్రతికూలము కలదు. యోచింపుడు:

అంబ శివునికోరినది:—

"భీష్ముని నాకుఁ జంపఁగా దొరకొనునట్లుగ నొసఁగుము."
—ఉద్యో. ౪ ఆ. ౩౭౧

శివుని ద్రుపదుడు ప్రార్థించినది:

"భీష్ముని వధించునట్టివాని నొక్క పుత్రుని నొసంగవలయు."
—ఉద్యో. ౪ ఆ. ౩౭౪

ప్రత్యక్షమై "సూతురై పుట్టి పదపడి కొడుకుదనము గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు" నని రుద్రుండు చెప్పెననియె. అవధ్యత్వమునకు ప్రతికూలముగా చంపుధాతువు ప్రయోగింపబడినది. ఇది ఇటులుండ నవమదివసమున ధర్మరాజుకృష్ణాదులు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకు బోయి వధోపాయము శిఖండియని వారిచే చెప్పించుకొనినపిమ్మటగూడ కృష్ణుడు అర్జునునితో నిట్లు పలికెను:

"నినువిధిపంచె శాంతనవునిం దెగటార్పఁగ వేయు నేటికిన్."
—భీష్మ. ౩ ఆ. ౩౦౯.

అర్జునుడు శివవరము నిట్లు జ్ఞప్తి చేసెను.

"......ఆద్రుపదాత్మజుజన్మ మాపగా
తనయ వధార్థమం ద్రడదియుఁ దప్పదు......

"అనవుడు నవ్వి కవ్వడికిం గమలనాభుం డిట్లనియె.

"నీ వొకరుండు దక్కగ ననింద్య పరాక్రమశాలి భీష్మునిం
జావఁగనేయ నెవ్వఁడును జాలఁడు నీతలఁ పెన్నిభంగులన్
దైవము చూపువోలెఁ దుది దాఁకునె యవ్విధ మిట్లుండఁగాఁ
ద్రోవగవచ్చునే యెటులుఁ ద్రోచినఁబోవదు చూచుచుండుమీ!"
—భీష్మ. ౩ ఆ. ౩౧౦-౩౧౨

శివుడు శిఖండిజన్మోత్పత్తికిగా నిచ్చిన వరమును కృష్ణుడు త్రోచివైచెను. శైవవైష్ణవ మతవిరోధమున కాబోలు!

మరియు దీనినే సమర్థించుట పరికింపుడు.

తొడలు విరిగిపడిన దుర్యోధనుడు కృష్ణు నాక్షేపించునప్పుడు కౌంతేయులు వగ బొందుచుండగా వెన్నుండు వారితో నిట్లనియె:

"గాంగేయగురుకర్ణకౌరవపతులజక్కటియని బరిమార్పఁగాననైతిమని మీరువగవకుఁ డద్దొర లుగ్రాస్త్రవేదులుప్రస్ఫుటవిక్రమమున నడరి వారలఁగెల్చు టరిదిగావున నేను బహువిధోపాయముల్ వన్ని యిటులఁ, దీర్చితిఁగాక య త్తీవ్రపరాక్రములఁలఁతులఁ బోదుకేయట్లు కాక, వారివిధి యివ్విధమునఁజావంగఁజేసె-దైవఘటనలు దప్పింప

మీవశంబె, సురలు దనుజుల గెల్చినచొప్పు లిట్లు - సంతసముసమ
బున వంత లేల? " —శల్య. ౨ ఆ. ౩౩౦

ఈ యూరడించుటయే యథార్థకథనము. దీనినే కర్ణుడుగూడ నంగీకరించెను.

"వారు మహాబలుల్ వారియు వారికిఁ బ్రాపు గలండు వారలం
బోర జయింప రామియును బుద్ధినెఱుంగుదు నైనఁ గౌరవ
క్ష్మారమణుండు సేయు తగు మన్ననలెల్లఁ దలంచి చూఁచినన్
భూరివివేక యే విడిచిపోవుట ధర్మమె వీరకర్మమే"—భీ ౩ఆ. ౪౪౬

భీష్మద్రోణులు గూడ నిదే అభిప్రాయముతో బొందిలో ప్రాణము లుండువరకు పోరిగలించిరి. ద్రోణుడు తన వధోపాయము పాండవులకు చెప్పినటుల భావించుట తప్పు. ఒకవేళ వధోపాయము చెప్పుట యథార్థమని తలంచినవారును ప్రతిజ్ఞాపాలనమును గావింపలేదని మరియొకమారు విన్నవించెదను.

శరతల్పగతుడైన భీష్ముడు ఉత్తరాయణమువరకు బ్రతికెనా, లేదా యని విచారించి ముగింతము.

"అత్తెఱంగాచరింప(దృఢరక్షు)తాత్పర్యంబున రక్షింపను దమ తమ(కురుపాండవుల)యందుండగినవారల నియోగించి రంతఁ జికిత్సకులు వచ్చి శల్యచికిత్స చేసెదమని తొడంగిన గాంగేయుండు వారించి వారి కభిమతార్థము లొసంగి వీడ్కొలిపె గీతవాద్యనృత్తప్రవీణంబులగు పాత్రంబు లామహాత్మునకు వినోదంబు సల్పుచుండె."—భీ. ౩ఆ. ౪౨౫

దీనిచే జీవితాశలేక భీష్ముడు శస్త్రచికిత్సను నివారించెనని ఊహించవలెను. ఇది ప్రపంచధర్మము. "మర్త్యుచేత" అని తానే చెప్పుకొనెను. ఇంకను "కౌరవేశ్వరుండు కోపాయత్తచిత్తుండై పెఱుంగుదు మోవ లేచి చేతుల భూతలం బూఁదికొని (తొడలువిరిగి) బొమముడి తోడి చూడ్కి అతనిపయిం బఱపి . అగ్గోపాలదేవుతో నిట్లనియె:

"...శిఖండి గడంగి యేసె ననఁగ, నర్జునుఁడు శాంతనవుఁ గూల్చు నట్లు చేసి." —శల్య. ౨ ఆ. ౩౨౫

అనుటచేతగూడ శిఖండి భీష్ముని వధించలేదనియు శివవరము వ్యర్థమైనదనియు దృఢమైనది.

"అక్కౌంతేయులు దారు ధర్మంబు దొఱంగి ద్రోణ కర్ణ శల్య దుర్యోధనాదుల వధించుటకు... ... జిత్తంబుల వగయు లజ్జయు మిగులఁ బొడమి మొగంబులవోఁప విన్న"నైరి. దీనిచే భీష్మాదులు మృతి చెందినటుల వాచ్యముగా కాన్పించుచున్నది. కాని తొడలు విరిగిన దుర్యోధనునివలె భీష్మకు బ్రతికియుండునా అని సంశయ మొదవు చున్నది.

దుర్యోధనుడు కృష్ణునితో,

"చదివితి నెల్లవేదములు జన్మము లొప్పఁగఁ జేసితిన్ రమా
స్పదమగువృత్తిఁబొల్చి నరపాలకులెల్లను గొల్వఁగంటి దు
ర్మదరిపుగాఢగర్వపరిమర్దనకేళి యొనర్చితిం దగన్
దుది నని మిత్రబాంధవులతోఁ ద్రివంబున కేఁగు టొప్పదే."

"నీవుం జూడనెట్టివాఁడనైనను నాకేమి మీరింకఁ బశ్చాత్తాప దుఃఖితు లగుచునుండుదురు గాక యనియె నప్పు డతనిపైఁ బుష్పవర్షంబులు కురిసె దేవ దుందుభులు మొరసె."—శల్య. ౨ఆ. ౩౨౯-౩౩౦

ఇవి ఆసన్న మరణవాక్యములు. భీష్ముడు దుర్యోధనునకు పూర్వమే మరణించియుండును. భీష్మకు యోగవిధానముచే బాధకు తాళజాలక నసువులు బాసెనుగాన స్వచ్ఛందమరణమే యనవలయును. ఇది ఇంకను పరిశోధింపదగినవిషయము నృత్తగీత వాద్యములచే బాధోపశమనము చేసికొనుభీష్ముడు ధర్మోపదేశముల నెటులచేసెను? శస్త్రచికిత్సకు నంగీకరింపకుండుట జీవితాశ లేకయే. కాకపోయిన చికిత్సకుల నివారించినటుల నృత్యగీతాదుల పరిహరించి, చికిత్సకులకు, నటకులకు, విదురాదులకు ధర్మోపదేశములు జేయవలసినది. యుద్ధములో మునిగి తేలుచున్న కృష్ణాదులకు ఉపదేశించినగాని ఫలము లేదని అట్లు చేయలేదుకాబోలు. ద్రుపదునిపగ దీర్చుటకైనను శిఖండి భీష్మునితల నరుకకపోవుట ఆజ్ఞాభంగము. తమ్ముడగు ధృష్టద్యుమ్నుడు చచ్చినద్రోణుని శిరమును ఖండించి సార్థకనామధేయుఁ డయ్యెను. అన్న వెనుకబడెను.

వారితండ్రి స్వచ్ఛందమరణమునేకాని అవధ్యత్వము ప్రసాదించలేదు. శాంతిపర్వధర్మములు భీష్మజీవితములోనివని మనము వాని నాదరించుట భీష్ముని పూజించుట. దివ్యుడగు భీష్ముడు స్వామిద్రోహి. మానుషభీష్ముడు సర్వోత్తముడు.

ధర్మజాదులు సముద్యత నానాయుధబహుళంబైన కురువ్యూహము దరిసి భీష్మాదుల మరణోపాయము లడుగుట ఎట్లు? భీష్మద్రోణుల వధోపాయమును సిగ్గులేక అడిగిన ధర్మజునకు, కృపాచార్యు నడుగుటకు మరల సిగ్గెందులకు?

"...కృపాచార్యునిఁ బరిమార్చు తెఱంగు నడుగందలంచి యేర్పడం బలుక నేరకున్న నతం డెఱింగి తానువధ్యుండుగామి యెఱిఁగించి గెలువుమని దీవించె" —భీష్మ. ౧ ఆ. ౧౬౨

"ఇట్టిట్టన కేఁగు మిప్పరుస యింతకుఁ గాలముగాదు దానికిన్." —భీష్మ. ౧ ఆ. ౧౬౦

అని భీష్ముడు మందలించెను. కాని ద్రోణుడు,

"...నాచేత నాయుధం బున్నంతసేపు నన్నుం జంప నెట్టివారికి నశక్యంబేను బ్రాయోపవేశంబున సన్యస్తశస్త్రుండనైనం జంపుటకు నోపునట్టివారికి నదిదొరకొనుఁబెద్దయు నమ్మఁగలవాఁడు సెప్పనత్యంత దుస్సహంబైన కీడుమాట వింటినేని నట్టివాడ నగుదు నప్పు డట్టిపగ అటు నప్పనిఁ దీర్పవనువైయుండు." —భీష్మ. ౧ ఆ. ౧౬౨

ఇంత దండకమును చదివిపైచెను. కాని ప్రతిజ్ఞాపాలనము గావింపలేదు. ఇంతమాత్రము ధైర్యము లేకకాబోలు! "క్రమ్మర

సేతెంచెదుగాక" యని ఆజ్ఞాపించి భీష్ముడు ధర్మజాదులను పంపివైచెను భీష్ముడు పదియవనాటి యుద్ధమున ధర్మరాజును సమీపించునపుడు "కయ్యముచేయుచందమున", "కదియుట", "అల్లన" మొదలగు విశేషణములతో కూడి స్వాభావికముగా నున్నది ఇచ్చటసందర్భశూన్యముగా నున్నది పదియవనాడు ధర్మజునితో భీష్ముడు వ్యంగ్యముగా జెప్పిన వధోపాయముపై నీకల్పితగాథ శేర్పడినదని దృఢముగా జెప్పవచ్చును ఆచార్యుల కందరకు వర్తింపజేసిరి

ధర్మరాజు పాదచారియై ఒంటిబోవునపుడు బద్మనాభుండు మరుత్తనయాదులతో నిట్లనియె

"ఇతని (ధర్మజుని) తలంపే నెఱింగితి నితండు భీష్మద్రోణకృపశల్యులకు నమస్కరించి వారలచేత ననుజ్ఞాతుండై భండనంబు సేయువాఁడుగాఁదలంచి చనియెడు బెద్దలయనుజ్ఞగొని కయ్యంబుచేసిన జయంబగుట నిశ్చయంబని యార్యులు చెప్పుదురు గావున నాసుకర్మం బాచరించుట మేలుకాక"

—భీష్మ ౧ ఆ ౧౫౬

ఆచార్యులవధోపాయ మడుగుటకు ధర్మజుడు పాదచారియై పోవుటయే సత్యమగునెడ సర్వజ్ఞుడగు కృష్ణుడుకూడ పొరబడినవాడగును నమస్కరించుటకె అయిన సర్వజ్ఞుడగును సత్య మింతియె యుద్ధకథాబీజమును వృక్షము చేసిరి కాని ఫలించక గొడ్డుపారినది

కాన భీష్ముడు స్వామిద్రోహము చేయక శరీరమునుదాచక 'వ్రేలెఁ డెడలేని' యట్లు గాయపడెను కర్ణునకు "ఆతనికి (స్వామి యగురారాజునకు) హితంబు దానిన యుదాత్తమతిం దగనాచరింపు" మని ప్రోత్సాహము గలిగించిన స్వామిహితైషి ఒకవేళ ధర్మజునకు వధోపాయము యుద్ధములో చెప్పినాడనుకొనినను స్వామిభక్తిపరుడుగాన "నేఁబట్టినఆయుధంబు నెడబాసినఁగాని వధింపఁబోలదు" అను ప్రతిజ్ఞను తిరస్కరించివైచి బొందిలో ప్రాణము లుండువరకు యుద్ధము చేసినవీరుడు దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు వీరిని నమ్మరి కాన కీర్తిబట్టి ప్రాణంబులు విడచిరి ధర్మరాజు యుద్ధములో భీష్ముడు వ్యంగ్యార్థముగ చెప్పిన అధర్మయుద్ధమునకు అర్జునాదుల బ్రోత్సహించి భీష్మ బడవైచునటుల జేసి, "ధర్మనూతి మెత్తనిపులి" యని కవిబ్రహ్మచే సత్కరింపబడినాడేకాని, అడుగులో హంసపాదియనునట్లు ఆచార్యులవధోపాయము నడిగినపాపమున బోయి 'గండుపులి' కాలేదు మరియు,

" సాదు రేఁగనేని వ్విను తలపాలమునన కాని నిలువదు సుమ్మీ"

—ఉద్యో ౨ ఆ ౧౩

సామెతకు పాత్రీభూతు డైనాడు

"దేవత్వము రాగద్వేషావేశము లేమిగాదె!"



అటవీ (ఫారెస్టు) కళాశాల, కోయంబుత్తూరు

—యస్ మీనాక్షిసుందరము





1 నాగేశ్వరరావుగారి దుర్గావిలాసము, బెజవాడ మహాత్ముని నివాసమందిరము ఆంధ్రదేశహరిజనసంచారమునందంతట మహాత్ముడు పంతులుగారి అతిథిగనుండిరి 2 చెన్నపురిలో శ్రీ నాగేశ్వరరావుగారి 'శ్రీ భాగు'లో బసచేసినపుడు మహాత్ముడు చూడవచ్చినవారికి మేడపైనుండి దర్శనమొసగుట







1 బందరు జాతీయకళాశాలలో కృష్ణాజిల్లాబోర్డు అధ్యక్షులు చల్లపల్లిరాజా గారు మహాత్మునకు సన్మానపత్రమును సమర్పించుట

2 మహాత్ముడు మధురలో హిందీవిద్యార్థిసభలో బహుమతి పుస్తకములందు సంతకములు చేయుట

## సూక్ష్మములో మోక్షము!  ఐహికాముష్మికసాధనము!!

**ముఖ్యముగా గమనింపవలసిన విషయము:—**

బ్రతికియున్నంతకాలము కాయకష్టము జెంది, ఆలుబిడ్డలను ఎటులో పోషించుచు, మరణానంతరము వారిని దిక్కుమాలిన వారినిగా నొనర్చిన మందభాగ్యు లెందరు లేరు? కావున ముందుగనే జాగ్రతపడి, సూక్ష్మములో మోక్షమనునట్లు, అతిస్వల్ప వ్యయముతో జీవితము భీమాచేసికొని, గడువువరకు జీవించియున్నచో నిరామయముగ మీరే సౌఖ్యమనుభవించిగాని, లేనిచో మీదారపుత్రాదులకు జీవనాధారము కల్పించిన చిత్తశాంతితో నిర్విచారమనస్కులై ఆముష్మికముగ సౌఖ్యమొందిగాని, జన్మము సార్థకమొనర్చుకొనుట ముఖ్యావసరము. దీనులపాలిటి కల్పవృక్షమై, దినదినాభివృద్ధి గాంచుచున్న స్వదేశీ భీమాసంస్థ

# జయ్ భారత్ యిన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్,

## 4/105 ఆర్మీనియన్‌వీధి, మద్రాసు.

ఆంధ్రదేశీయులు గర్వింపదగిన భీమాసంస్థ

| గవర్నమెంటు సెక్యూరిటీలు | చెల్లించిన క్లెయిములు |
|---|---|
| **రు. 1,20,000 లు.** | **రు. 2,61,000 లు.** |

"జయ్ భారత్" పాలిసి ప్రతివారి యందు బొటులో నున్నది

**మాట ఆలస్యమునకు కారణము కావున నేడే ఒకపాలిసీ తీసికొనుము**

## మా ప్రత్యేకలక్షణములలో కొన్ని

1– రు. 250/-లకుకూడ వైద్యపరీక్షతోను, లేకను, భీమా చేయవచ్చును.
2 ప్రీమియములు మిక్కిలి స్వల్పము
3 ప్రమాదముల బాధ్యతగైకొనబడును
4 పాలిసీలు రద్దుకాని సౌకర్యములు
5 శాశ్వతదౌర్బల్యసౌకర్యములు
6 ధారాళమైన "సరెండర్" విలువలు
7 స్త్రీల జీవితములు అంగీకరింపబడును
8 పాలిసీలమీద ఋణములు మంజూరు చేయబడును

కావలెను

సరళములైన షరతులమీద, పలుకుబడి, గౌరవముకలిగిన ప్రతినిధులు కావలెను

వివరములకై దయచేసి వ్రాయుడు

## జై భారత్ యిన్స్యూరెన్సు కంపెనీ లిమిటెడ్.,

4/105 ఆర్మీనియన్ వీధి, మదరాసు.








1. బందరు సారస్వతమండలి ద్వితీయవార్షికోత్సవము; 2. కృష్ణాపుష్కర ఖద్దరుప్రదర్శనము, స్వచ్ఛందసేవకులు.





1 శ్రీగణపతినవరాత్రమహోత్సవము, సంస్కృతకళాశాల-తెనాలి

2 బొబ్బిలితాలూకా ఉత్తరావల్లియందు జరిగిన శ్రీరామ సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవము



# ప్రార్థన

పానుగంటి విజయరాఘవరావు

## మహాత్ముని ఉపవాసాంతమున

ఆతఁడు ప్రకృతిలోనొకతునక యాతఁ
డాఁడు

పలుకు మాలలనిట్టూర్పు పడెడుపాటు
లగ్రజాతుల కుద్బోభ లతని చేష్ట
లధికవిజ్ఞానపథమున కమరుమెట్లు
లతని స్వేదాంబువులు మాల లకట! కనుల
నింపు నిర్మలహృదయరక్తంపు బొట్లు.
ఒకని దోషము తనదని యొప్పుకొన్న
వాఁడు, మాలలే లేరన్నవాఁడు, దేహ
మాత్మబానిసయని చూపినట్టివాఁడు,
పరమపూజ్యాతిపూజ్యుఁడు భరతమాత
కడుపుచలువచే మన భాగ్యగరిమచేత
సత్యపాలకుఁ డౌ రామచంద్రు కరుణ
దారుణోపవాసపిశాచి నోరినుండి
కీడుఁబొరయక వెలిఁబడినాఁడు నేఁడు.
కామధేనువ, పాలిచ్చి కావుమమ్మ!
కల్పవృక్షమ ఫలమిచ్చి కావుమమ్మ
హిందువుల పుణ్యధనమగు నితని సతము.

## పుట్టినరోజున

గడ్డిపూవుల కనువిప్పు కళుకుమొదలు
తారకల కన్నుగీటుల తళుకువఱకు
మొదలు తుద లేక నివసించు ముసలియువతి,
అఖిలలోకేశు ప్రతిబింబమైన యువతి
ప్రకృతికన్య మహాత్ముపైఁ బరమకరుణ
పులకరించెడి చూపులఁ జిలుకుఁగాక
ఒక్కనూఱేండ్లవఱకైన నొక్కబిగిని.
అరుల ఈర్ష్యావాక్యాళికి సురిగిపోక
యెంతకాలమునుండియో యింకియున్న
సర్వమతసమత్వమునకు సారమిచ్చి
ఆత్మవృద్ధియే జీవుని కధికతరమ
టంచు బోధించి, చేసిచూపించి, దశది
శాంతములఁ గీర్తినించిన శాంతమూర్తి
దేశదాస్యాంధకారపు దీపకళిక
పంచముల గోడు పాడు విపంచి, గాంధి
నొక్కనూఱేండ్లపాటైన నోము మీశ!
ఇంక నుపవాసములను జేయింపకుండ.

---



# బమ్మెర పోతన

బండా ఆదినారాయణ

“శ్రీ నాశ్రయింపకే మన
నేనేరనె?” యంచు వాణి యెంత
మ్మౌని ధర నవతరించెనో [యుఁ బంత
నా ననఘుఁడుపుట్టెఁ బోతనమహాత్ముఁ డిలన్.

భక్తిజ్ఞానవిరక్తులం గలిపి త
త్త్వమ్ముం బ్రబోధించుచున్
ముక్తిం గూర్చు మహాంధ్రభాగవతమున్
మోక్షార్థియై రాము స
ద్భక్తిం బల్కి సరస్వతీ వదన చిం
తా బాష్పముల్ వాపు శ్రీ
సూక్తుం గొల్తుఁ గవిత్వధీవిభవవి
ష్ణుం బోతనామాత్యునిన్.

అక్షరుఁ డైన రామునకు
నంకితముం బొనరించి భక్తి, దు
ష్టక్షితిపాలురన్ గణన
సల్పక భాగవతమ్ముఁ బల్కి, ప్ర
త్యక్షమునం బరోక్షమున
నాదృతి వాణివగం దొలంచు నా
దక్షత యబ్బు నెట్లు కవి
ధాతవు నిక్కము నీవు గాని వో?

గోపికలు మెచ్చ మురళిని గోపబాలుఁ
డాగమమ్ములఁ బాడినయట్లు నీవు
పండితులు మెచ్చఁ దెనుఁగునఁ బాడినావె
యాగమమ్ముల సారమ్ము భాగవతము!

గ్రంథములకెల్ల రాజు భాగవత మవనిఁ
గవులకెల్లను రాజ వీ వగుదు కాన
గ్రంథమును గవి యొండొంట ఘనతఁ గనియె
గ్రంథరాజము కవిరాజరచితమాట.

మూలమున లేని మధురకథాళి నన్య
కృతుల గ్రహియించి తెనిఁగించుకతన నెట్టె
కథను, నేకృతిఁ జదివిన క్షుధ తనియదు
నీదుభాగవతంబునన్ వినినఁగాని.

ధర రామాయణ భారతమ్ములను నాం
ధ్రమ్మందుఁ బెక్కండ్రు ప
ల్కిరి, నీవొక్కఁడె తక్క భాగవతమున్
లీలం దెనింగింప నొ
క్కరుఁడుం బూనమి చాటఁజాలదె యమో
ఘుంబైన నీశక్తి, ను
ర్వర నీ కెందును నీవె సాటి, కవితా
ఫాలేక్షణా, పోతనా!

వాగనుశాసనుండుఁ గవి
పద్మజ కేతనరంగనాథు లెం
తేగరిమం బ్రబంధపర
మేశ్వర భాస్కర సోమ భీమనల్
భాగవతామృతమ్ము శ్రుతి
పర్వముగాఁ దనివారఁ గ్రోలి తా
రేగతి మెచ్చియుందురొక
దే భువి వారలు నేఁటి కున్న వో!

నవరసమ్ములె కాని యీయవని భక్తి
గర్భితమ్మగు నవరసకలితకవితఁ
జవులుపుట్టించి చెవులపండువుగఁ బల్కు
సహజపండితుఁ డిల నీకు సాటిలేఁడు.

నన్నయఋణమ్ము ననఘు తిక్కన్న ఋణము
నెఱ్ఱనఋణమ్ము నింతయు నీఁగలేని
ప్రజకు భాగవతమ్ము నాంధ్రమునఁ బల్కి
యింకను భరమ్ము నేసితే ఋణము నీవు!

# స్వాతంత్ర్యలక్ష్మి

ఓలేటి సీతారామమూర్తి

౧

మురువులురులించు వేఁకువఁ బొడుపుమ
బాలభానుని దరహాసలీలవోలె [లను
హైందవస్వాంతసీమఁ బ్రేమార్ద్రవగుచుఁ
దల్లి, సాక్షాత్కరింపు స్వాతంత్ర్యలక్ష్మి!

౨

గళితభవ్యపురాణవికాసయగుచు
అవనతాననమున నిస్పృహాప్రవృత్తి
మల్లడింపఁగ భరతక్షమామతల్లి
దైన్యమున నిల్చెఁ గనుము స్వాతంత్ర్యలక్ష్మి!

౩

అమితదాస్యదారిద్ర్యక్షుధార్తితోడఁ
బ్రబలు యుష్మద్వియోగభరమ్ముతోడ
సత్త్వమును బాసి భారతజాతి క్రుంగె;
తల్లి, చేయూఁత నిమ్ము స్వాతంత్ర్యలక్ష్మి!

౪

సతతజాతీయమానితోత్సాహపటిమ
దైన్యరహిత సాంఘికజీవితప్రశాంతి
నీమృదుపదమ్ము హత్తిన సీమయందె
తాండవించునుసుమ్ము స్వాతంత్ర్యలక్ష్మి!

౫

కలుషహేయదాస్యధ్వాంతగహ్వరమున
నసిసిపోయిన జీవితచ్ఛవులతోడ
ఎంతకాలమొ ఈదేవురింపు మాకు?
తల్లి, దర్శన మీవె స్వాతంత్ర్యలక్ష్మి!

౬

కాయమునుగ్రుచ్చు దారిద్ర్యకంటకమ్ము
తావకీనహాసజ్యోతి తళుక్కుమనఁగఁ
ద్రెళ్లు నీఱయి; పూవుపొత్తిళ్లలోన
తల్లి, కనుమోడ్తు మవల స్వాతంత్ర్యలక్ష్మి!

౭

నీదు లేనవ్వు తొలకరినీటిజల్లు
గురియ జాతీయభావవిస్ఫురత సూన
రాజి విచ్చును; భారతప్రకృతి సొగయు;
తావకవిలాస మిద్ది స్వాతంత్ర్యలక్ష్మి!

౮

నీవలపుమేని పన్నీటితావికలిమి
ప్రిదులుకొనుచును జీరువాఱినతలమ్ము
పూతవీరరక్తస్వాంత, భోగభూమి;
ధన్యసుగుణవిఖ్యాత; స్వాతంత్ర్యలక్ష్మి!

౯

మాసుధాస్వాంతకవితాకుమారి కీవు
జిలుఁగులొడఁగూర్చు నెయ్యంపుచెలివిసుమ్ము!
తద్వియోగప్రవృత్తిని దలఁచితలఁచి
నాకలమ్ము చలించు స్వేచ్ఛాకుమారి!

---



# పుష్పబాణ విలాసము

(అనువాదము)

దివాకర్ల వేంకటావధాని

అనిశవ్రజాంగనావిహరణార్పితచేతసుడైన నందనం
దనుని విచిత్రగాథ భువనత్రితయప్రచిత ప్రశస్తమున్
ప్రణయసుధామయమ్మును, అది వస్తువుగా రసవత్ప్రబంధమున్
పనివడి గూర్చు నారసనపైని సరస్వతి తాండవించుతన్.

కాంతుడు దృష్టిగోచరుడు కాన్ వికసించెను కన్నుదోయి; యే
కాంతగృహమ్మునన్ గలసినంతనె దేహము పుల్కలెత్తె; న
త్యంతముదంబునన్ కుచములందిన కంపము పుట్టె, కంధరా
ప్రాంతము కౌగిలింప దృఢమయ్యెను నీవి విడెన్ లతాంగికిన్.

అతిశీఘ్రగమన పర్యాకులత్వమునందు కచభారమంతయు కలగిపోవ
ఆయాసజనిత ఘర్మాంబుసంతతియందు కమ్మకస్తురిబొట్టు కరగిపోవ
కంటకావిలవల్లికానికుంజములందు కాయంబు వ్రణితమై కందిపోవ
పతనస్ఖలన వికంపిత బాహుముఖహైమ కంకణమ్ములు కటుక్వణన మూన
ఏల పరిపక్వబింబమనీష నీదు - కెంపువాతెర కొరకి యేగిన శుకమ్ము
నరసి శిక్షింప భ్రమియించె దబల, నీదు - ఆడుబిడ్డయ కొనిపోయె నన్నిపూలు.

తెలతెలబారె హేమలత, తెల్లని ముత్యము లుద్భవిల్లె ను
త్పలయుగళంబునం; దుహినభానుడు పద్మమునన్ శయించెడిన్
జలరుహకోశసంగమమునన్ పువుదండలు వాడుదేంచె; ని
ట్లలమిన దుర్నిమిత్తముల యానముదంబు తొలంచె నెచ్చెలీ!

ఒకచిగురాకు కేల విడనున్న శిరోజభరమ్ము దాల్చి వే
ఱొకట పయోధరద్వయమునుండి తొలంగు దుకూల మూని, కా
ముకుని గృహంబు వెళ్వడెడి మోహనమూర్తి యొకర్తు, పుష్పసా
యక జయలక్ష్మియో యనగ నారయు చందనచర్చితాంగియై.

సఖుడు విదేశ మేగునని స్వాంతము కొందలమందు, చందిరుం
డఖిలజనప్రమోదకరుడయ్యెను వైరము సేయు నాయెడన్

సఖి, కలకంఠకంఠకలనాదము దుఃఖముగూర్చు; హావ్యభు
క్సఖుడు, వచింపనేల, అసుసంతతినే పెకలించివై చెడిన్.

సరసిజసుందరస్మితలసన్ముఖి యాహరిణాక్షి, చారుపీ
వరపృథుల స్తనాంతరనిపాతగళన్మృదులో త్తరీయయుం
బరిసరథ రుణీస్థజనవంచనకామయు నై విలోచనో
పరి, నును కేలు సాపినను వారక దూరమునుండి చూచెడిన్.

వనితా, చూచితె మాధవీలతలలో భ్రష్టప్రసూనావృతం
బును నీరంధ్రము నైన కుంజసదనంబున్, దాన ప్రౌఢాంగనల్
మణితంబుల్ కలిపింతురేని విను, తన్మధ్యస్థపుంస్కోకిల
క్వణవిస్తారమునందు వానిని వినంగాజాల రెవ్వారలున్.

పరితాపాపనయమ్ము పొంటె రచియింపంబడ్డ యీపల్లవా
స్తరణమ్ము న్నిజపాణిపంకరుహసంసర్గమ్మున న్వాడ్చు నీ
సరసీజానన, చిత్తజన్మశిఖిదత్తాంగారభావంబునన్
పరమేశా, తదసహ్యవేదన వచింప న్శక్యమే యెరికిన్?

మలయజవాయునిర్దయయు మంజులకోకిలకంఠనిస్స్వనం
బుల యతినిష్ఠురత్వమును పూర్ణశశాంకుని తిగ్మభావమున్
కలపి లతాంగి మృత్యుగత కావుటకై యొనరించు యత్నముల్
ఫలితముతప్ప క త్తృణలవప్రచలభ్రమితత్వదాగతిన్.

ఆరమణీలలామ హరిణాయతలోచన చక్రవాక శృం
గారవతీసమాన తుదికంటకమయ్యెడు నీవసంతమం
దోరువలేక దారుణవియోగరుజ న్మరణింప పుంజితాం
గారనిభమ్ము నీకిసలకల్పితతల్పము న్నాశ్రయించెడిన్.

కన్నుల నీరుపెట్టకుము కాటుక యంత కరంగిపోవు, కం
దు న్నవకంఠమాలికలు తూలగనీయకు వేడియూర్పులన్
క్రొన్ననపాన్పు జేరకుము కొంచెపడున్ తనురాగ మెల్ల నో
అన్నవమిన్న, నీమగని యాగమకాలము దాట దింకనున్.

కలువలబోని నీకనులు క్లాంతము లైనవి; ఘర్మవారిబిం
దులు నవమౌక్తికప్రభలతో తులతూగెడు నీలలాటికా
స్థలి; బహుళమ్ములయ్యెడిని శ్వాసలు; వెన్నెలలోన రాకపో
కలు పొనరించి యెంతగను గాసిలితోసి వృథామదర్థమై!

చాన యొకర్తు సర్వజనసమ్మత విభ్రమమూర్తి నెయ్యపుం
జానలమధ్య భ్రూచలనసంజ్ఞల దూతికతోడ పల్కుచున్
మానుగ నంజనంబు నయనంబుల దిద్ది పటాంచలంబునన్
పీనతరీభవత్కుచమణీ నవహారము కప్పె, వేగమై.

నీహారకిరణాస్య, నీయాననము చూపు చక్షుర్జడత్వవిశ్రాంతి రస్తు!
శుకవాణి, మధురవాక్కైన వినిపించు శ్రవణామృతస్రుతిసౌఖ్య మస్తు!
పద్మాక్షి, శిశిరదృక్పాతమ్ము గావించు మమితాంగపరితాపశమన మస్తు!
అమృతాంగి, నాపార్శ్వమందు నిల్వు మొకింత సౌరలోకావాస సంపదస్తు!
పలుగుచెలికత్తియల మృషావాదములనె-కాని, నాయందు ఇంత ఉత్కటము దీర్ఘ
తరము నౌ రోషమునకు కతమ్ములేదు,- కుటిలకుంతల, నాపైని కోపమేల?

వనరుహకోశచారురుచి భాసకుచంబుల తాకనెంచు, చుం
బన మొనరించు బింబఫలభాసము మోవి, ముఖమ్ము జ్యోత్స్న మూ
ర్కొను, నరుణాబ్జశోభ సుమకోమలిహస్తము లూనియాడు; సే
వన మొనరించు నబ్జముఖిపాదయుగంబుకు పల్లవద్యుతుల్.

అనుగుసఖి, చేసితేను చెప్పినది యెల్ల-ధరణి నీవంటి పరహితార్థప్రవణలు
కలరె! నాకయి యరిగి యింతలసిపోయి-తౌను శ్రమలేక సఫలమ్ము లగునె పనులు?

బెడగగురీతి ఫాలమున బెట్టదు కస్తురిబొట్టు; పూసరు
ల్ముడువదు కేశపాశమున ముందటివోలె లతాంగి; నెయ్యపుం
బడతులతోడ నాయెదుట మాటికిమాటికి సంచరింప, దే
నడిగినయప్పుడైన తెగనాడదు నాయపరాధలేశముం.

శ్రుతికటువౌను కిన్నెరల మ్రోత పొలంతుక పాటపాడినన్
స్మితము వెలార్చినన్ మలినమేయని వెన్నెల తోచు; క్లాంతమౌ
నతికనుదోయిముందు వికసన్మృదులోత్పలమయ్యునున్ తటి
ల్లతిక లతాంగిమైసొబగు లక్షితమైన వివర్ణమై చనుం.

కనుదోయి రాత్రిజాగరణజన్యంబైన రాగరేఖాపాళి ప్రచురమగుట
వక్షస్థలమునందు వరకుంకుమోదిత రాగచిహ్నములు తోరంబులగుట
అలికభాగంబునం దాలక్తికములైన రాగలింగము లవిరళములగుట
వేగకమున్న న న్వీక్షించు నభిలాష మించ నాయింటి కేతెంచియుంట
'ప్రాణనాయకి, నాయనురాగరసము-గాఢతరమౌను నీయాత్మకలుగుదాని
కంటె' నని నీవు పల్కిన యనుగుపలుకు-పొచ్చెమేలేని దని కానవచ్చె నేడు.

వారిజగంధబంధురము వాయువునూర్పన, వాక్కుచే మనో
హారిశుకారవమ్మును, శశాంకుని చారుహాసమ్ముఖమ్ముచే
నే రమణీలలామ హాసియించునో, యామెయ త్వద్వియుక్తయై
దారుణరుక్శరవ్యముగ దా జలుపంబడె వానిచేతనే.

దెసలన్ కైరవగంధబంధురసరస్తీరానిలం బొప్పగా
నిశలన్ చాంద్రమసాచ్ఛసౌధకిరణానీకమ్ము జృంభించుటన్
కుసుమోచ్ఛ్రాయలసద్వసంతమున నాకున్ తాపసంభావిసా
ధ్వసమే యుండదు దూరదేశమునకున్ ప్రాణేశ, నీ వేగగన్.

నతుడై వల్లభు చూడ దించుకయు మానమ్లానచేతస్కుడై
పతి నిర్యాతుడుకా నపారపరితాపం బందు నీబాల; తా
నతిమానంబు వహించు చెల్వుడు బలాదానీతుడైనప్డు; జీ
వితశంకాస్థితి నందు నాతడు పునఃప్రీతప్రయాణుండు కాన్.

కోమలివాక్కు విన్నయెడ కోకిలకంఠము లా కఠోరముల్
సోమునియందు లోకరుచి చూడకపూర్వమె తన్ముఖాభమున్
భామను గాంచుదన్కనె సువర్ణలత ల్లలితమ్ము లౌట, యా
సేమము నేత్రమీలనమె చేడియకన్నులముందు లేళ్లకున్.

---

అలవాటు ౨





# గృహకల్లోలాలు*

(ఏకాంకనాటకం)

టేకుమల్ల కామేశ్వరరావు

[దీంట్లో వచ్చేపాత్రలు

| | |
|---|---|
| నారాయణరావు | స్కూళ్ల డిప్టీయినస్పెక్టరు |
| వెంకమ్మ | నారాయణరావు తల్లి |
| లక్ష్మమ్మ | " భార్య |
| సుబ్బమ్మ | " చెల్లెలు |
| సీతమ్మ | లక్ష్మమ్మ తల్లి |
| రత్నమ్మ, రాజమ్మ | ఇరుగుపొరుగువాళ్లు |
| వెంకటేశ్వరులు | నారాయణరావు స్నేహితుడు |
| సోములు | బంట్రోతు |
| చామాలు | సోములుతల్లి |

నాటకమంతటా రంగం ఒకటే.]

## ౧-వ రంగం

[స్కూళ్లడిప్టీయినస్పెక్టరయిన నారాయణరావుగారి యిల్లు. నారాయణరావుగారి భార్య లక్ష్మమ్మ వంటింటిముందరవున్న సావిట్లో కూచుని పిల్లాడిచొక్కా కుట్టుకుంటూవుంటుంది. ఇరుగు పొరుగువాళ్లయిన రత్నమ్మ, రాజమ్మ వస్తారు.

లక్ష్మమ్మ యిరవైయేళ్లమనిషి పల్చగా, చామంచాయగా వుండును. మొహంలో కొంచెంవిచారం కనబడుతుంది.

రత్నమ్మ నలభైయేళ్లమనిషి. లావుగా వుండును. వితంతువు జుత్తువుంది. సగం నెరిసిపోయినతల చెంగావిపంచ కట్టుకు వచ్చును.

రాజమ్మ పాతికేళ్లమనిషి పునిస్త్రీ ఊలుటోపీ కుడుతూవుండును. మనిషిలో యేమీ విశేషం లేదు]

లక్ష్మ—(లేచి) రండి రత్తమ్మపిన్నిగారూ, రాజమ్మవదినగారూ! మిట్టమధ్యాన్నవేళ వచ్చేరు, యింతయెండలో. పీటలుతెస్తా వుండండి, కూచుందురుగాని.

రాజ—పీట లెందుకమ్మాయి, బాగానేవుంది!

రత్న—పీట లక్కర్లేదమ్మా. ఇక్కడే కూచుంటాంలే. సుబ్బర మైనగచ్చు. మనలో మన కేంమర్యాదలమ్మా! ఇక్కడ కూచుంటాం

రాజ—పీటలు తేకుసుమండీ వదినగారూ!

లక్ష్మ—మంచిమాటే అన్నారు! పోనీ చాపవేస్తాను, కూచుందురుగాని, వుండండి (వెళ్లి చాపతెచ్చి వేయును) ఇలా చాపమీద కూచోండమ్మా

రత్న—ఇదేంచాదస్తమమ్మా!

రాజ—మొత్తంమీద పూరుకోరు వదినగారు.

(రత్నమ్మ, రాజమ్మ చాపమీద కూచుంటారు.)

రత్న—మీపిల్ల లేరమ్మా, కనపడరేం? ఎక్కడా సందడి లేదు

లక్ష్మ—నిద్దరపోతున్నారు మంచంమీద వొకణ్ణి, వుయ్యాలలో వొకణ్ణి పడుకోపెట్టేను ఇద్దరూ వుయ్యాలలోనే పడుకుంటామని దెబ్బలాట ఒకళ్లకొకళ్లు తీసిపోరు. వాళ్లతగవులు తీర్చేటప్పటికి నాతాతలు దిగొచ్చేరు.

రత్న—(రహస్యంగా) మీఆయన ఆగదిలో లేరుకదా

లక్ష్మ—ఊఁ ఊఁ. లేరు ఎక్కడో వీధిగదిలో ఆఫీసుపని చేసుగుంటున్నారు

రత్న—ఏమో, పెద్దమనిషి అక్కడవుంటూవుంటే మేమిక్కడ గొడవచేస్తున్నామేమో అని.

రాజ—ఏదోమాట వేగిరం చెప్పండి, యింటికిపోతాం, ఆయన్ని యిబ్బందిపెట్టక.

లక్ష్మ—లేరమ్మా, ఇక్కడ లేరు. ఆయన వీధిగదిలో యెక్కడో ఆఫీసుపని చేసుగుంటున్నారు. మన మిక్కడ మాటాడుకున్నా ఫర్వాలేదు.

రత్న—ఔనుగాని మీ అత్తగారు యింట్లో లేదా యేమిటి?

* ఈ యేకాంకనాటకం రాజమహేంద్రవరంలో ౧౯౩౩-వ సం. జూన్ నెలలో రచించబడింది—టే. కా.

*The*

# *Primus*

—మిక్కిలి

ప్రకాశమానముగ వెలుంగు

# లాంతరులు



ఇపుడు వ్యాపకమునందున్న అన్నిరకముల యభివృద్ధులు గావింపబడి యీ లాంతరులు, దీపములయందు ఒకవిధమైన నూతనశోభ సమకూర్చినవి.

దీనివలన గలుగు ప్రయోజనములవలన, యివి సర్వత్రా ఆదరింపబడుచున్నవి బజారులో విక్రయింపబడు యితర లాంతరును, దీనితో పోల్చిచూచిన యెడల రెంటికిగల తారతమ్యత మీకే ప్రత్యక్షముగా గోచరింపగలదు.

200, 300 సి. పి. లలో దొరకును. పూర్తి విడిభాగములు లాంతరు వర్తకు లందరివద్దను దొరకును.

ఇండియా, సిలోనులకు సోల్ ఏజంట్లు :—

## కే. యస్. శివ్‌జీ అండ్ కో.,

## **K. S. SHIVJI & Co.,**

**178/179** బ్రాడ్వే, మద్రాసు. **144** చక్లావీధి, బొంబాయి.

ఏజన్సీలు :—

కలకత్తా, కరాచి, సిలోన్.



హైమవతీమనోహరుడు

— పెండ్యాల వెంకటరామారావు

లక్ష్మి:—ఆవిడ మరేమో మాఆడపడుచుగారివూరు వెళ్లేరు.

రత్న:—ఏమీ, యెందుకూ?

లక్ష్మి:—ఆవిణ్ణి యిక్కడికి తీసుకొద్దామని

రత్న:—(బుగ్గలుమీద వేళ్లువేసుకుని) అదేమిటమ్మా! మొన్న మొన్ననేకదూ శ్రావణమాసంలో వెళ్లింది యిక్కడికొచ్చి చాలానాళ్లయిపోయిందని, అప్పుడే యేంతీసుకురావడమమ్మా! రెణ్ణెల్లేనా అయిందో లేదో.

రాజ:—పున్నం వెళ్లేక పున్నమింకా వెళ్లిందే!

లక్ష్మి:—ఆవిడ మరి కూతుర్ని విడిచిపెట్టివుండలేరు. పచ్చగా వున్నది యీవొక్కకూతురేగా

రత్న:—అయితే కూతురిదగ్గిరే వుండిపొమ్మను చీటికీమాటికి యీతీసుకురావడాలేమిటి, తీసుకువెళ్లడాలేమిటి?

రాజ:—కూతురింట్లోనే వుంటే సరి తీరిపోతుంది

లక్ష్మి:—అల్లుడికి యింట్లో యెవరూ పెద్దవాళ్లు లేరు తల్లి చచ్చిపోయి రెండేళ్లయిందిపాపం!

రత్న:—అయితే యిల్లరికం చేసుకుంటుందా యేమిటి?

లక్ష్మి:—ఇల్లరికం చేసుకుంటుందని నేనేడవడం లేదు, పిన్నిగారూ! కూతురు వచ్చేక తనూ, కూతురూ కలిసి నన్ను బతకనిస్తారాఅని పగలురాత్రి యేకయిపోతున్నా. వాళ్లు యింట్లోవుంటే తింటారు, నేను తింటం లేదూ. అదేంఖర్మమోగాని వాళ్లిద్దరూ నాతో దెబ్బలాడనిరోజంటూ వుండదమ్మా అందుకని, నేనేడుస్తున్నా ఒహరుంటే నే చస్తున్నాకదా, యిద్దరూవుంటే యింక యేలాబతకడమని.

రత్న:—నిజమేనమ్మా, రాక్షసుల్లాంటివాళ్లిద్దరూను.

రాజ:—ఇద్దరూ లంఖిణీ తాటకేన్నూ.

లక్ష్మి:—ఇంట్లోవుంటే దెబ్బలాట ఆపట్టున మూడుమూడు నాళ్లకె యింట్లోంచి వెళిపోవడం వెళ్లినవాళ్లు పోనీ అక్కేవుంటారా అంటే మళ్లా అదిలేదు. ఇట్టే వెళ్లడం, యిట్టే రావడం. ఆవెళ్లడం రావడంఖర్చులు మళ్లా మావే ఇలా చస్తున్నామమ్మా!

రత్న:—సరేగాని, వాళ్లసంసారంకూడా మీనెత్తిని వెయ్యడమేమిటో! వాళ్లది వేరేకుటుంబంకాదా, వేరేసంసారంకాదా. అలాంటప్పుడు మీయింటిమీద కెందుకూ తీసికొచ్చిపెట్టడం?

రాజ:—అదేమో, నాకూ వింతగానే వుంది.

(లక్ష్మమ్మ వూరుకుంటుంది)

రత్న:—మీరిద్దరూ చిన్నవాళ్లుకదా ఇద్దరూ చిలకాగోరింకల్లాగ వుంటూవుంటే తను చూసి సంతోషించవలసిందికదా. అటువంటప్పుడు వాళ్లసంసారంకూడా మీనెత్తిని పెట్టడమేమిటమ్మా. ఇప్పుడు కాకపోతే మరెప్పుడూ సుఖపడడం!

రాజ:—ఇంత కాల్చుకుతినే అత్తగారిని నే నెక్కడా చూడలేదమ్మోయి! మాచెల్లెలిఅత్తగా రొకర్తె వుందిగాని ఆవిడేనా యింత కాల్చుకుతినడం నేచూడలేదు, విన లేదు

లక్ష్మి:—నా వొక్కర్తెతో దెబ్బలాడితే పోనీ అదేపోయిందని వూరుకుందును. ఆయనతోకూడా దెబ్బలాటే. ఆయన నన్ను కొట్టడం, తనబుర్ర గోడనేసి కొట్టుగోడం, యేడవడం, చచ్చిపోతాననడం, యీబాధలు నేభరించలేననడం, ఇహ యేమిచెప్పనుతల్లీ! ఇల్లు యుద్ధరంగ మయిపోతుంది. ఇవన్నీ తలచుకుని యేమిరాదైవమా నాకేమిదారని యేడుస్తున్నా.

రత్న:—కడుపుతోవున్నమనిషివి నువ్వు. రేపో నేడో నీళ్లాడతావు. నీచేత పనులు చేయించుగుంటుందేమిటమ్మా!

రాజ:—నిండుపొద్దులమనిషిచేత చాకిరీ చేయించుగోడమేమిటి నామొహం.

లక్ష్మి:—అటుమొన్నసాయంత్రం తలకాయినొప్పొచ్చి లేవలేక ఆవిడికి రాత్రికి బియ్యపుపిండి విసరలేనన్నాను. దానికోసం తెగతిట్టిపోసింది.

(రత్నమ్మ నోరు నొక్కుగుంటుంది.)

రాజ:—ఏమి ఆశ్చియం. చూడగాచూడగా యమురాలులాగుంది.

(బంట్రోతు సోములు వస్తాడు.)

సోము:—అమ్మగారండీ!

లక్ష్మి:—ఏమిటి?

సోము:—అయ్యగారు మరేమో నన్ను పడవలరేవుకాడికెళ్లిరమన్నారండి. అమ్మగారొత్తారంటండి. అమ్మగారు, సెల్లాయిగారూకూడా వొత్తారంటండి. పడవలరేవుకాడికెళ్లి తీసుకురమ్మన్నారండి ఆరిని. బజారెంటే యెల్తాగాదండి. ఏమేనా కూరగాయలట్టుగురావలసొస్తే సెప్పండి. ఒచ్చేటప్పు డట్టుకొత్తానండి. సిక్కం తీసుకెళతా, డబ్బులిప్పించండి

లక్ష్మి:—ఇప్పుడేమీ కూరగాయ లక్కర్లేదు. ఇంట్లో చాలా కూర లున్నాయి. పడవలరేవుకు వెళ్లి వాళ్లిద్దరినీ తీసుకురా.

సోము:—సిత్తమండమ్మా. పడవలరేవుకాడికెల్తానండి. అమ్మగారిని, సెల్లాయిగారిని తోడుకొత్తానండి.

లక్ష్మి:—సరే, వెళ్లు. (సోములువెళతాడు.)

రత్న:—మళ్లా ప్రళయం వచ్చి పడుతూందమ్మా

రాజ:—తల్లీ కూతురూ కలిస్తే రెండుప్రళయాలయిపోతాయి.

లక్ష్మి:—నాఖర్మానికి నే నేంచెయ్యగలనమ్మా! ఇంట్లో యింతమంది నౌఖర్లుంటూవున్నా మళ్లా పనిపాట్లన్నీ నేనేచెయ్యాలి;

గుడ్డలుతేకాలి, లాంతర్లుతుడవాలి, పిండ్లువిసరాలి, ఒహటేమిటి ? సమస్తం నేనే చెయ్యాలి (విచారంమాని) ఒహలాగయితే ఆవిడ వూరుకుంటుందమ్మా వారికొచ్చే జీతంకనక నెలనెలకే ఆవిడచేతిలోపోసేస్తిమా వూరుకుంటుంది 'అంతా మీ అల్లుడికే మీకూతురికే యిచ్చేసుగోండి. మాకేమక్కర్లే' దంటిమా పరమానందం. ఇహ మమ్మల్ని యేమీ అనదు కాని మాకు తిండెలాగ? మేమెలాగబతకడం? అదెలా చెయ్యమండీ పిన్నిగారూ !

రత్న·—నిజమేతల్లీ ! నువ్వెంతేనా క్షోభపడిపోతున్నావు నువ్వెంతక్షోభపడిపోతున్నావో ఆపరమాత్ముడికే తెలుసు.

రాజ·—కూతుళ్లని కనుక్కున్నవాళ్లే యిలాగ చేస్తావుంటే కూతుళ్లు లేనివాళ్లమాట చెప్పేదేమిటే !

రత్న·—కొడుకు బతికుండాలి, కోడలు ముండమొయ్యాలనేరకంమనిషి దేవుడేనా తగినశిక్ష చెయ్యకుండావున్నాడమ్మా !

రాజ·—పాపం పండితేగాని ఒద్దలవదంటారు పెద్దలు. అలా పెరగ్గాపెరగ్గా ఆఖరికి వాళ్లపాపం వాళ్లనే కొట్టేస్తుంది. చూడండి నామాట అబద్ధమయితే

లక్ష్మ—తనకూతురుచేత ఆవగింజంతపనిచేయించదు, ఆవిడ వొళ్లు యెక్కడ అలిసిపోతుందో అని. చాకిరీచెయ్యడానికి మళ్లా నేను. ఊరికే చెప్తున్నా, మీరు వింటున్నారుకదా అని, వాళ్లకావిడపెట్టడాన్నిగురించి వేపుగతిని తనకు కట్టుగోడానికి పంచలున్నాకూడా లేవనిచెప్పి ఆయనచేత ఒకసైనుపంచ కొనితెప్పించిందమ్మా తెప్పించుకున్నమనిషె తను కట్టుగోవాలా ? మళ్లా అదిలేదు. తిన్నగా తీసుకెళ్లి కిందటిసారి వెళ్లినప్పుడు అల్లుడిచేతి కిచ్చేసొచ్చిందమ్మా ! ఏమిటి చెప్పను పిన్నిగారూ ఆవిడచేసే పనులుగురించి. ఏమయినా, వొకళ్లకిచ్చిందని నే నేడవడంలేదు నన్ను చంపకండర్రో యని యేడుస్తున్నా నేనన్నా మాపుట్టింటారెవరన్నా కూడా ఆవిడికి కిట్టదమ్మా, ఆవిడికే కూతురికే కూడా. ఆమధ్య మా తమ్ముడొచ్చేడు. కుర్రాడుకదా. ఆరేళ్లవాడు- వాడిని పెట్టినభాదలు యేమనిచెప్పమన్నారు. ఇన్నీ అన్నీ కావు. చూడలేక చివరికి వాడిని వాళ్లింటికి పంపేసేను.

రత్న—ఆవిడి 'ధావత్తు 'అలాగుంది !

రాజ·—చక్రం తిరుగుతుంది లెండి. కింద మీదికే, మీదు కిందికే వస్తుంది.

లక్ష్మ—ఒకరోజునుంచీ, రెణ్ణాళ్లనుంచీ పడుతూన్నభాదలా యివి. ౦ంచి పడుకున్నా. పెదిమ మెదపకుండా భరిస్తున్నా.

రత్న·—నిజమేతల్లీ ! వింటూవుంటే నావొళ్లే ఝుల్లుమంటూంది పగవాళ్లకేనావద్దు నువ్వు పడేబాధలు. నేను వినే భరించలేకుండావున్నాకదా ! నువ్వు పడుతున్నావు. పాపం ! చిన్నపిల్లవి. దేవుడే రక్షిస్తాడు నిన్ను. దిక్కులేనివాళ్లకి దేవుడే దిక్కంటారు ఓపికపట్టివుండు తల్లీ. (స్ఫురించి) అమ్మాయీ ! ఇంక మీవాళ్లు వచ్చేవేళయింది మళ్లా రేపోయెప్పుడో వస్తాలే, వెళతాం దేవుణ్ణే నమ్ముకో. నీ కింకేమీ ఫర్వాలేదు ఇలాంటి వెల్లకాలం వుండిపోవు. లే, రాజమ్మా, లే పోదాం, మరి వెళ్లొస్తామమ్మా

రాజ—వెళ్లొస్తానండీ వదినా.

లక్ష్మ·—మంచిదమ్మా (రత్నమ్మ, రాజమ్మ వెళతారు.)

(లక్ష్మమ్మ చొక్కాకుడుతూవుండును. సోములు వస్తాడు.)

సోము·—అమ్మగారు, సెల్లాయిగారు వొచ్చేరండి. రెండు మూటలూ లోనడేసేనండి.

(వెంకమ్మ, సుబ్బమ్మ వస్తారు.)

(వెంకమ్మ నారాయణమూర్తిగారితల్లి. వలభైయైదేళ్లుంటాయి వితంతువు. బక్కపల్చగా వుండును చూడడానికి మనిషి కొరకొరలాడుతూవుండును

సుబ్బమ్మ వెంకమ్మకూతురు. తల్లిలాగే పల్చగా వుండును. తల్లికి ప్రతి వయస్సు యిరవైయేళ్లు )

లక్ష్మ:—(నిలుచుని) ఏంవదినా ! క్షేమంగా వున్నావూ ? ఏమత్తా ! వచ్చేరూ ?

వెంక—అబ్బాయి యెక్కడ ?

లక్ష్మ·—సావిట్లోనే వున్నారు. ఆఫీసుపని చేసుకుంటున్నారు. (సుబ్బమ్మతో) ఏమివదినా ! అన్నయ్య కులాసాగా వున్నారా ?

సుబ్బ—ఉఁ దేవుడిదయవల్ల.

లక్ష్మ·—అంతా దేవుడిదయే. లేకపోతే మరి మనయిష్టమా యేమిటి ?

సుబ్బ·—ఉఁ. ఔను

వెంక:—అబ్బాయిని చూసొద్దాం రా పిల్లా.

సుబ్బ·—ఉఁ. పద. (ఇద్దరూ వెళతారు )

## ౨ - వ రంగం

[నారాయణరావు కుర్చీమీద కూచుండును. లక్ష్మమ్మ వచ్చును.

నారాయణరావు స్కూళ్లడిప్టీయినస్పెక్టరు. సామాన్యంయెత్తు మనిషి. క్రాపెంగుతల. నవ్వుమొహం. సర్కీటువెళ్లడానికి దుస్తులు వేసుగువుండును. చేతితో దండకడియం పట్టుగొనును.]

లక్ష్మ—సర్కీటువెళ్లడానికి బట్టలు వేసుగున్నారూ ?

(నారాయణరావు అడావిడిగా దండకడియం జేబులో పెట్టుగొనును. లక్ష్మమ్మ పరిశీలించదు.)

నారా:—వచ్చేవూ? ఇంకా రాలేదేమని చూస్తున్నా.

లక్ష్మి:—ఏదో యింట్లో పనిచేస్తున్నాను.

నారా:—ఇంకా పనులేమిటే, నీమొహం. ఇప్పు డాల్టే కష్ట పడి పనిచెయ్యకూడదు చూసేవా? నీళ్లాడేరోజులొచ్చేయి. చాలా ప్రమాదం.

లక్ష్మి:—అలాగేలెండి. (కొంచెం సేపయేక)

నారా:—వచ్చింది.

లక్ష్మి—ఏమిటే?

నారా:—అయినా చెప్పుగో.

లక్ష్మి—నాకెం కెరళ మొచ్చుననుకున్నారేమిటి?

నారా:—నే నిన్నాళ్లూ అలాగే అనుకుంటున్నా

లక్ష్మి—మంచిమాటే!

(నారాయణరావు జేబులోనుంచి దండకడియం తీయును.)

లక్ష్మి—అదేమిటది?

నారా—మొదట చేతికి పెట్టుగో.

లక్ష్మి—తర్వాత పెట్టుగుంటాను లెండి

నారా—పెట్టుగోమరి.

లక్ష్మి—పెట్టుగుంటానులెండి.

నారా:—నువ్వు పెట్టుగుంటే మరి నేను చూసి సంతోషిస్తా. నా కానందం అక్కర్లే దనుకున్నావేమిటి.

లక్ష్మి—పెట్టుగుంటాలెండి ఇ దెందుకు చేయించేరూ?

నారా—నువ్వు కొంచెం బలుస్తావేమోఅని. కడుపుతోవుండే మనుష్యులు సాధారణంగా నీరుపట్టి బలిసివుంటారు. కాని నువ్వు బక్కగానేవున్నావు. ఈదండకడియం పెట్టుగుని, యిది దండమ నిలవడాని కేనా కాస్తతిని బలుస్తూవుంటావని చేయించేన.

లక్ష్మి:—సరేలెండి వేళాకోళాల మిటిగాని, మీఅమ్మకు తెలుస్తే యేమేనా అంటారు.

నారా.—అది అనేదేమిటి దానిమొహం. నాయిష్టం. నా డబ్బు. నాయిష్టం

లక్ష్మి:—మీయిష్టమని మీ రనగానే సరా యేమిటి ఆవిడ వూరుకుంటారేమిటి?

నారా:—అయితే నన్ను వెళ్లి చెప్పమన్నావేమిటి? వెళ్లి చెప్తాను, నే నిలా చేయించేను, నా కిష్టమని. (నిలుచొనును)

లక్ష్మి:—ఏమీ చెప్పక్కర్లేదు, కూచోండి.

(నారాయణరావు కూచొనును.)

నారా:—పెట్టుగో మరి.

లక్ష్మి:—పెట్టుగుంటానులెండి.

నారా:—నువ్వు పెట్టుగుంటేగాని నే నివాళ అసలు సర్కీటే వెళ్లను.

లక్ష్మి—పోనీండి అయితే (చేతికి దండకడియం తొడుగు కొనును)

నారా—చూసేవూ, నగ కెంత అంద మొచ్చిందో!

లక్ష్మి—అయితే, నగ కందంరావడానికేమిటి నగలుపెట్టు గుంటారు?

నారా:—కొంతమందికి నగలు పెట్టుగుంటే అందమొస్తుంది. కొంతమందికి నగలుపెట్టుకుంటే వికారమొస్తుంది. కొంతమంది నగలు పెట్టుగుంటే నగల కందమొస్తుంది. చివరజాతిమనుష్యులలో చేరిన దానివి నువ్వు.

లక్ష్మి—మీరే అన్నిటికంటే పెద్దనగ నాకు

నారా—నిజమే నిన్ను పెళ్లాడితే నాకు అందమొచ్చింది; ఆజాతిమనిషివని అననేఅన్నానుగా.

లక్ష్మి—పోదురూ! అన్నీ యిలాగే అంటారు.

నారా—నిజంచెప్పితే నిష్ఠూరం ఉన్నమాట ఆడకతప్పదు.

లక్ష్మి—అన్నినిష్ఠూరాలూ మీకే తెలుసు నా కేం తెలీవు.

నారా—ఇంక వెళతాను మరి. (దండను ముద్దాడును.)

లక్ష్మి—చాలులెండి. బొత్తిగాను.

(నారాయణరావు మళ్లాముద్దాడును)

నారా—మరి వెళ్లొస్తాను. ఇదిగో, అన్నట్టు చెప్పడం మరిచి పోయేను. మీఅమ్మకు ఉత్తరం రాసేను, వచ్చి నిన్ను తీసుకువెళ్ల వలసింది పురిటికని.

లక్ష్మి—చెప్పడం మరిచిపోవడమేమిటే, మీరు ఉత్తరం రాసి నాకు చూపించేరుకదూ, పోస్టులో వెయ్యకమునుపు.

నారా—మందమతిని, బొత్తిగా జ్ఞాపక ముండడంలేదు అంతకంతకి ఇప్పుడు జ్ఞాపకమొచ్చింది, నీకు చూపించేవేసేను పోస్టులో అని. ఎప్పుడువేసేను పోస్టులో?

లక్ష్మి—అటుమొన్న బుధవారంనాడుకదూ.

నారా—ఔను. మొన్నబుధవారంనాడే వేసేను. ఇంక రేపో నేడో వస్తుందన్నమాట మీఅమ్మ.

లక్ష్మి:—ఊఁ.

నారా:—నేను కాంపులోవుండగా వస్తేమట్టుగు నేనువచ్చే వరకూ వుండమని చెప్పు. చెప్పేం, తెలిసిందా?

లక్ష్మి:—ఉండ కేంచేస్తుంది? మీరు రాకుండా తీసుకెళు తుం దేమిటి నన్ను తీసుకెళతానంటేమట్టుకు నేను వెళతానా?

నారా:—అలాగేలే, నేను వచ్చేక వెళుదూగాని ఔనుగాని వాకు యీవూరునుంచి బదిలీఅవుతుం దనుకుంటున్నారు అంతా. అంతా అదేమాట. విచిత్రం

లక్ష్మి:—అయితే బదిలీవద్దని కోరుకోండి

నారా:—కోరుకోవాలంటే చెన్నపట్నంవెళ్లి డైరెక్టరాఫీసులో గుమాస్తాలకాళ్లు పట్టుగోవాలి.

లక్ష్మి:—పోనీ కోరుకోండి. ఇక్కడే వుండిపోదాం. ఈవూరు అన్నివిధాలా అనుకూలంగా వుంది మనవూరికి దగ్గిర ఇట్టే వెళ్లివస్తూ వుండవచ్చు. ఇక్కడే సుఖంగావుందాం

నారా:—ఇంకా యేమీచెప్పలేను దాన్నిగురించి. ఇంతకే యిప్పుడు తొందరేముందిలే. . మరి వెళ్లొస్తానోయ్.

లక్ష్మి—ఉఁ. మంచిది.

నారా:—ఇదిగో! పిల్లలు జాగ్రత్తసుమా. వీథిలోకి వెళతారు బళ్లూ గిళ్లూ, పశువులూ తిరుగుతూ వుంటాయి. బళ్లకింద పడతారు. జాగ్రత్త. వీథిలోకి వెళ్లనియ్యకు వెళ్లొస్తానుమరి.

లక్ష్మి:—ఉఁ మంచిది జాగర్త సుమండీ మూడునాలుగు రోజులవరకూ ఆవేళవపూళ్లంటే తిరగాలి, బాడిబందలోను రోడ్డేనా వుండదు. చేలగట్లంబడి తిరగాలి.

నారా:—కొత్తాయేమిటి?

లక్ష్మి:—కొత్తనిగాదు. అయినా మీశరీరం మీరు జాగర్తగా చూసుగోడం అలవాటు లేదు. అందుకని.

నారా:—ఉ. అలాగే. వెళతాను మరి.

లక్ష్మి:—మంచిది.

నారా:—జవాన్! (లోపల 'అయ్యా'అని వినవస్తుంది) పెట్టె, పరుపు పట్టుగు నడుస్తూవుండు (లోపల 'చిత్తమంఅయ్యా' అని వినవస్తుంది) వెళతా నింక.

లక్ష్మి—మంచిది (నారాయణరావు వెళ్లును)

లక్ష్మమ్మ—(తనలో) ఈనగ మాఅత్తగారయినా, మావదిన యినా చూస్తే యేమేనా అంటారేమో. (సుబ్బమ్మ వచ్చును. లక్ష్మమ్మ కొంచెం కంగారుపడును)

—ఏమమ్మా, మాఅమ్మ పిలుస్తూవుంటేనే నిన్ను. వినబడలేదూ? (దండకడియంచూసి) ఇదెక్కడిదో! చాలా బాగుంది.

లక్ష్మి:—మీ అన్నయ్య యిప్పుడే యిచ్చేరు.

సుబ్బ:—మాకెవరికీ చెప్పందే!

లక్ష్మి:—అత్తగారికి చెప్పే చేయించేనన్నారు.

సుబ్బ—అమ్మేనా చెప్పలేదు నాకు. చేతికి చక్కగావుంటో.

లక్ష్మి:—నువ్వుకూడా చేయించుగుందూగాని లే.

సుబ్బ:—ఈనగకోసమే యిప్పుడు దేవుళ్లాడుతున్నాను ఉన్న నగలు పెట్టుకుంటే చాలులే. నీచేతి కీనగ చాలాచక్కగావుంటో. నగకే కళకాంతులొచ్చేయో

లక్ష్మి—వదినవుకాబట్టి హాస్యమాడుతున్నావు, తప్పలేదు.

సుబ్బ—నువ్వే హాస్యమాడుతున్నావు. నేను నిజమే ఆడుతున్నాను. చక్కగా వుంది రావో అమ్మకుకూడా చూపిద్దాము

(వెంకమ్మ వచ్చును, నడుముమీద చేతులుపెట్టుగుని.)

వెంక—ఏమేపిల్లా! నువ్వుకూడా యిక్కడే వుండిపోయేవు సరే, దానికంటే పనిలేదు అది అన్నింటికీ తెగించింది.

సుబ్బ—చూడేఅమ్మా! అన్నయ్య వొదినికి దండగడియం చేయించేడు.

వెంక—(బుగ్గలునొక్కుకొనుచు) అలాగు వాడు డబ్బు తగలేసుకుంటూవుంటాడు స్వయంరాజు, స్వయంమంత్రి వాడెలాగుతగలేసుకుంటే యెవళ్లకికావాలి తగలేసుకోనీ తల్లిమాట విననికొడుకు బాగుపడేదేమిటి... పిల్లా! నేను వెళ్లి జపంచేసుగోవాలి ఇవాళ యేకాదశి ఉపోషంకదా. అప్పుడే అస్తమానవేళ అవుతూంది ఏదో కాస్త చలిమిడి గొంతుకులో వేసుగుంటూ, జపం చేసుకుని రెండుమంచినీళ్లచుక్కలు వేగిరం తాగితేగాని వొంట్లో ప్రాణాలు లేచిపోయేటట్లా వుంది. (లక్ష్మమ్మతో) ఏమే! నువ్వు ఆబియ్యం పూర్తిగా బాగుచెయ్యి

లక్ష్మి—అలాగే

వెంక:—నేను వెళతా ఇంక మరి జపంచేసుగోవాలి. (వెళ్లును)

సుబ్బ:—కూచో వదినా!

లక్ష్మి—అత్తగారిప్పుడే చెప్పివెళ్లేరు చూసేవా బియ్యం బాగుచెయ్యమని. అంచేత కూచోనుబాబూ వెళిపోవాలి వెళ్లి బియ్యం బాగుచేసుగోవాలి. బాగుచెయ్యకపోతే మళ్లా యేమేనా అంటారు.

సుబ్బ:—కాస్సేపు కూచో. నేనూ సాయంచేసిపెడతాను

లక్ష్మి—నువ్వు సాయంచేయక్కర్లేదమ్మా నాపని నేనే చేసుగుంటాను.

సుబ్బ:—ఫర్వాలేదు. కూచో కాస్సేపు.

లక్ష్మి:—(విసుగుతో) నువ్వు కూచోమంటావు. ఆవిడ బియ్యం బాగుచెయ్యకపోతే యేమేనా అంటారు. (కూర్చొనును.)

సుబ్బ:— అత్తగారిమాటమీదే నడుస్తూన్నట్టు మహాచెప్తా వేమిటి కబుర్లు.

లక్ష్మ:—అత్తగారిమాటమీద నడవ కేంచేస్తున్నాను ?

సుబ్బ:—ఆవిడమాటమీదకాదు, నోటిమీద నడుస్తున్నావు. నువ్వంతగా అత్తగారిమాటమీదే నడిచేమనిషివయితే యిన్ని దెబ్బలాట లెందుకు వస్తూవుంటాయి ?

లక్ష్మ:—నాఖర్మం.

సుబ్బ:—నీఖర్మంకాదు, నాఖర్మం ; మాఅమ్మఖర్మం. మా అమ్మ యెంతముచ్చటపడి చేసుకుందో అంత దూర మయిపోయింది, కొడుకిక్కి. సరా, తీరిపోయింది.

లక్ష్మ:—నువ్వు వున్నమాట, లేనిమాట ఆడకుమరి.

సుబ్బ:—నామీదా నువ్వు అధికారం చేసేదానివి పుట్టేవిన్నాళ్లకి.

లక్ష్మ:—నా కెందుకమ్మా. నా కేగొడవలూ తెలీవు. అలాంటప్పుడు వూరుకుంటేనే మంచిది.

సుబ్బ:—పోనీగాని నిన్నటికి నిన్నరాత్రి కాస్త వొంటిమీద నీళ్లోసుకుని దిబ్బరొట్టె చేసిపెట్టలేకపోయేవా ? ముసిలిముండకదా ! ఆమాత్రం కనికరం లేకపోతే ఆ దెలా బ్రతుకుంది? నలభైయేళ్లు దాటేయికదా ! అది బతకాలని మనస్సులోవున్న మనిషివేనా నువ్వు. ఉన్నమనిషివయితే అలా వూరుకుంటావా? ఒంట్లో ప్రేమ పుట్టాలికాని ఒకరు చెప్తే వస్తుందా ?

లక్ష్మ:—రాత్రి స్తానంచేసి చెయ్యలేదనేనా నువ్వనడం.

సుబ్బ:—చేస్తేమట్టుగు యేం మునిగిపోయిందని. ఉన్నపాటి నాళ్లయితే చెయ్యరూ, కడుపుతోవుంటే మట్టుగు. నువ్వేగాని మరే యిల్లాలూ కడుపుతోవుండడం లేదు కమోసు. ఇంతోటినాజూకు దానివీ పుట్టేవు. (లక్ష్మమ్మ వూరుకొనును) పోనీ, యెన్నడేనా రెండు రాగిడబ్బులు నీచేత్తో దానిచేతిలో పెట్టి యెరుగుదువా? నాకు తెలియక అడుగుతున్నా, చెప్పు.

లక్ష్మ:—ఆయనే యిస్తూవుంటేనే. ఇంతకీ నాదగ్గి రేముందనీ, నేనియ్యడానికి మానడానికిన్నీ.

సుబ్బ:—పెట్టితాళాలు మెళ్లోనే కట్టుకొన్నావుకదూ పుస్తెల్లాగా, పూసల్లాగా. మరెవరికీ కనపడనియ్యవుకదూ.

లక్ష్మ:—నాకెందుకూ తాళాలూ, యీతిట్లూ. ఆయనకే యిచ్చేస్తా, మీరే అడిగి తీసుకోండి.

సుబ్బ:—నీఅంత కుచ్ఛితంమనిషిని నేచూడలేదంటే నమ్మ. ముమ్మాటికీ నమ్మ. పైగా యివన్నీ అతగాడితో చెప్పి తాళాలు దానిమొహాన్ని కొట్టిస్తావా. ఆముండ నేడిపిస్తావా! ఇదా నువ్వుచేసే పని. నువ్వే 'తాళాలు నాకువద్దు. మీ అమ్మగారి కిచ్చెయ్యండి. మీఅమ్మగారికంటే నేనెక్కువా? కన్నతల్లికంటే యీయింట్లో నాకెక్కువఅధికార ముందా?' అని అతనితో చెప్పి ఆతాళా లిచ్చెయ్యొద్దూ. ఒకళ్లు చెప్పేకా బుద్ధిరావడం. చీవాట్లుపెట్టేక కుక్కకేనా బుద్ధొస్తుంది.

లక్ష్మ:—నువ్వన్నట్టుగానే చేస్తానమ్మా, నా కేగోలా అక్కర్లేదు.

సుబ్బ:—నువ్వు తాళాలు వదుల్తావా. నువ్వు తాళాలు వదిలేమనిషివే. నువ్వు తాళాలకంటే ప్రాణాలు తొందరగా వదులుతావు. ఆసంగతి నాకు తెలుసు.

లక్ష్మ:—(పుస్తెనుంచి తాళాలు తీస్తూ) నాకెందుకమ్మా యీ వెధవతాళాలు. నన్ను దెబ్బలాటలు లేకుండా బతకనియ్యండి. అంతే చాలు. నాకు తాళాలూవద్దు, గీళాలూవద్దు. తీసుకోఅమ్మా తాళాలు. (తాళాలు సుబ్బమ్మకాళ్లదగ్గిర పడవేయును.)

సుబ్బ:—అమ్మోయ్! నాయనోయ్! చచ్చేనర్రోయి, చచ్చేనర్రోయి, చచ్చేను. కొట్టేసిందర్రోయ్, కొట్టేసింది. తాళాలు మీద విసిరేసింది. (ఏమిటే ఏమిటే ఏమిటే అంటూ వెంకమ్మ వచ్చును.) నాకాళ్లు విరక్కొట్టేసిందర్రోయి, తాళాలు విసిరేసిందర్రోయి, నాకాళ్లమీద. కాళ్లు విరిగిపోయేయర్రోయి.

వెంక:—(సుబ్బమ్మను కౌగలించుకొని యేడుస్తూ) అయ్యో, అయ్యో, అయ్యో! నేనేంచేతునేతల్లీ. నువ్వెందుకొచ్చేవే అమ్మా. నువ్వు చచ్చిపోతే నేనుండలేనేఅమ్మా. నే నేగోతులోనో, నూతులోనో పడిపోతానే తల్లీ! (లక్ష్మమ్మతో) లంజా, నాపిల్లను చంపేస్తావుటే! నీపొట్ట నెట్టుకుంటావుటే. నా కొక్కకూతురేనే పచ్చగావుంది. నా కొడుకునీ, కూతురినీ కూడా పొట్టపెట్టుకుంటావుటే. అది చచ్చిపోతే నువ్వేంచేస్తావే. నీలాంటివాళ్లు లక్షమంది చచ్చినా నాపిల్లతో సమానంటే. నీయిల్లు వల్లకాడుగాను. నీవాళ్లంతా నాశనమైపోను. మీఅమ్మ చచ్చిపోను. మీనాయన బూడిదైపోను.

లక్ష్మ:—అసలు ఆవిడకాళ్లకు తాళాలు తగలందే.

సుబ్బ:—అమ్మోయి. ఎంతదెబ్బతగిలిందేవ్. దాని కేంతెలుసునేవ్. మోకాటిచిప్ప విరిగిపోయిందేవ్. ముట్టుగోకేవ్. నేచచ్చిపోతానేవ్. నన్ను విడిచిపెట్టెయ్యేవ్. నన్ను చంపేసిందేవ్ నీకోడలు.

వెంక:—నువ్వు నాశనమైపోను. నీవాళ్లంతా గంగలో కలిసిపోను. మీవంశం నాశనమవా. అలాగు కొడతావుటే పిల్లను.

లక్ష్మ:—మావాళ్ల నెందుకు తిడతారు కావలిస్తే నన్ను తిట్టండి

వెంక—నీమొగుడు సంపాదించినదంతా మీవాళ్లకు పెట్టెయ్యలేదని యేడుస్తున్నావు నువ్వు మేమంతా చచ్చిపోవాలని నువ్వు

ప్రతిరోజూ దేవుణ్ణి ప్రార్థిస్తున్నావు. మేమంతా చచ్చిపోతే ఆవెధవల్ని యింట్లో పెట్టుగుని కులుకుతూవుందామని చూస్తున్నావు. మేము తింటున్నామని ప్రతిక్షణం యేడుస్తున్నావు.

లక్ష్మ:—రామ! రామ! మీరు తిన్నారని నామనస్సులో నేనెప్పుడూ అనుకోలేదే! నమ్మండి నమ్మకపోండి.

వెంక:—ఓసి నీఅబద్ధాలు కాలిపోనూ! ఎంతదానివే నువ్వు! ఎంతకైనా తగుదువే నువ్వు! నీఅబద్ధాలు మండిపోనూ! నిజం చెప్పు, మేము తింటున్నామని యేడవడం లేదూ, యేడవటం లేదూటే నువ్వు. నిజంచెప్పు. నామొహంవేపు చూసి చెప్పు.

లక్ష్మ:—నిజంగానే చెప్తున్నా. నేనెప్పుడూ మీరు తింటున్నారనీ, మీరు వున్నారనీ, యెన్నడూ యేడవలేదు.

వెంక:—మీవాళ్లందరిమీదా వొట్టేసుగుచెప్పు. మీవాళ్లంతా చచ్చేరని వొట్టేసుగు చెప్పు చూతాం.

లక్ష్మ:—మావాళ్లంతా యెందుకుచస్తారూ. మావాళ్లేం చేసేరనీ చావడానికి. ఎన్నితిట్లు తిట్టినా నన్ను తిట్టండి కాని వాళ్లనేమనకండి. నా వాళ్లేంచేసేరూ మిమ్మల్ని. మిమ్మల్ని యెప్పుడేనా 'కాదు' అన్నమాటేనా ఆడియెరుగుదురా? వాళ్లనెందుకు తిడతారూ? నన్ను తిట్టండి. కావలసినన్ని తిట్టండి.

వెంక:—(సుబ్బమ్మవైపు తిరిగి) చూసేవా దానితమాషా! అది అలా తెగించి జవాబుచెప్తూవుంటే నే నేంమాటాడగలనమ్మా. నానోరెందుకు పనికొస్తుందమ్మా. మాటకు పదిమాటలు జవాబు చెప్తూంది. దాని రాక్షసినోటిముందర మననోళ్లు పనికివస్తాయా! ఇదిగో! యివాళ చెప్తున్నా. నువ్వు పెంద్రాడే చస్తే నాకొడుక్కి తిరిగి పెళ్లి చేసుగుంటా. అందరం సుఖంగా వుంటాము. నీశార్ధంనాడు పరవాణ్ణం వండుకుతింటాను.

సుబ్బ:—అదెప్పుడేనా నిన్ను అత్తగారూ అని పిల్చియెరుగునుటే. దానినోరు పుచ్చిపోనూ! దానినోరు మండిపోనూ! దానివాళ్లు నాశనమవా! మళ్లా పెళ్లిచేస్తేనేగాని మాఅన్నయ్యకు సుఖం లేదమ్మా. వాడు బతకడమ్మా. వాడింక చచ్చిపోతాడమ్మా.

లక్ష్మ:—అలాంటిమాటలు యెందుకూ అనడం. నన్ను తిట్టండి యెన్నయినా.

వెంక:—నీవల్లే వాడు చచ్చిపోతాడు. నీవల్లే వాడు దేశాలంట పోతాడు. నువ్వే వాడిని మింగేస్తావు. నువ్వే వాడిపాలిటి యమురాలివి. నిన్ను నూకాలమ్మ యెత్తుకుపోనూ!

సుబ్బ:—అయినా యిది మనని తెగకాల్చుకుతింటూందే. ఇది మనందరినీ మింగేస్తుందే, యింక. ఎందుకూ, మాఅన్నయ్యవచ్చేక వాడితో చెప్పు, ఇదిగో యిలాయిలా జరిగిందని.

వెంక:—వాడొచ్చినవెంటనే యెలాగా చెప్తాను. చెప్పి దీన్ని యెలాగా చంపించేస్తాను. (లక్ష్మమ్మతో) నీకూ వాడికీ యెడబాపులు చెయ్యకపోతే నాపేరు మారుపేరెట్టు. వాడిచేత నిన్ను కొట్టి చంపించెయ్యకపోతే నేను బ్రాహ్మణజన్మ యెత్తలేదు, చండాలుడికి పుట్టేననుకో. ఇదే నాపంతం.

సుబ్బ:—అమ్మా, యెందుకే యింక. నాఖర్మం, నీతలరాత, వాడిఖర్మం. అది యింట్లో కాలుపెట్టినప్పటినుంచి యిప్పటిదాకా యిలాగే యేడుస్తున్నాం. మనం బతికున్నాళ్లూ యిలాగే యేడుస్తాం. దానిజీవాని కేడుస్తూనే వుంటాం. ఎంతేడ్చి యేం ప్రయోజనం? ఇంకెందుకుగాని, నువ్వు వెళ్లి జపం చేసుగో. ఉపవాసం, ఉపవాసంతో వున్నమనిషిని యిలాచేసినందుకు దేవుడు నాకు తగిన శిక్ష వేస్తాడు. ఎంతినొప్పిపెట్టినా యేడవకుండా నోరుమూసుగుని వూరుకోవలసింది. ఊరుకోలేకపోయేనే అమ్మా! సొమ్మసిల్లిపోతాననుకున్నానే అమ్మా! చచ్చిపోతా ననుకున్నానే తల్లీ! నిన్ను మళ్లా కళ్లతో చూస్తా ననుకోలేదే అమ్మా! గుడ్లు తేలేసేనే అమ్మా! చచ్చిపోయేననుకున్నానే తల్లీ! ఎందుకింక. అమ్మా, నువ్వు వెళ్లి జపం చేసుగో. నామాట విను. పద.

వెంక:—(లక్ష్మమ్మతో) నావంటి ఋషివంటిదాని జపం చెడగొట్టినందుకు నువ్వూ, నీపుట్టింటివాళ్లూ కూడా బుగ్గయిపోకపోతే నాపేరు వెంకమ్మకాదు. ఏమిటే! నే నెవరనుకుంటున్నావే. నావంటి వుత్తమురాలిని, నావంటితపోశాలిని క్షోభపెట్టినందుకు నీవాళ్లు వృద్ధికొస్తారుటే. నాశనమైపోరుటే! ఋషుల్ని భాదపెట్టినవాళ్లు యెక్కడేనా బతికివున్నారుటే.

సుబ్బ:—(వెంకమ్మచేతులు పట్టుకొని) శాంతించు. శాంతించు. తల్లీ, శాంతించు. ఋషివి నువ్వు. సామాన్యురాలివి కాదు. నీమహిమ అల్పులికి తెలీదు. నావంటివాళ్లకి తెలుస్తుంది. మహాప్రభో! నువ్వు కోపించకూడదు. కోపించకు. కోపించకు. వాళ్లెలాగా నాశనమైపోతారు. దేవుడే వున్నాడు వాళ్లవంశం దుంపనాశనం చేసెయ్యడానికి. అందుకనే యిలాంటి పని చేయించేడు దానిచేత. (చేతులు విడిచిపెట్టి) నావంటి సత్తైమైన యిల్లాలిని, మహాపతివ్రతను, పరపురుషుణ్ణి యెరుగనిదాన్ని, నావంటిదాన్ని భాధపెట్టినవాళ్లు యెన్నడూ ముందుకురారు. రారంటే నమ్ము. ఎప్పుడేనా ముందుకొస్తారుటే. వాళ్లు నాశనమైపోరుటే, ధ్వంసమైపోరుటే.

వెంక:—చూడు యెలాగ యేడుస్తూందో, దానిమొహం కాల్చియ్యా. అది మంగళవారంనాడు, శుక్రవారంనాడు తప్ప మరొకప్పుడు యేడవనేయేడవదు. దాని ప్రతిజ్ఞ అది. మన నది సర్వనాశనం చేసెయ్యాలని చూస్తూంది. కాని దానివాళ్లే కాట్లోకలిసిపోతారని యెరగకుండావుంది.

(లక్ష్మమ్మ యేడుస్తూ వెళ్లిపోవును. చామాలు వచ్చును.

చామాలు సోములుతల్లి. నలభై యేళ్లమనిషి. మురికిగుడ్డలు, కంపుకొడుతూవుంటుంది.)

వెంక:—(చామాలుతో) ఇప్పు డెంతరణరావణయుద్ధ మయిపోవాలో అంతయుద్ధ మయిపోయింది. మమ్మల్ని చంపేస్తానని అది కత్తియెత్తింది. హా! హా! వద్దన్నాము. అప్పటికీ యిద్దరం పిడుగుల్లాంటివాళ్ల మున్నాముకాబట్టి యెలాగయితేనేం కిందపడి మీదపడి దానిచేతుల్లోంచి కత్తి లాక్కున్నాం. లాక్కుని ఆమట్టుగు పెట్లో దాచేసేం. ఇంక బతికేంకదా అని అప్పు డనుకున్నాం. అప్పటికే మాపిల్లకి మోకాలికి తగిలింది వెనకంచు. ముందుఅంచు తగిలితే కాలక్కడికి యెగిరిపోవలసిందే.

చామా:— (విచారంతో) అమ్మతల్లో! ఎంతపనిజరిగిందమ్మో!

వెంక:—ఎంతపని జరిగిందేమిటే, చచ్చి బతికింది పిల్ల. మళ్లా పునర్జన్మమెత్తింది.

చామా:—మా పెద్దదెబ్బ తగిలిందమ్మా!

వెంక:—మాపిల్లను నేను కళ్లచూస్తా ననుకోలేదమ్మా. నాబిడ్డ కేవలం నాఅదృష్టంవల్లే బతికివుంది. పూర్వజన్మాన నే చేసుకున్న సుకృతంవల్లే బతికివుంది. అది మమ్మల్ని చంపివెయ్యాలని చూస్తూంది.

సుబ్బ:—ఎందుకమ్మా చెప్పుగోడం. ఇంటిగుట్టెప్పుడూ చెప్పుగోకూడ దన్నారు పెద్దలు. అందుకే రెండుచేతులా నోరుమూసుగుని వూరుకోడం. అంచేతే నే నేడవలేదు, ఇంతదెబ్బతగిలినా. సొమ్మసిల్లిపోవలసిందే.

చామా:—అయ్యోబిడ్డా!

వెంక:—ఏమేచామాలూ! మీకోడలు నీతో యెప్పుడేనా దెబ్బలాడుతుందిటే.

చామా:—మాయమ్మో? నాతో దెబ్బలాడడమేనండి! దెబ్బలాడితే బతికుంటదండి! శాపనుతరిగేసినట్టు తరిగెయ్యనండి. నేను మాకోడలిని కొడతానేవుంటానండమ్మా. కొడితే సీపురుగట్టిరిగిపోద్దండి. నిన్న పులుసులోకి దుమ్ములులేకుండా కొట్టేసేనండి, నన్నేదో ఆడిందని.

వెంక:—(ఆశ్చర్యంతో బుగ్గలునొక్కుకుని) ఎంతఅదృష్టం! ఎంతఅదృష్టం! ఆహా! (సుబ్బమ్మవైపు తిరిగి) చూసేవేపిల్లా. అలాగుండాలమ్మా. అలాకొట్టకపోతే లొంగుతారా? ఎన్నటికీ లొంగరనుకో. ఒకమాటి కొకమాటు తగలనిస్తూవుండాలి. అయితే నీకొడుకేమీ అనడుటే చామాలూ, నువ్వుకొడుతూవుంటే.

చామా:—ఆడే కొట్టమంటాడండమ్మా. తప్పొస్తే ఆడే సంపెయ్యమంటాడండమ్మా.

వెంక:— (బుగ్గలునొక్కుకుని) ఎంతపుణ్యం! ఎంతపుణ్యం! ఎంతఅదృష్టంచేసుగుపుట్టేవే, కోడల్ని కొట్టడానికి. నీకేనా అతికారముంది కాని నాకు లేదు. మాయింట్లో మాకోడల్ని కొడితే మావాడు చంపేస్తాడేమో అనిభయం. అంచేతే దాని కొకదండమెట్టేసి వూరుకుంటున్నా. దానికి నాదగ్గిర చీమతలకాయంత భయం లేదంటే నమ్మ. మాటకిముందు యెదిరించడం, పెడసరం జవాబులు చెప్పడం, తిట్టడం. నేనూ నీలాగే కొడుతూవుంటే అది యిలాచేస్తుందా చెప్పు చూతాం? గజగజ వణికిపోదూ నాపేరు చెప్పేటప్పటికి. నన్ను చూసేటప్పటికి శవంలాగు వాలిపోదూ. మరి యేదీ అలాజరుగుతూందా? దానికి భయంలేందే. ఏకోశాన్నీ నేనంటే బెదురులేందే. నువ్వు యెంతోపుణ్యం చేసుగు పుట్టేవు. మహాఅదృష్టవంతురాలివి, శూద్రదానివైతే అయేవుగాని.

సుబ్బ:—దానిపుట్టుక మన కెక్కడొస్తుందమ్మా. వెధవబ్రాహ్మణజాతి. దరిద్రపువెధవజాతి. ఈ జాతిలోపుడితే సుఖమెక్కడ?

చామా:—నిజమేనండి. ఇప్పుడు బ్యామ్మర్లంతా యింతేనండి. మాసూద్రోళ్లే నయమండి. (కొంత సేపయేక)

వెంక:—(సుబ్బమ్మతో) ఏలాగుంది పిల్లా నీకాలు?

సుబ్బ:—అప్పిడే యేంనింపాదమ్మా! అప్పిడే యేంనింపాదే తల్లీ. ఇంతకీ నా దొక్క బుద్ధిపొరపాటొచ్చిందంటే నమ్మ. ఇక్కడికిరాకముందు నువ్వు నాతో చెప్పనేచెప్పేవు 'దానితో మాట్లాడుతూవుండకే' అని. నాదే బుద్ధిపొరపాటొచ్చింది. నీమాట వినకపోవడమే యింతముప్పొచ్చింది.

వెంక:—దానిజోలి కెళ్లొద్దే అని నీకు మొదటే చెప్పేనా. చూసేవా యెంతమట్టుకొచ్చిందో. అందుకే దాన్ని బియ్యంబాగు చెయ్యిపో అన్నాను, నీతో కబుర్లుచెబుతూకూచుంటుందనే.

సుబ్బ:—అమ్మా, నేను చెబుతూనేవున్నానుకదూ. నావల్ల బుద్ధిపొరపాటొచ్చింది. నాబుద్ధి గడ్డితింది. ఇహనైనా బుద్ధితెచ్చుగుంటా. మరింక మైకంలో పడిపోను. పడిపోను. ఎందుకమ్మా, వెళదాంరా. ఎందు కీశవజాగరం. పోదాంరా, జపం చేసుగుందూ గాని.

వెంక:—ఇంకేంజపమే తల్లీ! నాజపాలన్నీ బుగ్గయిపోయే యిలాంటిబతుకొచ్చింది.

సుబ్బ:—చెంబుడునీళ్లోసుగుని యింతచలిమిడి నోట్లో వేసుగుందూగాని రా. అమ్మా! లే.

చామా:—ఎదో కూంత తాగండమ్మా. ఇన్ని సల్లనినీళ్లు తాగి నా కడుపులో సల్లగుంటదండమ్మా.

వెంక:—నాకు పిండీవద్దు బిగ్గీవద్దు. (సుబ్బమ్మతో) నీవంటి దానిభాద చూసేక నాకు యేమీవద్దు. ఆఖరికి పచ్చిమంచినీళ్లేనా

వద్దు. ఇలాగే పస్తుపడుక్కుంటూ, వుసూరుమని. దేవుడా యింత చేస్తివా అని కడుపులో కాళ్లెట్టుగు పడుక్కుంటూ.

సుబ్బ:—అలాగు కాదమ్మా! కాస్త నోట్లోవేసుగుందూగాని లే.

చామ:—లెగండమ్మా. కాసిన్ని మంచీళ్లు తాగండి. ఆకలి తీరద్ది.

వెంక:—నేను రాను.

సుబ్బ:—నువ్వుతినకపోతే నేనూ యివాళరాత్రి తినను.

వెంక:—అమ్మోయి! నువ్వుమానెయ్యడమే! నాతల్లీ, యింత దెబ్బ తగిలేక తిండితినకపోడమే!

సుబ్బ:—అయితే రామరి.

వెంక:—(లేచి) ఎదో యింత మింగుతాను దానిశార్ధం మింగినట్లు, పద. (ముగ్గురూవెళతారు.)

## 3-వ రంగం

[సాయంత్రంపూట లక్ష్మమ్మ లాంతర్లు తుడస్తూవుండును. రత్నమ్మ వచ్చును.]

లక్ష్మ:—రండివదినగారూ! యేదేనా పనిమీద వచ్చేరా యేమిటి?

రత్న:—లేదమ్మా. ఊరికే వచ్చేను, ఒక్కక్షణం కూచుని పోదామని. ఇంటిదగ్గిర వొక్కర్తినీ కూచుంటే యేమీ తోచడం లేదు. అంచేత బయలుదేరి వచ్చేను.

లక్ష్మ:—ఇలా కూచోండి యీబల్లమీద.

రత్న:—ఎందుకమ్మా! కిందే కూచుంటాను. (కూర్చొనును.)

లక్ష్మ:—చూస్తూనేవున్నారుకదూ, మా నాటకమంతా.

రత్న:—(రహస్యంగా) ఇంట్లోలేరా యేమిటి మీఅత్తగారూ, ఆడపడుచూ?

లక్ష్మ:—ఇప్పుడిప్పుడే బిందెలు పట్టుకు కాలవకెళ్లేరు.

రత్న:—ఒకరువెళితే సరిపోకాయేమిటి యిద్దరూవెళ్లడం.

లక్ష్మ:—ఒకరికొకరు తోడు. నామీద నేరాలు చెప్పుగుంటూ వెళ్లొచ్చు. ఎంతదూరంవెళ్లినా యింతేనా అనిపిస్తుంది. అందుకోసమని యిద్దరూ వెళ్లడం.

రత్న:—వాళ్ల మొహం యీడ్చిరిలే.

లక్ష్మ:—మొన్న జరిగినయుద్ధం చూసేరా!

రత్న:—ఇదేమియుద్ధమమ్మా! రెండుపక్షాలవాళ్లూ వుంటే యుద్ధంకాని లేకపోతే యుద్ధమేమిటి నామొహం! రెండుపక్షాలూ లేందే! ఒకపక్షమే యుద్ధంచేస్తూవుండడం; రెండోపక్షం వూరుకోడం. దీన్నే శాంతియుద్ధమంటారు పత్రికలవాళ్లు. గాంధిమహాత్ముడు చెయ్యమంటూన్న దీరకంయుద్ధమే.

లక్ష్మ:—ఏదో శాంతియుద్ధమనండి, నావల్లకాడనండి. నన్నుమాత్రం కాల్చుకుతినడం తప్పదుకదా! మొన్నటియుద్ధమంతా విన్నారా?

రత్న:—వినకేం. పూసగుచ్చినట్టు మీ అత్తగారే చెప్పింది. ఆవిడచెప్పినదంతా తారుమారు చేసుగుంటూ అర్థం చేసుగున్నా. ఇన్ని అబద్ధాలు యెలావస్తాయమ్మా ఆవిడనోటంట! ఆవిడిది మనిషి జన్మ కాదేమో!

లక్ష్మ:—మా ఆయన యింటికి వచ్చీరావడంతోటే ఆవిడ వున్నవీ లేనివీ చెప్పి ఆయనచేత నన్ను కొట్టించి నాకూ ఆయనకీ యెడబాపులు చేస్తారుట.

రత్న:—(బుగ్గలు నొక్కుకుని) అమ్మయ్యో! ఎంతమాట!

లక్ష్మ:—నన్ను చంపించేస్తారుట.

రత్న:—ఇంకేం, చాలాబాగుంది. దానికేంగాని, నేనోమాటి చెప్తావిను. ఏమిటంటే—

లక్ష్మ:—అమ్మా! నన్నెన్ని భాదలుపెట్టినా నేనోర్చుగుంటాకాని, పిల్లలినిపెడితేమట్టుగు నే నోర్చుకోలేను. వాళ్లె నెందుకూ పసిగుడ్డుల్ని భాదపెట్టడం. నాకు సరే, తిండి తిన్నగా పెట్టడమే లేదు. వాళ్లు తింటూన్నంతసేపూ నేను నిల్చోడం, నిలువుజీతమిస్తూన్నట్టు. వాళ్లిద్దరూ తిన్నాక యేదోరెండుమెతుకులు నాకు పారేస్తారు. ఉత్తన్నం బుక్కలేకుండా చచ్చిపోతున్నా. పోనీ నాకేం పర్వా లేదు. ఇంతట్లోకి చచ్చిపోను. మరి పిల్లలిసంగతో. వాళ్లకీ అంతే. ఆపాడిమెతుకులు వాళ్లకి పెట్టలేక యేడుస్తున్నా. నిన్న మీయింటికి పచ్చడికోసం రావడం పిల్లలకోసమనే. నన్నెంతకాల్చుకు తిన్నా కిమన్నాస్తి, యేమనను. పిల్లలి నలా మాడ్చి చంపనమ్మా, పసిగుడ్డుల్ని.

రత్న:—అమ్మా! అంతా వింటూనేవున్నాను. నువ్వుపడే భాదలు చూస్తే రాళ్లేనా కరిగి యేడుస్తాయి. మరి మనుష్యులమాట చెప్పే దేమిటి. ఇంతకీ నే వొకటిచెప్తా చెయ్యి. 'ఇలాయిలాగుంది. ఇలాగిలాగు భాదలు పెడుతున్నారు, అత్తాకూతురూ కలిసి. నేను బతకలేను. కాబట్టి మీరు యీవుత్తరంచూసిన క్షణం బయలుదేరి రావలసింది' అని మీఆయన కోవుత్తరముక్క రాయి. రాసి మీ బంట్రోతుచేతి కిచ్చి పంపించు వెంటనే. విన్నావా?

లక్ష్మ:—ఆయన యేమేనా అంటారేమో?

రత్న:—నీ కెందుకు భయం? నే నున్నా, సరే. అంతమట్టుకొస్తే తెగబడి వచ్చి నేనేచెప్తా. ఇహ అలాంటివాటిలో వూరుకునే మనిషిని కాను. అవసరమొస్తే నేనే చెప్తా యిలాయిలాగు జరిగిందని. విన్నావా? అంచేత ఇవాళ ఒకవుత్తరం తక్షణం రాసిపంపు. మీఆయనకొకటి, మీఅమ్మగారికికూడా ఒకటి రాసిపడేస్తే పడెయ్యి. అలాచేస్తే





(7) 1. కీ. శే. చుంచూరు నాగభూషణం శ్రేష్ఠిగారు 2 కీ. శే పాటిబండ వెంకటరమణయ్యా పంతులుగారు,



1 కీ శే బాలసరస్వతి ఇంటూరి పద్మావతీ దేవిగారు 2 కీ శే మల్లంపల్లి శారదాంబగారు

మరీ మంచిది ' ఇక్కడ సంగతు లీలాగున్నాయి, నాకు నెలలు నిండేయి కాబట్టి నువ్వువచ్చి నన్ను తీసుకువెళిపోవలసింది ' అనిరాయి

లక్ష్మి —మాఅమ్మకికూడా రాయమంటారా ?

రత్న —మీఅమ్మకొకటి, మీఆయనకొకటి, రెండు రాసెయ్యి తక్షణం రాసెయ్యి మీఅమ్మకి నింపాదిగాయేదేనా రాయొచ్చులే ఆక్టే తొందరలేదు మీఆయనకివట్టుగు యిప్పుడు కూచున్న పాళంగా రాసేసి సోములికిచ్చేసి పంపించెయ్యి విన్నావా మరి ? మీఅత్తగా రొస్తుందింక మరి నేను వెళుతున్నా మొట్టమొదట మీ ఆయనకి వుత్తరంరాసి పంపించెయ్యి

లక్ష్మి —అలాగే

రత్న —మళ్లా వాళ్లొస్తారు రాసెయ్యి మొదట

లక్ష్మి —ఊఁ వెళుతున్నా (రత్నమ్మ వెళ్లును)

(లక్ష్మమ్మ కలం కాగితం తెచ్చుకుని వుత్తరం రాస్తూవుండును కొంచెంసేపయేక సోములు వస్తాడు)

లక్ష్మి —సోములూ, నువ్వు కాస్సేపు అవతల కూర్చో, యిప్పుడే పిలుస్తాను, పనివుంది

సోము —చిత్తమండమ్మా ? (వెళ్లును)

లక్ష్మి —(తనలో) మాఅమ్మకి రాసేవుత్తరం యింకా పూర్తవలేదు మరోరెండుముక్కలు రాయాలి ఈవుత్తరం పోష్టులో వెయ్యాలి కనక దీనికేం తొందరలేదు మొదట మాఆయనకి రాసిన వుత్తరం సోములుచేతికిచ్చి పంపించేస్తాను సోములూ !

('అమ్మగారూ' అంటూ సోములువస్తాడు)

సోములూ !

సోము —అమ్మా !

లక్ష్మి —మరేమో అర్జెంటుపనివుంది

సోము —అమ్మా !

లక్ష్మి —ఈఉత్తరం తీసికెళ్లి మీఅయ్యగారికి యెక్కడుంటే అక్కడ యిచ్చేసిరా విన్నావా ?

సోము —అమ్మా ! అయ్యగారు యేవూళ్లోమకాంవేసేరో యేంటోనండి

లక్ష్మి —వెళ్లి కనుక్కో ఆఫీసులో కనుక్కుంటే తెలుస్తుంది గుమాస్తా మంగయ్యగార నడుగు అడిగి ఆవూరెళ్లి యీ వుత్తరం యిచ్చేసిరా ఇప్పుడే బయలుదేరు వెళ్లు విన్నావా ? (ఉత్తరం సోములుచేతి కిచ్చును.)

సోము —సిత్తమండమ్మా

లక్ష్మి —వెళ్లు మరి బయలుదేరు

సోము —సిత్తం సెలవండమ్మా యెల్లొత్తానండి (వెళతాడు.)

లక్ష్మి —(తనలో) మాఅమ్మకి రాసినవుత్తరం రేపుపొద్దున్న పూర్తిచేసి పోష్టుకు పంపించేస్తా ఇప్పటికిట్టుకు యెవరికీ తెలీకుండా యిది నాపక్కకింద దాస్తాను (లక్ష్మమ్మ వెళ్లును)

(వెంకమ్మ, సుబ్బమ్మ నీళ్లబిందెలతో వచ్చి వంటగదిలో బిందెలు దించుకుంటారు)

వెంక —ఏదీ యెక్కడికివెళ్లింది యిది ?

సుబ్బ —ఏమో ! యెక్కడికిపోయిందో ! అత్తభయమా, మొగుడిభయమా, మరెవరిభయమా.! (లక్ష్మమ్మ వచ్చును)

లక్ష్మి —గదిలో లాంతరు తుడుస్తున్నాను

వెంక.—ఇప్పుడేంతొందరొచ్చింది దొరసానిగారికి

సుబ్బ —ఆనిడికేం మహారాణీ నీలాగా నాలాగా అనుకున్నావుటే ముష్టిబతుక్కి ఎప్పుడైనా పెట్టిపుట్టాలమ్మా అదిలేందే అడుక్కుతినేబతుకే అయిపోతుంది

(సీతమ్మవచ్చును సీతమ్మ లక్ష్మమ్మతల్లి నలభైయేళ్లమనిషి లావుగావుండును పునిస్త్రీ నవ్వుమొహం చురుకైనకళ్లు

ఆవిశవెనక బండివాడు పెట్టె, మూట పట్టుకువస్తాడు వచ్చి కిందపెట్టి 'అమ్మా, డబ్బులు బేగిప్పించండి యీదిలో యెద్దెలి పోద్దండి ' అంటాడు)

సీత —(లక్ష్మమ్మతో) పిల్లా ! ఈపావలాతీసుకుని బండీవాడికి రెండణాలియ్యి

లక్ష్మి —అక్కర్లేదులే నాదగ్గిర చిల్లరుంది (చిల్లరతేవడానికి గదిలోకి వెళ్లును)

వెంక —ఏం వదినగారూ ! ఇంతఅరాత్తుగా వచ్చేసేరు ?

సీత —మీఅబ్బాయి వుత్తరంరాస్తేనే, వచ్చి పిల్లని మీయింటికి తీసుకువెళ్లండని

వెంక —ఆమధ్య రాస్తానని నాతో అన్నాడు మరి రాసేడనుకోలేదు

(లక్ష్మమ్మవచ్చి బండీవాడికి డబ్బులిచ్చును బండీవాడు వెళిపోతాడు లక్ష్మమ్మ పిల్లాడిచొక్కాకుడుతూ నిలుచుంటును)

సీత —(సుబ్బమ్మతో) ఏంకోడలా ! సుఖంగావున్నావూ ?

సుబ్బ —మీదయవల్ల

సీత —మాదయేమిటమ్మా అంతా దేవుడిదయ

సుబ్బ —ఏమో ఆవేదాంతం నాకుతెలీదు

సీత —కాలం మళ్లితేగాని ఆలాంటివి తెలీవు మాలాంటి వాళ్లకు తెలుస్తాయి. ఏంవదినా ! నిజమేనా ?

వెంక — అప్పిడే నన్ను ముసిలిదాన్ని చేసేసేవుటమ్మా, ఎంత మంచిపిల్లల్నికన్నా! మీరంటే ముత్యంలాగ ఒక్క కొడుకుని, ఒక్క కూతుర్ని కన్నారు

సీత — తిండిపెట్టలేక మీలాగే భాగ్యవంతులమయితే మరింతమందిని కందుము

వెంక — అదంతాయేమిటే మమ్మల్ని ఆక్షేపించడం మాకే భాగ్యముంది మీకు లేదని అంతేనా?

సుబ్బ — ఎవళ్లకి బాగ్యముంటే వాళ్లుతింటారు అంతేగాని వొకళ్లకి పెడతారాయేమిటి? గుర్రానికి తోకవుంటే తనుపిసురుకుంటుంది. అంతేగాని సాలలోవున్న గుర్రాలన్నిటికే విసురుతుందా యేమిటి?

సీత — కోడలు అత్తగారివేపు మాటాడుతుందిటమ్మా యెంత మంచిదైనా?

సుబ్బ — అయితే మీరన్నమాటలకర్ధం అత్తగారు మంచిదనా, కోడలుమంచిదనా?

సీత — మీపిల్లలికా అర్ధాలన్నీ తెలుస్తాయి, మాకు తెలీవు మేమొకఅర్ధంతోటే మాట్లాడుతాము

సుబ్బ — అది యెదుటివాళ్ల మొహంమీద యిరవై అర్ధాలతో పేలుతుంది

వెంక — మాపిల్ల మీగుట్టంతా బైటపెట్టేస్తూంది

సీత — ఎన్నిఅన్నా కోడలిదే మీదుచెయ్యయితే అత్తగారికి సంతోషమే, తనకంటే మంచికోడలిచేతిలో సంసారంపెట్టేనుకదా అని

వెంక — మీమాటల కేంలెండి

సుబ్బ — అదేమిటేఅమ్మా! వియ్యపురాలొస్తే మంచినీళ్లు దాహానికిచ్చి కాళ్లుకడుక్కుంటారా అని అడగవు కూచోబెట్టి పీటవెయ్యవు ఇదేమిశోద్యమే

సీత — చూసేరా కోడలిమాటలు!

వెంక — రండివదినా! కాళ్లుకడుక్కుని మంచినీళ్లు తాగుదురుగాని

సుబ్బ — పదండి అత్తా

సీత — ఊఁ పదమ్మా కోడలా (అంతా వెళతారు)

## ౪ - వ రంగం

[సాయింత్రం 4 - గంటలప్పుడు వెంకమ్మ, సుబ్బమ్మ, సీతమ్మ, లక్ష్మమ్మ సావిట్లో కూచుంటారు సీతమ్మ వూరికే కూచుండును సుబ్బమ్మ వూలుకుట్టుకుంటూ వుండును వెంకమ్మ, లక్ష్మమ్మ బియ్యంలో వడ్లూ, బెడ్డలూ యేరుతూవుంటారు]

సీత — ఏంవదినా! యీమధ్య రామేశ్వరంయాత్ర చేసొస్తానన్నారు చేసొచ్చేరా యేమిటి?

వెంక — చేసొచ్చేను! నాబతుక్కి యాత్రలుకూడాను! నాబతుకే వొకయాత్రలా వుంది ఇల్లు సుష్టుగా వుంటే యాత్రలుగాని లేకపోతే యేమియాత్రలమ్మా! ఇల్లు సుష్టుగావుంటే యెన్నె నాయాత్రలు చేంవద్దును లేందే యాత్రలేమిటి నాపిండాకుడు!

సుబ్బ — సంసారం చక్కబెట్టుకునేటప్పటికే అయిపోతూంది మాఅమ్మపని తలప్రాణం తోకకొస్తూంది

వెంక — అంటే అనకూడదుగాని మీకూతురు యింట్లో కోతి కాపరం చేస్తూంది

సుబ్బ — నిజంచెప్పాలసొస్తే మీకూతురు కొండముచ్చు కాపరం చేస్తూంది ఆమాట చెప్పకతప్పదు మాఅమ్మకాబట్టి అలా భరించుకొస్తూంది తల్లీ మరొకయిల్లాలైతే యీపాటికి తోకతెంపుకుని దేశాలంట పారిపోను

వెంక — అమ్మా! నేనెప్పుడూ అబద్ధమాడియెరగను జిహ్వ కోసేసినాసరే అబద్ధమాడను నేనూ పిల్లలిదాన్ని, చూసేరామరి మీకేకనక యిలాంటికోడలుంటే పదేళ్లకిందటే యీలోకం విడిచపైలోకానికి వెళ్లిపోదురు నన్నిలా మాయచేసి పెళ్లిచేసేరో, కన్నుకప్పి పెళ్లిచేసేరు ఆమాయలవాడు చేసేడు లేకపోతే కళ్లారా చూసి చూసి చేసుగుంటానా యిలాంటిదాన్ని

సీత — నిజమేనమ్మా, మాకూ కళ్లుకప్పేసేడు లేకపోతే యిలాంటివాళ్లతో సంబంధం చేసుగుంటామా?

వెంక — మాతప్పేమొచ్చిందమ్మా అలాగంటున్నావు?

సీత — మాపిల్లతప్పేమొచ్చిందో చెప్పండి ముందర

వెంక — మీపిల్లంత పరమఘండాలురాలు లేదు

సుబ్బ — అది పరమతుంటరి అత్తగారిని కాల్చుకుతినడానికి పుట్టింది మలమల మాడ్చేస్తూంది అందరినీ

సీత — (సుబ్బమ్మతో) ఊరుకోవమ్మా వెర్రిమొర్రిగా మాటాడక

లక్ష్మ — ఎందుకే అమ్మా వాదం.

సుబ్బ — (కోపంతో) నేను వెర్రిమొర్రిగా మాటాడుతున్నానా, మీరు వెర్రిమొర్రిగా మాటాడుతున్నారా? ఇదేం అనకాపిల్లి కాదు, అతికారంచెయ్యడానికి ఇక్కడ ఝుడిసిపోయి మీకాళ్లు పట్టుగునేవాళ్లెవళ్లూ లేరు కొంచెం కిందూమీదూ చూసి మాట్లాడండి

సీత — నువ్వూ కాస్త అలాగే మాట్లాడుతూవుండు

సుబ్బ — నాకా మీరు చెప్పడం నాకుటమ్మా నువ్వుబుద్ధులు చెప్పడం, తాతకు దగ్గులునేర్పినట్టు నీబుద్ధికి నన్ను దిద్దుతావుటమ్మా.

వెంక —అది కాపరానికొచ్చిందిమొదలు యింతవరకూ (చేటలోనుంచి బియ్యపుగింజతీస్తూ) బియ్యపుగింజంతపని చేసిపెట్టెర గదు ఎప్పుడూ పిండి నేసేకదా రాత్రుళ్లు వండుకోడం

సీత —ఏమేపిల్లా నిజమేనా ? (లక్ష్మమ్మ వూరుకుండును )

సుబ్బ —మానేహా ఎంతముద్దరక్కరాలులాగ వూరుకుందో తప్పు తనమీద వుందికాబట్టి వూరుకుంది లేకపోతే వూరుకుంటుందా ? వూరుకుంటుందిటమ్మా మౌనం అంగీకారం అన్నాడు అదే నిజంకాకపోతే యీపాటికి మా జుత్తు పట్టిగు మమ్మల్ని నేలను రాసీదు!

సీత —ఇ దెక్కడి ఆడపడుచువమ్మా! ఇన్నినోళ్లెక్కడున్నాయమ్మా నీకు! మాటకి పదహారుమాట లంటున్నావు!

లక్ష్మ —ఊరుకోవేఅమ్మా అంటే నీకుకాదుటే చెప్పడం ?

సుబ్బ —న న్నొక్కమాటంటే నేను వూరుకునేది లేదు నే నొక్కమాటపడను కావలిస్తే మీకూతురు ననుకోండి, మీఅల్లుడి ననుకోండి, మీవియ్యపురాలి ననుకోండి. ఊరందరినీ అనుకోండి అంతే గాని నన్నన వాటం కాదు ఇదే పదిసార్లు మీకు చెప్పడం

వెంక —నాకు రవ్వంతపని చేసియెరగదమ్మా సరే రాత్రీ పగలూ తెగకాల్చుకుతినేస్తూంది మలమలమాడ్చేస్తూంది, మంగలం మీదపెట్టి వేచేసినట్టు

సీత —మీరు పెట్టేసినపెట్టుకేనా అది తెగకాల్చుకుతినేస్తూందని అంటున్నారు పోనీ, అది కాల్చుకుతిందనే అనుకోండి మీరుపెట్టినపెట్టేముందని ఇన్నేళ్లయింది వొక్కవస్తువేనా చేయించి పెట్టేరా పుస్తి, నల్లపూసలు తప్ప మరొక పెరుగునా పిల్ల ఆఖరికి కడియాలేనా వుంచలేదు చెన్నుగాళ్లతో అలాగే తిరుగుతూందికాని

వెంక —మేముపెడితే యిట్టే మాయంచేసీదుటమ్మా

సుబ్బ —మీపిల్లేం సామాన్యురాలనుకున్నా రేమిటి ?

సీత —ఊరుకోవమ్మా బుద్ధిమాలినమాట లాడతావు ఊరుకొంటూన్నకొద్దీ మితిమీరిపోతున్నావు పెద్దాచిన్నా తారతమ్యం లేకుండా మాటాడుతున్నావు మరీను

సుబ్బ —ఇదిగో నన్ననవాటంకాదని మీకు మొదటేచెప్పే నేను నేను వూరుకునేమనిషినికాదు నన్నన్నవాళ్లని పట్టుగుదులిపేసి ఝూశించెస్తా

వెంక —మీపెట్టుపోత లేం మహావున్నాయని మమ్మల్ని దెప్పడానికి మీపెట్టుపోతలు అలాగవుండబట్టే మాపెట్టుపోత లిలాగున్నాయి అవి బాగానేవుంటే యివీ బాగానేవుండును

సీత —పెళ్లిలో యిచ్చినకట్నమాతా యెవళ్లమొహాన్ని కొట్టేరూ ?

వెంక —ఎవళ్లమొహాన్నికొట్టేమా ? మీపిల్లమొహాన్ని కొట్టేము, మీమొహాన్ని కొట్టేము

సీత:—కొడితే వస్తువు లేవీ ?

వెంక —అది అమ్మవారమ్మకాబట్టి తినేసింది అదే బుద్ధిగా వుంటే మేము పెట్టకపోయేమా ? మాపిల్లకికట్టుకాసులపేరు చేయించుగున్నవాళ్లం దానికి వస్తువు చేయించి పెట్టలేకపోయేమా ?

సీత —మీఅందరిబుద్ధికీ దాన్ని ఆక్షేపించవచ్చేరు మీరు చేస్తూన్నపనులు యేం మహాబాగున్నాయనో పిల్లనిచ్చుగున్నవాళ్లం కదా అని యెంతవొగ్గుతూన్నా మరింత నల్లేరుపైబండి అయిపోతూంది మాబతుకు

సుబ్బ —వీళ్లని మీరు అతాపాతాళంలోకి తొక్కుస్తున్నారు ఆసంగతి మీరు గమనించేరా

సీత —(వెంకమ్మతో) మేమిచ్చినపంచ లెప్పుడేనా మాఅల్లుణ్ణి కట్టుకోనిచ్చేరా ? ఎక్కడికి మాయమైపోతాయో యేమిటో ? ఇట్టే యిలాయిస్తే అట్టే అలా మాయమైపోతాయి మరోవూరు మీరు మాయంచేస్తున్నారో, యెవరు మాయంచేస్తున్నారో ?

సుబ్బ —మాఆయన కట్టుకున్నారనేనా మీయేడుపు ఆపంచలు రెండున్నాయి అవి ముక్కలుముక్కలుచేసి మీమొహాన్నే పారేస్తాను అప్పటికి మీకడుపు నిండుతుంద

సీత —మీమొహాన్నే పారేసుగోండి

వెంక — అమ్మోయి! మాఅల్లుణ్ణి అంటేమట్టుగు వూరుకునేది లేదు బావమరిదికదా అని మావాడు యిచ్చుగున్నాడేమో! యిచ్చుగుంటె తప్పా ?

సీత —అన్నీ యిచ్చుగోడమేనా! పంచముక్కయిస్తే అల్లుడికా, రొక్కమిస్తే కూతురికా ఏదిస్తే అది యెవరికోవొకరికా మేమిచ్చినకట్నం మాపిల్లకు పెడతారా, లేక కట్టుకాసులపేరూ గాడిదగుడ్డూ చేయించేసుకొంటారా ?

సుబ్బ —మాభూములు మండి బుగ్గయిపోయే యనుకున్నారేమిటి?

సీత —మాకు తెలియని ఆస్తిపాస్తు లేమున్నాయమ్మా మీకు? భూములూ గీములూ అంటావు, పుట్టింట్లో పడివుంటున్నానని తెలియక ఉన్నమాటాడితే వుడుకుమోత్తనం నాబిచ్చం నాకు పెట్టమన్నాడుట

వెంక —ఏమమ్మోయి! మీరు యెన్నడూ వొక్కచిల్లిగవ్వ పెట్టలేదు మీరిచ్చినకట్నంరాళ్లు మీఅల్లుడే తగలబెట్టుకున్నాడు కాఫీవొటేళ్లకీ, నాటకాలకీ పైగా మాఅల్లుడిదగ్గర అప్పుచ్చుగుని తగలపెట్టేసేడు

సీత —మీ అల్లుడికున్న ఆస్తికి అప్పుచ్చుగోడంకూడాను!

వెంక —పోనీగాని నేనొక్కమాట అడుగుతాను చెప్పండి దానికి మీరు ఆచారమేనా ఆఖరికి కాస్త నేర్పింపం పేరా ? అంట్ల చేత్తో అన్నీ ముట్టుగోడమే పేడఅంటే అసహ్యాం చేతులు తిన్నగా కడుక్కోదు, గిన్నెలుముట్టుకుని ఏమేనా కాస్త నేర్పేరా ఆచార మేనా పోనీ ?

సీత —మీవంటివాళ్లుండగా మేము వేరే నేర్పడమేమి టమ్మా! ఆచారానికి గురువులు పేడతట్ట నెత్తి నెట్టుకుపుట్టేరు

వెంక —(గొంతుకచించుగుని) మేము పేడతట్ట నెత్తినెట్టుగు పుడితే మీరు అశుద్ధంతట్ట నెత్తి నెట్టుకు పుట్టేరు

సీత —అదే నేనుచెప్పడమున్నా

వెంక —మమ్మల్ని అంతమాట అంటారా ? మీయిల్లు బుగ్గయి పోనూ, మీరు చచ్చిపోనూ, నువ్వు నాశనమవా, నువ్వు వల్లకాడవా. నన్నంతమాటంటావా?

సుబ్బ —మీకొంప సుభ్రంగా బుగ్గయిపోవకపోతే నన్న నండి తెల్లారేలోగా ఆకబురొస్తుంది ఆ, నేనన్నమాట శాపమే

వెంక —ఇక్కడికి తినడాని కొచ్చి నన్నడానికేమి అతికార ముందమ్మా నీకు ?

సుబ్బ —మళ్లా మారువిస్తరి వేస్తుందా యీ యింట్లో

సీత —తిండికి వాచి చచ్చి పొరుగూరినుంచి వొచ్చేననుకుం టున్నా వేమిటమ్మా అలాంటివాళ్లం మేము కాము

సుబ్బ —ఎంతేసిమాట లాడుతూందో చూడు చమత్కారం మనిషి నాకు రక్తం వుడికిపోతూంది

వెంక —తిండికి వాచి చచ్చి రాఅక్కర్లేకపోతే మాయింట్లో ఒక్కఘడియ వుండక్కర్లేదు ఇప్పుడే పోవచ్చు

సీత — ఎంతతెలివితక్కువదానై్ననా యింకావుంటాను టమ్మా ఇదిగో యిప్పుడే వెళిపోతున్నా (లేచి) ఇన్నిసార్లు మీరు నాకు చెప్పాలా! (లక్ష్మమ్మతో) పిల్లా! మీ ఆయన వొచ్చేక నా కోసారి కబురుపంపించు నేను వెళ్లి రత్తమ్మగారింట్లో వుంటాను, అతనొచ్చేవరకూ (వెంకమ్మతో) మీకోరిక సిద్ధించిందా ? వెళిపో తున్నా మీయింట్లో విస్తరివెయ్యను

వెంక —వెళ్లు ఎవళ్లుండమని నీకాళ్లు పట్టుగున్నారు ? కాళ్లా వేళ్లా పడి బతిమాలుకుంటున్నాము వుండిపోవమ్మా అని

(సీతమ్మ వెళ్లును లక్ష్మమ్మ తన గదిలోకి పోవును వెంకమ్మ, సుబ్బమ్మ రహస్యంగా మాటాడుతారు)

సుబ్బ —మంచిపనిచేసేవు ఇలాంటిముండను కొంపలో వుంచడం తాచుపాము నుంచడంలాంటి దనుకో.

వెంక —మళ్లీ యీకొంపలో కాలుపెట్టనిస్తానా ?

సుబ్బ —మాఅన్నయ్య నేడో, రేపో వస్తాడు వచ్చేక యివన్నీ చక్కగా బోధపరుచు అత్తిగారిముండ యెంతచెడ్డదో వాడికి తెలియచెయ్యి

వెంక —అసలు వాణ్ణి దానితో మాటాడనిస్తేగా

సుబ్బ —మొట్టమొదట వాడి పెళ్లాంచేసినపనులు చెప్పు.

వెంక —అవి చెప్పేకే ఈవిణ్ణిగురించి చెప్తా అలాగే పోవాలి పడవకి మరింక యీగుమ్మం తొక్కకూడదు

సుబ్బ —పెరట్లో దాసీది పిలుస్తూన్నట్టుంది, పద అంట్ల కోసంకమోసు, పోదాం (ఇద్దరూ వెళతారు)

(తెరపడును)

## ౫-వ రంగం

[సాయంత్రం ౫-గంటలప్పుడు లక్ష్మమ్మ యిల్లు తుడస్తూవుంటుంది]

లక్ష్మ —(తనలో) ఇంకా సోములేనా రాలేదు ఏంచెప్మా ఒంట్లో యేమీ పాలుపోకుండా వుంది అసలు సోములుకేనా కన పడ్డారో లేదో? ఏవూళ్లోవున్నారో యేమిటో ? ఇవాళల్లా ప్రతి క్షణం ఆయనకోసమే చూస్తున్నా తలుపు చప్పుడైతే ఆయనే అను కుంటున్నా కేకవినబడితే ఆయనే వచ్చేరనుకుంటున్నా అప్పిడే సాయంత్ర మయిపోయింది ఇంకేం వస్తారు! (సోములు వస్తాడు)

సోము —అమ్మా!

లక్ష్మ —సోములూ! వచ్చేవా ? ఇప్పుడేనా వచ్చేవు ? ఇప్పుడేనా ?

సోము —అమ్మా! అయ్యగా రొచ్చేరండి సామా నట్టించు కుని రేవుకాడినుం చొత్తున్నారండి నన్ను బేగెల్లి తమురెలాగు న్నారో సూసి కబరు బేగట్టుగురమ్మన్నారండి

లక్ష్మ —బాగానే వున్నానని చెప్పు వేగిరంతీసుకురా వెళ్లు వేగిరం

సోము —సిత్తమండి (వెనక్కిచూసి) అరుగోనండి అయ్య గారే వొచ్చెత్తున్నారండి నే నెల్లక్కర్లేదండింక (నారాయణరావు వచ్చును)

నారా —ఏం యెలాగున్నావు, కులాసాగా వున్నావా ? మరేంవిశేషాలు లేవుకదా పిల్ల లెలాగున్నారు? ఉత్తరం మాసు కున్నతక్షణం బయలుదేరి వచ్చేసేను

లక్ష్మ —ఊఁ

నారా —పిల్లలు కులాసాగావున్నారా ?

లక్ష్మ —ఊఁ, బాగానే వున్నారు.

నారా — (సోములుతో) ఒశే సోములూ! ఆసామాను లోపల పడేయించి వాడికి యీఅణా యిచ్చెయ్యి (అణా యిచ్చును సోములు వెళిపోతాడు)

లక్ష్మి —ఇదిగో! ఈమాట వినండి మీఅమ్మ మరేమో లేని పోనినేరాలు నామీద కల్పించి చెప్పి మీకూ నాకూ యెడబాపులు చేస్తానన్నారు అలాచెయ్యకపోతే తనది బ్రాహ్మణజన్మకాదని శపథం పట్టేరు

నారా —ఏమిటే, ఎడబాపులు చేస్తుందా? నీకూనాకూ యెడ బాపులు చేస్తుందా? ఇంకేం చాలాబాగావుంది! నేనేమిటి పిచ్చి పుల్లయ్య ననుకున్నావేమిటే, ఆముండచెప్పినమాటలన్నీ విని నమ్మ డానికి వెర్రివాణ్ణేమిటే నేను!

లక్ష్మి —ఇదిగో, మొన్నసాయింత్రం మాఅమ్మవచ్చింది నిన్నసాయింత్రం ఆవిడితో తల్లీకూతురూ దెబ్బలాడి యింట్లోంచి గెంటేసేరు

నారా —(ఆశ్చర్యపడి) ఏమిటీ! ఏమిటీ! అంతపని చేసేరా! అయ్యో వీళ్లమ్మకడుపులుకాల! వీళ్లని గెంటెయ్య! నామర్యాద నాశనం చేసేస్తున్నారు ఈ వెధవలు వీళ్లని చంపెయ్య సోములూ!

(సిత్తమండయ్యా అంటూ సోములు వచ్చును)

నారా —(లక్ష్మమ్మతో) మీఅమ్మ యెక్కడున్నారు?

లక్ష్మి —రత్తమ్మగారింట్లో వుండే భోంచేస్తూంది

నారా —సోములూ, వెల్లి రత్తమ్మగారింట్లోవున్న మాఅత్త గారిని నేనొచ్చేనని చెప్పి వేగిరం పిలుచుకురా పో వెళ్లు వేగిరం రమ్మన్నా రయ్యగారని చెప్పి జల్దీ తీసుకురా వెళ్లు పో

సోము —సిత్తమండయ్యా! (వెళ్లును)

లక్ష్మి —నిన్న యేమిటిచెప్పమన్నారు, తెగయేడ్పించుకు తీసేసే రావిణ్ణి! ఏడ్పించి దెబ్బలాడి రాత్రి ఫలహారానికేనా వుండ నియ్యకుండా పొమ్మన్నారు ఆవిడ అప్పుడువెళ్లి రత్తమ్మగారింట్లో ఫలహారం చేసింది

నారా —అబ్బా! వాళ్లపని చెప్తాలే ఇంక వాళ్లకి రోజులు దగ్గిరపడ్డాయి ఇంట్లోంచి గెంటేస్తా వెధవల్ని

(వెంకమ్మ, సుబ్బమ్మ వస్తారు)

వెంక —వచ్చేవుట్రా నాయనా! ఎప్పుడొస్తావో అనుకుంటు— (చూసి) అదేమిట్రోవు అలాగున్నావు (సుబ్బమ్మవైపుతిరిగి) అప్పిడే యేమిటో చెప్పేసిందేవ్! అయ్యో నాకళ్లు కాలిపోనూ! ఇంక వీడు నన్ను కాల్చుకుతినెస్తాడేవ్!

నారా —నాకూ దానికీ యెడబాపులు చేస్తావుట కాదూ. ఏదీ యెలాచేస్తావో చూస్తాను, చెయ్యి చూద్దాం చప్పనాతిముండవి. ఏతపాపపుముండ పుట్టదు

వెంక —అదిగో! నేననుకున్నంతపని చేసేసిందమ్మా నాకంటే అదే ముందు చెప్పేసింది ఇంకేముంది నాకూ వాడికీ యెడబాపులయి పోయింది నాకూ వాడికే యెడబాపులు చెయ్యడానికే అది పుట్టింది

నారా —మీరిద్దరూ యింట్లోవున్నవాళ్లనీ, వచ్చినవాళ్లనీ కాల్చుకుతింటూవుంటారుకదూ

సుబ్బ —నన్నేమేనా అన్నావంటే నేనొప్పుకునేది లేదు

నారా —దానికూతురువేకాదుటే నువ్వు దానికిపుట్టినదానివే కాదుటే చింతచెట్టుకు పుట్టినచింతపండు పులుపు

సుబ్బ —నువ్వుమట్టుకు చింతచెట్టుకు పుట్టలేదేమిటి?

నారా —నేనా? నేను బదనికను చింతచెట్టుపులుపు విరి చెయ్యడానికి పుట్టేను దానిసారం పీల్చి చంపెయ్యడానికి పుట్టేను

సుబ్బ —ఏడిసేవ్ వెధవగొప్ప అంతకంతకి విర్రవీగి పడిపో తున్నావు

నారా —నువ్వు సామాన్యపుఆడబొంగచువుటే పిండిబొమ్మ నుచేసి ఆడబొడచంటే తైతక్కలాడిందిట

వెంక —దాన్నెందుకురా అంటావు? నీపెళ్లాన్ననుకో నీ అత్తగారి ననుకో అంతేకాని దాన్ని అనబోకు నీపెళ్లామే కాల్చుకు తింటూంది యింట్లోవాళ్ల నందరిని

(సీతమ్మవచ్చును)

నారా —అత్తగారూ! వచ్చేరాఅండి మీరు వచ్చేరన్న సంగతి యిప్పుడే తెలిసింది వీళ్లెంతదెబ్బలాడినా మీరు యిల్లువిడిచి పోడం యేమీ న్యాయంగా లేదు అలాగెప్పుడూ వెళిపోకూడదు

సీత —తండ్రీ! నన్నేంచెయ్యమన్నావు? ఇంట్లో వుండ నిస్తేగా నన్ను ఇద్దరూ కలిసి నన్నవతలికి సాయంపట్టేసేరు నావ శంలో లేకపోయింది విడిపించుకుని వుండడానికి

నారా —ఇదిగో దానికి తగినమందు వేస్తున్నాలెండి, వాళ్లకి

సీత —నాయనా! వాళ్ల నేమనకు వాళ్లు నీతోవుండవలసిన వాళ్లు, తల్లి, చెల్లెలు నేనా పరాయిదాన్ని ఏదో అప్పుడప్పుడు, మీరు పిల్చినప్పుడు చుట్టరికంచూపుగా వచ్చి పోవలసినదాన్ని అంతే కాని మరేంకాదు కదా అలాంటప్పుడు వాళ్ల నేమనకు నాయనా!

నారా —వాళ్లెంతముఖ్యులో మీరూ అంతేముఖ్యులు నాకు విన్నారా? వాళ్లెంతముఖ్యులో మీరూ నాకు అంతేముఖ్యులు ఇదిగో నామాట తీసెయ్యక మీరు మాయింట్లోనే వుండాలి

సీత —నాయనా నేనుండలేను ఇంట్లోవాళ్లకి యిష్టంలేక పోయేక యింట్లో వుండకూడదు, అది చాలాతప్పు ఎప్పుడూ అలా చెయ్యకూడదు.

నారా —వాళ్ల యిష్టమేముందండీ నాయింట్లోను, నాయిష్టం కాని

సీత —ఈమాటకి వూరుకో నాయనా! రత్తమ్మగారింట్లో కూడా చాలాఅనుకూలంగానే వుంది ఆవిడా అక్కగారికి చేసిపెట్టె నట్టు చేసిపెడుతూంది పాపం ఉత్తమమైన యిల్లాలు అంచేత నన్ను పిలవకు నాయనా! నువ్వు చెప్పిన పని చేసుకుపోడానికొచ్చేను నేను

నారా —అలాగు కాదు మీరు నామాటతీసెయ్యక యిక్కడ వుండిపోవాలి ఉన్నతరవాత, సంగతులు మాటాడదాం

సీత — నువ్వంతబలవంతం చేస్తూవుంటే నే నేంచెప్ప గలను? నిన్ను అయిష్టపరచడం నాకు యిష్టంలేదు అంచేత నువ్వు చెప్పినట్టేకానీ అలాగే వుంటాను

నారా —అదీ మంచిపని అలాగు చెయ్యండి బాగుంది ఒక ళ్లని మనం లెక్కచెయ్యకూడదు మనపని మనం చేసుకుపోతూ వుండాలి, యెవ ళ్లేమనుకున్నా సరే

సీత —నాయనా! మీబావమరిది తనచదువునుగురించి నిన్న డగమన్నాడు, ఏదిచదువుకుంటే మంచిదో యేమిటో!

నారా —అలాగా మంచిదే, మాటాడదాం రండి అక్కడ ఆరబైటకూచుని మాటాడదాం, యిక్కడ వుక్కపోస్తూంది

(నారాయణరావు, సీతమ్మ, లక్ష్మమ్మ వెళతారు)

వెంక —(గుండెబాదుకుని) అమ్మదీనమ్మకడుపుకాల, యింత రాక్షసిదాని నే చూపులేదే యింతవరకూ విననేలేదు ఆఖరికి అదె క్కడరాక్షసోగాని అదెలాకనిపెట్టిందే వాడు రావడం

సుబ్బ —గోతికాడనక్కలాగ కనిపెట్టుకు కూచుంది ఇంతకీ, అమ్మా! ఒక్కతప్పుపని చేసేవంటె నమ్మ పైకి చెప్పేసేవు నువ్వు 'నీకూ నీమొగుడికీ యెడబాపులు చేస్తా' నని పైకి చెప్పెయ్యకుండా వుండి చెయ్యవలసింది మహబాగా వుండిపోను

వెంక —నిజమే, నావల్ల అదొక్కపొరపాటొచ్చిందే ఇం కేనా బుద్ధితెచ్చుకుంటా ఇహముందు అలాగేచేస్తా అదెంతచిత్ర మోకాని తల్లితోకూడా దెబ్బలాడేమని చెప్పేసిందే, ఎలాచెప్పేసిందో కాని అమ్మదీనిల్లుమాసిపోను ఇంతఘటుకురాలిని నేచూపులేదు ఇంక పుట్టబోదంటేనమ్మ

సుబ్బ —ఎంతఘటుకురాలు కాకపోతే నిన్నూ నన్నూ యిలా కాల్చుకుతినేస్తూందీ!

వెంక —ముందుంది ముసళ్లపండుగ దానిపాట్లింకా ముందు న్నాయిలే దీనిపని పట్టిస్తా

సుబ్బ —ఇదిగో వాళ్లు మననిగురించే చెప్పుకుంటున్నారు రహస్యంగా విందాంరా, ఏమేంచెప్పుకుంటున్నారో

వెంక —ఔనౌనుపద దానితో తేలిపోతుంది వున్నదంతా

(వెళతారు)

(తెరవాలును)

## ౬-వ రంగం

[సాయింత్రం ౫-గంటలప్పుడు నారాయణరావు కుర్చీమీద కూచుండును ఒకఉత్తరం చదువుతూ వుండును]

నారా —ఇది యెవరికి రాసినఉత్తరం? వాళ్లవాళ్లకిఅంటే వాళ్లఅమ్మకి రాసినఉత్తరమన్నమాట అయినా యేమిటి రాసిందో చూద్దాం నామీద యేమేంనేరాలు రాసిందో యేమిటో (ఉత్తరం చదువును) 'సౌ సీతమ్మఅమ్మగారికి, అనేకనమస్కారములు మీ క్షే మం రాయవలెను ఇక్కడ నాక్షేమంగురించి చెబుతున్నాను ఇక్కడ యింట్లోవుంటున్నానన్నమాటేగాని నావొంట్లోమట్టుకు ప్రాణాలుండ డంలేదు మీఅల్లుడుగారెంతమంచివారో అంతచెడ్డవాళ్లు మాఅత్త గారు, ఆడబోడుచున్నూ ఇద్దరూ చెరోరాజ్యం యేలగలరు' అ యితేనన్నుగురించి పితూరీ లేమీ రాయలేదన్నమాటే బతికేను పాపం! స్వతాః మంచిమనిషి నాకే వొక్కొక్కప్పుడు పిచ్చికోపంవేసు గొస్తూవుంటుంది, కొడుతూవుంటాను (మళ్లీచదువును) 'మా అత్త గారు నన్నుపెడుతూన్నభాదలు యిన్నీఅన్నీ కావు' నిజంగానే నిజమే ఇంతవరకూ నే నెప్పుడూ అనుకోలేదు ఆసంగతి యెరగనే యెరగను మాఅమ్మ మంచిదనే అనుకుని దాన్ని శిక్షిస్తున్నాను (చదు వును) 'ఆవిడ లేనిపోనివన్నీ నామీద కల్పనచేసి ఆయనతో చెప్తూ వుంటుంది మొగవారు ఆయన కేంతెలుస్తుంది పాపం! ఆయన ఆ మాటలువిని నన్ను కొడతారు ఆయన నేమీఅనడానికి వీలులేదు చెప్పుడుమాట లెంతేనాపనిచేస్తాయి ఆయనికి నిజంగా నేనంటే యెంతో ప్రేమ పాపం! యీమధ్య వండగడియం చేయించియిచ్చేరు కాని మాఅత్తగారు యెన్నివిధాలయినా ప్రయత్నంచేసి మమ్మలి నిద్దరినీ సుఖంగా వుంచనియ్యరు ఇదీ ఆవిడప్రతిజ్ఞ తల్లివికాబట్టి నీకు దాచకుండా అన్నీ చెబుతున్నాను నాభాద లెప్పుడు విరగడవు తాయో యేమిటో ఆదేవుడికేనా నామీద దయరాకుండావుంది వాడిదయకోసమని రోజూ వెయ్యిదండాలు పెడుతున్నాను'

అబ్బా! యెంతమాటాడింది! ఎంతమాటాడింది! నాగుండెలలో శూలం లాగ గుచ్చుకుంది తనుచచ్చిపోవాలనా కోరుకొంటూందా? తను చచ్చిపోతే నేనుండగలనా? ఒకక్షణమేనా బతకగలనా? ఒక్కక్షణం. అమ్మయ్యో అబ్బా! నిష్కారణంగా నేను దాన్ని యిన్ని బాధలు పెట్టేను, అమాయకురాలిని, నిర్దోషిని, చిన్నదాన్ని అబ్బబ్బ! దీనికంతాకారణం నాతల్లి నాతల్లిముండ కల్పించి చెప్పిన అబద్ధాలన్నీ నేను వెర్రివెధవనై నమ్మి దాన్నికొట్టేను, తిట్టేను నాఅంతపాపి లేడు నాఅంతదుర్మార్గుడు లేడు నన్ను నరకకూపంలో పడేసినా తప్పులేదు నరకంలోవుండే ఘోరశిక్షల

దేవుడు నాకు విధించినా నాకు తగినదండన కాదు అయ్యో! అమ్మా! యింతదుర్మార్గపుదానివి నువ్వని నేను కలలోనేనా అనుకోలేదు నాభార్యను కాల్చుకుతినడమంటే నీకు పరమాన్నంతినడం వంటిదని నే నెప్పుడూ అనుకోలేదు ఎంత అజ్ఞానం! ఎంతమోసం! ఆమోసగుట్టుమాటలన్నీ నమ్మి దాన్ని కొట్టేను కానీ యింకెంత కాల మింటుంది యిలాగ మరెంతకాలముంటుంది యిలాగ ఇంకా యేమేంఘోరబాధలు పడుతూందో పాపం బిడ్డ చదివిచూస్తాను (చదువును) 'అమ్మా! మాఅత్తగారు నన్నొకపువ్వు తాంబూలమేనా పట్టనియ్యదు— ఇతరనోములమా ? అసలు తలపెట్టేందుకూడదు పువ్వులు కొని తలలోపెట్టుకుంటూంటే నువ్వేమి సానిదానివా పువ్వులమీద పడిచావడాని కని అడుగుతుంది ఆవిడ అనే మాటలు వినలేక నేను చెవులు మూసుకుంటున్నా' హరహరా! నేనూ చెవులు మూసుకుంటున్నా నేనూ వినలేను, అదిఅన్నమాటలు దానిక్రౌర్యం నేను వినలేను, చూడలేను ఇన్నాళ్లకి నాపాపాలన్నీ బైటపడ్డాయి, నా అదృష్టంవల్ల నేను బాగుపడేరోజు లొచ్చేయి ఇంక నే నీవుత్తరం చదవలేను కన్నీళ్లు దృష్టిని కప్పివేస్తున్నాయి అక్షరాలు కనబడడం లేదు అబ్బా! మహాపాపి! మహాపాపి! ఇంతదుర్మార్గుణ్ణి, యింత దుష్టుణ్ణి,యింతపాపిని నేనని యింతవరకూ గ్రహించలేకపోయేను ఎంత అజ్ఞానంలో పడివుండిపోయేను ఎంతఅజ్ఞానం నాకూ మంచిరోజులు వచ్చేయి రావడంబట్టే యీవుత్తరం నాకళ్లపడింది ఇంతవరకూ నేచేసిన పాపాలుకు నాభార్యను నేను క్షమించమని కోరుకోవాలి అప్పటికిగాని నాకు పాపపరిహారం లేదు, దేవుడిదయకు పాత్రుణ్ణి కాను దాన్ని యిప్పుడే పిలిచి క్షమించమని కోరుకుంటూ ఇప్పుడే పిలుస్తా ఇదిగో, ఔనా, ఓయ్('ఎంగుకూ, వస్తున్నా'అనిలోపల కేక లక్ష్మమ్మ వచ్చును) ఇలారా కూర్చో

లక్ష్మ —ఏమిటో చెప్పండి ఇంట్లో బోలెడుపను లున్నాయి చేసుకోవాలివెళ్లి అంట్లు తోమమన్నారు అత్తగారు వెళ్లి చేసుగోవాలమ్మా తీరిక లేదు

నారా —ఇంక ఆఅత్తగారిముండమాటలు వినకు నువ్వు విన వద్దు తెలిసిందా అ దేంచెప్పినా చెయ్యవద్దు ఇలారా కూచో

లక్ష్మ —(ఆశ్చర్యపడి) బాగా నేవుంది మంచిహితోపదేశమే

నారా —నామాట విను, ఇలారా, కూచో, కూచో, చెప్తా అన్ని సంగతులు (లక్ష్మమ్మకూర్చుండును.) అయితే యీవుత్తరం నాకు చెప్పేసింది యింట్లోస్థితి అంతా.

లక్ష్మ —(భయాశ్చర్యాలతో) ఈవుత్తరం మీచేతులలో యెందుకు పడిందీ.

నారా — ఎందుకుపడిందా! నాపూర్వజన్మసుకృతంవల్ల పడింది నాకు బాగుపడేరోజు లొచ్చేయికాబట్టి పడింది నాపాప కార్యాలు తుదముట్టేరోజులొచ్చేయి కాబట్టి కనపడింది

లక్ష్మ —సరే, బాగా నేవుంది మీ కెక్కడ దొరికిందీ యీవుత్తరం

నారా —నీపరుపుమీద పిల్లలు పడుక్కుంటున్నారు కదా! పోనీ రేపు యెండలో వేయిద్దాం ఇది తీసెస్తే మరోపరుపు వేసుగుంటావని చుడుతున్నాను చుడుతూవుంటే యీ కాగితం కన బడింది ఏమిటోఅనిచూ నేను నీదస్తూరీ కనపడింది పోనీకదా అని చదవడం మొదలెట్టేను ఇంట్లోవున్నస్థితిఅంతా విశదమయింది నేను చేస్తూన్న పాపాలన్నీ నాకు బోధపడ్డాయి నే నెంతపాపినో గ్రహించేను నీ క్షమాపణ కోరుకుంటేగాని నాకు పైలోకాలు లేవని అనిపించింది నిన్ను పిలిచేను నేను నీకు చేసినఅపకారాలూ, పెట్టినబాధలకీ నన్ను క్షమించు నువ్వు క్షమించకపోతే నాకు పుట్టగతు లుండవు

లక్ష్మ —అదేమిటీ మీవెర్రి బాగా నేవుంది అంతకంతకు మతి పోతూందా యేమిటి ?

నారా —దేవతలాంటిభార్యను నేపెట్టినబాధలు నాకు జ్ఞాపకమొస్తున్నాయి జ్ఞాపకమొచ్చినప్పుడల్లా నావొళ్లు జలదరిస్తూంది నిన్నిన్నికష్టాలు పెట్టేను కదాఅని కళ్లంబడి నీళ్లు కాలువలు కట్టి కారుతున్నాయి

లక్ష్మ —మీరు పెట్టిందేమిటీ, ఆవిడ పెట్టించిందిగాని

నారా —ఔను! ఆపాడుముండ నాపాలిటి రాక్షసి అయిపోయింది ఆముండచేసినపనే యిది ఆముండను చంపేసినా పాపం లేదు ఇదిగో యిప్పుడే వెళ్లి దానితల బద్దలకొట్టినంతపని చేసొస్తా

లక్ష్మ —ఎందుకండీ మళ్లా దెబ్బలాటలు ఆవి ణ్ణేమనవద్దు, ఊరుకోండి (వీధిలో 'అయ్యగారూ' అని వినవస్తుంది)

నారా —పోస్టుబంట్రోతు వచ్చేడు వెళ్లొస్తానుండు (వెళ్లి కవరుపట్టుకువచ్చును విప్పిచదువును)

లక్ష్మ —ఏమి టాఉత్తరం ?

నారా —నేను నీతో వెనకఅన్నమాటే బదిలీఅయిరాది

లక్ష్మ —అయిందీ! ఏవూరూ ?

నారా —చాలాదూరం బళ్లారి అయింది

లక్ష్మ —అబ్బా! చాలాదూరమండి 'నన్ను బదిలీ చెయ్యొద్దు ఈఊళ్లోనే వుండిపోతా' నని ఉత్తరంముక్క రాసెయ్యండి పైవాళ్లకి

నారా —ఉత్తరంముక్క సరిపోదు చెన్నపట్నంవెళ్లి అక్కడిగుమాస్తాలకాళ్లు పట్టుగోవాలి డైరెక్టరుకాళ్లు పట్టుగో అక్క ర్లేదు గాని యీగుమాస్తాగాళ్ల కాళ్లమట్టుకు పట్టుగోకపోతే మనకు మోక్షంలేదు సరికదా నష్టంకూడా వుంది ఈవూజారిగాళ్ల చేతుల్లో వుంది యెంతేనాపని

లక్ష్మి — పోనీ వెళ్లి ఆపనే చెయ్యండి

నారా — ఇంకా ఆలోచిస్తాను ఇప్పుడప్పుడే చెప్పలేను

(కొంచెం సేపయేక)

లక్ష్మి — ఏదీ నావుత్తరం నాకిచ్చెయ్యండి

నారా — అది యిప్పుడప్పుడే యిచ్చెయ్యడమే! ఎంతమాట అన్నావు! ఇప్పుడప్పుడే యిచ్చెయ్యడమే! వీలులేదు అది పూర్తిగా చదివాలి పదిసార్లు పారాయణ చెయ్యాలి చేసి నా పాపాలు క్షమించమని దేవుణ్ణి ప్రార్థించాలి అప్పుడేనా యిది నీకిస్తానో యియ్యనో, నాదగ్గిరే వుంచుకుని మనస్సులో పూజించుకుంటూవుంటానో చెప్పలేను (లేచి) ఇదిగో! వెళుతున్నా ఆముండను కొట్టి నంతపని చేసొస్తా (లక్ష్మమ్మ పట్టుకుని 'వొద్దువొద్దు'నును కాని నారాయణరావు విడిపించుకుని వెళ్లును లక్ష్మమ్మకూడా వెంటవెళ్లును)

(తెరవాలును)

## ౭-వ రంగం

[పొద్దున్న $7\frac{1}{2}$ గంటలకి నారాయణరావు కుర్చీమీద కూచుని వుండును లక్ష్మమ్మ కాఫీ పట్టుకొని వచ్చును]

నారా — కూచో అలాకుర్చీమీద

లక్ష్మి — కూచుంటాను లెండి

నారా — తాగుతాలే, నువ్వలాకూచో

లక్ష్మి — ఏమీ అలాగున్నారేమీ! ఒంట్లో నీరసంగా మందంగా వుందాయేమిటి?

నారా. — ఏమనిచెప్పమన్నావు ఇంట్లోసంగతుల్నిగురించి నాకేమీ తోచకుండా వుంది తిన్నతిండి వొంటపట్టడం లేదు కంటికి నిద్ర రావడం లేదు

లక్ష్మి — అయితే బెంగెట్టుకుంటే బాగుపడుతుందేమిటి?

నారా. — ఏంచెయ్యడానికీ నాకుతోచడం లేదు ఈగొడవలు యెలావొదులుతాయా దేవుడా అనిచూస్తున్నా ఎలావొదుల్చుకోడమో యేమిటో దారేమీకనపడడం లేదు (సోములు వస్తాడు)

సోము — అయ్యగారూ, మరేమో యెంకటేశర్లుగా రొచ్చేరండి.

నారా — (తొందరతో) ఏడీ వచ్చేడా? ఇల్రారమ్మను

లక్ష్మి. — మీ ప్రియస్నేహితుడు వచ్చేడుకాబట్టి నేను యింక వెళిపోతాను

నారా — ఊఁ తర్వాత మాట్లాడదాంలే వెళ్లు యిప్పటికి

(లక్ష్మమ్మ వెళ్లును వెంకటేశ్వరులు వచ్చును)

(వెంకటేశ్వరులు ముప్పైయేళ్లమనిషి సన్నగా పొడుగ్గా వుండును. సరదామనిషి)

నారా — ఏమోయ్, వెంకటేశ్వరులూ, యిలా దయచేసేవు? పనివుంటేగాని కనపడకుండావున్నావులే యీమధ్య

వెంకటే — నువ్వు వూళ్లో లేవని విన్నా (కుర్చీమీద కూచుండును)

నారా — మళ్లా వూళ్లోవున్నానని విని వచ్చేవేమిటి?

వెంకటే — నిన్న మీ గుమాస్తా మంగయ్య కనపడ్డాడు కనపడితే 'ఎప్పుడొస్తాడయ్యా మాగాయీ, మీయినస్పెక్టరుగారు' అని అడిగేను అతనూ నవ్వుతూ, 'అయ్యా, వూళ్లోనే వున్నారండి' అన్నాడు అలానా అనుకుని యివాళ వచ్చేను

నారా — ఏమిటీ విశేషాలు?

వెంకటే — ఏముంది మరేం లేదు ఏమున్నాయి విశేషాలు మరేం లేదు కాని,నువ్వొక్క వుపకారం చేసిపెట్టాలోయ్ నీచేతిలో వున్నపనే అది తలుచుకుంటే యిట్టే చేసెస్తావు మావాడొకడు — మా మేనల్లుడున్నాడు తే వాడికక్షరంముక్క లంటలేదు. ఎలాగయితేయేం నాలుగో ఫారందాకా డేకించేడు మరింక పైచదువు వీడికెలాగాఅబ్బదని ఆ తర్వాత హైయ్యరుఎలిమెంటరీ ట్రయినింగులో పడేయించేను ఏదో పాసయేడు వాడికిప్పుడు వుద్యోగంకోసం తంటాలు పడుతున్నా మునుపు తిరగనివూళ్లు యిప్పుడు తిరుగుతున్నా, యెరగని మనుష్యుల్ని యిప్పుడు యెరుగుతున్నా ఎంతచచ్చినా యెక్కడా పుట్టకుండావుందోయ్ వుద్యోగం

నారా — నిరుద్యోగసమస్య యెక్కువౌతూన్న యీరోజుల్లో వుద్యోగా లెక్కడొస్తాయి? అసలు ఖాళీలంటూ లేందే యెక్కడా!

వెంకటే — ఏదో కాస్త వాణ్ణి సాయంపట్టి పడేయిస్తివా నీపేరు చెప్పుగుబతుకుతాడు ఇంతతిండిపెట్టినవాడివౌతావు కాస్త వాణ్ణి కనిపెడుదూ.

నారా — మా డిప్టీయినస్పెక్టర్లచేతుల్లో యేదోపెద్దఅధికారం వుందనుకుంటున్నావు నువ్వు అంతేనా? అది వుత్తమాట వెనక సబస్టెంటుయినస్పెక్టర్లుగా వుంటూవుండినప్పుడు కొంతఅధికారం వుండేది అప్పుడు మేము రెకమెండుచేస్తేగాని డైరెక్టరు వొప్పుగునేవాడు కాదు ఇప్పుడు తాలూకాప్రెసిడెంటుగారే అన్నిటికిన్ని వారి చేతుల్లోనేగాని మరెవరిచేతుల్లో యేమీలేదు అంచేత యేమయినా ఆయన్నే ఆశ్రయించి పని కానిచ్చుగోవాలి

వెంకటే — అయితే బొత్తిగా మీచేతిలో యేమీలేదంటావు!

నారా — ఉన్నా బహుస్వల్పం ఇంచుమించుగా లేదనే చెప్పుగోవచ్చు అంతబొత్తిగా అక్షరాలురానివెధవనికనక బోర్డు ప్రెసిడెంటుగారు మేష్టరుగా వేయిస్తే ఆవెధవని తీయించెయ్యొచ్చు





1. నూజవీడు హైస్కూలు స్కౌటుసంఘము. 2. తెనాలి శ్రద్ధానంద హరిజన పాఠశాల బాలబాలికలు హరిజనదినోత్సవ సందర్భమున సంపన్నులయిండ్లకువెళ్లి కానుకలు వసూలుచేయుట.

# ప్రేమ బంధములు




“....... రాయిలోను, పనితనములోను, ఎటులుండిన బాగుండునని తలంచితినో, అటులనేయుండి, యుంగరము నాకెంతో ముదముగూర్చెనని మీకు నమ్మకముగా తెలుపుచున్నాను దానిని చూచినవారు గూడ మిగుల సంతోషించి, మెచ్చుకొనిరి..... .. .”

(సం) పి. శివశంకరం పిళ్లై, బి. ఏ., బి. యల్.

హైకోర్టు జడ్జి.

# సురాజమల్లు

రత్నవర్తకులు, నగలవర్తకులు.

**313** యెస్ప్లనేడు మదరాసు.

యితర ఆఫీసులు:

బొంబయి. రంగూన్. ఆన్టువర్పు.

ఆమున్య షూబోర్డ ప్రెసిడెంటుగారు తన మంగలాడికి మేస్త్రరిగిరీ యిప్పించేసు—వాడు బాగా క్షవరంచేస్తాడని ఆమంగలాడో మరి, కాగితంమీద అక్షరాలు రాసియెరగడు, చూసి యెరగడు ఆసంగతి యెలాగో వోహారాగా నాకు తెలిసింది వెంటనే డైరెక్టరుకి రాసిపారేసేను, యిలా గిలాంటిసంగతని ఆతర్వాత ఆమేస్త్రరీ ఆమంగలాడి కూడిపోయిందిలే

వెంకటే —అలాగునోయ్!

నారా — అలాగున్నాయి సంగతులు దానిమాటకేంగాని నాలుగుకబుర్లు చెబుతూ, కులాసాగా కాసేపు మాట్లాడుకుంటూ సరదాకబుర్లు మాట్లాడి చాలాకాలమయింది

వెంకటే —ఔనుగాని, నువ్వు మనిషివి నీరసంగా కనపడుతున్నావేం వెనకున్న చలాకీ లేదు ఒంట్లో మరేం లేదుకదా

నారా —ఒంట్లో మరేం లేదుగాని యింట్లో నామామ్మలుగానే వుంది.

వెంకటే —ఏమిటీ, దెబ్బలాటలేనా?

నారా —లేకపోతే మరేమిటింక మాఅమ్మ వొకర్తె కాల్చుకు తినేస్తూందోయ్ దానికితోడు మాచెల్లెలొకర్తె ఆపెపెనుకుఅధాట్టి పూరాగా దలాయిస్తూంది

వెంకటే —సరే చెల్లెలుమాటకేంలే మనమీద ఆధారపడి మనిషికాదు వాళ్ల అత్తారింటికి పొమ్మంటే తీరిపోతుంది

నారా—ఆమాట నిజమే దాన్ని పొమ్మనొచ్చుగాని మాతల్లి సంగతే వొచ్చిందోయ్

వెంకటే —నే నేంచేసేనో మానేవా మ తల్లి నిగురించి నన్నూ, నాపెళ్లాన్నీకూడా కాల్చుకుతినేసేది మాఅమ్మ ఆతర్వాతి నీయేడుపు నువ్వేడువని వేరేవుండమన్నాను నాసమ్మం తోకొద్దన్నాను మాస్వగ్రామంలోనే వుంటూంది యిప్పుడు నేను నెలకి నాలుగోఅయిదో పంపిస్తూవుంటాను.

నారా—అవునుగాని నే నొకసంగతి అడుగుతాను చెప్పు. మనిషిఅన్నవాడికి తల్లివై పొకధర్మం, పెళ్లాంవై పొకధర్మమంటూ వుందా లేదా? అలాంటప్పుడు తల్లిని యింట్లోంచి తరిమెస్తే తల్లివైపు నెరవేర్చవలసిన ధర్మాన్ని నెరవేర్చ లేదన్నమాటా, కాదా?

వెంకటే—మంచిసందేహమే కలిగింది నీకు! ఇద్దరూ వొకచోటవుండి కుక్కలులాగ, పిల్లులులాగ కాట్లాడుకుంటూవుంటే మంచిదా! వేరేవుంటే చెడ్డదా! తల్లివైపు, పెళ్లాంవైపు విధి, ధర్మం అనిపేరెట్టుగుని వాళ్లిద్దరినీ వొకచోట వుంచెనిచ్చి పికిలిపిట్టలులాగ కొట్టుగోనిస్తూవుంటే అది విధి ధర్మం నెరవేర్చుగున్నట్టా!

నారా—మరి?

వెంకటే —మరి. అయితే విను చెప్తున్నా, నువ్వడిగేవు కాబట్టి, వాళ్లిద్దరినీ సుఖపడనియ్యడమే మనధర్మం వాళ్లిద్దరూకూడా వొకచోట వుంటే సుఖం లేకపోయినప్పుడు యిద్దరినీకూడా వొకచోట వుండనియ్యకూడదన్నమాట పెళ్లాన్ని విడిచిపొమ్మనకూడదు కదా ఆదికేవలం అన్నిటికీకూడా భర్తమీదే ఆధారపడివున్న మనిషి. భార్యాభర్తలిది యెక్కువసంబంధం భార్య అర్ధశరీరం అన్నాడు. అన్నిటికీ యిద్దరూ వొక్కచోటే వుండితీరాలి, మనస్సు మనస్సు కలిసినప్పుళ్లు మరి తల్లివిషయమా తల్లికి కొడుక్కి అలాగువిడదియ్యడానికి సాధ్యంకాని సంబంధం యేమీ లేదు తల్లిని వేరేవుండమనడానికి వీలుంది అన్నిటికీ మనమీదే ఆధారపడినమనిషి కాదు, తన బతుకు తాను బతకవచ్చు కాబట్టె అటువంటస్థితిలో భార్యాభర్తల శ్రేయస్సుకోసం తనే ఆలోచించి తల్లి వేరేవుండవలసింది ఆసంగతి ఆవిడికే తోచి వేరేవుంటుందా మహామంచిమాట వేరేవుండదా, మనం వేరేవుండేట్లు చెయ్యాలి ఆవిణ్ణి యేదో పల్లెటూరులో వుండమని చెప్పు ఏగో నాలుగైదురూపాయిలు పంపిస్తూవుండు నెలకి ఆపల్లెటూళ్లోనే పడివుంటూ, అంతగా మిమ్మల్ని వచ్చి చూడాలని ఆవిడకుంటే యెప్పుడేనా వొకమారు వచ్చి, యేమూడు నాలుగురోజులో వుండి చూసి పొమ్మను స్థిరనివాసంమట్టుకు పల్లెటూరులోనే ఈ మోస్తరుగా చేస్తివా యెంతేనా సుఖపడతావు ఈమోస్తరుగా చేసే నేను యిప్పుడు యెంతో సుఖంగా వుంటున్నా

నారా —అదృష్టవంతుడివికాబట్టి సుఖపడుతున్నావు

వెంకటే —నేను చేసినపనే అదృష్టం అలా విడజేసుకున్నానుకాబట్టే సుఖపడుతున్నా ఇంక మరొకటి, ఆస్తులు పాస్తులువున్నవాళ్లు వొకళ్లతో వొకళ్లకి పడకపోయేక వేరేవేరేవుండి సుఖపడుకున్నారు వాళ్లెంతోమంది వున్నారు లక్షలకొద్దీ వున్నారంటే నమ్మ

నారా —ఎందుగ్గా, నేనే చూసేను అలాంటివాళ్లని ఎంతోమంది వున్నారు, ఆమోస్తరుగా పరిష్కారంచేసుగు సుఖపడుతూన్నవాళ్లు.

వెంకటే —మరి మనలాంటివాళ్ల సంగతంటావా? నేను చెప్పనేచెప్పేను యెలాగచెయ్యాలో నేనలా చేసుగున్నాను కాబట్టె సుఖపడుతున్నా నిన్నుకూడా అలాగు చేసుగుని సుఖపడమని చెప్తున్నా

నారా —నిజమే నువ్వు చేసినపని చాలాబాగుందయ్యా నువ్వుచేసినట్టు చేసి చూడవలసిందే చేసి చూస్తా దానివల్ల యీగొడవంతా వొదిలిపోతే సుఖపడతాను

వెంకటే —నాకు వొదిలిపోయేయి చూసేవా మరి ఆలాగే నీకున్నూ

నారా —ఊఁ.

వెంకటే — కాని దీంట్లో వొకసంగతి వుందిసుమా విధికి ధర్మానికి పిచ్చిపిచ్చిఅర్థాలు పెట్టుగుని పనిచేస్తే లాభంలేదు నేను చెసిం దీవిధి, ధర్మంప్రకారమే వాళ్లిద్దరినీ సుఖపెట్టడం మనకువిధి మనం సుఖపడడం మనవిధి అంచేత వాళ్లిద్దరినీ వేరేవేరే వుంచక తప్పదు. విధి, ధర్మానికి వ్యతిరేకంగా నేనూ వెళ్లలేదు ఆమో స్త రుగా చెయ్యి, మంచిది

నారా.—బాగానేవుంది నువ్వుచెప్పినమాట. నాకు నచ్చింది అలాగే చేసిచూస్తా.

వెంకటే —చేసేవో సుఖపడ్డావో ఏరట్టూ లేక బతుకుతావు బతికున్నాళ్లూ.

నారా —అలాగే

వెంకటే —మరి నేను వెళ్లొస్తా. వేగిరం వస్తానని యింటి దగ్గిర చెప్పి బయలుదేరేను వెళ్లొస్తామరి

నారా —మంచిదే మళ్లీ కలుసుకుంటాను.

వెంకటే —ఊఁ వెళ్లొస్తా (వెళ్లును)

(తెరపడును)

## ౮-వ రంగం

[సాయింత్రం వెంకమ్మ, సుబ్బమ్మ వత్తులుచేసుగుంటూ సావిట్లో కూచుంటారు]

సుబ్బ—అమ్మా! నన్నివాళే మావూరు తీసుకుపో వాడన్ని మాటలన్నాక నే నుండను, వుండలేను ఆడబొడుచుతనం యేంతేనా చేస్తున్నానుట. తనపెళ్లాన్ని కాల్చుకుతింటున్నానుట

వెంక —ఔనమ్మా! నిజమేతల్లీ! నిన్నెన్నిమాటలేనా ఆడేడు. అప్పటికీ నేనుచెప్పనేచెప్పేను 'నన్నెన్నిమాటలన్నా నేనుపడతాను గాని దాన్ని వొక్కమాటేనా అనవద్దని కాని వాడు వూరుకుంటాడా? బుద్ధి వుంటేకదూ! దానివలలో పడిపోయేడు

సుబ్బ —నువ్వు పడతావంటే నీఖర్మం, నీలలాటలిఖితం అంతేగాని నా కేంవచ్చిందే, నాఖర్మంకాలా, వాడన్నమాటలన్నీ పడడానికి పంతులాంటి నాసంసార ముండగా యిక్కడ వుండడమేమొచ్చింది నానుదుటిరాత కాకపోతే. వీడిచేత నానాబూతులూ తినడం నానెత్తిని రాయలేదు దేవుడు ఎప్పుడైతే వాడికి నామీద పడ లేదో అప్పుడే తెగతెంపులు చేసుగునిపోతాను నేను నీలాగ యింటిని కుక్కలాగ కనిపెట్టుగు కూచుంటాననుకున్నావు కమోసు!

వెంక —నేనుమట్టుగు కుక్కలాగ కనిపెట్టుకు కూచున్నా నుటే. నారాజ్యం నాయిష్టం కాబట్టే యిన్నాళ్లూ వున్నాను ఈమూడురోజులాయే వాడు నామీద తిరగబడ్డాడు. సరే అయి పోయింది ఇంతవరకు యెన్నడేనా నామాటకు యెదురాడి యెరుగునా వాడు నామాట విన్నన్నాళ్లూ అది భయభక్తులుతోటే వుండేది ఇప్పుడో, తాడెక్కిపోయింది

సుబ్బ —వాడికి అది మందుపెట్టి లొంగతీసింది ఆసంగతి నాకు తెలుసు మరెవ్వరికీ తలీదు

వెంక —నిజమే అయివుండవచ్చు అది యెంతేనా సాహసురాలు లేకపోతే వొక్కమాటున గిరుక్కున తిరిగిపోతాడా నిన్నటిదాకా నాఅనుపాజ్ఞలలో వున్నవాడు? దీని కేదో వైద్యం తగల పెట్టించాలి

సుబ్బ —ఇంక నిన్ను దగ్గిరికి రానిస్తేగా

వెంక —ఆమాట నిజమే అది బతికున్నాళ్లూ నన్నింక వాడిదరికి రానియ్యదు వాణ్ణి కళ్లపడనియ్యదు వాడు నెత్తికెక్కించుగుంటున్నాడు అ దెక్కుతూంది

సుబ్బ —ఇంకేముందిలే ఎప్పుడైతే అది నెత్తెక్కిందో అప్పుడే అది దిగతొక్కుస్తుంది అది జష్టాదేవమ్మా! ఎవరికీ తెలీ దాసంగతి ఒకమాటు నాకు కలలో వచ్చి లక్ష్మీదేవి చెప్పింది ఇలాంటి వంద రికి తెలీవమ్మా ఎవరో మహాపుణ్యాత్ములుంటారు మానేవూ, వాళ్లతో దేవుడు కలలోవచ్చి చెప్తాడు కలలో తననిజస్వరూపం చూపిస్తాడు నా కొకమాటు కలలో కనపడి లక్ష్మీదేవి చెప్పింది 'మీయింట్లో జష్టాదేవుంది సుమా, జాగ్రత్త జాగ్రత్త' అని అప్పుడు నే ననుకున్నాను 'హా! దైవమా! నాలాంటిదాన్ని కాబట్టి నువ్వు నిజంచెప్పి రక్షించేవు తక్కినవాళ్లపని అంతేకదా పరమాత్మా' అని అప్పటినుంచీ దానినిగురించి మెలకువగానే వుంటున్నా

వెంక —నిజమే, అది జష్టాదేవి అవతారమే లేకపోతే అత్తగారిని, ఆడబొడుచుని యింత కాల్చుకుతినదు

సుబ్బ —అయిందిలే వాడిసంసారం కూలబడేదినాలు దగ్గిరకొచ్చేయి ఎందుకనీ, నేను చెప్పడంలేదు, నిజంచెప్తే నిష్ఠూరమని

వెంక —నిజమే పిల్లా, నువ్వు చెప్పేవన్నీ నిజమే.

సుబ్బ —ఔనుగాని అమ్మా! వాడికి ట్రాన్స్ఫర్ అయిపోయిందిటేమిటే?

వెంక —ఏదో దూరదేశాని కయిపోయిందిట. దేవుడు వాడికి తగినశాస్తి చేసేడు

సుబ్బ —నువ్వు వెళతావాయేమిటి అక్కడికి?

వెంక —నేను వెళ్లేదేమిటి, నా మొహం నాతక్కినయిద్దరి కొడుకులదగ్గిరికే వెళ్లేదేమిటి వాళ్లిద్దరూ దూరదేశాల్లో ఒకడు బొంబాయిలోనూ, ఒకడు కలకత్తాలోనూ పడియేడుస్తున్నారవేకపూ వాళ్లదగ్గిరికి వెళ్లకపోడం సరే వీడుకూడా దూరమయిపోయేడు మిమ్మలినందరినీ విడిచిపెట్టి, చుట్టాలిని విడిచిపెట్టి, దేశంవిడిచిపెట్టి

వెళ్లేదేమిటి నామొహం వాహా, అదీ పోతారు, యుష్టిత్తుకోడానికి, అంతేగాని నేను వెళ్లను

సుబ్బ —మంచిపని అలాచేసేవంటే నిమిషాలమీద బుద్ధొస్తుంది 'నా' అన్నవాళ్లు లేనిచోట వుంటేగాని వాడికి బుద్ధిరాదు.

వెంక —నిజమే అప్పుడువచ్చి నా కాళ్లమీదపడి క్షమించు, క్షమించు, మహాపాతకం చేసేను, తల్లి కింతద్రోహం తెలియకచేసేనని వేడుకుంటాడు వాడిగడ్డి వాడుతిన్నాక అప్పుడు పోనీగదా బిడ్డడని వూరుకుంటాను.

(నారాయణరావు వచ్చును)

నారా —(తల్లితో) ఇదిగో నేను దూరదేశం వెళిపోతున్నాను బళ్లారి బదలీఅయింది నువ్వు నాతో రావడానికి వీలులేదు. అసలు నిన్నెప్పటికీ నాదగ్గిరికి రానియ్యను

వెంక —అదివున్నన్నాళ్లూ యెలాగా రాను

నారా —అదే నేను కోరేదీ

వెంక — నాకు పిండాకుడు దొరక్కపోయిందేమిటి, నీపంచనుంటేగాని ?

నారా —నా కిన్నిమాటలు పనికిరావు నేను నీకు నెలకి అయిదురూపాయిలుచొప్పున పంపిస్తూవుంటాను, యెక్కడవుంటే అక్కడవుండు నాయింటికిమాత్రం రావద్దు నువ్వు యెన్నడూ నాగొంప తొక్కవద్దు

వెంక:—నువ్వసలు కాళ్లమీదపడి బతిమాలుకున్నా నేను రానురోయి అలాంటిది నాఅంతట నేనే వస్తానుట్రా అది చచ్చేవరకూ యింతే ప్రతిజ్ఞ.

నారా:—అదీ నేనూ చచ్చేవరకూ నువ్వు చావనేచావవులే నా కాసంగతి తెలుసు మా చావులు చూసేక ప్రాణాలు విడిచిపెడతావు.

వెంక:—దేవుడాయుర్దాయం ఇస్తే యెవరేం చెయ్యగలరు ? అర్థాయుష్షువేసవలు పోతే పోతారు

నారా!—'పాపెచిరాయువు'అని వూరికే అన్నాడుటే. నీలాంటి వాళ్లని చూసే అన్నాడు

వెంక:—నేనుట్రా పాపని! ఓరిదుర్మార్గుడా! నేను సత్యఋషినిరా నేను బ్రహ్మఋషినిరా ఈకాలంలో నాఅంతటవుత్తమురాలు, నాఅంతటిఋషి లేదురా నీకేం తెలుస్తుంది కుక్కవి. నరకలోకంలో పడవలసినవాడికి నీకు తెలుస్తుందిరా

నారా —నాకు తెలియక్కర్లేదు నాకుతెలియకుండానేవుంటేనే సుఖంగా బతుకుతాను

(సీతమ్మ, లక్ష్మమ్మ వస్తారు వెంకమ్మ, సుబ్బమ్మ వెళతారు.)

నారా —అత్తగారూ!

సీత —నాయనా!

నారా —మిమ్మల్ని వొక్కమాటఅడుగుతా చెయ్యండి. మా సెరా నాకు బదలీఅయింది దూరదేశం

సీత —నాయనా, బదలీచెయ్యవద్దని రాసుకోలేకపోయేవా?

నారా —నేను కోరే యీబదలీకి వొప్పుకున్నాను. మాతల్లి దగ్గిరనుంచి కొన్నాళ్లపాటు యెంతదూరంగావుంటే అంతమంచిది, అంతసుఖపడతానని కోరుకున్నా దూరదేశంలో వుంటే అది నావూసేనా తలపెట్టదు నాగుమ్మమేనా తొక్కదు. ఆసంగతి తెలియడంచేతే దూరదేశంబదలీకి నేనే వొప్పుకున్నా

సీత:—మంచిది నాయనా! నీకు మంచిదని యెలాతోస్తే అలా చెయ్యి

నారా —విన్నారా ఇప్పుడు మీరు చెయ్యవలసిందేమిటంటే, మీపిల్లను యిక్కడినుంచే మీరుతీసుకువెళ్లడం నాకు యిష్టంలేదు. మాఅమ్మా, చెల్లెలూకూడా తనభార్యవంకవాళ్లంటే యిష్టమో, వాళ్లు చెప్పినట్టు చేస్తాడో అని యేడుస్తారు కనుక వాళ్లు యిప్పుడు యేడవకుండావుండడానికి మీరు నేను బళ్లారి వెళ్లేక తర్వాత అక్కడికి రండి అక్కడినుంచి పిల్లని మీరు తీసుకువెళుదురుగాని. రైలు ఖర్చులు నేనే యిచ్చుకుంటాను.

సీత:—రైలుఖర్చుల కేంమునిగిపోయిందిలే బాబు, యింతోటి రైలుఖర్చులు.

నారా!—అలాగుకాదు చెబుతున్నా. అలాచేస్తేనే బాగుంటుంది. అందుచేత యిక్కడినుంచి మీవూరు ప్రయాణమయి వెళ్లి తర్వాత అక్కడికి రండి. విన్నారా మరి.

సీత:—మంచిది నాయనా! అలాగే చేస్తాను. నియిష్టంవచ్చినట్లే చేస్తాను.

(లోపలనుంచి 'అమ్మగారూ' అనికేక 'ఎవరువా'రని సీతమ్మ వెళుతుంది)

నారా:—ఏమిటిది సమాచారం చూసేవా యెలా పరిష్కారమయిపోయిందో

లక్ష్మి:—ఏముంది ?

నారా:—శేషుగ్గా వదిల్చేసేనా మాతల్లీపీడ

లక్ష్మి —మీకు సుఖపడేరోజులు వచ్చేయి.

నారా —నాకు కాదు నీకు. లేకపోతే యింకా వెనకటిలాగే వుండును అంతా

లక్ష్మి.—ఊఁ.

నారా — ఒంట్లో యిప్పుడెంత ఆనందంగా నేనావుంగ

లక్ష్మి — ఉండకేం, అన్నీ పరిష్కారం చేసుకుంటే

నారా — ఏదీ యిలాదగ్గిరికిరా

లక్ష్మి — పడివాళ్లల్లో నేనా!

నారా — ముద్దు పెట్టేయిటే

లక్ష్మి — అగేవో బాబో అలారండి (గదిచూపించును)

నారా — రమ్మంటే (లక్ష్మమ్మ పారిపోవును) నువ్వన్నమాటే నగ్గించుకున్నావులే పద

(వెళ్లును)

(తెరవాలును)

---

ఉద్యోగ ప్రయత్నము





# 'అంధకారం'

కామరాజు కృష్ణమూర్తి

(ఇందులో వచ్చువారు—తండ్రి, తల్లి, కొడుకు, పూజారి, యిద్దరు పురుషులు)

అంకం ఒకటి—మొదటిసీను

[ఒక గుడిశె. లోపల ఒక నులకమంచం. ఒక తలుపు. లోపల తూర్పువైపున ఒకతాడు కట్టివుంది. ఆ త్రాటిమీద చినిగిపోయిన గుడ్డలు. పడమటివైపున ఒకపొయ్యి. ఆపొయ్యిమీద ఒకకుండ. దానిప్రక్కన చిన్నిచిన్ని పిడతలు మూడు వున్నాయి. ఆగుడిశెలో ఒకదీపం మిణుకుమిణుకు అంటుంది. అది ప్రమిదలో వుంది. ఆనులకమంచంపై కొడుకు పడుకొని వుంటాడు. చామనచాయ. తల్లివయస్సు నలభై యేళ్లు. ఒకచరకా మీద నూలుతీస్తున్నది. ప్రక్కన ఏకులు పడివున్నాయి. లోపలికిపోయిన బుగ్గలు, బరువయినకళ్లు. చిక్కుపడిన జుట్టు వెనక చుట్టచుట్టింది కొప్పుమోస్తరు. అప్పు డప్పుడు మంచంవంక చూస్తుంటుంది. ఒక దీర్ఘశ్వాస వదలుతుంది. కళ్లు మిలమిలలాడి నీటిచుక్కలు క్రింద పడుతాయి. అంతా నిశ్శబ్దం. ఆమె మొహంచూస్తే కష్టజీవి అని తోస్తుంది. అడుగులచప్పుడు వినిపిస్తుంది. తలుపు దభాలున తెరచుకొంటుంది.]

(ప్రవేశం తండ్రి—ఏభయి ఏళ్లు వుంటాయి. మంచి ఒడ్డూపొడవు. చేతిలో ఒకకఱ్ఱ. నెత్తిమీద ఒక చినిగిన తలగుడ్డ. పెద్దమీసాలు. నోట్లో పొగాకు. తూలుతూ వుంటాడు.)

ఒసేవు... ... ...(వెకిలినవ్వు)... ...హి... ... ...హి... హి... బువ్వ వండావు... (అని కుండదగ్గరకు వెళ్లి చూస్తాడు. ఏమీవుండదు) ...దొంగముండా ...బువ్వ వండకుండా ఏమి చేస్తున్నావు... ...

తల్లి

(లేచి) గంజికని గూట్లోపెట్టిన డబ్బు ఎత్తుకుపోతే—బువ్వ ఎక్కడనుంచి వస్తుంది అనుకున్నావు: పిల్లోడు యిందాక ఏడ్చిఏడ్చి పడుకున్నాడు.

తండ్రి

(తల్లిదగ్గరకువచ్చి) నామీద దొంగతనాలు కడతావు... నే నేరనుకొన్నావు.. హి...హి.. నామీద ...దొంగితనాలు కడతావు...ఊ...నామీద. ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు—ఎన్నిసార్లు చెప్పినా (అని తల్లిజుట్టు పట్టుకొని జరాజరా లాగి కొడతాడు.) ఇప్పుడయినా బుద్ధివచ్చిందా? (మళ్లీ తన్నుతాడు. 'అమ్మో' ...'అయ్యో' అని తల్లి కేకలు వేస్తుంది).

కొడుకు

(ఏడుస్తూ లేస్తాడు.) అయ్యో, అమ్మ నెందుకు తెగతాగివచ్చి కొడతావు. (అమ్మదగ్గరకువెళ్లి) అమ్మా ...లేవే (అయ్యో...అయ్యో అనే కేకలు)

తండ్రి

వెధవగాడిదా . . ఏడ్చి — ఏడ్చి పడుకొన్నా వుటగా...దొంగయేడ్పులు ఎక్కడనేర్చావు...గూట్లో రెండణాలు తీశావుకదూ .. దొంగవెధవా... ఎక్కడ పెట్టావో చెప్పు.. (కఱ్ఱతో కొడతాడు కొడుకు పెద్ద పెట్టున రాగాలు)

కొడుకు

అమ్మోయి. .నన్ను అయ్య చంపుతున్నాడు... అమ్మా.. అమ్మా . . అబ్బా (అని గుడిశెలోనుంచి బయటికి పరుగెత్తుతాడు. తలుపు బార్లా తీసివుంది.)

తండ్రి

నేర్చాడు బయటికి పరుగెత్తటం.. ఈ ముండే నేర్పింది...వాడ్ని గారాబాలుపెడుతుంది...ఎందుకన్నా పనికొస్తాడా...యివన్ని చెడిపోవటానికి...హి.. హి ... యిదే నేర్పింది (అని రెండుతన్నులు తంతాడు ఆమూలుగుతూన్న తల్లిని.)

తల్లి

రామా...రామా ... ఎన్నికష్టాలు తెచ్చిపెట్టా వురా (ఎక్కి ఎక్కి ఏడుస్తుంది, బాధకు ఓర్వలేక.)

తండ్రి

బువ్వ లేనే లేదు...ఒక అణా యియ్యి... బయటికి వెళ్లివస్తా....యియ్యి...యిస్తావా లేదా?

తల్లి

నాదగ్గరవుంటే బువ్వే వండిపెట్టేదాన్ని...ఏమి ...అబ్బా... లేదు... రామా!

తండ్రి

లేదు... లేదా...ఆమెళ్లో పుస్తె తెంచి యియ్యి ...నీకెందుకు... నేను యిచ్చినదేగా... ఏం ఆలిశ్యం (అని మీాదపడి...అయ్యో—అయ్యో అని ఏడుస్తుంటే తెంచుకొని బయటికి పోతాడు)

తల్లి

(వళ్లు పట్టుకొంటూ—యిటు అటూ సర్దుకొని)
ఒరేయి...నాయ...నా...రారా! వేళయింది...పడుకొందువుకాని...నాయనా!

కొడుకు

(తలుపుదగ్గరనుంచి తొంగిచూస్తూ) అమ్మా... అయ్య బయటికిపొయ్యాడూ? నన్ను తెగకొట్టాడే— అమ్మా నేను పరుగెత్తకపోతే...నన్ను చంపేశేవాడే అమ్మా.. తెగ్గ్రతాగివచ్చాడు. (లోపలికి వస్తాడు.)

తల్లి

అవునురా! నన్ను నడుములువిరుగకొట్టాడు— రెండు అణాలు తీసుకొన్నావని అంటే. రోజురోజు ఎక్కువయిపోతున్నది త్రాగుడు.

కొడుకు

నాకు నిద్ర వస్తున్నదే అమ్మా (అమ్మకాళ్లమీాద పడుకుని నిద్రపోతాడు. తల్లి కొడుకుఒళ్లు తడుముతూ వుంటుంది.)

తల్లి

(ఆశ్చర్యముతో) అయ్యో, నీబొడ్డులో ఎక్కడివిరా రెండణాలు (కొడుకు నిద్రపోతూవుండటం చూస్తుంది.) కర్మం! తండ్రి అంతవాడు అవుతాడు కాబోలు. తండ్రికి దొంగతనాలు లేవు. నాప్రారబ్ధకర్మం కాలింది. నాజీవితం అశ్రుధారలతో గడవాలసిందే. రామా! నీకయినా దయరాదా! నే నేమిపాపం చేశాను? రోజూ నీ ఆలయంలో నిత్యసేవ చేస్తా. నాకొడుకుని, నాకు అలివిఅయినన్నాళ్లు నీపాదాలదగ్గరకు తీసుకొస్తాను. తండ్రీ! నాకొడుకుని కాపాడు. వానిని రక్షించు. (అంటూ ఆవులించి ఒరిగి పడుకుంటుంది.)

గుడిశెముందర వీధి

(ప్రవేశం యిద్దరు పురుషులు)

మొదటిపురుషుడు

రోజు యిదే ఏడ్పుకదా! ఆమహాతల్లి ఏలా ఓర్చుకుంటుందో కదా!

రెండవపురుషుడు

ఏంచేస్తుంది, తెగత్రాగి వచ్చి యింకా డబ్బివ్వమని చావబాదుతుంటే! ఆకొడుకు తండ్రిలాగే తయారయ్యేటట్టున్నాడు. ఎంత ఓర్పు. ఎంతనిదానం. రోజూ తన్నులేకదా! మనకే విసుగు పుడుతున్నది.

(వెళ్లిపోతారు)

౨

[రామాలయం. వూరిబయటవున్న అడవిలో వుంది. ఒక పూజారి వుంటాడు. ఆలయంలో దీపం వెలుగుతూ వుంటుంది. జిమ్మని శబ్దం. అడుగులచప్పుడు. దీనాలాపం. నెమ్మదిగా తల్లిప్రవేశిస్తుంది.]

తల్లి

రా...మా! నన్ను ఎంత కష్టపెట్టాలో అంత కష్టపెడుతున్నావు. నాజీవితం నిరర్థకమయింది. ఎంత శరీరకష్టం చేసి సంపాదించినా రెండణాలు రావు. భర్తకు త్రాగుడుకు కావాలి ఆడబ్బు. ఇంటిదగ్గర బువ్వకు లేదు డబ్బు. ఇహ పిల్లవాని సంగతి చెప్పక్కరలేదు. వాడిదోవన వాడు తిరుగుతున్నాడు.

పూజారి

(అరవయి యేళ్లు వుంటాయి. పంగనామం పెట్టాడు. వెనకాల జుట్టు. దానిలో పువ్వులు. వంటిమీద గంధంపూత.)

అమ్మా, నీఅబ్బాయి ఏడి? ప్రతిరోజు వెంబడిపెట్టుకు వస్తుండేదానివి. నాలుగురోజులనుంచి రావటంలేదు. అయినా పెద్దవాడు అవుతున్నాడులే. చెడ్డ సహవాసాలు ముదిరాయని విన్నా. నీ వేంచేస్తావు పాపం, ముసలిదానివి!

తల్లి

(కళ్లనీళ్లు కారిపోతూ, యిదివరకు కొడుకు నుంచునే స్థలం చూచి) నాయనా, వీడు పెద్దవాడయి నన్ను వుద్ధరిస్తా డని—వాడు ఏళ్లలో పెద్దవా డవుతున్నకొద్దీ—నాఆశలు పెద్దవయి— నాకష్టాలు గట్టెక్కకపోతాయా అని అనుకొన్నా. ఎన్నిసార్లో వాడ్ని చూసి నాహృదయం పొంగి—ఆరిపోతూన్న నా జీవితాన్ని నిలుపుకున్నా. నా ఆశలన్నీ వాడిమీద నిలిపాను. కాని. . రామా! నాకు గతి ఈరామాలయం, వేరేగతిలేదు. నాకు యిదే శరణాలయం.

పూజారి

అమ్మా, ఎందుకు అంతగా విచారిస్తావు? అయ్యేది కాకమానదు కదా. కొందరిజీవితాలు నిరంతరకష్టాలతో నిండిపోతాయి. అందులో నీజీవితం ఒకటి. నీకేమయినా సహాయం కావాలంటే నాదగ్గరకు రా. నాకు చేతనయినంతమటుకు సహాయం చేస్తా.

తల్లి

అయ్యా, ఈ ప్రపంచకంలో దయ, కరుణ, జాలి, మృదుత్వమయినపలుకులు అనేవి నేను జన్మించినది మొదలుకొని అనుభవించలేదు, అనుభవించపోను. నా కొడుకు, యింకాకొందరు కలసి దారిదోపిడి చేసి వాళ్లను కొట్టి పొడిచి — ఒకడు చచ్చిపొయ్యాడుట. ఇప్పుడే దోవలో ఎవరోచెప్పుకొంటున్నారు—ఆడబ్బు తీసుకొని పారిపొయ్యారుట. దీన్నించి ఏంకష్టాలు ప్రాప్తిస్తాయో తెలియదు.

పూజారి

నీకు తెలియదేమో ననుకొన్నా! తెలిసింది. ఎవరుచేశారో ఎవరుచెప్తారు. నీకొడుకు వున్నాడని మటుకు విన్నా. న్యాయాన్యాయములు ఎవరికి తెలుస్తాయి. ఆరాముడే రక్షించాలి.

తల్లి

నిజమేనా నాయనా! సరిపడనివాళ్లు అన్నారనుకొన్నా. నాలుగు రోజులనుంచి యింటిఛాయల రాలేదు. వాళ్లతండ్రి అసలే రావటంలేదు. రామా! రామా! నాకు పుత్రభిక్షం పెట్టవూ (అని పెద్దపెట్టున ఏడుస్తుంది.)

పూజారి

కేసు విచారణకు వెళ్లాము. నిన్ను తీసుకొని వెళ్తాను.

తల్లి

ఇంకెక్కడికొడుకు—యింకెక్కడి విచారణ. నాకొడుకుని చూసేప్రాప్తి లేదు.. నాకు చావే శ్రేయస్కరం. నేను ఈకష్టాలు చూడలేను ఈపుత్రశోకం అనుభవించలేను. నేను చచ్చిపోతే ఈ రామాలయం సమీపంలో ఒక చెట్టుక్రింద పూడ్చివేయించండి. అంతకంటె ఈజీవితంలో నాకు ఆశ లేదు (వెళ్లిపోతుంది)

## 3

### వీధి

[ ప్రవేశం యిద్దరు పురుషులు ]

మొదటి పురుషుడు

విన్నావా ఎంత ఆశ్చర్యం అయినపనో —ఆ ముసలిది, తెలియదటయ్యా—పాపం! ఎప్పుడూ మొగుడు కొడుతూవుంటాడు — ఆమెకొడుకు దారిదోపిడిలో ఒకర్ని చంపేశాట్ట. ఈరోజున కేసు విచారణ అయి ముద్దాయి నేరస్థుడని ఋజువయిందట. ఆముసలిదానికి దిక్కెవ్వరు? ఆమె మొగుడా! ఎప్పుడూ తెగత్రాగి వూళ్లట్టుకొని తిరుగుతూవుంటాడు.

రెండవ పురుషుడు

నేరము ఋజువయితే ఉరిశిక్ష అన్నమాటే.

మొదటిపురుషుడు

అన్నమాటే. ఉరిశిక్ష వేశారుట. మొద్దులాగు నిలబడ్డాడుట.ఒకఏడుపు—ఒకవిచారం—ఏమీ లేదుట. ఎంత రాయిగుండె అయితేనేమి—తల్లి కోర్టుకు వచ్చిందిట వచ్చి శిక్ష వినంగానే 'నాయనా' అని క్రింద పడిపోయిందిట. కోర్టు అంతా గందరగోళం. ఈతల్లి కేక వినేటప్పటికి—ఒకతుపాను వచ్చినట్లు వచ్చింది—ఆ దుఃఖం పొంగిపోయి బావురని ఏడ్వటం మొదలు పెట్టాడు. తల్లి కొడుకు ఒకర్నిఒకరు కౌగలించుకొని అదే ఏడ్పు, పోలీసులు విడతీసేవరకు. వెళ్లేటప్పుడు 'నీకడుపు చెడపుట్టాను. క్షమించాలి' అన్నాట్ట కొడుకు. నాకుమటుకు ఆముసలిదాన్ని చూస్తే గుండె తరుక్కుపోతుంది.

రెండవ పురుషుడు

ఇంకేముందిరా! ముసలిది చచ్చిపోతుంది. ఎన్ని కష్టాలు అని ఓర్చుకుంటుంది. మంచియిల్లాలు.

మొదటిపురుషుడు

కాని జడ్జిగారు ఒకటిమటుకు చెప్పారుట. 'న్యాయవిధి నేను చేశాను. కాని ముద్దాయి వయస్సులో చిన్నవాడవుటచేతను, దుర్జనసహవాసంచేత చెడిపోయినాడు కాబట్టిన్ని, ఉరిశిక్షను యావజ్జీవశిక్షకు మార్చేందుకు సిఫార్సు చేస్తాను' అని చెప్పాడుట!

రెండవ పురుషుడు

అది ఎంతవరకు నిజమవుతుందో.

మొదటివాడు

తల్లికిమట్టుకు రోజూ కొడుకుదగ్గరకు వెళ్లేందుకు అనుమతి యిచ్చారుట.

రెండవవాడు

ఏముంది—అంతా విచారమేగా. ఉరిశిక్ష ఖాయపడుతే ఎన్నాళ్లు వెళ్తుంది. పగవాళ్లకయినా ఆతల్లి కష్టాలు వద్దురా. (వెళ్లిపోతారు)

## ౪

[రామాలయం. గుళ్లో దీపం. ఆలయముకు యిరవయిగజాలదూరాన వున్న ఒకచెట్టుక్రింద తల్లి పడుకొని వుంటుంది. మూలుగుతూ ఆవేదన పడుతూఉంటుంది. కళ్లనీళ్లు కారిపోతూ ఉంటాయి. ]

తల్లి

నాయనా! నేను నిన్ను చూడలేనురా. నా వల్లు నాస్వాధీనం కావటం లేదు తండ్రీ! రోజూవచ్చే అమ్మ రాలేదని ఎంత దుఃఖిస్తున్నావో—పాపం ఆ పూజారిని పంపాను, నేను రాలేనని చెప్పమని. "మంచి



తల్లి, బిడ్డ
(కాశ్మీరము)

V. R C,

ఉదారస్వభావుడు. దిక్కులేనివారికి దేవుడే దిక్కు. ఎన్నాళ్లని భరించేది ఈకష్టాలు. ఈ పాడు కృశించి పోయినశరీరాన్ని ఎప్పుడు విడిచిపోతాడు ఈజీవుడు. రామా! నాప్రాణం తీసుకొని నాకొడుకుని రక్షించు తండ్రి. వాడిప్రాణాలు కాపాడు రామయ్యతండ్రీ! చిన్నప్పటినుంచీ పెంచి పెద్దచేసిన వాత్సల్యం చంపుకోలేకుండావున్నాను రామా! నాప్రాణాలు నీ కర్పిస్తాను. (అడుగులచప్పుడు. పూజారిప్రవేశం. చేతులు చాచి లేవబోతుంది తల్లి. కాని క్రింద తూలిపడిపోతుంది) అయ్యా!...నా తండ్రి—నాపిచ్చితండ్రి—నాయనా—ఏంచెప్పాడు. దేవుడిలాగా నీవు కనుపించావు. నాదుఃఖయాత్రలో నీవు నిలబడ్డావు సహాయంగా— చెప్పు— త్వరగా నాయనా!

పూజారి

ఏముంది. నీవు రాలేదని జైలుకొట్టు అంతా తిరుగుతున్నాడు. మాటలు తడబడుతున్నాయి. రేపు వస్తే వస్తాయిట ఆర్డర్లు యావజ్జీవశిక్షవేశామని... రాకపోతే. ఎల్లుండి.

తల్లి

(ఆదుర్దాతో) అంతవరకు వచ్చింది—రామా! నేను ఈకష్టాలు చూడలేను. నేను యింక బ్రతకను. నాకు దడగావుంది. ఆయాసం ఎక్కువగా వుంది. (రొప్పుతూ) మానాయన—ఏలావున్నాడు.

పూజారి

ఏలావుంటాడు. మొహం అంతా పీక్కుపోయి ఎంతముసలివాడులాగున్నాడమ్మా! తల అంతా నెరసిపోయింది—ఒకపదిరోజులలో. మనస్సులో ఆందోళన ఎంతపని చేస్తుంది. ఆ.. ఆ. .యిది ఏమిటి (పడిపోతున్న తల్లిని పట్టుకుని తల ఒళ్లో పెట్టుకొని కూర్చుంటాడు.)

తల్లి

ఉ....ఊ....నాకు శ్వాస...తిరగటం లేదు. దా...హం...నాకొడుకు...ఉరి...శిక్షా...ఏలా భరి . .స్తావు....తండ్రీ.. .రామా.. .నీకు ఒప్పచెప్పా....పోతున్నా ... రా...మా. (కళ్లు తేలవేస్తుంది...గురక. పూజారి గబగబ ఆలయంలోకి పోయి అర్చనజలం ఒకతులసిదళం తీసుకొనివచ్చి తల్లినోటిలో పోసి, తులసిదళం నోటిలో పెడతాడు. తల్లి కళ్లు మూస్తుంది.)

పూజారి

(లేచి) ఎంతభక్తురాలు. మహా పతివ్రత. భర్త మాటకు కొట్టినా తిట్టినా ఎదురాడలేదు. మహాసాధ్వి. పుత్రశోకంతో మరణించింది. రాముని సేవ చేయనిరోజు లేదు. ఇటువంటి భక్తాగ్రేసరులు—ఏకులం అయితే మటుకు ఏమి—వున్నారుకాబట్టే భూదేవి ప్రోయ కలుగుచున్నది. లేకపోతే పాపాలతో భూమి క్రుంగిపొయ్యేది. రామా! ఈమె నీపాదసన్నిధికి చేరుకొన్నది. ఈమెఆత్మకు శాంతి చేకూర్చుము.

(ప్రవేశం యిరువురు పురుషులు. శవంవంక చూచి)

మొదటివాడు

తల్లి చనిపోయిందా! ఎంతవార్త. ఈమెను తెలియనివాళ్లు ఈ గ్రామంలో లేరు. ఎన్నికష్టాలు భరించింది. ఈమె కొడుకునకు ఉరిశిక్ష తప్పించారుటగా! తల్లి ఆకబురుకూడా వినలేదా. ఎంతకష్టం...

రెండవపురుషుడు

ఈమెకు యిచ్చటనే సమాధిచేయించాలి. నేను డబ్బుయిస్తాను. ఒక చలువరాతిపయిన "తల్లి...సాధ్వి...భక్తురాలు.....పతివ్రత...... పుత్రశోకమున చనిపోయెను" అని చెక్కిస్తాను.

పూజారి

అంతకంటేనా...మీరు ఉదారస్వభావులు.

మొదటిపురుషుడు

మంచిఉద్దేశ్యం. (అందరూ వెళ్లిపోతారు.)

*

[ ఒక ముసలివ్యక్తి ప్రవేశం. తలఅంతా నెరసిపోయింది. పెరిగినగడ్డం. చిరిగిపోయినవస్త్రాలు. చేతిలో

ఒకకఱ్ఱ. జడలుకట్టి జుట్టు మొహంమీద పడుతోంది. వెఱ్ఱిచూపులు చూస్తున్నాడు. ఇటూఅటూ చూస్తు న్నాడు. ఆవీధివెంబడి నడుస్తున్నాడు. వీధులన్నీ తిరుగు తాడు. ఆ గుడిశెవంక చూశాడు. తాను చిన్నప్పుడు గంతులు వేశినగుడిశె. కంటివెంబడి అశ్రుధారలు కారు తున్నాయి. కాశేపు అక్కడ నిలబడి తిరిగి ప్రయాణం సాగించాడు—చిన్నప్పుడు తనబాల్యస్నేహితుల గృ హాలవంక చూస్తూ. జనం పోతూవుంటారు వీధివెంబడి. కాని ఎవరూ మాట్లాడించరు. మొహం చూచి తెలియ నట్లు వెళ్లిపోతారు. కాళ్లులుకట్టి కంటివెంబడి నీరుకారు తున్నయి. ఒకనిట్టూర్పువిడిచి వూరిబయటవున్న రామా లయందగ్గరకు వస్తాడు. రెండుచేతులు జోడించి నమ స్కరిస్తాడు. పూజారి ఆశ్చర్యంతో చూస్తూవుంటాడు—ఎవరా యిది అని. ఈవ్యక్తి రామాలయంసమీపంలో వున్న సమాధి, ఆవృక్షం చూస్తాడు. ఆ చలువరాయి మీాద లిఖించినవి చదివి "అబ్బా! పాపిని—పాపిని" అంటూ తల బాదుకొని హృదయం పగిలేటట్టు విలపి స్తాడు. ప్రతిమవలె నిలబడిపోయినాడు రెండునిముషాలు. తిరిగి పయనం సాగించి ఆవూరిప్రక్కన వున్న నదీతీరం దగ్గరకు వెళ్లాడు. జలం ప్రవహిస్తూవుంటుంది. చీక టులు పడుతున్నాయి. పక్షులకోలాహలములు తప్ప వేరే శబ్దములు లేవు. ఆగట్టుమీాద కూర్చుంటాడు. కాసేపు కూర్చుని క్రిందకు ఒదిగి పడుకొని చేతులు వెనక్కి జాచుతాడు. ఒకశరీరం తగులుతుంది. లేచి కూ ర్చుంటాడు.]

కొడుకు

ఎవరది (అని ఆశరీరంవంక చూస్తాడు. శరీరం కదలి, తలయెత్తి కొడుకువంక చూస్తాడు. అది త్రాగి పడియున్న తండ్రి. ఒకర్ని ఒకరు గుర్తిస్తారు. యిద్దరు లేచి నుంచుంటారు.)

తండ్రి

నీవా....దూరంగా. వుండు...పాపివి...దొం గవి. యింకా బ్రతికివున్నావా. (అంటూ చేతిలో ఉన్న కఱ్ఱతో కొడుకుతలమీద కొడుతాడు కొడుకు ముందరికి వస్తున్నాడు. ఇంకోదెబ్బ వేస్తాడు. కొడుకు తండ్రిమీాదవురికి క్రిందపడవేసి గొంతుపట్టుకొని పిసుకు తాడు. తండ్రి చేతులు వ్రేలవేసి నెత్తురు కక్కి ప్రాణం విడుస్తాడు.)

కొడుకు

అబ్బా.. నాతల పగిలింది...నావళ్లు తూలిపో తున్నది. మంచినీళ్లు తాగాలి. (అని నదిలో దిగి నీళ్లు త్రాగటానికి ముందరికి వంగి తూలిపోతాడు నది లోనికి. నదినుంచి గుటకలువేసినశబ్దం. అంతా అంధ కారం.)



# భావయుగము

కుందుర్తి నరసింహారావు

వింటివా? సుఖస్వప్న పుష్పితము లైన
అడవితీగెలు మనత్రోవ కడ్డువచ్చె,
అర్ధరాత్రసంగీతమోహాస్రవంతి
అడ్డుపరచెను తీవయిల్లాండ్ర సొగసు.

కేకిసలుగొట్టు, పడమటి కెంపుగిరుల
పరచియుంచిన లేయెండపరుపుమీద
నిదురకన్నుల నిసుగైన నిండునెలను
లేచిరమ్మని తల్లి లాలింపలేదు.

చెలి, ముఖస్నిగ్ధ పర్యంకసీమలందు
ప్రాతతెన్నుల కలవాటుపడిన మనము
కోమలీలోచనవిషాదకుంచితములు
నవ్యహృదయపథాలలో నడచు టెట్లు?

ఆరిపోయెను గగనవింధ్యాద్రిగుహల
మిణుగురుల ప్రోవు వెలిగించు మేలుకొలుపు,
జారిపోయెను మోహసంబంధమధుర
ప్రాక్తనవిషాదసంశయప్రణయపథము.

భావపురుషప్రపంచక ప్రాంగణమున
అగరువత్తులు వెలిగించినట్టి నీవు
చెలి, చిరంతనవిపద్దృశ్యమలిన మైన
తులువకనుగవ నీచేత తుడిచిపొమ్ము.

కట్టుకొన్న పాపాల శంఖారవంబు
హోరుమని కర్ణపుటములలో రుతించు:
తెచ్చుకొన్న శత్రువుల సాధించలేక
బధిరత నటించుచున్నాను పరులముందు.

తూరుపు మొగాన పొడిచిన తోకచుక్క
అందుకొనియె ప్రతీచీలతాంగి కేలు
ఇతరతారకలటు పరుగెత్తబోయి
మాయమయ్యెను రోదసీమధ్యమందె.

జర్జరితలతికా భుజస్కంధమందు
వచ్చిపడె స్వీయసంతానభార మొకటి,
పారలౌకిక చింతానిబద్ధగగన
వాయునిర్మితశిర మట్టె వాల్చవలసె.

తొలుత నాయింట పగడాల తోరణాలు,
ముంగిటను మల్లెమొగ్గలే ముగ్గులయ్యె:
ఇపుడు నే నిల్లువాకిలి యెల్ల వీడి
అడవితీగెల నీడలో ఆడుకొందు.

'నవ్యయుగసృష్టి యింక నెన్నాళ్లుపట్టు,
మానవులకు రెక్కలువచ్చు మార్గ మేది?'
అనుచు నన్నేల ప్రశ్నింతువయ్య నీవు?
యువకుడా, అది నీచేత నున్న దేమొ—

మబ్బునడిలేని యీమధుమాససమయ
విపిననిశ్శబ్ద సౌందర్యవీధులందు
కోకిలాంగన తన గొంతుకోసికొనును
పట్టపగ లింటియుడురాజు పగలబడగ.

చెలి చెలీ, ముగ్ధగౌతమీసికతభూమి
త్రోవతప్పితి, నను వీడి తొలగిపోకు:
వెనుక నడులెల్ల ప్రౌఢలై వెంటవచ్చి
త్రోవ చూపించెడివి మాకు లేవు నేడు.

శిథిలశృంగారసౌధవాసిని యొకర్తు
ప్రియవియోగచింతాభరవివశ యగుచు
నేటి చంద్రుని గని, కట్టుబాటు విడిచి,
ప్రేయుని మారుగ వానిపై ప్రేమగురిసె.

పుప్పొడివిదిర్చిన గులాబిమొగ్గ విరిసి
తన యశస్సు జగాల నింపినది నగుచు,
మూసికొనియున్న గన్నేరుమొగ్గసొమ్ము
దాచుకొనెనంచు పొగడెను తాత వచ్చి.

రక్తరాగాట్టహాసముద్రావికాసి
పశ్చిమాశాకుమారుని పైడిడాలు
నిముసమున ఋక్షగణరంధ్రనిలయమగుట
చెప్పకేచెప్పు నీనాటి చిత్తశుద్ధి.

లెమ్ము, పూదండ సవరించుకొమ్ము, చెలియ
వాడిపోయె నీయుద్యానవనములెల్ల
మన ప్రబంధములో! పేదవాడనైన
నేను తేలేను నందనోద్యాననిధులు.

నీవు రమ్మింక, విరహపాండిత్యబధిర
గహనరోదన విషకర్మకాండ విడిచి
ప్రణయ మొదవక యెట్టులో బ్రదుకవచ్చు,
పట్టెడన్నము నేఁగా కావలయుగాదె?

పసరుపిందెల గొరికిన పక్కిరేడు
వటకుజచ్ఛాయలో మేను వాల్చియున్న
తీర్థసేవకు డితని కాతిథ్యమిచ్చె,
దినకరాతపమున బోవు మనల విడిచి.

చెలి, యిదే, లేతయుసిరికచెట్టుకొనల
వగరుపిందెలపై ఈఁగ వ్రాలలేదు,
నిసుగు లాచాయలకు బోవనేర్వలేదు!
ఈయనుభవజ్ఞు లేల లెక్కింతు రిట్లు?

విమతసహిత చింతాభగ్న విప్రలంభ
జనితతాపానలజ్వాల చల్లబడగ
మలయపవనుడు దిగిచిన మంచుతెరల
మన తొలిపథాల వెన్నెల మరుగుపడియె.

నికటదేశచరన్మేఘశకటములకు
వెండిజండాలు గట్టిన వింధ్యశిఖరి
తనకు దూరమైపోనున్న తరిని వాని
రజతగతి లాగికొని వట్టిరాళ్లు చూపె.

లేచిర మ్మింక, పెంపుడులేడినొసట
బొట్టు పెట్టుకాలము దాటిపోయె నిపుడు,
సరసికెరటాల దిరుగు చందురుని జూచి
తామరాకంత కన్నులు తడుపు నిదియె.

మంచికో చెడ్డకో త్రోవ మారిపోయె:
వెలిసినది నూత్న దేవతా విగ్రహమని
త్రోవ కడ్డమువచ్చిన తొలగిపోతి,
కానివో, కాదె ఘోరసంగ్రామ మపుడె?

పీడిపోలేక యేడ్చుచున్నాడు తరణి
ప్రాగమృతభాండమునకు కరంబు సాచి,
పొడుచు రిక్కల తూరుపు ముసిముసినగు
పగులువారిన దానిమ్మపండువోలె.

మోహితుడనైతి, చెలి, భవన్ముఖతలస్థ
తరళమధుపాత్ర గని! దయార్ద్రవు, నిజమ్ము,
నీవె క్రోలుము మధువెల్ల, నేటినుండి
పాత్ర నానోటి కందించి బ్రదుకనిమ్ము.

మోసగించుచున్నది కనుల్ మూసి తిగిచి
మానవుల వింతరూపాలు మరుగుపడగ,
భిదురమో, మెరపో అనిపించుచున్న
మొగిలు ముత్తైదువులచేతి ముద్దుబిడ్డ.

కళవళించెడు మనగుండ్లకమ్మదరుల
పొదలమాటున బెబ్బులి పొంచియుండె,
నిన్ను గని వెరగందిన వన్నమాట!
ఏల, లేకున్న, దాగుట యేడ్చుటయును?

రజనిశిరమున నవరత్నరాశి గురిసి
బేలతనము నటించిన పిన్నవాడు
ఆమె తలవాల్చువేళ మోహాంధు డగుచు
సోయగము వాయుచున్నాడు, చూచిపొమ్ము.

పగలు గడచినగాని సంపెగలు పూచి
మగలుగావు శిరోజంపు నిగనిగలకు,
చెలి, ముడిచికొమ్ము, నిగళవిచ్ఛిన్నమైన
దానిపై వచ్చిపడునో యేకానిపూలు!

వినుము, రిపుదుర్గగోపురధ్వనితగగన
హాసవిన్యాసచరమఘంటారవంబు
జననిపగడాల మొగసాలచాయ నిలిచి
విని తెలిసికొమ్ము నిదురకు వేళ యెపుడొ!

---

# అభిసారిక

శిరోమణి, సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

మైమఱచి నిద్రగొన్న సమస్తజంతు
వితతిహృదయబిలంబుల వెలికివచ్చి
మసలెడు తమశ్చయంబన దెసలనెల్లఁ
గటికచీఁకట్లు కార్కొని క్రమ్ముకొనియె.

పడకగది వీడి మెలమెల్ల గడియఁదీసి
తలుపుఁ జీమకు దోమకుం దెలియరాక
తనదు వలపులరాయని, ధనపుమూటఁ
గొల్లగొన నేగుచున్నది కొమ్మ యోర్తు.

తన్నుఁ జూచియుఁ జూడకయున్నపగిదిఁ
బ్రకృతియెల్లఁ దటస్థభావము వహింప
బయలుపడనీక తన నడవడి నొకింత
మింటఁ జుక్కలగమి యొక్కకంటఁ గావ.

తనదు ముఖచంద్రు వెలుఁగుమొత్తంబు లంధ
తమసముల నొత్తగించుచు దారిఁదెలుప
మలయమారుతములు దన కొలువుకత్తె
లట్లు నలువంకలం జుట్టి యనుసరింప.

హృదయ మాశంసితంబైన మదనకేళి
కలన నానందసాంద్రంబుగా లయింపఁ
బాదములు తొట్రిలంబడఁ బైఁట జాఱ
నవశభావంబు నొంది యాయువతి నడచి.

మొలిక తిరుగుళ్ల సందుగొందులను దాఁటి
కాలిబాటను బాదలును జేలు గడచి
పంటచెఱువుకెలంకునఁ బాడువడ్డ
గుడిని నిద్రించు బుద్ధునిఁ దడవి తాఁకె.

తాఁకుటయు లేచి కూర్చుండి తత్పరమతిఁ
బుణ్యనామసంకీర్తనంబును జలుపుచు
ధర్మసూక్తముల్ చదువుచుఁ దరుణయోగి
శిష్యవిభ్రాంతి నాపెపైఁ జేయివైచె.

అతని గాత్రసంస్పృష్టిమహత్త్వమేమొ?
మదనకేళీప్రసంగంబుమాఱె మఱచి
శిష్యగాఁ గొని దీక్ష నొసంగ వేఁడె
సప్రయత్నంబుగా వ్రాలి యడుగులందు.

---



# తల్లి—బిడ్డ

ఉభయభాషాప్రవీణ, మిన్నికంటి గురునాథశర్మ



ప్రణయమనుచుఁ గూర్మియనుచు రాగమనుచు - వలపటంచుఁ గన్నీటి తర్పణమటంచు
హార్దమనుచుఁ బల్కునవెల్ల స్వార్థపరము - లొక్క తల్లిప్రేమంబె యత్యుత్తమంబు.

నాకనుంగవ గిఱ్ఱునం దొట్టు నీర మయ్యావిదశోకాబ్ధి కర్ధోదయంబు
నాబోసినోటి చిర్నగవుసొం పామె మొగముచందురునకు రాకాగమంబు
నా వచ్చిరాని ప్రన్ననిపల్కుఁజా లామె జానుగుంగవకు రసాయనంబు
నామెయి నాఁచికొన్న యలంతిబాద యాయమధైర్యశాఖికి నశనిపాత
మస్మదీయపాదోల్లస ద్ధైమనూపు-రోదితఝుళంఝుళన్నినాదోల్బణంబు
ఆమెమేనికిఁ బులకవర్షాగమంబు - జననివాత్సల్య మెంత ప్రశస్యతమము!

ఇది చేయందగు, నిద్ది చేయఁదగ దిట్టీకార్యముం జేయఁగ
ల్గ, దిటుల్ చేసినఁ గల్గుఁ గీ డని యెఱుంగన్ లేని పౌగండు న
న్నదిరా వేగనులం గనుంగొనుచు నెం దావంత యావంతయేఁ
గదురన్ రాని తెఱంగున న్మనిచె వేడ్కం దల్లి దైవంబె కా.

ఏను దిన్నదో గఱ్ఱునఁ దాను ద్రేంచు - నే నలంకృతుండను గాఁగఁ దాను మురియు
నేను బాధితుండనుగాఁగఁ దాను గుందు - నేను సుఖపడ నానంద మొనయుఁ దాను
వింతమైనదిగద తల్లి ప్రేమవృత్తి.

నాకుఁ బెట్టికాని యాకె భుజింపదు - తాను దినక నోటిలోనిదైనఁ
దీసి నాకుఁ బెట్టి తృప్తిసెందును దల్లి - కడుపుఁదీపికంటెఁ గడుపు దీపె?

నాయారోగ్యము నాసౌఖ్యాయతి నే నెఱుఁగకున్నయప్పుడు నాకె
న్నో యుపచారములు మురిసి - చేయుచుఁ బెంచినది తల్లి చెల్లదె పొగడన్!

తన కందమైన రవణము-లను బెట్టుం దనకు మెప్పులంగొల్పు దుకూ
లనికాయము గట్టన్ సొగ-సు నెఱుంగని నాకుఁ దల్లి శుద్ధప్రేమన్.

పగవాఁడైనను బాలుం-డుగదా యని తాను దినియెడు పదార్థం బే
పగిదినో పెట్టును మాకు నో-నఁగునట్టులఁ దల్లిగుణము శంసయొనర్తున్.

ఘుమ్మున కమ్మతెమ్మెర బుగుల్కొన నవ్వుదు కాఁగు నావునా
జ్యమ్మున దొప్పదోఁగి మృదువై చవులూరెడి రాజనాల య
న్నమ్మును బల్మి నాదు వదనంబున నించుచు బుజ్జగించుచున్
సమ్మతి మ్రింగఁజేసెడిని సాధ్వి మదంబ యదెంతప్రేమయో!

చూచినవెల్ల బెట్టు మనుచున్ హఠమూని పదాల కడ్డమై
రాచుకపోవు గొంతు పెనుఱంతులఁ జింతిలుచుండఁ జంకలో
వైచుక యశ్రులాలలను బాపుచు నేడ్వకుమంచు నాయభీ
ష్టాచరణంబునం బొదలు నమ్మక్షమాగుణ మేఁ దలంచెదన్

తీయనిపండొ ఖాద్యమొ యదే భుజియింపుమటంచు నెవ్వరే
నీయఁగ మాకు నిర్వురకు నేఁ ద్రుటి నాయది మ్రింగివైచి పై
నాయమఁ జూడ నామె దరహాసముమై నను జీరి నాయనా,
యీయది తిన్మటంచుఁ దనదిచ్చెడిఁ దల్లి యదెంతప్రేమయో?

అల్లరి చేయుచునుండఁగ - మెల్లఁగ నను జేరి నగుచు మేనునిమురు చీ
'పిల్లఁడు' కృష్ణుఁడు సుమి యను - తల్లిసహనశక్తిప్రేమ తత్త్వము తలఁతున్

నను జూచి యొరులు రోఁతపడినఁ గాంచి సహింపలేదు డెందంబుననై
నను దాఁ దలపోయద నల్లని నాయాకృతిని లాలలన్ జనని తమిన్.

జడకుప్పెలతో వ్రేలాడెడి జడ ముంగురులపై ముడిన్ గల్కితురా
మెడసొమ్ములు కాల్గజ్జెలు - కడియము లుంగరము లొప్పెఁగా నాశిశుతన్ .

నిగనిగలాడు మొగమ్మున ఘుమ్మను నీలపుఁ గస్తురిబొట్టిడి క
న్నుఁగవను గప్రపుఁ గాటుకరేకలు నూల్కొనఁజేసి కరమ్మున నె
మ్మొగ మొకయించుక యెత్తి కనుంగొని బుద్ధి నెటుల్ దలపోయునొ న
ల్లగ నొకచుక్కను వామకపోలతలంబున నుంచెడుఁ దల్లి భళీ!

అడుగఁగ నోరులేక నడయాడఁ బదంబులులేక చిత్తమం
దడరిన వస్తు వియ్యది యటంచును జూపఁగఁ గేలులేక చే
డ్పడిన శిశువ్రజంబునకు బ్రహ్మ ఘటించెనొ యేడ్పుసత్తియం
చెడఁదఁ దలంచుఁగాని యెపుడుం గసరం జన దమ్మ యింతయున్.

పోకిరిబాలురఁ గలిసి యెవో కొంటెపనుల్ వొనర్పఁ బాడమెడి కినుకన్
'నీకడుపు పండ' యనియెడిఁ - గాక జనని నన్నుఁ దిట్టఁగడఁగద యెపుడున్.

తాఁకునది తప్పునది యేవీఁకం దెలియంగలేక, విన్నఁదనంబున్
శోకం బభీష్టసిద్ధికి - సాకుగ శైశవము జాతె సౌఖ్యాంబుధిలో.

చెడుగుడొ? చెలపట్టియొ కుందుడొ బంతియొ పుట్టచెండొ దొరయాటయొ దాఁ
గుడుమూఁతయొ బిళ్లాటయొ - యొడలు చెమటపోయ నాడుచుందుం, బిదపన్.

ఇంటికి నక్కుచు రా నొక-కంటం గనిపెట్టి నానగా రెఱేఁగిన వోఁ
దంటా లుభయులకును నీ - వింటనె చదువుకొన కిట్టు లేగుదువటరా!

వేళాపాళా లేదా ?- కూళలతోఁ గలిసి యాడుకొనుటయె యిఁకఁ బా
ఠాలను జదువుట యెప్పుడు ? - చాలవె యాటవిడుపుదివసంబులు రెండున్ ?

అని తెప్పవడనిమాపునఁ - గనుచు నపట్కర్ణరవముగాఁ బల్కుచు న
క్కన నొత్తి ముంగురులఁ దన - కొనగోళ్లం దువ్వఁ దల్లి కొండిక నన్నున్.

మీఁపంతు లేల రాలే - దాపద్యం బనుచుఁ గినుక నఱచుచు బాదన్
వాపోవు నిన్నుఁ గని నిలు-పోపునె నాప్రాణ మనుఁ బ్రసూత్తంసంబున్.

ఇచ్చినవాఁడున్ మఱచిన - నొచ్చెల యేండ్లింతలోన నొట్టవె? వీఁడుం
బచ్చంగ నున్న నెన్నఁడొ - ముచ్చటగాఁ గనుట యనుచు మురియు జననియున్.

నాపున్నెమ్ముల పంటయు - నీపగిదిం గృతుల వ్రాయు నిటునలుగురిలోఁ
జూపట్టు మిన్నయై యని - చూపు శుభోదర్కమునను జొనుపుఁ గనికవిన్.

పౌరాణికకథాప్రపంచంబు వినిపించెఁ బ్రతిదినంబును నుగ్గుఁబాలతోడ
భక్తిప్రబోధ మాసక్తిఁ గావించెను బాటించుచును లాలిపాటతోడ
నీతులుగఱపె మేల్ చేఁతలఁ జేయ నొప్పెడురీతి జోకొట్టునుడులతోడ
ఆశ్రమాచారధర్మాళి బోధించె సంప్రీతి బోర్కాడించు క్రియలతోడ
భళి! యుదాత్తాదులం బల్కు పద్ధతులు గ-డుం గఱపె నాకు వెన్నఁబెట్టుటలతోడ
నస్మదీయ భావ్యభివృద్ధి కన్నియున్ని-యనఁగరాని యిడుమ లందె నమ్మగారు.

తలిదండ్రులు పేదఱికము-వలనం బాదవడుచున్నఁ బాటింపక ని
చ్చలుఁ జూచినవెల్లం గా-వలయు ననుచుఁ బోరువెట్టు బాల్య మ్మరిగెన్.

ప్రొద్దున నేడ్చుచు లేవ - న్నిద్దుర, తత్క్షణమ చెంత నిలిచి పిలుచుచున్
ముద్దిడి కేలంగొని య-క్కద్దుకొనెడిఁ దల్లి నన్ను నాసుఖ మరిగెన్.

అన్నము దిని చని నాయీ - డున్న సఖులతోడఁ గూడి యుల్లాసమునన్
వెన్నెలకుప్పల నాడుచుఁ - గన్నమ్మకు ముదముఁగూర్చు కాల మ్మరిగెన్.

అవి చిన్ననాఁటి సుఖములు - నవుదేతెడిమోముతో జనని త్రచ్చుచుఁబాల్
నవనీతము మీఁగడపెరు - గవశ్య మిడి కొసరికొసరి యన్నముపెట్టున్.

అయ్యవి యెన్నటి మాటలొ - క్రయ్యం ద్రాడుగల బుజ మొరసి వ్రేలెడి యా
కొయ్యపలక దస్తరముం - జయ్యనఁ గొని శ్రీకి బడికిఁ జకచక చనుదున్.

అవి చిన్ననాఁటి సుఖములు - రవిపుట్టనికాలమున శిరఃస్నానము మో
ము విభూతి బద్ధపరిధౌ-తవస్త్ర ముఖలేశు ధ్యానతత్పరత భళీ!

ఇది కష్టం బదిసౌఖ్యం - బిది లే దది యున్న దను వికృతిపొందని నె
మ్మది హాయిగఁ దినితిరిగెడు - నదృష్ట మది బాల్యమందె యరిగెను నాకున్.



భావన




"ఎవరు వారు ?"

"నేను కోంమ్ముశ్రోత్రిని చయనులుబాబయ్యలా వుంది"

"అవునురా నాయనా! అంతా క్షేమంగా వున్నారా ?"

"నీఆశీర్వచనం నువ్వు కులాసాగా వచ్చావా ?"

"జిజ్ఞున చీవలేమురా యీమాటు"

"చాలారోజులికి వచ్చావు ఫాల్గునంలోకామా—"

"అవునవును. పదిమాసా లయింది."

"వెళ్లినపని తృప్తిగా—"

"తృప్తన్న తృప్తా ? కురిసి పోయాయిరా రూపాయలు చెట్టు దులిపినట్లే మహామంచిసంపాదన జరిగిందిరా యీ ప్రయాణంలోను."

"పునహాసతారాలు వెళ్లి ను వ్వెప్పుహూ తక్కువ తేలేదు, కాని నిలవమాత్రం చేశావుకాదు."

"దానిసిగ్గోసిన నిలవ. డబ్బా ప్రధానం దర్జాకానీ. . ఇంతకీ; మనిషిని ధనం నిలవచేస్తుందా, ధనాన్ని మనిషి నిలవ చేస్తాడా ?"

"అదీ నిజమే"

"ఇంకేం మరీ ? ఎప్పుడు కావాలంటే అప్పుడే అవుతుంద సంపాదించేవాడికి నిలవ పిడికిలి గట్టిగా బిగిస్తేసరీ."

"తలుచుకుంటే నువ్వు నినుపాలమీద వేలు నిలవచేస్తావు"

"అవునుగదా ? .. కాని చిపుకులగామిగాణ్ణి మట్టంచేసీ దాకా నిలవచెయ్యడంమాట తీసెయ్యి నాదగ్గిర"

"నీపట్టుదల మహాచెడ్డది బాబయ్యా!"

"కాకపోతే వా ణ్ణిక బతకనిస్తానుట్రా నేనూ!"

"నీకు కోపంవస్తే అంతే."

"నేను దేశంలోనే లేనుకదా అని కిలకిల్లాడుతున్నాడు. కామోసునేం వాడు ?"

"ఇంకేనా శాంతించవూ పెద్దబాబయ్యా ?"

"శాంతించమంటావా ? శాంతించేపనే చేశాడా వాడూ ?"

". . . . . ."

"నాఅంతర మేం, తనఅంతర మేం ? నిండుసభలో తీసి పారేస్తాడా నన్ను ? రెండోతాంబూలం యిప్పించడూ నాకూ ?"

"నిజానికి వాడు తొందరపడ్డాడు; కానీ—"

"ఇక కానీయెందుకూ మరీ?.. ...తోటపంపుతనఖా అయి పోయింది కదా ? కొంపవేలంవెయ్యడమే తరవాయిగదా ? ఇకరంగ సానిబాడవా ? చూస్తూవుండు, ఈ దెబ్బతో అది క్రియమే."

"నువ్వు తలుచుకున్నావంటే —"

"తిండికేనా సరిపడ్డ ధాన్యం రావుకదా నామీద కక్షుకడ తాడా ?"

". . . . ."

"నాతో విరోధపడ్డాకేనా వాడికి దిగతీత ప్రారంభం ?"

"అవును."

"అజ్ఞానం వుండాలా అక్కర్లేదా ? దీపంమీద పడ్డ శలభం లాగ మాడిపోవాలి; గాని నాతోపోరి—"

"ఇప్పటికేనా వాడికి బుద్ధిరావలసింది."

"ఇంకా యేమేనా వాగుతున్నాడా యేమిటి ?"

" వాడి మాటకి జమేమిటి, పద్దేమిటి పోనిస్తు బాబయ్యా! "

" అయినా సంగతేమిటో కాస్త చెబుదూ వోరే! "

" చెప్పేదేమిటి పదిమాట్లు? ఎవ్వరికి తెలవం దేవుంది? "

" తిడుతున్నాడా యేమిటి? "

"..  .  .     .     .     "

"కవిత్వం అల్లుతున్నాడా?     ఆమధ్య ఛందస్సేడి తాడుకాదూ భట్రాజుదగ్గిర?"

" వాడిమొఖం. కవిత్వమే ?"

" మరేమిటే? "

" ఇక మూడో తాంబూలంకూడా ఇప్పించకుట నీకు"

" ఏమో?"---

" రెండుతాంబూలాలు మొదట కర్మజ్యేష్ఠులికి వెళుతున్నాయి కనక యిక మూడో తాంబూలం విద్యాధికుడికి వెళ్లడం ధర్మమట "

" ఆలాగేం ? "

" చాలాబింకంగానే చెబుతున్నాడు కభుర్లు "

" ఆ ? "

" ఇంతకీ · కొంపెల్ల వెంకప్ప వాడితో కలిశాడు నువ్వు వెళ్లిన నెల్లాళ్ళకి. "

" బాగుంది .. .. ఇది వాడి పురమాయింపే అనుకుంటాను. "

" ఇద్దరూ వొక్క మాటమీద___ "

" జోగీ జోగీ రాసుకుంటే బూడిదరాలిందిట. "

" మహాబాగా చెప్పావు "

" వెంకప్పగాడి బతుకు మనచేతిలో వుంది "

" ఎలాగా? "

" వాడు బోడ్డుపెరుమాళ్లుశెట్టికి యెనిమిదివందలికి నోటు రాశాడు, యెరుగుదువా? "

" రేండేళ్లు దాటింది. "

" శెట్టి యెన్నిమాట్లడిగినా "యిదిగో", "అదిగో" అంటూ వచ్చాడుగాని దమ్మిడీఅయినా వసూలుపెట్టలేదు "

" అయితే? "

" శెట్టి యిక ఆగడు "

" దావా___"

" సగంఫాయిదా యిస్తే నోటు నాకు ట్రాన్సుఫరుచేస్తానన్నాడు శెట్టి. "

" అదెప్పుడు? "

" ఇక నెల్లాళ్ళకి నేను వెళతా ననగానూ "

" ఇక పొలమూ, కొంపాకూడా జప్తన్నమాటే."

" ఇక చూసుకో నాప్రతాపం "

" ఇంతకీ జమ యేమాత్రం బాబయ్యా? "

" అంచనాకట్టు "

" సహస్రం. "

" ఛా! ఎప్పుడూ లేదూ "

" రెండు___"

" దాన్ని రెంటింట గుణించు. "

" అబ్బా!"

" ఏమనుకున్నావు మరి ? "

" అయితే రామదీక్షితులూ, వెంకప్పా చచ్చారన్నమాటే. "

" వెధవల్ని తిప్పితిప్పి కొడతానుచూస్తూవుండు నువ్వు నాలోవాడవేనా ? "

" నాలోవాడవేనాఅంటే నాసంసారంసంగతి నువ్వెరగంది కాదు ఏరోజున అర్ధరూపాయి లేకపోతే ఆరోజున___ "

" ఏమంటావు ? "

" నాదారిని నన్ను పోనియ్యి "

" నువ్వు దివాన్గిరీ బాగా చేస్తావు. నువ్వు నాపక్షంలో వుంటే తక్కిన నాపనులు ఆగిపోవు "

" నేను పూనుకోవడమే వస్తే ప్రాణం యిచ్చేయ్యాలసిందే, వెధవకృత్రిమం నాచేతకాదు బాబయ్యా!"

" అందుకోసమే___వొక్కకాగితం పారేస్తాను, పుచ్చుకో "

" .       .. "

" ఏమంటావు ? "

"    ..    ..    "

" ఆలోచించుకో. "

"    ..    ...  "

" ఎన్నిపెళ్లిళ్లూ వొడుగులూ చేయిస్తే రానూ వంద రూపాయలు ఇంతకీ! నీ కెన్ని ఆశ్రమా లుండినా యేడాది కెన్ని శుభకార్యాలు తగులుతాయీ పెద్దవీ? "

"    .. .. ..    . . "

" భయపడకు. "

" కొడతారనీ, తిడతారనీనా ? "

"నేనేం తక్కువచెప్పలేదు మూడుపుట్ల ధాన్యం అన్న మాట."

" .                .''

"గాది బాగుచేయించుకో "

"అలా అన్నావా?"

"అంతే అనుకోకు యీ భైచాపులు అసమానమైనవి దొరికాయి. నాలుగు—అరడజ నిచ్చేస్తాను, దర్జాగా కట్టుకో "

"   ..         ."

"నీకొడుక్కి కూడా బట్టలూ, పుస్తకాలూ యిచ్చేస్తా నీయేటికి ఏం?"

"నువ్వు పేరుపేరువరసని యింటిల్లపాదికీ—"

"ఇక కోడలికిమాత్రం బంతిలో బాలపక్షంచెయ్యడం యెందుకూ? వొకపునహాచీర దానిక్కూడా పట్టుకుపో."

"మాఅత్తారేనా యెప్పుడూ యిలాగ సంతోషపెట్టలేదు—"

"వాళ్ల మొఘం ఏమంటావు మరీ?"

"ఇక తప్పుతుందా?"

"ధీమాగా చెప్పావుకాదు."

"పనిచెయ్యాలా, మాటచెప్పాలా ధీమాగా?"

"అయితే సరే. మధ్యాహ్నం కనపడతావుకాదూ?"

"రాయవరం వెళ్లాలి వొకక్షణం వుండి. అక్కడ నవగ్రహశాంతి-అర్ధరూపాయేనా ముట్టుతుంగి "

"పోనియ్యకు "

"పున్నానికి బియ్యం అయిపోతాయంటోంది నీకోడలు."

"రేపే కొలిపించేస్తాను ధాన్యం, కొలగాడితో చెప్పి. వాయిగావేస్తా ననుకున్నావా యేమిటి?"

"అబ్బే నువ్వు దాటేస్తావనా?"

"మరి వెళ్లు సాయంత్రం—"

"తప్పకుండానూ "

"గప్‌చిప్ "

"వేరే చెప్పాలా?"

"అయితే. ‹వూళ్లో వున్నట్టేనా?"

"ఎవరూ? ఆ! ఆ! నిన్న పొద్దున్నే వచ్చింది మేళానికి వెళ్లి. దంశిగానే లాక్కొచ్చిందిట యీమాటు కోనసీమ దోచేసింథని చెప్పుకుంటున్నారు "

"అసాధ్యురాలురా అదీ........నేనుకనక లొంగి నమ్మకంగా పడివుంది."

"అవునవును. రామదీక్షితుల్ని నోరెత్తాటప్పటికి విసిరికొట్టింది, మరిచిపోతానా?"

"ఆపరాభవం చాలదుట్రా వాడికి? నీలాచలా న్నలా నిలపగలిగేడా వాడూ? నన్ను చూసిందంటే కుక్కఅయిపోదూ అదీ?"

"నీచేతికి యెముక లేదుకనక."

"చూడూ, పాకేసీచోట పారెయ్యాలి. వొక్కమాసం తిరిగానంటే సానికి సంవత్సరంపోషణ. లేకపోతే మర్యాదా నిలుపుకోగలమూ?"

"నీశక్తి అలాంటిదే మరి తోటలోకి వెళ్లి చక్కా వస్తాను."

"పద .       పోనియ్యరా కుర్రాడా బండి. పెద్దవీథికే పోనియ్యి, కరణంగారి యింటిదగ్గిర మళ్లించవచ్చు. చూడూ. వూళ్లోకి వెళ్లాక గాలప్పరుగుమీద వెళ్లాలి గుర్రం. తెలిసిందా?"

౨

"ఏమట్టుకి వచ్చిందిరా కథా?"

"ఏమట్టుకయితే యేం? నేనేమో తప్పకుండా నెగ్గేస్తాను; కాని మూడురోజులకిందట వూరికి వెళ్లింది "

"ఏవూరూ?"

"రామేశ్వరం."

"ఏమిటీ?"

"అదే వచ్చింది చిక్కు."

"చక్రం అడ్డుపడెయ్యలేకపోయావా?"

"కుదిరిందికాదు."

"ఇక ముందుమాట యేమిటి?"

"నేనూ అదే ఆలోచిస్తున్నాను "

"పోనీ, యిదేఅన్నమాట యేమిటి? మరోటి చూడూ"

"తీరా, ఫలోన్ముఖం అయినాక యీస్వల్పకారణంకోసం విడిచిపెట్టనా? చేదాయేమిటి? మీరంతా వుండనేవున్నారకదా మార్గదర్శకులు?"

"మాలాగే వుండాలా నువ్వూనూ? అయినా అంతఅశ్రద్ధగా యెందుకున్నావూ?"

"అశ్రద్ధకాదు వ్యవహారం అంతా వడీదుడుగ్గా వచ్చేసింది."

"ఏమిటదీ?"

"అసలు రామేశ్వరంయాత్ర హఠాత్తుగా—అంటే సూచనేనా లేకుండా తటస్థించింది. సోమిదేవి మేనత్త తనకూతుర్ని తీసుకువెడుతూ దీన్నికూడా తంపిస్తారేమో అని శనిగ్రహంలాగ వచ్చి

ఘడింది. దానితో సోమిదేవి యెంత మొత్తుకున్నా భీమన్న శాస్త్రులు మాషు పదపదమంటూ పడగొంచేశాడు."

"ఇంకా యిరవై సంవత్సరాలేనా నిండాయో లేదో, అప్పుడే యీ పుట్టిమునక యేమిట్రా?"

"మనమతం వొక్కి వెధవమతంరా జుట్టుతీసేస్తేమాత్రం గుణం మారుతుందా యేమిటి?"

"మరి మీ చెల్లెలికి—"

"మంచో చెడ్డో అది పదోనాడే అయిపోయిందికదూ?"

"అదో కప్పదాటు.. . సరే, తరవాత?"

"ఎలాగేనా తప్పించేద్దామని రెండురోజులు మహాతిరిగాను; కాని మాట్లాడ్డానికే వీలయిందికాదు"

"ఏం?"

"ఎప్పుడు వెళ్లినా సుందరంగాడు వాకట్లో కూచునివుండే వాడు యములాడిలాగ"

"అదేమిటి?"

"శాకుంతలం పాఠం మొదలుపెట్టాడురా వాడు భీమన్న మామదగ్గిరా."

"వుద్దేశం యేమిటో?"

"ముప్ఫయ్యేళ్లు దాటాయిగదా నీకింకా చదువేమిట్రా అని నే నడగ్గా, "సర్వేశ్వరుడి దయవల్ల భుక్తికి లోటు లేకుండా పోయిందిగదా, చదువుకోక యింకేం చెయ్యనూ" అన్నాడు"

"అంతేనా?"

"అంటే?"

"నీకు పోటీ—"

"ఛఛా! నల్లమద్దితుండులాగ కారునలుపూ వాడూ—లాటరీలో పదివేలు రావడంతోటే అందగాడయిపోయాడా యేమిట్రా వాడూ?"

"నలుపైనా వాడి కళ్లల్లో మాంచి తేజస్సూ, ఆకర్షణశక్తి వున్నాయిరా. పైగా నోరువిప్పాడంటే చకచకచక—కిన్నెరలు మోగుతూ ఆకంఠమూ, ఆరాగవరసా—ప్రస్తావన మొదలుపెట్టాడంటే వొక శేధోరణికదా గంటలకొద్దీని? మధ్యమధ్య శ్లోకాలు విడిచిపెడుతూ, చేతులు తిప్పుకుంటూ—అసలు వాడు మాట్లాడితేనే నవరసాలూ వొలికిపోతాయి అంచేతే యెక్కడికి వెళ్లినా పెద్దపెద్ద పండితులతో సరిగ్గా వాడికి సత్కారాలు జరుగుతున్నాయి."

"ఆసత్కారాలకీ, దీనికీ సమ్మంధం యేమిటోయ్?"

"అలా అనకు అమ్మాణ్ణి చూశావా యెలా యెదిరిస్తోందో వాడికి?"

"అదో పిచ్చిముండ"

"వాణ్ణిచూస్తే చాలామంది ఆడాళ్లు పిచ్చిముండ లైపోతారు"

"అయినా సోమిదేవిదగ్గిరమాత్రం ఆమాట తీసెయ్యి దాని మనస్సు నామీదే పూర్తిగా లగ్నం అయిపోయింది ఇక ఆరు మూడైనా అది తిరిగిపోదు అసలు దాని మనస్సు కదిపినవాణ్ణి నేనే కనక చలించినవెంటనే నామీదే పడిపోయింది దాని మాపు"

"ఎప్పుడేనా—వొక ముద్దేనా?"

"ఇంకా లేదు—కాని అది నాసొత్తే"

"బాగా నమ్మకమే?"

"ఇటు సూర్యుడటు పొడిచినా తిరిగిపోదిక."

"సరే మరీ నీ కంతధైర్యం వుంటే నేను కాదంటానా? కాని సుందరానికి పెళ్లయింది సుమా!"

"ఏమిటీ?"

"ఇప్పుడే తెలిసింది నాకు."

"ఎప్పుడు, ఎక్కడ?"

"నిన్నకాక మొన్న సాయంత్రం, చెన్నపట్నంలో"

"తణుకోయి మాచారం అన్నట్లదేమిట్రా?"

"అదో గమ్మత్తు"

"పిల్ల నిచ్చిన అభాగ్యు డెవర్రా?"

"ఇవ్వడమూ, పుచ్చుకోడమూ కాదు, కోరడమూ అంగీకరించడమూనూ"

"అంటే?"

"స్వయంవరం అన్నమాట"

"అంత యేబ్రాసిపిల్ల—"

"పిల్లంటే పిల్లకాదు మాంచి ముమ్మరంలో వుంది"

"వెధవముండా యేమిట్రా?"

"సరిగ్గా కనిపెట్టావ్"

"చెన్నపట్నంలో అయితే రాయవరం కృష్ణయాజులు గారి అల్లుడు చేసివుంటాడు"

"అదీ అంతే తేడా లేదు. కానీ—'

"ఇంకేమిటి?"

"పెళ్లిమట్టుకే ఆయన చేశారు"

"బోధపడలేదు"

"మాకు పెళ్లి చెయ్యండంటూ పెళ్లికొడుకూ, పెళ్లికూతురూ వెళ్లి కోరేదాకా ఆయన యిదేమీ యెరగరు."

" ........ "

" వులిక్కిపడ్డావేం ? "

" ఏమీ లేదు.. అయితే— "

" ఆంధ్రపత్రికలో దంపతుల ఫోటోకూడా పడింది .. చూడు "

" పేర్లు చూసేస్తావేం ? "

" పెళ్లికూతు రెవరో కనిపెట్టూ, చూస్తాను "

" .. ఎక్కడో చూసినట్టుంది.మన ప్రాంతమే అనుకుంటాను "

" బాగా పరకాయించు "

" రామచంద్రపురంలో చూశా నిలాంటి మనిషిని. అయితే ఆమనిషి రాచది, కాని వెధవముండల్ని పెళ్లాడేవాళ్లకి జాతిభేదం అక్కర్లేదేమో "

" అదంతా నీకెందుకోయ్ ? "

" అయితే యిది చూసిన మనిషిమాత్రం— "

" మాట్లాడిన మనిషికూడా— "

" ఆ! ఆ! ఆసి రంకుముండా! సోమిరా "

" ఈమాటు చదువుకో కిందవున్న విషయం "

" .. . .. . .. .. ఎంతపని చేసిందిరా దంకుముండా? "

" తిట్టకు "

" తిట్టాలా, పాతిపెట్టాలా ? నన్ను దగాచెస్తుందా ? "

" అదేమీ చెయ్యలేదు నిన్ను. "

" నన్నే కాదు, యింకా యెందర్ని మోసంచేసిందో యిలాగ. లేకపోతే మళ్లీ పెళ్లాడ్డానికి సిధపడగలదా ? "

" ఇప్పుడేకాదుట్రా మహాపతివ్రత అన్నావూ ? "

" ఎవడిమట్టుకి వాడికే పతివ్రత ; కాని సుందరంగాడి పని పట్టాలి ఎంతపని చేశాడూ పాడువెధవా ? "

" ఏంచేస్తా వేమిటి ? "

" బోలెడుసొమ్ముతోటీ, వొంటెడు నగలతోటీ లేవతీసుకుపోయాడని భీమన్నమామచేత ఛార్జీ తగిలిపిస్తాను. ముందు వాళ్లిద్దరికీ అరదండాలు వేయిస్తాను మూడునిమిషాలలో. "

" లాభంలేదు, వూరుకో. "

" నువ్వూరుకో. నా కడ్డువస్తాడా ఫాజీ ? "

" లేవకు, నామాట విను వా డేమీ చెయ్యలేదు నిన్ను. "

" అది కోరితేమాత్రం ? గ్రాండంతా నేను ప్రిపేరుచెయ్యగా మధ్యవచ్చి వాడు తన్నుకుపోతాడా ? "

" బాగుంది వాదం ! "

" ముందు పత్రిక యిలాతే. "

" వుండు వులాకోకు. పత్రిక యెందుకూ ? "

" భీమన్నమామకి చూపించాలి "

" గుమ్మంలోకి వెళ్లావంటే మొగమ్మీద—తెలిసిందా ? "

" ఏం ? "

" సోమిదేవి అతనికి వుత్తరం రాసింది "

" ఆ ? "

" నువ్వు చేసిన కుట్రఅంతా రాసేసింది. నువ్వు చెరపడానికి సిద్ధపడ్డావుట సుందరాన్ని తానే కోరగా పెళ్లిచేసుకుంటే వొప్పుకుంటానన్నాట్ట వాడు వా డామాట అన్నాక నీబుద్ధి అంతా బోధపడిందిట దానికి. మద్రాసుస్టేషన్లో తాను జట్టులోనుంచి తప్పించుకుపోవడమూ, సుందరం ఆబండిలోనే జట్టువాళ్లకి తెలవకుండా రావడమూ, తనజట్టువాళ్లు బళ్లు కుదుర్చుకొంటూవుండగా తానూ, సుందరమూ మోటారెక్కి యెగరిపోవడమూ, సుందరం అదివరకే రాసివుండడంవల్ల కృష్ణయాజులుగారి అల్లుడు ఆసాయంత్రమే తమకి పెళ్లిచేసెయ్యడమూ—అంతా పూసగుచ్చినట్టు రాసేసింది "

" దానిల్లు వల్లకాడు— "

" అదేం కర్మం ? ఇక దానిల్లు నోసకోట అయి కలకల్లాడుతూవుంటుంది "

" అదీ వొకబతుకే ! "

" బుద్ధి చలించాక అదే నయం "

" అయితే నువ్వుకూడా కానియ్యవోయ్ ! "

" అది తరవాత ఆలోచించుకుందాం. "

" అయినా నే నూరుకోను. వాళ్లని సుఖపడనివ్వను నేను. "

" వాళ్లకి పెద్దపెద్దల ఆసరా వుంది. ఎగిరెగిరిపడకు. "

" ఏంచెయ్యమంటావురా మరి ? "

" కిక్కురుమనకు ఏమీ యెరగనట్లు— "

" సిద్ధాన్నం తన్నేశాడురా ఛండాలుడు. "

" పెట్టిపుట్టాడు వాడు. ఇప్పటిదాకా పెళ్లికాకపోయినా చివరికి నిక్షేపమూ, నిక్షేపంలాంటి పెళ్లామూ— "

" పోతూపోతూ నాకూడా బిగించిందిరా దంకుముండ వురీ ! "

" కనక చప్పచప్పగా వూరుకో. శాస్త్రిల్లుమామ కదిపితే " అదే నన్ను కోరింది " అని బుకాయించు "

" నమ్మతాడా ? "

" అయితే సెల్లాళ్లు వూళ్లో వుండకు. "

"ఎక్కడికి పోనురా ?"

"మండపేట వుండనే వుందికదూ ?"

## 3

"కొప్పవరంనుంచి కబురు వచ్చిందా ?"

"ఇప్పుడిప్పుడే మురుకాల్వ దాటతా డీపాటికి గుమాస్తా"

"నీమాట పంతులుగారితో నిన్న చాలాదూరం చెప్పాను. నాతోపాటు నలుగురికీ ముట్టచెప్పించాలని చూస్తానుగాని నామట్టుకే చూసుకోను నేను"

"నంచునే మాట్లాడుతున్నావు"

"స్నానాని కిప్పటికే అలస్యం అయిపోయింది అల్లుడు కూడా వచ్చాడు రాకరాకా"

".వొక్కక్షణం."

" ..... చాపెందుకోయ్ ?"

"వుందికాదూ ?"

"..... .. .. .. ..."

"అయితే యెవరెవరి కేర్పరిచావు ?"

"నాకు, నీకు, సీతాపతిశాస్త్రికి, సుబ్బావధానికి, రామభద్ర చయనులికి——"

"మొన్ననే నాలుగువేలు కొట్టుకువచ్చాడుగదా——"

"అలాకాదు. వాణ్ణికూడా కట్టుకోకపోతే చిక్కులున్నాయి. వాడు నోరుగలవాడు. డబ్బులక్ష్యం లేదు. చేతిలో లేకపోతే నిమిషంలో సంపాదిస్తాడు. పైగా అధికారిప్రాపకం వున్నవాడు."

"నువ్వు కొంచెం లౌక్యం——"

"ఇంతకీ పెద్దకూతుర్ని మకాం ప్రయాణం తప్పించి రామేశ్వరం తీసుకువెళ్లినందుకు వాడిమీద పంతులుగారికి చాలావిశ్వాసం వుంది కూడాను. పదిమాట్లు చెప్పారు ఆయన వాడిమాట."

"అప్పుడు చేదుమేశాడా యేమిటి వాడు ?"

"వచ్చేచోట నువ్వుమాత్రం వొదులుకుంటావా యేమిటి?"

"నామాట కేంగాని, రామదీక్షితులు వొప్పుకో డనుకుంటాను."

"కుర్రకుంక, వాడి కేం తెలుసునోయ్, వ్యవహారాలూ?"

"ఇంతకీ: నూరేసే యేర్పరిచావేం?"

"అక్కడికే యెక్కువ. సీమవెళ్లా డన్నమాటేగాని సుబ్బారావు కేమేసావంటిం దనుకున్నావా యేమిటి ? బారిష్ట రనిపించుకున్నాడు. అంతే. నోరూ వాయీ లేదు. వొక్కకేసు నడపగలడని తోచదు."

"దానితో మనకి పనిలేదు కాదూ?"

"నిజమే తాలూకామొత్తంమీద సనాతన ధర్మసభకి ప్రెసిడెంటుగా వున్నారు; కనకగాని లేకపోతే రామచంద్రుడు గారు మాత్రం సిద్ధపడతారా యేమిటి కొడుక్కి ప్రాయశ్చిత్తం చేయించడానికి? సుబ్బారావయినా తండ్రి కెదురుచెప్పలేక తల వూపాడు; గాని యిది కాస్తా అయిపోయినతరవాత——అవేమిటీ స్టేషన్లో వుంటాయీ? వాట్లలో అయినవీ, కానివీ తినడం మానతాడాయేమిటి రుచిపడ్డాక? మన మాపోతాడు గ్రహించవద్దూ? పైగా మనకే ఐదువంద లయినాయి సంతర్పణకే, సంభావనకే మరో మూడువందలేనా కావాలి. ఆపైని చిల్లర లుంటాయి లౌక్యులికి కాఫీలూ అవీకూడా పోస్తారుట సాయంత్రం హరికథా, రాత్రి కొల్లవేషమూ కూడానుట. మొత్తానికి సంచీ పూర్తి అవుతుంది"

"సరే మరీ వచ్చేదుంటే నువ్వుమాత్రం పోనిస్తావా యేమిటి ? దీనితో పిబ్రవరికి స్త్రీ చెల్లిపోతుంది కదా?"

"వెంకుసోదెమ్మ చెల్లిస్తుందిలే మార్చికి స్త్రీ. బెంగపెట్టుకోకు"

"అదికూడా సిద్ధమన్నమాటే?"

"సిద్ధంఅంటే ద్వాదశినా డయిపోవాలి. ఏకాదశివుపవాసమూ ద్వాదశిపారాయణా——అన్నీ కలిసిరావద్దూ? కొడుక్కి శేషావధాని కూతుర్ని చేరమాడుతోంది వాడుకూడా మొగ్గుతున్నాడు అందుచేతే తలోవందా యివ్వడానికి వొప్పుకుంటోం దది."

"శేషిగాడు మొగ్గుతున్నాడంటే ఆశ్చర్యమా? యాభైవేలున్నాయి ముండదగ్గిర. కానిపనిచేస్తేమాత్రం దానికేం పోయిందీ? మేమమ్మా మహామహా చదివేశామని విర్రవీగుతున్నాము; గాని మనలో వొక్కడిదగ్గిరా పదివేలేనా లేవు"

"మన దేవతార్చనలే మనకి ఆస్తి అవి లేకపోతే మనల్ని చూసేవా రెవరోయ్ ?"

"అదీ నిజమే; కాని దేవతార్చనవంట తాను చేస్తాననటుందేమో వెంకుసోదెమ్మ ?"

"అది తప్పదు లేకపోతే దాని కేంలాభం ? మనం స్వయంపాకాలు చేసుకోడానికా యేమిటి అయిదువందలూ, పైఖర్చులూ——"

"దిక్కుమాలినముండ రంగూనుకూడా తగులడిందని చెప్పుకుంటారుగదా, చూస్తూచూస్తూ మాలకూడు తినమా ?"

"ఇక అదంతా కట్టిపెట్టు. పంచగవ్యప్రాశన చేశాక——మంత్రాలికి శక్తి వుందంటావా లేదంటావా ?"

"లేకపోతే అయిన నూరేసీ కరుకులు గుమ్మరించి మనల్ని బతిమాలుకోడం యెలా వస్తుందీ ?"

"ఇంకేం ? ఇంతకీ శంకరాచార్యపీఠం మూలపడిందీకనక సరిపోయిందిగాని లేకపోతే మనకేంవుందీ ? నాలుగేసి రూపాయలతో తృప్తి—"

"అవునవును."

"లోకం యెలా వుందో మనం కొంచెంచూసుకుంటూ వుండాలి బిగించనూకూడదు ; విడిచిపెట్టనూకూడదూ. పదిరూపాయలు చేతిలో పడే వుపాయమే ముఖ్యంగా చూసుకోవాలి."

"శాస్త్రంమాత్రం యేం చెబుతోందీ ? శాస్త్రంలో వున్న బండారం అంతా ప్రాయశ్చిత్తాలే కామా ?"

"అదిగదీ మాట చాంద్రాయణం చేస్తే అన్నిపాపాలు చెల్లూ. చాంద్రాయణం అంటే ?"

"మనకి తలోవందా—"

"అంతే అంతే. "విత్తశాఠ్యం నకారయే" త్తనికాదూ కారికా ? ఎంతచెట్టు కంతగాలి అన్నట్లు నడిపించాలి మనం"

"అవును.. అయితే సుబ్బలక్ష్మి రామభద్రచయన్లులు వెనక్కాల తిరుగుతోందిట యేమిటోయ్ ?"

"నిజమే ప్రస్తుతం తోడికోడలు తెచ్చిన మనోవర్తిదావాలో పనిచేసపెట్టమనిమాత్రమే కాకపోయినా, ముప్ఫయ్యేళ్ల పీనుగు. పీదోయేడుస్తుంది పోనిద్దూ"

"వూరంతా చుట్టబెట్టేలా వున్నాడు వాడు."

"పోనీ తోడికోడలీపక్షం నువ్వు కాసుకో"

"నా కక్కర్లేదుసుమా, నన్నిలా పోనియ్యి."

"రామసోదమ్మే చాలు నీకు."

"పొమ్మంటే యెన్నివిధాల గెంటినా విడవనంటుం దది ఖలవంతాన పొమ్మనడానికే మనస్సొప్పడంలేదు నాకూ పాపం మాట లనుకోగూడదు అడుగంటిపోయేసమయంలో నన్ను లేవతీసిం దదే. విశ్వాసం అంటే దానిదేచెప్పాలి"

"పెట్టిపుట్టావు. .. రేపు సోమేశ్వరంలో సదస్యం నిశ్చయమేనా ?"

"చల్లపడేటప్పటికి కబురు వస్తుంది"

"తలోరూపాయీ—"

"అయిదుగురికి పిల్లకాసులు- అయిదుగురికి కోనసీమచాపులు, పాతికమందికి రూపాయలు—"

"సెలగోసెలగ. అస లంతమంది పండితులేరోయ్ మన ప్రాంతంలోనూ ? అయితే కాసులు—"

"నీకూ నాకూ తప్పదు."

"రామభద్రచయనుల్ని కూడా కలుపు."

"ఏం ?"

"చెబుతాకాదూ."

"వాడి కూతుర్ని నీమనవడికి—"

"అప్పుడే యెక్కడీశావూ ? . ..నిశ్చయం కావాలిగదా ?"

"ఏమాత్రం ?"

"వెయ్యినూటపదహార్లిచ్చి వుభయఖర్చులూ పెట్టుకోడం."

"పోనియ్యకు"

"జామార్లు కట్టుకోడం తరవాయి. రేపు దశమినాడు స్థిరపరిచాం"

"బాగుంది."

"మరి వెడతా పదకొండుకాదూ ?"

"అదిగో . .. సరిగ్గా కొడుతోంది విన్నావా ?"

"మీరంతా సంపాదించారోయ్ తలోటేనీ. నాకే శ్రద్ధలేకపోయింది"

"నువ్వు పాతికరూపాయలు మాలాగ గంగలో పోస్తావుటోయ్ ?"

"గంగలో పొయ్యడానికేంగాని—మది పోతా."

"పద."

## ౪

"నువ్వు లక్షచెప్పు, కోటిచెప్పు, నేను మానను"

"నే నెందుకు చెబుతున్నానో కొంచెం ఆలోచించుకో."

"మాచెల్లెలు వెధవ, రజస్వల అయినప్పుడు వాడుచేసిన అల్లరి మరిచిపోయావా ? తరవాత దానికి పెళ్లి అయిందనిపించాటప్పటికి నాగడ్డి నేను తిన్నానే ?"

"మీనాన్న వాణ్ణి తిప్పలుపెట్టాడు వాడు మిమ్మల్ని వీథిలో పెట్టాడు."

"ఇంకేం ? ఈవిరోధం మాకు తరతరాలనుంచీ వస్తోన్నదే. నేను దాన్ని భంగపరచడం యెందుకూ ?"

"అలా కాదు. కాస్త పస్తాయించు."

"బుద్ధిపూర్వకంగా కోడల్ని విషంపెట్టిచంపుతే వాడెక్కడో దేవుడంటూ నన్ను దిగతీస్తావేమిటోయ్ ?"

"సూతికవచ్చి చచ్చిపోతే విషంపెట్టాడంటూ వేమిటి నువ్వూ ? రామచంద్రపురంనుంచి పెద్దడాక్టరు వచ్చి రెండురోజులుయింజెక్షన్లు కూడా చేసివుండగా ముందూ వెనకా చూడకుండా గంతులేస్తావేమిటీ ? కేసు నిలుస్తుందా ?"

" నిలిచీదాకా యెందుకూ? దహనం కాకుండా రెండుపూట లాపుచేస్తే చాలనూ వాడికి ప్రాయశ్చిత్తం ?"

" నీమాటమీద మనసబు బకీరురాసి శవాన్ని అటకాయిస్తా డన్న నమ్మకం యేదీ ?"

" లేకపోతే అతన్నిమాత్రం వదిలిపెడతానా నేనూ ?"

" నువ్వే మొగాడవు వూళ్లోకల్లానూ ఇంకెవడికీ యేమీ చేత కాదు. ఏం ?"

" ఈవిషయంలోమాత్రం నా కడ్డులేదు."

" వాడిపక్షంలో రామభద్రదచయనులుగా రున్నారు, తెలు సునా ?"

" వుం-టే ?"

" రే పీపాటికి నీసంగతి యింజెక్షన్లో పడిపోతుంది. యెగిసె గిసిపడకు."

" పారేస్తాను మరోచోట తెచ్చీ. ఆయనే మహా వడ్డీవ్యాపారం చేస్తున్నాడా యేమిటి? "

" అంత చులాగ్గా డబ్బుపుట్టేవాడవు నిన్నగాక మొన్న యెందుకు తిరగరాశావూ నోటూ ?"

" విషమప్రశ్నలు వేసి నువ్వు చంపుతా వేమిట్రా నన్నూ ?"

" నిన్ను చంపడంకా దిది, అనవసరపు గొడవల్లో మునిగి పోకుండా తేల్చడం."

" శవం యింకా అవతలికి వెళ్లకుండానే నీకూతుర్ని స్థిర పరుద్దా మనుకుంటున్నట్టున్నావు నువ్వు, ధోరణి చూడగానూ."

" పోనీ, నీకూతురికి మాట్లాడనా ?"

" నాకు మరోసమ్మంధం దొరకదా యేమిటి ?"

" నాకే దొరకగు పాపం! అవునా ?"

" అయినా నన్ను విడిచిపెట్టేస్తూ."

" పట్టుకున్నానా యేమిటి ? ఇక నీయిష్టం వచ్చినట్లు తంటాలుపడు. నడుంగా యీరొొష్టంతా నాకెందుకూ ?"

" నుంచో......వొరేయ్! మాట పూర్తికాకుండానే తారకం అంటితే యెలాగరా దానిల్లు వల్లకాడయితేనూ ?"

" నే నవతలికి పోయినా తప్పే ?"

" పోయి వూరుకుంటావా యేమిటి నువ్వు? పట్టామణీని తిరగ దీస్తావు. మూడువే లివ్వాలి నీకతగాడు. నువ్వు కల్లెరచేస్తే కుంయి మన లేదు."

" రామభద్రదచయనులుగారు యెదుట నిలవబడితే మహాపాడి చేస్తావుకాబోలు నువ్వు !"

" నాకు కడుపు మహామండిపోతోందిరా వాణ్ణి తలుచు కుంటేనూ. వొక్కమాటు బదులుతీర్చుకోనివ్వరా !"

" కానియ్యి. నీ కడ్డేమిటి? నేను వెళ్లిపోతా నన్నానుగానూ ?"

" అబ్బా ! తడిగుడ్డతో గొంతుకోస్తావురా నువ్వూ !"

" నువ్వే మహాధర్మరాజవు. కదూ ?"

" పోనీ, వాడప్పు డలా అల్లరిచెయ్యవచ్చునా ?"

" చేశాడుకనకనే నువ్వు బదులుతీర్చుకోవా లనుకుంటున్నావు. అది వొకవిధంగా ధర్మమే ; అయితే నువ్వు బదులుతీర్చుకోవాలంటే అవకాశం వుండాలా అక్కర్లేదా ? వాడికోడ లిప్పుడు చచ్చి పోయిందంటే అందులో యేమేనా అనుమానాస్పదం వుందా ? అలాంటికోడలు మళ్లీ దొరుకుతుందా వాడికి ? అది పోయినందుకు ఇంటిల్లపాదీ యెంతగోలపెడుతున్నారో చూశావా నువ్వూ ?"

" కనక తప్పకుండా అల్లరిచెయ్యాలి."

" కానియ్యమన్నానుగా నేనూ ?"

" నవనాడులూ కుంగదీశావు, కానియ్యమంటున్నావు. కింద మంటపెడుతున్నావు, పైని నీళ్లు చల్లుతున్నావు."

" నీ కంతకష్టంగా వుంటే—"

" నుంచో.........పోనీ నావుక్రోషం పోయే వుపాయం చెప్పు."

" నేను చెప్పింది నీకు నచ్చదు."

" అయినా చూద్దాం.. ......"

" నీకిలాంటి కష్టం వచ్చిందా అని మనస్ఫూర్తిగా పరామర్శ చెయ్యి వాణ్ణి."

" చ-ప్ప-గా వుంది."

" జ్వరితుడికి పంచదార చేదు. పచ్చకామెర్లరోగికి జగ త్తంతా పసుపు. అసలు నీజన్మ చప్పనిదీ. నీబుద్ధి చప్పనిదీ. నీహృదయం చప్పనిదీ—"

" ఇక నీదారిని నువ్వు వెళ్లు నాయనా! ఇక నేనేమీ చెయ్య నులే."

"వాణ్ణి నువ్వేంచేసినా నాకు పోయీ దేమీలేదు. నీకు వొరిగే దంతకంటే లేదు. కడుపు చించుకుంటే కాళ్లమీద పడుతుంది."

"అది అందరికీ వుండొద్దూ? "

"వుండాలి. లేదు కనకనే యిప్పుడు బ్రాహ్మడంటే కంపు కంపు."

" మాట్లాడితే నువ్వు లెక్చరు మొదలుపెడతావు."

"తప్పా? ఇంతకీ నీచెల్లెలు రజస్వల అయిందని వాడల్లరిచేస్తే నీకు వచ్చిన నష్టం యేమిటి? వెంటనే దానబ్బసమ్మంధం మరోటి వచ్చిందిగాని పెళ్లి ఆగిపోయిందా? పోనీ, నువ్వు మొదట స్థిరపరిచిన కొంకుదురు సమ్మంధం మహాశాస్త్రీయమైనదేమో అంటే ఆ పెళ్లికొడుక్కి పద్ధెనిమిదో యేటగదా వొడుగయింది? ఈలోపున—"

"చెప్పకురా"

"ఏం? ఇవాళ వెగటుపుట్టిందా?"

"వొరేయ్! ఇక నువ్వు నోరు మూసుకుంటావా లేదా? పేగులు తోడేస్తావేమిటి పిశాచంలాగ?"

"నీకంతకష్టంగా వుంటే పోతానులే"

"ఈ వుపకారానికి వాడు నీ కేం చేసినా చెయ్యవచ్చు"

"నేను చేసింది వుపకారం అని నీవు బోధపడినప్పుడు అది వాడికిగాక నీకని తెలవకపోవడం ఆశ్చర్యమే!"

౫

"విన్నారా?"

"ఏమిటి?"

"పోనీ తెలిసిందా?"

"ఏమిట్రా అదీ?"

"ఇవాళ శంకరప్పతండ్రితద్దినం"

"అయితే?"

"నిన్నరాత్రి యెరికిమిదింటికి ప్రవేశించాడు పిచ్చాయి మేడ మళ్లీ యివాళ వంటలయిపోయా యని కబురుమీద కబురువెళ్లగా యిప్పుడిప్పుడు వచ్చాడివతలికి"

"మీరంతా అంతేగామా? ఇప్పటి కుర్రకారుకి మంచిచెడ్డా యేమేనా వుందా? పుట్టింది బ్రాహ్మణకులం అన్న జ్ఞానం వుందా? వాళ్లని మేశాలకి వెళ్లనివ్వడం లేదుగదా మీరు సరిగ్గాను?"

"పెద్దపెద్దలుమాత్రం—"

"పెద్దలేమిటి చిన్నలేమిటి, చెడ్డపని అన్నప్పుడు అందరిదీ తప్పే కాని వొక్క తేడా వుంది పెద్దవాళ్లు వూరుమాటుమణుక్కుండా వాళ్లయింటికి వెళ్లరు తెల్లవారితే అక్కడ వుండరు వ్రతం పాడుచేసుకుంటున్నారు, గాని వాళ్లు కులం చెరుపుకోవడం లేదు మీకు ఆహారపానాలు సాధారణంగా అక్కడేకదా?"

"అదే నేను చెప్పవచ్చేది"

"మాకు తెలవం దేమిటి?"

"ఇది వినాలి"

"కానియ్యి, పోయిం దేమిటి? ఇదివరకి విన్నవాళ్లకంటే చెడ్డది వుండదు"

"బోగందాని చేతి కాఫీ తాగివచ్చాడు వాడు"

"ఇంకా?"

"వుప్మాకూడా తినేవుంటాడు"

"నువ్వు చూడలేదన్నమాట"

"మీ రిలా అంటారని నాకు తెలుసు"

"ఏమనాలో?"

"అలా చేసినవాళ్లందరికీ సమానంగా గడ్డిపెట్టరేం?"

"రుజువేదీ?"

"నేను చెప్పినదంతా అరణ్యరోదనమే?"

"నువ్వు చూశావా?"

"ఆ"

"మరి తినేవుంటా డన్నావేం?"

"అదిమాత్రం నేను చూడలేదు"

"కాఫీ పుచ్చుకోడం—"

"కళ్లారా చూశాను మామేడవసారాలోనుంచుంటే స్పష్టంగా కనపడుతుంది"

"ఏంజరిగిందో చెప్పు"

"పిచ్చాయితల్లి, వాళ్లు కూచునివున్న గదిలోనుంచి రెండు వెండికప్పులు తెచ్చి వసారాలో కడిగింది"

"అయితే?"

"వొకటి వాడు తాగిందీ, వొకటి అది తాగిందీనీ"

"పోరా!"

"పోనీ, పిచ్చాయి తమలపాకుల చిలకలు వాడినోటి కందిస్తూ వుంటే నేను చూశానండీ!"

"వాడు పట్టే వేస్తాడుకాదూ?"

"

"అది నల్లమందులాంటిది తద్దినం అయేది, చివరికి శ్రాద్ధం అయేది అలవాటయినవాడు మానలేడు"

"ఏమంటారు మీరూ?"

"ఏం వుందీ?"

"మరి నేను సుభద్రాచలం యింటో సగ్గుబియ్యపుపరమాన్నం పుచ్చుకుంటే మీరంత తర్జనభర్జన చేశా రెందుకూ ఆవేళా?"

"నువ్వు ఆపని చేశావుకనక"

"మరి వాడు?"

"సాక్ష్యం?"

“ ప్రతీఅక్షరానికి సాక్ష్యం కావాలంటే సాధ్యమా ?”

“ లేకపోతే మేమేంచెయ్యమూ ? నువ్వు కోడిగుడ్లు తిన్నావంటాడు వొకడు వచ్చి తగినంత నిదర్శనం లేకుండా నమ్మవలసిందేనా ?”

“ ”

“ ”

“ నిదర్శనంవున్నవికూడా మీరు వదిలేస్తున్నారు అనేకసంగతులు ”

“ ఏమిటేమిటి ? ”

“ చెప్పమంటారా ? ”

“ వొకటి ”

“ . ”

“ పోనీ రెండు ”

“ ”

“ నాలిక కదలదేం ? ”

“ ”

“ చెవలవాజమ్మా! నోటికివచ్చినట్లల్లా పేల్తావూ ? ”

“ . ”

“ వాహూ నువ్వూ యెక్కడో పోటీలు తగులడ్డారు అక్కడ గుడ్డిగవ్వకి మారలేకపోయావు ఇలా వేస్తున్నావు యెత్తు ”

“ ”

“ అనవసరపు గొడవల్లో దిగక వొళ్లుతెలిసి మసులుకో ”

“ సీతప్పకూతురు బ్రూణహత్య చేసిందా లేదా మొన్నమొన్న ? రామచంద్రుడుకూతురు రంగూన్‌దారి పట్టిందా లేదా ? జోగన్నశాస్త్రి మనమరాలు అత్తింటోనూ కాకుండా, పుట్టింటోనూ కాకుండా—వారంరోజులు మాయమైపోయిందా లేదా ? నాగావధానులుగారి శంభన్న మాలపాలికాపుకి గడ్డిమో పెత్తాడా లేదా ? ”

“ సాక్ష్యం సాక్ష్యం పాడిమాటలు పనికిరావు నాకు ”

“ అలా అయితే రంగూనులో నాలుగేళ్లు జమాబందీ చేసి వచ్చిన వెంకుసోదెమ్మయింటో మీరంతా దేవతార్చన చేశారా లేదా ? ”

“ దానినాలిక తెగ్గొల్చాం పంచగవ్యాలు పడపోశాం—”

“ తలోవందా కొట్టారు ”

“ అదా నీయేడుపు? మా కా తాహతు వుంది మా కాఅధికారంవుంది మా కాప్రామాణికత్వంవుంది తప్పుచేసినవాళ్లని శిక్షిస్తాం పశ్చాత్తాపపడ్డవాళ్లని ప్రాయశ్చిత్తంచేసి వుద్ధరిస్తాం ”

“ వెళ్లండీ మీనీతులూ మీరూనూ ”

“ మేం కదలం మేం చలించం నువ్వు వెళ్లవలసిందే శీఘ్రంగానూ ”

“ హుం ”

“ ఫుండాఖోరా! నువ్వు మహాశిష్టాదిగురువులా యేడుస్తావు
వీళ్లంతా వొక్కతాటిమీదే వున్నారు అప్రాచ్యులు ”

“ ”

“ ఎక్కణ్ణుంచోయ్ ?”

“ పెచ్చాయియింటోనుంచి వస్తున్నాను సూర్యనారాయణ సోమయాజులుగారి శంకరప్ప—”

“ అవునుట ఇప్పుడే చెప్పాడు భాగిన్న ”

“ నిజంచెబుతావా లేదా అని నిలవతీస్తే కాఫీపుచ్చుకోడం నిజమే అంది ”

“ ఇలా వుంది బ్రాహ్మణ్యం ”

“ ఏమిటి చెయ్యడం ? ”

“ తద్దినం పెట్టాడు అంతకే సంతోషిద్దాం మనం ”

“ కాస్తకాస్త మధ్యమధ్య కూకలేస్తూ వుండకపోతే—”

“ చయనం చేసినవాడవు నువ్వే వేశ్యాలోలుడవై యున్నావు గదా—? ”

“ వొదిలేద్దాం ఆ ప్రస్తావన ”

“ ఏం ? ఎందుకు వొదిలెయ్యాలీ ? ”

“ నీకిప్పుడు అవసరం లేదుకనక ”

“ చాలాదూరం వెళ్లింది ఆమాట—ఇక కట్టిపెట్టు ”

“ ఏం ? ఎందుకు కట్టిపెట్టాలీ ? ”

“ ”

“ ”

“ ఇంకేవీ లేవాయేమిటి చెప్పుకోవలసినసంగతులు ? ”

“ ఇవి కాకపోతేగాదూ ? ”

“ అన్నీ వుడిగినవాడితో ఆ ప్రస్తావన లేమిటి పోనిస్తూ ”

“ అలాగేం ? పోనీ, జ్ఞాపకంవస్తే యెంతబాధ కలుగుతుందో పాపం! వెడతాను ”

“ సాయంత్రం వోమాటు కనపడు ”

“ ఆ ”

౬

“ వుసూరుమంటూ వస్తున్నావు ”

“ క్లాస్టైశాగు ”

"ఆ?"

"పైగా ఖర్చులుకూడా ముదరాయిచ్చుకోవాలిట"

"అయ్యో!"

"మిమ్మల్ని నమ్ముకున్నాను—"

"నే నేమేనా అసందర్భాలు చెప్పానా?"

"రామరామా! మీ రెలా చెప్పాలో అలా చెప్పారు నాకోసం మీరు మొదణ్ణుంచి చివరిదాకా శుద్ధాబద్ధాలు చెప్పారు —"

"నువ్వొకనక తెలిసిందా? మరొక డిలా చెప్పమంటే గుమ్మంలోకి రానివ్వకపోదును"

"అవునవును నేనెరగనూ? మాఅమ్మ బతికివున్నంతకాలమూ మావ్యవహారాలు మీరే దిద్దారు తరవాత మామామగారు పూనుకోడం చేత నైతేనేమి—"

"ఏమైతేయేమిలే"

"చెప్పవచ్చిం దేమిటంటే? మీ రేమీ లోటుచెయ్య లేదు, కాని—"

"నన్ను బాగా—అంటే నేను చయనం చెయ్యడమే కాకుండా గొప్పవిద్వాంసుణ్ణనీ, కర్మిష్ఠినని, ప్రామాణికుణ్ణనీ బాగా యెరుగును పొగడుతాడు ఇంటో కొత్తకుండతడుపుకుంటే నేను వెళ్లాలి నాసాక్ష్యమేనా మంజూరుచెయ్యకుండా—"

"వొక్క సంగతి విన్నాను"

"ఏమని?"

"కనకాచలం వొకరాత్రి మకాంవేసిందని తెలిసింది—"

"అలా చెప్పు"

"రామభద్రచయనులుగారు పురమాయించారుట పాతిక రూపాయ లిచ్చారట్ట వెంకటేశం దానికి"

"జులాయితనంవుంది మనిషిదగ్గిర సందేహం లేదు మున్సబీ అయినాక హెచ్చుకూడా అయిందిట పోనీ నువ్వుకూడా పంపలేక పోయావా యేవెంకటాచలాన్నేనా?"

"తీర్పు చెప్పేంతరవాత తెలిసింది ఇంతకీ కొండుశ్రౌతి నిలువునా దగాచేశాడు"

"నేను చెప్పలేదూ వాడు రామభద్రచయనులుతాలూకు మనిషనీ?"

"ఎంతచమత్కారపు రాకడ వచ్చాడో చూశారా? దస్తూరీ తన దేట, కాని సొమ్మివ్వడం తాను చూడలేదుట తనచేత నోటురాయించి, తనయెదటే సాక్షిసంతకాలుచేయించి నోటు నాచేతి కిచ్చి వెంకటేశం నాతోకూడా మాయింటికేసి వచ్చాడుట తన కంతే తెలుసుట"

"సాక్షులుకూడా బాగా దగా చేశారు"

"రాధాకృష్ణమూర్తి కొంతవరకు బాగానే చెప్పాడు గాని-"

"వాడి మొగం నువ్వన్నీ రూపాయలే యిచ్చావనగా వాడు కొన్ని నోట్లుకూడా యిచ్చావన్నాడు ఇక సుందరప్ప సరేసరి!"

"రామభద్రచయనులుగారు నామీద యింతకక్ష కడతా రను కోలేదు చివుకుల రామదీక్షితులునిబట్టి నన్ను దిబ్బచేశా డాయన"

"అసలు తొమ్మిదివందలా?"

"ఫాయిదాతో పదకొండువందల యిరవై దాటాయి వెయ్యి న్నాటపదహార్లు—"

"పెద్దదెబ్బ నీకు"

"రామదీక్షితులు మంచి వ్యవహారత అనుకున్నాను, గాని-"

"అధికారి గడ్డితింటే వాడేం చేస్తాడు పాపం?"

"కొండుశ్రౌతి నాదగ్గిర గడ్డి మేసి-"

"తరవాత వాడిదగ్గిర నుగ్గిళ్లు మేశాడు ఇటూ అటూ కూడా కొట్టేకు వాడు గుండెలు తీసినబంటు"

"సూరపరాజుగారిమీదకూడా దావా పడెయ్యాలి చయనులు గారు దానిలోకూడా—"

"పూనుకుంటాడు తప్పదు పోనీ నువ్వు అతగాణ్ణి ఆశ్రయించ రాదూ?"

"ఆశ్రయిస్తే రామదీక్షితులుమీద దావా పడెయ్యాలి లేక పోతే నోటు ఆయనికి ట్రాన్సుఫరు చెయ్యాలి ఇందులో యేం చేసినా వాడికి కైదే"

"అదీ నిజమే"

"ఆయన కోటిరెడ్డికికూడా రాయబారాలు పంపుతున్నారుట కానిరోజులు వచ్చిపడ్డాయి కన్ను పొడుచుకున్నా డబ్బుపుట్టక ప్రతివాడూ ఐసుకో, అబద్ధాలకో సిద్ధపడుతున్నాడు అసలికికూడా ఆశవుండేటట్లు కనపడదు"

"భూమి కొనెయ్యరా అంటే విన్నావా?"

"శనిగాడు నెత్తిమీద కూచున్నాడు ఏం చెయ్యనూ?"

"అప్పీలు చేస్తావాలేదా?"

"మానడం యెలాగా?"

"ఈమాటు ప్లీడర్ని నేను కుదురుస్తాను నువ్వు తొందర పడకు"

"అలాగే"

౨

"ఏమంటాడు?"

"వినిపించుకుంటేనా ఏమేనా అనడానికి మానడానికీనీ ?"

"  .  .  ,"

"కొన్ని కొన్ని చిక్కులు చూపించాను చివరికి భయ పెట్టాను "

"ఏమనీ ?"

"దావాపడితే చాలా నష్టం అనీ, పైగా అప్రతిష్ఠ అనీ "

"  "

"ఏంచేసినా వొకటేమాట "అది నాపెళ్లాంకాదు దాన్ని నేను కోరలేదు నే నంగీకరించలేదు నా కేమీ తెలవనివయస్సులో మావాళ్లు చేసినదానికి నేను బాధ్యుణ్ణికాను—"

"ఎవరుట బాధ్యులు ?"

"తల్లీ తండ్రీనిట ఇవతల మీరుట మీ అమ్మాయికూడా అలాంటి అధికారమే వుందిట మళ్లీ పెళ్లాడవచ్చుట!"

"వాడికి ఘటాశ్రాద్ధంకూడా చెయ్యవచ్చా ?"

"  ,  "

"గొప్పవిద్వాంసు డవుతాడని యింగ్లండు పంపిస్తే పశువై వచ్చాడు బోలెడుసొమ్ము—"

"అవునుట ఆమాటకూడా వాడేచెప్పాడు తనకోసం మీ రెంత ఖర్చుపెట్టారో అంతటికీ ప్రస్తుతం నోటు రాసియిస్తాడుట తరవాత రెండేళ్లలో అణాపైసలతో తీర్చేస్తాడుట "

"ఆ ?"

"ఎంతసేపూ ప్రేమ, ప్రేమ—మరోమాట లేదు ప్రేమ కలగనిచోట పెళ్లేమిటంటాడు వధూవరు లిష్టపడి పెళ్లి చేసుకోవాలి, గాని మధ్య మీరంతా యెవ రన్నాడు "

"పోనీ వొకపని చెయ్యమనలేకపోయావా ?"

"ఏమి టది ?"

"మాపిల్లతో స్నేహం చెయ్యమను తనిక్కడికి వచ్చినా సంతోషమే దాన్ని తనదగ్గిరికి పంపమన్నా సంతోషమే మా కేమీ అభ్యంతరంలేదు ప్రేమ కుదురుతుందా, ఏలుకోవచ్చు అవసరమైతే తనయిష్టంవచ్చినపద్ధతిలో మళ్లీ పెళ్లిచేసుకోవచ్చు ప్రేమ కుదరకూ ? మాపిల్ల మాయింటోనే వుండిపోతుంది ఇంకేమీ మాట్లాడము అదీ, మేమూ మాకర్మానికి యేడుస్తూపడివుంటాము "

"ఇంత ఆలోచన తోచలేదు నాకు, కాని మరొకవిధంగా చెప్పాను "

"ఎలాగ ?"

"దాన్ని రహస్యంగా మాయింటికి తీసుకువస్తాను మీ రిద్దరూ మాట్లాడుకోండి, నచ్చి నీకు దానిమీద ప్రేమకలిగితే తీసుకు వెళ్లు లేకపోతే మానెయ్యి— "

"ఏమంటాడు ?"

"చదువురాని మూఢురాలితో స్నేహం యేమిటిట!"

"తనచదువు యిలా తగులడుతోంది పోనీ, నాకూతుర్ని ప్రేమించవద్దు దాన్ని తనపెళ్లాంగా భావించవద్దు పెళ్లాంగా చూడ వద్దు తనయింటికి తీసుకుపోతే చాలు దాసీపనులు చేయించుకుంటూ అయినా తనదగ్గిర వుండనిస్తే చాలని యేడుస్తాం దది తాను మరొక దొరసాన్ని పెళ్లాడినా సంతోషమే "

"అదీ చెప్పాను అంతఔదార్యం వుండేవాడి కిలాంటిబుద్ధి యెందుకు పుడుతుందీ ?"

"ఏం చెప్పాడు ?"

"నీకూతుర్ని వాడు ఇటీవల చూడలేదుట, కాని అందం గానే వుండవచ్చుట కనక దాన్ని తనయింటో అట్టే పెట్టుకుంటే నెలో, రెణ్ణెల్లో చూసేటప్పటికి తనమనస్సు చలించవచ్చుట దాని మీద తనకి మోహం కలగవచ్చుట అది పెరిగిపోవచ్చుట స్వాధీనం కాకపోవచ్చుట దాంతో కొన్ని సంవత్సరాలు ఆజంజాటలో పడి వుండిపోవలసివస్తుందిట అది వోపట్టాన వదలదుట ఈసంఘటనవల్ల తనకిక పెళ్లి కాదుట యావజ్జీవమూ యీ మూఢురాలితో వుసూరు మంటూ కడపవలసివస్తుందిట సుఖం వుండదుట ఆనందం వుండదుట శాంతి వుండదుట తన అమూల్యజీవితం దుఃఖభాజన మైపోతుందిట!"

"అబ్బా!"

"ఎంత గడుస్తనంగా—"

"ఇంతకీ ఈతప్పంతా నాగి "

"  "

"చిన్నతనంలో చురుగ్గా వుండడం చూసి నేనే యింగ్లీషులో ప్రవేశపెట్టమని సలహాచెప్పాను తరవాత ఆస్తి తక్కువైనా పిల్ల నిచ్చాను ప్రొఫెసర్లంతా మంచి తెలివైనవాడని పొగడితే యింగ్లం డు పంపించాను సొమ్మూ పోయింది, దిమ్మూ పట్టింది "

"  "

"నేను చేసినదానికి శిక్షకూడా నాకే అయితే బాగుండిపోను మా అమ్మాయి గొంతుకోసినట్టయింది దాన్నిచూస్తే కడుపు చెరువైపోతోంది "

"పైవాళ్లే చూడలేకుండా వున్నారు "

"ఇంకోటిచూడూ ప్రేమ ప్రేమ అంటూ అంత గుంజు కుంటాడు గదా ? నిజంగా ప్రేమవున్నవాడయితే యింత మొండి కత్తగలడా ? ప్రేమ హృదయాన్ని మృదువుపరుస్తుందా, రాయిగా చేస్తుందా ? తాను ప్రేమకలవాడే అయితే నాకూతురుస్థితికి జాలి కలక్కుండా వుంటుందా ?"

"నిజమే, ప్రేమవున్నచోట యింత కాఠిన్యంవుండడం అసహజం"

"కనక వాడికి నిజంగా ప్రేమించడం తెలవదు ఎవత్తిమీదో కన్నువేశాడు అది వీణ్ణి యింకా లక్ష్యపెట్టడంలేదు దాన్ని మరిచి పోలేడు దీన్ని సుఖపడనివ్వడు ఇలాంటివాళ్లకి చివరి కెలాంటిగతి పడుతుందో యెరుగుదువా?"

"ఆశ్చర్యమా?"

"ఇలాచూస్తే బ్రాహ్మణలక్షణమూ లేదు అలాచూస్తే ప్రేమి కుని లక్షణమూ లేదు చివరికి మనిషి అనికూడా చెప్పడానికివీల్లేదు"

"ఇంతకీ ఇంగ్లీషు మన గొంతుకోస్తోంది"

"అది తెలివితక్కువమాట ఆచారాల్లోనూ, నడతలోనూ భేదం కలిగించవచ్చు ధర్మంలోనూ, నీతిలోనూ కొత్తదారి తొక్కించవచ్చు హిందువుగా పుట్టినవాణ్ణి క్రిస్టియనుగా మారిస్తే మార్చవచ్చు, గాని పెళ్లామనీ, బిడ్డలనీ, సంసారమనీ తెలవకుండా చేస్తుందా యింగ్లీషు?"

"ఏమో! నాకు—"

"అలాకాదు, కాని వొక తెలివితక్కువ పనిమాత్రంచేస్తున్నాం మనం ఇంగ్లీషు చదువుకున్నవాళ్లకి ఆడాళ్లుకూడా చదువుకోవాలని వుంటుంది మనం మొగపిల్లలికి యింగ్లీషుచెప్పించి వూరుకుంటున్నాం గాని ఆడపిల్లలికూడా చెప్పిస్తే యీ కుర్రకారురోగం చప్పగా కుదురుతుంది"

"అది మరీ—"

"చివరికంటా విను ఇంగ్లీషు మొగపిల్లలికి పడమటిచూపు కలిగిస్తోంది ఆడపిల్లల చూపు తూర్పుకే వుండిపోతోంది దీనితో—"

"కాని ఆడపిల్లలికికూడా యింగ్లీషు అలవాటుచేస్తే మన సంప్రదాయాలు నిమిషంలో గంగలో కలుస్తాయి"

"అది నిజమే, కాని యీవుప్పెనచూశేవా?"

"ఏంచెయ్యడానికీ తోచదు"

"కానియ్యి ఇంకా యెంతకాలం యిలా యేడవాలో మాపిల్ల వొక్కపిల్ల పైగా వజ్రపుతునక ఎన్నిముచ్చట్లు తీర్చుకోవాలని ఆశపడ్డామురా దీనిమూలంగానూ? ఎంతవిఘాతం "

"అదేమిట్రా?"

" "

"ఛా! ఆడదానిలాగ—"

"ఆడదానికేగాని మొగాడికి దుఃఖం వుండదూ? పదిహేడేళ్లు వెళ్లాయి దాన్ని చూస్తూ యెలాగ భరించడం? దానికి గతి యేమిటి? పురిట్లో వొకసాడు ఆశవదులుకున్నాం అప్పుడే పోయి వుంటే యింతకోత లేకపోవును మాకు వొక్కొక్కప్పుడు దాన్ని కిరస్తానీలలో కలిపేసి— మేంకూడా కలిసిపోయి మరొకడికి పెళ్లి చేసేద్దామా అన్నంత వుద్రేకం కలుగుతూవస్తుంది కాని వాడు దారికి రాకపోతాడా అని ఆశపుడుతూవుంటుంది చూడూ ఇంతవూ రుంది నూరిళ్ల బ్రాహ్మణాగ్రహారం అంతా పండితుల్లోనే జమ అంతా కర్మిష్ఠుల్లోనే లెక్క మాట్లాడితే ప్రాయశ్చిత్తా లంటారు, కాని వాడికి గడ్డిపెట్టరేం? మాపిల్లకి మళ్లీ పెళ్లిచేస్తే—"

"ఇక తరవాయా? అవి కారికలు కావు, అవిసభలు కావు, అవి చర్చలుకావు, అవి తీర్మానములుకావు, అవిబహిష్కారాలు కావు—"

"ఛీ! ఏంజాతిరా మనదీ?"

## ౭

" నూతినీళ్లుకాబోలు"

"అవునండి"

"చాలా బాగున్నాయి ఈమధ్య తమయింటో శుభ కార్యం యేమేనా జరిగిందా?"

"మాచెల్లెలిపెళ్లి చేశాం అందుకోసమే యీపందిరి వేశా మండి"

"బాగుంది . మీయింటిపేరు?"

"చావలివారు"

"నామధేయం?"

"వేంకటావధాని"

"మీరేం అధ్యయనంచేశారు?"

"అన్నీ అయినాయి—"

"ఏమేమిటి?"

"మొదట సంహితఅంతా అయిపోయింది తరవాత పరా యతం పూర్తిచేశాను స్మార్తం అయిందనిపించాను చివరికి పంచ కావ్యాలుకూడా పాడేశాను, కాని—"

"ఇంకా కానీయేం?"

"వాళ్లవల్ల యేమీ లాభం లేకపోగా స్కూలు మాస్టరుగా ప్రవేశించాను"

"ఇంగ్లీషుకూడా—"

"తెనుగే చదవలేదూ నాలుగోక్లాసు ఇనస్పెక్టరుగారి నాశ్ర యించగా నా చిన్నతనంలో తారీఖువేసి ప్రయిమరీ సర్టిఫికెట్టు దయ చేశారు ట్రెయినింగుకికూడా వారే—"

"తాంబూలం యేమాత్రం—?"

కలితంబైన మనోజ్ఞరూపమునకా, కాకత్యభూపాలని
ర్మలశిల్పంబునకా, అవాచ్య కలుషప్రారంభ సంరంభముల్ !

శిథిలముల్ దిలకించి శిల్పవిన్యాసంబు లరయుకోరిక మున్నె యంతరించె
ప్రథమ పదాంకితములో పాషాణములపయి కను లద్దుకొనువాంఛ గంగఁగలసె
జాతీయచిహ్నముల్ చారిత్రగతము గావించు రౌచికుల ధీ సంచలించె
అన్యజనాసాధ్యమగు నాంధ్రశిల్పంబు నరయువేడుక మదియందె యణఁగె
కాలగతిచేఁ బ్రతాపభూపాలరాజ్య - మంతరించినయందుకుఁ జింతలేదు
నాఁటి కీర్త్యంకముల పరిపాటి దలఁచి - వగతుఁ గన్నీరు పొంగి కాల్వలయి పార.

కాకతీయుల భోగభాగ్యముల నరసి - సమ్మదాశ్రులు విడిచిన జనులె నేఁడు
శిథిలరూపంబునకు నశ్రుసేచనంబు - నాచరింతురుగాని రమ్యాంధ్రపుత్ర!

---



ఉదకమండలము రైలుస్టేషను

—యస్. మీనాక్షిసుందరము





1 వీరభద్రవ్యాయామమండలి, బందరు 2 కోయంబత్తూరు వ్యవసాయకళాశాల ఆంధ్రవిద్యార్థిసంఘము

# సంసారి

కీ. శే. పండిత జంధ్యాల శివన్నశాస్త్రి

ఘన కష్ట నష్ట నక్రగ్రాహ సందోహ ఘోరభీకరము సంసారజలధి
శశ్వదాయాస్యద్వినశ్వరద్విపదూర్మివారపూరితము సంసారజలధి
మహితశుభాభాసమానకార్యానేక జాలవేల్లితము సంసారజలధి
ఉత్తమర్ణద్విషదుపలగర్తముహుర్ముహురారోధకమ్ము సంసారజలధి
సారహీనమ్ము నిట్టి సంసారజలధిఁ - దాఁటఁజేయఁగ హరిపదధ్యాన మనెడు
నౌకయే యింక లభ్యమ్ము గాకయున్న - నబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

తల్లిదండ్రుల యప్పచెల్లెండ్ర మాటల నాదరింపంగ నిల్లాలు కినియు
నిల్లాలిమాటల నెల్లఁ బాటింపంగ సతిమాటఁ జవదాఁటఁజాలఁ డండ్రు
ఉభయులకును న్యాయమూని చెప్పంగ నుభయులకోపమునకుఁ బాత్రుఁ డగును
వారల కోపమ్ము బాటింపకున్న గృహమునఁ గల్లోలమ్ము లతిశయిల్లు
ఇరుగుపొరుగున నుండువారెల్ల కడిఁది - చులకజూచుచునుండ్రు రచ్చలను వాని
మాటపాటింపకుండ్రు సమ్మాన ముండ - దబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

నిన్ననో మొన్ననో తన్నుఁ గూడెనో లేదో పెండ్లమన్నను నింతప్రీతి యేల
ఎన్నికష్టముల సహించి తన్గాంచిన తల్లియన్నను పెద్ద దయ్య మేల
పెండ్లిపేరంటముల్ ప్రీతిఁ జేసిన తన జనకుఁ డన్నను గర్భశత్రు వేల
ఏకగర్భమున జనించిన సోదరీసోదరులనఁగ నసూయ యేల
ననుచు పరిపరిగతుల నిందను బొనర్చు - లాతివారల పలుకు లెల్లను వినుచును
బ్రతుకవలయును జీవచ్ఛవంబుబోలె - నబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

గడగడవడఁకుచు నడుగుకు మడుగుల నెంతయొత్తిన లాభ మేమి యుండు
పెంచి పెద్దలఁజేయు పితరులగూడ వదలివచ్చెనని సుంత దలఁపవలదె
తనజీవితంబునంతయు నాత్మవశముచేసెనని యొక్కింత యోజింపవలదె
తల్లియుఁ దండ్రియు దైవమ్ము గురుఁడును తానె యంచును గృప నూనవలదె
అకటకట యేటిమాట లీయవి నెలంత-లెట్టిరేనియు మగవారి కెందు పితలె
యెక్కు వను సతిమాట లాలించు టెట్టు - లబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

కవియైనచో వాని కవనమెల్లను పాడు, ధనియైనచో వానిధనము పాడు
మానవంతుండైన వాని మానము పాడు, బలియైనచో వాని బలము పాడు
శౌచియౌనెడ వాని శౌచమెల్లను పాడు, నియమియౌనెడ వాని నియతి పాడు
ఉద్యోగియైనచో నుద్యోగ మగు పాడు, ధీశాలియైన బుద్ధి యగు పాడు
దైవభక్తుండ యగునేని దైవభక్తి-యెల్ల పాడగు భవి కిల నలఘుదుఃఖ
మొక్కటియదక్క మిగిలిన దొండుగలదె-యబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

గయ్యాళియౌనెడఁ గాఁపురంబగు భగ్న మని విచారంబు నాత్మనువహించు
సౌందర్యవతియేని జారు లెవ్వారేని యాసింతురో యని గాసిఁ జెందు
రూపసంపద కరమేపారకున్న నా యింతిసంగతి కేవగించు మదిని
విదుషియౌనెడ తనపేరుప్రతిష్ఠల కేలోపమో యని యెదను గుందు
వంధ్య యగునేని పరితాపభరితుఁ డగును - వత్స ద్విప్రసూతయై వఱలెనేని
యష్టకష్టంబులకుఁ బాత్రుఁ డగుచునుండు - నబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

పెండ్లియైనది మొదల్ పెండ్ల మెప్పుడు స్వగృహమున కేతెంచునోయని తపించు
వచ్చినదాదిగ నెచ్చెలికిని నింటివారికిఁ బడమికి వంతఁ జెందు
దైవయోగమ్మునఁ దద్బాధ లేకున్న సంతతికయి కొంత చింతఁ జెందు
నదియునుఁ జేకూఱు నది మొదల్ తదపత్యరోగాదులకు మదిరోయుఁ గడిఁది
గడచెనేనియు నట్టిరోగంబు లెల్ల - పిదప వారలఁ బోషింప వివిధకష్ట
ములను బొందఁగవలె నెల్లభవులుఁదిరిగి - యబ్బ! సంసారిపాట్లారయఁగవశమ్మె!

పొరుగువారలఁ జూపి భూషణమ్ములను జేయింపుఁడంచును నేడిపించుఁ గాంత
తాము జూచిన వస్తుతతినెల్ల కొనిపెట్టుఁడంచు సంతతి నిరోధించుచుండు
నర్పించుఁ డెల్లద్రవ్యంబును వడ్డితో ననుచు బాధించెద రప్పువారు
అనయమ్ము గిల్లి కయ్యమునకై కాలుద్రవ్వుచునుందు రాయింటిపొరుగువారు
లజ్జ విడనాడి యిద్ది కాలమ్ము కాదు - పొందు పైసయు లేదని ప్రొక్కువఱకు
పీడకయ యర్థిజనములు వేచుచుండు - రబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

మానినీమణిమోవితేనెఁ గ్రోలఁగవచ్చు పిల్లపాపల ముద్దుపెట్టవచ్చు
సుదతి యొనర్చు శుశ్రూష లొందఁగవచ్చు సజ్జనులకు సేవ సలుపవచ్చు
పితృదేవతలకునుఁ బ్రీతిఁ గూర్పఁగవచ్చు బంధువులనుఁ జాలఁ బడయవచ్చు
యజ్ఞయాగాదుల నాచరింపఁగవచ్చు అతులసౌఖ్యంబుల నందవచ్చు
అగ్నిహోత్రాదికంబుల ననవరతముఁ - జేయఁగావచ్చు నంచు నాసించి సుఖము
పడుచునుందురుగాని ఈభవజలధిని-అబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

తననోటవచ్చుపల్కును లక్ష్యపెట్టకే కాంత సారెకుఁ దన్నుఁ గసరికొట్టు
తమతండ్రి వట్టిమూఢమతియంచును గన్న సంతానమేని విశ్వాసముంచ

దిగ్గుపార్గుననున్న యెల్లవారలు తన్ను చుల్కనగాఁ జేసి పల్కుచుండ్రు
గ్రామస్థులును శుభకార్యమ్ములందు తఱ బెద్దఁజేయుచు గారవింపకుండ్రు
ప్రియమెలర్పఁగ దన్నాదరింపకుండ్రు - బంధుజనములు తా ద్రవ్యవంతుఁడేని
యురుతరోద్యోగియేని గాకున్న నింక - నబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

ఇల్లు గుల్లగఁజేసి యెంతఁ గూర్చినఁగాని యల్లునిఁ దృప్తుఁ జేయంగవశమె
కూఁతులకన్న నెక్కువప్రేమఁ జూచిన గోడండ్రకుం దృప్తిఁ గూర్పఁగలమె
ఎంతప్రీతిగఁ జూచెనేనియు సతికి జన్మగృహావాసముకాంక్ష మాన్పఁగలమె
గొప్పవిందుల నెన్ని కుడువఁబెట్టిన బందుగుల దెప్పులను దప్పకొనఁగఁగలమె
ఘనమనోవ్యాధు లెన్ని యిక్కట్టు లెన్ని - కపటవేషంబు లెన్ని సంకటము లెన్ని
మహిని సంసార మనఁగను మాటలొక్క - యబ్బ! సంసారిపాట్లారయఁగవశమ్మె!

జాయ జారిణియైన షండుఁడంచును బల్కువారిమాటలు రద్దుపరచుటెట్లు
తల్లి పాంసులయైన తండ్రి నీ కెవఁడు వచింపుమం చన నేమి చెప్పవలయు
భగిని స్వైరిణియైన భావుకులే నీకు వీ రెల్ల రనఁగ జీవించుటెట్లు
తనవారు భ్రూణహత్య నొనర్చువా రుండిరే న్పురంబునఁ జరియించుటెట్లు
చోరులగుచు నాత్మీయు లెవ్వారుగాని - అల్ల గోదావరీస్నాన మాచరించి
యేఁగుదెంచిరయేని దలయెత్తు టెట్టు - లబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

ఎల్లవిద్దెలఁ బరియించి శిష్యుం డల్ల యాచార్యుతో గ్రుద్దులాడినట్లు
రోగముల్ పోయి యారోగ్యవంతుండగువాఁడు వైద్యునితోడ వదరినట్లు
నావ నారోహించి యావలిదరి కేఁగి పోతవాహునితోడఁ బోరినట్లు
పడతి పజ్జకుఁజేఱుపదపడిఁ దనుఁగన్న తల్లిదండ్రులమాట నొల్లనట్లు
తమకు సంతతిగల్గునందాఁక సతులు - కడిఁది శుశ్రూషఁజేతురు గాంత్రు ప్రీతి
నాపదంపడి మోమెత్తియైనఁజూడ - రబ్బ! సంసారిపా ట్లారయఁగ వశమ్మె!

ఇంటనుండినఁ దన యిల్లాలు బెల్లమ్ము నల్లమ్ము లేదని వల్లెవెట్టు
పణ్యవీధికి నేఁగ బచ్చులు పద్దుల రద్దుజేయుఁ డటంచు రద్దిఁజేతు
రేపొలంబున కేని యేఁగినఁ బాలికాపులు జీతమిమ్మని పలుకుచుందు
రేయూరికేని పోయిన ఋణదాతలు విత్తమీయుఁ డటంచు వెంటఁబడుదు
రింక నుదకాగ్నులంబడియేని విసము - ద్రావియేని ప్రాణముల్ తరలుద మన
నాత్మహత్యయ న్దోషంబు ప్రాప్త మగును - నబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!
సుతలనే భయపెట్టఁజూడ మే మెటులైన నన్యులమే కదా యండ్రు వారు
కోడండ్రనే కసరొక్కనఁగ మే మొకరి బిడ్డలముగదా యంచు పలుకుచుండ్రు
యింటికిఁ బెద్దయైయుంట వైరమ్ము మాన్పకయున్న జననిందఁ బడయునగునె
స్నుషలకు సుతల కన్యోన్యవైరము నైజ మగుట మాన్పంగ శక్యంబుగాదు

ఈచరాచరజగముల నెల్లఁజేయు - ధాతయేసియు నందఱే దన్నఁగలఁడె
యింక నరమాత్రునకు శక్య మెట్టులగును - అబ్బ! సంసారిపా ట్లారయఁగ వశమ్మె!

కుండపోయెను వంటవండు టెట్టుల నింక ననియేడ్చు సతిపల్కు వినుటయెట్లు
బూరుగులో యనుపదంబును విన్నమాత్రన బుడుతల చెవులను మూయు టెట్లు
రాకరా కొక్కపర్యాయ మేనాఁడో యేతెంచు బంధుగులఁ బంపించు టెట్లు
చలికాలమందు బట్టలు లేక పిల్లలగాత్రంబు చలిమంటఁ గ్రాచుటెట్లు
స్వప్నసారంబు నిట్టి సంసారమునకుఁ - దోడు దారిద్ర్యముంగూడ గూడియున్న
నింక జీవించు టెట్లు మహీతలమున - నబ్బ! సంసారిపా ట్లారయఁగ వశమ్మె!

తానన్నఁ జాలపెద్దగఁ జూచువారలు తనయింటి కేతెంచఁ దన్నుననియు
ఈతఁడన్ననుఁ బెండ్లమేని మన్నింపదు ఛీయని జనులు భాషింతురనియు
చెలికాండ్రతోడ భుజించుకాలమ్మున గరిటెతో తననెత్తిఁ జరచుననియు
ఈపెతో పెండ్లిండ్ల కేఁగిన నెటకేని పదిమందిలోఁ దన్నుఁ బాదుననియు
వదలిపెట్టిన నిందింత్రు భార్యనేల - వీఁ డశక్తుఁ డంచును జనుల్, వేయియేల
గడుసుపెండ్లాము భూనరకంబుసుండి - యబ్బ! సంసారిపా ట్లారయఁగ వశమ్మె!

వావదూకుండైన వాచాలుఁ డందురు వాచంయమిని మూగవాఁ డటంద్రు
అగణితసాహసుఁ బొగరుబో తందురు స్వపథగామిని వట్టిపంద యంద్రు
సత్యభాషణుని దూషణశీలుఁ డందు రుపేక్షాస్వభావు గూబిగ వచింత్రు
శాస్త్రానుసారిని ఛాందసుఁ డందురు స్వేచ్ఛాచరుణ్ తుంటవిధవ యంత్రు
లోభియంద్రు మితవ్యయుణ్, లోలుఁడంద్రు-చూచినవియెల్లఁ గొనువాని, క్షోణి నెటుల
నున్నవంకలు నిఁక నొందకుండురొక్క - యబ్బ! సంసారిపా ట్లారయఁగ వశమ్మె!

కడుపునిండఁగఁ దినఁగల్గువారికి జొన్నయన్నమైనను నంబలైన నుండ
దర్థరాసుల నోలలాడువారలకు కారపుమెతుకులును జీర్ణములుగావు
లేదనుపదముఁ బల్కిన దోషమనువారియొద్ద దమ్మిడియైన నుండఁబోదు
మెతుకుపోయిన నింక బ్రతుకుపోయెడు ననువారి భాగ్యమునకు మేర లేదు
ఇట్టి విపరీతముగ సృజియించినట్టి - యల్ల చతురాస్యున కొకింతయైన మేధ
యుండునే సల్పునొక్క లేకున్న నిట్టు - లబ్బ! సంసారిపా ట్లారయఁగ వశమ్మె!

అనుకూలవతిని భార్యగఁ గాంచఁగావలె పాడిపంటల వృద్ధిఁ బడయవలెను
తనయాజ్ఞ మీఱని తనయులఁ గనవలె వారికాంతలు నట్టివారె వలెను
రోగమన్మాట నెఱుంగకుండఁగవలె నెద నవిచారము గదియవలెను
సంతతి మృతినిగాంచకయుండఁగావలె నంచితకీర్తి నార్జించవలెను
తగులవలయును ధర్మార్థ తత్త్వబుద్ధి - నున్నచో నిన్నియున్ సుఖ ముండుఁ గాని
యిందు కొన్నింటినేనియు నొందకున్న - నబ్బ! సంసారిపా ట్లారయఁగ వశమ్మె!

పుత్రులకొఱకునై మొగమువాచినవారి భార్యలు వంధ్యలై పరఁగుచుండ్రు
ప్రోవంగలేక మొఱ్ఱో వద్దువద్దను నరులకేటేట సంతతి గడింది
సరసాగ్రగణ్యుఁడౌ జనునకు నిలభార్య యెడ్డిమానిసి యయి యెసగుచుండు
మూర్ఖమూర్ధన్యుఁడౌ పురుషున కిల్లాలు నెఱజాణయై కరం బరిదిఁ గూర్చు
ఒకటియుండిన యుండ దింకొకటి లేక - రెండు సున్నయు, యుండిన రెండు నసను
రూపముగ నుండు నీభవకూపమందు - అబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

కనదనలజ్వాల గని ఫలమనుభ్రాంతిపడి శలభం బందు పడినభంగి
ఘనపిపాసార్తుఁడై కాంచి మరీచికల్ జలమంచు రయమునఁ జనినయట్లు
కాలసర్పంబును గాంచి దండం బని యెంచి హస్తమున గ్రహించినట్లు
గురుగురుద్రోహియౌ నరున కెఱుంగక విద్య యత్నమ్న మర్పించినట్లు
సౌఖ్యసారమ్ముగలది సంసారమనుచు - మోహితాత్ములై భవవార్ధి మునిఁగి తమ య
నర్ఘ్యజీవిత మెల్లను వ్యయముజేతు - రబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!

గాలివీచుట పయికప్పదెల్లను లేచె వానచేఁ గాల్వలు వాఱె నింట
ఆఁకలి కోర్వలేమని యేడ్చుచును బసికాయలు గుండెఁ బగుల్చుచుండ్రు
కనునెల దాపరించిన తనయిల్లాలు ప్రసవంపువేదన పడుచునుండె
కోడలిపురిటికై కూడవెట్టిన యాముదముకుండ పగులుటఁ దల్లి యేడ్చు
కానిడబ్బును కంటికి గానకుంట - నేమిసేయఁగఁ దోఁచక యేడ్చుచుండె
తాను నోకమూలఁ గూర్చొని, ధాతకైన - నబ్బ! సంసారిపాట్లారయఁగ వశమ్మె!



# ప్రకృతి నటన

జి. జాషువ

మిటమిట యెండ గాచినది, మేదిని పీటలువాఱిపోవ, నం
తట సుడిగాలి రేగి, వసుధారజముల్ గలగించి రేచె, బి
మ్మట నినమండలంబు తెలిమబ్బుల దాగుడుమూతలాడె, నా
దట, గఱులున్న కొండలవిధంబున బేరములెత్తె మేఘముల్.

ఉఱుములు మెఱుములు గల యొక - శరదము గగనమున మసలి క్షణకాలమునన్
గురిసెం బ్రచండవర్షము - నిరులు గవియ మిన్నుమన్ను నేకమగు క్రియన్.

మగడు దిట్టిన రోదించి మానుకొన్న - పెద్దగయ్యాలివలె వాన వెలిసిపోయె
మమత లుడిగిన సన్న్యాసిమనసువోలె - గగనమండలంబెల్ల నిష్కలుషమయ్యె.

ఆకటం దూలు సస్యశ్యామలక్షేత్ర కన్యగర్భము చల్లగా భజించె
బక్కచిక్కినకొండవాగు దటాకంబు సిరివచ్చి చిటుకలో జియ్యబట్టె
ముమ్మాయిముత్యంబువోలి తామరమీద వర్షబిందువు తాండవంబుసేసె
నడయాడు రతనంబువడువున నాడాడ నారుద్రపుర్వు ప్రత్యక్షమయ్యె
చెలగి చేయార దానంబు జేసిచేసి - కొఱతవడియున్నవాని కాపురమువోలి
యుబ్బసెడి తూలె నొక చిన్నిమబ్బుతునక - యుత్తరంబుగ దిక్కుల కొత్తిగిల్లె.

వానదడిసిన భూమిదర్పణమునందు - ప్రకృతిరమ తలక్రిందుగా ప్రతిఫలించె
ముసలిసూర్యుని పసలేని మోముజూచి - మూతిముడియించె బడుచు టంభోజవనము.

పడమట, నెఱ్ఱపట్టు జిగిపట్టుతివాచులమీద, వృద్ధసూ
ర్యుడు నివసించె, వీడ్కొలుపు టుత్సవగానము లాచరించుచున్
నడిచె శకుంతకోటి సదనంబుల కంతట బ్రొద్దు గ్రుంకె, సం
దడులు క్రమక్రమంబుగ నణంగె, వసుంధర కన్నుమూసినన్.

---

# కళింగదేశపు తూర్పుగాంగరాజుల పరిపాలనావిధానములు

రాళ్లబండి సుబ్బారావు, యం. ఏ., యల్. టి., యఫ్. ఎ. యు.

తూర్పుగాంగవంశపురాజులనుగురించి, పశ్చిమగాంగరాజులచరిత్ర తెలిసికొనినంతబాగుగ ఇదివరలో, అనగా ౮ లేక ౯ సంవత్సరములకు పూర్వము, తెలిసికొనుటకు తగినన్ని ఆధారములు దొరకకుండెను. ఇటీవల దక్షిణహిందూదేశశాసనములు నాల్గు, ఐదు, ఆరుసంపుటములు వెలువడినకారణమున తూర్పుగాంగరాజులచరిత్ర మిక్కిలిబాగుగా తెలియవచ్చినది. అంతకుపూర్వము, చెన్నరాజధాని సర్కారుశాసనాధికారుల సంవత్సరాంతపునివేదికలలో ప్రకటింపబడిన శాసనపుసూచనలవల్లనేమి, హిందూదేశశాసనావళి మొదలగు సంచికలలో ప్రకటింపబడిన ఈరాజులశాసనములవల్లనేమి కొంతచరిత్ర (ఈరాజులకుసంబంధించినది) దొరికినను, హిందూదేశశాసనముల సంపుటములవల్లనే ముఖ్యముగా పూర్తిచరిత్ర దొరికినదని నమ్మవలెను. ఇవిగాక, ఈరాజులకు సంబంధించిన బంగారునాణెములు, గంగవంశానుచరిత్ర, మాదలాపాంజి మొదలగుగ్రంథములు, ముఖలింగ-నగరకటకము, వారణాసి- కటకము, కళింగపట్టణము మొదలగుతావులలో దొరికిన చారిత్రకవస్తుశిథిలములు, ఈవంశపురాజులచేత కట్టబడి ఇప్పటికిని నిలిచియున్న ముఖలింగము, శ్రీకూర్మము, అరసవిల్లి, మహేంద్రగిరి, సింహాచలము, నారాయణపురము, జగన్నాథము, కోనార్క మొదలగుస్థలములలోని దేవళములు- ఇవిఅన్నియు ఈరాజులచరిత్రను మిక్కిలిబాగుగా తెలియజేయును.

ఈరాజులును, మైసూరుదేశమును పూర్వము పాలించిన పశ్చిమగాంగులును ఒకేవంశమునకు ప్రాచీనకాలమున చెందియున్నను, విధివశమున వేర్వేరై, ఒకశాఖవారు కళింగదేశమునను, మరియొకశాఖవారు మైసూరుదేశమునను స్థిరవాసము లేర్పరుచుకొనిరి. అనాదిని, అనగా గాంగులు రెండుశాఖలుగా విడిపోకముందు, ఈవంశమువారు గంగానదీప్రాంతమువారని వారిశాసనములవల్ల తెలియుచున్నది. మరియు క్రీ. పూ. ౪-వ శతాబ్దాంతమున పంజాబుదేశముపై దండెత్తి దానిని జయించిన అలెగ్జాండరు గంగానదీప్రాంతదేశములనుగూడ జయింపదలపెట్టగా ఆకాలమున అందుండురాజు బహుపరాక్రమవంతుడనియు, ఆతనికి సామంతులుగానున్న అందలిజాతులు గాంగరిడులు, ప్రాశ్చిజాతులని పిలువబడుచుండిరనియు గ్రీకుచరిత్రకారులవ్రాతలవలన మనకు తెలియుచున్నది. కనుక, గంగానదీప్రాంతపువారైన ఈగాంగులు కళింగమున నివసించుటచేత తూర్పుగాంగులనియు, మైసూరునందు నివసించుటచేత పశ్చిమగాంగులనియు నవీనచరిత్రపరిశోధకులచే పిలువబడుచున్నారు. ఈతూర్పుగాంగులచరిత్రయు, పరిపాలనావిధానములును తెలిసికొనుట మనకు ముఖ్యావసరము. ఏలనన ఆంధ్ర, కళింగదేశములందు ఈవంశపురాజులు క్రీస్తుశకము ౫-వ శతాబ్దాంతభాగము మొదలుకొని ౧౫-వ శతాబ్దార్ధభాగమువరకును తమ ఏలుబడిని చక్కగ జరిపిరి. వారికిపూర్వము దేశము

అనేక చిన్నచిన్న రాజ్యములుగా చీల్పబడియుండెను, జైన, బౌద్ధ మతములసంప్రదాయములతో నిండియుండెను. వాణిజ్యవ్యాపారములు, నాగరికతయు అడుగంటెను. వీరి రాజ్యప్రారంభమునుండియు ఆర్యమత సంప్రదాయములు, నాగరికత, బ్రాహ్మణమతము, వేద విద్యలు, దేవాలయములు, వాణిజ్యవ్యాపారములు దేశమున నిండియుండెను. వీరిరాజ్యము ప్రప్రథమమున గంజాం జిల్లా, విశాఖపట్టణంజిల్లాలయందుమాత్రమే స్థాపింపబడినను, క్రమక్రమముగా గంగా, గోదావరీ(ఒకప్పుడు కృష్ణా) నదుల మధ్యప్రదేశమునందంతటను వ్యాపించెను. ఈ తూర్పుగాంగవంశపురాజులలో రెండుశాఖలు గలవు. అనగా, రాజ్యకాలములనుబట్టి రమారమి క్రీస్తుశకము ౯ - వ శతాబ్దాంతమువరకును రాజ్య మేలినవారు పూర్వతూర్పుగాంగరాజులనియు, తర్వాత రాజ్య మేలినవారు పరతూర్పుగాంగరాజులనియు పిలువబడుచున్నారు. అయినను, వీరుభయులును ఒకేవంశమునకు చెందినవారనియే నమ్మవలెను. పరగాంగరాజులశాసనములలో పేర్కొనబడిన ఒకరాజు మధుకామార్ణవుడు వారివలె తనశాసనమున శకాబ్దసంవత్సరమును పేర్కొనక పూర్వరాజులవలె గాంగవంశశకసంవత్సరమును పేర్కొనుటచేత ఉభయశాఖలవారు నిజముగ ఒక్కవంశమువారనియే నమ్మవలెను. ఇదిగాక, మధుకామార్ణవునిశాసనమున పేర్కొనబడిన గాంగవంశశక సంవత్సరమును, ఆతని తర్వాత రాజ్యమునకువచ్చిన మూడవ వజ్రహస్తదేవుని శాసనమున పేర్కొనబడిన శకాబ్దసంవత్సరములు, వంశావళి, రాజ్యకాలములను బట్టి శకసంవత్సరముగా మార్చుటకు వీలు చిక్కినది. దీనినిబట్టి గాంగవంశపురాజుల కాలనిర్ణయములు స్థిరపరచబడినవి. గాంగవంశము కళింగమున రాజ్యమేలుటకు ప్రారంభముగావించినది క్రీస్తుశకము ४౯౬-వ సం. అని తేలినది. ఈవిషయములు ఇదివరలో పూర్తిగా చర్చింపబడి కొందరు పరిశోధకులచే అంగీకరింపబడినవి.

పైవిషయములు తెలిసికొనినగాని, రమారమి ౧౦౦౦ సం. తూర్పుతీరము నేలిన గాంగరాజుల పరిపాలనావిధానములు బాగుగ గుర్తెరుంగుట కష్టము. పూర్వరాజుల (అనగా క్రీస్తుశకము ౯ - వ శతాబ్దాంతమునకు ముందున్నరాజుల) రాజ్యవిస్తీర్ణము మిక్కిలి చిన్నది. గంజాంజిల్లాలోని ప్రస్తుతపు బరంపురం తాలూకామొదలు గోదావరినదివరకును గల దేశము వారిస్వాధీనమున నుండెను. ప్రస్తుతము పాడుపడిన దంతపురము మొదటరాజధాని. తర్వాత నగరకటకము రాజధాని. కళింగపట్టణము, భీమిలిపట్టణము, విశాఖపట్టణము మొదలగునవి రేవుస్థలములు. మహేంద్రగిరిపై స్థాపింపబడిన గోకర్ణస్వామి వీరికి కులదేవత. గాంగరాజులు బ్రాహ్మణులకును, దేవుళ్లకును అగ్రహారములు విరివిగా దానముచేయుచుండిరి. ఒకప్పుడు జైన, బౌద్ధమతములతో నిండిన కళింగదేశమున వీరియాదరణమున హిందూబ్రాహ్మణమతము స్థిరవాసము జెందెను. పూర్వగాంగరాజులలో నొకడగు అనంతవర్మకుమారుడు దేవేంద్రవర్మ వరాహవర్తనివిషయమందలి (ఇప్పటి శ్రీకాకుళం తాలూకా) తామరచెరువు గ్రామకుటుంబినులను సమావేశముచేసి సూర్యగ్రహణసమయమందు ఆగ్రామమును ౩౦౦ మంది బ్రాహ్మణులకును, మహేంద్రగిరి గోకర్ణభట్టారకదేవునకును ౫౧ - వ గాంగశకసంవత్సరమున దానముచేసిన విషయము తెలియుచున్నది.* సాధారణముగ దానములు దేవ, బ్రాహ్మణాగ్రహారములుగా చేసి యివ్వబడుచుండెను. అట్టి దానములకు ఎట్టి పన్నులుగాని, ఆటంకములుగాని లేకుండెను. వివాహకాలములందును, యుద్ధసమయములందును, వ్యాధిపీడితులైనప్పుడును, తటాకాదిస ప్తసంతానప్రతిష్ఠకాలములందును, ఉత్తరాయణ, దక్షిణాయన పుణ్యకాలములందును, సూర్య, చంద్రగ్రహణ పర్వకాలములందును, రాజ్యపట్టాభిషేక కాలమునందును భూదానములు చేయబడుచుండెను.

---

* Ind. Ant. Vol XIII, p 273 f.

# బలహీనత — అపాయకరమే!

శక్తి, సామర్థ్యము తగ్గుట—భోజనమునందు పనియందు అయిష్టత—జీవితముయొక్క సౌఖ్యము ననుభవించుటకు గల అసమర్థతకు యేదో నొక కారణముండవలెనని మీ రెరుగుదురు

ఆరోగ్యభంగమునకు మార్గమున కిది చిహ్నమనియు, దీనిచే దుర్భరముగా కష్టములు—అనగా క్షయ, పక్షవాతము, మూర్ఛ, మతిభ్రమ, అయితే నరముల బలహీనతకు గుఱి యగునట్టి యితర జబ్బులుకూడ గలుగునని మీకు తెలియును

యెప్పుడైన యిట్టి యోచన మీ మనస్సుకు తట్టినప్పుడు, దాని మీరు అలక్ష్యముచేయక, మిక్కిలి భద్రమైన అతిశాస్త్రీయమైన, త్వరితముగా గుణమునిచ్చునట్టి ఔషధమును (తరువాత దుర్గుణములు కలుగని) సేవింపుడు

రసాయనములన్నియు కల్పితములని తలచి వివేకశూన్యులుగాకుడు ఏలననగా కొన్ని మాత్రమే నిజముగా అట్లుండును అనేకమంది ఆలశ్యము చేయుటవలనను, ఉపేక్షవలనను వారి జీవితాశయమును వదలుకొనిరి మీకేది శ్రేష్ఠమైనదని పరిశీలించి తెలుసుకొనుడు—వైద్యవేత్తలచే ప్రపంచమునందంతటను యేది వాడబడి, ప్రశంసింపబడుచున్నదో, అదే రీతిగా బాగుపడునట్టి వారిచే గూడ స్తుతించబడినదో—అతి దుష్టవ్యాధులుకూడ దేనిచో పారదోలబడినదో అట్టి దానిని నీవు గ్రహించి సేవించుము




ఈదిగువ విషయమును జ్ఞాపకమునం దుంచుకొనుట శ్రేయస్కరము




## "అస్గంధర"




అస్గంధ్ర రసాయనమునందు, (బలమునకు) సాలా మిశ్రి, (దీర్ఘాయువుకు) కాల్సియం, (మెదడుకు) ఫాసఫొరస్, (దానికి చేరినపనుల నిర్వహించుటకు) కాయగూరలందు గల విటమినులు (తిరిగి పుష్టినిగలిగించుటకు) శ్రేష్ఠమైన ఓషదులు, వేరులు మున్నగు వాటియందుగల తప్పని అద్వితీయగుణములుండుటచే హిస్ ఎక్సలెన్సీ మద్రాసు గవర్నరుగారి యాజమాన్యముక్రింద జరిగిన అఖిలభారత వైద్యశాస్త్రజ్ఞులు ఎ ఐ ఎస్ అండ్ ఎస్ ప్రదర్శనమునందు బంగారు పతకము నొసగిరి

మా మాటను మాత్రమే మీరు నమ్మవలసినదని మేము తెలుపుటలేదు!
దీనిని పరిశోధించి, వుపయోగించినవారి అభిప్రాయమును కూడ గ్రహింపుడు
అస్గంధ్ర ధరతక్కువ యితర రసాయనము లన్నిటికంటె యెక్కువ గుణము నిచ్చును

## పారగన్ ప్రాడెక్ట్సు కంపెనీ,

(అద్భుతమైన ఓషధులశాఖ)

బల్లారు ఎస్టేట్, బొంబాయి

పరా:—హిందూదేశము, బర్మాదేశములందలి సుప్రసిద్ధ వైద్య దుకాణములలో దొరుకును.



1 రావుబహదూరు యన్ రంగనాథాచార్యులుగారు 2 మానూరి వెంకటకృష్ణారావుగారు 3 క వి రాధాకృష్ణశాస్త్రిగారు
4 రాజవైద్య, రాయవరపు అచ్యుతరామయ్యగారు 5 సాహుకార చిరంజీవి చౌదరి.




1 టి జియ్యరుదాసుగారు 2 అల్లూరి నారాయణరాజుగారు 3 వేముల కూర్మయ్యగారు
4 అప్పన సుబ్బారావుగారు 5 డా. వి వి సాగరుగారు.

దేవుళ్లకు నిత్యనైవేద్యపూజాదిసత్కర్మలకు దానములు చేయబడుచుండెను. అట్లు దానములు "సర్వకరపరిహారైః" అనగా సిద్ధాయము, దండు, అపరాధము మొదలగుపన్నులనుండియు, సర్వాటంకములనుండియు అనగా, అచట, బట మొదలగువారి రాకపోకలతో నిమిత్తము లేకుండగా తప్పింపబడి ఇవ్వబడుచుండెను. అట్టిదానములు చేయబడుసమయమున ఆయా గ్రామమునందలి కుటుంబినులను (వ్యవసాయదార్లను) సమావేశము చేసి వారి ఎరుకతోను, అనుమతితోను రాజాజ్ఞలను వినుపించుచుండెను. ఒక్కొక్కప్పుడు ఆయా రాష్ట్రములందలి ప్రధానులను, మాండలికులను, జానపదులను సమావేశముచేసి రాజు తనయాజ్ఞలను వినుపించుచుండెను. దానములు సరిగా జరుగుటకై సంధివిగ్రహికునకో, లేక సామంతమాండలికునకో రాజు ఆజ్ఞ యొసగుచుండెను. దానములు పొందిన బ్రాహ్మణులు వేదవిద్య నేర్పుటకును, వేదమతము, లేక వైదికమతము దేశమున వృద్ధిచేయుటకును, రాజ్యపరిపాలనావిధానములందు రాజునకు తోడ్పడుటకును నియమింపబడినట్లు తోచును.

దానార్ణవునికొడుకగు ఇంద్రవర్మయొక్క గాంగ సంవత్సరము 154 తాలూకు టెక్కలిశాసనమునుబట్టి* అప్పటి కాలమానములలో బ్రహ్మదేయపుకాలమాన మొకటుండెననియు, భూములకు తటాకములందలి నీరు కాలువలద్వారా ప్రవహింపజేసి సాగుబడి చేయుచుండెడివారనియు, భూమి, నీటి పన్నులు రాజులు సంగ్రహించుచుండెడివా రనియు తెలియుచున్నది. ఈ శాసన ఆజ్ఞప్తి మహామహత్తర హారిశర్మ. ఈ మహామహత్తర దేశమునందలి పెద్ద యుద్యోగి యని చెప్పవచ్చును. సంధివిగ్రహి రాజకీయవిషయములం దారితేరినట్టియు, యుద్ధములు, సన్ధిచేయుట మొదలగుపనులు గల్గిన యుద్యోగి. మహామండలికుడు ఒక మండలాధిపతిగా నుండిన యుద్యోగి. మండలములు ఇప్పటి జిల్లాలకంటె చిన్నవిగను, విషయములు, లేక భోగములు ఇప్పటి తాలూకాలకంటె చిన్నవిగాను ఉండెను. విషయ, లేక భోగ పతులు మండలాధిపతులక్రింది సామంతోద్యోగులు. ప్రతివిషయమునను పెక్కువందలగ్రామము లుండెను. గ్రామాధిపతులు, గణకులు, కరణికులు, ఉపాధ్యాయులు, తలవరులు, అచటబటులు, భోగిక, వారిక మొదలగు చిన్న ఉద్యోగులు ప్రతిగ్రామమునందు నుండిరి. జానపదులు, కుటుంబినులు, రాష్ట్రకూటప్రముఖులు రాజాజ్ఞలను శిరసావహించి కొనసాగించుచుండిరి. గ్రామ కుటుంబినులందరును కలిసి గ్రామము మొత్తముపై చెల్లించవలసిన పన్నులకు బాధ్యత వహించుచుండిరి.

ఈ ఇంద్రవర్మకాలమున అనగా క్రీ. శ. ౭౯౭మొదలు ౬౭౩ మొదలు ౬౧౦ వరకు దేశము బహుశాంతి గొనెను. శాసనములనుబట్టి కళింగులు ఆంధ్రభాష నే వాడుచుండి రని తెలియును. శాసనముల లిపి ప్రాచీనపు తెలుగు; భాష సంస్కృతము. దేశమున వేదవిద్యయు, వైదిక మతసంప్రదాయములును, ఘటికాశ్రమములును, దేవాలయనిర్మాణములును వృద్ధిపొందుటచేత ఆర్యుల నాగరికత హెచ్చెను. ప్రాయశః ఈతనిరాజ్యకాలమున నే చీనాదేశపు బౌద్ధయాత్రికుడగు యుఆన్‌ఛ్వాంగు కళింగదేశమునసంచారము చేసెను. ఆతని గ్రంథమును బట్టి కళింగ దేశము ౧౦౦౦ మైళ్లు చుట్టుకొలత గలిగియుండెను. దానిరాజధాని ౪మైళ్లువిస్తీర్ణముగలిగియుండెను. భూములు ఫలవంతములైనసస్యసమృద్ధి గలిగియుండెను. దేశమునందలికారడవులు, కొండలు మైళ్లకొలది వ్యాపించి మదపు ఏనుగులతో నిండియుండెను. ప్రజలు అనాగరకులు, మోటువారలయ్యు విశ్వాసపాత్రులుగాను, న్యాయవాదులుగాను, స్పష్టముగా మాట్లాడువారుగాను ఉండిరి. దేశమునందు కొద్దిమందిమాత్రము బౌద్ధమతస్థులు. విశేషించి ప్రజలు హిందూమత మవలంబించిరి. దేశమున ౧౦ బౌద్ధమఠము లుండ, నూరుకంటె నెక్కుడుగ హిందూ దేవాలయము లుండెను. నిర్గ్రంథులు (జైనులు) గూడ నుండిరి. దేశము ఋషిశాపమున జనహీనముగా నుండెను.

* Ep. Ind. vol. XVIII. pp- 307-311.

ఈ ఇంద్రవర్మ సమకాలికుడును, తూర్పుచాళుక్య వంశీయుడును, వేంగీభూపాలుడును నగు మొదటి జయసింహు (క్రీ. శ. ౬౩౩-౬౬౬) నాస్థానము నలంకరించిన దండిమహాకవి రచించిన దశకుమారచరిత్రమునుబట్టి కళింగ, వేంగిదేశములకు యుద్ధములు జరుగుచుండెననియు, నావికదళము లుండెననియు తెలియుచున్నది. కళింగులు ఆకాలమున తూర్పుదీవులు, చైనా, లంక, మొదలగు ప్రదేశములతో విరివిగా వర్తకము సాగించుచుండిరి. ఆకాలపునాణెములు గంగమాడలనుపేరను, వంగపరక లనుపేరను, పెక్కులు అనేకస్థలములందు దొరికినవి. నాణెములు ముద్రించుటకు టంకశాలలు, శాసనములు రచించుటకు లేఖకస్థానములు ఏర్పరచబడెను. సముద్రతీరపుపట్టణములందు నావికదళములు, వర్తకపుపన్నులు వసూలుచేయుటకు సుంకాలయములు ఉండెను. తూర్పుదీవులకు, సువర్ణభూమికి, లంకకు కళింగులును, ఆంధ్రులును వలసబోయి తమమతమును, భాషను, నాగరికతను అందు నెలకొల్పిరి. దీనికి ఆ దేశములలో కన్పట్టు శైవాలయములును, తెల్గులిపియందు వ్రాయబడిన శాసనములును, క్లింగులని పిలువబడు ప్రజలును నిదర్శనములు.

ఇంక, పరగాంగరాజులశాసనములనుబట్టి తెలిసికోదగిన పరిపాలనావిషయము లెన్నియో కలవు. బొబ్బిలితాలూకాయందలి నారాయణపురముననున్న నీలేశ్వరదేవాలయమునందును, గంజాంజిల్లాలోని శ్రీకూర్మం, ముఖలింగం దేవాలయములందును, విశాఖపట్టణముసమీపముననున్న సింహాచలాలయమునందును, తూర్పుగోదావరిజిల్లాలోని ద్రాక్షారామభీమేశునియాలయమందును గల పెక్కువందల శిలాశాసనములనుబట్టియు, ఈపరగాంగరాజుల తామ్రశాసనములనుబట్టియు, ఆకాలపు రాజకీయపరిస్థితులు మిక్కిలి బాగుగా తెలియుచున్నవి. క్రీ. శ. ౧౦-వ శతాబ్దము మొదలు ౧౫-వ శతాబ్దార్థభాగమువరకును గంగాకృష్ణామధ్యస్థదేశమునంతను పరిపాలించిన ఈ సుప్రసిద్ధ తూర్పుగాంగరాజులు తమ రాజ్యాంగవిధానములనుఉచ్చస్థితియందుంచిరి. అప్పటికాలపు రాజకీయపు టుద్యోగములు కొన్నింటి నిందు పొందుపరిచితిని. వాటినిబట్టి చదువరులే ఆకాలపు రాజ్యాంగవిషయములు గ్రహింతురుగాక.

సేనాపతి, మహాసేనాపతి, నాయక, నాయకాణి, సంధివిగ్రహి, మహాసంధివిగ్రహి, దండనాయక, మహాదండనాయక, శ్రీకరణ, రాచపురవరి, సాహిణి, లవణకరాధికారి, ప్రధాని, మూలభండారమున ముద్రహస్త, మండలిక, మహామండలిక, రాచపడిహస్త, శాసనకుడు, రట్టడి, మహాదండవాసి, మహారాణక, విషయపతి, నగరపాలక, పురోహిత, దండపాసి, తలవరి, నగరాధ్యక్ష, కళింగరక్షపాలక, రాజగురు, మహాప్రధాని, మహాపాత్ర, పాత్ర, మహాసామంత, సామంత, రాజానక, కుమారామాత్య, ఉపరిక, గ్రామాధ్యక్ష, మహాప్రతిహార, ప్రతిహార, పంచవిషయమండలేశ్వర, పంచపాత్ర, రాజపాదోపజీవిన, సామభొజి, మహామహత్తర, మహత్తర, బుడయివెంక, భోగపరీక్ష, కళింగదండపర. ఆకాలమున కళింగదేశము అనేకమండలములక్రింద విభజింపబడియుండెను. ఒకమండలము అనేకనాడులు, లేక విషయములుగ విభజింపబడెను. శాసనములలోని కొన్నినాడులు ఇట్లు పేర్కొనబడినవి: చోడవలనాడు, గుద్దవాడినాడు, జంతరునాడు, సరుడనాడు, ప్రోలనాడు, నుంగనాడు, పొత్తపినాడు, దిమిలసీమ, వరాహవర్తని, కులవర్తని, రూపవర్తని, క్రోష్ఠుకవర్తని, ప్రక్కినాడు. ఆకాలమున రాజులును, రాణులును, ఉద్యోగులును, ప్రజలును విశేషముగా దానములను జేయుచుండుటయు, అట్టిదానములు దాతలఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికైకాని, పుత్రపౌత్రాభివృద్ధికైగాని, మాతాపితృస్వపుణ్యాభివృద్ధికైగాని, దేవబ్రాహ్మణ, రాజ, గురు, బంధుజనప్రీతికైగాని చేయబడుచుండుట ఆచారము. దానములు అఖండవర్తిదీపమునకై చేయబడుచుండెను. అట్టిదానములు పురవరి, లేక ఇతరఉద్యో

గీయులవశమునగాని, బోయలు, లేక పశువులకాపరుల వశమునగాని పెట్టుట ఆచారము. దీపదానము జరుపుటకై ఆవులు, గొఱ్ఱెలు, మేకలు, భూములు, నాణెములు పెట్టుట కలదు. పలురకముల నాణెములు శాసనములలో పేర్కొనబడినవి. మచ్చునకు కొన్నింటిని ఉదాహరించుచున్నాను: మాడలు, గండమాడలు, గంగమాడలు, మల్లమాడలు, మత్స్యమాడలు, చిరుగండమాడలు, చిన్నాలు, టంకాలు, పసుకాణి టంకాలు, మత్స్యగద్యలు, పరకలు. రాజులకుగల బిరుదములనుబట్టి వారు నిజముగ చక్రవర్తులని చెప్పవచ్చును. శకసం. ౧౦౦౩ నాటి అనంతవర్మచోడగంగుని కొర్ని శాసనమునను, ముఖలింగాలయమున నున్న శిలాశాసనములవల్లను గాంగరాజుల కందరకును అనంతవర్మ మహారాజు, రాజాధిరాజు, రాజపరమేశ్వర, పరమభట్టారక, పరమమాహేశ్వర, త్రికళింగాధిపతి మొదలగు సార్వభౌమబిరుదము లుండినట్లు తెలియుచున్నది. ఆశాసనమున రాజు వరాహవర్తనివిషయ మందలి రాష్ట్రకూట ప్రముఖులను, కుటుంబినులను సమావేశముచేసి పురోహిత, అమాత్య, యువరాజ, సంధివిగ్రహి, దౌవారిక ప్రముఖ పరిజనసమక్షమున ఖోన్నగ్రామమును సత్కర్మనిరతులగు ౩౦౦ బ్రాహ్మణులకు దానము జేసెనని తెలుపబడినది.

ఈగాంగరాజులు కటకమునకు క్రీ. శ. ౧౧౩౨ లో తమరాజధానిని మార్చకమునుపు సింహాచలము, ముఖలింగము, శ్రీకూర్మము, అరసవిల్లి, దీర్ఘాసి, మహేంద్రగిరి, నారాయణపురము మొదలుగాగల స్థలములలో పెక్కుశివాలయములను గట్టించిరి. అనంతవర్మచోడగంగ కటకము జయించి తనరాజధానిని అక్కడకు మార్చినదాదిగా వైష్ణవమతమునం దాసక్తి గలవాడయ్యెను; పురి, లేక జగన్నాథమున పురుషోత్తమున కాలయము కట్టించెను.

ఈతనితర్వాత రాజ్యమునకు వచ్చిన రెండవ రాజరాజదేవు, రెండవ అనంగభీమదేవులకాలములలో భువనేశ్వరమున పెక్కుశివాలయములును, వైష్ణవాలయములును కట్టబడెను. మూడవ అనంగభీముని కాలమున (క్రీ. శ. ౧౨౧౧-౧౨౩౮) నరసింహమహోమునులు తమమతమును వృద్ధిచేసెను. రాజు జగన్నాథాలయమున కనేకమండపములు, గోపురములు కట్టించెను. ఈతనికొడుకగు మొదటినరసింహదేవు (క్రీ. శ. ౧౨౩౮-౧౨౬౪) కోనకోనయందు సూర్యదేవునికి సుప్రసిద్ధమైన యాలయ మొకటి కట్టించెను. ఈకోనార్కాలయమును, అందలి సూర్యరథము, నాట్యమందిరము, అందలి నటకులయొక్కయు, గాయకులయొక్కయు, విగ్రహములును ఆకాలమునాటి శిల్పచాతుర్యమును చాటుచున్నవి. ఈకాలముననే ఈరాజుగురువగు నరహరితీర్థులు కళింగమున మండలికపదవియం దుండి మాధ్వమత సంప్రదాయములను కళింగదేశమునందంతటను వ్యాపింపజేసెను. అనేకమఠములు, దేవాలయములు కట్టబడెను. రాజులును, మంత్రులును పెక్కు దానశాసనములను చెక్కించుటచే మనకు అప్పటికాలపు మతచరిత్ర, రాజకీయపరిస్థితులు బాగుగా తెలియుచున్నవి. నాల్గవ నరసింహదేవుని పురి (జగన్నాథము) తామ్రశాసనములనుబట్టి, రాజులు తరుచుగా దేశమున సంచారములు సల్పుచుండెడివారనియు, మహమ్మదీయులు దండెత్తకుండ దేశమును సంరక్షించుచుండిరనియు, పెక్కుసామంతరాజవంశీయులవల్ల కప్పములను గైకొనుచుండిరనియు, రాజకీయ, ఆర్థిక, మత విషయములం దారితేరి సామంతోద్యోగులను పురికొల్పుచుండెడివా రనియు, రాజ్యము (గంగాగోదావరీనదుల మధ్యప్రదేశము) శాంతిని, సౌఖ్యమును పొందియుండెననియు తెలియుచున్నది.




మారేమండ రామారావు యం. ఏ., బి. ఇడి.,

చంద్రగుప్తమౌర్యుని కాలమునకే జైనమతము దక్షిణాపథమున వ్యాపించినది. అంతటినుండి క్రీ. శ ౧౧-వ శతాబ్దివరకు నీమతము ప్రబలముగ నుండినది. క్రీ. శ. ౧౧౫౦ ప్రాంతమున బసవేశ్వరుడు వీరశైవమతమును బోధించెను. ఆతనియేలికయగు బిజ్జలకాలాచుర్యుడు జైనుడగుటవలన బసవేశ్వరునికి రాజాశ్రయముచే నప్పటికి ప్రబలముగనుండిన జైనులవలన పెక్కుకష్టములు గలిగెను కడపట నీమతబోధకుడు రాజును చంపించి తదాశ్రితులగు జైనుల ననేకవిధముల హింసించెను కాలక్రమమున జైననిర్మూలనము శైవమతవ్యాపనమునకు ముఖ్యసాధనముగ నేర్పడెను. ఎన్నియోస్థలముల శైవమతస్థులు జైనులను జంపియు, వారిసంస్థలను నాశమొనర్చియు, జైనమతమును విధ్వంసమొనర్చిరి. దక్షిణాపథమత చరిత్రమునం దిదియొక ముఖ్యమగు ఘట్టము. బసవపురాణాది శైవగ్రంథములందును, కొన్ని స్థానిక చరిత్రములందును ఈమతయుద్ధముల ప్రశంస గలదు. అందును కాకతీయులకాలమునం దీజైనవిధ్వంసనము ప్రబలముగ నుండిన ట్లగపడుచున్నది. ఈవాఙ్మయాద్యాధారములను బలపరచు నితర చారిత్రక ప్రమాణము లరుదుగ లభించినవి. కట్టడములనుండియు, శిల్పమునుండియు నీజైనమత విధ్వంసమునుగూర్చి యెరుంగనగును. ఇట్టివి నైజాం రాష్ట్రాంతర్గతములగు కొల్లిపాక, గంగాపురము, పూడూరు మున్నగు స్థలముల గలవు. పూడూరుగ్రామమునందలి శిథిలములను వర్ణించి యవి శైవమతయుద్ధవిషయకములగు వాఙ్మయాద్యాధారముల నెట్టుల బలపరచునో యీవ్యాసమున జూపబడును.

పూడూరు హైదరాబాదు-కర్నూలు రైలుమార్గమున గద్వాలకైదుమైళ్లదూరమునందుండు చిన్నగ్రామము. గ్రామమును సమీపించినతోడనే రైలుమార్గ. మొకదిబ్బముగనున్న మట్టిగోడగుండా పోవును. ఈగోడ గ్రామముచుట్టును వలయాకారముగ నున్నది. ఇదిగాక కేశవస్వామియాలయము, మల్లికార్జునగుడి, వీరభద్రదేవళము నాగ్రామమున జూడదగిన ప్రదేశములు.

కేశవాలయము చతురస్రమగు నొకయావరణపు మధ్యభాగమున నిర్మింపబడినది. ఈయావరణ పడమటిగోడలో సింహద్వారమున్నది. నీలశిలానిర్మితమును, చక్కని శిల్పముగలదియు నగు నీద్వారము చాళుక్యులకాలమున నిర్మింపబడినది. స్థానికులనడుగగా నాయూరబావిని త్రవ్వునపుడీద్వార మంటలనే దొరకెననియు, దానినంతకుపూర్వముండిన గుమ్మమును దీసివైచి యిది సింహద్వారముగ నమర్చిరనియు జెప్పిరి. ఇచ్చటి కేశవాలయమునం దొకప్రవేశమంటపమును, దానినంటి యంతరాళమంటపమును, దానివెనుక గర్భాలయమును గలవు. ఆలయము పైభాగమున గోపురములేదు. చుట్టును మూడడుగులయెత్తున నొకపెట్టగోడమాత్రము గలదు.౧ పదునారవ శతాబ్ది యుత్తరార్ధమునందుండిన గద్వాలురాజగు పెదసోమభూపాలు డప్పటికి శిథిలమైయున్న పూడూరి కేశవాలయము నుద్ధరించెనని స్థానిక చరిత్రములలో నున్నది.౨ ౧౭, ౧౮ శతాబ్దములనాటి యాంధ్రవాఙ్మయమున నీకేశవస్వామి ప్రశంస విశేషముగ గన్పించుచున్నది. మొదటినుండియు నీయాలయమునందుండిన కేశవస్వామి విగ్రహము గద్వాలదుర్గమునందలి కేశవాలయమునకు గొనిపోబడెననియు,౩ కొంతకాలమయినపిమ్మట నొకచేయి భిన్నముకాగా నావిగ్రహము కృష్ణలో పడవేయబడెననియు స్థానికులు దెలుపుదురు.

కేశవస్వామియాలయమున కుత్తరముగా రెండుఫర్లాంగులదూరమున ముందుపేర్కొనబడిన మట్టిగోడ గలదు. ఈ స్థలమున నెచ్చుతగ్గులుగాబడియున్న చదరపుగళ్లనుండియు, గోడలోగల యానవాళ్లను

౧. గద్వాల సంస్థానములోని దేవళములు చాలవరకు నిటులే నిర్మింపబడినవి.

౨. గద్వాల కైఫీయతు. Loc. Rec. Vol. XXXVIII.

౩. గద్వాలదుర్గమును, అందలి కేశవాలయమును పెదసోమభూపాలునిచే క్రీ. శ. ౧౬౯౮-౧౭౦౫ ల నడుమ నిర్మింపబడినవి.

బట్టియు నిట గోడలో నొకద్వారముండెడిదని యూహింపవచ్చును. ఈగోడ యావలిభాగమున నుత్తరముగనేగు బాట గలదు. ఈమార్గము ననుసరించి యొకఫర్లాంగుదూర మేగినచో, బాటకెడమవైపున చిన్న దేవళమొకటి గన్పించును. ఇదియే మల్లికార్జునగుడి. ఐదడుగులయెత్తు గలతిన్నెపై గట్టబడిన యీగుడిలో నొకలింగముమాత్ర మున్నది. వెనుక వైపునుండి యాలయము పడిపోవుచున్నది. ఇచ్చట నొకచింతచెట్టు క్రింద ౪ అడుగులయెత్తున ప్రాక్పశ్చిమముగ నొకచిన్నగోడగలదు. దీనినాని యీక్రిందివిగ్రహములు గలవు

౧. ఇర్వురు ద్వారపాలకులు.

౨. కూర్చునియున్న యొకదేవీమూర్తి.

౩. అటులేయున్న పురుషవిగ్రహము

౪. పద్మాసనమున గూర్చొని తలపైయేడుపడగల సర్పముగల యొకధ్యానజైనమూర్తి.

౫. నిలచియున్న మరియొకజైనవిగ్రహము.

౬. సుందరముగ చెక్కబడి యాభరణాదులతోనుండిన మరియొక జినమూర్తి.

ఈ విగ్రహములన్నియు భూమిని త్రవ్వినపుడు వెలువడినవనియు, వీనికి జైనబొమ్మయ్యలని పేరనియు స్థానికులు దెల్పిరి.

మల్లికార్జునగుడినిదాటి కొంతదూర మేగినచో నొక శిలాప్రాకారశిథిలము గానవచ్చును. ఇదియు వలయాకారముగనే యున్నది. బహుశః ఇయ్యది బహిఃప్రాకారమై యుండును. దీని కుత్తరముగ రెండుఫర్లాంగుల దూరమున వీరభద్రాలయము గలదు. చరిత్రాన్వేషుల కీయాలయము మిగుల ముఖ్యమైనది. ఇందు ముందరిభాగమున నొక చిన్నిమంటపము (Porch)ను, దానివెనుక విశాలమగు ప్రవేశమంటపము, నటుపై అంతరాళమంటపము, నటుపిమ్మట గర్భాలయమును గలవు. గర్భగుడిలో నొకలింగ మున్నది. ప్రవేశమంటపమున గుడివైపున వీరభద్రుని విగ్రహము గలదు. దీనినుండియే యాలయమునకు వీరన్నగుడి యనిపేరు వచ్చినది. కేశవాలయమునందువలె గాక నీగుడి పైభాగమున శిఖరము గలదు. ఇది మెట్లుమెట్లుగ నుండి పైకి పోనుపోను సన్నమగును. అగ్రమున తలక్రిందుగ బోర్లింపబడిన కలశముగలదు.౪ ఇట్టిపద్ధతినినిర్మింపబడిన శిఖరములు జైనదేవాలయములపై గాంచనగును. పశ్చిమాభిముఖమగునాయాలయమున కెదురుగ నొక చిన్న మంటపమున చక్కని నందియు, దానివెనుక నొకవేదికపై ధ్వజస్తంభమును గలవు. అటుపై ఆలయ సింహద్వార మున్నది. ఈద్వారము నంటి యుత్తరముగ నొకమట్టిగోడ గలదు. ఆగోడలో నీక్రిందిశిల్పశకలములు బిగింపబడినవి.

౧. ఒకచేతకత్తిని, మరియొకచేత డాలునుగల నాలుగు నాగీవిగ్రహములు.

౨. ఇరుపార్శ్వములను చామరములు వీచు స్త్రీ లుండ మధ్యభాగమున ధ్యానముద్రలో పద్మాసనమున గూర్చొనియున్న జినుడు. వానిక్రింద గుఱ్ఱముపై నొక స్త్రీయు, పురుషుడును.

౩. గుఱ్ఱములపైనున్న యిర్వురు యోధు లొండొరులతో బోరుట.

౪. పై నొకధ్యానజైనవిగ్రహము. క్రిందిభాగమున నిర్వురు యోధులు కత్తులతోబోరుట.

౫. ఒకటియు నంతకుమించినవియు నగు పడగలుగల నాగవిగ్రహములు.

వీరన్నగుడికావల ప్రాక్పశ్చిమముగ నొకసత్ర మున్నది. దీని కుత్తరముగ నొకశాఖయు గలదు. ఈసత్ర మిటీవల బాటసారుల సౌకర్యమునకై నిర్మింపబడినది. దీనియుత్తరశాఖయొక్క వెలుపలిగోడలో కెన్నియో మనోహరములగు శిల్పములు బిగింపబడినవి. ఇవియును పొలములదున్నునపుడును, బావులను ద్రవ్వినపుడును దొరకినవియేయని స్థానికులు చెప్పిరి. ఈశిల్పములలో నీక్రిందివి ముఖ్యములు.

౧. ఒకద్వారబంధపుదూలము. దీనిపై చక్కని నగిషీపని గలదు. నడుమనున్న గజలక్ష్మివిగ్రహము మనోహరమైనది.

౨. అట్టిదే మరియొకదూలము. దీనిపై తాండవనృత్యము చేయుచున్న నటరాజవిగ్రహము గలదు.

౩. రామాయణమునందలి సీతారామవనవాసమును, శూర్పణఖానాసికాచ్ఛేదమును చిత్రింపబడిన యొక స్తంభము.

౪. ఇది యొకవిశేషమగు శిల్పము. ఇందు మొదటివరుసలో చామరహస్తలగు నిర్వురు స్త్రీలనడుమ నొకధ్యాని జైనవిగ్రహమును, దానిప్రక్క నొక వేదికపై లింగమును గలవు. రెండవవరుసలో శివలింగముక్రిందనిలచిన యొకపదాతి జినప్రతిమక్రింద నున్న యొకరౌతు గుఱ్ఱమును ఈటెతో పొడుచుచున్నటు లున్నది. వీనిక్రిందుగ రౌతునకుదగ్గరగా మృతదేహమొకటి యున్నది.

పైనపేర్కొనబడిన కట్టడములును, శిల్పములేగాక పూడూరులో కర్ణాటాంధ్రభాషలలో నారుశాసనములు గలవు. వానిసారాంశము నీక్రింద నొసంగుచున్నాను:

(i) మల్లికార్జునగుడివద్ద, బాటకెడమవైపున నొకచేనుగట్టుపైనున్న బండపైగల కన్నడశాసనము. దీనికాలము ౧౨-వ చాళుక్యవిక్రమసంవత్సరము. ఇందు పశ్చిమచాళుక్యచక్రవర్తియగు త్రిభువనమల్లుని సామంతుడగు పూండూరహల్లకరస తనగురువును ద్రవిడసంఘ

౪. హనుమకొండలోని సిద్ధేశ్వరాలయమునకును, పద్మాక్షిగుడిపైనను, వరంగల్లులోని స్వయంభూదేవాలయముమీదనుగూడ నిట్టి శిఖరములు గలవు.

మునకు జెందిన పల్లవజినాలయమున వసించువాడునగు కనకసేనభట్టారకునికి జేసినధర్మములు పేర్కొనబడినవి. ఈశాసనమునందలి మొదటి వైపున అడుగుభాగమున నొకసంస్కృతశ్లోక మిటులున్నది:

స్వస్తి శ్రీజగతీతలైకతిలకే శ్రీపుండ్రసంజ్ఞేపురే
శ్రీమత్పల్లవరాజఖ(డ్గ)జలతో దుర్గే యశస్సాసరే,
చూతారామసుగంధశాలివనకే సంతిష్ఠతే సద్గురుః
శ్రీమత్కాంచనసేనపండితపతిః విఖ్యాతకీర్తిప్రియః.

ఈశాసనారంభమున నొకజినప్రతిమయు, దానిక్రింద

శ్రీమత్పరమగంభీర స్యాద్వాదామోఘలాంఛనం
జీయా త్త్రైలోక్యనాథస్య శాసనం జినశాసనం.

నిత్యపూజాలయ స్సర్వం శ్రీపల్లవజినాలయం
నిత్యపూజాలయ స్సర్వం శ్రీపల్లవజినాలయం.

అను రెండుశ్లోకములు గలవు.

(II) పూడూరుదక్షిణభాగమున గణపతిగుడివద్ద బాటనానియుండు బండపైనున్న కన్నడశాసనము. ఇందును ప్రారంభమున జినవిగ్రహమును, పైరెండుసంస్కృతశ్లోకములును గలవు. ఈశాసనము పైహల్లకరస మరుసటిసంవత్సరము చేసినదానమును పేర్కొనును.

(III) మల్లికార్జునగుడి కెదురుగ బాటనడుమగల శిలాఖండముపై గల శాసనభాగము. కరికాలకులప్రదీపకాది తెలుగుచోడ బిరుదములు గల రాజశేఖరు డనువానికాలమునాటిది.

(IV) కేశవస్వామిగుడిలో, ప్రవేశమంటపమునందలి యొక స్తంభముపై నుండు శాసనము. అరగిపోయినది. కోమార్ప్రరవరాధీశ్వరుని ప్రశంస యిందు గలదు.

(V) వీరన్నగుడిప్రక్కనుండు సత్రము గోడలోగ జలక్ష్మిదూలముపై రెండుపంక్తులలోని పాతకన్నడాక్షరములు. "స్వస్తి శకవరిస ఎన.. నాల్వత్తెణ్టనెయ సర్వజిత్సంవత్సర ప్రవర్తిసె" యని యొకపంక్తియు, "శ్రీపోరవణగావుణ్డమాడిసిద"యని మరియొకటియు దెల్పుచున్నవి.

(VI) అదేసత్రములో మూలలో నిలువున సగముభాగము బిగింపబడిన స్తంభముపై తెలుగుశాసనము. ఇందు "శకవరుషం, ప్రజాపతి సంవత్సర, జగదాళ, ఈశ్వరప్రతిష్ఠ, గుడి కట్టించి" యను పదములు తెలియుచున్నవి.

ఇంతవరకు నుదాహరింపబడిన కట్టడములనుండియు, శిల్పముల వలనను, శాసనములమూలమునను, మధ్యయుగమునాటి రాజకీయమత చరిత్రములకు సంబంధించిన విశేషాంశములు గొన్ని తెలియనగుచున్నవి. మల్లికార్జునగుడివద్దనున్న శాసనమునుండి పూడూరునకు పూర్వము పుండ్రపురమను నామముండెడిదనియు, నిట నొక దుర్గముండెడిదనియు దెలియుచున్నది. నేటికిని గాంచనగు మట్టిగోడ దానిలోనిభాగమై యుండును. ఈపూడూరిదుర్గమును పండ్రెండవ శతాబ్ద ప్రారంభమున హల్లకరసయనునతడు పాలించుచుండెను. ౧౪-వ శతాబ్దికిపూడూరుసీమపై వీరారెడ్డియనునతడు నాడగౌడుగనుండెను. ఆతనియనంతర మాతని దౌహిత్రుడగు పెదసోమభూపాలు డీసీమ కధిపతియయ్యెను. ఆరాజు తననివాసమును గద్వాలదుర్గమునకు మార్చినపిమ్మట పూడూరుదుర్గము క్రమక్రమముగ శిథిలమయ్యెను.[౫] పశ్చిమచాళుక్యులకును గాకతీయులకును నడుమ ఆంధ్రదేశమును తెలుగుచోడు లేలిరి. ఆచారిత్రకాంశమును బలపరచుటకు పూడూరులో రాజశేఖరచోడుని శాసనముగలదు వీరభద్రగుడివద్ద సత్రములో నొకమూలనున్న శాసన స్తంభము తరువాత జరిగిన వృత్తాంతమును దెలుపుచున్నది. ఇందు శకవర్ష సంఖ్యగలభాగము తెలియుట లేదు. ప్రజాపతి సంవత్సరముమాత్రము గలదు. ఇందలి యక్షరములు కాకతీయగణపతిశాసనములలోని యక్షరములను పోలియున్నవి. ఈ శాసనములోని జగదాళయనునతడు పాఖాలశాసనమున కాకతిగణపతి సామంతుడుగ బేర్కొనబడిన జగదాళుడు గానోపును. సుప్రసిద్ధ జైనస్థలమగు పూడూరులో శివాలయప్రతిష్ఠ చేయబడెనని యీశాసనము దెల్పుచున్నది. గణపతిదేవునికాలమున జైనులు హింసింపబడిరనియు, శైవమతము విజృంభించెననియు స్థానికచరిత్రములు మున్నగునవి ఘోషించుచున్నవి. కాన నీశాసనమందలి జగదాళుడు పాఖాలశాసనములోని జగదాళుడేయని చెప్పవచ్చును.[౬] దానినుండి పూడూరులోగూడ తెలుగుచోళులకు వెనుక కాకతీయులు రాజ్యమేలిరని చెప్పనగును.

పూడూరుశిథిలములు మతచరిత్రమునకు మిక్కిలిముఖ్యములు. నేటివీరభద్రాలయము మొదట జైనదేవాలయముగ నుండెననుట కాయాలయశిఖరమే ప్రబలనిదర్శనము. మల్లికార్జునగుడివద్దనున్న కన్నడశాసనములోని పల్లవజినాలయ మిదియేయగును. అటులయినచో దీని చుట్టును చక్కనిమామిడితోటయొకటి యుండియుండవలెను. హల్లకరసగురువగు కనకసేనభట్టారకు డిటనే యుండెను. మల్లికార్జునునిగుడి ప్రక్కన గోడకాన్చియుంచబడిన విగ్రహములలో నేడుపడగలసర్పము తలపైగల దిగంబరజైనవిగ్రహమును, అచటివేయగు స్త్రీపురుషదేవతావిగ్రహములను చేర్చినచో, నొకజైనతీర్థంకరుడు, నాతనివెంబడి గాంచనగు యక్షయక్షిణీవిగ్రహములు నగును. జైనశిల్పశాస్త్రముల ననుసరించి ౨౨-వ తీర్థంకరుడగు పార్శ్వనాథునితలపై నిట్టిపడగ యుండవలెను.[౭] కాన నీవిగ్రహము పార్శ్వనాథునిదనియు, నీతడు

౫. యథాశ్లోక తాత్పర్య భారతోద్యోగపర్వము, పుటలు ౬—౮.

౬. ఈయూహనుబట్టి యీశాసనములోని ప్రజాపతి సంవత్సరము క్రీ. శ. ౧౨౧౧ కు సరియైనదని నిర్ణయింపవచ్చును.

౭. Ind. Ant. for **1927,** p. 3.

నీతని యక్షయక్షిణీవిగ్రహములును 'పూడూరు పల్లవజినాలయమున మొదటనుండినదనియు జెప్పవచ్చును. ౧౨-వ శతాబ్దిలో జైనశైవమతములకు యుద్ధముజరిగి, శైవము జయించి జైనమతమును విధ్వంసమొనర్చెనని యిదివరలో చెప్పియుంటిమి. ఆమతసంఘర్షణము పూడూరులోగూడ జరిగినది. పల్లవజినాలయము వీరన్నగుడిగ మారి, యందలి జైనతీర్థంకరునకుబదులుగ శివలింగవీరభద్రవిగ్రహములు స్థాపింపబడుట యిందుల కొక ప్రబలనిదర్శనము. ఈవీరన్నగుడివద్దగల సత్రపుగోడలోనున్న శిల్పములలో నాల్గవదిగూడ నీవిషయమునే సూచించుచున్నది. ఇది యొకసాంకేతికశిల్పమని తోచుచున్నది ఇందలిజినవిగ్రహమును, లింగమును జైనశైవమతములను సూచించును. వీనిక్రింద నిర్వురు యోధులు పోరాడుట పైరెండుమతములకును జరగిన సంఘర్షణమును దెల్పుచున్నది. జైనవిగ్రహముక్రిందనుండు రౌతుకాళ్లవద్దగల మృతదేహ మాతనిదేయనియు దన్మూలమున జైనమత పరాజయమును, శైవమతవిజయమును సూచింపబడుచున్న వనియు స్పష్టమగుచున్నది. దీనికిఫలితముగనే పల్లవజినాలయమున శివలింగమును, వీరభద్రవిగ్రహమును బ్రతిష్ఠింపబడియుండును. ఇచటి సత్రములోని స్తంభముపైగల శాసనమున నొక శివాలయము గట్టింపబడెనని యున్నది. ఇది నేటి వీరన్నగుడియగుటకు వీలులేదు. కాన నీయూర మరియొక శివాలయ ముండెడిదని చెప్పవలెను. సత్రముగోడలో బిగింపబడిన నటరాజవిగ్రహముగలదాల మీ యాలయములోనిదే యనియు, నీయాలయము నాదాలమువలె భూగర్భమునం దుండుననియు నూహింపవచ్చును. ఇట్టి నటరాజవిగ్రహముగల దాలము హనుమకొండ రుద్రేశ్వరాలయమునం దుండుట పై యూహను బలపరచుచున్నది. పూడూరులోని శైవాలయము ౧౬-వ శతాబ్దినాటికే శిథిలమైనదని యిదివరలో చెప్పియుంటిమి. ఇచటి సత్రపుగోడలో నున్న రామాయణమునందలి ఘట్టములు గల స్తంభ మచటిదే యైయుండును.

ఈవిధమున పూడూరుగ్రామములోని శిథిలములు మిగులముఖ్యములైనవి. ఇంతవరకును వాఙ్మయమునను, స్థానికచరిత్రములందును గాంచనగు మతచరిత్రమునందలి ముఖ్యాంశములు వానినుండి స్పష్టముగ దెలియుచున్నవి.

---

## క్రాపింగుల గ్యాలరీ—(కొన్ని సూచనలు)



## మిణుగురా!

కృష్ణవేణమ్మ

ఈయిరుల నీమెఱపు లేలనే మిణుగురా!
ఈనిశల నీపయన మెచటకే మిణుగురా!

విశ్వహృదయమ్ములో
వెల్లివిరిసే సుధా
ప్రేమసౌందర్యము
న్వేషించుకొనెదవా?—

మిసిమివెన్నెల లీను
పసిడిమాలల నల్లి
ఈ నిశాంగనగళము
నిట్టె కైసేతువా?—

ఈ యిరుల నీమెఱపు లేలనే మిణుగురా!
ఈ నిశల నీపయన మెచటకే మిణుగురా!

వలపులే నిండారు
భాగ్యజీవనముతో
ఆటగా పాటగా
అలయు నర్తింతువా?—

జ్యోతిర్లవమ్ము లగు
ద్యుతిపరంపరలతో
పదునాల్గు భువనాల
బంధించివైతువా?—

ఈ యిరుల నీమెఱపు లేలనే మిణుగురా!
ఈ నిశల నీపయన మెచటకే మిణుగురా!

విసపుచీకటిగములు
మసలు ఈరేయిలో
చుక్కలుగ చుక్కలుగ
సుధలు చిలికింతువా?—

విసికి వేసారకే
విశ్రాంతియే లేక
ధాత్రిలో ఎడతెగని
యాత్రసాగింతువా?—

ఈ యిరుల నీమెఱపు లేలనే మిణుగురా!
ఈ నిశల నీపయన మెచటకే మిణుగురా!

ఆగవే—నీపయన
మాపి, నాయెడద నీ
కర్పించు కానుకల
నందుకొందువుగాక!—

కొనిపోవగదవె! నను
కూడ నీవెనువెంట
ఎచటికో దూరాన
ఏపుణ్యభూమికో!—

ఈ యిరుల నీమెఱపు లిట్టె మెఱసినదాక!
ఈ నిశల నీపయన మిట్టె సాగినదాక!

---



(15) యం. సి. సి. జట్టు, చెన్నపురి.













1 కెప్టెను జార్డైను 2 పాటియాలా యువరాజు 3 మేజరు సి కె నాయుడు 4 గాడె నారాయణమూర్తిగారు
5 పిసిపాటి రామమూర్తిగారు 6 నాభి నారాయణరావుగారు





# దేశప్రియ జతీంద్ర మోహన సేనుగుప్త

పి. సుబ్బారావు, యం. ఏ., బి. యల్.

["Let freedom be the thought of your day and the dream of your night." —J. M. Sengupta.]



దేశప్రియుని మరణవార్తను విన్నంతనె దేశమెల్ల దుఃఖాబ్ధి మునిగిపోయినది. వినయ వివేక మనోబల సంపన్నుం డగు నీ యనఘుని అకాలమృతివలన పుత్ర మిత్ర బాంధవానుచరులలో చింతింపనివారు లేరు. వలచి వలపింపజేసి జీవితాంతమువరకు అత్యధికప్రేమాదరములచే తన్నానందడోలికల నూపిన ప్రియుని పోకచే ప్రియురాలు పుత్రుల నిరువుర కౌగలించుకొని పెద్ద పెట్టున విలపించినది. స్వాతంత్ర్యసమరమును సంరంభముతో నడపిన మహారథుడు మడిసెగదాయని మహాత్ములు కన్నీరు నించిరి. ఎల్లవేళల సోదరులవలె మన్నించి ప్రేమించిన పురుషోత్తముడు తమ్ము విడనాడిపోవుటచే తురకలెల్ల శోకనిమగ్నులైరి. మానసికాధ్యాత్మికశక్తుల నెల్ల మాతృభూమికే యర్పణజేసిన మహనీయు లొకరి వెంట నొకరు మృత్యువునోట బడుట మిగుల శోచనీయము. జతీంద్రుడు సాటిలేని స్వార్థత్యాగి. ఐహిక సుఖముల నెన్నడు నతడు పాటింపలేదు. ఆధ్యాత్మికానందమే యతడు వాంఛించినది. స్వాతంత్ర్యరంగమే యతని పడకటిల్లు. నిరుపేదలే యతని బంధువులు. క్షణమైనను విశ్రాంతి యెరుగని సైనికోత్తముడతడు.

జతీంద్రునిజనకుడు స్వాతంత్ర్యాభిలాషి. పుత్రుని జాతీయభావముల స్తుతించువాడు. ఇంగ్లాండులో బారిస్టరుపట్టము నొంది ౧౯౧౦-వ సంవత్సరములో జతీంద్రుడు కలకత్తా హైకోర్టులో న్యాయవాదవృత్తిని స్వీకరించెను. కాని యాతని హృదయ మెప్పుడును జాతీయోద్యమంపు దెసయే తిరుగుచుండెడిది. అయిదారు వత్సరములు పెనగులాడియు న్యాయవాదులలో పేరు గడింపలేక పోయెను. అయినను ౧౯౧౮-వ సంవత్సరమునుండి జతీంద్రుని ప్రాక్టీసు క్రమముగా విజృంభించినది. సాటిలేని క్రిమినలులాయరని యతనిపేరు నలుమూలలకు ప్రాకిపోయినది. ధనార్జనమునకు గొరతలేదు. మరియు నతనికి పిత్రార్జితం బగు గొప్ప 'జమీ' గలదు. ధనధాన్యసౌభాగ్యము లెన్నియున్నను అతడు మన భరతజాతిని మరువలేదు. రేయుంబవలు భారతజాతీయదాస్య శృంఖలల దెగనరుకు మార్గముల నన్వేషించువాడు. పేరుపడి పైకివచ్చురోజులలో దేశసేవ కడ్డుతగిలెనని వకీలువృత్తిని విసర్జించిన సత్యాగ్రహి జతీంద్రుడు.

ఇంతలో ౧౯౨౧-వ సంవత్సరము ఏప్రిలునెల వచ్చినది. చిటగాంగులోని బర్మాఆయిలుకంపెనీలో పనిచేయు పనివాండ్రను పాలకులు బాధింపసాగినారు. చిటగాంగు జతీంద్రుని జన్మభూమి. సోదరులమొరల నాలించి సమ్మెకట్టించినాడు. పాలకపాలితులమధ్య రాజీ ప్రయత్నములన్నియు విఫలమగుటచే పనిలేని ౧౮౦౦౦

మంది పనివాండ్ర బోషించు బాధ్యత పైనబడినను జంకక నడుముబిగించి నాయకత్వమును బూని దీనులపాలిటి కల్పవృక్షమైనాడు. పైతృకంబగు జమీాయెల్ల దెగనమ్మి వారల నందరిని నాలుగుమాసములు పోషించినాడు. న్యాయవాదవృత్తిని విసర్జించుటచే చేత గవ్వలేకుండినను రు. ౮౦౦౦౦ ఋణముజేసి పలుకష్టములకు పాలైనాడు.

ఇంతలో సహాయనిరాకరణోద్యమపు భేరీలు మ్రోగినవి. మహాత్ముఁడు దేవదత్తమును పూరింప నాయకులెల్ల సన్నద్ధులైరి. జతీంద్రుడు రణరంగమున దుమికి పలుమారులు కారాగృహవాసకష్టముల ననుభవించినాడు. చిత్తరంజనుడు స్థాపించిన స్వరాజ్యపక్షపు కార్యనిర్వాహకుడై యామహాసీయునకు కుడిభుజమైనాడు. నిరుపమానమగుజతీంద్రమోహనుని కార్యదీక్ష, స్వార్థత్యాగము, వ్యూహనిర్మాణదక్షత చిత్తరంజనుని ఆకర్షించినవి. పదునుపెట్టినకత్తి జతీంద్రుని బుద్ధి. మృదుత్వమున పూరేకులను మించినది జతీంద్రుని హృదయము. ఆంగ్లయువతి యగు గృహిణిని నెల్లీగ్రేను తగురీతిని పోషింప దగుధనము లేకున్నను దేశప్రియుడు ధైర్యమును వదలలేదు. విసరివైచినభుక్త్యమగు న్యాయవాదవృత్తిని మరలస్వీకరింపలేదు. నెల్లీ సతియు సదా నాథుని ననుకరించు సాధ్వి. ఆంగ్లయువతి యయ్యు వస్త్రాభరణాలంకారనిత్యమర్యాదలలో భారతరమణీమణులనే యనుకరించును. అనిబిసెంటువలెనే నెల్లీకి భారతీయులయెడ ప్రేమాదరణములు మెండు. పతిత భారతజాతిని లేవనెత్తుట కామె కంకణముకట్టినది. భారతజాతీయ దాస్యవిముక్తికై పాటుపడు ప్రియునికి దోడునీడయై ప్రోత్సహించుచుండెడిది. నెల్లీజతీంద్రుల దాంపత్యమే దాంపత్యము.

చిత్తరంజనుని బుద్ధికుశలతకు జతీంద్రుని కార్యసాధనతత్పరత తోడై వంగరాష్ట్రమున ద్వంద్వప్రభుత్వ విధానముల నంతరింపజేసినది. చిత్తరంజనుని మరణానంతరము ఆమహాసీయుని స్థాన మధిష్ఠించుటకు జతీంద్రుడే తగియుండెను. వంగీయులెల్ల నేకగ్రీవముగ జతీంద్రుని వంగరాష్ట్రీయ-కాంగ్రెసు-సభాధ్యక్షునిగను, రాష్ట్రీయ శాసనసభాజాతీయపక్షనాయకునిగను, కలకత్తామేయరుగను ఎన్నుకొనిరి. ఇట్లు కిరీటత్రయము నొక్కపరి ధరించిన దేశప్రియుని దీవించి మహాత్మాజీ 'సకలజనసంస్తుతిపాత్రు డగు సజ్జను' డని సెలవిచ్చిరి. స్థానికసంస్థలను, శాసనసభలను అన్నిటిని వశపరచికొని నిరంకుశప్రభుత్వపు పోకడల బ్రతిఘటించుటకు స్వరాజ్యపక్షనాయకులు ప్రతినవట్టినకాల మది. పురపాలక సంఘాధ్యక్షుడై స్వరాజ్యపక్షనాయకుడయ్యు తన పలుకుబడినంతను దేశీయోద్యమప్రాచుర్యమునకే వెచ్చింపక రేటుపేయర్ల కష్టసుఖముల పాటించి యలరిన మహారాజకీయవేత్త జతీంద్రుడు. అతని కధికారకాంక్ష లేదు. పురపాలక నియమానుష్ఠానములకును, రాజకీయవ్యవహారములకును జతీంద్రు డెన్నడును లంకెపెట్టలేదు. పురపాలకసంఘ సభ్యులగు యూరోపియనులు, తురుష్కులు, హిందువులు, హైందవక్రిస్టియనులు, ఆంగ్లోయిండియనులు-అందరును జతీంద్రుని నిష్పక్షపాతబుద్ధిని ప్రేమించి కొలుచుటవలననే అయిదుపర్యాయములు నగరమునకు మేయరై ప్రపంచవిఖ్యాతమగు కీర్తిని ఆర్జించినాడు. అతనిపాలనమున నగర మన్నివిధముల వెంపొందినది. జాతి మతభేదముల లెక్కింపని పూతచరిత్రుడు జతీంద్రుడు. ప్రాక్పశ్చిమనాగరకతాసంప్రదాయములు జతీంద్రునిలో మేళవించినవి. లోకమాన్యుని స్ఫురణకుదెచ్చు జతీంద్రుని పట్టుదల, ఉత్సాహము, నిరంతరపరిశ్రమ పాశ్చాత్యధర్మసంప్రదాయముల మూర్తీభవింపజేసినవి. హైందవులకు సహజములగు సహనశక్తి, పరమార్థచింత, ఐహికకాంక్షావిరతి, అన్నియు జతీంద్రునిజీవితమున బ్రతిబింబించినవి. జతీంద్రునివాగ్ధోరణి కరంబు స్ఫుటమై, ఆవేశపూరితమై, సర్వజనాకర్షణీయమై యుండెడిది. అతని ప్రకృతికి సహజము లగు నిష్కపటత్వము, మొగమాటములేమి, నిరహంకారము, ఫలనిరపేక్ష అన్నియు అతని నిత్యకృత్యములలో, అతని యుపన్యాసపరంపరలలో ప్రతిధ్వనించుచుండెడివి.

జతీంద్రుడు కాంగ్రెసునాయకులలో అతివాది యని కొందరందురు. చీటికిమాటికిని మతములమార్చు కొనుమత మతనికి నచ్చదు. ఆదర్శము లను నీటిబుగ్గల నెగురనెంచని కర్మయోగి జతీంద్రుడు. నిరంకుశాధి కారుల స్తోత్రపాఠముల కుబ్బి తబ్బిబ్బులై తాళములు వేయు మితవాదులన్న నతనికిరోత. తరుచ్ఛాయలగాంచి తరువులేయని భ్రమించు నజ్ఞత్వ మతనికి లేదు. స్వయంకృషియే స్వరాజ్యసోపానమార్గమని జతీంద్రుని యుపదేశము. నలువదిమూడవ జాతీయమహాసభాహ్వాన సంఘాధ్యక్షోపన్యాసమున జతీంద్రు డిట్లుచెప్పెను: "దేశ మాతయొక్క దాస్యవిమోచనము ఆమె సంతతి పైననే ఆధారపడియున్న కతమున జాతియంతయు నొక్క పరి నడుముబిగించి ఏకోద్దేశ్యముతో సమష్టిగా కృషి చేయుటయే శరణ్యము. స్వబలముల బ్రేరేపించుచు మనకాళ్లపైననే పూనికతో మనము నిలువవలయును. నవీనశకమున మనలనావరించిన విపరీతజాత్యాచార ములే మన విఫలప్రయత్నములకన్నిటికిని మూలాధార ములు. పురుషోత్తముడగు మహాత్ముడు పూని నడిపిన సహాయనిరాకరణోద్యమ మేల విఫలమైనది? అరవిందు డేల సన్యాసియయ్యె? చిత్తరంజనుని హృదయకుటీర మేల పటాపంచలైనది? మూఢభక్తి, సాంఘికవైషమ్య ములు, వర్ణవిభేదములు, మగువలముసుగులు (Purdah), బహుపత్నీత్వము, బాల్యవివాహములు: ఇవి అన్నియు భారతజాతీయారోగ్యపతనమునకు మూలహేతువులు. మనజీవితములలో పొందిక లేదు; ఐక్యము లేదు. మన దేశభక్తి సాంఘికము. మనఅన్యోన్యతయన కేవలము పరస్పరసద్భావముమాత్రమే. దానిలో జీవము లేదు; స్థిరత లేదు. ఈ నూత్నప్రపంచములో మనజాతి తల యెత్తి తిరుగవలెనన్న సనాతనత్వమునకు తిలోదకముల నివ్వవలెను. తుప్పువట్టిన శస్త్రాస్త్రములచే మింటనెగయు విమానముల నెగురగొట్టగలరా? స్వాతంత్ర్యపీఠమును స్త్రీకి సమర్పింపుడు. నిర్లక్ష్యముతో సగముజాతిని దాస్యకూపముల మురుగబెట్టి నిర్జీవమగు తక్కినసగముతో స్వప్రయోజనముల సాధింపజాలరు. వర్ణవిభేద ముల దరుమగొట్టుడు. ఆధునికహైందవార్థికజీవిత ములో అది సాధించుకార్యమేమి? అదిని, వర్ణాశ్రమ ముల వెన్నంటియున్న ఆర్థికోద్దేశ్యము లిప్పు డంతరించి నవిగదా! ఈవర్ణవిభేదములు అర్థములేని సాంఘికకలహ ముల కునికిపట్టయి జాతీయభావముల నణగ ద్రొక్కు చున్నవి. సదా పూర్వాచారముల మన్నించు మూఢ మతము మనలో నాటుకొనియుండుటచే గతపురుషాంత రముల వేయబడినపునాదు లక్కరకు రాక వెంటనే జీర్ణించుచున్నవి. కనుకనే రామమోహనరాయ, విద్యాసాగర, వివేకానందులవంటి మహనీయులు జీవిత పర్యంతము సల్పినకృషి రవ్వంత ఫలించి జాతీయాభి వృద్ధికి దోడ్పడినను వెనుదిరిగి మరల యథాస్థానముల జేరుచున్నాము. కాన, రాజకీయవిప్లవమునకు చేదో డుగా సాగిపోవు సాంఘికవిప్లవ మత్యావసరము. సాంఘిక రాజకీయవిషయములలో క్రమేపి స్వాతంత్ర్యమును సాధింపనగునని మనము నమ్మజాలము. సమూలపరి వర్తనము లేకున్న అది దుస్సాధ్యము. రేయింబవలు స్వాతంత్ర్యమంత్రమునే సంస్మరింపుడు. రానగుకష్టపరం పరల లెక్కింపక, నిరంకుశులు చేయనగు కఠినచర్యల ధాటికి చలింపక హైందవసోదరసోదరీమణులెల్ల జాతీయ పతాకముల నెగురవైచుచు సర్వమానవసమానత్వ సహోదరత్వాదిభండననాదములతో స్వతంత్రభారత సౌఖ్యపుజీవితముల పొంతకు దరలిపొండు. శక్తులనన్నిటి గుమిగూర్చి విజృంభించి మహోన్నతపదవిని మెరయు చుండు భరతమాత పదపద్మములచెంతకు మహోత్సా హమున దరలిపోవు మిమ్ముల నెట్టిశక్తియు నిరోధింప నేరదు."

అఖిలభారతనియంతయై శాసనోల్లంఘనోద్యమ మును నడుపు జతీంద్రమోహనుని ౧౯౩౦-వ సం. నవం బరు మూడవతేదీన రాజద్రోహనేరముపై నిరంకుశాధి కారులు నిర్బంధించి యొకసంవత్సరము విడిఖైదును విధించిరి. పలుమారులు కారాగృహముల నిర్బంధింప

బడుటచే జతీంద్రునియారోగ్యము చెడినది. బలిష్ఠమగు కాయ మెంతకృశించినను జతీంద్రుడు సత్యాగ్రహవ్రతమును విడువలేదు. ఎన్నివిఘాతము లుప్పతిల్లినను లెక్కగొనక భారతవీరుడగు కర్ణునిపోల్కి ద్విగుణీకృతోత్సాహముతో ముందుకు దుముకుచుండెడివాడు. విపరీతమైన రక్తపుపోటుచే నవయుచుండియు రణభూమిని వీడలేదు. శిక్షాకాలము ముగియగనే ఆరోగ్యాభివృద్ధికై జతీంద్రుడు పత్నీసహితుడై ఆంగ్లదేశమున కరిగి భారత జాతీయాశయముల వేనోళ్ల చాటినాడు.

అప్పుడు గాంధిగారు రెండవ రౌండుటేబిలు సభలో పాల్గొనుచుండిరి. గాంధిగారు మరల హిందూదేశమునకు దిరిగిరాకమునుపే గాంధి - ఇర్విన్ ఒడంబడికను నిర్మూలింప ప్రభుత్వాధికారులు నిశ్చయించి, జవహ్వారిలాలు, గఫూరుఖాన్ ప్రభృతుల నిర్బంధించిరి. చేయునదిలేక గాంధీజీ మరల శాసనోల్లంఘనమును ప్రారంభింప, నాయకులెల్ల నొక్కపెట్టున కఠినశాసనముల పాలైరి. ఇదంతయు జతీంద్రుని హృదయమును క్షోభింప జేసినది. కష్టకాలమున మాతృభూమిని విసర్జించుట జతీంద్రునకు రుచింపలేదు. సమరసమయముల రణరంగమును వీడియుండుట వీరునికి లోపమని జతీంద్రుడు నిశ్చయించెను. శరీరమున రుగ్ణత నశింపకున్నను స్వదేశమునకు బరువులెత్తెను. భారతభూమిపై నడుగిడకముందే ౧౯౩౨-వ సం. జనవరి ౨౦-వ తేదీన ౧౮౧౮ సం॥పు మూడవ రెగ్యులేషన్ క్రింద మరల జతీంద్రుని నిర్బంధించిరి. అతని యారోగ్యము తిరుగ క్షీణించినది. ఇట్టి నాయకోత్తముని ఆపత్సమయమందైనను విడుదల చేయుట ప్రభుత్వమునకు 'కనీసధర్మ' మై యుండెను. ఢిల్లీసింహాసనాధిరూఢు లగు నిరంకుశప్రభువులు స్వధర్మముల గుర్తింపలేకపోయిరి. 'జల్పాయిగురి' జయిలులోను, ఆలిపూరు సెంట్రలు జెయిలులోను జతీంద్రుని పలుకష్టములపాలుచేసి అవసానసమయమున 'రాంచీ' సానెటోరియమున నుంచిన లాభమేమి? ౧౯౩౩-వ సం. జూలై ౨౨ - వ తేదీ రాత్రి జతీంద్రుని రక్తపుపోటు తీవ్రముగ హెచ్చినది. దుర్భరమగు తలనొప్పిచే బాధపడుచు ప్రియసతియగు నెల్లీని చేరువకు పిలిచినాడు. కనుల జలములొలుక కడసారి కౌగిలీయమన్నాడు. పొరలివచ్చు కన్నీటిధారలు నేల దొరల చేసాచినది నెల్లీ. ఇంతలో జతీంద్రునికి స్పృహ తప్పినది. మూసినకనులు తిరుగ తెరువలేదు. జతీంద్రుని ఆత్మ అంతర్వీధుల నప్పుడే పరుగిడిపోయినది. భౌతికశరీరమును త్యజించినాడు జతీంద్రుడు. అనాథయగు దేశమాతహృదయమెల్ల నిలువునీరైపోయినది. మరునాడు ప్రాతఃకాలసమయమునకు జతీంద్రునిశవము కలకత్తాపురము ప్రవేశించినది. ఎల్లెడ విషాదపుముసురు. అనుచరుల ఆర్తనాదములు మిన్నుముట్టినవి. శవమువెంట నూరేగుచు శ్మశానమున మూగినమూక మూడులక్షలకు మించినది. ఆనాడు కలకత్తానగరమంతయు కన్నీటి కాలువలమయమై పోయినది. మేయరైన సంతోష కుమారబాసుగారు మృతకళేబరమును పుష్పమాలాలంకృతంబుగ నొనర్చి సాటిలేనివీరుడని హెచ్చరించిరి. విద్యార్థులు, విద్యాధికులు, పండితులు, పామరులు, నాయకులు, గాయకులు, పాలకులు, పాలితులు, హైందవులు, తురుష్కులు, బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు-అందరును జతీంద్రుని శవమునకు జోహారులొనర్చిరి. శాసనోల్లంఘనోద్యమమును అణచివైచితిమని తలచు నధికారులికనైననుజతీంద్రునియెడ జనులెల్ల వెలిపుచ్చిన భక్త్యనురాగముల బరికించి తమ మతముల దిద్దికొందురుగాక! పూతచరిత్రుడగు జతీంద్రమోహను డైహికదేహమును విసర్జించినను కళంకరహితమగు ఆపుణ్యుని యాత్మ దిక్సూచికయై మింట మెరయుచు భారతజాతిని కనిపెట్టియేయుండును. కాని, రవీంద్రుడన్నట్లు, ఇట్టిమహనీయులను కారాగృహకూపముల మడియనీయుట మనజాతికెల్ల మాయని మచ్చ.

"He was a man of peace and refinement, but when his country called hc rejoiced to offer his life at the altar of his country's freedom. The memory of such a life, nobly lived and fr ely given, is at once India's glory and shame." —Rabindranath Tagore.

జతీంద్రుని ఆత్మకు శాంతియగుగాక!

# జవాబు

**కుడితిపూడి అచ్చమాంబ**

[మార్వాడ్ సంస్థానాధిపతి అమరసింగుగారాబుకూతురు విమల తురకల సరకుగొనక వారితోడి పెండిలి నిరాకరించి రాజపుత్రునిదక్క వేఱొక్కని వరింపనని నిక్కుప్రతిన బట్టి కన్నియగనే కాలము గడపుచుండెను. అట్టితరి ఔరంగజేబు కిల్లాలు, విమలకు తోబుట్టువు నగు కేసరి తగు నాడంబరముతో పుట్టింటికి వచ్చెను. తలిదండ్రులు, తక్కుంగలవారు తగినరీతి నామెను గారవించిరి. విమలమాత్రము పాపభీతిచే నామె మొగము జూడనొల్లక, ఒంటరిగ నొకగదియందు కూర్చుండి ముక్కంటి గొలుచుచుండ, చెల్లెలిజూచు నిచ్చతో కేసరి అచ్చటకు వచ్చి ముక్కంటి దెగడి, పాదుషాను బొగడి, అతనిని వరింపుమని పలికెను. దానికి కోపించి ప్రత్యుత్తరించిన పలుకు లివి :]

పడతిరో : ఏల కీ మిడిసిపాటు ప్రభుం డవురంగజేబు ప్రే
ముడిచెలి వైతినంచు తలపోయుచు సర్వము విస్మరించి, యీ
చెడిదపు పోటుమాటల నుపేక్షగ దైవము దూలనాడగా
చెడుతల వేలగల్గెడు నిసీ! తలకెక్కెనె కన్ను లింతకున్.

పుట్టిన రాజపుత్రకులమున్ బరికింపక, పాదుషాను చే
పట్టి కులంబుగౌరవము భగ్నమొనర్చి తురుష్కజాతిలో
చెట్టతనంబునన్ బ్రతుకుజీవిని నిన్గని మానినీమణుల్
రట్టొనరించుటన్ గనియు లజ్జను బొంద విదేమి కేసరీ!

పోతపోసిన బంగారుబొమ్మ వీవు - గూనిగడ్డాల పోతుసుల్తాను వాడు
వెలది, కోతికి కొబ్బాయిపెట్టినట్టు - ఏమిపొం దిది తెలియ దూహించిచూడ

చెలియరో! తండ్రి నీ కమరసింగు మహాయశాలి, అన్నద
మ్ములు రసపుత్రకుంజరులు, పొచ్చెములేని స్వరూపదీప్తి, కా
వలసినయంత వైభవముపై తులదూగెడి నీవు కాకిముక్కునన్
గలిగిన దొండపండువలె గన్పడుచుంటి తురుష్కు జేరినన్.

పెల్లుగ వైభవా లనుభవించుతలంపున నీవు వీరులన్
ఒల్లక, ఆర్యధర్మముల నొప్పరికించి త్యజించి మానమున్
ఎల్లి దుడో తురుష్కుని గ్రహించియు "తా చెడుకోతి అ వ్వనం
బెల్లను చెర్చె"నట్టుల వచింతువు పెండిలియాడుమంచు నన్.

ప్రాణములనైన బాయుదుగాని మాన - ముజ్జగించి ధర్మంబు గోల్పోయి, తురక
వెధవమొగమైన నేను దర్శింపసుమ్ము - దైవ మీమహేశ్వరుని పాదముల సాక్షి.

---



# భారతీయ రాగ పద్ధతి

వింజమూరి వరాహనరసింహాచార్యులు

## ప్రస్తారమేళములు

గడచిన ఆంగీరస, శ్రీముఖవత్సరముల ఉగాదిసంచికలందు భారతీయరాగపద్ధతినిగూర్చి చెప్పుచు గ్రామరాగకాలమందలి భాషా విభాషాంతరభాషాజాతిగ్రామరాగాది విభాగమునుగూర్చియు, అనంతరము మేళపద్ధతినిగూర్చియుచెప్పుచు రామామాత్యుడు, సోమనార్యుడు, దామోదరుడు, అహోబలుడు మున్నగు వాగ్గేయులమతము ననుసరించి గ్రహింపబడు మేళములు, వీనియందలి జన్యరాగములు మున్నగువాని గూర్చియు దెలిపియుంటిమి మరియు రాగములు పరిస్ఫుటమగుటకు వలయు గ్రహాంశాదిలక్షణము భరతశార్ఙ్గదేవరామామాత్య సోమనార్య వెంకటమఖ్యాదుల యభిమతముల ననుసరించి గ్రహింపబడునట్లు చెప్పియుంటిమి. గ్రహాంశాదుల వివరముగూడ క్లుప్తముగ దెల్పియుంటిమి.

మేళములపద్ధతి వేంకటమఖికాలము (క్రీ. శ. ౧౬౬౦) వరకు అనుసరింపబడినట్లు శ్రీముఖఉగాదిసంచికయందు తెలిపియుంటిమి. ఈపద్ధతియందు వారివారిమతముల ననుసరించు ప్రకృతివికృతిస్వరములను ప్రతిమేళమునందు ఒకటి తరువాత మరియొకటి చేర్చి యిరువది, లేక యిరువదిమూడు, లేక పందొమ్మిది యిట్లు మేళములు వరుసగ రామామాత్యుడు, సోమనార్యుడు, వెంకటమఖి—వీరిచే జెప్పబడిన విధము తెలిపితిమి. ఏయేమేళమున దేస్వర మెట్లు చేర్చబడినదియు నిప్పు డెంచుట భావ్యము కాకపోదు. వీని నిట్లు చూడనగును :

రామామాత్యుని మేళములు:—

ఈయన వెలయించిన మేళములందలి స్వరముల నారయుటకు ముందు వీరిప్రకృతి వికృతస్వరములను గుర్తించుట ముఖ్యము. రామామాత్యుడు శార్ఙ్గదేవునివలె ౧౯ స్వరములను గ్రహింపక శుద్ధస్వరావళిగ నెంచబడు షడ్జగ్రామస్వరావళియు, మరి ఏడువికృతస్వరములును మొత్తము పదునాలుగుస్వరములు చెప్పియుండెను. ఇతని వికృతిస్వరములు—(౧) షట్ఛ్రుతిఋషభము, (౨) అంతర గాంధారము, (౩) చ్యుతమధ్యమము, లేక చ్యుతమధ్యమగాంధారము, (౪) చ్యుతపంచమము, లేక చ్యుతపంచమమధ్యమము, (౫) కైశికినిషాదము, (౬) షడ్జ నిషాదము, లేక కాకలినిషాదము, (౭) చ్యుతషడ్జము ఇట్లున్నవి. షట్ఛ్రుతిఋషభసాధారణగాంధారములు, షట్ఛ్రుతిధైవత కైశికీనిషాదములు, శుద్ధగాంధార పంచశ్రుతి ఋషభములు, శుద్ధనిషాద పంచశ్రుతిధైవతములు ఒక్కస్వరస్థానము కలిగియున్నవని ఇతని అభిప్రాయము. వీని జేర్చి తన యిరువదిమేళము లిట్లు చెప్పినాడు.—

| మేళము పేరు | స్వరములు |
|---|---|
| ౧. ముఖారి | శు. స, . రి, శు. గ, శు. మ, శు. ప, శు. ద, శు, ని. |
| ౨ మాళవగౌడ | శు.స, శు. రి, చ్యుతమధ్యమ గ, శు.మ, శు.ప, శు. ద, చ్యుతషడ్జ ని. |
| ౩. శ్రీరాగము | శు.స, పంచశ్రుతి రి, సాధారణ గ, శు.మ, శు.ప, పంచశ్రుతి ద, కైశికి ని. |
| ౪. సారంగనాట | శు.స, పంచశ్రుతి రి, చ్యుతమధ్యమ గ, శు.మ, శు.ప, పంచశ్రుతి ద, చ్యుతషడ్జ ని. |
| ౫. హిందోళ | శు. స, పంచశ్రుతి రి, సాధారణ గ, శు.మ, శు.ప, శు.ద, కైశికి ని. |
| ౬. శుద్ధరామక్రియ | శు.స, శు రి, చ్యుతమధ్యమ గ, చ్యుతపంచమ మ, శు.ద, చ్యుతషడ్జ ని. |
| ౭. దేశాక్షి | షట్ఛ్రుతి రి, చ్యుతమధ్యమ గ, శు.మ, శు.ప, పంచశ్రుతి ద, చ్యుతషడ్జ ని. |
| ౮. కన్నడగౌళ | శు. స, షట్ఛ్రుతి రి, చ్యుతమధ్యమ గ, శు.మ, పంచశ్రుతి ద, కైశికి ని |
| ౯. శుద్ధనాట | శు.స, షట్ఛ్రుతి రి, చ్యుతమధ్యమ గ, శు.మ, షట్ఛ్రుతి ద, చ్యుతషడ్జ ని. |
| ౧౦. అహిరి | శు.స, పంచశ్రుతి రి, సాధారణ గ, శు.మ, శు.ద, చ్యుతషడ్జని. |
| ౧౧. నాదరామక్రియ | శు.స, శు.రి, సాధారణ గ, శు.మ, శు.ద, చ్యుతషడ్జ ని. |

౧౨. శుద్ధవరాళి—శు.స, శు.రి, శు.గ, చ్యుతపంచమ మ, శు. ద, చ్యుతషడ్జ ని.

౧౩. రీతిగౌళ—శు.స, శు రి, శు.గ, శు.మ, పంచశ్రుతిద, కైశికి ని.

౧౪. వసంతభైరవి—శు.స, శు.రి, చ్యుతమధ్యమ గ, శు.మ, శు.ద, కైశికి ని.

౧౫. కేదారగౌళ—శు.స, పంచశ్రుతి రి, చ్యుతమధ్యమ గ, శు.మ, పంచశ్రుతి ద, చ్యుతషడ్జ ని.

౧౬. హిందోళ్జిజ్జి—శు.స, శు.రి, అంతర గ, శు మ, శు ద, కాకలి ని.

౧౭. సామవరాళి—శు.స, శు.రి, శు.గ, శు.మ, శు ద, కాకలి ని.

౧౮. రేవగుప్తి—శు.స, శు.రి, అంతర గ, శు.మ, శు.ప, శు.ద, శు ని.

౧౯. సామంత—శు.స, షట్శ్రుతి రి, అంతర గ, శు.మ, షట్శ్రుతి ద, కాకలి ని.

౨౦. కాంభోజి—శు.స, పంచశ్రుతి రి, అంతర గ, శు.మ, శు.ప, పంచశ్రుతి ద, కాకలి ని.

వెంకటమఖి మేళములు:—

ఇక వెంకటమఖి మేళములందలి స్వరముల నారయుదము. వికృతస్వరము లెంచుటలో రామామాత్యునకును, వెంకటమఖికిని కొలదివ్యత్యాసము కలదనునది మరువకూడదు. రామామాత్యుడు చెప్పిన అంతర, కాకలిస్వరస్థానము లితడు చెప్పలేదు. వెంకటమఖి చెప్పిన అంతరగాంధారకాకలి నిషాదములు వరుసగ రామామాత్యుని చ్యుతమధ్యమ గ, చ్యుతషడ్జ ని స్వరస్థానములకు తుల్యములు. తక్కిన స్వరములు సమములే. వేంకటమఖి మేళములు స్వరములతో నిట్లున్నవి:

మేళము పేరు. స్వరములు.

౧. ముఖారి—శు.స, శు.రి, శు గ, శు.మ, శు.ప, శు. ద, శు. ని.

౨. సామవరాళి— * శు.రి, శు. గ, శు.మ, * శు.ద, కా. ని.

౩. భూపాల—శు. రి, సా. గ, శు.మ, శు.ద, కై, ని.

౪. హిజ్జిజ్జి—శు. రి, అం. గ, శు.మ, శు.ద, శు. ని.

౫. వసంతభైరవి—శు. రి, అం .గ, శు. మ, శు.ద, కై. ని.

౬. గౌళ—శు.రి, అం. గ, శు. మ, శు. ద, కా. ని,

౭. భైరవి—పంచశ్రుతి.రి, సా.గ, శు. మ, శు. ద, కై. ని.

౮. ఆహిరి—పంచశ్రుతి రి, సా.గ, శు. మ, శు. ద, కా. ని.

౯. శ్రీరాగం—పంచశ్రుతిరి, సా.గ, శు.మ, పంచశ్రుతిద, కై.ని.

౧౦. కాంభోజి—పంచశ్రుతిరి, అం.గ, శు.మ, పంచశ్రుతి.ద, కై.ని.

౧౧. శంకరాభరణ—పంచశ్రుతి రి, అం. గ, శు.మ, పంచశ్రుతి ద, కా. ని.

౧౨. సామంత—పంచశ్రుతి రి, అం. గ, శు.మ, షట్శ్రుతి ద, కా.ని.

౧౩. దేశాక్షి—షట్శ్రుతి రి, అం.గ, శు మ, పంచశ్రుతిద, కా.ని.

౧౪. నాట—షట్శ్రుతిరి, అం.గ, శు.మ, షట్శ్రుతిద, కా.ని.

౧౫. శుద్ధవరాళి—శు.రి, శు గ, వరాళి మ, శు.ద, శు.ని.

౧౬. పంతువరాళి—శు.రి, సా.గ, వరాళి మ, శు ద, కా.ని.

౧౭. శుద్ధరామక్రియ—శు.రి, అం.గ, వరాళిమ, శు.ద, కా.ని.

౧౮. సింహారవ—పంచశ్రుతి రి, సా.గ, వరాళి మ, పంచశ్రుతి ద, కై ని.

౧౯. కళ్యాణి—పంచశ్రుతి రి, అం గ, వరాళి మ, పంచశ్రుతి ద, కా.ని.

పై విధములగు మేళములవలన వీరిరువురిమతములు తెలియుట యేకాక వారివారికాలములందలి లక్ష్యసంగీతముగూర్చియు నెరుగ వచ్చును. రామామాత్యుడు, శార్ఙ్గదేవుడుచెప్పినట్లు ౧౯ స్వరములను ఎంచక వానియందలిదోషములను, అనగా అచ్యుతషడ్జము, షడ్జమునకు వేరుకావనియు మరియు అచ్యుతపంచమము, అచ్యుతమధ్యమములు శుద్ధములకు వేరుకావనియు నిట్లు చెప్పి తాను గ్రహించుపడు నాలుగుస్వరములను చెప్పియుండెనుకదా. ఇతడు చెప్పిన అంతరగాంధారకాకలీనిషాదములస్థానముల కొక్కశ్రుతి వ్యత్యాసమున మాత్ర ముండిన చ్యుతమధ్యమగాంధార, చ్యుతషడ్జనిషాదములు గ్రహించుట సులభము కాదని వెంకటమఖి ఎంచినాడు నూరువత్సరములకు వెనుకనున్న వెంకటమఖి రామామాత్యునిచ్యుతస్వరములు గ్రహించియు వానిస్థానములందు అంతరకాకలీస్వరముల నొప్పించుట కాలముమార్పుగ నెంచవలసియుండును. అంతియేకాని వెంకటమఖి వలె రామామాత్యునిగూర్చి హేయముగ బలుకుట భావ్యముగ దోపదు. ఈస్వరములు సరకుజేయకయు, దన ౧౨ స్వరములను చేర్చి పై మేళములు వెంకటమఖి తనకాలమందలివానిని చెప్పియుండె నంటిమి ఇందుచే నితడు రామామాత్యునియిరువది మేళములు తప్పులుగ నెంచి పదునాలుగు† గ్రాహ్యములని యభిప్రాయపడినాడు. రామామాత్యుడుసహితము ఈసంగతి గ్రహించియుండకపోలేదు. అంతర, కాకలీస్వరములు చ్యుతమధ్యమ చ్యుతషడ్జములకు భిన్నములగునవి యని గ్రహింపనొల్లని వో మేళములు పదునైదుమాత్రము కలుగునని ఇత డిట్లు చెప్పినాడు:

“అంతరస్య చ కాకల్యాః స్థానే ప్రతినిధిః క్రమాత్,
చ్యుతమధ్యమగాంధారః చ్యుతషడ్జనిషాదకః
అయం ద్వితీయః పక్షోఽత్ర మేలాః పంచదశ స్మృతాః.”

* స పలు అన్నిట శుద్ధములే కావున వేరుగ వ్రాయలేదు.

† కేదారగౌళ, సారంగనాటమేళము లొక్కటిగ జెప్పినందున.

కాని వెంకటమఖి రామామాత్యుని స్వరములను తప్పులుగ నెంచుట చెల్లదు. రామామాత్యుడు అంతర, కాకలీ స్వరములను శార్ఙ్గదేవుడు అంతరస్వరములుగ చెప్పినట్లు గ్రహించినచో నాపక్షమందు ౧౫ మేళములుమాత్రము కలుగుననిచెప్పియుంట వెంకటమఖి గ్రహింపక పోవుట శోచనీయము. ఈసంగతి రామామాత్యు డిట్లు చెప్పినాడు:

"ఏతదే వాభిసంధాయ కథితం శార్ఙ్గసూరిణా,
అల్పప్రయోగః సర్వత్ర కాకలీ చాంతరస్వరః."

శార్ఙ్గదేవుని యనంతర మీయంతరస్వరములు జనబాహుళ్యము నొందియుండనోపు. అందుచే రామామాత్యుడు వీనినిగ్రహించి వికృతస్వరములందు చేర్చిచెప్పినాడు. వెంకటమఖి వీనినే గ్రహించియు వీనిస్థానము లొక్కశ్రుతి యధికముకలవిగ జేసి చెప్పియుండెను. అందుచే నితనికి అంతరకాకలీస్వరములు రామామాత్యుని చ్యుతమధ్యమషడ్జములకు భిన్నములుగ లేవు. ఈసంగతివలననే వెంకటమఖి రామామాత్యునిగూర్చి గర్హ్యముగ పలుకుట భావ్యముగ దోపదు.

పైసంగతులవలన రామామాత్యుని వసంతభైరవియందు హుజ్జిమేళము, సామవరాళియందు శుద్ధవరాళి, బౌళియందు రేవగుప్తి, కన్నడగౌళయందు సామంత, సారంగనాటయందు కాంభోజిమేళము-ఇట్లంతర్భూతము లగుచున్నవని రామామాత్యు డెంచినాడు.

'వసన్తభైరవీమేళే లీనో హుజ్జిజ్జిమేళకః,
అథ సామవరాళ్యాశ్చ మేళో యః ప్రాగుదీరితః.

అంతర్భూతః స్ఫుటం శుద్ధవరాళీమేళకేచ సః,
బౌళ్యాశ్చ మేళకే లీనో రేవగుప్తేస్తుమేళకః.

మేళే కన్నడగౌలస్య లీనః సామన్తమేళకః,
సారంగనాటమేళేచ లీనః కాంభోజిమేళకః.'

రామామాత్యుని ౨౦ మేళములందు కేదారగౌళ, సారంగనాటమేళములకు స్వరస్థానము లొక్కటేయగునట్లు చెప్పబడుట లేఖకదోషమనవలయును. అట్లు కానిచో నితని మేళములు ౧౯ అగును.

మరియు రామామాత్యుడు కాంభోజిమేళమందు కాకలీనిషాదము పేర్కొనుటయు, అంతరగాంధారకాకలీనిషాదములుగల శంకరాభరణరాగము సాధారణగాంధారకైశికీనిషాదములుగల శ్రీరాగమేళజన్యముగ జెప్పుటయు, గౌళమేళజన్యములగు పాడి ఆర్ద్రిదేశిరాగములు శుద్ధరామక్రియమేళజన్యములుగను, భైరవిజన్యమగు ఘంటారవరాగము కన్నడగౌళజన్యముగను, నాదరామక్రియమేళము అంతరగాంధారయుతముగ జెప్పుటకు మారుగ సాధారణగాంధారముతో నెలయించియు నిట్లు తప్పులుగ జెప్పినట్లు వెంకటమఖి రామామాత్యుని గూర్చి పల్కినాడు. శతాబ్దము వెనుకనుండిన వెంకటమఖికాలము నాటికి సంగీతలక్ష్యమందు కొంతమార్పు జెందియుండిన నుండవచ్చు ననునది గ్రహింపనొల్లడు. ఇందుకు కారణము లేదు. అట్టులయ్యు రామామాత్యునిగూర్చి గర్హ్యముగ బలుకుట తనయాధిక్యము చెప్పుకొనుటే. వెంకటమఖి తీవ్రముగ ఖండించుట చూడుడు:

౧. శ్రీరాగమేళము

"తథాహి భైరవీరాగః శంకరాభరణ స్తథా,
గౌళరాగశ్చ కథితా స్త్వయా శ్రీరాగమేళజాః.

తత్ర భైరవా శుద్ధధైవతే నాన్వితాఖలు,
శంకరాభరణా రాగోఽన్తరగాంధారవాం స్తథా.

సకాకలీ నిషాదశ్చ గౌళీరాగ స్త్వయం పునః,
జాతో మాళవ గౌళాఖ్య రాగమేళాది సంస్థితః.

రాగాణాం పున రేతేషాం జన్మ శ్రీరాగమేళకః,
కథం వికత్థసే రామ రామ రామ తవ భ్రమః."

౨. శుద్ధరామక్రియమేళము

"యదుక్తం భవతా శుద్ధరామక్రీరాగ మేళకః,
పాడీ రాగార్ద్రిదేశాఖ్య రాగజన్మ భవేదితి.

తద్దోషజాతయే రామ రామస్మరణ మాతను,
పాడ్యార్ద్రిదేశిరాగాచ ప్రసిద్ధా గౌళమేళజా."

3. కన్నడగౌళ

"దేశాక్షీ మేళ ఏవైష కైశిక్యాఖ్య నిషాదకమ్.
ప్రాప్య కన్నడగౌళః స్యా ద్గౌళస్యాతి మృషావహో,
కన్నడగౌళః శ్రీరాగమేళనతో మతో న కిమ్."

౪. ఘంటారవ

"యచ్చ కన్నడగౌళస్య మేళే సముపజాయతే,
ఘంటారవ ఇతి ప్రోక్తం పాతకే నామునా పునః.

సత్యం విమోక్ష్యసే రామ రామస్తేతుం గతోఽపినే,
భైరవీ మేళసంభూతో రాగో ఘంటారవః ఖలు."

౫. నాదరామక్రియ

"యద్వాప్యుక్తం త్వయా నాదరామక్రీరాగమేళకే,
సాధారణాఖ్య గాంధారః సంగ్రాహ్య ఇతి తత్వతః.

అపూర్వ భయకారత్వ మావేదయతి రామ తే,
నాదరామక్రియామేళ గాంధారోఽప్యంతరాభిధః."

౬. రీతిగౌళ

"యదుక్తం రీతిగౌళాఖ్య రాగమేళస్య లక్షణమ్,
శుద్ధాః సరిగమాః పశ్చ పంచశ్రుతిక ధైవతః.

కైశిక్యాఖ్యనిషాదశ్చ త్వత్ర రామక్రియ స్తథా,
భైరవీరాగ మేళోత్థో రీతి గౌళః ప్రకీర్త్యతే."

౭ కాంభోజి.

"కాంభోజీరాగమేళస్య కైశిక్యాఖ్య నిషాదకః,
'ఇతి నోవేత్తి కిం వీణావాదినాం గృహదాస్యపి"












1. శ్రీమతి కె. రామసుబ్బమ్మగారు. 2. శ్రీమతి డా. మాలినిబాయి సుక్తంకరు. 3. కుమారి కౌముది.
4. శ్రీమతి కొల్లా తాయారమ్మగారు. 5. శ్రీమతి భువనగిరి లక్ష్మీకాంతమ్మగారు.

ఇనాం! రు. 100 ఇనాం!!

# అసలు పుష్యరాగముల ఆభరణములు

గల దుకాణమునందే ఎల్లప్పుడు లావాదేవి చేయుటకు ప్రతియొక్కరు అభిలషింతురు. గాన వీరు యీదిగువస్థలమునకు వచ్చిన షేప్లైన అసలు పుష్యరాగములు, ఇతర మేలగు మణుల ఆభరణములు న్యాయమైన ధరకు దొరకును.

అసలు పుష్యరాగములు కాదని రుజువుపరచునట్టివారికి **100** రూపాయలు ఇనామివ్వబడును.

జలగం సుబ్రహ్మణ్యం నాయుడు కంపెనీ, 222, చైనాబజారు రోడ్డు, మద్రాసు.

---

## ఏలూరు, అన్న, వస్త్ర, వైద్య, విద్యాదాన సమాజము (ఏలూరు)

ఈ సమాజము 1913 సం॥ స్థాపించబడెను. దీనికిస్థలము ప్రభుత్వమువారు ధర్మముగ నొసగిరి. బొమ్మా రత్నంగారు భవనమును కట్టించి ధర్మముగ నొసగిరి. ఇచ్చట ప్రతిదినము అశక్తులకు అన్నదానము జరుగుచున్నది. సంవత్సరమున కొకసారి 15 డిశంబరు తేదీన 1000 వెయ్యిమందికిపైగా బీదలకు వస్త్రదానము జరుగుచున్నది. వేసవికాలము నాలుగు మంచినీళ్ల చలివేంద్రలు పెట్టబడుచున్నవి. వైద్య, విద్యాదానములు జరుగుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. దాతలపేరున ప్రతి సంవత్సరము నెలగోనులు రెండవపూట అన్నదానము జరుగుచున్నది. అనాథశరణాలయముకూడ స్థాపించుటకు ఏర్పాటులు జరుగుచున్నవి. రు 10 లు లగాయతు శాశ్వతనిధి ధర్మమునిచ్చి రశీదులు, పట్టాలుపుచ్చుకొని సమాజాభివృద్ధికై సహాయబడ కోరుచున్నాము.

యితర వివరములకు :—

1. రా. బ మోతేగంగరాజు జమీందారు
2. కొత్తమాసు శీతారామయ్య (సోల్ ట్రస్టీలు,)
3. పసుమర్తి పురుషోత్తము (ప్రెశిడెంటు)
4. మద్దుల వెంకటచిన్నరాజు } (వైస్ ప్రెసిడెంట్లు)
5. సున్న గంగరాజు }
6. కందుల రామయ్య (శెక్రటరీ)





సత్య(వంతుని) సముద్ధరణము

**Liberation of Satya (vanta)**

—T. Rama Rao.







(17) 1. పర్ణకుటియందు మహాత్ముడు, సి. యఫ్. ఆండ్రూసుగారును. 2. శ్రీ లక్ష్మీదేవదాసుగాంధీల పరిణయము

## మహాత్ముని హరిజనయాత్ర.











1. రైలుప్లాటుఫారములలో మహాత్ముని దర్శనమునకు. 2. గోరీ బిన్నూరులో సభ. 3. సీతానగర సత్యాగ్రహాశ్రమమునకు కాలినడక.
4. చికట్లాలో తోటపికారు. 5. తిరుమారుచేరువ శ్రీరామకృష్ణ గురుకులమునకు శంకుస్థాపన.

వెంకటమఖి ఇట్లు నిర్దాక్షిణ్యముగ రామామాత్యుని బుల్కుటకు తనగొప్పాధిక్యమును చెప్పుకొనుటకన్న వేరుకాదని యెంచితిమి. చ్యుతషడ్జముకన్న తక్కువ నిషాదమే రామామాత్యుడు కాంభోజియందు చెప్పినాడు. ఇతని కాంభోజియందలి నిషాదము వేంకటమఖి చెప్పు కాకలినిషాదము కాదనునది విశదమే. శంకరాభరణము మున్నగు వానిగూర్చి యెంచునప్పుడు కొంత భిన్నపద్ధతులు కాన్పించినను అందులకు కారణము సంగీతము లక్ష్యమందు ఆయా కాలానుసరణముగ మార్పుజెందుచుండిన దనునది గ్రహింపవలయునే కాని ఒక కాలమునందలిపద్ధతి మరియొకప్పుడు లేనిచో నది తప్పుగ జెప్పుట తగదు. లక్ష్యమందు సంగీతము మార్పులుచెందుటగూర్చి వెంకటమఖి యేమి, సోమనార్యుడేమి ప్రతివారును గ్రహించుచునే యుండిరి. అప్పుడెల్ల లక్షణముకన్న లక్ష్యమే ప్రధానమని వీరెల్లరు వాకొని యున్నారు. రామామాత్యుడు

"తస్మాల్లక్ష్యప్రధానం తన్నతు లక్ష్మప్రధానకమ్."

అనియు, శార్ఙ్గదేవుడు

"యద్వా లక్ష్యప్రధానాని శాస్త్రాణ్యేతాని మన్వతే""

అనియు నిట్లు చెప్పుచుండిరి. ఇట్లు ఆయాకాలములందు సంగీతము లక్షణమునకు గొంతవ్యత్యాసముతో లక్ష్యమందుంటచే నప్పుడెల్ల లక్షణగ్రంథములు లక్ష్యమునకనుసరించి రచింపబడుచుంట విదితము.

"సంగీతశాస్త్రే బహుధా సన్త్యేవ లక్ష్యేషుచ లక్షణేషు,
సర్వసమో కృత్య స రామమన్త్రో తనోతు శాస్త్రం వచసా తవేతి " (?)

అని రామామాత్యుడు చెప్పినాడు. వెంకటమఖి తన కాలమున ౧౯ మేళములుమాత్రము వాడుకయం దుండినట్లును, ప్రస్తార మేళములు డెబ్బదిరెండు తాను నిర్మించినట్లును చెప్పుకొనుటచే నితని కాలపుసంగీతమునకును, అనంతరముండినదానికిని వ్యత్యాసము కలదని గ్రహింతుము. వెంకటమఖికాలమునాటి మేళములుమాత్రము కాక యితని అంతరకాకలీస్వరములుసహిత మిప్పుడు బాహుళ్యము నొందలే దనునది విదితము. ఏల, వెంకటమఖి ౭౨ మేళముల పేర్లు కూడ నిప్పుడు కానము? ఇట్లు ఆయాకాలములందు సంగీతము కొంత వేరుగ గన్పట్టుటచే రామామాత్యుని మేళములు, జన్యరాగములు వెంకటమఖికి దోషములుగ దోచుట నవ్యము కాదని నామతము.

వెంకటమఖి

వెంకటమఖి తనస్వరములను షడ్జము, శుద్ధఋషభము, పంచశ్రుతిఋషభము, శుద్ధగాంధారము, షట్శ్రుతిఋషభము, సాధారణగాంధారము, అంతరగాంధారము, శుద్ధమధ్యమము, వరాళిమధ్యమము, పంచమము, శుద్ధధైవతము, పంచశ్రుతిధైవతము, శుద్ధనిషాదము, షట్శ్రుతిధైవతము, కైశికినిషాదము, కాకలినిషాదము లనుపదునారు పేర్లను చెప్పి యిందు పంచశ్రుతిఋషభశుద్ధగాంధారములు, షట్శ్రుతిఋషభసాధారణగాంధారములు, ఇట్లు పంచశ్రుతిధైవత శుద్ధనిషాదములు, షట్శ్రుతిధైవత కైశికినిషాదములు వీని స్వరస్థానము లొక్కటియగునని యెంచి వీనిని రామామాత్యునికన్న కొంత క్రమపద్ధతిని మేళములందు చేర్చి తన ౧౯ మేళములను వెలయించినాడు. రామామాత్యుడు రాగములకు శార్ఙ్గదేవుడు సూచించిన రాగాంగోపాంగభాషాంగపద్ధతిగ మేళముల నేర్పరచి కృతకృత్యుడాయెను. ఈ మేళపద్ధతి కర్ణాటకసంగీతవేత్తలెల్లరు, సోమనార్యుడు, వెంకటమఖి, రఘునాథరాయలు మున్నగువారుసహితము అనువదించుచుండిరి. అందుచే నితడు మార్గదర్శకుడుగ నెన్నబడును. వెంకటమఖి తనమేళములు సహితము ప్రకృతివికృతస్వరముల క్రమప్రస్తార నిర్మితములుగ లేవని గ్రహించి మేళప్రస్తారపద్ధతి ననువదించెనని చెప్పబడును ఇప్పు డనువదింపబడునది ఇదియే.

మేళప్రస్తార పద్ధతి

మేళప్రస్తారపద్ధతి వెంకటమఖి స్వనిర్మితమే యని గర్వముగ జెప్పుకొనినను ఇయ్యదియితనితండ్రి గోవిందదీక్షితనిర్మితమనియెంచుటకాధారములు కలవు. గోవిందదీక్షితులు తంజపురి నేలిన రఘునాథరాయల యాస్థానమున నమాత్యపదవి నలంకరించి యుండెననియు, నితనివలన "సంగీతసుధ" అనులక్షణగ్రంథము వెలువడెననియు దెలియుదుము. ఈగ్రంథము రఘునాథరాయలు తాను రచించినట్లు తన పేరు పెట్టుకొనెను. వెంకటమఖియు దన తండ్రిగారు సంగీత లక్షణగ్రంథము రచించినట్లును, తనకది యాధారమగుచుండినట్లును చెప్పుకొనినాడు ఇయ్యది "సంగీతసుధ" యే యని గ్రహింపనగును. మేళప్రస్తారపద్ధతి ఇట్లు తండ్రిగారివలన గ్రహించియుండనోపు. అట్లయ్యు నితడు

"మేళా ద్విసప్తతిః శ్రీమద్వేంకటాధ్వరి కల్పితాః."

అని చెప్పుకొనుట తనఘనతను వెల్లడించుకొనుటకే.

మరియు గోవిందాచార్యకృత "సంగీతశాస్త్రసంక్షేపమ్"అను ప్రాచీన తాళగ్రంథమున * డెబ్బదిరెండు ప్రస్తారమేళములు చెప్పబడియున్నవి. ఈగ్రంథమందలి మేళములపేర్లు వెంకటమఖి చెప్పు చొప్పున లేవు. ఇప్పుడు వాడుకలోనుండిన కనకాంగి, రత్నాంగి, ఖరహరప్రియ మున్నగుపేర్లు ఈగ్రంథమున జూతుము. గోవిందాచార్యప్రణీతగ్రంథము వెంకటమఖిగ్రంథముకన్న ప్రాచీనమైన దని యెంచవలసినచో నీప్రస్తారపద్ధతికూడ వెంకటమఖికి ఆధార మాయెనని యెంచవలసి యుండును. అందుచే నితని పై వాక్యమునందువలె ౭౨ మేళములు స్వనిర్మితములే యని చెప్పుటలో రసములేదు. ఎట్లయినను వెంకటమఖి ప్రస్తారమేళములం దెక్కువ మక్కువకలిగియుండెననుట చెల్లు. ఏమికారణముననో వెంకటమఖియొక్క అంతర గాంధార కాకలినిషాదముల స్వరస్థానములుకాని, పంచశ్రుతిఋషభ ధైవత

* అడయారు పుస్తకభాండాగారము, నెంబరు 3౦ A ౨౨.

ములుకాని, కనకాంబరి, రత్నాంబరి మున్నగు ప్రస్తారమేళముల పేర్లు కాని ఇప్పుడు వాడబడుటలేదు. కాని దీక్షితసోదరులు మున్నగువారీపేర్లను గ్రహించియుండిరనునది మరువరాదు. ఈసంగతులు ముందు మరియొకవ్యాసమున చర్చింతుము.

## ప్రస్తారక్రమము

వెంకటమఖి స్వరావళిని పూర్వాంగోత్తరాంగము లను రెండు విభాగములుగ నెంచెను. షడ్జము మొదలు మధ్యమము వరకు పూర్వాంగస్వరము లనియు, పంచమముమొదలు నిషాదమువరకు ఉత్తరాంగస్వరములనియు నెంతుము. ఇట్లు శుద్ధమధ్యమముతో జేర్చబడిన ౩౬ మేళములు పూర్వాంగములనియు, వరాళిమధ్యమముతో జేర్చబడినమేళము లుత్తరాంగములనియు నెంచబడును రెండువిధములగు మధ్యమము లిట్లు చేర్చబడెను.

అ, ఇ, ఉకారములు — ఆయాస్వరములకు అ, ఇ, ఉకారములు చేర్చి వానిని సంజ్ఞలతో వెలయించు వెంకటమఖిభావము భావ్యమే అ, ఇ, ఉలు స్వరముల ఉచ్చస్వనమును చెప్పగలుగుచున్నవి 'అ' కన్న 'ఇ' ఉచ్చస్వనముకలది. 'ఇ' కన్న 'ఉ' ఉచ్చస్వనము కలది. ఇయ్యవి చేరి ఓంకారమైనందున నాదము ఓంకారస్వరూపమని యెంచబడుచున్నది. ఈసంగతివలనకాబోలు త్యాగరాజు 'కోలాహలసప్తస్వరగృహముల - గురుతేమోక్షమురా ఓ మనసా' అని పాడినాడు పాశ్చాత్యశాస్త్రవేత్త "హెల్మ్‌హోల్ట్సు" అచ్చులస్వనముగూర్చి చెప్పుచు వీనిధ్వనిని లెక్కవేసి వరుసగ హెచ్చుధ్వనికలిగియుండినట్లు పేర్కొనినాడు. మిగుల ప్రాచీనకాలమునాటిదిగ నెంచబడిన *కుటుమియామలై శిలాశాసనమందు స్వరములు పైవిధముగ నచ్చులతో జేర్చి చెప్పబడెను అందుచే నీశాసనము వెంకటమఖికి ఆధారమాయెనని యెంచ వీలగుచున్నది. ఈశాసనమందలి సంగీతముగూర్చి వేరువ్యాసము వ్రాయుదును. ఎట్లైనను వెంకటమఖి స్వరములందు అ, ఇ, ఉలు చేర్చి ర, రి, రు, గ, గి, గు; ద, ది, దు; న, ని, ను; ఇట్లు పదునారుస్వరములుచెప్పినాడు. వాని నిట్లుగ్రహించునది

| పూర్వాంగములు | | | | ఉత్తరాంగములు | | | |
|---|---|---|---|---|---|---|---|
| స్వరము | సంజ్ఞ | తుల్య స్వరము | సంజ్ఞ | స్వరము | సంజ్ఞ | తుల్య స్వరము | సంజ్ఞ |
| ౧ శుద్ధరి | ర | — | — | ౭. శుద్ధ ద | ద | — | — |
| ౨. పంచశ్రుతి రి | రి | ౩. శుద్ధ గ | గ | ౮ పంచశ్రుతి ద | ది | ౯ శుద్ధ ని | న |
| ౪. షట్శ్రుతి రి | రు | ౫. సాధారణ గ | గి | ౧౦షట్శ్రుతి ద | దు | ౧౧. కైశికి ని | ని |
| — | — | ౬ అంతర.గ | గు | — | — | ౧౨. కాకలి ని | ను |
| ౧౫. షడ్జము | — | ౧౩. శుద్ధ మ | మ | ౧౬. పంచమము | — | ౧౪. వరాళి మ | మి |

* ౧౨-వ శతాబ్దముకన్న ప్రాచీనమైనదిగ జెప్పబడెను.

సప్తస్వరములు ప్రతిప్రస్తారమేళమునందు ఉండునట్లు ప్రతిస్వరమును క్రమముగ ప్రస్తరింపబడుట ౭౨ మేళములందు చూతుము. వెంకటమఖి తన ౧౬ స్వరములు ప్రస్తరించునప్పుడు అందలి రి, గలు; రు, గిలు; ది నలు; దు, నిలు; ఒక్కస్వనమును కలిగియున్నవనునది గ్రహించియే యట్లు లెక్కవేసె ననునది మరువరాదు. అప్పుడు ౭౨ మేళములుమాత్రము కలుగును. ఎట్లో ఇటుచూడనగును.

పూర్వాంగస్వరములందు ప్రస్తారయోగ్యములు రి, గలుకదా. వీని నిట్లు ప్రస్తరింపవచ్చును. ఈప్రస్తారములు ఆరుఅగును.

| | | | | |
|---|---|---|---|---|
| ౧. శుద్ధఋషభ | శుద్ధగాంధారములు | లేక | సంజ్ఞలతో | రగ |
| ౨. ,, | సాధారణగాంధారములు | — | | రగి |
| ౩ ,, | అంతర ,, | — | | రగు |
| ౪. పంచశ్రుతి ఋషభ | సాధారణ ,, | — | | రిగి |
| ౫. ,, | అంతర ,, | — | | రిగు |
| ౬. షట్శ్రుతి ,, | ,, ,, | — | | రుగు |

ఉత్తరాంగస్వరము లిట్లు ధైవతనిషాదములు ద, నిలను ఆరువిధములుగమాత్రము ప్రస్తరింపవచ్చును

| | | | |
|---|---|---|---|
| ౧. శుద్ధ ధైవత | శుద్ధ నిషాదము | లేక | దన |
| ౨. ,, | కైశికి ,, | — | దని |
| ౩. ,, | కాకలి ,, | — | దను |
| ౪. పంచశ్రుతి ,, | కైశికి ,, | — | దిని |
| ౫. ,, | ,, కాకలి ,, | — | దిను |
| ౬. షట్శ్రుతి | కాకలి ,, | — | దును |

ఋషభగాంధారయుతము లారును ధైవత నిషాద ప్రస్తారము లారింటితో జేర్చిన ముప్పదియారుమేళకర్తలు కలుగును ఇయ్యవి శుద్ధమధ్యమ వరాళిమధ్యమయుతములుగ జేసిన డెబ్బదిరెండు మేళకర్తరాగము లగును. పైవిధమున ౧౬ స్వరములను ప్రస్తరించిన ౭౨ మేళములు కలుగవని కొందరు దురభిప్రాయ పడుచుండిరి. వీరు ౩౨ మేళకర్తలే గ్రహింతురు. ఇయ్యవి వెంకటమఖియొక్క ౧౨ స్వరముల ప్రస్తారము ననుసరించునవని వీరి యభిప్రాయము. వెంకటమఖి ౧౬ పేర్లు చెప్పినను ౧౨ స్వరముల ప్రస్తారమువలననే ౭౨ మేళకర్తల నెరిగెనని వీరు గ్రహింపవలయును వెంకటమఖి యభిమతము ననుసరించి యిట్లు చెప్పనగును వెంకటమఖిచెప్పిన ౩ రిలు, ౩ గలు ఇట్లు ప్రస్తరించి వీనిని 'దని'లతో జేర్చవచ్చును. ఇట చూడుడు

ఋషభగాంధారములు (౧) రగ, (౨) రగి, (౩) రగు, (౪) రిగ, (౫) రిగి, (౬) రిగు, (౭) రుగ, (౮) రుగి, (౯) రుగు

ఇట్లు తొమ్మిదివిధములుగ జేర్చవచ్చును. కాని పంచశ్రుతిరి=శుద్ధగ, షట్శ్రుతిరి=సాధారణగ కావున పైవానియందు రిగ; రుగ; రుగిలు గ్రహింపబడవు. కావున ౬ ప్రస్తారము లగును. ఇట్లు ధైవతనిషాదములచే నారు ప్రస్తారములు కలుగును. అందుచే ౩౬ మేళకర్తలగును. వీనియందు శుద్ధవరాళి మధ్యమములనుజేర్చి ౭౨ మేళకర్తలను జెప్పవచ్చును.

## చక్రములు

వెంకటమఖి పూర్వాంగస్వరములను ప్రస్తరించి ౬ చక్రములను వెలయించుట భావ్యమె. ఉత్తరాంగస్వరములు ప్రస్తరించిప్రతి చక్రమందును ౬ మేళకర్తరాగములు చేర్చినాడు. ఇందుచే

| | | | |
|---|---|---|---|
| ౧ వ | చక్రమందు | శుద్ధఋషభ | శుద్ధగాంధారమును |
| ౨ వ | ,, | ,, | సాధారణ ,, |
| ౩ వ | ,, | ,, | అంతర ,, |
| ౪ వ | ,, | పంచశ్రుతి ,, | సాధారణ ,, |
| ౫ వ | ,, | ,, ,, | అంతర ,, |
| ౬ వ | ,, | షట్శ్రుతి ,, | అంతర ,, |

ఇట్లున్నవి. ఒక్కొక్కచక్రమందు ధైవతనిషాదము కలిగి ఇట్లున్నవి:—

| | | | |
|---|---|---|---|
| ౧ వ | మేళకర్త | శుద్ధధైవత | శుద్ధనిషాదము |
| ౨ వ | ,, | ,, | కైశికి ,, |
| ౩ వ | ,, | ,, | కాకలి ,, |
| ౪ వ | ,, | పంచశ్రుతి ,, | కైశికి ,, |
| ౫ వ | ,, | ,, ,, | కాకలి ,, |
| ౬ వ | ,, | షట్శ్రుతి ,, ,, | ,, |

కావున ఆయామేళకర్త ఆయాచక్రమం దాయాస్థానమున నుండునట్లు గ్రహింపవలయును. ఇందుచే మేళకర్తసంఖ్య తెలియవచ్చిన నందలి వికృతస్వరావళి నెరుగ నగును. ఎట్లో ముందు చూతము. పైచక్రములకు వెంకటమఖి వరుసగ (౧) ఇందు, (౨) నేత్ర, (౩) అగ్ని, (౪) వేద, (౫) బాణ, (౬) ఋతు అని పేర్లు చెప్పెనాడ. వీనికి దుల్యమగు వరాళిమధ్యమయుతము లగునవి (౭) ఋషి, (౮) వసు, (౯) బ్రహ్మ, (౧౦) దిశ, (౧౧) రుద్ర, (౧౨) ఆదిత్యులు. మొదటి యారుచక్రములు పూర్వాంగములు. తక్కినవి యుత్తరాంగములు. పూర్వాంగచక్రములందలి రాగముల స్వరములే యుత్తరాంగము, వానియందును వరాళిమధ్యమముతో గూడి యున్నది. ఇట్లు మధ్యమము వేరుగ నుండినంతనే పూర్వాంగములు మారుచున్నవి. ఇందుకు దృష్టాంతముగ వేంకటమఖి ఇట్లుచెప్పినాడు:

"కటాహసంక్షిప్తం క్షీరం కేవలం దధిబిందునా,
యథా సంయోజ్యమానంతు దధిభావం ప్రపద్యతే;
తథైవ పూర్వమేలాస్తే మధ్యమేన విసంజ్ఞికాః."

మరియు నాయాచక్రమునందలి ఈవరుసరాగములు వ్యాపకము జెందుట గమనింపదగినది.

| | | | | |
|---|---|---|---|---|
| ౧ వ | చక్రమునందలి | ౧ వ | మేళకర్త | — కనకాంగి. |
| ౨ వ | ,, | ౨ వ | ,, | — హనుమతోడి. |
| ౩ వ | ,, | ౩ వ | ,, | — మాయామాళవగౌళ. |
| ౪ వ | ,, | ౪ వ | ,, | — ఖరహరప్రియ. |
| ౫ వ | ,, | ౫ వ | ,, | — ధీరశంకరాభరణము. |
| ౬ వ | ,, | ౬ వ | ,, | — చలనాట. |

ఈరాగము లాయాచక్రములందు ముఖ్యము లగుటచే నా చక్రము లాపేర్లతో వాడ్కొనుటయు దప్పుకాదు.

కొన్ని ముఖ్యాంశములు:—

౧. మేళకర్తలన్నియు సంపూర్ణములుగ నిష్పాదించబడును. స, పలు అవినాశి, అనగా వికృతములు లేనివి యగును.

౨. తక్కిన వినాశిస్వరములు రి, గ, మ, ద, ని లలో మధ్యమము ౭౨ మేళకర్తలను విభాగించుచు మొదటి ౩౬ మేళముల శుద్ధమధ్యమము కలవిగను, తక్కిన ౩౭-౭౨ మేళకర్తలు వరాళిమధ్యమము కలవిగను ఉన్నవి.

౩. ౧ మొదలు ౧౮ మేళకర్తలు వీనికి సమములైన వరాళిమధ్యమయుతములగు ౩౭-౫౪ మేళకర్తలు శుద్ధఋషభయుతములు.

౪. ౧౯-౩౦ మేళకర్తలు వీనికి సమములైన వరాళిమధ్యమయుతములగు ౫౫-౬౬ మేళకర్తలు పంచశ్రుతి ఋషభయుతములు.

౫ ౩౧-౩౬ మేళకర్తలు వీనికి సమములైన వరాళిమధ్యమయుతములు. ౬౭-౭౨ మేళకర్తలు షట్శ్రుతిఋషభయుతములు.

౬. ౧ మొదలు ౬ను, వానికిసమములైన వరాళిమధ్యమముగల ౩౭-౪౨ మేళకర్తలును శుద్ధగాంధారయుతములు.

౭. ౭-౧౨ మేళకర్తలును, ౧౯-౨౪ మేళకర్తలు వీనికి సమములైన వరాళిమధ్యమముగల ౪౩-౪౮ మేళకర్తలును ౫౫-౬౦ మేళకర్తలును సాధారణగాంధారయుతములు.

౮. ౧౩-౧౮ మేళకర్తలును, ౨౫-౩౬ మేళకర్తలు వీనికి సమములైన వరాళిమధ్యమముగల ౪౯-౫౪ మేళకర్తలును, ౬౧-౭౨ మేళకర్తలును అంతరగాంధారయుతములు.

౯. పూర్వాంగోత్తరాంగమేళ చక్రములందలి ౧, ౨, ౩ మేళకర్తలును శుద్ధధైవతయుతములు. ఇట్లు ౪, ౫ మేళకర్తలు

పంచశ్రుతిధైవతయుతములు. ౬-వ మేళకర్త షట్ఛ్రుతి ధైవతముతో గూడినది.

౧౦. పూర్వాంగోత్తరాంగమేళచక్రములందు వరుసగ ౧-వ మేళకర్త శుద్ధనిషాదము, ౨-వ మేళకర్త కైశికినిషాదము, ౩-వ మేళకర్త కాకలినిషాదము, ౪-వ మేళకర్త తిరిగి కైశికినిషాదము, ౫, ౬, మేళకర్తలు కాకలినిషాదము ఇట్లు కలవిగ నున్నవి.

ఇట్లు ఋషభగాంధారములు మేళచక్రములను ధైవతనిషాదములు చక్రమునందలి వరుసమేళకర్తలను నిరూపింపగలుగుచున్నవి.

## ఈపద్ధతి యుపయోగములు

మేళచక్రములును, చక్రములందలి మేళములును నియమానుసరణముగ నుంటచే మేళకర్తసంఖ్య తెలిసిన అందలి ప్రకృతివికృతి స్వరావళి నెరుగవచ్చునని యెంచితిమి. ఉదాహరణముగ ౨౩-వ మేళకర్తయందలి స్వరావళి నారయుట కిట్లు చూచునది:

౧. తొలుత స . . . ప . . సే ఇట్లు అవినాశి స్వరములను వ్రాయునది.

౨. సదరు మేళసంఖ్య పూర్వాంగోత్తరాంగములం దెచ్చట కలదియు నెరిగి శుద్ధ లేక వరాళిమధ్యమమును వ్రాయునది. స . . శు.మ ప . . సే

౩. ఇకపూర్వాంగస్వరములు రి, గ, ల నెరుగుటకు సదరు సంఖ్య ఏచక్రమందుండునదియు నెంచునది. ౨, ౩, సంఖ్య ౪-వ చక్రమందు కలుగును కావున నది పంచశ్రుతిఋషభ సాధారణ గాంధారములు కలిగినదగును.

స, పం, సా.గ, శు.మ, ప . . సే

౪. ఉత్తరాంగస్వరములు ద, నిల నారయుటకు సదరుసంఖ్య ఆచక్రమం దే స్థానముననున్నది తెలియవలయును. ౨, ౩, సంఖ్య ౪-వ చక్రమందు ౫-వ స్థానమున నుంటచే నిందు పంచశ్రుతిధైవత కాకలి నిషాదములు కలుగును. కావున స్వరము లిందు:—స, పం. రి, సా.గ, శు మ, పం.ద, కా.ని, సే. ఇట్లు కలవు మేళసంఖ్య ౩౬ కు మించిన నద్దానియందు ౩౬ తీసివేసి పైక్రమమున స్వరములు తెలియనగును. ఇందు వరాళిమ. కలుగును.

## కటపయాది నియమము

పైవిధమగు మేళకర్తసంఖ్య తెలిసిన నందలి స్వరావళి నెంచనగును కదా. మేళకర్త పేరు ననుసరించి సంఖ్య నెరుగుటకు కటపయాదినియమము అని చెప్పబడును. క, ట, ప, య అనగా—కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్ట – అని గ్రహింతము. వీని స్థానములు సంఖ్యల నిట్లు తెల్పును:

| | ౧ | ౨ | ౩ | ౪ | ౫ | ౬ | ౭ | ౮ | ౯ | ౦ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కాదినవ— | క | ఖ | గ | ఘ | ఙ | చ | ఛ | జ | ఝ | ఞ |
| టాదినవ— | ట | ఠ | డ | ఢ | ణ | త | థ | ద | ధ | న |
| పాదిపంచ— | ప | ఫ | బ | భ | మ | - | - | - | - | - |
| యాద్యష్ట— | య | ర | ల | వ | శ | ష | స | హ | - | - |

మేళకర్తల తొలిరెండక్షరములు వానిసంఖ్యను తెలుపునట్లుగ తెలియుచునప్పటి మనవారిశక్తి వర్ణనాతీతము. మేళకర్తయందలి ప్రథమాక్షరము కటపయాదులం దెచ్చట నున్నదియు గ్రహించి యా సంఖ్యను లిఖించి యద్దానివెనుక రెండవ యక్షరముయొక్క సంఖ్యను చేర్చిన నాసంఖ్య మేళకర్తను తెలుపగలుగుచున్నది. ఞ, న, లు శూన్యాంకము కలవి. మేళకర్తలందలి సంయుక్తాక్షరములలో ద్విత్వములు గ్రాహ్యములు.

ఉదాహరణము:—రత్నాంగియందు 'ర' ౨ ను తెలుపును. తక్కిన 'త్నా'యందు 'న' తీసికొబడి యది శూన్యముగ నెంచబడుటచే నీమేళకర్తసంఖ్య ౨ మాత్ర మగును. ఇట్లు తక్కినవి గ్రాహ్యములు. కాని కొన్నిట ద్విత్వమునకు మారుగ పై యక్షరమే తీసికొబడినది. "చక్రవాకము" నందలి 'చ' = ౬ ను, క = ౧ తెలుపునదిగ నెంచి యద్దాని ౧౬-వ మేళకర్తగ జెప్పబడెను. 'రత్నాంగి' యందువలె ద్విత్వమగు 'ర' గ్రహింపబడలేదు. ఇట్టి విధివిరోధము లగునవి కొన్ని 'కనకాంగి' మున్నగు మేళకర్తల పేర్లయందు చూతుము. వీని వివరము మరియొక వ్యాసమున వ్రాయుదును. ఇప్పటి కర్ణాటకరాగములన్నియు నిట్టి మేళప్రస్తారపద్ధతి ననుసరించి యుండినవని గ్రహింపవలయు. వీని జన్యములు, రాగ విభాగము మున్నగు నంశములనుగూర్చి వేరువ్యాసమున దెలుపుదును.

# గర్జనము

కొమ్మినేని వెంకటసుబ్బమాంబ, క్రొత్తపల్లి సీతారామమాంబ

[కర్నాటకదేశమందలి బేలగాముమండలములోని బేలవాడీభుయికోటకు ఏలికయైన ఏసాజికి ఇల్లాలు సావిత్రి శివాజీసైన్యాధిపతియగు దాదోజీవీరుడు ఏసాజీని గెలువగోరి భుయికోటను ముట్టడించెను ఏసాజీ పగఱజూచి బెగడొందక మగటిమితో శత్రుల డీకొనుచుండెను కాని యధర్మయుద్ధంబున దాదోజి ఏసాజీని హత మొనర్చెను వీరపత్ని సావిత్రి పతిమరణమునకు కుందక తన పరివారముతో రణరంగంబు జేరి పతికళేబరమునకు మూమ్మారు భక్తితో ప్రదక్షిణించి తల్లడపాటుతో చెల్లాచెదరగుచున్న తన సైనికులకు శౌర్యాగ్ని ప్రజ్వరిల్లునట్లు గర్జించిన ఘట్ట మిది ]

వీరవరేణ్యులార, పరువెత్తుదు రేమి, త్యజించి యుద్ధమున్
భీరువులైన స్త్రీలబలె బిక్కముగంబులు వైచి మానమున్
పౌరుషమున్ గణింపక క్షణాత్యయబుద్బుదతుల్యజీవముల్
గోరుచు నీచశాత్రవులకున్ చెయిమోడ్చి నమస్కరింపుచున్

ఆజి నొకింతయేనియును న్యాయములేక చలంబుతోడ ఏ
సాజిని మీ ప్రభూత్తముని శాత్రవు లేకత ముట్టడింప దా
దోజి మహాపరాక్రమముతో చనుదెంచి వధించియుండ మీ
తేజ మదెందు డాగెను ప్రతిక్రియకున్ దలపెట్ట రింతకున్

మీ ప్రభువరేణ్యు లిట్లు సమీకమందు-చచ్చిపడియుండ ప్రాణంబు లిచ్చగించి
పరికిపందలగుచు పరువెత్తుచుంట-రాజభక్తులు మీకు ధర్మంబటయ్య!

తలచి మొఱుంగరయ్య తమ తాతలు తండ్రులు నీచభోగముల్
తొలగి తొఱుంగరయ్య ఘృతతో, పెనుభీతితో యుద్ధరంగమున్
నిలిచి మొఱుంగరయ్య ప్రభునిన్ వధియించి పరుల్ క్రమింపగా
పలికి మొఱుంగరయ్య తమపాదములన్ బడువార మంచునున్

సమరమునందు కాలిడుట శత్రులనొంచుట లేక తారు ప్రా
ణములను ఖాయుటో జరుగగావలె కాని భయంబుతోడ మా
నమును త్యజించి వైరిచరణంబుల వ్రాలి నమస్కృతుల్ రచిం
చి మనుట శౌర్యవంతులకు సిగ్గులచేటుసుమీ తలంపగా

రాజభక్తిని విడక సంగ్రామమందు-ప్రాణముల గోలుపోయి స్వర్గంబు జేరి
పూజ్యగౌరవస్థానంబు బొందినారు-ధన్యులగుచును మీ తాత తండ్రు లకట!

అట్టివీరుల కడుపున బుట్టి మీరు-తుచ్ఛభోగంబు లాసించి ద్రోహులగుచు
రాజభక్తిని వీడి సంగ్రామమందు-మొరకుపగరకు బత్తి కేల్మోడ్తు రేమి?

స్వీయదేశమానంబు రక్షించుకొఱకు - ప్రతినబూనినవారలై పడతులెల్ల
కాళికామూర్తులగుచు సంగరము జేరి - పరుల దునుమ తమకు తలవంపుగాదె.

సైనికులార, లెండు తమ సాహససంపద జూపరండు యు
ద్ధాన నరాతివీరుల మదం బడగింపగ పొండు తేకువన్
ప్రాణములన్ గణింపక మహాహవమందు జయంబుతెండు మీ
మానము గాచుకొండు తుదిమాటిదె సిద్ధముకండు పోరికిన్.

---




(ప్రకృతి చిత్రము)

—శ్రీ పంద దుర్గారావు.

# ౭. వైద్యము

## ఆయుర్వేదములోని అద్భుతచికిత్సలు

మంగిపూడి వేంకటశర్మ

పార్శ్వపునొప్పికి — నొప్పి గలవారిని దంతధావనము చేయకపూర్వమే సూర్యోదయమగువేళకు రమ్మని చెప్పి వారిని పడమటిముఖముగా నిలిచియుండబెట్టి వారికి ఏపార్శ్వమున నొప్పియుండునో ఆపార్శ్వమున నీడలో కనుబొమ్మమీద భ్రూమధ్యముమొదలు కనుబొమ్మ చివరదాక మూడుమేకులను నేలలోనికి కొట్టవలయును. నీడలో కనుబొమ్మ బాగా గుర్తించి కొట్టవలయును. నీడ బాగా ఆనకయున్నయెడల ఆపార్శ్వమున చెవిలో ఒకరూళ్లపెన్సిలుగాని, ఆలాటి సన్నని పుల్ల వేరొకటిగాని పెట్టుకొని ఆపుల్లచివర పట్టుకొమ్మని చెప్పి చెవికిని (చెవిరంధ్రమునకును) కనుబొమ్మకును ఎంతయెడము గలదో అంతయెడము మీదకు చూచినయెడల కనుబొమ్మస్థానము తెలియును. అప్పుడు మేకులు సరియైన స్థానములో కొట్టుటకు వీలగును. ఒకవేళ ఎండ మసకగానుండి ఇంకను నీడ సరిగా కనపడకయుండినయెడల మేకులు నిదానముగా గాక ఎగుడుదిగుడుగా కొట్టినయెడల ఏదోయొకమేకుఅయినను కనుబొమ్మమీద పడకమానదు. అదియైనను చాలును. ఒక్కమేకు కనుబొమ్మమీద పడినను పార్శ్వపునొప్పి వెంటనే ఆశ్చర్యకరముగా తగ్గిపోవును. మేకులు బొత్తిగా సన్నముగా నున్నయెడల నీడ సరిగాలేనపుడు కనుబొమ్మలో పడవు కనుక లావుపాటి బొగడమేకులు కొట్టినయెడల సులభముగా కనుబొమ్మమీద పడును. మూడు మేకులలో ఏమేకు కనుబొమ్మనీడలో దిగినను నొప్పి ఆక్షణములోనే చేతితో తీసివేసినట్లు మాయమైపోయి బరువు తగ్గి సుఖముగలిగి యింద్రజాలము చేసినట్లు రోగికి తోచును. అట్లు నొప్పి, బరువు తగ్గి వెంటనే సుఖము కలుగనియెడల మేకులు సరియైనచోటున పడలేదని నిశ్చయించుకొని మరునాడు మరల జాగ్రత్తగా చూచి యీచికిత్స చేయవలయును. రెండుమూడురోజులు చేసినయెడల ఒకనాడయినను ఎండ బాగుగానుండి మేకులు కొట్టవలసినచోటు నీడలో స్పష్టముగా కన్పడ వచ్చును. ఈ చికిత్స మావైద్యశాలలో వేలకొలది మందికి చేయబడినది. అందరికిని అమోఘముగా కుదిరినది. మబ్బువేసిననాడుగాని, వర్షపుదినములలోగాని ఈ మేకులవైద్యమునకు వీలుండదు. కనుక అప్పుడు ఈ క్రిందిచికిత్స చేయవలయును. నొప్పిగలవారు ఉదయమునకు పూర్వమే దంతధావనము చేసి ఒక ఔన్సు ఆవుపాలలో ఇరువదిచుక్కలు ఆవునెయ్యి వేసి త్రాగవలయును. ఇట్లు ఒకవారము, పదిదినములవరకును చేయవలయును. నొప్పి తప్పక తగ్గిపోగలదు. అనేకులకు తగ్గినది.

బుడ్డలు — చిన్నపిల్లలకు కొందరికి ఒరబీజములు (ఒకటి పెద్దదిగా ఒకటి చిన్నదిగా నుండును.) మిక్కిలి పసితనములోనే వచ్చును. ఈబీజములలో పెద్దదిగా నున్నదానిని లోపలికి గెంటినయెడల పోవును. మరల నడచినగాని, ఊపిరి గట్టిగా విడిచినగాని వచ్చును. అట్టి దానికి క్రింది చికిత్స చేయవలయును. కంసదుంపలు, లేక కాజదుంపలు అను పేరుగల దుంపలు రెండు తేవలయును. (కంసమొక్కలు, లేక కాజమొక్కలు ఊడుపు

చేలలో తరుచుగానుండును కాలువలలో నీటివారను గట్టులనంటియుండును నీరు నిలిచిన గుంటలలోనుకూడ మొలుచును వీటి ఆకులు ఖిక్కిలిదళసరిగా నుండును పువ్వులు తెల్లగా - కృష్ణతామరపువ్వులవలె - కాడలవలె నుండి కొద్దిగా పలచనిరేకులు కొంచెము కలిగి యుండును) రెండుదుంపలను పిల్లలబుడ్డలకు దిగదుడిచి ఒకదుంప అన్నము వండుకొను పొయిలో పాతిపెట్ట వలయును రెండవదుంప యింటిగుమ్మమునకు వ్రేలాడ గట్టవలయును ప్రొయిలోని దుంప అన్నము వండు నపుడు నిప్పుశెగకు ఉడికి కరగి హరించిపోవుచుండును బుడ్డకూడా తగ్గ నారంభించును ప్రొయిలోని దుంప హరించిపోవునప్పటికి బుడ్డ సమానస్థితికి వచ్చును ఇది అద్భుతము అయితే ఈచికిత్సలో కొందరికి గుణము కనుపించలేదు అనేకులకు పనిచేసినది ఈబుడ్డలలో భేదము లుండి తగ్గలేదో మరి యేమిహేతువో శ్రద్ధగల వైద్యులు పరిశోధనలు చేసి కనుగొని వెల్లడింప వేడు చున్నాను

తేలుకాటుకు—మామిడిచెట్లు పూచినరోజులలో ఉదయముననే చెట్టుసమీపమునకు పోయి దంతధావనము చేసుకొనవలయును వెంటనే చెట్టుయొక్క ఒక్కవాలుకొమ్మ కేసి మాడవలయును ఆకొమ్మ చేతికి అందునదిగా నుండవలయును చూడగానే ఏపువ్వులు కన్నులబడునో ఆపువ్వులగుత్తిని పట్టుకొని గుత్తి కొమ్మనుండి కోయకయే రెండుచేతులతోను నలిపి ఆరసమును రెండు చేతులయొక్క అరచేతులలోపలను, వెలుపలను వ్రేళ్లను వ్రేళ్లసందులను బాగుగా పట్టునట్లు పూసుకోవలయును ఇంతవరకును ఆపువ్వులగుత్తిగల కొమ్మను వగలివేయరాదు అనగా కొమ్మయొక్క పూగుత్తిని పట్టుకొనగానే నలిపివేసి చేతులనిండ ఒక్కసారిగానే ఒక్కనిమిషములోనే ఆపసరు, లేక రసము పట్టునట్టు రాచుకోవలయును. కొమ్మను వదలిపెట్టి మరల పట్టుకొని నలిపి రాచుకొనగూడదు ఇంకొకకొమ్మకాని, గుత్తులుగాని అసలే పనికిరాదు. మొదటచూచినగుత్తులే నలపవలయును దంతధావనము చేసికొని పువ్వుగుత్తులు చూచు వరకును తలవంచుకొనియో, యింకొకదిక్కుకు చూచుచునో యుండవలయునుగాని చెట్టు కేసి (చెట్టువంక) చూడరాదు ఈలాగు చేతులకు పూసుకొన్న పువ్వురసముయొక్క మహాత్త్వము ఏడాది (ఒక్కసంవత్సరము) వరకు నుండును ఇప్పుడు పునాసచెట్లు దేశమంతటను దొరకుచున్నవిగాన ఆరునెలలకొకసారి యీలాగు చేసినచో మరియును మంచిది ఈరీతిగా పసరు పట్టించుకొన్న తరువాత ఇంటికి వెళ్లి చేతులు కడిగి వేసికోవచ్చును ఆనాడుమొదలు తేలుకుట్టినవారు వచ్చినయెడల కుట్టిన చోటు అడిగితెలిసికొని, కాలు అయినయెడల తొడలవద్దనుండి క్రిందికిని, చేయిఅయినయెడల చంకలదగ్గర నుండి క్రిందికిని గట్టిగా పట్టుకొని దిగజార్చవలయును మెస్మరిజము చేసినట్లు దిగిపోవును రెండుచేతులతోను (కుట్టినకాలుగాని చెయ్యిగాని) గట్టిగా పట్టుకొని (తనచేతులు) క్రిందికి దిగజార్చవలయును యక్షిణివలె బాధ తగ్గిపోవును ఇదికూడ చేసి మాడబడినది

తేలుకాటుకు ఇతరచికిత్సలు—తేలు కుట్టినచోట వేడినీళ్ల ఆవిరి పట్టినయెడల చెమటతో విషము పైకి వచ్చి త్వరలో బాధ ఉపశమించును గనుక ఎక్కువబాధగలవారికందరికిని ఆవిరిచికిత్స ముందుగా చేయించుట మంచిది చింతగింజ ముదిరినది, పెద్దది, అనగా వెడలుపుగానుండునది తెచ్చి దానిపైనిగల బెరడును (పెచ్చు, లేక పెంకు) అరగదీసి తీసివేయవలయును నీళ్లతో అరగదీయ వచ్చును బెరడు అంతా అరగదీసివేయవలయును లోపలిపదార్థమును అనగా చింతగింజలోనిపప్పును తేలు కుట్టినవారు వచ్చినయెడల ఒక్కనీళ్లచుక్కవేసి రాతిమీద కొద్దిగా అరగదీసి, అనగా ఒకటిరెండుచుట్టులు మాత్రము అరగదీసిన ఆగింజకు కొద్దిగా జిగురువచ్చును ఆగింజను కుట్టినచోట అంటించవలయును అయిదు, లేక పదినిమిషములలో నిశ్శేషముగా బాధ తగ్గిపోవును చింతగింజ అని తెలిసినయెడల గురియుండదు గనుక ఆగింజను గుండ్రముగా అరగదీసి మణిరాయివలె చేయ











1 తిరుపత్తూరులో మహాత్ముడు విశ్రమించిన క్రైస్తుకులాశ్రమము. 2 మహాత్ముని కనురెప్పవలె కాపాడుచు పరిచర్యసలుపుచున్న మీరాబెను కన్య |3 నిద్ర 4 భక్తులొసగిన ఫలాదులు! వియ్యంకునకు.

౫. మహాత్ముని ఉత్తర, పత్రములదిండు జవాబుదారీ సాంబమూర్తిగారు.
















1 'జాతిమతములు హరిజనులకు పరమశత్రువులు' అని వ్రాసిన యొకచిత్రమునకు మహాత్ముని నిరసనము. 2. సంతకమునుకోరిన యొకబాలుని పోగుల కోరుట. 3. కుమారి కౌముది నిలువుదోపుడు. 4. విజయనగరము మహారాణిగారి రోల్సురాయిసుకారులో మహాత్ముడు. 5. తిరువాంకూరు హరిజనసంఘాధ్యక్షుని చేతిగాయమునకు మహాత్ముని ప్రథమచికిత్స.

వలయును. ఈచికిత్సను వేలకొలదిమందికి చేసినాము. నూటికితొంబదిమందికి గుణమిచ్చినది. చెరుకుబెల్లము ముక్కనుతెచ్చి తేలుకుట్టినవారిని నోటిలో ఆముక్క పెట్టుకొని ఊటను మ్రింగించుచు ఆనోటిలోని ముక్కనే కొంచెము ఉమ్మితడితోనే కుట్టినచోటను రాచుచు (మెల్లగామర్దించుచు) తెల్లావాలు, తలవెంద్రుకలతుక్కు, చెరుకుబెల్లము పొగవేయవలెను. బాగుగా గుణమిచ్చును. అనేకులకు గుణమిచ్చినది.

పశువులకుకరిం(మర్మస్థానము)పుచ్చినందుకు-చిటపట కాయలమొక్క, ప్రేలుడుకాయలమొక్క అనిపిలువబడు చిన్నఆకులుగలమొక్క యుండును. దీనికాయలు నీళ్లలో వేసిన టప్పుమన్నిప్రేలును. పిల్లలు దీనికాయలను నోటిలో పెట్టుకొని ఉమ్మితడి తగులగానే అవి పగిలి చప్పుడైన ఆనందించుచుందురు. ఈమొక్కలఆకులు తెచ్చి కరిం పుచ్చి పురుగులుపట్టిన పశువులయొక్క ముడ్డికలగుంటలో (మేడకిందగుంటలో) ఆపసరు పిండి కొంతపసరు వెన్నపొడుగునను రాయవలయును. ఇట్లు ఒకటిరెండుపూటలు చేయగానే పురుగులు పడిపోయి పుచ్చుమానిపోవును. ఇదికూడ చేసి చూచినదే. అమోఘమైనగుణము.

మూర్ఛకు—— ఈమహామహిమగలమూలికారాజముపేరు తెలియలేదు. ఇదియొకతీగ. దీనిఆకులు కాకరఆకులవలె నుండునుగాని ఈయాకులకు ప్రతిఆకునకును గూడ ఏడేసిచీలిక లుండును. ఏపుగాపెరిగినకాకరపాదు తీగలంతలావుగా దీనితీగె లుండును. ప్రత్తికాయలంత లేసికాయ లుండును. కాయపైన కొంచెము నూగు ఉండును. దురదగొండి నూగువలె ఇదియును శరీరమునకు తగిలిన దురదపెట్టును. కాయలోపల పలుచనిదూదియుండును. అదూదిలో గింజ లుండును. ఆగింజలు కంది గింజలంతలేసి యుండును. గింజలరంగు గోధుమలను పోలియుండును. గోధుమగింజల కుండునంత మెరుగు లేక కొంచెము కనుమాసినరంగుగా నుండును. ఈయాకుల రసము మూర్ఛగలవారిముక్కులలో పిండనక్కరలేదు. ఆకులు నలిపి వాసనచూడనక్కరలేదు, ఇంటిలో ఆతీగపాదు, లేక ఆమొక్క, లేక ఆఆకు లుండినచాలును. మూర్ఛయనుపిశాచము పారిపోవును. ఆమొక్కయొక్క లేక ఆకులయొక్క గాలి మూర్ఛగలవారికి సోకిన చాలును, మూర్ఛలు అమోఘముగా నివారణఅయి ఆరోగ్యభాగ్యము కలుగును. ఈమహామూలికపేరు బొత్తిగా తెలియకుండుట శోచనీయము. ఆయుర్వేదవైద్యులు, పరిశోధనలయందభిరుచిగల బుద్ధిమంతులు ఈమూలిక పోలికనుబట్టి (పైనివ్రాసినదానినిబట్టి) గ్రహించి ఉపయోగించి చూచి దీనిమహత్వమును వెల్లడిచేసి లోకులకు మహోపకారము చేయుదురుగాక.

మూర్ఛలకుచేకొణిదచెట్టు (క్షీరమోరటి)యొక్క ఆకులు నలిపి ఆపసరు ముక్కులలో పిండినయెడల మూర్ఛరోగము నివారించును. కొద్దినెలలనుండి ఉన్న రోగమైనయెడల ఒకటి రెండుసారులు పిండిన చాలును. ఏళ్లకొద్ది నిలవగా ఉన్నరోగమైనయెడల నాలుగయిదు సారులు చికిత్సచేయవలయును. చేకొణిద చిన్నచెట్టుగా నుండును. ఆకులుచిన్నవి. ఆకులు నలిపితే జిగురుగా నుండును. రసముత్వరగా రాదు. ఈచెట్టులు సామాన్యముగా చాలమందికి తెలిసియుండును. ఈచికిత్సవల్ల అనేకులకు గుణము కలిగినది.



# రక్తపుటొత్తిడి (Blood-pressure)

మండ వెంకట నరసింహారావు, బి. ఎ.

ఒకప్పుడు జ్ఞానముగూడ విషమముగనే పరిణమించును. ఎప్పుడును దెలియనవసరములేని విషయములుసైతము లోకములో గొన్నియున్నవి. కాక యట్టివిషయములు తెలిసినపిదపనే మానవునకు జెడుగులు సంభవించును. ఈ రక్తపుటొత్తిడియను విషయము గూడ నట్టివానిలో జేరును.

రక్తపుటొత్తిడినిగూర్చి మనతాతముత్తాత లెరుంగరు. ఎరుంగవలె ననుయత్నమును వారు చేయలేదు. కాని సుమా రిరువదివత్సరములనుండి యీ విషయమైన విజ్ఞానము దేశమున వ్యాప్తము గాజొచ్చినది. నాటి నుండియు నేతద్విషయకములగు వ్యాధులు మానవ మానసములను గలంచివైచుచున్నవి. కనుక జ్వరము, తలనొప్పి మొదలగువ్యాధుల విజ్ఞాన మెట్లు మానవ సామాన్యమైనదో యట్లే యీవిషయముగూడ గావలయును.

రక్తనాళములలోని రక్తముయొక్క యొత్తిడియే రక్తపుటొత్తిడి యనబడును. గుండెకాయనుండి శుద్ధ రక్తము నాళముల కంపబడుటచేత నీయొత్తిడి గలుగుచున్నది. మనుజుని యారోగ్యమునకు గొంతయొత్తిడి యావశ్యకము. కాని యొకతిత్తిలో గాలి నెక్కువగ పూరించిన నాతిత్తి యెట్లు పగులునో యట్లే రక్తాధికత వల్లగూడ జీవి కాపద గల్గును.

మణికట్టునొద్దను, జేతులమీదను మన మీరక్తపుటొత్తిడిని కనుగొనగలము. దేహోష్ణతాపరిశీలనమున కెట్లు శీతోష్ణపరిమాణయంత్రము (Thermometer) వలయునో యట్లే దీనిని బరీక్షించుటకుగూడ నొకయంత్రము గావలయును. నాడీనిదానమున దీని నంతగ గనుగొనలేము. దీనిని బరీక్షించుయంత్రము, యంత్రము నుపయోగించు నైపుణ్యము గలవైద్యుడు నుండిననే కాని దీనియొక్కువతక్కువలు తెలియజాలవు. ఈరక్తపుటొత్తిడిలో నత్యధికము, నత్యల్పము రెండును బ్రమాదములే. నేడు వైద్యశాస్త్రమునం దీవిషయమే యత్యధిక ముఖ్యస్థానము నందియున్నది.

అధికమగు రక్తపుటొత్తిడి మలబంధాతిశయము వల్లను, లోనిరక్తమునందుఁ గల్మషములు చేరియుండుట, వల్లను, సారా, కల్లుమొదలగు నసహజపదార్థము లతితములుగ సేవించుటవల్లను గలుగుచున్నది. క్రోధము, నసూయయు దీనిలో విభేదములు గలిగించును. కావున రక్తపుటొత్తిడివలని రోగములకు దేహమానసములు రెండును నిదానములనుట స్పష్టము.

ఎంతయోకాలమునుండి చికిత్సాసాధ్యములైన రోగములుసైత మేతద్విషయకపరిశోధనానంతరము తేలికగ గుదుర్పబడుచున్నవి. దీనిసంబంధమగు పరిశోధన వైద్యశాస్త్రమునకుగూడ వింతపరిణామమును గల్గించినది.

అధికమగు నీరక్తపుటొత్తిడివలన గల్గెడిరోగములు నేడు సంఘమునందు విరివిగ వ్యాపించి యల్లకల్లోలము చేయుచున్నవి. కాన నిట్టిజాడ్యములు రాకుండ జాగ్రత్తపడుటయు, నేలోపమువల్లనేని వచ్చినచో ద్వరగ గుదిర్చికొనగల్గు జ్ఞానశక్తి గల్గుటయు మన

కత్యావశ్యకము. ఉపవాసము, విశ్రాంతి, సుఖవిరేచనము మొదలగునవి యీజాడ్యప్రవేశము నాటంకపరచును. కనుక మనుజులెల్లపుడును మృష్టాన్నములపైని, అమితమగు ఫలాహారములపైని యాసక్తులు గాక తమ జీవితమునందు యుక్తసమయములలో పైజెప్పబడిన యుపవాసాదినియమము నవలంబించుట సర్వోత్తమము.

మరియొకవిషయము. మజ్జిగయొక్క విలువను మనదేశ మింకను గ్రహింపలేదు. ఎందరో జనులు ముఖ్యముగ గ్రామీణులు తమభోజనమునందు మజ్జిగను వాడకుండుట మనము చూచుచున్నాము. రష్యాదేశమున నీమజ్జిగలోని సుగుణములనుగూర్చి చేసెడిప్రచారములో బదియవవంతు మనదేశమున జేయుచో నాయుఃక్షయమునకు హేతువులగువానిలో నొకదానిని నిర్మూలింపజేసిన ట్లగును. కాని పరిస్థితులు భిన్నములు. అట్టి సత్ప్రచారములకు దేశము నేడాభిముఖ్యముచూపు దృష్టిలో లేదు.

మజ్జిగ యుదరములో నిరికియున్నకుళ్లును బాఱదోలి మలబద్ధమును బోగొట్టును. దాన రక్తపుటొత్తి యొక్క తీక్ష్ణత రూపుమాయును. మరియు సూర్యకిరణప్రసారము, సంతోషస్వాంతము, ప్రాతఃకాలమున వాహ్యాళి, లవణరహితభోజనము నివియన్నియు రక్తపుటొత్తిడివలన గల్గెడి జాడ్యములను నిర్మూలింపజేయును.

---




ప్రబంధసుందరి—సాదృశ్యమే నిజమైనచో (బాలకవుల కుపయోగపడుటకు చిత్రము)



# బాలబోధము

శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ

(జయపురాధిపతి)

తల్లిదండ్రుల ననవరతంబుఁ బూజ
సలుపుచుం బాలనము సేయవలయుఁ జుమ్మి
ఒదిఁగియుండుము పెద్దలయొద్ద నీవు
నడువుమీ విశ్వవిధులను గడవకుండ
సుస్థములుగ నుంచుము మనస్సును దనువును
పనులఁ జేయుము యోచించి బాగుగాను
అప్పుఁ గొను టగుఁ జుమ్ము నింద్యమ్ము దలఁప
దానిఁ గొనియెదవేని బిఱానఁ దీర్పు
ఇరువునకుఁ దగునట్లు మందిరముఁ గట్టు
చేయు నిజవృత్తిని దురాశఁ జెందకుండ
దరను దగ్గించి యమ్మకు ధాన్యములను
అర్కజదినంబున శుభ మభ్యంజనంబు
ఇల నిరోధ ముత్తమము నిర్వృతి యధమము
పరుల యీవుల నడ్డగింపకుము నీవు
పెఱల కెఱిఁగింపకుము నీదు విత్తగరిమ
ఇయ్యఁదగుదాని యాచకుం డెఱుఁగుఁగాక
దానధర్మములను జేయఁబూను మెపుడు
ఇతరులకు నిచ్చి పిమ్మట నే భుజింపు
శాస్త్రకథితంబులందు సశ్రద్ధ దగదు
నిక్కముగ నెఱింగినదానినే నుడువుము
అన్యులను వేఁడు టది నైచ్య మగును జుమ్మి
చనెడువఱకు సద్గ్రంథంబులను జదువుము
పలుకుచుండుము ప్రియవాక్యములనె యెపుడు
కపటమైత్రి యుపద్రవకరము సుమ్మి
విషయసక్తుల సంగంబు విడుచు టొప్పు
సజ్జనులమైత్రినే సదా సలుపఁదగును
పొదలనీయకు మెపుడును మదిని వంత
సతత మఖిలాధిపతిభక్తియుతుఁడ వగుము.

---

# సృష్ట్యాదికాలము

చివుకుల వెంకటరమణశాస్త్రి

సృష్టి ప్రారంభమై ఎంతకాలమైనది అనువిషయమును సయుక్తికముగ విమర్శింతము. కాలనిర్ధాయక మగుశాస్త్రము జ్యోతిశ్శాస్త్రము (Astronomy). దీని ననుసరించుచు ప్రాచీనోక్తులను కేవలముగా విశ్వసించక ప్రత్యక్షముగా మన కగపడు పరిస్థితులను బట్టియే ఈసృష్ట్యాదికాల నిర్ధారణనుగూర్చి విమర్శింతము:

ఆకాశమందు కాంతివంతములుగ (వెలుగుచున్న) మన కగుపడునవి గ్రహములు, నక్షత్రములు. అందు గ్రహములకుమాత్రము చలన మున్నట్లు మనకు ప్రత్యక్షముగా నగుపడుచున్నది. ఆకాశమందలి సూర్యసంచారమార్గమునకు (The sun's path in the heavens) క్రాంతివృత్తమని (Ecliptic) పేరు. ఖగోళమధ్యయం దనగా ఉత్తర దక్షిణధ్రువములకు మధ్యనుండు వృత్తమునకు విషువద్వృత్త (Celestial Equator) మని పేరు. భూగోళమందును, రెండు ధ్రువములకు మధ్యనున్నదియే భూమధ్యరేఖ (Terrestial Equator). కావున దీని ప్రదేశమందుండువారికి సరిగా నెత్తిమీద అభిముఖముగా ఖగోళమందు విషువద్వృత్తముండును. ఈ క్రాంతివృత్తము విషువద్వృత్తముతో రెండుస్థానములందుమాత్రమే కలిసియుండి రెండుస్థానములందు దీనికి ౨౩½ భాగలదూరములో ఉత్తరముగాను, దక్షిణముగాను ఉండును. అందు కలసినస్థానమునకు మేషాది (First point of Aries) అనిపేరు. ఇచటనుండి ౯౦ భాగల (Degrees)దూరము వరకు క్రాంతివృత్తము, విషువద్వృత్తమున కుత్తరముగా క్రమముగా పెరుగుచుండును. అచట, అనగా పరమక్రాంతి (Obliquity of the Ecliptic) యగు ౨౩½ భాగలదూరములోనున్న స్థానమునకే కటకాది (Cancer) యని పేరు. అచటనుండి క్రమముగా తగ్గుచు ౯౦ భాగలదూరములో పూర్తిగ తగ్గి విషువద్వృత్తముతో కలియును. దీనికి తులాది (Libra) యనిపేరు. ఇచటనుండి క్రాంతివృత్తము విషువద్వృత్తమునకు దక్షిణముగా నుండును. ఈదూరము క్రమముగా ౯౦ భాగలవరకు పెరుగును. దీనికి మకరాది (Capricorn) యని పేరు. ఇచటనుండి క్రమముగా ఆదూరము తగ్గుచు క్రమముగా ౯౦ భాగలదూరములో తిరిగ విషువద్వృత్తముతో కలియును. ఇదియే మేషాది. ఇదియే క్రాంతివృత్తము. ఇందు సూర్యుడు సంచరించును. ఈసంగతులన్నియు మనకు ప్రత్యక్షముగా నగుపడును. ఎట్లనగా, భూమధ్యరేఖయందలి దేశములో నున్నవాడు ప్రతిదినము మధ్యాహ్నకాలమందు తననీడను పరీక్షించును. మార్చి ౨౧ వ తేదినాడు తన నీడ నేమియు ఉండన ట్లాతడు చూచెను. అందుచే ఆదినమున సూర్యుడు తన నెత్తిమీద నుండెనని తెలిసికొనెను. ఆ దినమునుండి క్రమముగా అతడు తననీడను తనకు దక్షిణముగా క్రమముగా పెరుగుచుండినటుల చూచెను. అందుచే సూర్యుడు తననెత్తిమీదికి ఉత్తరముగా వెళ్లుచుండెననియు, క్రమముగా ఉత్తరముగా వెళ్లుమార్గ మధికమగుచున్నదనియు ఆతడు తెలిసికొనెను. ఇట్లు ౨౨ జూన్ వరకు తననీడ ఉత్తరముగా పెరిగి, ఆ దినమునుండి తన నీడను వెనుక పెరిగినట్లుగా ఇప్పుడు తగ్గుచున్న ట్లాతడు గనెను. దీనినిబట్టి అటనుండి సూర్యుడు తిరిగి దక్షిణముగ వచ్చుచున్న ట్లాతడు గనిపెట్టెను. ఇట్లు తగ్గుచు, సెప్టెంబరు ౨౩-వ తేదీని తన నీడ లేన ట్లాతడు చూచెను. అందుచే వెనుకటివలె సూర్యుడు తన నెత్తిమీద నుండెనని యాతడు గుర్తించెను. ఇట్లే ఆదినము మొదలు అతడు, తననీడను, తనకుత్తరముగా వచ్చుట చూచి, సూర్యుడు దక్షిణముగా నున్నాడని తెలుసుకొనెను. డిసంబరు ౨౨-వ తేదీనాడు, వెనుక తననీడ ఎంతదక్షిణముగా నుండెనో అట్లే ఈదినమున అంతఉత్తరముగా తననీడను చూచెను. అటనుండి తననీడను క్రమముగా తగ్గుచున్నట్లును, తిరిగి మార్చి ౨౧-వ తేదీనాడు నీడ ఏమియు లేనట్లును ఆతడు చూచెను. దీనినిబట్టి ఆతడు వెనుకచెప్పిన క్రాంతివృత్తస్వరూపమును, సూర్యసంచారమును గుర్తించెను.

అట్లే, ఇతరదేశములందున్నవారుగూడ దీనిని గుర్తింపవచ్చును. భూమధ్యరేఖనుండి, తమదేశమున కెంతదూరముండెనో (Latitude) అంతదూరముగ సూర్యు డుండురోజున వీరికి నీడ శూన్యమగును. తమనీడ క్రమముగ ఉత్తరముగా పెరిగినచివరదినమున, అచట చిహ్నముచేసి, దక్షిణముగా పెరిగినచివరదినమునగూడ నిట్లే చిహ్నముచేసి,

ఈరెండుచిహ్నములమధ్యను, ఒకరేఖ గీచినచో అదియే విషువద్వృత్త మగును. ఇట్లే దీనినిబట్టి వెనుకటివలె అంతయు గుర్తించనగును.

ఇట్టి వృత్తసంపాతమే (Vernal Equinox) ఆరంభ స్థానము. అటనుండి క్రమముగా పెరుగుటచేత, సూర్యునికి గతిగలదని ఆతడు గుర్తించెను. ఇట్లు తిరిగి ఆస్థానమునకు వచ్చుదినమునుబట్టి ఆతడు సూర్యుడొకసంవత్సరకాలములో తిరిగి, ఆరంభస్థానములో నగుపడునని తెలుసుకొనెను. ఇట్లే చంద్రుడుమొదలైనగ్రహములను వేధచేసి, వాటికి దినగతులను, వార్షికగతులను పరీక్షించనగును. ఎట్లనగా వేధచే నీదినమున మేషాదినుండి కొంతదూరములో గ్రహము కనబడినది. రేపటిదినమునగూడ నిట్లే వేధ చేయగా మేషాదినుండి గ్రహమువరకు గలదూరము తెలిసెను. ఈరెంటికిమధ్యనున్న దూరము ఆదినమందు ఆగ్రహముచే ఆక్రమించబడినదిగా నతడు గుర్తించెను.

ఈగతులనుబట్టి, వారు చక్రమును చుట్టివచ్చుట కెంతకాలము పట్టునో తెలియనగును. అట్లే ఒకసంవత్సరములో అనగా సూర్యుడు ఆరంభబిందువునుండి తిరిగి ఆబిందువును చేరుకాలములో ఏగ్రహ మెంతదూరము నడచునదియు వేధవలన తెలియనగును. ఇది మనకు ప్రత్యక్షముగా గాన్పించును. ఇట్టిపరీక్షచే ఒకసంవత్సరకాలములో గ్రహముల కింతగతియని గుర్తించనగును.

| | రా. | భాగ. | విక. | విలి. |
|---|---|---|---|---|
| రవికి | ౦ | ౦ | ౦ | ౦ |
| చంద్రునకు | ౪ | ౧౨ | ౪౬ | ౪౦ |
| కుజునకు | ౬ | ౧౧ | ౨౪ | ౯ |
| బుధునకు | ౧ | ౨౪ | ౪౫ | ౧౭ |
| గురునకు | ౧ | ౦ | ౨౧ | ౬ |
| శుక్రునకు | ౮ | ౧౫ | ౧౧ | ౫౨ |
| శనికి | ౦ | ౧౨ | ౧౨ | ౫౦ |

ఇట్లు పరీక్షించుటలో, గ్రహము కొంతకాలము వేగముగను, కొంతకాలము మెల్లగను, నడచుచున్నట్లగపడుచున్నది. ఎప్పుడు భూమికిగాని, ఆకర్షకునకుగాని అతిదూరములో గ్రహముండునో అపుడు గ్రహము మెల్లగ నడచుచున్నట్లును, ఆకర్షకునకు అతి సమీపములో నున్నపుడు శీఘ్రముగ నడచుచున్నట్లును వేధవలన (by observation) మన కగుపడుచున్నది. దీనిని బట్టి గ్రహముల నాకర్షించు విశేష శక్తిగల ఒకానొక దేవతావిశేష మున్నదనియు, దాని ఆకర్షణలోని హెచ్చుతగ్గులనుబట్టి గ్రహగతి హెచ్చుచు, తగ్గుచు నున్నదనియు కనుగొనవచ్చును. దీనికే మనవారు ఉచ్చ (Appogee) యని పేరిడిరి.

గతిహెచ్చుస్థానము

•ఆకర్షకస్థానము
[Focus]

మధ్యబిందువు

గతితగ్గుస్థానము ఉచ్చ [Appogee]

ఈ ఉచ్చకుగూడ కొంతగతియున్నట్లు మనకగుపడుచున్నది. ఎట్లనగా గ్రహము తిరుగుచున్న కక్ష్యావృత్తములో (Orbit) మధ్య బిందువునుండి వేధచేసినపు డొకవిధముగను, పార్శ్వబిందువు (ఆకర్షక స్థానము Focus) నుండి వేధచేసినపుడు మరియొకవిధముగను అగుపడు చున్నది. ఇట్లు ప్రతిదినము చూచుచుండగా, నీరెంటికి భేదము కొంతకాలము పెరుగుచును, మరి కొంతకాలము తరుగుచును ఉన్నట్లు మన కగుపడుచున్నది. దీనిని నిపుణముగా పరీక్షించినచో, గ్రహము ఉచ్చవద్దనున్నపుడు రెంటికిని అంతరము కనుబడుటలేదు. ఇట్లే నీచ వద్ద గ్రహమున్నపుడును భేద మగుపడుటలేదు. అనగా నీసమయము లందు మధ్యనుంచి వేధచేసినను, పార్శ్వబిందువునుంచి వేధచేసినను ఒక్కే విధముగా గ్రహ మగుపడుచున్నది.

ఇట్లేదినమందు గ్రహ మగుపడునో, తిరిగి అట్లగుపడు మధ్య కాలమందలి తేడానుబట్టి ఈ ఉచ్చకు గతియున్నట్లు తెలియనగును. అనగా మేషాదినుండి ౯౦ భాగలదూరములో గ్రహమున్నపుడు మధ్య పార్శ్వ బిందువులలో నెచటినుండి చూచినను అంతరమగపడుట లేదు. అనగా నీగ్రహముయొక్క ఉచ్చ (Appogee) గూడ మేషాది నుండి ౯౦ భాగలదూరములో నుండెనని తెలుసుకుంటిమి. తిరిగి రెండవమారు గ్రహము మేషాదినుండి ౯౦.౫ భాగల దూరములో నుండునపు డీయుచ్చస్థాన మగుపడెను. అందుచే గ్రహ మొక పర్యాయము తిరిగివచ్చుకాలములో ఉచ్చ ౦.౫ దూరము కదలెనని తెలుసు కొంటిమి. దీనిని బట్టి ఇది సంవత్సరమున కెంతదూరము కదలునదియు, ఇది చక్రమును చుట్టివచ్చుట కెంతకాలము పట్టునదియు తెలియనగును.

ఇట్లే క్రింది విధమైన గతులు, ఉచ్చలకు ౧౦౦ సంవత్సరము లలో కానవచ్చును:

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| రవి | ఉచ్చ | భాగాది | ౦ | ౦ | ౧౧ | ౩౬ |
| చంద్ర | ,, | ,, | ౧౦౭ | ౨౧ | ౩౦ | |
| కుజ | ,, | ,, | ౦ | ౦ | ౬ | ౮ |
| బుధ | ,, | ,, | ౦ | ౦ | ౧౧ | —౨ |
| గురు | ,, | ,, | ౦ | ౦ | ౨౮ | ౦ |
| శుక్ర | ,, | ,, | ౦ | ౦ | ౧౬ | ౩ |
| శని | ,, | ,, | ౦ | ౦ | ౧ | ౧౦ |

ఈప్రకారముగానే గ్రహములను ఉత్తరముగాను, దక్షిణముగాను ఆకర్షించుశక్తిగల "పాతలు" (Nodes) గలవని వేధవలన గుర్తెరిగితిమి. అదెట్లనగా, గ్రహములు కొంతకాలము క్రాంతి వృత్తమున కుత్తరముగాను, మరికొంతకాలము దక్షిణముగాను, మరి కొంతకాలము క్రాంతివృత్తమందును నడచుచున్నట్లు మన కగుపడు చున్నది.

క్రాంతివృత్త మెట్లు విషువద్వృత్తముతో రెండుస్థానము లందుమాత్రమే కలసియుండి, తిరశ్చీనముగా నున్నదో అట్లే గ్రహ

ములు తిరుగు కక్ష్యావృత్తములు క్రాంతివృత్తములో రెండుస్థానము లందుమాత్రమే కలుసుకొని, తిరశ్చీనముగా నున్నట్లు మనకు వేధవలన అగుపడుచున్నది. ఈ రెండువృత్తములు (క్రాంతివృత్తము, గ్రహ కక్ష్యావృత్తము) కలసినస్థానములకే 'పాత' (Nodes) లని పేరు.

వేధవలన గ్రహ మేదినమున క్రాంతివృత్తమందు గనుపించెనో ఆదినమున, ఆగ్రహముతో సమానమైన మేషాదిదూరములో దాని పాత యుండును. ఇట్లు గ్రహము తిరిగి అచటికన్న కొంతవెనుక నుండగనే ఆగ్రహము క్రాంతివృత్తమం దగుపడుచుండెను. అందుచే గ్రహము ఒకపర్యాయము చక్రముచుట్టు తిరిగివచ్చుకాలములో, దాని పాత కొంత వెనుకకు నడచినదని తెలియుచున్నది. ఇదియే 'పాత' యొక్క విలోమగతి. ఉదా. మేషాదినుండి ౪ భాగలదూరములో గ్రహ మున్నపుడు, ఇది క్రాంతివృత్తమం దగుపడెను. తిరిగి ఆ గ్రహము దానిని దాటిపోయి చక్రమును చుట్టివచ్చి, మేషాదినుండి 3.౭ భాగల (Degrees) దూరములో నుండగనే అది క్రాంతివృత్తమం దగుపడెను. ఇదియె పాతస్థానముగదా! అందుచే నీమధ్యకాలమందు ఆగ్రహముయొక్క పాత ౦.3 భాగలదూరము వెనుకకు నడచినట్లు స్పష్టముగా మన కగుపడుచున్నది. దీనినిబట్టి 'పాత' ఒకసంవత్సరకాలములో నెంతెంత నడచునదియు, చక్రమును చుట్టి వచ్చుట కెంతకాలము పట్టునదియు తెలియనగును. ఇట్లన్ని గ్రహముల పాతలకును ౧౦౦ సంవత్సరములకాలములో విలోమగతి ఈక్రిందివిధముగ నుండును:

| | రాశి. | భాగ. | లిప్త. | విలి. | పర. |
|---|---|---|---|---|---|
| రాహువు లేక చంద్ర పాత గతి | ౪ | ౧౫ | ౧౯ | ౦ | ౦ |
| కుజ ,, ,, | ౦ | ౦ | ౦ | ౬ | ౨౫ |
| బుధ ,, ,, | ౦ | ౦ | ౦ | ౧౪ | 3౭ |
| గురు ,, ,, | ౦ | ౦ | [illegible] | ౫ | ౧3 |
| శుక్ర ,, ,, | ౦ | ౦ | ౦ | ౨౮ | ౫ |
| శని ,, ,, | ౦ | ౦ | ౦ | ౧౯ | ౫౧ |

ఇదంతయు మనకు ప్రత్యక్షముగా వేధవలన అగుపడుచున్నది.

ఇకను మనకు ప్రకృతమందు విమృశ్యాంశమగు సృష్ట్యాదికాల నిర్ణయమువద్దకు వచ్చెదము. ఆరంభకాలములో అన్ని గ్రహములు వాటి ఉచ్చలు, పాతలు, అన్నియు ప్రారంభస్థానమగు మేషాది (Vernal Equinox) యం దుండవలయును. అట్లారంభస్థానమం దుండనిచో దానికి ఆరంభస్థాన మను సంజ్ఞ వ్యర్థముగదా!

కొన్ని గ్రహములుమాత్రమే ఈ ఆరంభస్థానమం దున్నచో అది ఆరంభకాలము గానేరదు. అంతకుపూర్వము ఏవిధమైనగ్రహములుగాని, ఉచ్చలుగాని, పాతలుగాని ఏర్పడకయుండి అపుడే ఏర్పడినకాలమే సృష్ట్యాదికాలమని సర్వవిదితము. అందుచే, అన్ని గ్రహములు ఉచ్చలు, పాతలు, ఒక్కమారు సృజింపబడి, ఒక్క చోటనుండి తిరుగుట ప్రారంభించినదనియు, అదియే సృష్ట్యాదికాలమనియు చెప్పక తప్పదు.

ప్రకృతమందుండు గ్రహస్థితినిబట్టియు, వాటిగతులనుబట్టియు వెనుకకు వెళ్లగా, నెప్పుడు ఈగ్రహ, ఉచ్చ, పాతలకు ంపరకు సామ్యముగా ఆరంభస్థానమందు స్థితియుండునో అదియే సృష్ట్యాది కాలము. ఇట్లు వెనుకకుపోగా ౧,౯౫,౫౭,౭౫,౦3౪ సంవత్సరముల క్రిందట, ఇవన్నియు ఆరంభస్థానమగు మేషాదియందుండును. కావున నదియే సృష్ట్యాదికాలము.

గణితమర్యాదానుసారముగా గ్రహములకు సామ్యకాలము ౪3,౨౦,౦౦౦ సంవత్సరములు. అనగా ఇంతకాలమున కొకమారు గ్రహములన్నియు ఆరంభస్థానమం దుండును. కాని ఈకాలమునకు ఉచ్చలు, పాతలు ఆరంభస్థానమునకు రానేరవని మనకు ప్రకృతము అగుపడుచుండు గ్రహగతులచే స్పష్టపడుచున్నది. ఈగ్రహములకైనను ఈకాలములలోపల సామ్యము గలుగనేరదని దిఙ్మాత్రముగా ప్రదర్శించుచున్నాను.

| | రవిగతి | చంద్రగతి | కుజగతి | బుధగతి | గురుగతి | శుక్రగతి | శనిగతి |
|---|---|---|---|---|---|---|---|
| | రా. భా. లి. వి | రా. భా. లి. వి. | రా. భా. లి. వి. | రా. భా. లి. వి. | రా. భా. లి. వి. | రా. భా. లి. వి. | రా. భా. లి. వి. |
| ౨౦౦౦ సంవత్సరములకు | ౦-౦-౦-౦ | ౮-౨౬-౦-౦ | ౪- ౫-౨౦-౦ | ౨-౧౦-౦-౦ | ౮-౧3-౨౦-౦ | ౧- ౬-౦-౦ | ౧౦- ౭-౦-౦ |
| ౫౦౦౦ ,, | | ౧-౨౦-౦-౦ | ౪-౧3-౨౦-౦ | ౫-౨౫-౦-౦ | ౬-౧౭-౨౦-౦ | ౯- ౦-౦-౦ | ౮-౨౦-౦-౦ |
| ౬౦౦౦ ,, | | ౧౧-౧౭-౦-౦ | ౦-౧౬- ౦-౦ | ౮- ౦-౦-౦ | ౧౦-౧౦- ౦-౦ | 3-౧౭-౦-౦ | ౬-౨౪-౦-౦ |
| ౧౦,౦౦౦ ,, | | 3-౧౦-౦-౦ | ౭-౨౬-౪౦-౦ | ౧౧-౨౦-౦-౦ | ౧- ౬-౪౦-౦ | ౬- ౦-౦-౦ | 3-౧౦-౦-౦ |

సూర్యుడుమాత్రము సంవత్సరమున కొకమారు ఆరంభస్థానమునకు వచ్చును. గ్రహములకు పైనచూపినవిధముగా ౪3,౨౦,౦౦౦ సంవత్సరములలోపల భిన్నమగుగతు లుండునేగాని, ఏకరీతిగల గతి యుండి అన్నియు ఆరంభస్థానమునకు రానేరవు. ౪3,౨౦,౦౦ సంవత్సరములకాలమునకు గ్రహములన్నియు ఆరంభస్థానమునకు రాగలవు. కాన మందోచ్చలు ఈకాలములో రాలేవు. ఈకాలములో వాటి గతి ఈక్రిందరాశి. భాగ. లిప్త. విలిప్తలలో కనపర్చబడుచున్నది.

| | | | | |
|---|---|---|---|---|
| రవి ఉచ్చ | ౪-౧౯-౧౯-౧౨ | చంద్రోచ్చగతి | ౦-౦-౦-౦ | ఇవి ప్రకృతమందు మన కగుపడు గతులచేత సాధింపబడినవి. |
| కుజ ,, | ౨-౧౩-౨౬-౨౪ | కుజ పాతగతి | ౨-౧౭- ౨-౨౪ | |
| బుధ ,, | ౪-౧౨-౨౮-౪౮ | బుధ ,, | ౫-౨౫-౪౦-౪౮ | |
| గురు ,, | ౧౦-౨౪- ౦- ౦ | గురు ,, | ౨- ౨-౩౮-౨౪ | |
| శుక్ర ,, | ౬-౧౨-౩౬- ౦ | శుక్ర ,, | ౧౦-౨౫- ౪-౪౮ | |
| శని ,, | ౦-౧౪- ౨-౨౪ | శని ,, | ౭-౨౮-౧౯-౧౨ | |

చంద్రపాత or రామగతి ౦- ౦- ౦- ౦

కావున ౪౩,౨౦,౦౦౦ సంవత్సరములకాలములో గ్రహము లన్నియు ఆరంభస్థానమగు మేషాదిలోనికి వచ్చినను, ఉచ్చలు, పాతలు, ఆరంభస్థానమునకు రాజాలనందున ఈకాలము సృష్ట్యాదికాలముగా నేరదు. ఈగ్రహములగతి సామ్యకాలమునకే (ఆరంభస్థానమునకు అన్నిగ్రహములు చేరుకాలమునకు) ప్రాచీనులు గూఢముగ "మహాయుగ" మని పేరిడిరి. వారియాశయ మిదియై యుండనోపు!

ఇట్లే ఉచ్చ, పాతలు, గ్రహములు అన్నియు ౪౩౨,౦౦,౦౦,౦౦౦ సంవత్సరములకాలములో ఆరంభస్థానమునకు చేరును. ఈలోపల చేరజాలవు. ఇందుకు ప్రకృతమందు మన కగుపడుగతియే తార్కాణము.

ఇట్టికాలమునకే ప్రాచీనులు 'కల్ప' మని పేరుపెట్టిరి. ఇదియే దీనికి హేతువుకాబోలు!

కావున ప్రకృతమందలి గ్రహస్థితిని, వాటిగతులనుబట్టి ఈగ్రహములు, ఉచ్చలు, పాతలు, ఇవన్నియు ఆరంభస్థానమునకు చేరుకాలమును వెనుకకు శోధించగా ఇప్పటికి రమారమి ౧౯౫,౫౮,౮౫,౦౩౪ సంవత్సరములక్రిందట అయియుండునని పైవిధముగావిమర్శింపనగును

---




ఆలయములో

—క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యము, కాకినడ.



1. జటావల్లభుల పురుషోత్తంగారు 2. సూర్యనారాయణ సోదరకవులు 3. కవిసింహ, పోకూరి కాశీపతిగారు (వారి ధర్మపత్నియు) 4. తాపూరి చిదంబరంగారు. 5 ఆంజనేయ అవధూత బ్రహ్మానందస్వామిగారు.











1 దంటు నాగేశ్వరరావుగారు 2 శ్రీమంగళగిరి రాఘవదాసుగారు. 3 శ్రీకొమ్మూరి బాలబ్రహ్మానందదాసుగారు.
4. ముదునూరి వేంకటకృష్ణరావుగారు. 5. బొల్ల వెంకటసుబ్బారావుగారు.

# శ్రీకృష్ణజననము

మాడభూషి మఠం వెంకటాచార్యులు, బి. ఏ.

[శ్రీ విష్ణుచిత్తులు ద్రావిడమునఁ బ్రసాదించిన "వణ్ణమాడంగళ్" అను ప్రారంభముగల పాశురములు: ద్రవిడదివ్యప్రబంధములోనిది.]

వన్నెమాడువుఁను వరలు గోష్ఠిపురాన
వెన్నుఁ డుద్భవింపఁ జెన్నుమీఱఁ
జమురు సున్ని గొని వసంతంబు లాడంగఁ
బంకమయ్యెఁ గృష్ణు ప్రాంగణంబు.

పరువులెత్తువారుఁ, బడువారు, ముదమారఁ
బెనఁగువారు, నేఁడి బిడ్డఁడనుచు
నెమకువారు, వాయిదము గొట్టఁబాడువా
రాడువారు నైరి యాలపల్లె.

ఇడుమవాసి చెల్వ మెసఁగ బిడ్డఁడుపుట్టఁ
జూడఁబోవువారుఁ, జూచి మరలు
వారు, వీనిసాటి రా రెవ్వ, రితఁడు శ్ర
వణపతి, జగమేలు ననెడివారె.

ఉట్లఁ దెచ్చి ముంగి నురలించి యాడువార్,
పాలు పెఱుఁగు నేయి పంచువారు,
నెఱికురు ల్వీడంగ నెఱపి నాట్యము తెల్వి
కూలినట్టి రయిరి గొల్ల లచట.

గట్టిత్రాటియుట్లుఁ, గఱకైన గొడ్డండ్లు,
మొగలిసెజ్జ దండమును, చెలంగ
మొల్లపూవుదంతముల గొల్ల లపుడు "నె
య్యాడ*" లాటలాడి రాలపల్లె.

కాలుకేలు నిమిరి గంగాళపున్నీటఁ
జక్క నార్చి చిన్నిచాయపసపు
నాల్కగీచినట్టి నాతికి వా సూప
బిడ్డనోటఁ గాంచె విశ్వ మామె.

విశ్వ మట్లు గాంచు వెలఁదుక సఖులెల్ల
గొల్లబిడ్డ గాఁడు, గొప్పదైవ
మఖిలసుగుణశీలుఁ డగు మేటిబాలుండు,
మాయకాఁ డటంచు మలయువారె.

పదిదినములు గడవఁ బిదపరెండవనాఁడు
అన్నిదిక్కులను జయధ్వజంబు
నిలిపి కొండతాల్పు నేర్పుకానినిఁ గేలఁ
గొనుచు సంతసిలిరి గొల్లలెల్ల.

పండఁబెట్టఁ దొట్ల పగులఁదన్నును, జంక
నెత్తుకొన్న నొడలనెల్ల విఱుచుఁ
జిక్కఁబట్టి ఱొమ్ము సేర్పఁ గద్పునఁ బాఱు
నోర్వ కలసిపోతి నువిదలార.

వరిపయిరులమళ్ల వరగోష్ఠిపురమందు
సామి యవతరించు చందమెల్ల
వెలయఁ జెప్ప విప్రవిష్ణుచిత్తుల పాట
లివి పఠించువారి కెడరు లేదు.

---

* నెయ్యాడల్ - ద్రవిడము- గొల్లల క్రీడావిశేషము.

# మనుస్మృతి—వేదాధారము

జటావల్లభుల పురుషోత్తము, బి. ఏ.

ప్రస్తుతము ౨౬౮౫ అనుష్టుప్ఛందః శ్లోకములతో నొప్పుచున్న మనుస్మృతిని మనువు వ్రాయలేదనునంశము మనుస్మృతిని బట్టియే స్పష్టమగుచున్నది. అందలి ప్రథమాధ్యాయమున నీక్రిందిగాథ కలదు.

"మునులు మనువునొద్దకేగి వర్ణాశ్రమధర్మములను తెలుపవలసిన దని కోరిరి. మనువు వారికి సృష్టిక్రమమునకు సంబంధించిన కొన్ని యంశములను దెలిపి 'నే నిదివఱలో భృగువునకు వర్ణాశ్రమధర్మములను చెప్పియుంటిని. ఆతడు వానిని మీ కిపుడు తెలుపగలడు.' అని చెప్పెను. అంత భృగువు మనువు తన కుపదేశించినవిధముగ వర్ణాశ్రమధర్మముల నుపదేశించెను."

ప్రథమాధ్యాయములోని ౬౦-వ శ్లోకముచివఱను భృగుని మాటలు ప్రారంభ మగుచున్నవి. అంతవఱకునుగల గాథను గ్రంథస్థము చేసినవారెవరో మనకు తెలియదు. భృగువు సరిగ మనువు చెప్పిన యక్షరములతోనే ధర్మములను చెప్పియున్ననుగూడ మొదటి యఱువది శ్లోకములకును మనువు కర్తకాడనియు, నొక యజ్ఞాతకవియే కర్తయనియు చెప్పవలసియున్నది. కాని భృగువుచెప్పినధర్మములు మనువుమాటలలో లేవని స్పష్టముగ తెలియుచున్నది. ఏమన ననేక స్థలములలో 'మనురబ్రవీత్' అని భృగువు చెప్పుచున్నాడు. ఒకచో భృగుని స్వీయాభిప్రాయముగూడ చెప్పబడినది. (౩ అ. ౧౬ శ్లో.) మఱియు నప్పుడప్పుడు మునులు భృగువును ప్రశ్నించుచుండుటయు, భృగు వందులకు సమాధానముచెప్పుటయు గాన్పించుచున్నది. మునులు వేయబోవుప్రశ్నలను గూడ మనువే వచించెనని చెప్పుటకు వీలులేదు గదా! ఈయంశములనుజూడ భృగువు మనువుచేసిన ధర్మోపదేశము యొక్క సారమును తనమాటలతో కుదించిగాని పెంచిగాని మునులకు చెప్పెనని తేలుచున్నది. కొన్నిచోట్ల మనువు చెప్పినమాటలే యుండిన నుండవచ్చును. మొత్తముపైన మనువుచేసిన ధర్మోపదేశమును స్మరించి భృగువు తాను స్వయముగ మునులకు వాని నుపదేశించినాడు. కావున భృగువు మునులయెదుట మనుస్మరణను లేకమనుస్మృతిని చేసినాడని చెప్పవలెను. ఈమనుస్మృతి ప్రస్తుతమనుస్మృతిప్రథమాధ్యాయములోని ౬౧-వ శ్లోకమునుండి ప్రారంభమగుచున్నది. గ్రంథాంతము వఱకును గూడ మనుస్మృతియే యున్నది.

అట్లగుచో మొదటి యఱువదిశ్లోకములలోను నచ్చటచ్చట గాన్పించు సృష్టిక్రమాదికొన్నిరహస్యములు మనుప్రోక్తము లని యందు చెప్పబడినదికదా. అవికూడ మిగిలినగ్రంథ భాగముతో సమానముగనే ప్రమాణములా కావా యనుప్రశ్న యుదయించును. ఈ యఱువదిశ్లోకములను వ్రాసిన యజ్ఞాతకవి తననాటికి దేశములో వ్యాపించియున్న మనుప్రోక్తము లని నమ్మబడుచుండిన యీరహస్యములను తనమాటలతో నిందు వ్రాసియున్నాడని మన మూహింపవలెను. అంతకుపూర్వమే భృగుప్రోక్తములైన మనుధర్మములు ప్రజలలో పఠనపాఠనములలో నుండియున్నవనియు నీ యజ్ఞాతకవి రచించిన సృష్టిరహస్యాదివిశేషణములతోను పైన పేర్కొనబడిన గాథతోను గూడుకొనిన యఱువదిశ్లోకములును భృగుప్రోక్తగ్రంథమునకు చక్కని యుపోద్ఘాతముగ నేర్పడినవనియు, నందుచే వానికి మనుస్మృతితో నవినాభావసంబంధ మేర్పడినదనియు చెప్పవలసియున్నది

మనుప్రోక్తవిషయమును స్మరించి వ్రాయబడినది కావున దీనికి మనుస్మృతి యను నామము గల్గినదని యిదివఱలో చెప్పియున్నాను. నారదుడు వ్రాసినది నారదస్మృతి యనియు, పరాశరుడు వ్రాసినది పరాశరస్మృతియనియు నీవిధముగ స్మృతులకన్నిటికిని వాని కర్తల నామములు గన్పట్టుచుండ మనుస్మృతికి మాత్ర మట్లేల యుండదని కొందఱు ప్రశ్నింపవచ్చును. ఇందులకు రెండు సమాధానములు: (౧) నారదాదిస్మృతు లాయా ఋషులచే ప్రోక్తములైన ధర్మములను తెలుపుచున్నవనియే మన ప్రాచీనులు చెప్పినారు కాని వారు వానిని లిఖించినారని చెప్పలేదు. (౨) మనుస్మృతి యన్నిటికంటెను ప్రాచీనతమమగుటచే మిగిలిన స్మృతులు వ్రాయబడుకాలమునకు స్మృతిశబ్దము ధర్మశాస్త్రగ్రంథ మను నర్థమున రూఢియై కొందఱు ఋషులు వ్రాసిన ధర్మశాస్త్రము లాయాఋషుల నామాంకితములైన స్మృతులుగ తెలియబడుచు వచ్చినవి.

స్మృతులలో వేదములయర్థము స్మరింపబడుటచేతనే వాని కట్టినామము గల్గినదని (ప్రతింపశ్యన్తి మునయః స్మరంతి చ తథాస్మృతిం) చిరకాలమునుండి మనవారు చెప్పుచున్నారు గదా. మనుస్మృతియను గ్రంథములో మనువను నాతనిమాటలు స్మరింపబడి నవేకాని వేదము స్మరింపబడినదని చెప్పుటకు వీలు లేదుకదా. కావున ప్రాచీనసంప్రదాయము ననుసరించి ప్రస్తుతమనుస్మృతి నిజమగు స్మృతి కాకనేపోవునుగదా యని కొందఱు వాదింపవచ్చును. ఇందు లకు నేను చెప్పబోవు సమాధానము కొందఱ కాశ్చర్యమును గల్గింప వచ్చును. కాని వారు కొంచెము మోపికతో విననలసియున్నది.

మనువును స్మరించుట యనగా వేదమును స్మరించుటయే యని యర్థము. మనువు ఋషిగ గలిగి ధర్మప్రతిపాదకమైన కొంత వేద భాగ మొకప్పు డుండెడిది. ఆభాగములో మానవులు నడచుకొన వలసినవిధానము సవివరముగ వర్ణింపబడియుండెను. ఆవేదభాగమును స్మరించి భృగువు స్మృతిని వ్రాసినపిమ్మట ప్రజలకు దురవగాహముగ నుండిన యావేదభాగము లుప్తమై యీస్మృతియే మిగిలినది. ఆవేద భాగము లుప్తమగుటకు మఱొకహేతు వది యేయజ్ఞయాగాదుల లోను పఠింపవలసినది కాకుండుటయే యని చెప్పవలెను. అందు వర్ణింపబడిన ప్రవర్తనవిధానమే ముఖ్యమగుటచేతను నదియంతయు నవీనసంస్కృతములో స్పష్టముగ గన్పట్టుచుండుటచే నాదివైదిక రూపములోనే దానిని చదువవలె ననుపట్టుదల ప్రజలకు లేకుండెను. విషయములోనేకాక కొంతవఱకు భాషలోకూడ ప్రస్తుతమనుస్మృతి యావేదభాగమునే పోలియుండుటచేతనే ప్రజలకీ స్మృతియుండగ దానియవసరము గాన్పింపదాయెను. వేదవాఙ్మయములో భాగముగ నుండినపుడుగూడ నిది యనుష్టుప్ఛందములోనే యుండియుండ వచ్చును. ఋగ్వేదములోకూడ ననుష్టుప్ఛందము చాలసూక్తములలో వాడబడియున్నదిగదా! ఈవిధముగ నక్షరములలోకూడ భేదములే కుండ వైదికభాగములు స్మృతులలో గన్పట్టుట యసాధారణవిష యము కాదు. గౌతమధర్మసూత్రములలోని ౨౬-వ అధ్యాయమంతయు సామవిధానబ్రాహ్మణములో నున్నదేకదా! ఆర్ష ప్రయోగములు లౌకిక ప్రయోగములుగ మారుటయను స్వల్పపరివర్తనముతోనే యావేదభాగ ములో కొంత ప్రస్తుతమనుస్మృతిలో నిలచియుండవచ్చును. ఆర్ష ప్రయోగములు లౌకికప్రయోగములుగ మారుట యనునది చాలధర్మ శాస్త్రగ్రంథముల చరిత్రములలో గన్పట్టుచున్నది. ఆపస్తంబధర్మ సూత్రములకంటె ప్రాచీనములైన గౌతమధర్మసూత్రములలో నార్ష ప్రయోగములు తక్కువగ నుండుటకుకారణ మాగ్రంథములోనియార్ష ప్రయోగములు తరువాతికాలములో నవీనవ్యాకరణము ననుసరించి సవరింపబడుటయే యని పాశ్చాత్యపండితులందఱు నంగీకరించియే యున్నారు. అన్నిటికంటెను నెక్కుడు పఠనపాఠములలో నుండిన మానవధర్మశాస్త్రములో నిట్టిసంస్కరణములు జరిగినవని చెప్పుటలో నాశ్చర్యమేమికలదు? కొన్ని వేదభాగములే ప్రస్తుతమనుస్మృతిలో నిలచియున్నవను సిద్ధాంతమును ప్రతిఘటించు కొన్ని యుక్తు లకు పైన సమాధానము లీయబడగా నిక నా వేదభాగము లెట్లు వైదిక స్వరరహితమైన వను ప్రశ్న రావచ్చును. అందులకు సమాధానముకూడ వీనికి యజ్ఞకర్మలలో వినియోగము లేకుండుటయే యని చెప్ప వలెను. మంత్రభాగమే యజ్ఞములలో పఠింపవలసిన దగుటచే నదియే స్వరయుక్తముగ నేటివరకును కాపాడబడినది. యజుర్వేదమునకు సంబంధించిన బ్రాహ్మణములును, తైత్తిరీయశాఖకు చెందినయుపనిష త్తులును దక్క మఱి యేయితరవైదికవాఙ్మయమునుగూడ నేడు స్వర యుతముగ లేదు. వానిస్థితియే యిట్లుండ యజ్ఞకర్మలలో వినియో గము లేకుండుటతోబాటు భాషావిషయకముగ పరిణామమునకు లోనైన పైనపేర్కొనబడిన వేదభాగములమాట చెప్పుట కేమున్నది?

మనువు ఋషిగగలిగి ప్రస్తుతమనుస్మృతి కాధారమైన వేదభాగ మొకప్పు డుండెడిదనుట కార్యవాఙ్మయములో నాంతరంగిక సాక్ష్యము లేవైన కలవా యను నంశము విచారింపవలసి యున్నది. అట్టిసాక్ష్య మొకటి ప్రస్తుత మనుస్మృతిలోనే యున్నది. సృష్ట్యా దిలో పరమేశ్వరుడు మనువునకు ధర్మశాస్త్రము నొకదానిని చెప్పె నని మనుస్మృతిలో నున్నది.

ఇదం శాస్త్రంతు కృత్వాసౌ మామేవ స్వయమాదితః,
విధివద్గ్రాహయామాస మరీచ్యాదీం స్త్వహంమునీన్.

—౧ అ. ౫౮ శ్లో.

ప్రతికల్పారంభమునందును వేదములు పరమేశ్వరుని ముఖము నుండి ఋషులకు వినబడుచుండునని శాస్త్రములు చెప్పుచున్నవిగదా! అట్లు కల్పారంభమున వేదమును వినినవారిలో మను వొకడని పై శ్లోకము చెప్పుచున్నది. ఆ శ్లోకములో శాస్త్రమును భగవంతుడు మనువునకు చెప్పిన ట్లున్నదేకాని వేదమునుచెప్పినట్లు లేదేయని కొందఱ నవచ్చును. కాని శాస్త్రమనుపదము వేదమనునర్థమున కూడ వాడ బడుటకలదని 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే' యను గీతావాక్యము మున్నగువానిని వినినవారికెల్ల తెలియగలదు. అంతియేకాక సృష్ట్యా దిలో మనువునకు భగవంతుడు తెల్పినది వేదేతర మెన్నటికిని కాజా లదు. అట్లగుచో వేదముకంటె ప్రాచీనమైన వాఙ్మయ ముండెడిదని యంగీకరింపవలసివచ్చును. అట్లంగీకరించుట ప్రాచీనార్యమతమునకే కాక నవీనపండితుల సిద్ధాంతమునకుకూడ వ్యతిరేకమే.

కావున మనువునకు భగవంతుడు తెల్పినది వేదమే యని చెప్ప వలసి యున్నది. కల్పారంభమునందు ప్రతిఋషికినిగూడ నన్ని వేద ములను వినబడక యొక్కొకని కొక్కొకభాగమే వినబడినట్లును తరువాత నివియన్నియు కలిసి వేదమనుపేరుతో వ్యవహరింపబడినట్లు ను తెలియుచున్నది. ఎవని కేభాగము వినబడినదో యాత డాభాగ మునకు ఋషి. మనువునకు వినబడినభాగమున కాతడు ఋషి యగు టయు, నాతనికి వినబడినభాగమున కంతకును గలిపి మనుసంహిత యనుపేరు గల్గుటయు నిట్లు సిద్ధించినవి.

ఆదిలో వేదమంత్రము నందరు ఋషులకును పూర్ణముగ విన బడుచుండుటయేకాక యందఱకును వారివారిభాగము లొకపర్యాయము వినబడలేదనికూడ చెప్పవలసియున్నది. ఈసిద్ధాంతముకూడ నార్యమతమునకుగాని, నవీనపండితులసిద్ధాంతమునకుగాని విరుద్ధముగ లేదు. ఇట్లు వేదమును వినినవారిలో ప్రథములలో మనువొకడని మను స్మృతినిబట్టియే తెలియుచున్నది.

> తప స్తప్త్వా సృజద్యంతు స స్వయం పురుషో విరాట్,
> తంమాం విత్తాస్య సర్గస్య స్రష్టారం ద్విజసత్తమాః:
>
> అహం ప్రజా స్సిసృక్షు స్తు తప స్తప్త్వా సుదుశ్చరమ్,
> పతీన్ ప్రజానా మసృజం మహర్షీ నాదితో దశ.
>
> (౧ అ. 33, 34 శ్లో. లు)

ఇతరవేదద్రష్టలు జన్మించుటకు పూర్వమే మనువు జన్మించె నని యీశ్లోకములవలన తెలియుచున్నది. మను వందఱికంటెను పూర్వుఁడనువిషయము వేదమునుండియు తెలియుచున్నది. అందును ప్రాచీనతమమని నమ్మబడుచున్న ఋగ్వేదములోఁగూడ నిట్లే చెప్పబడి యున్నది. ప్రథమమండలములోని యెనుబదవసూక్తములోని పదునారవఋక్కులో మను వందఱకును పితయని చెప్పబడినది.

> 'యా మథర్వామనుష్పితా దధ్యఙ్ ధియ మత్నత.'

తైత్తిరీయసంహితలోఁగూడ ప్రజలందఱును మనుసంతతియే యనిచెప్పబడినది

> 'మానవ్యోహి ప్రజాః.' (౨-౧-౫-౬)

మనుస్మృతిలో చెప్పబడిన మనువృత్తాంతము సత్యమైనదే యని యీవిధముగ వేదములు ధ్రువపఱచుచున్నవి. మనువునకు కొన్ని వేదమంత్రములు వినబడిన వనునంశములోఁగూడ వేదములు మనుస్మృతిని బలపఱచుచున్నవి. ఋగ్వేదములోని (౮-౩౦) యొక సూక్తము నకు మనువు ఋషియని నేఁడు మనకు తెలియుచునే యున్నదిగదా! ఇంకను అనేకమంత్రములకు మనువు ఋషి యనియు, నాతఁడు తాను దర్శించిన యొక్కొక వేదభాగము నొక్కొకరికి చెప్పుచుండెడివాఁడనియు వేదములనుబట్టియే తెలియుచున్నది. ఈసందర్భమున నీక్రింది వేదవాక్యములు గమనింపదగినవి:

"మనుః పుత్రేభ్యో దాయం వ్యభజ త్స నాభానేదిష్ఠం బ్రహ్మచర్యం వసన్తం నిరభజ త్స ఆగచ్ఛ త్సోఽబ్రవీ త్కథా మా నిరభాగితి నత్వా నిరభాక్షు మి త్యబ్రవీ దంగిరస ఇమే సత్ర మాసతే తే సువర్గం లోకం నప్రజానన్తి తేభ్య ఇదం బ్రాహ్మణం బ్రూహి తే సువర్గం లోకం యన్తో య ఏషాం పశవ స్తాగ్ స్తే దాస్య న్తీతి తదేభ్యోఽబ్రవీ త్తే సువర్గం లోకం యన్తో య ఏషాం పశవ ఆస న్తా నస్మాఅదదుః." —తై. సం 3-౧-౯-౪, ౫.

అర్థము:—మనువు తన యాస్తిని పుత్రులకు పంచి యిచ్చెను. కాని వేదాధ్యయనము చేయుచున్న నాభానేదిష్ఠుఁడను పుత్రునికి మాత్రము భాగ మీయలేదు. ఆపుత్రుఁడు వచ్చి యేహేతువుచే నన్ను భాగరహితునిగ చేసినావని తండ్రి నడిగెను. అంత తండ్రి 'నేను నిన్ను భాగరహితునిగ చేయలేదు. నీకు భాగమువచ్చు నుపాయము చెప్పెదను వినుము. అంగిరసులను మున్నగు ఋషులు సత్రయాగము చేయుచున్నారు. వారు స్వర్గప్రాప్తిసాధనము నెఱుఁగకున్నారు. నీవు చదువుకొనియున్న యీబ్రాహ్మణమును వారికి చెప్పుము. అట్లు చేసినచో వారు స్వర్గమును పొందగలరు. నీకు వారు యాగముచేయగా మిగిలిన పశువుల నీయఁగలరు. ఇదియే నీకు భాగప్రాప్త్యుపాయము.' అని చెప్పెను. ఇట్లుపదేశింపబడిన కుమారుఁడాబ్రాహ్మణము నంగిరసాదులకు చెప్పెను. అంత వారినుండి యవశిష్టములైన పశువులను పొందెను.

ఈగాథనుబట్టి మనువు తనకుమారున కెవ్వరును నెఱుఁగని యొక వేదభాగమును బోధించెనని తెలియుచున్నది. ఇదేవిధముగ ననేకుల కనేకవేదభాగముల నాతఁడు బోధించియుండవలెను. ఏమన: మనువు చాల వేదభాగములను చెప్పెనని వేదమునుండియే తెలియుచున్నది.

> "యద్వై కించ మను రవద త్తద్భేషజం"
>
> —తై. సం. ౨-౨-౧౦-౨.

[అర్థము:—మనువుచెప్పిన దది యౌషధము.]

మను వేదిచెప్పినదది మంచిదని యనవలసినంతగ్రంథము గాని, యున్నదానిలో నంత ప్రాశస్త్యముగాని ప్రస్తుతవేదములలో మనకు గోచరముగుటలేదు. పైన చెప్పబడిన విధమున వేదభాగములను మను వెందఱికో యుపదేశించియుండవలెనని యీవిధముగ తేలుచున్నది. ఇంతియేకాదు. ఈవిధముగ మనువుచే నుపదేశింపబడిన వారిలో భృగు వొకఁడనియు, మనువుచే నితరులకు ప్రసాదింపబడిన వేదభాగములలో వర్ణాశ్రమధర్మప్రతిపాదకమగునది యొకటనియు మనుస్మృతినిబట్టి తెలియుచున్న రెండంశములకును గూడ వేదములలో బలీయములగు సాక్ష్యములు గన్పట్టుచున్నవి.

మనువు భృగువునకు దేనినో యుపదేశించినాడని మనుస్మృతి చెప్పుచున్నదానికి వైదికాధారమేమియో ముందుగ చూతము. ఋగ్వేదము (౭ మం. అనూ. 3 ఋ) లో మనువు అగ్నిని సృష్టించెనని యున్నది. ఋగ్వేదములోనే (౧-౫౯-౬) భృగువు లగ్నిని మానవుల నడుమకు తీసికొనివచ్చినారని చెప్పబడినది. మనువు కనిపెట్టిన యొకపదార్థమును లోకములో వ్యాపింపజేసినవారు భృగువులని యిందువలన తెలియుచున్నది. దీనింబట్టియే మనువునకును భృగువుల కును గురుశిష్యసంబంధ మున్నట్లు స్పష్టమగుచున్నది. భృగువంశస్థులాదిలో మనువునుండి యొకవేదభాగమును గ్రహించిరని దీనింబట్టి చెప్పుటకు వీలుగలుగుచున్నది. ఆమనుసంహిత యావంశమువారిలోనే

యొక్కడుపఠనపాఠములలో నుండుటచే దానిరహస్యమును నావంశములోనివాడేయగు నొక డర్వాచీనకాలమున తన స్వీయవాక్యములతో చెప్పుటచే నది మనుస్మృతి యయ్యెను. ఒక్కొక్కవంశమువారియధీనమున నొక్కొక్కవేదభాగ ముండుట యనునది యందఱు నెఱిగినవిషయమే. ఋగ్వేదములోని రెండుమొద లేడువఱకునుగల మండలములకు గోత్రమండలము (Family Books) లని పాశ్చాత్యులు పేరు పెట్టియేయున్నారు. ఈవిధముగ చూడ భృగువంశములోనివాడగు నొకభృగు వర్వాచీనకాలమున, ననగా వేదేతరవాఙ్మయ ముదయించుటకు పూర్వ మీస్మృతిని వ్రాసెనను టసర్వవిధములచేతను సంభవముగనే గన్పట్టుచున్నది.

మనువు ఋషిగ గల యొకవైదికభాగము వర్ణాశ్రమధర్మప్రతిపాదకముగ నుండెనని స్థిరపఱుపబడినపిమ్మటనే కాదా యీయూహ చెల్లుట యను నొకపూర్వపక్షము సహజముగ వచ్చును. కావున కొన్ని వేదమంత్రములకు మనువు ఋషియని యిదివఱలో ఋజువు చేయబడినదానికి తోడుగ నిపుడు అట్టి వేదమంత్రములలో కొన్ని వర్ణాశ్రమధర్మప్రతిపాదకములని ఋజువుచేయుచున్నాను.

వర్ణాశ్రమధర్మము లనగా మానవులు ప్రవర్తించుకొనవలసిన విధానమును తెల్పు ధర్మములని చెప్పవచ్చును. ఇట్టి విధానము నొకదానిని మనువు ప్రజల కిచ్చియున్నాడని ఋగ్వేదములో నున్నది.

"మానః పథః పిత్ర్యా న్మానవా దధిదూరం నైష్టపరావతః."
—ఋ. సం. ౮-30-3

[అర్థము:—మాపూర్వుడగు మనువు మా కేర్పఱచిన మార్గము నుండి మమ్ము దూరముగ కొంపోకుము]

ప్రజ లేరీతిగ నడచుకొనవలెనో తెల్పు మనుధర్మశాస్త్ర మొకటి యీఋక్కుచ్చరింపబడుటకుపూర్వమే యార్యావర్తమున నుండినదనునంశము దీనినుండి స్పష్టమగుచున్నది. మఱియు నా మనునిర్దిష్టధర్మమార్గము చాల ప్రశస్తమైనట్లుకూడ నిందువలన తెలియుచున్నది. ప్రస్తుతము మనకు లభ్యముగ నున్న వేదములో నెచ్చటనుగూడ నట్టిమార్గము గన్పట్టుటలేదు. కాన నావేదభాగము లుప్తమైనదని చెప్పవలసియున్నది. అది యేవిధముగ లుప్తమైనదో యిదివఱలోనే చెప్పియున్నాను.

మనుస్మృతి కాధారమై వర్ణాశ్రమధర్మప్రతిపాదకమైన వేదభాగ మొకప్పు డుండెనని చెప్పుటకు గలహేతువులు పైనవివరింపబడినవి. ఈసిద్ధాంతమును బాధించునట్లు గన్పట్టు కొన్నియంశములనుగూడ పైన గన్పఱచి వానికి సమాధానము చెప్పియుంటిని. అట్టియాక్షేపణము నింకొకదాని నిట పరిశీలింపవలసియున్నది.

ఋగ్వేదకాలములో వర్ణపద్ధతి లేదనియు, నది క్రమముగ నేర్పడి బ్రాహ్మణములకాలమునాటికి స్థిరపడినదనియు నవీనపండితులు చాలమంది చెప్పుచున్నారు. ఋగ్వేదములోని యనేకఋక్కులకంటె పూర్వమే మనుసంహిత మనువునకు వినబడెనని పైనచెప్పబడినది. కావున మనుసంహితనాటికి వర్ణపద్ధతియే లేదని తేలుచుండగా నది వర్ణాశ్రమధర్మప్రతిపాదక మెట్లు కాగల దనునొకప్రశ్న వచ్చును. ఇందులకీక్రిందిసమాధానములను చెప్పుచున్నాను:

ఋగ్వేదమునాటికి వర్ణపద్ధతి యేర్పడలేదని చెప్పువారు తమవాదము నింతవఱకును ఋజువుచేసియుండకపోవుటయేకాక ఋగ్వేదదశమమండలములో చాతుర్వర్ణ్యమును పేర్కొనుసూక్తము ఋగ్వేదకాలములోనిదికాక తరువాతిదని ఋజువుచేయలేకపోయినారు. ఋగ్వేదములో ప్రాచీనములని నమ్మబడుచున్న భాగములలోగూడ బ్రాహ్మణాదివర్ణములు పేర్కొనబడియున్నవి. బ్రాహ్మణశబ్దము జాతిపరముగ నెనిమిదిపర్యాయములును, పురోహితుడనునర్థమున నలువదియూరు సారులును ఋగ్వేదములో వాడబడినదని మాక్డొనెల్ పండితుడే (History of Sanskrit Literature Pp. 161 - 162) యంగీకరించియున్నాడు. క్షత్రియశబ్దము కూడ ననేకపర్యాయములు వాడబడియున్నది. అది జాతిపరముగకూడ వాడబడినదని అవినాశచంద్రదాసుగా రంగీకరించియున్నారు. ఎట్లన క్షత్రియేతరులగు వైశ్యులుకూడ యుద్ధముచేయుట ఋగ్వేదములో గాన్పించుచున్నదని వారు తమ గ్రంథము (Rg. Vedic culture P. P. 132-133) లో వ్రాసియున్నారు. వైశ్యజాతికూడ ఋగ్వేదకాలములో నుండెనని వా రంగీకరించినట్లు దీనింబట్టి తెలియుచున్నది. గ్రామణి తరచుగ వైశ్యుడైయుండెడివాడని వా రాగ్రంథముననే (పుట ౧33) వ్రాసియుండుటచేతగూడ వైశ్యజాతి ఋగ్వేదకాలముననే యేర్పడెనని యీపరిశోధకుని యభిప్రాయమైనట్లు స్పష్టమగుచున్నది. శూద్రశబ్దము దశమమండలము (౯౦-౧౨) లో మాత్రమే పేర్కొనబడినమాట వాస్తవమే. అంతకంటె ప్రాచీనములగు ఋగ్వేదభాగములలో శూద్రజాతి లేదని చెప్పుట కేమాత్రమును వీలులేకుండుటయేకాక శూద్రజాతి యున్నదని చెప్పుటకు గొప్ప యాధారమున్నది. ఋగ్వేదములోని ప్రాచీనభాగములో దాసశబ్దము జాతిపరముగ వాడబడినదని యందఱు నంగీకరించినవిషయమే. మనుస్మృతిలోని ద్వితీయాధ్యాయములోని 3౨-వ శ్లోకములో శూద్రునకు ప్రైష్యసంయుతమైన నామ ముంపవలెనని చెప్పబడినది. శూద్రునినామమునకు చివర సేవకార్థబోధకమగుపద ముండవలెనని దీని యర్థము. అనగా 'దాస' మున్నగుశబ్దములు శూద్రుని నామమునకు చేర్పవలెనని యిట నుండుటచే దాసశబ్దము శూద్రవాచక మెట్లగునో తెల్లమగుచున్నది. విష్ణుపురాణములో స్పష్టముగ 'దాసశ్శూద్రస్య కారయేత్' అని చెప్పబడినది. ఇట్లే యనేకార్యగ్రంథములలో దాసశబ్దము శూద్రవాచకముగ చెప్పబడినది. ఈయంశములన్నియు చూడ ఋగ్వేదములోని ప్రాచీనభాగములలోగూడ శూద్రులప్రశంస యున్నదని చెప్పవలసియున్నది.

ఈవిధముగ బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులను నాలుగుజాతులవారును ఋగ్వేదకాలములో నుండిరని తేలుచున్ననుగూడ వేదకాలములో జన్మనుబట్టి వృత్తినిర్ణయము లేదని చెప్పుచు నవీనాశచంద్రదాసుగారు మూడుహేతువులను గన్పఱచుచున్నారు: (౧) విశ్వామిత్రుడు క్షత్రియుడైయుండియు ఋషియాయెనని ఋగ్వేదములోనున్నది. (౨) ఒకఋషితండ్రి వైద్యుడనియు, తల్లి పిండివిసరునదనియు ఋ సం. ౯-౧౧౨-౩ లో నున్నది. (౩) ఋషిపుత్రులు కొందఱు యుద్ధముచేసినట్లును, కొందఱు రథములను చేసినట్లును గలవు. వీని కన్నిటికిని సమాధానములను చెప్పుట సులభము. (౧) వర్ణధర్మములను బాగుగ బోధించుచున్న ఐతిహాసికగ్రంథములలోగూడ విశ్వామిత్రునిగూర్చి యిట్టివృత్తాంతము గలదు. తపోమహిమచే నతడు బ్రహ్మర్షి యగుట మున్నగువృత్తాంతమును చెప్పుచున్న ఐతిహాసికవాఙ్మయమునాటికి వర్ణపద్ధతి సునిర్మితమైనదని యొప్పుకొనువారు, ఈ వృత్తాంతమునే తెలుపు వేదభాగము రచింపబడునాటికి వర్ణపద్ధతి సుస్థిరము కాలేదని తేలుచున్నదని యెట్లుచెప్పగలరో తెలియకున్నది (౨) తండ్రి వైద్యుడును, కుమారుడు ఋషియును, తల్లి పిండి విసరునదియునగుట వర్ణధర్మముల కేమాత్రమును విరుద్ధముకాదని చెప్పవలసియున్నది. మనుస్మృతిలో నెచ్చటనుగూడ బ్రాహ్మణు లీనూతనవృత్తులను చేయుటకు వీలులేదని చెప్పబడి యుండలేదు. (౩) అవసరము వచ్చినపుడు బ్రాహ్మణుడు చాపము ధరించుట యన్నియుగములలోను గాన్పించుచున్నట్లే వైదికయుగములో గూడ గాన్పించుచున్నది. ఇక ఋషిపుత్రులు కుశలురైన రథకారకులని యేలచెప్పబడినదన రథకరణమును ఋగ్రచనతో పోల్చుట ఋగ్వేదములో ననేకస్థలములలో నున్నదని మాక్డొనెల్ (A History of Sanskrit Literature P. 66) చెప్పియున్న యంశమును మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను. అపుడు మనకు ఆఋషిపుత్రులు చక్కగ మంత్రములను కూర్చువారనుసంగతి తెలియగలదు. ఋగ్వేదములో కొన్నిస్థలములలో వర్ణాంతర వివాహములు జరిగినట్లు గన్పట్టుచుండుటచే నాకాలమునాటికి వర్ణవ్యవస్థ స్పష్టముగ లేదని నవీనపండితులు కొందఱు చెప్పుచున్నారు. కాని మనుస్మృతిలోగూడ వర్ణాంతర వివాహముల ప్రశంస యున్నదని మనము జ్ఞప్తియం దుంచుకొందుమేని యీ హేతువుచే మనుస్మృతినాటిసంఘమునకును ఋగ్వేదమునాటి సంఘమునకును భేద ముండవలసిన యవసరము లేదని తెలియగలదు.

మానవులు నడచుకొనవలసిన విధానమును దెల్పుచు మనుస్మృతి కాధారమైన యొక వేదభాగ మొకప్పు డుండెననియు, మనుస్మృతి రాకచే నది లుప్తమయ్యెననియు చెప్పుట కేమియు నాక్షేప ముండజాలదని యీవిధముగ తేలుచున్నది. మఱియు భృగువు మనుద్రష్టృకమైనయీవేదభాగమును స్మరించి యీగ్రంథమును చెప్పుటచేతనే దీనికి మనుస్మృతియనునామము కల్గినదనిగూడ వ్యక్తమగుచున్నది. ఇక భృగువుచే చేయబడిన మనుస్మృతి నేటివఱకును మార్పులచెందకయే నిలచియున్నదా, లేక నడుమ దీనిలో ప్రక్షిప్తములుకాని, లుప్తములుకాని యేమైననుండినవా యనుప్రశ్న యుదయించును. భృగుకృతమనుస్మృతి మార్పులనుచెందియే మనయొద్దకు వచ్చినదని పండితులయభిప్రాయము. మనుస్మృతి పదవయధ్యాయములోని నలుబదినాల్గవశ్లోకమున యవన, కాంభోజ, పల్లవ, శక, చీనులును, నలుబదియెనిమిదవ శ్లోకమున ఆంధ్రమేదులును పేర్కొనబడుటచేతను నీజాతులవారందఱును నీశ్లోకకర్తకు తెలియవలెనన్న నాతడు క్రీస్తుపూర్వము మూడవ శతాబ్దికిపూర్వమువాడు కాజాలడని చెప్పవలసియుండుటచేతను మనుస్మృతిలోని కొన్నిశ్లోకములు క్రీస్తుపూర్వము మూడవశతాబ్దమున వ్రాయబడినవని బుహ్లరుమున్నగుపండితులు కొందఱు చెప్పియున్నారు. కాని ప్రస్తుతము మనకు లభ్యమైయున్న వేదేతరవాఙ్మయమంతలోను ప్రాచీనతమమైన నిరుక్తములో మూడవ యధ్యాయమున దాయభాగమువిషయమై మనువునకు గల యొక యభిప్రాయమును దెల్పుశ్లోక మొకటి యుట్టంకింపబడుటచే మనుస్మృతి నిరుక్తకారునకుగూడ తెలిసియేయుండెననియు, మహాభారతములో వందలకొలది ప్రదేశములలో మనువు ప్రమాణముగ చెప్పబడుటయేకాక మనుస్మృతిలో నేడును గన్పట్టుచున్న రెండువందల శ్లోకము లాగ్రంథమున నుట్టంకింపబడి యుండుటచేతను, గౌతమ, వసిష్ఠ, బోధాయనాదులసూత్రములలో మనువు ప్రమాణముగ పేర్కొనబడియుండుటచేతను వేదేతరమగు సమస్తహిందూగ్రంథసముదాయముకంటెనుగూడ పూర్వముననే భృగువు మనుస్మృతిని చేసెనని తేలుచుండగా మహాభారతాదులగు కొన్నిగ్రంథములలో మనుశ్లోకములుగ చెప్పబడినవి నేటి మనుస్మృతిలో గన్పట్టకుండుటచేతను, వసిష్ఠు ననేకపర్యాయములు నేటి మనుస్మృతి పేర్కొనుచుండుటచేతను, ఉతథ్యతనయు డను నామమున గౌతమునిగూడ పేర్కొనియుండుటచేతను యవనాది నవీనజాతులను మనుస్మృతి పేర్కొనుటచేతను మనుస్మృతి ప్రథమమున వ్రాయబడుట యతిప్రాచీనకాలమందే (వేదేతరగ్రంథము లన్నిటికంటెను పూర్వమందే) జరిగినను చాల యర్వాచీనకాలమువఱకును దానిలో లోపాగమములు జరుగుచునే వచ్చినవని చెప్పవలెనని నేటిపండితుల యభిప్రాయము. కాని యీ లోపాగమములు మూలగ్రంథస్వరూపమునే మార్చునట్టివిగ నున్నవని యెవ్వరును చెప్పియుండకపోవుటచే నేటి మనుస్మృతికి కర్త భృగువే యనియు, నాతడు మనుద్రష్టృకమై, వర్ణాశ్రమధర్మప్రతిపాదకమై ప్రస్తుతము లుప్తమైయున్న వేదభాగమును స్మరించి యీగ్రంథమును రచించుటచేతనే మనుస్మృతి యనునామము దీని కన్వర్థమగుచున్నదనియు చరమసిద్ధాంతము తేలుచున్నది.

---

# మతవైషమ్యపరిహారము

**శతావధాని అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి**

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పర మిద మదః పథ్యమితిచ;
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిలనానాపథజుషాం
నృణా మేకో గమ్య స్త్వమసి సరితా మర్ణవ ఇవ.

ఇది యొకభక్తుఁ డొనర్చిన భగవత్ప్రార్థన. ఇందు సర్వమతసమరసభావము పొడఁగట్టెడి. జీవులయభిరుచులు భిన్నభిన్నములై యుండునుగాన భిన్నభిన్నమతబోధ లేర్పడెననియు, గమ్యస్థానమొక్కఁ దేవుఁడే యనియు సమర్థింపఁబడినది. హిందువుల నిత్యప్రార్థనయగు సంధ్యావందనముచివర "ఆకాశా త్పతితం తోయం యథా గచ్ఛతి సాగరం, సర్వదేవనమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి" అని యున్నది. వాననీ రెచ్చటఁబడియు సముద్రమునఁ జేరునట్లే దేవతకు నమస్కరించినను భగవంతునకే చేరునని దీనియాశయము. ఇంతకన్న హిందువులమతము పరమతసహనముగల దనుటకేమి నిదర్శనము కావలెను?

ధర్మార్థకామమోక్షములు పురుషార్థము లందురు. మనుజునకుఁ గావలసినది పురుషార్థమందురేని కామ మెట్లు పురుషార్థమగును? భోగములు నిరర్థకములు, హానికరములు నని "సర్వేంద్రియాణాం జరయన్తి తేజః" అను నుపనిషద్వాక్యము చెప్పునుగదా. "చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మిసాలపై తేనియల్" అని పెద్దనమహాకవియుఁ దెల్పుచున్నాఁడుకదా? కాన మనుజులు కోరుచుండునవి పురుషార్థము లనవలెను. కొందఱు ధార్మికులును, కొందఱర్థలుబ్ధులును, కొందఱు భోగపరాయణులును, మఱికొందఱు మోక్షతత్పరులును ప్రజలలోఁ గన్పట్టుచున్నారు. అందఱికోరికలును వీనిలోఁ జేరియే యుండును. అర్థము అనుదానిలో ధనధాన్యరాజ్యకీర్తిపాండిత్యాదు లనేకములు చేరు. ఇట్లు రుచిభేదములుగల ప్రజల డెందముల ననుసరించి వారికి తరణోపాయములు బోధింపఁబడవలెను. ఒకభోగపరాయణునియొద్దకుఁ బోయి ముముక్షువున కుపన్యసింపవలసినసన్న్యాసవిధుల నుపదేశించిన నాతఁ డదిగ్రహించి యట్లు నడచుకొని కృతార్థుఁడు కాఁగలఁడా? అట్లే ఒక ధర్మపరునియొద్దకుఁ బోయి విషయభోగప్రాముఖ్యమును బోధించిన వాని డెందమున కది నచ్చునా? ప్రవరునికడ వరూథినిపని యేమైనది? అర్థలుబ్ధుఁగ నుండెడువానికి దానధర్మములు చేయుమనిన విసువుకాదా? దుర్యోధనుఁడు పాండవులకు సూదిమోపినంతభూమి గూడ నీయలేదనలేదా? కావున వేదముకూడ సర్వజగదుద్ధరణమున కేర్పడినదికాన నానావిధాంతఃకరణములు గలజనులకు నానావిధోపాయములను విధించుచున్నది. దానంజేసియే వేదమున శత్రుహింసోపాయములు మొదలుకొని సర్వము నీయాత్మయే యనుబోధవఱకుఁ గల బోధలెల్లఁ గన్పట్టెడి. ఏవిధమైనకోరికకు బద్ధుఁడైనవానినైనను, బలవంతముగ నాకోరికను వదలుకొనుమని బోధించుపద్ధతులకన్న యుక్తిగా వారి నాపనుల నుండి మానిపించుట మంచిది. ఇట్టిపద్ధతియే వేదమునఁ బెక్కువిధములలోఁ గైకొనఁబడినట్లు తోఁచెడిని. ఆపద్ధతి యిట్టిది—ఒకవిషయమున బద్ధానురాగుఁడై తిప్పలుపడువాని నావిషయముకొఱకే వేల్పులఁ బ్రార్థింపుమని వేదము చెప్పును. అట్లతఁ డభీష్టసిద్ధికి దేవతారాధన మొనర్చెనేని విషయము సిద్ధించుటయకాక యావిషయమున విరక్తియు, నాదేవతమీఁద భక్తియు నేర్పడును. ఇది ధ్రువునికథయందుఁ గన్పట్టెడిని. ధ్రువుఁడు సర్వోన్నతికోసము తపస్సుచేసెను. భగవంతుఁడు ప్రత్యక్షమై దాని నిచ్చెను. ధ్రువుఁ డది పడసి వెంటనే చింతించెను. అతనిచింత యిది—అక్కటా! భగవంతుఁడు నిత్యానందము నొసఁగువాఁడు కన్పట్టినపుడు మోక్షమును గోరనైతినిగదా? ఈలభించినయౌన్నత్య మేనాఁటికేని భంగురమేకదా? చూడుఁడు. ఈకథ యేమితెల్పుచున్నది? ధ్రువుఁడు దేవతాప్రార్థనచేఁ గోరిక వడయుటయే కాక విజ్ఞానప్రాబల్యలాభమునం జేసి వైరాగ్యభాగ్యము కలవాఁ డయ్యె. పురుషప్రయత్నమున నహంకారపూరితులమై కోరికలను నెఱవేర్చుకొంటిమేని కోరికలు పిల్లలఁబెట్టును. అనఁగా మఱికొన్నికోరికల నది కలిగించును.

నజాతు కామః కామానా ముపభోగేన శామ్యతి,
హవిషా కృష్ణవర్త్మేవ భూయఏ వాభివర్ధతే.

అని మనుస్మృతి. దేవతారాధనమునం జేసి యభీష్టములఁ బడిసితిమేని వాంఛితములు సమకూరుటయేకాక దేవతాభక్తికూడఁ గల్గును. భక్తి ప్రాబల్యమునం జేసి రక్తి కొఱపడి కలిగి వైరాగ్యభాగ్యము కరతలామలకమగును.

ఈరీతి ననుసరించి శత్రుద్వేషములపాలై యహర్నిశములు పాటుపడువారి కాశత్రునాశనమును దేవతారాధనమున సమకూర్చుకొనవచ్చు ననుబోధలే వేదములోని యాభిచారికవిధులు. ఇట్లే వివిధభోగపరాయణులగువారికి భోగసాధనముల సమకూర్చు తరణోపాయముఁ జూపు దేవతారాధనలఁ జూపించుటయే వేదములోని కామ్యవిధి విధానరహస్యము.

దేవతలమీఁద నించుకంత భక్తి యేర్పడినపిమ్మట దానిని బలపఱుచుటే ఫలకాంక్షవదలి మంచిపనులను (వేదవిహితములను) జేయుమనుట. ఇది మనభగవద్గీతలలో మొదటిశ్లోకమాదిగ ఇతిశ్రీ అనునంతదాఁక మనకు గోచరమగు కర్మయోగము. ఇఁక సగుణోపాసన, నిర్గుణోపాసన యను భక్తిమార్గములును, జ్ఞానమార్గమును, జ్ఞాననిష్ఠ యనుమోక్షమును ఇవియెల్లఁ దారతమ్యములతో నుండెడి యుత్తమాంతఃకరణములవారి తరించుటల కేర్పడిన విధానములే.

ఏనరుఁడైన నివియెల్లఁ దెలిసికొని యేది తనయోగ్యతకుఁ దగియున్నదో అను నంశమును గురుల (పెద్దల) సహాయముచేతను, విజ్ఞుల సలహాలచేతను నిర్ధారణ చేసికొని యాస్వధర్మమున నడచుకొనెనేని తరింపఁగలుగును. తన యోగ్యతకు తగనిధర్మమునఁ దాను ప్రవేశించెనేని తనతత్త్వమునకుఁబడనిమందు సేవించినవానివలె హాని గాంచును. ఇదియే 'స్వధర్మము స్వధర్మము' అని భగవద్గీతలలోఁ బల్మారు చెప్పునది. "పరధర్మో భయావహః" అనుటయుఁ దనచేతఁగానిపనిఁ జేయఁబూనుట వ్యర్థమో, హానికరమో అనుటయే.

ప్రార్థనలచే వాంఛితసిద్ధి ప్రయత్నము లేక కలుగునా? అను శంకయు గలుగవచ్చు. మన మెవ్వరమును ప్రయత్నములేక తపస్సులచేఁ గోరికలను బడయుట నెఱుఁగము. మనవాఙ్మయమున నేమూలఁ జూచినను ఇది ధ్వనించుచుండును. పతంజలియోగసూత్రములలో భావనచేతనే గజబలాదులు గలుగునని కలదు. కాని "నదేవా దండమాదాయ రక్షంతి పశుపాలవత్" అనునది మనకే అట్టిప్రభుమంత్రోత్సాహశక్తుల వేల్పులు గల్గింతురని బోధించెడిని. ఆధ్యానములోని మహిమ యిది. ఇట్లు పనులు నెగ్గుటనే దేవతల వరములుగ భావింతురని కొంద ఱంద్రు. ఎట్లయిననేమి? ప్రార్థనలుకూడ పనులు నెఱవేర్చుకొనుటకు సాధనము లనునది వేదవిజ్ఞానములోఁ బేరిగియున్న భరతఖండవాసులకుఁ గ్రొత్తగ బోధింపవలసినదికాదు. మనకుఁ జేతగానివెల్ల సృష్టిలో లేవని కొంద ఱనుకొనిండు. హిరణ్యకశిపురావణాదులబలములు తపస్సిద్ధములని పురాణములు వాకొనుఁగదా. శంకరులు అద్వైతమె నిజమనిరి. శ్రీరామానుజాదులు నిట్లే కొన్నిసిద్ధాంతములను నిర్ణయించిరి. వీరిలో నెవరు సర్వజ్ఞులు? పూర్వులనబరులు కాదనుకొనుట వీరిలోఁ గలదు. అని మనకు శంక గల్గుచున్నది. కాని నేను వెనుక మనవిచేసికొనినట్లు వారివారికాలములలో నాయాబోధల కర్హులైనజీవు లెక్కువగనుండుటయే వారి విలక్షణసిద్ధాంతము లేర్పడుటకుఁ గారణము. ఇట్లనుకొనుట సర్వమతస్థుల సామరస్యమునకు హేతువు కావునను మన కుపాదేయము. శంకరులకాలమున కద్వైతతత్త్వమును నిరాకారమును బోధింపవలసినయావశ్యకతలు గల్గియుండవచ్చును. అప్పటిప్రజల యధికారములు (అర్హతలు)అట్లుండెను. శ్రీరామానుజులవారినాఁటికి మనుజు లద్వైతసిద్ధాంతమును సరిగఁ దెలిసికోలేక చేతగానిభావనలఁ జిక్కి దురాచారాలపాలై యుండవచ్చును. వారియెడ దయగలిగి రామానుజులు విశిష్టాద్వైతమును బోధించియుండవచ్చు. అప్పుడుగూడ కొంద ఱద్వైతమున కధికారు లుండవచ్చును. ఉన్ననేమి? వా రదియవలంబించియే సిద్ధులగుదురుగాక! రామానుజబోధలు నింద్యము లెట్లగు? పలువు రాయన కన్నులకుఁ గన్పట్టుటం జేసి యట్టిబోధకుఁ డతఁడయ్యె. ఇట్లే శివవిష్ణ్వాదిధ్యానములును రుచిభేదములంబట్టియే యేర్పడినవి. ఒకరిదారి యొకరికి ద్వేషపాత్రము కాఁగూడదు. మతకర్తలెల్లఁ బరమతఖండన మేల చేసిరని యొక శంక వొడము. శ్రద్ధావిశ్వాసములు శిష్యులకుఁ గల్గించుటకే అని సమాధానము.

సర్వోన్నతమనినంగాని యెవ్వఁడును విశ్వసింపఁడు. ఆ సర్వోన్నత్యము పరమతఖండనమునంగాని తేటపడదు.

ఒక బి. ఏ. పాఠము చెప్పువాఁ డుండఁగా ఇంటర్మీడియేటు ప్యాసైనవాఁ డెంత బాగుగఁ జెప్పినను వానియొద్ద నెవ్వఁడును సామాన్యముగఁ బాఠము చెప్పుకొననెంచఁడు. అంతటి గుణగ్రహణశక్తి లోకమునఁ జాలవిరళమనక తప్పదు. దేశభేదములనుబట్టి కూడ మతకర్తల మతములు భిన్నములు కావచ్చును. మహమ్మదు, క్రీస్తు మొదలగువారి బోధ లిట్లే భిన్నాకారములతో వేఱువేఱుగ నుపాయములను దెల్పుచున్నవి. తన పూర్వు లేమతమునఁ బ్రవేశించిరో ఆ మతధర్మముల యథాశక్తి ననుష్ఠించుచున్నఁ బరమార్థమునకు లోటుండదు.

మోక్షమునకు మనుజుని జేర్చునది భక్తి. అది పెద్దవ్యక్తుల నెలకొను ప్రేమయే. గురువులో, దేవతలో, భగవంతుఁడో ఎవరో మనస్సునకుఁ దట్టి ప్రేమింపఁబడుచుండిరేని నరుఁడు తప్పక తరించును. అందులో భగవద్భక్తి దబ్బున నందదు. భగవంతుని రూపము సచ్చిదానందమయము. అట్టిమూర్తిని నరుఁడు తన జన్మమున నెఱుఁగఁడు. రూపము నెఱిఁగినంగాని సామాన్యనరుఁడు భజింపలేఁడు. కాన దేవతాభక్తి భగవద్భక్తికి సాధనము. దేవతలరూపములు మనరూపులకన్న విలక్షణములైనను భగవంతునివలె నవాఙ్మనసాగోచరములుకావు. కాన హిందువులలో గృహస్థాశ్రమమున దేవతాభక్తి విధింపఁబడినది. బ్రహ్మచారికి గురుభక్తి ప్రధానము. దీన నాటితేఱిన వాఁడు దేవతలను గృహస్థయి యజింపఁగలుగును. పరమసాధ్యమయిన సన్న్యాసమునఁ బరమాత్మధ్యానము హిందూమతమున విహితమగుట కిదే కారణము.









1. శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మి 2 తూర్పుఆఫ్రికాకు పయనమయిన బరోడా ఆర్యకన్యా మహావిద్యాలయ విద్యార్థినులు.
3. శ్రీమతి కిళాంబి సీతమ్మ. 4. దక్షిణభారతహిందీప్రచారక సభవారి పరీక్షలకు రాజమండ్రి అభ్యర్థినులు.






1 శ్రీమతి చంద్రాదత్తు సతి  2 రాజమహేంద్రవరము శ్రీమహిళాగాన సభవారి ప్రథమ ప్రదర్శనము.

# ది ట్రావెన్‌కూర్ నేషనల్ బ్యాంక్ లిమిటెడ్.

## 1912 లో తిరువాన్కూరునందు స్థాపింపబడినది

రిజిష్టర్డు ఆఫీసు : తిరువల్ల. హెడ్డాఫీసు : అల్లెప్పే.

### డైరెక్టరులు

కే. సి. మమ్మెన్ మాప్పిళ్లెగారు, బి. ఏ., యెడిటర్; యిన్-చీఫ్, "మళయాళ మనోరమ" కొట్టాయం (అధ్యక్షులు); పి. పిలిపోజ్ గారు, వకీల్, హరిపాడ్; కె. జి. తామస్ గారు, బ్యాంకరు, కాయంకులం; యి సుబ్రహ్మణ్యఅయ్యరుగారు, యం ఏ యం. యల్. ప్రిన్సిపాల్, గవర్నమెంటు లాకాలేజి, ట్రివేండ్రము; ఏ. టి. యస్. ఖాసిర్ భాయిగారు, మిల్ యజమానులు, క్విలన్; కే. పి. క్రిష్ణనియాన్ గారు, బి. ఏ. యల్. టి. హెడ్‌మాస్టర్, యన్. యస్. యింగ్లీషు హైస్కూలు, మన్నారు; డబ్లియు. పి. ఏ. సౌందరపాండ్యన్ గారు, యం. యల్. సి. పట్టివీరన్‌పట్టి, మధుర; కె. సి. యీపెన్ గారు, బి. ఏ. (మేనేజింగు డైరెక్టరు); కే. యం. యీపెన్ గారు, యం. ఏ. బి. యల్. (కార్యదర్శి).

| 164 బ్రాడ్వే. | మద్రాసు బ్రాంచీలు : | మౌంటురోడు. |
|---|---|---|

### ఇతర బ్రాంచీలు :

అలెప్పే, బొంబయి, కాలికట్టు, కొచ్చిన్, దేవికోలం, యెర్నాకులం, కొట్టాయం, కరైకుడి, మన్నారు, మధుర, ఉదకమండలము, వాల్‌ఘాటు, పొల్లాచి, పెరంపవూరు, క్విలను, శ్రీరంగము, ట్రిచెంద్రము, తిరుప్పూరు, తిరువల్లి, తిరుచునాపల్లి, ట్రిచూరు, త్రిపునిత్తుర, ఉడిపూల్ పేట, విరుధునగర్, మంగళూరు.

1933 సం॥ 31 డిశంబరుతో అంత్యమయ్యే ఆస్తి అప్పుల పట్టికతో అనుబంధింపబడిన డైరెక్టరుల రిపోర్టునుండి, బ్యాంకుయొక్క రాబోవు రజతోత్సవము గురించి తెలియజేయబడిన యీ క్రింది విషయము గ్రహింపబడినది

"బ్యాంకుయొక్క వివిధశాఖల కార్యనిర్వాహకము యెక్కువ తృప్తికరముగ జరుపబడుచుండుటకుగాను, 1932-వ సంవత్సరములో మొదటిపర్యాయము, అందరిమేనేజర్లయొక్క సమావేశము గావింపబడెను. ఇట్టిసమావేశములు, మిక్కిలి ప్రయోజనకరముగాను, ప్రోత్సాహజనకముగాను గోచరించుటచేత, ఇంకను కొంతకాలము యీవిధముగనే తరచుగా వార్షికసమావేశములు జరుపుటకు నిశ్చయింపబడెను. గత సంవత్సరపు మేనేజర్ల సమావేశమునందు, బ్యాంకు, స్థాపించినది మొదలు 1937 లో 25 సంవత్సరములు గడచుటనుబట్టి, అప్పుడు జరుపబడు రజతోత్సవమునకు ముందుగా, కొన్ని చక్కని నిర్ణీతనూతన పద్ధతులపై, బ్యాంకు వ్యాపారాభివృద్ధికిగాను, "ఐదు సంవత్సరముల ప్లాను" సూచింపబడి, దానిని విజయవంతముగ నెరవేర్చుటకుగాను మేనేజర్ల సహకారము అర్థింపబడెను. గతసంవత్సరమునందు బ్యాంకుగాంచిన యాభివృద్ధిని, క్రిందటిసంవత్సరములలో జరిగిన పనితో పోల్చి చూడగా, 1933 సంవత్సరమున సదరుప్లాను నిర్వహణమునకై తలచినదానికంటె యెక్కువ తృప్తికరమగు అభివృద్ధి గలిగినదని గమనించుటకు మేము మిక్కిలి ముదమొందుచున్నాము."

## అభివృద్ధి సూచనపట్టిక.

| సంవత్సరము | మూలధనము | | మూలనిధి | డిపాజిట్లు | నగదు నిల్వ | జి. పి. నోట్లు వగయిరామీద పెట్టుబడి | మొత్తము వ్యాపార మూలధనము |
|---|---|---|---|---|---|---|---|
| | అనుమతిపొందిన జారీ చేయబడిన | చెల్లించిన | | | | | |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| 1912 | 2,00,000 | 13,000 | | 19,000 | 211 | | 33,000 |
| 1917 | 2,00,000 | 59,000 | 3,000 | 1,10,000 | 500 | | 1,87,000 |
| 1922 | 10,00,000 | 2,60,000 | 24,000 | 3,75,000 | 15,000 | 14,000 | 7,17,000 |
| 1927 | 10,00,000 | 3,02,000 | 1,10,000 | 9,27,000 | 1,07,000 | 68,000 | 15,27,000 |
| 1932 | 10,00,000 | 4,22,000 | 2,00,000 | 36,69,000 | 5,86,000 | 4,30,000 | 58,18,000 |
| 1933 | 50,00,000 | 5,20,000 | 2,20,000 | 58,33,000 | 8,37,000 | 10,46,000 | 86,02,000 |

దీనినిబట్టి, గతసంవత్సరమునందు డిపాజిట్లలోని యభివృద్ధి, క్రిందటి 5 సం॥లనాటి యభివృద్ధికంటె ఎక్కువ తృప్తికరముగ నుండినట్లు గోచరించును. ఈబ్యాంకు, అనేకములయిన బ్రాంచీలతోను, యితరమార్గములతోను, అన్నివిధములయిన బ్యాంకింగు సౌకర్యము లొసంగుటకుగాను తగినశక్తి గలదై యున్నది.

**కే. యం. యీపెన్, ఎం. ఏ., బి. యల్.** కార్యదర్శి.

కావున నే మతమయినను భక్తి గలిగియున్న శ్రేయోదాయకమే. కావుననే హిందుమతములలోని కితరులను జేర్చుకొనుట యనుసంప్రదాయము హిందూమతధర్మమై యుండలేదు. ఏమతములలోనివారామతముల సిద్ధాంతములకు లోఁబడి నడచుకొనుచు స్వేచ్ఛావశులై ఖేదమోదములపాలు కాకుండుఁడు. దేహము నాత్మగా భావించి కించిజ్జ్ఞులై శోకమోహములకును, క్షుత్పిపాసలకును, జరామరణములకును మీ జీవయాత్రల నర్పింపకుఁడు అనుటయే హిందూమతసంప్రదాయము.

మనభరతఖండమునఁ బూర్వరాజులను ధర్మరాజాదులు పరరాజులను జయించియు నక్కడివారినే వినీతులుగఁ జేసి యాయా రాజ్యముల నిల్పి వచ్చి రనునట్టి కథలు పురాణములలో వేనవేలు కలవు.

మనహిందూమతము సైతము సర్వమతజననివలె నెల్లమతముల యభివృద్ధిని, విహితధర్మానుష్ఠానమును ప్రేమించును. ఈయంశం బితర మతములవారికి దుర్బోధలు చేసి తనలోఁ జేర్చికొనుడని శ్రుతిస్మృతి పురాణాదులు చెప్పకుండుటచేతనే బోధపడుచున్నది.

ఎల్లమతములు నేదో గొప్పవస్తువునుగూర్చి మానవులభావములను ప్రయాణముచేయించుచునే యున్నవి. అట్టియాత్రికుల యంతఃకరణములలో భక్తికి తావు లేకపోలేదు. అట్టిభక్తినే ముక్తికి యుక్తిగా వేదవేదాంతము లధికారానురూపముగ బోధించెడి. కాన ఇతరమతములో వంశకులపారంపర్యక్రమాగతముగఁ జేరియుండెడి వారిని వారిమతములు చెరచి తనలోనికి రమ్మనవలసిన యావశ్యకత మంచిమతములకేల?

మతధర్మమును వాసనచూచి యెఱుఁగనివాండ్రయ్యును తిండికోసమో, డబ్బుకోసమో మతములలోఁ జేరి సంఖ్యను బెంచి మతగౌరవమును సభలలోని కెక్కించెడి చెడుసంప్రదాయము నెన్నఁడును మంచిమతము కోరకుండుఁగాత! కాలప్రభావమునఁ గల్గెడి యశ్రద్ధ మతములలోఁ జేరునప్పు డెల్లమతములవారలు నొక్కరూపయని విజ్ఞులు తలంతురుగాత. స్వాభిమానములను బోఁగొట్టు ధర్మశ్రద్ధ భక్తివిశ్వాసములతో లోకమున నల్లుకొనుఁగాత. భక్తుఁడై సుజనుఁడైనవాఁడు ఏమతమువాఁడైనను బూజ్యుఁడె. అజ్ఞులకు మతాంతర రుచిచే బుద్ధిభేదము గల్గకుండుటకు పరమతము పెద్ద బాహ్యపూజ మానినను దోషముకాదు.

---

## అ భ య ము

కొంపెల్ల జనార్దనరావు

నావిముగ్ధైకశిఖము క్రొందళుకుపోక
 వ్రీల చఱచిన అలహాసజ్వాలిక నను
జార్చుకొన్నది నీపదచ్ఛవుల, నీదు
అభయహస్తమ్మునీడల నక్షితెఱవ.
ఒకక్షణాదాగతము పునరుత్థగగన
చకితగతిమద్విహారకౌతుకము నీదు
అభయహస్తమ్ము చలువఊర్పయి మెలంగు
టిది అవశ్యము నీకు జ్ఞాపితమొనర్తు.
అగును మఱి యేలొ పౌనరుక్త్యమిటు?-కాని
నీఅభయహస్త మిపుడు సంచితసమర్చము:—
అంత, 'బ్రదు'కన్నదొకటి పరాస్తసకల
పూజ్యమని నాచెవుల రొదపుత్తు వీవు.

---

# సంస్కృతనాటకము-ఉత్పత్తివిచారము

సరసకవితాధురీణ, కపిస్థలం కృష్ణమాచార్యులు, బి. ఏ., యల్. టి.

సంస్కృతనాటకవికాసముయొక్క ప్రాథమికావస్థలు మనకు గోచరించుటలేదు. కాఁబట్టి, సంస్కృత నాటకముయొక్క విశ్వసనీయమైన యుత్పత్తిని విమర్శించు ప్రయత్నము లూహలతో నిండియుండవలసిన దే. ప్రస్తుతము మనకు లభించియుండు నాటకములలో మిక్కిలి పురాతనమైనవి అశ్వఘోషుని నాటకముల ఖండములు, భాసుని నాటకములును. ఇవి నిర్ణయమగు నొక పరిపక్వదశను సూచించుచున్నవి. కావున, ఇంతకుఁ బూర్వము కొన్ని శతాబ్దములనుండి యాకళ వికాసము చెందుచువచ్చిన దని యూహింపవలసియున్నది. ఆ కాలములలో నది యెట్లుండినదో, ఇప్పుడు నిర్ణయించు టసాధ్యము. యవన ( Greek ) నాటకసాదృశ్యము ననుసరించి యనేకప్రాక్పండితులు సంస్కృత నాటకచరిత్రమును దాని యాదినుండి నిర్మింప యత్నించిరి. కాని, ఇంతవరకును వారిప్రయత్నములు నిరాక్షేపణీయములగు ఫలితములను కలిగింపలేదు. సంభాషణల రూపమునఁగాని, స్వగతములరూపమునఁగాని యుండు ఋగ్వేదములోని యనేకసూక్తములకును యవనుల Mystery Plays కును సాదృశ్య మున్నదని యీ పండితులలో ననేకుల యభిప్రాయము. ఈయభిప్రాయమునాధారముగ నుంచికొని వీరు సంస్కృతనాటకోత్పత్తిని గూర్చిన తమ వాదములను సూత్రీకరించిరి. వీరియనంతరము సుప్రసిద్ధుఁ డగు ప్రతిరచయితయును వీరి వాదములను పూర్ణముగ విసర్జించి, తనవాదములను నెలకొల్పెను. లేదా, వీరివాదములను చాలవరకు మార్చెను.

వేదసూక్తము లన్నియును మతమునకు సంబంధించియుండవలయు నను నియమము లేదని యీవిమర్శకులలో ననేకులు గ్రహించినట్లు తోఁచుటలేదు. నాటకమునకు మతసంబంధమైన యుత్పత్తిని స్థాపించి, దానిని వేదసూక్తములలో గుర్తించు నాత్రమున, ఈ సూక్తములలో కొన్ని లౌకికము కావచ్చు నని వీరు విశ్వసింపకున్నారు. విశ్వామిత్రసూక్తము (III 33), వసిష్ఠసూక్తము (VII 33), మండూకసూక్తము (VII ౧౦౩), ద్యూతకరసూక్తము (X ౩౪) మొదలగునవి లౌకికము కాకున్న మరేమి? మతమునకు సంబంధించిన సూక్తములలో దాదాపుగ నన్నిటి నేదో క్రతుక్రియార్థ ముపయోగించి, పిమ్మట క్రతుక్రియా వాఙ్మయము లౌకికసూక్తములను విసర్జించినది. పూర్వపు ఋషులు కొన్ని ఋగ్వేదసూక్తములను లౌకికము లని భావించిరనుట కిదియే నిదర్శనము. సంభాషణగాని, స్వగతముగాని ఋగ్వేదకవుల రచనభేదము. ఇది యెల్లప్పుడును మతమునకు సంబంధించి యుండదు. ఇది యేదో యొకవిధమున పురాణయుగమువరకుండి, పిదప నాటకమున పరిపక్వదశను గాంచినది.

మరికొందరు పండితులు Indo-Germanicతెగల సస్యాభివర్ధకక్రతువుల ( Fertility rites ) వంటివానిలో గీర్వాణనాటకోత్పత్తిని గుర్తించి, మండూకసూక్తమువంటి కేవలాపహాసిక సూక్తములలో వర్షాకర్షకాది క్రతువులను ( rain charm etc. ) చూచుచున్నారు. వీరి వాదములింతవర కెల్లర యామోదమును బడయకున్నను, ఇవి

తుదకు సంభాషణసూక్తములలో Vedic Mysteries ను గుర్తించువారి వాదములకంటె దృఢమైనవి.

ఇంక కొందరు దేశములోని ప్రాచీనవాఙ్మయమును పరిశీలించి నాటకపుబీజముల నందు గుర్తించు నవసరము లేక, సంస్కృతనాటకమునకు యవనోత్పత్తిని సుఖముగ నాపాదించుచున్నారు. అంకవిభజనము, వస్తునియమము (Unity of action), అభియోగము (Central conflict) వంటివి యవననాటకములకును, భారతీయ నాటకములకును కొన్నిపోలికలు లేకపోలేదు. కాని, బలవత్తరము లైన యసాదృశ్యాంశము లనేకము లున్నవి. యవనకవుల Tragedy సంస్కృతకవులకు తెలియనే తెలియదు. అట్లననేల ?—Tragedy కిని సంస్కృతకవులకును సరిపడదు. ఖేదము నాయకుని పక్షమున నుండునప్పుడు తప్ప, ఒకనాటకము ఖేదాంతమగుటవలననే యది Tragedy కానేరదు. సనాతనధర్మమును బోధించుటకు తమ నాటకము నుద్దేశించు సంస్కృతకవులు సజ్జనుల కపజయమును, దుర్జనులకు విజయమును గలుగుట నూహింపలేదు. కాబట్టి, భాసుని 'ఊరుభంగము' వంటి నాటకములు కొన్ని యప్పుడప్పుడు ఖేదాంతము లైనను, ఖేద మెల్లప్పుడును ప్రతినాయకునిపక్షమున నుండునట్లు వారు జాగ్రత్తగ చూచికొనిరి. అందువలన నిజముగ నంతమున నాయకుని కానందమే. యవనుల కాలనియమము, స్థాననియమము (Unities of time and place) సంస్కృత నాటకమున లేవు. మరియు, సంస్కృత నాటకములలో ప్రాకృతభాష నుపయోగించు వాడుకవంటిది, యవన నాటకములలో లేదు. సంస్కృతనాటకములలోని ప్రస్తావనకును, యవననాటకములలోని Prologue కును సాదృశ్యము లేదు.

కథనము, గానము, నృత్యము, అభినయము మొదలగునవి తన వాఙ్మయమునందే యుండవానిని మేళవించి, నాటకమును ప్రభవింపజేయుట కేదేశమును పరదేశముల ప్రోద్బలమును ప్రతీక్షించు చుండదు. యవనసంయోగము నాటకమును కొంత యలంకరించి యుండవచ్చును. కాని, అది యే యలంకారమునకు హేతుభూత మైనదో నిర్ణయింపలేము.

మరి, ఏండ్లకొలందిగ వేరువేరుగ నివసించు చున్నను, ఒకేమూలమున జనించిన రెండుజాతులవారికి తమ యభివృద్ధిలో నేదశయందును నొకరినుండి యొకరు గ్రహింపకయే, సాదృశ్యము గల పరిస్థితులలో తమతమ నాటకముల నుద్భవింపజేసికొన నసాధ్యము కాకపోవచ్చును. వారినాటకములయం దచ్చటచ్చటి సాదృశ్యములతోకూడ ముఖ్యము లగు భేదము లుండుట కిదియే కారణ మేమో.

భరతుని నాట్యశాస్త్రమున నాటకోత్పత్తినిగూర్చి వింతమైన యైతిహ్య మొకటి కానవచ్చుచున్నది. మనకు ప్రస్తుతము లభించియుండు నాట్యశాస్త్ర మట్టి శాస్త్రములలో మొట్టమొదటిది కాదు. ఏలనన: అం దచ్చటచ్చట శ్లోకచ్ఛందమునంగాని, ఆర్యాచ్ఛందమునంగాని యుండునట్టి యనువంశ్యసూత్రములును, సూత్రానుబద్ధమునుండి యావిషయమునకు సంబంధించిన కొన్నిసూత్రములును నుదాహరింపఁబడియున్నవి. అం దప్పుడప్పు డూరక 'కేచిత్'అని యితరరచయితలుకూడ సూచింపఁబడియున్నారు. ప్రస్తుతము మనకు లభించియుండు గ్రంథము భరతుని మూలగ్రంథమునకు సంగ్రహమగుటవలన, దీనిలో నుదాహరింపఁబడియుండు సూత్రములు మూలములోనివి కావచ్చును; కాకున్న, పాణిని యుదాహరించిన శిలాలి, కృశాశ్వుఁడు-వీరి నటసూత్రములవంటి సూత్రముల నవి సూచింపవచ్చును. ఈవిషయమున తగిన యాధారములు లేకుండుటవలన మన యూహలీయెడలలో నిరాక్షేపణీయములు కానేరవు.

ఇంక మన మాయైతిహ్యమును పరిశీలింతము. నాలుగువేదములును త్రైవర్ణ్యులకే సంబంధించియుండుటవలన, దేవత లందరును నింద్రపురస్సరముగ బ్రహ్మకడకుఁ జని,నాల్గవవర్ణమునకుఁ జేరినవారుకూడ నుపయోగింపఁదగినదియు, మనోహరమును బోధకమును నగు

నదియు నగు నొక పంచమవేదమును సృష్టింపుమని యతనిని ప్రార్థించిరి. బ్రహ్మ ప్రసన్నుఁడై నాట్యవేదమును సృష్టించెను. దానిని సృష్టించుట కతఁడు ఋగ్వేదమునుండి కథనమును, సామవేదమునుండి గానమును, యజుర్వేదమునుండి నృత్యమును, అథర్వణవేదమునుండి రసములను గ్రహించెను.

> "జగ్రాహ పాఠ్య మృగ్వేదా త్సామభ్యో గీతమేవచ,
> యజుర్వేదా దభినయాన్ రసా నాథర్వణాదపి."

అతఁడు నాట్యవేదమును రాఁగల తరతరములవారి యౌన్నత్యమునకు సాధనముగ నుద్దేశించెను. దాని నతఁడు భరతమహామునికి బోధించి, ఇంద్రుని ధ్వజమహోత్సవసందర్భమున నొక ప్రదర్శనమువలన దేవతలను సంతోషపెట్టు మని యతనిని నియమించెను. ఆ ప్రదర్శనమున కితివృత్త మసురపరాజయము. కాఁబట్టి, అసురులు కోపించి విఘ్నము లొనరించిరి. రంగముమీఁది నటకులు తమతమపాత్రములను మరచిరి; వారికి నోట మాట రాకుండెను. కాలు సేతులు కదలకుండెను. వారు రంగమున చేష్టలుదక్కి నిలిచిరి. అప్పు డింద్రుఁడు విఘ్నకారుల నణఁచి, శాంతి నెలకొల్పెను. పిమ్మట దేవతలు బ్రహ్మపాలికి జని, అసురు లొనర్చిన విఘ్నముల నతనికి విన్నవించిరి. బ్రహ్మ తోడనే విశ్వకర్మను రావించి యొక నాట్యమందిరమును నిర్మింపుమనెను. అది నిర్మింపఁబడిన యనంతరము దేవత లందరును సాధ్యమైనంతవరకు దానిని రక్షింపవలసియుండెను.

తమప్రయత్నములన్నియు నిట్లు నిష్ఫలమగుటఁ జూచి, విఘ్నకారుల నాయకుఁ డగు విరూపాక్షుఁడు దేవతలకువలె తమకుఁగూడ మూలపురుషుఁడగు బ్రహ్మ యెల్లప్పుడును దేవతలయెడ పక్షపాతము వహించి యుండునని బ్రహ్మను నిందింపసాగెను. బ్రహ్మకునింద సమంజసమేయని తోఁచెను. వెంటనే యతఁడుకోపపడియుండు తనబిడ్డలను శాంతి పరుపఁదలఁచి, ఈ విధమున వారికి సంధిచేసెను: నాటకరంగమున దేవతలగుతివృత్తములేకాక, అసురులు, నృపులు, బ్రహ్మర్షులు వీరి యితివృత్తములుగూడ ప్రదర్శింపఁబడవలయు ననియు, అవి ప్రపంచౌన్నత్యమునకు సాధనములుగ నుండవలయు ననియు శాసించెను.

> "లోకోపదేశజననం...............
> దేవానా మసురాణాంచ రాజ్ఞోలోకస్యచైవహి,
> బ్రహ్మర్షీణాంచ విజ్ఞేయం నాట్యం వృత్తాంతదర్శకమ్."

అదియునుగాక, తాను సృష్టించిన నాట్యవేదము దేవతలతోకూడ అసురులును, మానవులును సమానముగ ననుభవింపఁ దగినదనియు స్పష్టము చేసెను. నాట్యశాస్త్రమునకు సమస్త శాస్త్రములును, కళలును పనికివచ్చుటవలన, దాని కుపయోగపడని యే శాస్త్రము గాని, కళగాని తనపేరునకు తగదనియు చెప్పెను.

> "నతచ్ఛ్రుతం నత చ్ఛిల్పం నసా విద్యా నసా కలా,
> నాసౌ యోగో నతత్కర్మ యన్నాట్యేస్మి న్నదృశ్యతే."

అప్పు డసురులు తృప్తిపడిరి. నాట్యమందిరముతో సంపూర్ణముగ వికాసము నొందిన నాటకము వాడుకకువచ్చినది.

ఇది యేదో కల్పితమని యీయైతిహ్యమును సులభముగ విసర్జింపరాదు. సాధారణముగ నైతిహ్యములలో చారిత్రకములగు సత్యములు కొన్ని యంతర్గతములై యుండును. ఆసత్యములను విమర్శించి వెలికీయుట కొన్ని సందర్భములం దసాధ్యముగనుండును. ఈయైతిహ్యమున నాటకవికాసమును గూర్చిన చారిత్రకసత్యములు కొన్నియున్నట్లు నాకుఁ దోఁచుచున్నది. వానిని క్రింద వ్రాయుచున్నాను.

ఋగ్వేద సూక్తములు ముఖ్యముగ పఠించుట కుద్దేశింపఁబడి యుండుటవలన నావేదము కథనవేదము. సామవేదసూక్తములు గానముచేయఁదగిన వగుటవలన నావేదము గానవేదము. యజుర్వేదమున కొన్నియెడల పురోహితులు దేవతలపాత్రములను ధరింపవలసియుండు నట్లు తెలియుచున్నది. నేఁటికిని, పితృశ్రాద్ధములు చేయుటయందు మనలో నిట్టి యభినయము వాడుకలో నున్నది. కాఁబట్టి, అభినయము మొట్టమొదట యజుర్వేదమునుండి వాడుకకువచ్చినది.

మరియు, మన శ్రాద్ధకర్మలు వేదకాలమునుండి యీకాలమువరకును విరామములేక వచ్చుచున్నవని పండితు లొప్పుకొనియున్నారు. కావున, అభినయము యజుర్వేదమునుండి వాడుకకు వచ్చినదని మన మూహింపవచ్చును.

అథర్వణవేదము మంత్రతంత్రాదిసూక్తములతో దాదాపు నిండియున్నది. మంత్రతంత్రాదులకును ప్రేమ, భయము, కోపము, ద్వేషము, జుగుప్స, కరుణ మొదలగు భావములకును పరస్పరసంబంధ మున్నది. రంగమున ప్రదర్శింపఁబడునట్టి యీభావములయెడఁ గలుగు పురుషభేదములులేని ప్రత్యేకాభిరుచియే రసము. కాఁబట్టి నాటకమునందలి రసము లథర్వణవేదమునుండి గ్రహింపఁబడియుండవచ్చును.

కథనము, గానము, నృత్యము, అభినయము మొదలగువానిని నాలుగువేదములనుండి యవి యుద్భవించినక్రమమును చూచినయెడల నాటకము క్రమక్రమముగ వికాసమునొందినదని తోఁపఁగలదు. వేదములు సహితము క్రమముగ నుద్భవించినవని సూచించు గూఢార్థముగల భాగము లందందు వేదవాఙ్మయమున కనుపట్టుచున్నవి.

"ఋచ స్సామాని జజ్ఞిరే . "
"యజు స్తస్మా దజాయత."

కావున, నాటకము మొట్టమొదట మనపౌరాణికములలోని కథనమువలె నుండినదని యూహింపసాహసించుచున్నాను. తదనంతరమందు గానము ప్రవేశించి యుండును. అప్పుడు మన హరికథాభాగవతములవంటివి పుట్టియుండును. కొంతకాల మైనపిదప దానియం దభినయము కలసియుండును. అప్పుడు నాటకము మనజాతరలు, వీధినాటకములు మొదలగువానివంటిదై యుండియుండును. రసము వికాసమునొందినప్పటినుండి కావ్యముయొక్క యాత్మ గోచరింపసాగినది. సర్వాంగసుందరమగు నాటక మాకాలమునుండియే పరిపక్వము కాఁదొడఁగెను.

ఋగ్వేదములోని నైతిహ్యమునందలి దేవతలును, రాక్షసులును రసికలోకమును, పామరలోకమును సూచించుచున్నట్లున్నది. రసము నాటకమున కాత్మవంటి దని గ్రహించుటకుపూర్వము నాటకప్రదర్శనములు వీధినాటక మాడినట్లుండియుండును. అప్పుడు రంగమని యొకటి యుండలేదు; మనవీధినాటకముల రంగమట్లె బయలైనను రంగ మగుచుండెడిది. రసమును కనుఁగొనినప్పటినుండి రసికులు కొందరు నాటకము నభివృద్ధిపరచి, దానిని తమవశము గావించికొనియుందురు. సహజముగ పామరులు కోపపడి వారి ప్రదర్శనములకు విఘ్నములొనరించియుందురు. కాఁబట్టి, రసికు లావరణముల యావశ్యకత నెరిఁగి నాట్యమందిరములను నిర్మించిరి; తమకిష్టమువచ్చినవారినే యందు ప్రవేశపెట్టుచుండిరి. చేయునదిలేక విఘ్నకారులు వారితో సంధి చేసికొనిరి. పిమ్మట పామరులును నప్పుడప్పుడు ప్రవేశింపఁదగిన సార్వజనీననాట్యమందిరములు వాడుకకు వచ్చినవి.

ఇట్లు నాటకము రెండువిధములుగ నభివృద్ధిచెందినది: రసికులది, పామరులది అని. పామరుల నాటకము, తన స్వభావములతో వీధినాటకములరూపమున నేఁటివరకును నిలిచియున్నను, రసికుల భాణము, అంకము, వీధి మొదలగువానికి హేతుభూతమైనట్లు తోఁచుచున్నది. రసికుల నాటకము సర్వవిధముల నభివృద్ధిచెందుచు నాటకను, నాటిక, ప్రకరణము మొదలగువానికి కారణమైనది.

నాట్యశాస్త్రములలోని నైతిహ్యమునుండి గ్రహింపఁదగిన దింతియే. ఈవిధముగ నాట్యశాస్త్రము సంస్కృతనాటకోత్పత్తివికాసముల కానుషంగికసాక్ష్యమొకటి యిచ్చునట్లు తోఁచుచున్నది. అయినను, ఆశాస్త్రమే యతిపురాతనము గాకుండుటవలన నీవిషయమున నది సాక్షాత్సాక్ష్య మీయఁజాలదు. దశవిధనాటక ముద్భవించిన చాలకాలమునకు నాట్యశాస్త్రము జనించినది. నాట్యశాస్త్రమునందు కొంతవిపులముగ చర్చింపఁబడియుండు రసములు, వృత్తులు, సంధులు

నభివృద్ధిగాంచినయనంతరము దశవిధరూపకములు జనించినవని వానినుండి తెలియుచున్నది. నాట్యశాస్త్రము యొక్క కాల మెద్దియైయుండవచ్చును?

నాట్యశాస్త్రమున నలంకారశాస్త్రము బీజావస్థయం దున్నది. ఉపమ, దీపకము, రూపకము, యమకము అని యలంకారములు నాలుగువిధములనియం దున్నది.

"ఉపమా దీపకంచైవ రూపకం యమకం తథా;
కావ్యస్యై తే హ్యలంకారా శ్చత్వారః పరికీర్తితాః."

అందు ఉపమాలంకారము బాగుగ చర్చింపఁబడలేదు. అయినను, యమకము శాస్త్రసమ్మత మగు విధమున నే చర్చింపఁబడియున్నది. అర్థాలంకారములకును శబ్దాలంకారములకును భేదమున్నట్లు దానినుండి తెలియుటలేదు. ప్రస్తుతము మనకుఁ దెలిసియుండునట్టి యాలంకారికులలో మొదటివాఁడు భామహుఁడు. అతఁడలంకారములను నాట్యశాస్త్రమునకంటె విపులముగ చర్చించియున్నాఁడు. కాఁబట్టి, నాట్యశాస్త్రమునుండి భామహునివర కలంకారశాస్త్రము కొన్ని శతాబ్దము లభివృద్ధి చెందిన దని మన మంగీకరింపవలయును. భామహుఁడు క్రీ. శ. ౫-వ శతాబ్దమువాఁడని పండితుల యభిప్రాయము. కావున నాట్యశాస్త్రము సుమారు క్రీ. శ. 3-వ లేక ౨-వ శతాబ్దమునాఁటిదై యుండును.

క్రీ. శ. ఆరంభములయందు నాటకము పరిపూర్ణముగ నభివృద్ధి చెందియుండెనేని, నాటకవికాసావస్థలను నిర్ణయింప నుపయోగపడఁగల సాక్షాత్సాక్ష్యము నాట్యశాస్త్రమునఁగాక మరియెందైనను లభింపఁగలదు. అశ్వఘోషుని నాటకములఖండములయందును, భాసుని నాటకములయందును గల యభివృద్ధిని నాట్యకళ కాంచుటకు కొన్ని శతాబ్దములు పట్టియుండునని వానినుండి పూర్వమే గ్రహించియున్నాము గదా.

'హేతుమచ్చ' (III-౧-౨౬) అను పాణినీయ సూత్రమును విమర్శించునెడ, పతంజలి యతిపురాతనమగు విషయమును తెలుపుటకు వర్తమానము నుపయోగించుటలోని సామంజస్యమును చర్చించుచు, శౌభికులు, గ్రంథికులును ప్రేక్షకుల సమక్షమున నప్పుడే జరిగినట్లు 'బలిబంధనము', 'కంసనాశనము' ప్రదర్శించుట నుదాహరించి యున్నాఁడు (మహాభాష్యము III ౧). శౌభికులు మూకప్రదర్శనముల (Pantomimes) లోని నటకులనియు, గ్రంథికులు వేషధారు లగు కథకు లనియు కొందరు పండితుల యభిప్రాయము. కొందరు పండితులు శౌభికులు మూకప్రదర్శనములను ప్రేక్షకులకు విశదీకరించెడివారనియు, గ్రంథికులు వట్టి కథకులనియు ననెదరు. అయినను, వసుదేవునిపక్షపువారుగను, కంసునిపక్షపువారుగను అభినయము చేయుటకై గ్రంథికులు తమ ముఖములకు వర్ణములు పూసికొనుటను పతంజలియే వర్ణించియున్నాఁడు. కాఁబట్టి గ్రంథికులు నటకు లనుట నిస్సంశయము. పతంజలికాలమున నొకవిధమగు నాటకమును, నటకులసంఘములును నుండినవని యిందొక సాక్షాత్సాక్ష్య మగపడుచున్నది. దీనితో పాణిని యుదాహరించిన నటసూత్రములను కలిపినయెడల, నాటకము క్రీ. పూ. ౫-వ శతాబ్దమునాఁటిదని తేలుచున్నది. ఇంతకంటె తగిన యాధారములు లేకుండుటవలన ప్రస్తుతము మన మింతటితో తృప్తిపడవలసినదే.

కాళిదాసుఁడు, శ్రీహర్షుఁడు, భవభూతి వీరినాటకములలో నైతిహ్యము మరియొకటి కానవచ్చుచున్నది. వీరి నాటకములలో కొన్నిటియందు స్త్రీలు ప్రదర్శించిన యంతర్నాటకము లున్నవి. విక్రమోర్వశీయములో ఊర్వశిమొదలైన యప్సరోవనిత లింద్రసభలో 'లక్ష్మీస్వయంవరము' అనునాటకమును ప్రదర్శించిరి. ప్రియదర్శికలో వాసవదత్తయొక్క చెలులు 'ఉదయనచరితము' అనునాటకమును ప్రదర్శించి యామెను సంతోషపెట్టిరి. ఉత్తరరామచరితములో, వాల్మీకి తన యతిథుల యెదుట సీతాపరిత్యాగము మొదలుగల కథను ప్రదర్శింపఁజేసెను. ఇయ్యెడలలో స్త్రీలే పాత్రములను ధరించిరి. ఈవాడుక తుద కంతఃపురములలోనైన నుండకుండిన దీని నీకవులు తమనాటకములలో చేర్చియుండరు. స్త్రీలు నాటకమాడరా దను దురభిమాన మాకాల

ములలో నుండినది. అట్లుండియు, రాణివాసపు స్త్రీలేల యానిందలపాలు గాలేదు? అంతఃపురమున నాటకమేదేని ప్రదర్శింపమని వారినాథులేల వారిని ప్రోత్సహించుచుండిరి?

నాటకముయొక్క ప్రాథమికావస్థలలో నాటకములయందు స్త్రీపురుషులు ధారాళముగ పాల్గొనుచుండిన ట్లున్నది. ఈదురభిమాన మాకాలమందే యుండినదని నానమ్మకము. ఈనమ్మకమును 'ప్రస్తావన'కొంత బలపరచుచున్నది. రంగమున స్త్రీపురుషులు కలసిమెలసి యుండుటవలన ముఖ్యముగ స్త్రీలు చెడుట సహజమే. 'జాయాజీవాః'అనుపేరు నటకుల కర్థముతోడనే పెట్టియుందురు. స్త్రీలప్పటినుండి నాటకమాడుట మానిరి. ఆదురభిమానమును మాయమయ్యెను. పూర్వకాలపు బౌద్ధసన్యాసులును, జైనసన్యాసులును తమవారు నాటకములకుఁ బోరాదని నియమించికొనుటకును, వారియనంతరముండిన అశ్వఘోషుఁడు మొదలగు సన్యాసులు నాటకములను తమ మతధర్మములను ప్రచారము చేయుట కుపయోగించుటకును నిదియే కారణము.

అంతఃపురములందువలె స్త్రీలే యన్నిపాత్రలను ధరించినప్పు డాదురభిమాన ముండుటకు హేతువు లేదు. రాణివాసపు స్త్రీల యధీనమందుండినప్పుడు నాటకము వారిచే కొంతపెంపొందింపఁబడియుండుట సుసాధ్యమే. దీనికొరకే, నాటకకర్తలైన యాస్థానకవులు తమ నాటకములను, పట్టణములలోను, నగరములలోను గల నాట్యమందిరములయందు ప్రదర్శించుటకు పూర్వము అంతఃపురములలో ప్రదర్శింపఁజేయుచుండిరేమో. (సికలోకపు నాటక మిట్లు కాళిదాసభవభూత్యాదిమహాకవుల నాటకములలో పరిపక్వమైయుండవచ్చునుగదా.

---

# కార్తీక పౌర్ణమి

చావలి బంగారమ్మ

పక్షుల్లు పలుకకే పడియుండినాయి
వృక్షాలు చూచుచూ వూరకున్నాయి
తనవెంట బడుచున్న
తరుణి చూడడి దేమి
పోవుచున్నాడు తాను
అదు గదుగో
పొంగు లోకాలు గనను.

గాలివుయ్యాలలై కదలుచుండెడి మబ్బు
కనుల కడ్డము రాగ కాలైనతడబడక
పోవుచున్నాడు తాను
తన గర్వ
పొంకములు దెలుపుతూను.

వాద్యములు వినబడవా చోద్యములు కన
బడవా
నిముసంబు నిలువ డేనీడనిలుచునో గాని
పోవుచున్నాడు తాను
గర్వంపు
పొంగు బోకారిపోను.

పక్షికలకలములే పరిభవంబని యెంచి
తెల్ల బోయినమోము తెలియకుండుటకునై
పోవుచున్నాడు తాను
తనువెల్ల
తారుమారగుటచేను.

---

# ఉపాధ్యాయుఁడు - జాతీయత

తిరుమల రంగాచార్యులు

వర్తమానకాలమున ‘జాతీయత’ అనుపదమును మఱి మఱిదిన మును వినుచునేయున్నాము. ఉపాధ్యాయునికిని జాతీయత కును గల సన్నిహితసంబంధమును జర్చించుటయే యీవ్యాసము ముఖ్యోద్దేశము.

ఉపాధ్యాయుఁ డనుపదమునుగూర్చి మొదటఁ జర్చింతము: ఈపద మిపుడు ‘అ ఆ’ తిద్దించుట అయ్యవారు మొదలుకొని అధ్యాప కులవఱకు నంటఁటిచే నుపయోగింపఁబడుచున్నది. కాని అమర కారుఁడు “ఉపాధ్యాయోధ్యాపకోఽథ స్యాన్నిషేకాదికృద్గురుః, మంత్రవ్యాఖ్యాకృదాచార్యః—” అన్నాఁడు. క్షీరస్వామి వ్యాఖ్యా నము చేయుచు “ఉపేత్య అధీయతే అస్మాత్ ఇతి ఉపాధ్యాయః” (ఈతని సమీపించి యధ్యయనము చేయుగురు. “అధ్యాపయతి ఇతి అధ్యాపకః” (అధ్యయనముచేయించువాఁడు) నిషేక + ఆదికృత్, నిషేకము, సీమంతము మున్నగునవి చేయించువాఁడు) గురుః, వ్యుత్ప త్తి: గృణాతి ఉపదిశతి గాయత్ర్యాదికం గురుః—మంత్రవ్యాఖ్యా కృత్ (కల్పసూత్రాదిసహితమైన వేదము నధ్యయనము చేయించి తద ర్థమును వ్యాఖ్యానము చేయువాఁడు) ఆచార్యుఁడు. వ్యు: ఆచారం గ్రాహయతీతి ఆచార్యః మనువుకూడ “ఉపనీయతు యః పూర్వం వేద మధ్యాపయే ద్ద్విజః; సాంగంచ సరహస్యంచ త మాచార్యం విదు ర్బుధాః.” (ఉపనయనముచేసి శిక్షాద్యంగములతో వేదరహస్య మేవఁ డెవఁడెఱిగించునో యట్టిబ్రాహ్మణుఁ డాచార్యుఁడు) అని వచిం చెను. అధ్యయనమన వేదాధ్యయనమనుట ప్రసిద్ధమెకదా! ఇఙ్, ధాతువునుండి పుట్టినది ధాత్వర్థము నధ్యయనమే. కాన నుపాధ్యా యుఁడు, అధ్యాపకుఁడు, గురువు, ఆచార్యుఁడు అనుశబ్దములను సర్వసామాన్యముగ నందఱికి నుపయోగించు టెంతయొప్పో విజ్ఞు లాలోచింత్రు గాక!

ఇఁక నిపుడు చదువుచెప్పువారల కంతరములఁబట్టి ఆంగ్లభాషా పదములగు “టీచర్” “లెక్చరర్” అనునర్థమిచ్చు ‘బోధకుఁడు, ఉపన్యా సకుఁడు,’ అనుపదములు చక్కఁగా అన్వయించునని నాయూహ. ఇఁక వీరు చెప్పుచదువును, పద్ధతియును విజాతీయములే! పదిగంటలకే పదిమెతుకులు పండ్లతో నొక్కి విసవిస విద్యాశాలల కరుగుట, భోషప్రకారము పాఠము ముగిసినను ముగియకున్నను బయటికి వచ్చుట, పాఠశాలమూసియు మూయకముందే బ్యాటు గైకొని బంతులాడఁబరుగు లిడుట, పద్దుగ నెలజీతమును గైకొనుట, పంతులుగారికి పరిపాటి యైపోయినది. ఇంటిలోనివారి నేడిపించి కొందఱును, ఇల్లిల్లు తిరిగి యింతయొంగిర మెట్లో గడించి కొందఱును, వసతిగృహములలోని వంటలవారిపై స్వారీచేసి కొందఱును, అన్నముతిన్నశాస్త్రము చేసి పరుసులతోఁ బాతకాలచేరుట, ప్రక్కవారితోఁ బలుమఱు పకపకలు, పరియాచకములు, అయ్యవారిదృష్టి యటుత్రాలఁగనె యెలుకను మ్రిం గిన పిల్లివలె నుండుట, కడుపులోఁగాలుచుండుటచే కడపటిగంట గణగణయని యెపుడు మ్రోఁగునని వేచియుండుట, అదియు మ్రోఁగిన వెంటనే యక్లే లేచి యరుగుట, సాయంకాలము కాఁగనే యాటలకుఁ గొందఱును, పాటలకుఁ గొందఱును, బరువులిడుట, పరీక్షలలో దొంగిలినవికొన్ని, వెంగలివికొన్ని వింతవ్రాఁతలు వ్రాసి ౧౦౦ కి ౩౫ కొందఱును, మొత్తముపైఁ గొందఱును, మోసపురీతిని గొంద ఱును గుణములను సంపాదించి యుత్తీర్ణు లనిపించికొనుట విద్యార్థుల విద్దైపోయినది. “గంతకుఁ దగిన బొంత” యన్నట్లీవిద్యార్థులకు నాయయ్యవారలకు ముడి చక్కఁగాఁబడినది. జాతీయత సర్వతో ముఖముగ వికసించుటకు మూలకారణభూతులగు వీరిస్థితి యిట్లుండ నది సర్వాంగసౌష్ఠవముతో నెట్లు నిలుచును? ఏకొలఁదిమందియో తప్ప బోధకులందఱును విజాతీయవేషధారులే! కాని మహాత్మునిపుణ్య మా యన వీరిసంఖ్య క్రమక్రమముగఁ దగ్గిపోవుచున్నది. బాహ్యవేష ధారణము తగ్గుచున్నను భావవిజాతీయత్వముమాత్రము బాగుగ నాటి కొనిపోయినది. అనుకరణమే స్వభావముగఁ గల యర్భకులమాట చెప్పనేల? “రూపం తదోజస్వి తదేవవీర్యం తదేవ నైసర్గిక మున్న తత్వం” అన్నరీతిగ విద్యార్థులందఱు నచ్చముగ నయ్యవారలనే యాక ళింతకుఁ దెచ్చుచుందురు. ఆచార్య, అంతేవాసులస్థితి కడకు నేఁ డిట్లు పరిణమించినది.

జాతీయత యనిన నేమియో చర్చింతము. జాతీయత యన జాతీయునిస్వభావము, లేక కృత్యము. జాతికి సంబంధించినవాఁడు జాతీయుఁడు, లేక జాతికి హితుఁడు జాతీయుఁడు. జాతీయత యను పద మేజాతిపరముగ నుపయోగింపఁబడునో యాజాతీయత యని యర్థము. కాని మనజాతి దౌర్భాగ్యస్థితినిబట్టి యీవ్యాసాంశములు





1. పెదపాలెము ఆర్యబాలసమాజ గ్రంథాలయపు 28-వ వార్షికోత్సవము, అధ్యక్షులు. కా నాగేశ్వరరావు గారు.

2. గవర్నమెంటు ఇండియన్ మెడికల్ స్కూలు ఆంధ్రవిద్యార్థి సమాజము, కీలుపాకు





1 తిరువాంకూరు దివాను సర్ మహమ్మదు హబీబుల్లాగారికి లాల్దాసు గోవిందదాసుగారి విందు.

2. ఉత్తరహిందూదేశమున సంచారముచేయుటకై వెడలిన మదరాసు హిందీప్రచారకులకు వీడుకోలు.



విమోచనము
**(Redemption)**

— T. M. Subrahmanyam.







1 క్రికెట్టు యోధులకు మదరాసు కార్పొరేషనువారి సమ్మానము. 2 | చెన్ననగర కళాశాలల పోటీలో విజయముగాంచిన లయోలా కళాశాల ముష్టియుద్ధపు జట్టు.





1. జపానులో టెన్నోజీ ఉత్సవములు-భజన. 2. జపానులో ఆధునిక బౌద్ధ చిత్రములు.

మనకే యెక్కువగ నన్వయించుచున్నది. ఏలన, — ఒక్కొక్క జాతికి నొక్కొక్క రీతియైన వేషమును, భాషయును, ఆచారమును, వ్యవహారమును, సహజములై యుండును వీనినిబట్టియే యితఁ డీజాతివాఁడని క్రొత్తవారిని సామాన్యముగా సులభముగా గుర్తింపవచ్చును. దీనఁ గల్గు నుపయోగములుకూడఁ బెక్కులు మచ్చున కొకదృష్టాంతము విదేశములకుఁ బోయినవాఁ డొకఁ డచటఁ గడగండ్లఁ బడుచుండినపుడు తనదేశస్థుఁ డెవఁడైన నచటికి రాఁదటస్థించిన నతనిఁ గనుకొనుటకు జాతీయతకంటె వేఱుసాధన మున్నదా? అంతవఱకు నొకరిముఖము లొకరు చూచియున్నను స్వదేశ వేషభాషాదులు ప్రోత్సాహపఱచుచుండ నపు డాక్రొత్తవాఁడు నాఁడు నాపన్నునికిఁ జేతనైనంతసాయము చేయుఁగదా! పరిచితులైనచో నిఁకఁ జెప్పఁబనియేమి? జాతీయవేషధారికాని యెడల నపరిచితులఁ గూడ గుర్తింపఁ గష్టముగుచుండుట ప్రసిద్ధమే కదా!

కాన జాతీయత యనునది కాలానుగుణములైన మార్పులతోఁ గూడఁ జక్కఁగాఁ బోషింపఁదగినది మార్పులనుటలోని యభిప్రాయ మేమన, కాలప్రవాహమునఁబడి కొట్టుకొనిపోవునపుడు మంచిదైననుఁ జెడ్డదైనను గొన్నిమార్పులు కలిగియే తీరును కాని యుద్ధశాలలు జాతీయతామార్పులుకూడ దేశకల్యాణమునకై యుపయోగపడునట్లు చేయవలయు లేకున్న ముక్కుముదుఁ గీడుకల్గుటయేకాక జాతీయతకు మొదటికే మోసము వచ్చు. ఎవరిపైన జాతీయతాభివృద్ధియంతయు నాధారపడియుండునో యట్టివిద్యార్థులకు జాతీయజీవితశిక్షణ నొసఁగుచున్న బోధకుల బాధ్యత యెంతయెక్కువయో, వా రెంత మెలఁకువతో నుండవలయునో వేఱుగ వక్కాణింపనేల? విద్యార్థిజీవిత మంతయు విద్యాబోధకులపై నెక్కువగ నాధారపడియుండుఁగదా? అట్టియెడ బోధకుల జాతీయతాభిమానము పూర్ణానుస్వారమగుచో వారిమాటలే వేదవాక్యములుగను, వారినడవడియే యాదర్శముగను దలఁచు విద్యార్థులస్థితి విజాతీయముగనే యుండక తప్పదుగదా! ఇట్టి వీరు పెద్దవారైనను బాల్యదశనుండి పట్టువడిన విజాతీయత్వ మెట్లు విడువగలరు?

ప్రకృతకాలస్థితినిబట్టి ఉపాధ్యాయుఁడు, అధ్యాపకుఁడు, గురువు, ఆచార్యుఁ డనుపదముల నంతకు నన్వర్థముచేయ వీలు లేదు విద్యాశాల లన్నియు విజాతీయవిద్యాస్థానములగుటచే నందన్నియు నాదులకుఁ జోటెక్కడిది? ఉపాధ్యాయు లనఁబడువారు పెక్కండ్రు ప్రభుత్వముయొక్కయుఁ, దత్పద్ధతులనే తలచుగా ననుసరించు స్థానికసంఘములయొక్కయు, నితర ప్రత్యేకసంస్థలయొక్కయు యాజమాన్యమునకు లోఁబడియున్నారు. వేషధారణముగూర్చి కొన్నినియమములుగూడ నేర్పడియున్నవి. ఆనిబంధనములలోఁ గొన్ని విజాతీయవేషధారణమునకుఁ బ్రోత్సాహము నొసఁగుచున్నవికదా యనవచ్చు నిజమే కాని, యోగ్యమైనవేషము ధరింపవలెనని యానిబంధనలముఖ్యాభిప్రాయ మగుటచే జాతీయవేషధారణమున కవి యేమాత్ర మడ్డుతగులుట లేదు. ఐనను గొందఱు భావదాస్యమునకు లోనై విజాతీయవేషధారు లగుటచే నిబంధనము లెఱుంగనియితరులుకూడ వారినే యనుసరించుచున్నారు. అట్లు కాక బోధకులందఱు నియమముల యంతరార్థమునెఱిఁగి యైకమత్యముతో జాతీయవేషధారణము నొనర్చిన వేషధారణవిషయమున నైనను జాతీయతను నిల్పుకొనవచ్చును. ఇపుడిపుడు పునాదుల నేర్పఱచుకొనుచున్న దాక్షిణాత్యబోధకసంఘము, దానియుపసంఘములు నీయంశమును జక్కఁగఁ జర్చించి యొక్కుమ్మడి నికార్యము నెఱవేర్పవచ్చును. ప్రస్తుతపాఠశాలలలో (సంస్కృతపాఠశాలలు తప్ప) నధ్యయనమునుగూర్చిమాత్ర మనుకొనవలెనన్న నవకాశము నహి. విశ్వవిద్యాలయాధ్యక్షులు మొదలుకొని విద్యాలయబోధకులవఱకు నందఱును బ్రకృతవిద్యాపద్ధతి విసర్జింపఁదగినదని వివిధవిధముల ఘోషించుచున్నారు. కాన మనకుం దెపుడైన జాతీయవిద్యాప్రణాళిక యేర్పడునా యనునాశ యంకురించుచున్నది.

ఇప్పటి పాఠశాలలలో నెక్కువగ శ్రద్ధకొని నేర్పఁబడునది యాంగ్లభాష. కాన బోధకులెల్లరుఁ దద్భాషావేత్తలుగనే యున్నారు. ప్రాథమిక పాఠశాలలలోఁగూడ నాంగ్లభాషావేత్తలగు బోధకులసంఖ్య క్రమముగ నతిశయించుచున్నది. ఆంగ్లభాషాబోధన కాలమున దానినే యుపయోగింపక తప్పదు. విద్యాలయవ్యవహారముగూడ విదేశభాషనుండి నడచుచున్నది. ఇంతియకాక దేశచరిత్రము, భూగోళశాస్త్రము మున్నగునవికూడ నాంగ్లభాషలోనే బోధింపవలయు. విద్యార్థులును బరీక్షలలోఁ బైభాషనే పదింబదిగ నుపయోగింపవలయు. ఇట్లుండ స్వభాషావిషయమున సంపూర్ణమున దృష్టినిల్పుట కవకాశ మెక్కడ? అని ప్రశ్నింపవచ్చు. ఇదియథార్థముకూడ. కాని యిట్టివిషమపరిస్థితులు గలవు కాఁబట్టియే విద్యాలయబోధకులు వివేకము నెక్కువగ నుపయోగింపవలసివచ్చినది. ఇట్టిపరిస్థితులలోఁగూడ జాతీయభావను నిల్పుకొనుటలోనే కదా యెక్కువ నేర్పును గన్పఱుపవలయు. అదెట్లు నిల్పుటన, ఒక విశ్వవిద్యాలయప్రణాళికను జూచి మఱొక్క విశ్వవిద్యాలయముగూడ ఆంగ్లభాషనుతప్ప నితరాంశముల నన్నిటిని మాతృభాషలోనే బోధింపవలెనని సిద్ధాంతీకరించుచున్నవి. కాన నిఁకఁగొన్నాళ్లలోనే యన్నిటి నాంగ్లభాషలో బోధింపవలెననుట యదృశ్యమగును. పాఠశాలావ్యవహారవిషయమున అధికారులతో నుత్తరప్రత్యుత్తరములు జరుపుటలోఁ దప్పనిసరిగ నాంగ్లభాష నుపయోగించియే తీరవలెను. కాన నిం దేమిమార్పుచేయుటకుఁ బ్రస్తుతము వీలు లేదు. కాని చిక్కుచటఁగల్గుచున్నదన బోధకులు విదేశభాషాబోధనసమయమున సులభశైలి యుపయోగింపఁ దోఁపక నడుమనడుమ మాతృభాష నుపయోగించుటయు, మాతృభాషలో మాటాడవలసినపట్ల మది కిరాకయు, నభ్యాసవశమున విదేశభాష నుపయోగించుటయు తటస్థించుచున్నది. మాతృభాషలో మాటలాడునపుడుకూడ ననవసర

ముగ నాంగ్లభాషాపదముల నుపయోగింతురు వేళ, వంటవాఁడు, పిల్లవాఁడు మున్నగుపదములకుఁ గూడ విదేశభాష నుపయోగించుచున్నారు వీరినే యాదర్శముగ నుంచుకొన్న విద్యార్థులుకూడ నీవెట్టిలో మున్గుట కడ్డేమి? ఎంతటి యాంగ్లభాషావేత్తలైనను జిన్ననాఁటినుండి యుగ్గుబాలతోఁబాటుగ నలవడియున్న మాతృభాషను మఱచిపోదురా? వారేల చీటికిమాటికి నితరభాషాపదముల నుపయోగింపవలయు? తమభాషలో లేనట్టియుఁ, గల్పించుకొనఁగూడఁ గష్టమయినట్టియు మాటల నుపయోగించుటలో నర్థము కలదు, కాని సులభముగ స్ఫురించు సర్వసామాన్యపదములకు మాఱుగ నితరభాషాపదముల వాడుటలో నర్థమున్నదా? విద్యావంతులగు వీరిట్లుపయోగించుచుండుటచే నితరులు గూడ దీనిలో నేమో గొప్పతన మున్నదని యీపద్ధతినే యనుసరింతురు ఇపు డీపద్ధతి పల్లెలకుఁగూడఁ బ్రాకి, కొన్ని జాతీయపదము లదృశ్యములగుస్థితి యరుదెంచినది ఇంతకును గారణమేమన ఏ బి సి, డి లు నేర్చియు నేర్వకముందే స్వభాషలో వ్రాయుటకాని, మాటలాడుటకాని నాగరికతకు లోపమని తలఁచుచుఁ గ్రొత్తగఁ గొనితెచ్చుకొనిన యీ విజాతీయభాషాజ్యేష్ఠాదేవిని నెత్తికెక్కించుకొనుటయే ఇట్లుచేయుటయేకాక స్వభాషాగ్రంథములమొగమైనఁ జూడక చదువుటకుఁగూడ విదేశభాషాగ్రంథముల విరివిగ నుపయోగించుటచేఁ దమభాషలో ధారాళముగ మాటలాడుటకుఁ జేతకాకుండ నలుగురిలో మాటలాడవలసిన నైచ్యానుసంధానముకూడ నానవిడిచి చేయవలసివచ్చు దీనికిఁదోడుగ విదేశవేషధారణము, విజాతీయసంప్రదాయము వచ్చినవో వీరిక్రింది విద్యార్థుల కలవడునవి వింతవేషములు, విచిత్రభాషణములు, వింతపోకడలుతప్ప మఱేమి? కాన బోధకులు అత్యంతావశ్యకమైనపుడు తప్ప మిగిలినసందర్భముల మాతృభాష నెక్కువగ వాడుచు భాషావిషయమునఁగూడ జాతీయతను నిలువఁబెట్టవలయు 'సంఘే శక్తిః కలౌ యుగే' అన్నరీతిగ బోధకసంఘము లీయంశమున శ్రద్ధఁబూనవలయు

జాతీయసంప్రదాయములు బోధకులకు జక్కఁగాఁ దెలియవలయు తెలిసికొనుటయేకాక వాని ననుసరింపవలయు సర్వధారి సంవత్సరమన్న చదలుచూచువారును, మఘమాసమన్న మదికి రాక మార్చినెలయా యను బోధకులును ఎందఱు లేరు 'గాంజెస్' అనువఱకు గంగయను పదము తలఁపుకురాని వీరికి 'శతద్రు' నదియే సట్లజ్ అన్నచో నాశ్చర్యము జనింపదా! వైకుంఠైకాదశినాఁడు కూడ విందులుకుడుచువారి వివేకము నేమనవలయు? బంధుమిత్రాదులలో నెవ్వరి కేరీతి లేఖల వ్రాయవలయునో యనుటకూడ దెలియనివా రెందఱు లేరు? మహాపురుషులఁ గాంచినపుడు మనఃపూర్వక నమస్కృతు లర్పించురీతిమాత్ర మెందఱికిఁ దెలియును? బోధకు లనఁబడు కొందఱు స్వభాషాగ్రంథములఁ జదువుసంప్రదాయము కూడఁ దెలియక సామాన్యుఁడగు పల్లెటూరిపంతులు చక్కఁగాఁ జదువుచుండ వినినపుడు పురపురఁ బొక్కవలసినదేకదా! పర్వములనాఁ డాకంఠపరిపూర్తిగ భక్షించుటతప్ప నవి యేల యాచరింపఁబడుచున్నవో యని తెలిసినవా రెందఱు? తెలిపికొనఁ దలంపైన వీరికిఁ గలదా? జాతీయసంప్రదాయములఁ జక్కఁగ నెఱుంగమిచే దదవలంబకులఁ జూచి తటాలున నవ్వుటయేకాక తలకుమీఱిన వేళాకోళము చేయు సర్వజ్ఞమ్మన్యులఁ జూచి విజ్ఞులు పరితపింపవలసినదే కదా! చెప్పఁబూన నిట్టి వెన్నియో యున్నవి ఆదర్శప్రాయులగు నయ్యవారలే యిట్లుండ నంధప్రాయముగ వారి ననుసరించు నజ్ఞులగు విద్యార్థు లంతకంటె నొకయంజ యధికముగా నైతురు కాన బోధకులు స్వజాతీయసంప్రదాయ విషయమై పూర్ణశ్రద్ధ గైకొనవలయు ఇంతియకాక అనాలోచితముగ నిట్టివానిని నిరసించుటలో నహమహమికను జూపుట గూడ మానవలయును

వ్యాయామక్రీడలపైఁగూడ బోధకులు పరిపూర్ణశ్రద్ధను గైకొనవలయు ప్రస్తుత పాఠశాలల కనుబంధములుగ బ్యాడ్మింటన్, హాకీ, క్రికెట్ మున్నగుక్రీడావిశేషముల నేర్పఱచియున్నారుగదా! నేఁటివిద్యాప్రణాలికప్రకార మివి నిర్బంధముగ నాడవలసిన నియమములు లేకున్నను జాలకాలమునుండి యలవాటువడుటచే నీయాటలు పాఠశాలలోఁదప్పక యేర్పఱుపవలెనను నభిప్రాయము సర్వసామాన్యముగ వ్యాపించినది ఒకొక్కపాఠశాలయు నీక్రీడాపరికరములకై యేఁటేఁట నెంతపైకము వెచ్చమొనర్చుచున్నదో చూచినఁ బరితాపము జనించును విద్యార్థులుగూడ వినువ నెక్కువగల యీపరికరముల విశేషముగఁ గైకొందురు బోధకసంఘము లీయనర్థమును గుర్తించి యాయాస్థలములఁ బ్రత్యేకనామములతోఁ జెప్పఁబడు జాతీయ వ్యాయామక్రీడల నేలయేర్పఱుపరాదు? హాకీ, క్రికెట్ మున్నగువానికంటె జాతీయక్రీడ లెక్కువయుపాయకరములు కావుగదా? మీఁదుమిక్కిలి విజాతీయక్రీడావస్తువులకై వెచ్చించువిశేషధనవ్యయముకూడఁ దగ్గిపోవు విద్యాశాలలలో విధిగ నేర్పఱుపవలయు ననుకొన్నను వానితో నేమాత్రము సంబంధములేని క్రీడాసంఘములలోఁగూడ వీనినే యేల యేర్పఱుపవలయు? ఇట్టిసంఘము లీకాలమున నెన్ని యేర్పడుచున్నవో చూడుఁడు మొత్తముపై నివి యన్నియుఁగూడ విజాతీయక్రీడలఁ బ్రోత్సహించునవియే విద్యాశాలలలోని విజాతీయక్రీడలఁ జూచియు, విద్యాబోధకులకుఁ గూడ వీనియందుఁ గొంతకుఁగొంత సంబంధ ముండుటచేతను బ్రత్యేకసంఘములుకూడ పరంపరగ నీక్రీడల నేర్పఱచుచున్నవి బోధకులు కొందఱు జాతీయభాషావేషములయావశ్యకతలు గ్రహించియున్నారు కాని యీయంశముమాత్ర మింతవఱకు నెవరికి నెదనాటలేదనుట సాహసము కాదు కారణ మేమనఁ గతానుగతికత్వమే! జాతీయవాదులగు బోధకులస్థితియే యట్లుండఁ దదితరులఁ గూర్చి తడవనేల?

వాఙ్మయసభాసమావేశాదికముల విమర్శింతము ఉపన్యాసములలోఁ బస లేకపోయినను ఉన్నతపీఠములు తప్పవు అచార

ప్రకార మాయాచోట్ల సభ్యక్షమహాశయు నరయక తప్పదు. ఎంత పెద్దయుద్యోగి యధ్యక్షుఁడుగ దొరికిన నంత మేలు. అన్నియు సమకూడిన అధ్యక్షునాధిక్యమును జెప్పుట యరగంట. అతనిని సైచ్యానుసంధానమునంటియ కల్పోక్తరీతిగఁ గార్యదర్శి కార్యవృత్తాంత నివేదికను జదువు టొకగంట. ఇంతలోనే శ్రోతల కింతింతయనరాని విసుగు జనించును. కానఁ జర్చనీయాంశము చకచక చెప్పక తప్పదు. ఉపన్యాసకుఁడు తన్మయుఁడై యుబుసుపోక మాట లుజ్జగించి ఉపన్యసించిన నొక్కరొక్కరే యూడని బాడుదురు. ఆద్యంతము సభ్యక్షులయభినందనములు కార్యక్రమములో నతిముఖ్యములు కానఁ బ్రధానాంశము లుపన్యసించుటకు మిగులుకాలము మిగులఁ గొంచెము. వక్తలీ కొంచెపుకాలములోనే శ్రోతల కంచేత వైకుంఠము చూపింపవలయును. ఇట్లగుటచే ఏయుపన్యాసకునివేష మెట్టిది? ఎంతసేపతఁడు వింతమాటలఁ జెప్పెను? ఎవని రూపరేఖా విలాసములు హెచ్చు? ఎవఁడు గడగడఁ జెప్పెను? అను ప్రశ్నము లే యచటి శ్రోతలకుఁ గలుగునవిగదా! ఎవరో యపరిచితులు, నెక్కువవిద్యావంతులును వచ్చినపుడు, అట్టివారినందఱి కెఱుకపఱుపవలసినదే కాని ఎప్పుడును ఇనాముపట్టావలె అధ్యక్షపదము నధిష్ఠించువారికి ఇరుగుపొరుగువారికి ననవసరాభినందనము లేల? విషయము విశిష్టమైనపు డుపన్యాసకులు వేళకై గడియారములఁ జూడనేల? ఒకగంటకాలములో నుపన్యాసము లున్నవన్నియు ముగింపవలెననుటకంటె నొకపైనదొక్కటి చాలదా? చేఁజిక్కినయవకాశము చెడిపోవుననుట కన్నియు నఖిలభారతసభలు కావుకదా? కాన బోధకులీ యనవసరాడంబరముల నుజ్జగించి సభాకాలము సద్వినియోగపడునట్లు విద్యార్థులకు వెల్లడిచేయవలెను.

ఐన నూత్నపద్ధతుల నన్నిటి నుజ్జగింపవలెనా? జాతీయత యనుపేర విజాతీయములైన యుత్తమపద్ధతులను విడువవలయునా? వేలమువెఱ్ఱితో విజాతీయపద్ధతుల ననుసరించు వివేచన శక్తిలేని విద్యార్థుల వివేకులఁ జేయ వీలగునా యను ప్రశ్నము లిటఁ గల్గవచ్చును. జాతీయములైనను, విజాతీయములైనను చక్కనిపద్ధతు లనుసరింపఁదగినవే కాని యాపద్ధతులు తమప్రత్యేకత్వమునకుఁ దగునట్లు - సరిపుచ్చుకొనవలయుఁగాని యనర్థకరములగునన్ని పద్ధతులను తు, చ, లు తప్పక యనుసరింపఁగూడదనియే యీవ్యాసరచనోద్దేశము. ఉన్నవి కొన్నియు, లేనివి కొన్నియుఁ జెప్పుచు నుచ్ఛృంఖలవృత్తినున్న బోధకులే విద్యార్థిపతనమున కుత్తరవాదు లనక తప్పదు. ఇట్టివీరినిఁ జూచి విద్యార్థులును, వీరిఁ గాంచి వెఱ్ఱిలోకమును చెడిపోవుచున్నది. కాన బోధకులు దమయవివేకమువలన జాతీయత కెట్టిభంగము గలుగుచున్నదో స్మరించి సంఘశక్తి నుపయోగించి స్వజాత్యుద్ధరణమునకుఁ గడంగుదురుగాక!

---

## ఒకడు

ఉభయభాషాప్రవీణ, ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

చేదయిన జీవితమ్ము నాశించినాడు
　　ముసలిగొంతుల హుంకరింపులకు దలకి
దిగులుపడినాడు నవనవేందీవరార్ద్రి
హృదయసుకుమారనేత్రాల కొదిగినాడు

దద్దరిల్లును కులపర్వతాలు కెరలి
ఘూర్ణమైపోవు సప్త మహార్ణవములు
విరుచుకొనిపడ్డ జీవనవిషమభరము
జాలిగా ఆమెకన్నుల వ్రాలినంత

గ్రుడ్ల నెత్తుటి పొంగు గ్రుక్కుకొనినాడు
సానుభూతిని హృదయమ్ము చాచినాడు
గుసగుసలువోయినారు ముక్కోటిజనులు
తొలగిపోలేదు, హృదయ మందుకొనలేదు.

బుసలుగొట్టుచు చంద్రికావిసరమందు
పర్వకొని రేకురేకు నాశీర్విషమ్ము
క్రక్కినది యెరుగ దామె హార్ద్యమున నవ్వు
మల్లెపూదండ యగునె ఈ తెల్లత్రాచు?

ఏటిగాలికి పొంగిన పాటతీపి
కరచుకొన్నది యామె రక్తంపు టెదను
పచ్చివెన్నెల కన్నుల పరువ మరసి
పాటలకు నోచుకోని నిర్భాగ్యగళము

ఒకరి చూచిన నొకరు నవ్వుకొనినారు
ఎదతెరచి యాతిథేయ మందిచ్చె నతడు
పేదకన్నుల సుధవోసి పిలిచె నామె
పిడుగుపడినది　ఇరువురు వడకినారు

పగులదన్నుము వజ్రకవాటములను
ఆవులించి గూండ్రించు సింహాల నదిమి
బొబ్బలెత్తింపు! కృతసటాస్ఫోటనమున
యువక, నీస్నిగ్ధహృదయమ్ము ఉడికెనేని

# ప్రాచీనకాలమందలి వ్యవసాయము

దువ్వూరి బాలకృష్ణమూర్తి

మనదేశములో పూర్వకాలమునందు వ్యవసాయమెట్లుండెడిదో గ్రహించుటకు ప్రత్యేకాధారములు ఏమియు లేకపోవుటచేత శ్రుతిస్మృతులలోను, పురాణేతిహాసములలోను, తరువాత శాస్త్రకావ్యప్రబంధాదులలోను సందర్భానుసారముగ నుదాహరించబడిన చెదురుముక్కలనుబట్టి ఊహించవలసినదేకాని, యిద మిత్థమని నిశ్చయముగా నొక్కిచెప్పుటకే ఆధారగ్రంధములును లేవు ప్రత్యేకముగా వ్యవసాయశాస్త్ర మొకటి యుండియుండినను మన కింతవరకు నెచ్చటను లభ్యముగాలేదు. వృక్షాయుర్వేదము, సస్యానందాది ఖండగ్రంథము లుండినను వాటివలన పూర్వకాలమునందు మన దేశమునందలి వ్యవసాయ మిట్లుండెనని చెప్పుటకు వీలు కలుగకున్నది కాని, యితర దేశములలో వ్యవసాయాభివృద్ధిమార్గములు తలయెత్తకమునుపే, యీ దేశమందలి వ్యవసాయపద్ధతులు మంచిమార్గముల ననుసరించియుండె నని దృఢముగా చెప్పుటకు కౌటిల్యుని అర్థశాస్త్రమే ప్రమాణము.

ఈ గ్రంథరాజమును విష్ణుగుప్తుడు, చాణక్యుడు అను నామాంతరములు గల కౌటిల్యు డను మహారాజకీయవేత్త క్రీస్తుశకమునకు పూర్వము నాల్గవశతాబ్దములో రచించియుండె నని చరిత్రకారులు నిర్ధారణ చేసి యున్నారు శ్రీరామచంద్రమూర్తి రావణసంహారము జేసి విభీషణునికి పట్టము గట్టినరీతి నీ మహామహుడు నందవంశము నున్మూలనముచేసి చంద్రగుప్తునికి రాజ్యము నిచ్చినవాడని విష్ణుపురాణాదిగ్రంథము లుద్ఘోషించుచున్నవి. ఈ అమూల్యగ్రంథము నతిప్రయాసపైన సంపాదించి ఆంగ్ల భాషాంతరీకరణముతో ప్రచురించిన మైసూరు సంస్థానాధీశుల ప్రాచ్యగ్రంథ భాండాగారాధ్యక్షు లగు శ్రీయుత ఆర్ శ్యామశాస్త్రిగా రెంతయు అభివందనీయులు వారి భాషాంతరీకరణసహాయము లేనిదే మాతృకను సరిగా అర్థముచేసుకొనుట బహు కష్టము ఇందు రాజనీతి తంత్రమంతయు నూటయాభై అధ్యాయములుగా విభజింపబడి, యితర ధర్మశాస్త్రములరీతినే సూత్రములుగా గద్యపద్యాత్మకముగా రచింపబడినది. అందు వ్యావసాయికవిషయములను బదిపంద్రెండు అధ్యాయములలో సూక్ష్మముగా వివరించిరి. వాటిలో "సీతాధ్యక్షః" వ్యవసాయాధ్యక్షుని విధులను నిరూపించిన అధ్యాయములో సేద్యపుసంగతు లెన్నో కలవు. అందు ముఖ్యసూత్రము లీక్రింద నుదాహరించబడినవి

"సీతాధ్యక్షః కృషితంత్రగుల్మవృక్షాయుర్వేదజ్ఞ స్తజ్జ్ఞసఖోవా సర్వధాన్యపుష్పఫలశాక కందమూలవాల్లిక్యక్షౌమకార్పాస బీజాని యథాకాలం గృణయాత్."

(వ్యవసాయాధికారి (సీతాధ్యక్షుడు) తరు గుల్మలతాదులను పెంచుటలో తగినవ్యవసాయజ్ఞానము కలిగిగాని, అట్టిశాస్త్రజ్ఞానము గలవారి సహాయమునుపొందిగాని ధాన్యపుష్పఫలశాక కందమూలాదుల విత్తనములను యుక్తకాలములో భద్రముచేయవలెను.)

"బహుహలపరికృష్టాయాం స్వభూమౌ దాసకర్మకరదండప్రతికర్తృభి ర్వాపయేత్."

(తృప్తికరముగా బహుపర్యాయములు దున్న బడిన రాజన్యభూములయందు సౌఖర్లచేతనున్ను, కూలీలచేతనున్ను ఖైదీలచేతనున్ను విత్తనములను చల్లించవలెను)

"కర్షణయన్త్రోపకరణబలీవర్దైశ్చైషా మసంగం కారయేత్."

(వ్యవసాయపుపనిముట్లు, పశువులు తక్కువగుటచే పైవాళ్లచే చేయించివలసినపని చెడిపోనట్లుగా నుండవలెను.)

"కారుభిశ్చ కర్మారకుట్టాక మేదకరజ్జు వర్తక సర్పగ్రాహాదిభిశ్చ"

(కమ్మర్లు, వడ్రంగులు, తోలలు కోయువారు, త్రాళ్లువేయువారు, పాములనుపట్టువారు, మొదలగువారి సహాయమును సంపాదించుటలో ఆలస్యముచేయరాదు.)

"తేషాం కర్మఫలవినిపాతే తత్ఫలహానం దండః"

(పైవాళ్లవలన గలిగేనష్టమునకు తగినంత అపరాధమును విధింపవలెను.)

"షోడశద్రోణం జాంగలానాం వర్షప్రమాణ మధ్యర్ధ మనూపానాం దేశవాపానా మర్ధత్రయోద శాశ్మకానాం త్రయోవింశతి రవన్తీనా మమిత మపరాన్తానాం హైమన్యానాంచ కుల్యావాపానాంచ కాలతః"

(ఎడారిప్రదేశములలో కురియువాన ౧౬ ద్రోణములుండును తేమగలచోట్ల ఇంకొక అర్ధభాగ మెచ్చుగా నుండును వ్యవసాయయోగ్యమైన దేశములలో మహారాష్ట్రములో ౧౩½ ద్రోణములు, ౨౩ ద్రోణము లవంతిలోను, పశ్చిమదేశములో అమితవర్షమును హిమాలయప్రాంతము మొదలగు వ్యవసాయమున కుపయోగపడు నీటికాలువలుగల ప్రదేశములలో అమితవర్షము కురియును.)

"వర్షాత్రిభాగః పూర్వపశ్చిమమాసయోః
ద్వౌత్రిభాగౌ మధ్యమయోఃసుషమా రూపం.—"

(కురియువర్షములో మూడోవంతు సన్యారంభాంత్యమాసములయందును మిగిలిన రెండువంతులు మధ్యకాలమున కురిసినయెడల సస్యానుకూలవర్షమని చెప్పనగును

"తస్యోపలబ్ధి ర్బృహస్పతే స్థానగమన గర్భాధానేభ్యః శుక్రోదయాస్తమయచారేభ్యః సూర్యస్య ప్రకృతివైకృతాచ్చ—"

(బృహస్పతి స్థితిగమన గర్భాధానాదులను బట్టియు, శుక్రోదయాస్తమయ చలనాదులను బట్టియు, సూర్యుని ప్రకృతివికృతులబట్టియు వర్షపాతమును సూచించవచ్చును)

"సూర్యాద్బీజసిద్ధిః, బృహస్పతే స్సస్యానాం స్తమ్బకారితా, శుక్రా ద్వృష్టి రితి—"

(సూర్యునివలన బీజోత్పత్తిని, బృహస్పతివలనసస్యవృద్ధిని, శుక్రునివలన వర్షపాతమును కనిపెట్టవచ్చును)

"త్రయస్సప్తాహికా మేఘా అశీతిః కణశీకరా,
షష్టిరాతపమేఘానాం ఏషావృష్టి స్సమాహితా,
వాతమాతపయోగంచ విభజ న్యత్ర వర్షతి,
త్రీన్ కర్షకాంశ్చజనయన్ తత్ర సస్యాగమో ధ్రువః"

(ఏడురోజులువిడవకవర్షించుమేఘములు మూడు, తుంపరలుమాత్రముపడుమేఘములుయెనభయి,ఎండతో కలిసివర్షించు మేఘములు అరవయి. ఇదే వర్షపాతము)

గాలి యెండ లేకుండ మూడుదక్కులు దున్నుటకనుకూలమగునట్లు వర్షించినయెడల మంచిపంటలు పండుట నిశ్చయము

"తతః ప్రభూతోదక మల్పోదకంవా సస్యం వాపయేత్—"

కనుక వర్షపాతముయొక్క హెచ్చుతగ్గుల ననుసరించి ఎక్కువనీరు తక్కువనీరు కావలసినపైర్లవిత్తనములను చల్లించవలెను.

"శాలి వ్రీహి కోద్రవ తిల ప్రియంగు దారక వరకాః పూర్వవాపాః—"

(వరిరకములు, ఆరికలు, నువ్వులు, సజ్జలు, పిల్లిపై సర మొదలగు పూర్వసస్యములను వర్షారంభమున చల్లవలెను)

"ముద్గమాషశైబ్యాః మధ్యవాపాః—"
(పెసలు మినుములు మొదలగునవి మధ్యకాలమున చల్లవలెను)

"కుసుమ్భమసూర కుళుత్థ యవగోధూమ కలాయాతసీ సర్షపా పశ్చాద్వాపా —"
(కుసమలు,మసూరీలు,ఉలవలు,యవలు,గోధుమలు, పప్పుదినుసులు, నీమలవిసి, ఆవాలు వర్షాకాలాంతమున చల్లవలసిన సస్యములు)

"యథర్తువశేనవా బీజావాపాః"
(లేక, ఋతువులమార్పునుబట్టి విత్తుచుండవలెను)

"వావాతిరిక్త మర్ధసీతికాః కుర్యుః"
(కూలీలు చాలక చల్లకుండా మిగిలినభూమిని సగముపాలికి పండించుకునేవాళ్ల కీయవలెను)

"స్వవీర్యోపజీవినోవా చతుర్థ పంచభాగికాః యథేష్ట మనవసితభాగం దద్యు రన్యత్ర కృచ్ఛ్రేభ్యః స్వసేతుభ్య"
(స్వయముగా కష్టపడి పనిచేయవారలకు పండిన పంటలో నాలుగవ వంతుకో, అయిదవ వంతుకో విడిచిపెట్టవలయును వ్యవసాయముచేయుటకు కష్టతరమైనతమ స్వంతభూములు మినహా మిగిలినవాటిని పండించువారికి భారము లేకుండా వాళ్లిచ్చువంతుకే యియ్యవలెను)

"హస్తప్రావర్తిమముదకభాగంపంచమందద్యుః"
(చేతులతో నీళ్లతోడుకుని సాగుచేయువారు నీటిపన్నుక్రింద పంటలో అయిదోభాగ మీయవలెను)

"స్కంధప్రావర్తిమం చతుర్థం"
(బజాలమీద నీళ్లు మోసి పండించువారు పంటలో నాలుగోభాగ మియ్యవలెను)

"స్రోతో యన్త్రప్రావర్తిమంచ తృతీయం"
(నీళ్లుతోడు యంత్రములతో పండించువారు మూడోవంతు)

"చతుర్థం నదీసరస్తటాకకూపోద్ఘాటం—"
(నదులు, సరస్సులు, చెరువులు, బావులలోనుండి నీరుతోడి పండించువారు పంటలో నాల్గవవంతు నీటి తీరువ యీయవలెను)

"కర్మోదక ప్రమాణేన కేదారం హైమనం గ్రైష్మికంవా సస్యం స్థాపయేత్—"
(లభ్యమగు కూలీలనుబట్టిన్ని, నీటివసతికి తగినట్టుగా వ్యవసాయాధ్యక్షుడు మాగాణిపైర్లుగాని,శీతకట్టుపైర్లనుగాని, వేసవిపంటలనుగాని పెట్టించవలెను)

"శాల్యాదిజ్యేష్ఠమ్—"
(వరిపైరు ఉత్తమము)

"షండో మధ్యమ"
(కాయగూరలు మధ్యమము)

'ఇక్షుః ప్రత్యవర ఇక్షవోహి బహ్వాబాధా వ్యయగ్రాహిణశ్చ"
(చెరకు కనీసము చెరుకుకు వ్యయప్రయాస లెక్కువ)

ఇంకను నేలలస్వభావములను ఉత్పత్తినిబట్టి వాట్లలో వేయతగినపైర్లు వివరించబడినవి విత్తనములు భద్రముగా నుంచుటకు తగుయేర్పాట్లు చెప్పబడినవి

విత్తనములను చల్లునప్పుడు చేయవలసినవిధులును, ఈక్రిందిమంత్రమును చెప్పబడినవి

"ప్రజాపతయే కాశ్యపాయ దేవాయచనమః సదా, సీతా మే ఋధ్యతాం దేవీ బీజేషుచ ధనేషుచ"
పనివాళ్లకీయవలసినజీతములు భత్యములువివరించబడినవి

దేవబ్రాహ్మణవినియోగము చేయవలసిన సంగతులును పరిగయేరుకొనుట ధర్మములు చెప్పబడినవి చేలను కోసి కుప్పలువేసి కళ్లములలో గమనించవలసినవిధానములు పేర్కొనబడినవి.

కొలతలు, తూనికలు, దేశకాలములను విభజించు మార్గము లెన్నో చెప్పబడినవి

ప్రభువులకొట్లమీద అధికారులవిధులను చెప్పుటలో వ్యవసాయమునకు సంబంధించినసంగతులు విశేషముగా వివరించబడినవి

ఇట్టి విశేషాంశములు గలిగిన గ్రంథరాజమును తగినవారు ఆంధ్రీకరణము నొనర్చి ఆంధ్రదేశమున కుపకారము చేయుటకు ప్రార్థించుచున్నాను

# మాయ

అప్పల వీరవెంకటజోగయ్యశాస్త్రి
(కవిమిత్రమండలి)

చండభాస్కరఖరకర సంచయంబు
లగ్నికీలలఁ గురియించి నట్లు దోఁప
సర్వజీవితకోటులు సంచలింప,
అబ్జజాండము తహతహ లాడఁజొచ్చె!

సరసు లింకెను సెలయేళ్లు తఱఁగిపోయె
లలితశృంగారవనవృక్షరాజి బడలె
పాంథజనకోటి మృగతృష్ణపాలఁ బడియె
నోలి గ్రీష్మర్తుదీర్ఘదినాలవేళ

ప్రీతిఁ గార్తాంతికులు గ్రహవీక్షణముల
గతులఁ దిలకింప, ఛాందసగణములెల్ల
సంచితగతి సహస్రఘటాభిషేక
మీశునకుఁ జేసి పూజించి రెల్లవిధుల

ఆకసంబునఁ గనుపించె నంత చిన్ని
జలదఖండాలు నీలపుం జాలువోలె
స్మరహరుని దిక్కునం దోఁచె మెఱుఁగుఁదీగ
వానకురిసెను గడుపువ్వుసోనవోలె!

భూజనంబులు సద్భక్తిఁ బూజసేయ
నమలసంతోషరసపూరితాత్ము లగుచు,
నమరకోటులు రాల్చు హర్షాశ్రులనఁగ
నాఁటి వర్షంబు చెన్నొందె నందునందు!

ప్రబలఝంఝానిలోద్ధూత బహుళభయద
ఘుమఘుమధ్వానసంకీర్ణ ఘోరనిబిడ
నీలనీరదసంఘాత నిర్గమములు
కానుపించెను మఱునాఁడు గగనవీథి

సలిలదంబుల కెదురేగె చాతకంబు
చండకరుఁ జేరె పరివేషమండలంబు
కుహుకారారావముచు సల్పె కోకిలంబు
జనులు సందియపడ నింద్రధనువు దోఁచె!

భూరివారణకరనిభధార లెసఁగ
నాకసము చిల్లివడినట్టు లమితగతిని
నింగి నేలయు నేకమై పొంగిపారఁ
గురిసె నెడలేకవారంబు కుంభవృష్టి!

మిట్టపల్లంబు జలరాశి మేదినియును
నొక్కతీరునఁ గాన్పించె లెక్కలేక
నురుఁగుకెరటాలతో నొడల్ విసుచుకొనుచు
వచ్చె గౌతమి ప్రజ తన్ను మెచ్చిమాడ

తీర మొఱయుచుఁ జనుదెంచు తీరు గాంచి
యంచితంబుగ భయభక్తు లతిశయిల్ల
పౌరకాంతలు పుష్పాలఁ బసుపుకుంకు
మముల గౌతమిఁ బూజించి మఱలి రంత

రమ్మ మానోముపంట! రారమ్మ తల్లి!
మాతృగమనాపహారి! సమ్మాన్యచరిత!
లీలఁ జరియింపు గోదావరీస్రవంతి
యంచు నెంజలులై జను లాత్మఁ బొంగ!

క్షుభితకుటిలతరంగనిర్ఘోషణములు
వాతచలితోరుభూరుహధ్వానములును
ప్రథితమండూక సంకులారావములును
భూనభోంతరములు నిండిపోయె నంత!

సందె - నీఁక కనుచీఁకటిసమయమందు
సగము మునిఁగిన లంకల చక్కఁ బెక్కు
తాళవృక్షాలు కనుపించె దవ్వుదవులఁ
దలలు విరబోసికొన్న భూతాలపగిది.

చలితనిర్ఝరిణీవీచికలను దేలి
లీల నూఁగుచు చిన్నియుల్లాలఁబోలి
దరికిఁ జనుదేరయత్నించు తరణి యొకటి
గౌతమిని దోఁచె దూరానఁ గన్నుఁగవకు.

ప్రళయకాలమహాధ్వాంతపటలసదృశ
తిమిరసంఘాత మెల్లెడ దీటుకొనఁగ
సర్వశూన్యంబుగాఁ దోఁచె జగతిఁ గన్ను
దెఱచినను మూసినను నొక్కకరణి నంత!

జగతినంతయు మెఱయించి సంభ్రమించి,
మబ్బుతునుకలలో మటుమాయమయ్యె
విమలవిద్యుల్లతాకాంతి వీక్షణంబు -
కనుల మిఱుమిట్లు గొలుపుచు క్షణములోన!

అసలె వర్షంబు దానిపై నంధకార -
మశనిపాతంబు - నామీఁద అనిలఘాత
మట్టిసమయాన ధైర్యం బదెట్టు నిలచు
మఱచితిని నావమాట, యమ్మెఱపు మాట

కాంచుచుండఁగ విడియె మేఘాల గుంపు
తళుకుమంచును దారకావళులు దోఁచె
పిదప చంద్రోదయమ్ముఁ బ్రహ్మయే బిండియార
బోసిన విధాన వెన్నెల పొలుపుమీఱ!

హిమకరుఁడుష్ణుఁడై నా మేను దహింపసాగె
క్రమ్ముకొనె రోమకూపాల ఘర్మజలము
మండె కన్గవ యది యేమి మాయయొ నట
నప్రయత్నాన "వెన్నెల" యంటి నేను!

జాముపొద్దెక్కె వెన్నెల యేమి? పలవ
రింతలా యంచు నాసతి సుంత నవ్వె -
సూర్యకిరణాలు మేనెల్లఁ జుట్టుకొనఁగ
కన్నువిచ్చితి విభ్రాంతిఁ గలయటంచు!

---




నంది

—క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యము, కాకినాడ.

గొప్పరకము సబ్బులను ఉచితనమోనాలపరీక్షించి
మీరే తెలిసికొనుడు

# కామినియా టాయిలెట్ సబ్బులు

మీరు ముఖ్యముగా కోరెదరు
మనోహరములైన నానావిధ వాసనలతో నిండిన
శ్రేష్ఠమగు సబ్బులు



మనోల్లాసము కలిగించు పరిమళముతో గూడిన గొప్పరకము. "కామినియా టాయిలెట్ సబ్బులు" మీకు యింపుగా నుండును. "కామినియా టాయిలెటు సబ్బు" శరీరమును శుభ్రపరచి మృదువుగా నుండునట్లు చేయును. ఈక్రింది "కామినియా టాయిలెటు సబ్బులు"లలో నేదియైనను నిత్యస్నానమునకు వాడినచో శరీరము మృదువుగానుండి హాయిగానుండును.

"కామినియా వైట్ రోజ్ సోప్" గొప్పరకము సబ్బు, గులాబివాసనలను వెదజల్లు చుండును.

"డిల్ బహార్ సోప్" "ఆటో డిల్ బహార్" పరిమళము గలది. దానివాసన చిరకాలము నిలచును.

"కామినియా శాండల్ సోప్" శుద్ధ చందన పరిమళముతో ఘుమాయించు చక్కని సబ్బు. మిక్కిలి యింపుగాను, మనోజ్ఞముగాను నుండును. ఒక్కొక్క రకము 3 బిళ్లలుగల పెట్టె. రు. 1-0-0 పోస్టేజి వేరు. పైరకము సబ్బులలో యొకదాని ఉచిత నమోనాకై 0-0-6 పోస్టుబిళ్లను పంపుడు.

సోల్ యేజంట్లు:— **ది ఆంగ్లో యిండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ,**

285, జుమ్మా మశీదు, బొంబాయి. 2.

# BADSHAHI SOAP

ప్రపంచ ఖ్యాతిగనిన

## బాద్ షాహి సబ్బు

సువాసనతో కూడినది. ఎల్లపుడు నుపయోగింపుడు

## నవీన రోమనాశని

వెంట్రుకలను రాల్చివేయు రకములలో నీసబ్బు ఒక్కటియే మిక్కిలి శ్రేష్ఠమైనది
నిరుపయోగమైన నమూనాలను జూచి మోసపోకుడు
నాజూకైన టిన్ను పెట్టెలలోగల 3 బిళ్లల వెల రు. 1-0-0 పోస్టేజి ప్రత్యేకము.
ప్రతిచోటను విక్రయింపబడును.

*Madras Agent:-*
**J. M. SHETH,**
26; China Bazar.

C. C. MAHAJAN & Co. BOMBAY. 2





1. అఖిల భారత మహిళా మహాసభ సమావేశము, చెన్నపురి  అధ్యక్షురాలు: శ్రీమతి కృష్ణమాచార్యసతిగారు.

2. లేడీ విల్లింగ్డను వైద్య పాఠశాల (ఎగ్మూరు) వార్షికోత్సవము.





1. లండనున మహాత్మునకాతిథ్యమిడిన మిస్ మరియల్ లిస్టరుగారు మదరాసు స్వదేశీ ఎంపోరియమును దర్శించుట.

2. మదరాసు చీనాబజారులో సి. పి. రావ్ అండు కో., ఔషధాగారము ప్రారంభోత్సవము.

# జపాను—జాతీయాభివృద్ధి

ప్రతివాదిభయంకర పార్థసారథి బి. ఎ., బి. కామ్., ఎల్. ఎల్. బి.,

జపాను ఎక్కడనున్నదియు నాగరికప్రపంచమున డెబ్బది సంవత్సరములకు పూర్వ మెవరికిని తెలియదు. ఏకొలదిమందికో జపాను పసిఫిక్ సముద్రమున నున్న యొకచిన్నద్వీపమనిమాత్రము తెలిసియుండిన నుండవచ్చు. అంతమాత్రమే. అట్లింతవరకును నామరూపములు లేని జపాను, నేడు, ప్రపంచమందలి ముఖ్యరాజ్యములలో నెల్లరచేతను గణన చేయబడుచున్న గొప్పపదవిని పొందియున్నది. నేడు జపా నేమిచెప్పినను, ఏమిచేసినను ప్రపంచమంతయు నాతురతతో చెవులొగ్గి విని గమనించుచున్నారు. మొన్న మొన్నటివరకు నానాజాతిసమితిలో జపాను చాలాముఖ్యమగపదవి నధిష్ఠించియుండినది. నేటికి, నానారాజ్యసమితి (League of Nations) నిరాకరించి, మొత్తముమీద ప్రాక్పశ్చిమరాజ్యము లెల్ల దన్నెదురొడ్డినను లక్ష్యపెట్టక, తననిశ్చితమును సాగించుకొనుటకు వలయు శక్తిసామర్థ్యములను సంపాదించినది. ఇట్టిమహాద్భుతమగు జపానుఅభివృద్ధి ప్రపంచ చరిత్రయందు శాశ్వతస్థానమును బొందె, దేశ మెంతక్లిష్ట పరిస్థితులలో నుండినను, దుస్సాధ్యములగు నాటంకము లెన్నియుండినను, యెట్టిలోటుపాట్లుండినను, నేదేశమైనను, విసుగువిరామములేని పట్టుదల, స్వార్థహీనమైన దేశభక్తివలన దేశము నెంతటిమహోన్నతపదవికి, యెంత స్వల్పకాలములో తేగలదో ప్రత్యక్షనిదర్శనముగ నుండగలదు. అందునువిశేషించి ౧౮౬౮-వ సంవత్సరమునకుపూర్వము, నేడుహిందూదేశ మెట్టిస్థితియందున్నదో, అంతకన్న నీచదశయందుండియు, స్వశక్తిచే నిట్టిమహోన్నతిని బొందగలిగెనదన్నచో, తగునవకాశములు గలిగినచో, దేశాభిమానము తమరక్తనాళములయందు ప్రవహించుచున్నచో జపానుదేశము నాదర్శముగ గొని, ప్రతిభారతీయుడును తనదేశాభివృద్ధికై ప్రాణములనైన ధారవోయుటకు వెనుకంజవేయడు.

నేటి జపానురాజ్యము విస్తీర్ణము సుమారు ౨,౬౦,౭౦౮ చదరపుమైళ్లు. నేటి జపానురాజ్యమున హొన్షు (Honshu), షికోకు (Shikoku), క్యూషు (Kyushu), హోక్కైడో (Hokkaido), కురైల్ (Kuriles), లూచూ (Luchu), షాగలియన్ (Shagalien), కొరియా (Korea), ఫార్మోసా (Formosa) ఇంకను ననేకచిన్న ద్వీపములు కూడియున్నవి. ఈరాజ్యపు జనసంఖ్య ౧౯౨౧-వ సంవత్సరపు జనాభాలెక్కలప్రకారము సుమారు, ౭,౭౦,౦౫,౫౧౦.

దేశమంతయు పర్వతపంక్తులతోడను, నగ్నిపర్వతములతోడను నిండియున్నది. చిన్నచిన్నద్వీపము లగుటవలన, నదులు చాల చిన్నవియు, వడిగా ప్రవహించునవియు నగుటచే నౌకాయానమున కుపయుక్తము కాదు. కాని వ్యవసాయమునకును, విద్యుచ్ఛక్తి నుత్పత్తియొనర్చుటకును నవసరమగునీటిని వర్షాధిక్యముచే నీనదులు నిరాటంకముగ సరుదుబాటు చేయుచున్నవి. చిన్నసరస్సులును, చెరువులును దేశరామణీయకతకు తోడ్పడుచున్నవి. పర్వతమయమగుటచే, విశాలమగు సమప్రదేశములు లేకున్నను, కొండలోయలు, ఇతరములగు చిన్నమైదానములు మిక్కిలి సారవంతములైనవి. అందు పెద్దనదు లగు టోనా (Tona), అరకావా (Arikawa) నదులచే తడుపబడి టోకియో (Tokio), యోకహామా (Yokohama) మొదలగు ముఖ్యపట్టణములకు నిలయమై, కోటిజీవులకు పైగా ఆశ్రయస్థానమగు క్వాంటో మైదానము ముఖ్యమైనది. జపానురాజ్యము మొత్తముమీద అధికముగా ద్వీపములయొక్కయు, ద్వీపకల్పములయొక్కయు సముదాయమగుటచే విస్తారమైన సముద్రతీరమును, అత్యధికమగు హార్బరులును, నౌకాశ్రయములును కలవు. జపాను శీతోష్ణపరిస్థితుల ముఖ్యస్వరూపము సకాలవర్షము (Monsoons). వేసవియందును, వర్షాకాలమందును వర్షములు మిక్కుటముగ నుండును. శీతకాలమందు తీవ్రమగుగాలి యత్యధికముగ వీచుచుండును. తరుచుగా తుపాను గాలివాన ఇబ్బందుల గలుగజేయుచుండును. వృక్షజాతులు, జంతువులు, పక్షులు మిక్కిలి విరివిగా నుండుటయే కాక ప్రపంచమందితరప్రాంతముల నెచ్చటను లేని క్రొత్తరకములగు జాతు లనేకములు గలవు. దేశమంతయు పర్వతమయమై యుండుటచే ధైర్యసాహససమన్వితులగు హిమాలయప్రాంత ఘూర్ఖాలవంటిజాతికి నిలయమాయెను.

జపాన్ దేశము చిరకాలమునుండియు సోగా (Soga) వంశీయుల పరిపాలనలోనుండి, కాలక్రమమున నధికారమంతయు, ౧౨-వ శతాబ్దమున 'షోగనెట్లను' జమీందారులహస్తముల చిక్కి రాజవంశము మారుమూలకు త్రోసివేయబడినది. జపాన్ రాచరికమంతయు నప్పటినుండియు ౧౮౬౭-వ సంవత్సరము వరకును షోగనెట్ల హస్తములందేయుండెను. ఈషోగనెటు ప్రభుత్వము కేవల విలాసపురుషులతోడను, త్రాగుబోతులతోను, జూదరులతోను నిండి

యుండుటచే, దేశము నానాటికి దౌర్భాగ్యస్థితికి రాదొడగినది. సాంఘికముగ దేశము మిక్కిలిహీనగతికి వచ్చినది. ప్రజలలో తారతమ్యము లధికములై, పరిపాలకజాతివారు, జమీందారులు తమకన్న తక్కువవారియెడ చాలనీచముగ బ్రవర్తించుచుండిరి. పాశ్చాత్యమతబోధకులు, వర్తకులు, నితరదేశములకువలెనే జపానుకుగూడ రాదొడగిరి. విదేశీయులు సందుదొరకినదిగదాయని, తమ కత్యధికలాభకరమగు పద్ధతులపై, శక్తిహీనమైయున్న షోగనెటుప్రభుత్వముతో సంధిషరతుల నేర్పరచుకొని, జపానులో, జపానీయులకన్న నధికమగు సదుపాయముల సంపాదించిరి. అందువలన జపానుప్రజలలో షోగనెటుప్రభుత్వముపై నసహ్యతయు, విదేశీయులపై నీర్ష్యయు నానాటికి వృద్ధిగాజొచ్చినవి. దేశమం దెల్లెడ నసంతుష్టి, కలహములు, తిరుగుబాట్లు, కల్లోలములు అధికముగాజొచ్చెను.

సాంఘికముగా జపాను అనేకశతాబ్దము లితరదేశములతో సంపర్కము లేశమాత్రము లేక మూల నొదిగియుండుటచే నభివృద్ధికి మార్గము లేదాయెను. భూస్వామిఅధికారపద్ధతి (Fuedalism) ప్రబలి, దేశమంతయు దాదాపు ౩౦౦ చిన్న స్వతంత్ర సంస్థానముల క్రింద విభజింపపడి తత్సంబంధమైన బాధ లధికముగా నుండెను. ఆర్థికముగా దేశము చాల దరిద్రస్థితియం దుండెను. ఆస్తిప్రాణములకు భద్రత లేకుండెను. బలవంతులు, జమీందారులు శక్తిహీనుల నడగద్రొచి వారిప్రాణము, ధనము నపహరించుచుండిరి. దేశప్రజలలో సాంఘిక విభేదము లధికమై సమానత్వము, స్వాతంత్ర్యము నశించిపోయెను. రైతులు భరింపశక్యముకాని ప్రభుత్వపుపన్నులచేతను, సర్వాధికారసమన్వితులగు భూస్వాముల లంచములతోడను పీల్చి పిప్పిగా జేయబడిరి. తుదకు కొన్నిచోట్ల ఎవనికి వాడు తనకునచ్చిన వృత్తి నవలంబించుటకుగాని, తన యిచ్చవచ్చినచొప్పున నడచుటకు గాని, స్వాతంత్ర్యము లేకుండెను. జమీందారులు మొదలగు ఉన్నత వంశీయులు (Upper classes) వీధులలో వెడలునప్పుడు త్రోవలోనున్న ప్రతిసామాన్యజాతీయుడును (Commoner) ముఖము నేల కంటునట్లు నమస్కరింపవలెను; లేకున్న శిక్ష. భూస్వాములును, అధికారులును జరిపెడి యత్యాచారములపై ప్రజలు ప్రభుత్వమునకు విన్నపము చేసుకొను నధికారము కూడ లేకుండెను. సామాన్య జాతివారు ఆస్తి కొనుట గాని, అమ్ముట గాని పైజాతివారి యనుమతిలేక చేయరాదు. పన్నులనుగాని, మరియనేక పేరులతో రాబట్టెడి లంచములగాని సకాలమున నీయనిచో వీపున కంచీతో దెబ్బలు కొట్టుట (Whipping) సర్వసాధారణమగు శిక్ష. ఈబాధల సహింపజాలక పల్లెలు, గ్రామములు, భూములు, ఆస్తులు విడిచి, పాటకపుజనము పట్టణములకు బరుగిడసాగిరి. పట్టణములందు జనసమృద్ధి యధికమగుటచే నిరుద్యోగసమస్య నానాటికి వృద్ధికాజొచ్చెను. అంగుచే నెక్కడచూచినను విప్లవవాతావరణము ప్రబలము కాజొచ్చెను. వర్తకవ్యాపారసంఘములన్నియు "జా" లని పిలువబడు వాణిజ్యసంఘముల (Guilds) లెక్కకుమీరిన కట్టుబాట్లకు లోనై యుండెను. "జా" సంఘసభ్యుడు కానివాడెవడును వర్తకము చేయరాదు; కాని "జా" సంఘసభ్యులసంఖ్య అత్యల్పముగను, భూస్వాములహస్తగతమయ్యు నుండెను.

దేశ మన్నివిధముల నిట్టిదుఃస్థితులపాలై, యంతటను అసంతుష్టి ప్రబలియుండుటచే, జపానులో నూతనజాతీయభావోద్రేక ముదయించెను. దేశమందలి చిక్కులనెల్ల బోగొట్టి, శక్తియుతమగు కేంద్రప్రభుత్వమును బునరుద్ధరించి, విదేశీయులబారినుండి జపానును కాపాడవలెననుదీక్ష ప్రతివానిహృదయమందును బయలుదేరెను. తత్ఫలితముగ, ప్రథమమున, షోగనెటుప్రభుత్వము నధికారమునుండితప్పించి, రాజ్యభారమును, దేశాభివృద్ధిని జపానురాజవంశీయుడగు మీజీ చక్రవర్తి ప్రభువుహస్తములం దుంచి, కేంద్రప్రభుత్వమును బలపరుప బూనుకొనిరి. దీనికే Meigi Restoration అనియు, The Bloodless Revolution of 1868 అనియు ప్రసిద్ధి. మీజీప్రభువు రాజ్యభారము వహించుటతోడనే జపానుచరిత్రలో నూతనశక మారంభ మాయెను. జపానుభావిభాగ్యోన్నతికి పునాదులు వేయబడెను.

సింహాసన మధిష్ఠించుసరికి ౧౫ సంవత్సరముల బాలుడైనను, దన జీవితమంతను జీర్ణజపానుదేశోద్ధరణకై ధారవోయుటకు బ్రతినవట్టి, పట్టాభిషేకసమయమున, మీజీసార్వభౌముడు ఈ క్రింద వివరించినవిధముగా తనప్రజలకు ౧౪-వ మార్చి ౧౮౬౮-వ సంవత్సరమున వాగ్దానము చేసెను:

౧. దేశమందు బహిరంగసభలు జరుగుట కెట్టి యాటంకము నుండరాదు.

౨. రాజ్యపాలనమంతయు జపానుజాతి, జపానుదేశము అభివృద్ధి పొందుమార్గములందే, వాని అభ్యుదయమునకై మాత్రమే జరుపబడును. పాలకులును, పాలితులును ఆ ఆశయమునకే పాటుపడవలెను.

౩. దేశమందలి రాజోద్యోగీయు లందరు అన్నివిధము లగు స్వతంత్రపరిశ్రమలను పెంపొందించుటకును, ఎవనిశక్తికి తగినటుల వాని ప్రత్యేకపరిశ్రమను వృద్ధిచేయుటకును, తమ అధికారమును వినియోగపరుపవలెను.

౪. దేశమందలి నైతిక, సాంఘిక దోషములను, ఇతర అన్యాయములను తొలగింపవలెను.

౫. ప్రపంచమందలి అన్నిభాగములనుండియు నుపయోగకరమగు విజ్ఞానమును సంపాదించి, దేశమున జ్ఞానాభివృద్ధికి వలయు యత్నములన్నియు జేయవలెను.

ఈశపథమునకే జపానులో "గొజొనొగొసీబన్" అని పేరు. ఇతరదేశములలో రాజుల ప్రతిజ్ఞలవలె నివి కేవలము ముఖప్రీత్యర్థము

అవసరమనుబట్టియు జేయబడినవి కావు. రాజ్యభారము వహించిన క్షణమునుండియే మీజీసార్వభౌముడు తన విధిని నెరవేర్చుటకు మొదలిడెను. అనతికాలములో దేశములోని భూస్వాముల దురంతములు, సాంఘికతారతమ్యములు నాశనము చేయబడెను. ప్రజలందరు సమానహక్కు గలవారైరి. భూస్వాముల పూర్వపు అధికారములు, ఆధిక్యములు అంతరించినవి. ప్రత్యేకాస్తికి (Private Property), అందరి హక్కులకు రక్షణ యేర్పడినది. వృత్త్యవలంబనమునకు గల యడ్డంకులన్నియు దొలగింపబడినవి. వర్తకవ్యాపారసంఘములను "జా"లను, నాటి కట్టుబాట్లను రూపుమాపి స్వేచ్ఛావ్యాపార, స్వతంత్రపరిశ్రమపద్ధతులు పెంపొందింపబడినవి. తాను సింహాసన మధిష్ఠించి ఆరునెలలు కాకపూర్వమే, భిన్నభిన్నముగా చీలియున్న వివిధ స్వతంత్ర సంస్థానముల గూడదీసి, వాని నన్నిటిని దనవశమొనర్చుకొని, కేంద్రప్రభుత్వపుటధికారమును జపానులో నంతటను బలపరచెను.

౧౮౭౦-వ సంవత్సరమున నాధునికపద్ధతులపై నడుపబడు మొదటివర్తకసంఘము (Commercial Company) టుషోకైషా (Tsusho Kaisha) అనుపేర స్థాపింపబడెను. దానివెంటనే 'బ్యాంకింగ్ కార్పొరేషను' కూడ నెలకొల్పబడెను. ౧౮౭౦ మొదలు ౧౮౮౩ వరకు ప్రభుత్వమువారే స్వయముగ పరిశ్రమలను నెలకొల్పుచు, వ్యాపారమును సాగించుచుండిరి. దేశమందలి ముఖ్యకర్మాగారములన్నియు ప్రభుత్వమువారికే చెందియుండి, వారిచే నడుపబడుచుండెను. రైలుమార్గములు, బొగ్గుమొదలగు ఇతరగనులు, నౌకానిర్మాణము, వస్త్రపరిశ్రమ, పట్టుపరిశ్రమ, గాజుపింగాణీవస్తువుల తయారుచేయుయంత్రములు ప్రభుత్వమువారు స్వయముగ స్థాపించి పట్టుదలతో నడిపింపసాగిరి. ౧౮౮౩-వ సంవత్సరప్రాంతమున దేశమందలి పరిశ్రమలన్నియు చాలవరకు స్వతంత్రముగ వృద్ధికి రాదొడగెను. స్థాపించుటకు వలయు కష్టనష్టముల కన్నిటికిని ప్రభుత్వమువారు బాధ్యతవహించి, స్వతంత్రముగ నవి పెంపొందగలస్థితికి రాగనే, వాటిని వ్యక్తియాజమాన్యమునకు (Private enterprise) అప్పగించిరి. ౧౮౯౩-వ సంవత్సరమున నాణెముల చలామణి, ఇతర దేశముల నాణెములతో మారకపువిధులు నిర్ణయించు చట్టములు (Currency, Exchange and Bank acts) కావింపబడెను. ౧౮౯౪-వ సంవత్సరమున 'చైనాజపాను' యుద్ధముతో ప్రభుత్వమువారు స్వయముగ పరిశ్రమల స్థాపించుట, వానిని నడపించుట పూర్ణముగా మానివైచి అంతయు వ్యక్తులకును, కంపెనీలకును వదిలివేయబడెను. ౧౮౬౮-వ సంవత్సరమున మొత్తముమీద షుమారు ౨,౬౦,౦౦,౦౦౦ యెన్నుల విలువగల జపానువర్తకము ౧౮౯౩ నాటికి ౧౪,౯౫,౮౪,౦౦౦ యెన్నులవరకు వృద్ధిచెందెను. (యెన్ను అనగా షుమారు పండ్రెండణాలన్నర ప్రస్తుతపు విలువగల జపాను నాణెము) కాని అంతటితో తమపని ముగిసినట్లు తలచి యూరకుండక, జపానుప్రభుత్వమువారు పారిశ్రామికాభివృద్ధికి వలయుమార్గములనెల్ల నన్వేషించుచు, వానికివలయు సహాయమును, సదుపాయములను సమకూర్చుచు నితరదేశములలోవలె పరిశ్రమలు వర్తకము ఆస్తి పాశ్చాత్యుల హస్తగతము కానీయక, కాపాడి సర్వహక్కులును జపానీయుల లాభముకొరకే యేర్పడునట్లు పాటుపడిరి. విదేశములతో షోగనెటుప్రభుత్వమువారు చేసుకొన్న నష్టదాయకములగు సంధిషరతుల నన్నిటిని తిరిగి మార్పుగావించి, సమాన హక్కులు, సమానహోదాపద్ధతులమీద మీజీప్రభువు ౧౮౯౪-వ సంవత్సరమున ఇంగ్లాండుతో ప్రథమమున సంధిగావించుకొనెను. వెంటనే యితర దేశములుకూడ ఇంగ్లాండుపద్ధతినే యనుసరించినవి.

జపాను అంతఃకలహముల నడగించి రాజ్యమును బలపరుప మొదలిడగనే యితరదేశములతో విరోధములు, యుద్ధములు సంభవించెను. ఇతరదేశములు తమపై దండెత్తి రాకుండుటకై, తమ ప్రక్కనేయున్న 'కొరియా' తో ౧౮౭౬-వ సం. మున జపాను సంధిగావించుకొని, కొరియాలో సంస్కరణాభివృద్ధికి జపాను ప్రయత్నింపసాగెను. కాని చైనాకు, తదితరదేశములకు కొరియా అభివృద్ధిచెందుట యిష్టము లేదు. కొరియా స్వతంత్రరాజ్యమైనను, చైనాకు సామంతరాజ్యమువలె గ్రుడ్డిగ చైనా ననుకరించుటయే తన విధిగ నెంచుచుండెను. పాశ్చాత్యులు చైనాకొరియాలలో తమ అధికారమును స్థాపించుకొనుట కెప్పుడు సమయము లభించునాయని యెదురుచూచుచుండిరి. జపాను, ఈరానున్న అపాయమును గ్రహించి, తామును పాశ్చాత్యవిధానముల నవలంబించి తమ దేశము నభివృద్ధియొనరించుకొనుటయేకాక, కొరియాలో నూతన వికాస ముదయింపజేసి, పెంపొందింప యత్నించుచుండిరి. కాని చైనాదేశము తనపూర్వాచారములను, ప్రాచీనపద్ధతులను విడచుట కేమాత్ర మిచ్ఛగింపక, వెనుకబడియుండుటయేకాక, కొరియాలో కూడ నెట్టిసంస్కరణము జరుగుటయు సహింపలేకుండెను. జపాను కొరియాలో సంస్కరణాభివృద్ధికై యత్నించుచుండ, చైనా అట్టిసంస్కరణమున కడ్డుతగులుట చైనాజపానుల సంఘర్షణకు కారణమై, తుదకు యుద్ధముగా పరిణమించెను.

౧౮౯౪-౯౫ సం. మున జపానుకును చైనాకును యుద్ధము జరిగి, అందు జపానుకు అద్భుతవిజయము లభించెను. తత్ఫలితముగ చైనావారు "షిమనోషీకీ" వద్ద సంధి గావించుకొనిరి. ఆసంధి షరతులప్రకారము జపానుకు చైనావారు,

౧. ౨౦,౦౦,౦౦,౦౦౦ టేల్సు నష్ట పరిహారములక్రింద యివ్వవలెను. (టేల్ అనగా షుమారు పదమూడణాలన్నర విలువగల చైనానాణెము).

౨. దక్షిణ చైనా సముద్రతీర సమీపమున నున్న ఫార్మోసా (Formosa), పాస్కొడెరిస్ (Pascoderes) ద్వీపముల వదలివేయవలెను.

౩. లయటాంగ్ (Liaotung) ద్వీపకల్పమును విడువవలెను.

౪. కొరియా దేశము సర్వస్వతంత్రముగ నుండవలెను.

౫. చైనాదేశములో ముఖ్యమగు నాలుగురేవుపట్టణములలో జపాను వ్యాపారమునకు స్వేచ్ఛ యొసంగవలెను. యాంగ్ట్సీనదియందు స్వేచ్ఛగ జపానువారు నౌకాయానము లొనర్పవచ్చును.

ఈసంధిషరతులప్రకారము జపానునకురొక్కమూలమున అధిక లాభమే కాక నూతనరాజ్యవిస్తీర్ణమును, అధిక హక్కులును సంక్రమించినవి. కాని రష్యా, జర్మనీ, ఫ్రాంసు మొదలగుదేశములు జపానుకు గతించినలాభమునకు ఓర్వలేక ప్రాచ్యదేశశాంతిరక్షణ మనుపేర జపానును బెదరించి లయటాంగ్ ద్వీపకల్పమును మరల చైనాకు వదలివేయునటుల బలవంతపరచిరి. అందుకు బదులుగ చైనానుండి జపానుకు తిరిగి ౩,౦౦,౦౦,౦౦౦ పరిహారము చెల్లింపబడెను.

అంతవరకు చైనాయన్న భయపడు విదేశీయు లెల్లరు చైనా యొక్క దుర్బలత్వమును గ్రహించినంతనే ఒకరొకరుగ చైనాతో స్నేహము చేసుకొని ఏదోయొకమిషమీద కొన్ని ప్రాంతముల తమస్వాధీనానుభవములలోనికి దెచ్చుకొనిరి. ఆ విధముగ జర్మనీ కియాచౌ (Kiachow) లోను, రష్యామంచూరియాలలోను హక్కుల సంపాదించుకొనిరి. ఫ్రెంచివారుకూడ కొన్ని ప్రాంతములను కవులుకు సంపాదించుటయేకాక కొన్ని రైలుమార్గముల నిర్మించుటకును, నడపుటకును అధికారమును బడసిరి. ఇతరదేశములతో బాటు బ్రిటనుకూడ వీహైవీ (Weihaiwei) ప్రాంతమును కవులుకు పొందెను. ఈయపాయమును గ్రహించి జపాను, ఫార్మోసా కెదురుగానున్న ఫుకీను (Fukein) పరగణాను ఇతరులకెరికిని అన్యాక్రాంతము చేయకుండునట్లుగ చైనాతో మరల సంధిగావించుకొనెను.

ఇంతలో చైనా అధికారముబలము తగ్గగానే రష్యా క్రమముగ కొరియా దేశములో నధికారమును సంపాదింప మొదలిడెను. తనస్వాధికారములో నున్న మంచూరియానుండి కొరియానుకూడ క్రమముగ నాక్రమింపవచ్చుననియు, జపాను అడ్డుపెట్టిన ఓడింపవచ్చుననియు రష్యా వ్యూహముల బన్నుచుండెను. కొరియాయందలి అన్యోన్యాధికారములవిషయమై జపానుకును రష్యాకును నానాటికి విరోధములు వృద్ధికాజొచ్చెను. జపాను సంధిషరతులను సూచింపగా రష్యా అతిహేళనముగా వానిని నిరసించి, నీచమగు షరతుల మరల సూచింపసాగెను. ఈ అన్యోన్యవైమనస్యమే ౧౯౦౪ లో రష్యాజపానుయుద్ధమునకు కారణమాయెను. ఈకాలమునకు పాశ్చాత్య రాజ్యములలోనెల్ల రష్యా చాల గొప్పదియు, యూరపుదేశమున సగమునకుపైగాను, ఆసియాఖండమున సగమునకు అధికమగు విస్తీర్ణము నేలుచు రాజ్యవిస్తీర్ణకాంక్షాపీడితులగు నిరంకుశప్రభువుల పాలనలో నుండి రష్యాయన్న నెల్లరకు భయము గలిగించుచుండెను. దానికితోడు జపానుకు పడమరను, ఉత్తరమునను సరిహద్దు నంటి రష్యారాజ్య ముండుటచే ఏనిముషమున హఠాత్తుగా తమపై బడు దురో యనుభయము జపానువారిని పీడింపసాగెను. జపాను తన్ను రక్షించుకొనుటకు, ప్రాచ్యశాంతి రక్షణకును మరల నొకమారు రష్యాపై కత్తిగట్టక తప్పదాయెను. ఏకాలదిమందియో అశక్తులు, స్త్రీలు, బాలురు తప్ప జపానుజాతియంతయు విజయమో, లేక మరణమో రెంటిలో నేదియో యొకటి తప్పదని నిశ్చయించుకొని యుద్ధమునకు బయలుదేరిరి. జపానుజాతి జీవించియుండుటయా, నశించిపోవుటయా యనునది యీయుద్ధపర్యవసానముమీదనే ఆధారపడునని గట్టినమ్మకము జపానుఅంతటను ప్రబలమాయెను. క్రమముగ రష్యా సైన్యములను తమకన్న మిక్కిలిబలమైనవియు, సాధనసంపత్తులతో కూడుకొనినవియునైనను హృదయమందు రగుల్కొనిన దేశభక్తియను దివ్యతేజోబలమున జపానీయులు తమ విరోధుల నొక దుర్గమునుండి మరియొకదుర్గమునకు పారద్రోల మొదలిడిరి. ఎంతపట్టుదలతో పోరాడి ఆరునెలలవరకును విరోధికి లొంగకుండినను తుదకు రష్యనులు పోర్టుఆర్థరును (Port Arthur)ను కూడ వీడవలసి వచ్చెను. ముకుడేన్ (Mukuden) యుద్ధములో రష్యావారు సంపూర్ణముగా నోడింపబడిరి. మరియొకవంక, నతిక్లిష్టమగు ప్రయాణప్రయాసమున కోర్చి జపానుతీరమును జేరుకొనిన రష్యనునౌకాదళమును ౧౯౦౫ లో జపానునౌకాదళాధిపతియగు అడ్మిరల్ టోగోచే జపానుసముద్ర పరిసరప్రాంతముల నుండకుండ జెదరకొట్టబడెను. అంతటిలో రష్యా యిక యుద్ధమును సాగించుట నిరుపయోగమని నిశ్చయించుకొని ౫-వ సెప్టెంబరు ౧౯౦౫-వ నాడు పోర్ట్సుమత్ (Portsmouth) వద్ద జపానుతో నీక్రిందిషరతులతో సంధి కుదుర్చుకొనిరి:

౧. కొరియాదేశములో జపానుఅధికారమును, అంగుపై జపాను సార్వభౌమత్వమును అంగీకరించుట.

౨. లైటాంగ్ ద్వీపకల్పమును కవులుహక్కులన్నిటితోను జపానుకు వదలివేయుట.

౩. దక్షిణమంచూరియా రైలుమార్గమును దానికి సంబంధించిన గనుల హక్కులతో సహితముగ జపానుకు స్వాధీనము జేయుట.

౪. షాగలియన్ (Shagelian) పరగణాలోని దక్షిణార్థమును జపానుకు విడుచుట.

ఈ రెండుయుద్ధములఫలితముగ జపానుయొక్క ఆధిక్యము స్థిరపడి, అంతవరకును "పచ్చకోతు"లని (Yellow Monkeys) వెక్కిరింపబడిన ఆజాతితోనే పాశ్చాత్యులెల్లరు సఖ్యము నొందగూర్చుకొన మొదలిడిరి. ప్రపంచమందలి గొప్పరాజ్యములలో జపా నొకటిగ పరిగణింపబడ మొదలిడినది. ౧౯౦౫ – వ సంవత్సరమున తిరిగి బ్రిటిషువారు తా మిదివరలో జపానుతో చేసుకొనిన సంధిషరతుల వృద్ధిచేసి, ఒకరికొకరు సహాయము చేసుకొనుటకును, ఒకరిహక్కుల మరియొక రంగీకరించి వాటిని కాపాడుటకును,

తూర్పు ఆసియా, హిందూదేశములందు శాంతిని ఇరువురును రక్షించుటకును మొదలగు సమానబాధ్యతగల షరతులతో సంధి కావించుకొనిరి. ఈయుద్ధముల ఫలితముగ నిట్లు జపానుహోదా విదేశములయందెల్ల ప్రకటితమగుటయేకాక, జపానుఆర్థికాభివృద్ధికి మిగుల నుపయోగించెను. చైనాయుద్ధమూలమున జపానుకు లభించిన ౨౩ కోట్ల ధనమును పారిశ్రామికాభివృద్ధికి వినియోగింపబడెను. దానికి తోడు విదేశములతో సంధిషరతులన్నియు లాభకరముగ నేర్పాటు చేసుకొనబడినందున వర్తక మభివృద్ధి బొందసాగెను. ఎటుచూచినను జపానున కభివృద్ధియే కన్పించెను. ప్రపంచమంతు సామాన్యముగ యుద్ధము నష్టకరమైనను, జపానుకుమాత్రము ఈరెండుయుద్ధములు లాభదాయకములు, అభివృద్ధికి మూలకారణములు నాయెను.

ఇదివరలోవలె జపాను ఆత్మరక్షణకై భయపడవలసినయగత్యమంతరించెను. అందుకుమారు విదేశములే జపానుసఖ్యమున కెదురుచూడ మొదలిడినవి. అంతేకాక జపాను నొకకంటితో కనిపెట్టి చూచుచుండవలసిన యవసరముకూడ కలిగెను. ఫ్రాంసు, రష్యా, అమెరికాదేశములుకూడ, బ్రిటనువలెనే అన్యోన్యసహాయపద్ధతుల పైనను, చైనాయందు వర్తకాధికారమందరకు సమానముగా నుండవలెనను మొదలగుపద్ధతులపైనను జపానుతో సంధిగావించుకొనిరి. ఇట్లుండగా ౧౯౧౦ లో జపాను తనరక్షణక్రిందనున్న కొరియా రాజ్యము నాక్రమించుకొని దానిని తనసామ్రాజ్యమందు కలుపుకొనెను. ౧౯౦౫ మొదలు ౧౯౧౩ వరకు జపానుపారిశ్రామికాభివృద్ధి చరిత్రలో స్వర్ణయుగముని యెంచకతప్పదు. అంతటి మహోత్కృష్టదశకు కారకుడగు మీజీప్రభువు జూలై ౩౧-వ తేది, ౧౯౧౨ నాడు కాలగతినొందెను.

త్వరలోనే ప్రపంచపరిస్థితులలో కల్లోలము లేర్పడెను. ౧౯౧౪ లో ఐరోపామహాసంగ్రామము మొదలుపెట్టబడెను. ఈ సంగ్రామములో జపాను జర్మనీకి విరోధముగ మిత్రమండలితో కూడినను మిగిలినవారివలె ప్రధానరణరంగమధ్యమున దుముకవలసిన యగత్యము సంభవింపలేదు. అందుమూలమున యుద్ధమున తమ యావచ్ఛక్తులను వినియోగపరచుచున్న ఐరోపాదేశీయులకు వలయుసరకులను, యుద్ధసామగ్రిని నౌకలనుగూడ జపాను ఎగుమతి జేయసాగెను. ఇతరులపోటీ లేనందునను, సరకులకు మితిలేని అమ్మక మేర్పడుట వలనను జపాను కపారముగ ధనము రాదొడగెను. దేశమందలి పరిశ్రమలు, పరిశ్రమాలయములు నానాటికి పెరుగజొచ్చెను. జపాను ఆధిక్యము, ప్రాముఖ్యము ప్రపంచపరిస్థితులలో నధికమాయెను. ప్రాచ్యప్రాంతమంతటను సముద్రములపై జపాను సర్వాధికారి యాయెను. మహాసంగ్రామసంధిసభలలో జపానుప్రాతినిధ్యము చాల బలముగా నుండెను. ఆసంధిషరతులమూలమున జపాను గతయుద్ధమున తాను జర్మనుఅధికారమునుండి జయించి స్వాధీనముచేసుకొనిన షాంటంగ్ పరగణాలో సర్వహక్కులను, భూమధ్యరేఖ కుత్తరమున నున్న జర్మను దక్షిణసంద్రపురాజ్యమును, మార్షల్, కరోలైను, యాప్ ద్వీపములతోసహా రక్షణహక్కు (Mandate) జపానుకు నానాజాతిసమితినిర్ణయమువలన నొసగబడెను.

౧౯౨౧ - వ సం. మున జపానుయువరాజు ప్రపంచయాత్రపైన విదేశములకుబోయి, అచ్చట నేర్చుకొనవలసినవిషయములనెల్ల తెలిసికొనుటయేకాక, యితరరాజన్యులనెల్ల సందర్శించి వారి పరస్పరమైత్రి నభివృద్ధిచేసెను. ఈవిధముగ నాతడు బ్రిటను, ఫ్రాంసు, బెల్జియం, హాలెండు, ఇటలీ మొదలగుదేశములందు సంచరించి, దేశాభివృద్ధికి వలయు విషయములనెల్ల గ్రహించి, తనదేశమునకు తిరిగివచ్చెను. ఆసంవత్సరమే సార్వభౌముని అస్వస్థతవలన యువరాజు రీజెంటుగా నియమింపబడుటచే, తాను పాశ్చాత్యదేశములందు నేర్చిన పాలనావిధానములెల్ల నమలులో నుంచి, బాధ్యతాయుక్తప్రజాప్రతినిధిసంఘములసలహాలతో రాజ్యము పాలించునట్లేర్పాటు చేసెను. ఈవిధముగ విజ్ఞానార్జనమే ముఖ్యాశయముగ నెంచి, ౧౯౨౫ లో జపానుసార్వభౌముని రెండవపుత్రుడున్నతవిద్యాభ్యాసమునకై ఐరోపాఖండమున కేగెను. జపానుప్రభువులు, ప్రజలు దేశాభివృద్ధికై తమ యావచ్ఛక్తులను, విజ్ఞానమును ధారవోసి, జపాను నత్యల్పకాలములో నేటిమహోన్నతస్థితికి తేగలిగిరి. జపాను వర్తకవ్యాపారపరిశ్రమల యభివృద్ధి యీక్రింద పొందుపరుపబడిన వివరణమువలన తేటపడగలదు.

| సంవత్సరము | ఎగుమతుల విలువ (యెన్నులలో) | దిగుమతుల విలువ | మొత్తము |
|---|---|---|---|
| ౧౮౬౮ | ౧,౫౫,౫౩,౦౦౦ | ౧,౦౬,౯౩,౦౦౦ | ౨,౬౨,౪౬,౦౦౦ |
| ౧౯౦౩ | ౨౮,౯౫,౦౨,౦౦౦ | ౩౧,౭౧,౩౫,౦౦౦ | ౬౦,౬౬,౮౭,౦౦౦ |
| ౧౯౧౫ | ౭౦,౮౩,౦౭,౦౦౦ | ౫౩,౨౪,౫౦,౦౦౦ | ౧,౨౪, ౭,౫౭,[illegible]౦౦ |
| ౧౯౧౮ | ౧,౯౬,౨౧ ౦౦,౦౦౦ | ౧,౬౬,౮౧,౪౪,౦౦౦ | ౩,౬౩,౦౨,౪౪,౦౦౦ |
| ౧౯౨౪ | ౧,౮౦,౭౨,౩౩,౦౦౦ | ౨,౪౫,౩౩,౯౦,౦౦౦ | ౪,౨౬,౦౬,౨౩,౦౦౦ |

జపానువారి మూలధనము (Capital)తో స్థాపింపబడి జపానువారిహక్కుగా నడుపబడుచున్న అన్నివిధములగు వర్తకసంఘముల (All Companies) యొక్క మూలధన మెట్లు నానాటి కభివృద్ధియగుచు వచ్చెనో యీ క్రింది పట్టికవలన తెలియగలదు:

| సంవత్సరము. | మొత్తము మూలధనము (యెన్నులు) |
|---|---|
| ౧౮౯౩ | ౨౩,౧౯,౬౬, ౦౦౦ |
| ౧౯౦౩ | ౮౮,౭౬,౦౬,౦౦౦ |
| ౧౯౦౫ | ౯౭,౫౦,౦౦,౦౦౦ |
| ౧౯౧౩ | ౧,౯౮,౩౦,౦౦,౦౦౦ |

౧౯౧౪ మొదలు ౧౯౧౮ సంవత్సరములమధ్య సంవత్సరమునకు ౧౦,౦౦,౦౦,౦౦౦ మొదలు ౧౫,౦౦,౦౦,౦౦౦ వరకు నూతనమూలధనమును పరిశ్రమలయందు వినియోగించి జపానువారు తమపరిశ్రమల నితరప్రఖ్యాతపాశ్చాత్యదేశములవానితో తుల్యస్థితికి తేగలిగిరి.

ఈక్రిందవివరింపబడిన జపానుజాతీయభాగ్యమును సూచించు పట్టికను పరిశీలించిన జపాను ఎంతశీఘ్రకాలములో నత్యధికాభివృద్ధిని జూపగలిగెనదో స్పష్టమగును.

## జపాను జాతీయైశ్వర్యము (Japan's National Wealth)

| ఆస్తి వివరము | ౧౯౧౩ సం॥ లో విలువ (యెన్నులు) | ౧౯౧౯ సం॥ లో విలువ |
|---|---|---|
| భూములు (Lands) | ౧,౩౭,౯౫,౦౦౦ | ౩,౩౦,౮౬,౦౦౦ |
| గనులు (Mines) | ౧౪,౬౩,౦౦౦ | ౬౪,౧౩,౦౦౦ |
| సరస్సులు,నదులు,రేకాశ్రయములు వగైరా (Seas,Lakes,Rivers,Harbours) | ౨౭,౬౭,౦౦౦ | ౪౫,౯౭,౦౦౦ |
| కలప (Trees) | ౧౭,౬౦,౦౦౦ | ౪౫,౩౪,౦౦౦ |
| భవనములు (Buildings) | ౩౬,౩౨,౦౦౦ | ౮౫,౬౦,౦౦౦ |
| గృహోపకరణములు (Furniture and Household effects) | ౧౫,౬౬,౦౦౦ | ౪౪,౨౪,౦౦౦ |
| పారిశ్రామికయంత్రములు (Machinery for manufacture) | ౩,౯౯,౦౦౦ | ౧౧,౦౨,౦౦౦ |
| మచ్చికజంతువులు (Domestic animals) | ౧,౫౪,౦౦౦ | ౫,౦౩,౦౦౦ |
| రైలుమార్గములు, ట్రాములు (Railways and Tramways) | ౨,౯౯,౦౦౦ | ౧౧,౧౧,౦౦౦ |
| ఇతరశకటములు (Vehicles) | ౪౭,౦౦౦ | ౧,౮౨,౦౦౦ |
| నౌకలు (Ships) | ౪,౭౧,౦౦౦ | ౧౧,౮౨,౦౦౦ |
| జలయంత్రములు (Waterworks) | ౭౭,౦౦౦ | ౨,౪౯,౦౦౦ |
| వంతెనలు (Bridges) | ౯౫,౦౦౦ | ౨,౩౪,౦౦౦ |
| పంటలు (Agricultural Products) | ౯,౯౪,౦౦౦ | ౩౬,౨౪,౦౦౦ |
| అడవిపదార్థములు (Forest Products) | ౪౧,౦౦౦ | ౮౮,౦౦౦ |
| పారిశ్రామికవస్తువులు (Manufactures) | ౭,౪౮,౦౦౦ | ౨౬,౩౦,౦౦౦ |
| గనులనుండి వచ్చిన వస్తువులు (Mineral Products) | ౮౫,౦౦౦ | ౩,౮౭,౦౦౦ |
| జలవస్తువులు (Marine) | ౨౦,౦౦౦ | ౪౩,౦౦౦ |
| దిగుమతిసరుకులు (Imports) | ౧,౯౭,౦౦౦ | ౪,౪౫,౦౦౦ |
| వెండి బంగారములు, నాణెములు (Gold and Silver bullion and coin) | ౭,౪౭,౦౦౦ | ౨౩,౬౦,౦౦౦ |
| ప్రభుత్వశాఖల ఆస్తి (Property of Govt. departments) | ౧౧,౧౬,౦౦౦ | ౧౫,౪౮,౦౦౦ |
| చక్రవర్తి స్వంత ఆస్తి (Property of Imperial House) | ౩,౪౬,౦౦౦ | ౭,౨౭,౦౦౦ |
| ఇతరములు (Others) | ౩౦,౮౨,౦౦౦ | ౭౭,౯౩,౦౦౦ |
| ఇతరదేశములనుండి తమకురావలసినబాకీలు (Balance in favour of claims) | ౧౮,౬౦,౦౦౦ | ౩,౫౬,౦౦౦ |
| మొత్తము | ,౩,౨౦,౪౩,౦౦౦ | ౮,౬౦,౭౭,౦౦౦ |

ఐరోపామహాసంగ్రామకాలమున మితిమీరి యభివృద్ధిచెందిన పరిశ్రమలు, వర్తకము, నూతనకంపెనీలు మొదలైనవన్నిటికి, ప్రపంచ శాంతియేర్పడి పూర్వపుపరిస్థితు లేర్పడగనే, ఇతరదేశములలోవలెనే ౧౯౨౧-వ సం. మున విఘాతము కలిగెనవి. యుద్ధసమయమున దేశమందు మితిమీరి వృద్ధిఅయిన నాణెములు, బ్యాంకునోట్లు ధరలను అధికముగా పెంచినవి. యుద్ధానంతరము మామూలుపరిస్థితు లేర్పడినందున అన్ని దేశములు తిరిగి పరిశ్రమలు, వర్తకము విరివిగా మొదలిడినందున, ఒక్కమారుగా ధరలు తగ్గిపోయెను. అందుచే ననేక కంపెనీలు, బ్యాంకులు నాశనము జెందినవి. వర్తకము మందగించినది ఎక్కడమాచినను నష్టమే. అంతటితో పెద్దపెద్ద కంపెనీల మూలధనము (Capital) తగ్గింపబడి మొత్తముమీద సెప్టెంబరు ౧౯౨౨ నాటికి ౯౮౦ కోట్లు తగ్గింపబడినది. ఈచిక్కులలోనుండి విడబడి మరల శక్తిసంపాదించుకొన యత్నించుచున్న సమయములో ౧౯౨౩-వ సెప్టెంబరులో జపానులో మహోపద్రవకరమగు భూకంపము, దానితోబాటు అగ్నిపర్వతప్రమాదము కలిగి మితిలేనినష్టము కలిగించినది. జపాను ముఖ్యపట్టణములగు టోకియో, యోకహోమాలు నిర్మూలము లయినవి. సుమారు ఒకలక్ష జీవులు మరణించిరి. ఏవిధము చేసైనను, ఈసమయమున జపానుకు మొత్తముమీద ౫౫౦,౬౩,౮౬,౦౦౦ నష్టము సంభవించినట్లు అంచనావేయబడెను. ఈవిఘాతము జపానుకు తీరనినష్టమును గల్గించుటయేకాక, యభివృద్ధియందు గొప్పయంతరాయమును గలిగించినది. జపాను తిరిగి పునర్నిర్మాణము జేసుకొనవలసిన యగత్య మేర్పడినది. మరియొకదేశ మేదైనను ఇంతటితీవ్రమగునష్టమును బొందినచో నణగంటియుండవలసినదే కాని, జపానీయుల ఆత్మవిశ్వాసము, పట్టుదల, ధైర్యస్థైర్యముల వలన, నిర్మూలమైన తమముఖ్యపట్టణములను మరల పూర్వముకన్న నధికమగువైభవముతో పునరుద్ధరించుటయేకాక, ఆర్థికప్రపంచమునందముయున్న తపదవిని నిలుపుకొనగలుగుచున్నారు.

ప్రస్తుతము జపానులో ప్రతిసంవత్సరమును ౧౦ లక్షల చొప్పున జనసంఖ్య అధికమగుచున్నది. జపానురాజ్యమున కీనానాటికివృద్ధియగు జనసంఖ్యను భరింప శక్యము కాకయున్నది. దానికితోడు అమెరికా, కనడా, ఆస్ట్రేలియా మొదలగు దేశములన్నియు జపానీయులపోటీకి తాళలేక, జపానీయులను తమదేశమునకు వలసరానీయక ఆటంకపుచట్టముల నేర్పరచిరి. ఒకవంక నింతవరకును నల్లమందుమత్తున నిదురించుచున్న చైనా మేల్కాంచి తనస్వాతంత్ర్యమును గాపాడుకొన నిశ్చితయై జపాను కెదురుతిరిగి యుద్ధముగూడ జేయుచున్నది. రష్యా మొదలగురాజ్యములు జపానును పడమరవైపు భూభాగమున రాజ్యవైశాల్యము బొందుట కడ్డుతగులును. ఇక పసిఫిక్ మహాసముద్రమున గలదీవులలో అమెరికావారు తమ యధికారమును స్థాపించుకొనిరి. అట్టిస్థితిలో జపానుకు ఊపిరి తిరుగనిస్థితి సంభవింపకతప్పదు. ఈసమస్యను జపాను ఎటులపరిష్కరించునో తెలియదు.

జపాను నేడు కేవలము పరిశ్రమలపైనను, వర్తకముపైనను ఆధారపడియున్నది. జపానులో వ్యవసాయప్రదేశము చాలతక్కువ. ఇదిగాక దేశము చిన్నదైనను జనసంఖ్య చాలా హెచ్చగుచున్నది. అందుచే జపానులో పాశ్చాత్యదేశములలోవలెనే తమపరిశ్రమలకవసరమైన ముడివస్తువుల (Raw material)నిమిత్తము, తమ ఆహారపదార్థములనిమిత్తముకూడ నితరదేశములపై నాధారపడవలసివచ్చినది. జపాను తానుతయారుచేయు వస్తువులలో చాలా కొలదిభాగము మాత్రమే తనదేశమున ఖర్చుపెట్టుకొనగలదు. మిగిలినభాగమంతయు విదేశములం దమ్మవలెను. నేడు ప్రపంచమందు వ్యాపారవిషయకమగు పోటీ అధికమైనది. ప్రతిదేశమును, తనసరకులనిముడుటకు వీలగు విశాలమైన విక్రయప్రదేశములను (Foreign Markets) సంపాదించుకొనుట కనేకవిధముల ప్రయత్నించుచున్నది. అన్ని దేశములకంటెను పరిశ్రమాభివృద్ధి ముందుగ మొదలిడి, తమవస్తువు లత్యుత్తమములని పేరుప్రఖ్యాతులు సంపాదించిన బ్రిటను నొకవంక, ఆధునికపద్ధతులపై, చక్కని కట్టుబాట్లతో వస్తుగుణమును చెడనీయక ధరల తగ్గించుచువచ్చెడి అమెరికా మరియొకవంక, చిరకాలమునుండియు నొక్కొకవస్తువును తయారుచేయుటలో ప్రసిద్ధిజెందిన ఫ్రాంసు, ఇటలీ మొదలగు యూరపియను దేశములు వేరొకప్రక్క, జపాను వ్యాపారాభివృద్ధి కంతరాయములుగ నున్నవి. వీటికితోడు, ఇకనెన్నటికిని తలయెత్తజాలదని తలంపబడిన జర్మనీదేశము, యుద్ధానంతరము మరల నతితీవ్రముగా పరిశ్రమల నభివృద్ధిపరచి తనపూర్వపు మార్కెట్టుల వశపరచుకొని, యుద్ధాత్పూర్వముకంటె నధికముగ వ్యాపారము చేయ మొదలిడినది. వీని అన్నిటికంటెను ఆశ్చర్యకరముగ శతాబ్దములతరబడి పారిశ్రామికవాసనలేక కేవలవ్యవసాయమున కలవాటుపడిన రష్యాదేశము చూచుచుండగనే గొరడీమార్పువలె, ప్రజాస్వామ్యపరిపాలనమున చిత్రమగుమార్పును జెంది పారిశ్రామికాభివృద్ధికి సర్వశక్తుల వినియోగించుచున్నది. ప్రతిదేశమునను పరిశ్రమ లభివృద్ధి నొందించి యేదేశమునకు వలయువస్తువులు వారే తయారుచేసుకొనవలెనను భావము విస్తరించినది. జపానుకు ఇంతవరకున్న చౌకయగుకూలీవ్యయమువలన కలుగు లాభముకూడ నంతరించుచున్నది. జపానులోకూడ పూర్వముకన్న నేడు కూలీవ్యయము చాల అధికమైనది. అందువలన వస్తువులు తయారుచేయుట కగువ్యయము అధికమై, ధరలు పెరుగుటచే, నితరదేశములకన్న తక్కువధరలకు తనవస్తువుల విక్రయించుసదుపాయము తగ్గినది. అందుమూలమున జపానుకు ముందు క్లిష్టపరిస్థితు లేర్పడవచ్చును. జపాను భావిభాగ్యోన్నతి యీరెండు సమస్యలను పరిష్కరించుటపై నాధారపడియున్నది.

జపాను ఇంత యత్యల్పకాలములో నంతటి మహోత్కృష్టదశకు వచ్చుటకుకారణము లనేకము లున్నవి. అందు మొదటిది దేశీయాభిమానము, జాత్యభిమానము. జపానులో ప్రతియింటను తల్లి పసిపిల్లల కుగ్గుపాలతోబాటు జాతీయభావమును శరీరమున బట్టింతురు,

ఉయ్యెలలోని బాలుని జోకొట్టుచు దేశాభిమానమును దెలుపుపాటలనే పాడుదురు. పాఠశాలలో పుస్తకములందు దేశాభిమానము వృద్ధి బొందించు పాఠములు బోధింపబడును. జపానులో ప్రతివ్యక్తికిని జాతీయత, దేశాభిమానము ప్రతినాళమునందును రక్తముతోబాటు నిరంతరము ప్రవహించుచుండును. జపానీయులు తమదేశక్షేమము మొదటిదిగను, వ్యక్తి తరువాతదిగను గణింతురు. దేశరక్షణ ఆవశ్యకమైనప్పుడు తమయావదాస్తిని నిర్లక్ష్యముగ ధారపోయుటయేకాక. అత్యుత్సాహముతో జీవితమునుకూడ దేశక్షేమమునకై విడుతురు, ఈవిషయమున వారి స్వార్థత్యాగము నిరుపమానము, "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" యన్నసుడి వారికే చెల్లును. ఇట్టి స్వార్థరహితమగు నిష్కళంక దేశాభిమానమే జపానుఅభ్యుదయమునకు గారణము.

ప్రజలయందలి దేశాభిమానమునకు తోడు ప్రభువులు, పాలకవర్గమువారుకూడ నట్టి మహోన్నతాశయమునకే పాటుపడి, దేశసౌభాగ్యమే తమసౌభాగ్యముగ నమ్మి, విధివిరామములు లేక సర్వశక్తుల ధారవోసి, దేశౌన్నత్యమునకు పునాదులు వైచి, భావిభాగ్యోదయమునకు బాసటయై నిలచిరి. ప్రపంచచరిత్రయందు మరెచ్చటను ఇట్టిరాజాదరణము కన్పింపదు. దేశమున పరిశ్రమలు లేనికాలమున ప్రభుత్వధనము వెచ్చించి, పరిశ్రమాలయముల నిర్మించిరి. విదేశములనుండి గొప్పగొప్పపండితులను, శాస్త్రజ్ఞులను రావించి దేశమందు విజ్ఞాన మభివృద్ధిపరచిరి. విద్యార్థివేతనము లిచ్చి విద్యార్థుల విదేశములకంపి వృత్తివిద్యలను (Technical Education) విరివిగా వృద్ధిపరచిరి. ఇంతటితో తృప్తినొందక కంపెనీలు కాని, వ్యక్తులు కాని పరిశ్రమల స్థాపించినపుడు వాటికి వలయు సర్వసదుపాయము నొడగూర్చుటయే కాక, మూలధనమును సర్కారువారు అత్యల్పమగు వడ్డీలకు ఋణమిచ్చుచుండిరి నౌకానిర్మాణ మభివృద్ధిచేయుటకు ప్రథమమున ప్రభుత్వమువారే స్వయముగ నిర్మాణాశ్రయముల (Dock Y. rds) నిర్మించిరి. తరువాత నీపరిశ్రమ నభివృద్ధి నొందించుటకై Navigation Bounty Laws, Overseas ship Subsidy Act, Ship-building Encouragement Act మొదలగు చట్టముల గావించి దూరము ప్రయాణముచేసిన, జపానువారిచే, జపానుదేశములో, జపానుధనముతో నిర్మింపబడి, జపానునావికులచే నడుపబడు ప్రతినౌకకు నెంతదూరము పయనమొనరించిన నంత పారితోషికమిచ్చుట మొదలగువిధముల పరిశ్రమ కుత్సాహము గలిగింపజొచ్చిరి. ఇదేవిధముగ, చౌకగ నమ్ముటకై వస్తువును తుచ్ఛపురకముగా తయారుచేసినవారు దండింపబడుదురని మరియొకశాసనము గావించి, లోకములో జపానువస్తువులన నెందుకును కొరగానివను నిదివరలోని యపవాదమును తొలగించివేసినారు. వేయేల? నేడు జపాను ఇంతటిగొప్పపదవిని బొందగలిగినచో నదియంతయు రాజాదరణము, ప్రజాభిమానముచేతనేకాని మరియొకకారణములేదు.

వీనికితోడు జపానుదేశములో పరిశ్రమలలో కూలీపనియంతయు సామాన్యముగ స్త్రీజనము చేయుచుండుటచే, పాశ్చాత్యదేశములన్నిటికంటె చాలచౌకగ కూలీలు దొరుకుదురు. అందుచే ఉత్పత్తిచేయుట కగుఖర్చు చాలతక్కువగును. దానినిబట్టి యితరదేశములకన్న మిక్కిలిచౌకధరలకు వస్తువులను జపానువారు విక్రయింపగలుగుచున్నారు.

జపానీయులందరును చాలపాటు పడెడివారును, పట్టుదలగలవారును. తమసోదరజాతియగు చైనావారికి గల మాంద్యము వీరికి లేదు. వీని అన్నిటికన్న మిన్నయగునది, యేయితరజాతియందైనను సరే నేర్వవలసినసంగతులున్నచో, నిశ్శంకతో, నీషణ్మాత్రమైన దురభిమానము లేక స్వీకరించెదరు. పాశ్చాత్యప్రపంచముతో సంబంధము కలుగగానే తమపూర్వపుటలవాట్లను, కట్టుబాట్లను ధైర్యముగా వదలివైచి, వారి యాధునికపద్ధతుల నింతమనముతో నంగీకరించి యావిధానములపైననే జపాను నభివృద్ధికి దెచ్చిరి. ఇతరుల పద్ధతుల నవలంబించుటయందును, వానిని తమ కనుగుణముగ నుపయోగించుకొనుటయందును జపానీయులకు గల యనువదించుశక్తి (Adaptability) మరి యే యితరజాతికిని లేదు. మనహిందుదేశములోవలెనే జపానులోను పూర్వ మనేక విభేదము లుండినను, ఉన్నతజాతులవారు తమయధికారములను దేశక్షేమునిమిత్తము బుద్ధిపూర్వకముగా వదులుకొనుటచే దేశమున నైకమత్యము సులభముగా వ్యాపించి జాతీయాభివృద్ధికి వారిత్యాగము సహాయకమయ్యెను. జపాను పాశ్చాత్యవిధానముల నంగీకరించినను, పాశ్చాత్యనాగరికతను స్వీకరించినను వాటిసారమునే గ్రహించి యుపయోగించుకొనుచున్నదికాని, గ్రుడ్డిగా వాటి ననుకరించి పాశ్చాత్యులలో లీనము కాక, జపాను తనవ్యక్తిత్వము నంతటను గాపాడుకొనుచున్నది.

ఇదేవిధముగ నేదేశమైనను, ఎంతటి యధోగతి నందున్నను, తమస్వశక్తిచే, పట్టుదలతోగూడిన జాత్యభిమానముచే నత్యల్పకాలములో నున్నతస్థితికి రాగలదని జపానుచరిత్ర ప్రపంచమునకంతకు నాదర్శమై చాటిచెప్పుచున్నది ప్రాచ్యదేశీయులు సహజముగ నలసబుద్ధులనియు, వేదాంతులనియు, మూఢవిశ్వాసములుగలవారనియు (Philosophic and Superstitious) నిరుపయోగములును, అభివృద్ధికాటంకరము లునునగు ప్రాచీనాచారముల నంటిపెట్టుకొనియుండువారనియు, నైహికప్రపంచమున నార్థికాభివృద్ధికి తగరనియు జాటెడి పాశ్చాత్యులకును, మనవారికిని, జపానుఅభివృద్ధి తగుకీతిని ప్రత్యుత్తర మీయగలదు నేటికైనను మూఢవిశ్వాసములను, అంతఃకలహములను విడచి, తమయందు దాగియున్న శక్తిసామర్థ్యముల గ్రహించి, జపాను నాదర్శముగ గొని, భారతీయులు తమదేశాభివృద్ధికిని, జాతీయాభివృద్ధికిని యత్నింతురుగాక

[జపాను అభివృద్ధిని సూచించు ముఖ్యవిషయములు మాత్రమే యిందు తెలుపబడి, సాధ్యమైనంతవరకు వివరములు తగ్గింపబడినవి.

# యూనిక్ అస్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్
# వారితో భీమాచేసికొనుడు

## స్థాపితము : 1912—హెడ్ ఆఫీసు:—కలకత్తా

దేశబంధు సి. ఆర్. దాసుగారిచే

స్థాపింపబడినది.



దానిపాలిసీ లధిక వ్యయము లేకుండ (1) శాశ్వత అశక్తులకు లాభములను, (2) వృద్ధాప్యమందు లాభములను సమకూర్చును.

గతించిన పాలసీలు నవీన స్కీములో మరల నుద్ధరింపబడు చున్నవి. ఇందు పాతబాకీ ప్రీమియములు చెల్లింప నక్కరలేదు కాన పాలసీదార్లు ఎవ్విధమైన నష్టము నొందరు.

హక్కుదారుల గూర్చి చిక్కేమియు లేనియెడల చావును తెలియ చేసినచో సగము సొమ్ము ముందరగా పంపబడును.

ఈ కంపెనీ మిక్కిలి ఉత్తమమైనట్టియు, నవీనమైనట్టియు, భీమావిషయముల నేర్పాటుచేసియున్నది.

కడపటి అయిదుసంవత్సరముల లెక్కల కట్టుటలో రు 1000 లకు రు 50 లు

బోనసును ప్రకటించియున్నది. ఈదఫా వాల్యుయేషనుకు

యింక నెక్కువబోనసు నివ్వ వీలున్నట్టి సూచనలుగలవు.

ఈ కంపెనీ ప్రీమియములు చాల తక్కువ.

యునీక్ వారి ఏజెన్సీని తీసికొనిన మీకు లాభింపగలదు.

వివరములకు యీదిగువ విలాసమునకు వ్రాయుడు:—

బ్రాంచి ఆఫీసులు :— **మదరాసు, లేక బెజవాడ.**

చీఫ్ ఏజెంట్లు :—**మెస్సర్సు శ్రీనివాస అండు కో.,**

నైజాంరాష్ట్రము, **ఒరంగల్.**

(మహాత్ముని చిత్రములు)





 1. మహాత్ముడు సబర్మతీ ఆశ్రమమునుండి బయలుదేరుట. 2. నెల్లూరులో వి. ఆర్. కాలేజి ఆవరణమున బహిరంగసభ.





1. మహాత్ముడు వెంకటగిరిలో. 2. హిందూపురములో.



కాకినాడ వంతెన
(Cocanada Bridge)

—K. Venugopal.









1. సీతానగరసత్యాగ్రహాశ్రమమున మీరాబెహ్‌గారు హరిజనబాలికలకు ఖద్దరుపంచిపెట్టుట. 2. సిర్సిపురమువద్ద అడవిలో మార్గమధ్యమున గ్రామస్థులతో మహాత్ముని సంభాషణ. 3. స్టేషనులవద్ద జనసమూహము. 4. విశాఖపట్టణములో విశ్వనాథంగారి మేడపైన మహాత్ముడు.





1 పాలకొల్లువద్ద జనకాశ్రమమునకు మూలరాయివేయుట 2 కావలి సభలో

ఆర్థికపరిణామము, చరిత్ర, రాజ్యాంగవిధానము మొదలగు ఇతర వివరము తెలుసుకోగోరువారు క్రిందచెప్పినపుస్తకముల జూడగోరెదను

౧ The Economic aspects of the History of the Civilisation of Japan—3 Volumes. by Y. Tokokoshi.

౨ History of Japanese religion with special reference to the Social and Moral life of the nation. by Anesaki Masahara.

౩. The Economic development of Japan. by Yuhara.

౪. Japan Year Books ]

---

# జీవతత్త్వము

ఉమర్ అలీషాకవి

* రాగము బిలహరి - తాళము అట

జీవునికథనము, జెప్పెదవినుము,
ఈవిశ్వమును జేరగ, వచ్చినత్రోవ. జీ.

ఆవిరాట్టునుండి, ఆనాడు తెగిపోయి-
ఆవిర్భవించి మర్త్యాకారమందగ
చావుపుట్టుకలనెడు ద్వైధీ
భావములఁ బడి జడునికై పడి
కేవలాజ్ఞానాంధకారమె
తావలంబగు తనువుతోనను. జీ.

ఈపంచభూతాల, నిమిడిన విషయాల
ప్రాపుజేరి ప్రపంచములోపల
ఆపదలనుభవింపగను జన్మించి స
ద్రూపముచెడియేదో, రూపము గైకొని.
కాపురము జేయుచును సతిసుత
రూపతాపత్రయములను బడి
ఆపరబ్రహ్మస్వరూప మ
హాపదార్థము మఱచి తిరిగెడు జీ.

శారీరకపు సౌరు, కారణమగుతీరు
కోరి పుత్రదారేషణావస్థల
మీఱగలేక సంసారఘోరపారా
వార మీదు దారి, నేరక గాఢాంధ
కారమగు ప్రారబ్ధకర్మా
గారమున జడుడగుచు తొంబది
యాఱుచక్రము లున్న తనువను
నీరథంబును నడుపుచున్న. జీ.

రేలని పగలని, కాలచక్రములోని
కీలుదెలియలే, కార్తి పాలైకల
కాలము విషయ సౌఖ్యాళి నోలలాడి
యీలోకమే నిజమంచాలోచించి యెపుడో.
కూలియీ తిరుగలిని బోలెడు
కాలనిహతిని బూడిదైతుది
ధూళిధూసరములను గలిసి వి
శాల విశ్వము విడిచి పోయె. జీ.

---

* రామునీచరితము - కోమలివినవె—అనువరుస.

మాయయు ఆ ప్రతి, చ్ఛాయయు గలనుప
దేయమైనయీ, కాయమే యవి
ద్యాయతమగు దే, హావరణ విక్షేప
మైయొప్ప కూటస్థ,మైయున్న పరమాత్మ
కీయుపాధియు నింద్రియంబులు
నీరజస్సత్త్వాదిగుణముల
నేయవస్థల నంట కదిజల
తోయజంబుల తీరు దనరును, జీ.

అనురూపముగమాఱె, జననిగర్భముజేరి
జననమొంది బా,లేందు బింబాకృతి
దినదినము పెరిగి జీ, వననాట్యరంగమున
జని కాలుమోపిన,ర్తనము చేయుచు స్వీయ
ఘనమహాచరితంబు పాడుచు
వినుచు నీమూనాళ్ల సంతను
గనుచు నిది తనదనుచు తుది కల
గను విధంబున విడచినడచే. జీ.

ఈకర్మవాంఛల, చీకాకు పడిచాల
శోకమోహాభ, మైకమౌ నూహల
ఆకాశమునకు భూ,లోకంబునకు త్రాళ్ల
తో కట్టియూగగ, ప్రాకిప్రాకియెపుడో
ఈకళేబర మిచట విడచియు
నాకమున కేకాకినై యా
భీకరములగు పథములను బడి
పోకమునుపే తెలిసికొనుటకు. జీ.

అఆఉతత్వముల, మీఱిన యోంకార
కారమైన యా,కారమె జీవుడు
ఆరూఢి సుషుమ్న, దారినివ్వరిముల్లు
తీరుమెఱయుచు హరిని, జేరు ధారణయందు,
ఆరహస్యముతెలిసి ఉమ
శాలిపాకవివలెను సాధకుఁ
డాఱితేరి వివాద మణఁచియు
నూరకొను నానందమందుచు. జీ.

ఇదేసమాధి,యియ్యదె యోగ,మిదియెశాంతి
శాంతిపారకుడా యిట్లు స్వాంతశరధి
పొంగి పొరలుతరంగాల మునిగితేలి
వ్రాసితిని గీతి యీరీతి, పాడిపాడి.



# స్వసంరక్షణ సూత్రము

వల్లూరి సూర్యనారాయణ రావు

ఈ ప్రపంచమునందుండు చరాచరసృష్టిలో ఒకజీవి మరియొకజీవిని తినుచున్నగాని తాను బ్రతుకనేరదు. ఇది ప్రకృతిలో స్వభావజన్యమైనది. జీవత్వము వృక్షాదులయందు కూడ కలదని జగదీశచంద్రబోసు మొదలగు భౌతికశాస్త్రజ్ఞులందరు ఒప్పుకొన్న విషయమే. అట్టి జీవులను తిని కీటకాదులు, సరీసృపములు, పక్షులు, మృగములు, మనుష్యులు మొదలగు జీవరాసులన్నియు బ్రతుకుచుండుటయేకాక వీనిలో కొన్ని ఒండొరులను చంపుకొని తినుచు జీవించుట మనము కన్నులార ననుదినము చూచుచునే యున్నాము. ఈ నిరంతర మగు పోరాటములో బుద్ధిబలము,శరీరబలము కలవి యెక్కువకాలము జీవించుచు, వానిసంఖ్యను వృద్ధిపరచుకొనుచుండును. మానవునకు తక్కిన జీవరాసులకంటె, ప్రకృతిపరిణామమునుబట్టి బుద్ధిసంపద యెక్కుడగుచుండుటవలన, తానేకపరికరములను, సాధనములను, ఆయుధములను, యంత్రములను మొదలగువానిని కనిపెట్టి తక్కిన జంతువుల నన్నిటిని తనస్వాధీనము చేసికొని వానిమీద జీవించుచున్నాడు. ప్రకృతిరహస్యములను ఇంకను పరిశోధించి కనుగొనుచున్నాడు. ఈకారణముచేతనే తన పూర్వులును, అతిసమీపబంధువులును నగు ఓరాంగు, చింపాంజీ, గిబ్బన్,గోరిల్లా మొదలగు మర్కటజాతులను కూడ పరిమార్చి, తాను కోటానుకోట్లకొలదిగ వృద్ధియై ప్రపంచమంతయు నిండిపోవుచున్నాడు. అనేకవిధములైన ఉద్భిజ్జములను తాను జీవించుటకు పెంచుచున్నాడు. తన నాగరికత వృద్ధియైనకొలది తనసోదరు లగు అనాగరికజాతులును, నానావిధములైన వన్యమృగములును పేరులేకుండ అనేకలక్షలశతాబ్దములనుండి క్రమక్రమముగా కృశించి నశించిపోయినవి. ఇప్పుడును పోవుచున్నవి. ఇట్టి స్వార్థపరత్వము ప్రకృతిలో నంతటను మనకు గోచరించుచున్నది. ఆత్మరక్షణసూత్రము ఎల్లెడలను వర్తించుచున్నది.

కాని, మానవులు పూర్వకాలములో ఒకరినొకరు చంపుకొని తినుచుండినను, ఇటీవల వారి బుద్ధివికాసము వృద్ధియైనకొలది, మానవజీవిని పోషించి నిలుపుచుండుట సంఘాభివృద్ధికి ముఖ్యమని యెంచి, నరమాంసభక్షణమును మానుకొనుటయేకాక ఆత్మహత్య కూడ పాపకార్యమని శాసించిరి. అన్యజంతువుల మాంసభక్షణమునుమాత్రము మానలేదు. కాని, దయాదాక్షిణ్యములు పెంపొందించుకొని వానికి అనవసరమగుబాధ కలుగజేయకుండ వానిని భుజించుచున్నాడు. అట్లు వీరు చేయనిచో ఆజీవరాసులు వృద్ధియై మానవులకు తినుటకు గడ్డికూడ దొరకకుండ చేసియుండును.

"అహింసా పరమోధర్మః"అనునీతిసూత్రమున్ని మతములలోకూడ ప్రతిపాదింపబడియున్నది. హింస యనగా కేవలము జీవముతీయుటయే కాదు. ఇతర ప్రాణులయొక్క మనస్సునకైనను, శరీరమునకైనను ఉపద్రవము కలుగజేయుట, అట్లుచేయతలంచుట సైతము హింసక్రింద వచ్చును. కాని, స్వసంరక్షణసూత్రమునకు ఈఅహింసాసూత్రము సామాన్యముగా లోబడక తప్పదు. "జీవితం మరణాచ్ఛ్రేయో జీవన్ ధర్మమవాప్నుయాత్", "జీవన్భద్రాణి పశ్యతి" బ్రతికియుండిన ధర్మమొనర్పదగును. ధర్మసాధనముకైనను ముందుగా

బ్రతుకుతెరవు చూచుకొనవలెను కావుననే ధర్మదృష్టి ననుసరించి చూచినను మరణముకంటె జీవితము శ్రేయస్కరము. మానవులలో ఎక్కడనో కొందరు ఉత్కృష్టమేధాసంపత్తికలిగి వాదప్రతివాదనలను దూరదృష్టితో విమర్శించి, స్థూలసూక్ష్మధర్మములను పరిశీలించి, తమ దేశముకొరకుగాని, తోడిప్రజలయోగక్షేమమునకైకాని తమప్రాణముల నిచ్చెదరుగాక ఇది యంతయు ప్రకృతి స్వభావమునకు విరుద్ధమేయని చెప్పవలసియుండును.

మనుష్యులలో వ్యాఘ్రత్వ మెన్నటికిని పోనేరదు. వీరు వ్యాఘ్రములకంటెను నైతికవిషయములలో, అధములనియే యెంచవలెను. వ్యాఘ్రము తనయొక్కయు, తనపిల్లలయొక్కయు తత్కాలపు ఆకలిని తీర్చుకొనుటకుమాత్రమే యితరజంతువులను హింసించును మానవుడు తనసోదరులను కొల్లగొట్టియు, హింసించియు, ద్రోహము చేసియు తనకు, తనపిల్లలకేకాక, తనకు కలుగబోవు భవిష్యత్సంతానపరంపరకు వంశపారంపర్యముగ నుండునట్లు ఆస్తిని సేకరించుటకు సదా ప్రయత్నించుచునేయుండును. తా ననుభవించుటకు భోగవస్తువులకంతము లేదు ఆశకు మేరలేదు జీవరాసులలో మానవుడే యెక్కువ హింసను కలుగజేయుజంతువు. తనకుటుంబమును, తనజాతిని వృద్ధిపరచుకొనుటకు ప్రపంచములోనుండు నానావిధ వృక్షలతాగుల్మములను, తక్కినజీవరాసులను తానువశపరచుకొని, ప్రపంచమునంతయు నేలుచున్నాడు తనకు, తనజాతికి హానిచేయు జంతువులను చంపివేయుచు తాను తినదగినప్రాణులను మచ్చికజేసికొని వానిని పెంచుకొని తినుచు, తనపొట్టపోసికొనుచున్నాడు.

మానవకోటిలో వ్యక్తులమధ్యనే యిట్లు హింస ప్రబలియున్నపుడు, జాతులనుగురించి వేరుగ చెప్పనక్కరలేదు ఈ ప్రపంచములోని వివిధ మానవసంఘములు ఎల్లపుడు ఒండొంటితో పోరాటములుసల్పుచు, చిన్నవానిని, బలహీనమైనవానిని పెద్దవిమ్రింగివేయుచు వీలుగానిచోట్ల సంధిచేసికొనుచు సామదానభేద దండోపాయముల నుపయోగించి జీవించగలుగుచున్నట్లునానా దేశచరిత్రలు స్పష్టపరచుచున్నవి. ప్రతికుటుంబములో ధనవంతులు, ప్రయోజకులు, దరిద్రులు - ఎట్లు వంశపారంపర్యముగ మార్పులు జరుగుచున్నవో ఆవిధముగానే మానవసంఘములకుకూడ వృద్ధిక్షయములు కలుగుచునేయుండును నేటికిని అట్లే జరుగుచుండుట మనము చూచుచునేయున్నాము మానవసౌభ్రాత్రమనుమాట కొందరి నాలుకలమీద ఆడుచుండునేగాని ఆచరణలో ఏజాతిలోను లేదని యీ యిరువదవశతాబ్దములో కూడ స్పష్ట మగుచున్నది.

కాబట్టి గాంధిమహాత్ముని అహింసా సూత్రమునకు దేశకాలపరిస్థితులనుబట్టిఅనేకములు మినహాయింపునకు అవకాశము లున్నవి ఈయన నరమాంసభక్షకుల సంఘములో నుండుట తటస్థించునెడల, ఈ సూత్రములకు ఆసంఘమువారిని ఒప్పించలేడు సరికదా యీయనయే జీవించుట కడుదుర్లభము భగవద్గీతయే దీనికి దృష్టాంతము దాని యుపక్రమోపసంహారములే యిందుకు తార్కాణము సామ దాన భేద దండోపాయములు సర్వదా ఆయా కాలపరిస్థితులను బట్టి, సంఘములోని అధికసంఖ్యాకుల యభిప్రాయమును బట్టి ఉపయోగపరచబడుచుండును అట్లు చేయనిచో ఆ సంఘము జీవించనేరదు బలమైనజాతికి బానిసయైతుదకు దానిలో కలసిపోవును గాని, దాని ప్రత్యేకతను నిలుపుకొనజాలదు ఈ అంతర్జాతీయ మగు పోరాటము ఎన్నటికిని నశించదనుటకు నానాజాతిసభయు, ఆయుధవిసర్జనసభయు, ఆర్థికవిషయకసభయు విచ్ఛిన్న మగుచుండుటయే ఒక గొప్ప దృష్టాంతము దొంగలు దొంగలు కలసి ఊళ్లు పంచుకొనునట్లు బలవంతులైన కొన్నిజాతులు బలహీనజాతులను పీడించుటకే యిట్టి సభలు యేర్పాటైనపుడు, వారిలోవారికి పొత్తు తెగక యెవరిస్వార్థమును వారు రక్షించుకొన ప్రయత్నించుచున్నారు ఇది ప్రకృతియొక్క స్వభావలక్షణమే కనుక మన మాశ్చర్యపడవలసినపని లేదు. ఈ విధానములో

తప్పొప్పులు పాటింప నక్కరలేదు. చర్చల కతీత మైనది స్వసంరక్షణకొరకు అట్లు ప్రతిసంఘము చూచు కొననియెడల అది అస్వాభావిక మనే యనవలెను. త్యాగము మానవునికి స్వాభావికము కాదుగనుకనే, అది వారిలో అరుదుగ కనుపడుచుండును దానిని ఉత్కృష్టధర్మముగ ప్రజ లెంచుకొనుట తటస్థించుచుండును ఇట్లి మానవస్వభావమును మార్చుకొననియెడల, మనము పశుతుల్యులమని వేదాంతులు చెప్పుచుందురు. అట్లుగాక మరియేమి?

ఈనూతననైతికాభివృద్ధి అనేకవేలసంవత్సరముల క్రిందటనే మొదలుపెట్టబడి వ్యక్తులలో ప్రబలి సంఘము కట్టుబాట్లకు, సంఘస్థిరత్వముకొరకు సాంఘిక, మత, రాజకీయశిక్షలవలన పెంపొందచేయబడినవి కాని, యీనైతికమార్గము, కడుపుకాలుచున్నపుడు ప్రజ లంగీకరించుట అసంభవము మతసాంఘికరాజకీయనిబంధనలన్నియు స్వసంరక్షణసూత్రము నుల్లంఘించితీరు ననియే పాలకులు పాలితులుకూడ యెరిగియుండి, పట్టువిడుపులతో రాజ్యపరిపాలన కావించుచున్నారు వారిలో బలహీనజాతులు, స్వసంరక్షణకు వివిధోపాయములను ఆచరణలో పెట్టుచుందురు ఆంగ్లేయపార్లమెంటులో, నిజమును మరుగుపరచకుండ కుండబద్దలు గొట్టినట్లు చెప్పువాడు చర్చిల్‌దొర ఒక్కడే తక్కిన వారు తమ నిజాభిప్రాయములను మరుగుపరచి, రాజనీతి తంత్రజ్ఞులుగా ప్రవర్తించి తమదేశజుల స్వార్థమును జాగ్రతగ కాపాడుకొనుచు, మనకు కొద్దిమెతుకులు పార వేయజూచుచుందురు 'మొండివాడు రాజుకంటె బలవంతు' డనుసామెతనుబట్టి మనలో కొందరు సహాయనిరాకరణవిధానము నవలంబించెదరు. వీరిలో ఎవరికిని అహింసాసూత్రమునందు నమ్మకము లేదు స్వసంరక్షణ కొరకే యీసామదానభేదదండోపాయములు వ్యక్తుల చేతను, సంఘములచేతను అవలంబింపబడుచున్నవి.

---



సింహాచలదేవాలయములో నొక స్తంభము —పి వి రామారావు

# శబర శంకర విలాసము

విద్వాన్, వెంపరాల సూర్యనారాయణశాస్త్రి

[ప్రదేశము:—హిమవత్పర్వతమందలి వనము

పార్థివలింగమును బూజించుచుఁ దపస్వివేషధారియగు నర్జునుఁడు ప్రవేశించును]

అర్జు:—(ధ్యాననిమీలితాక్షుఁడై ఫాలమున నంజలిపట్టి)

బాలశశాంకశేఖర, యపారకృపాకర, ముక్తివల్లికా
వాల, మునీంద్రమానసనివాస, జగత్పతి, సర్వమంగళా
కీలితవామగాత్ర, నిజకింకరకింకర, దేవదేవ, నా
పాలిటి కల్పకంబ, పరిపాలనసేయవె నన్ను శంకరా!

కౌరవనాథకల్పితనికారమునన్ సహధర్మచారిణీ
గౌరవభంగమున్ గనులఁ గాంచి, త్యజింపఁగలేక ప్రాణముల్
భీరువులట్లు కుందు చటవిన్ బడియుండెడు మాకు నీపదాం
భోరుహముల్ గదా శరణముల్ జగదీశ్వర, శంకరా, హరా!

తల్లి యనాథయట్లడలు దాయలయింట వసించి, బిడ్డలో
తల్లిని బాసి, రన్నలును దమ్ములు ద్రౌపది కామ్యకంబునం
దుల్లల పొక్కుచుండి, రిట నొక్కఁడనే దపమాచరింతు నీ
సల్లలితాంఘ్రిపద్మముల స్వాంతమునన్ ఘటియించి శంకరా!

బాల్యంబాది విరోధమూని మముఁ జంపన్ జూచి, చాకున్నదౌ
శ్శీల్యం బొప్ప, దురోదరంబున మహీశ్రీమానముల్ గొంచు హృ
చ్ఛల్యంబౌ నల ధార్తరాష్ట్రుని సపుత్రక్షేత్రమిత్రానుజా
వర్యాప్తంబుగఁ ద్రుంప నెక్కరణి నాస్వాంతంబు శాంతం బగున్?

పారాశర్యమహోపదేశమున జంభద్వేషి సేవించి, త
త్సారాస్త్రంబులఁ బొంది, పాశుపతమంత్రశ్రేష్ఠ మార్జించి యా
చారం బొప్ప జపింతు నెన్నఁటికి నో చంద్రార్ధకోటీర, యీ
దారిన్ వత్తువొ? వచ్చి వత్సలతఁ జేతఃకాంక్షితం బిత్తువో!

(కన్నులుదెఱచి నలువంకలఁ గాంచి)

తారైపాఱెడు కొండయేఱులఁ, దమంతన్ బుట్టి పుష్పచ్ఛదాం
కూరోదారములైన భూరుహలతాకుంజమ్ములన్, సుస్వర
శ్రీరాజచ్ఛుకకోకిలాదికమునన్, జైవ స్వభావోక్త్యలం
కారోదాహరణంబుగా వెలయు నీకాంతార మూహింపఁగా

అఖిలావయవతాప మాఱంగ సోఁకెడు శీతలపవమానపోతములును
గనులకుఁ జల్లనై కనుపట్టు కోమల శ్యామలచ్ఛదమహాభూమిజములు
శ్రవణపర్వంబుగా రవళించు పరభృత శారికాదిద్విజాతిగణము
రసనారసాయనక్రమమైన శైలాగ్రవిచ్యుతనిర్ఝరవిమలజలము
నాసికాపుట సంతర్పణంబు సలుపు
సకలసుమగంధములును నైసర్గికముగఁ
గలుగుచుండంగ మును లేల కాననిడిచి
కృత్రిమసుఖంబు గార్హస్థ్య మిచ్చగింత్రు

ఎంతసుఖంబులేనిదె మునీంద్రులు దారసుతాదివైభవం
బంతయు రోసి యాకలము లాఁకటికిన్ దినుచున్ మహీరుహ
ప్రాంతము లాశ్రయించి చలిబాధకు నెండకు మేనొసంగి యా
త్మాంతరుపాధులై వనములందుఁ దపింపఁగ వెఱ్ఱివారొకో!

ఫలదళజలంబు లొక్కొక
నెలభోజనముగను మూఁడునెల లరిగిన వీ
నెల వాయుమాత్రభక్షణ,
మలవఱచిన నదియు శివునయన్ సుఖమిచ్చున్

(మఱియొకవంక దృష్టిసారించి చూచి)

ప్రళయకాలపయోదపటలంబు నటు మీఱు కర్కశనీలిమాకలితతనువు
మథ్యమానాబ్ధిభ్రమన్మందరధ్వానిఁ గొనగొట్టఁ జిమ్ము ఘుర్ఘురరవంబు
సంచరద్వనమృగకంపిధ్ధ్వనిశ్రుతినిగళితానలకణవీక్షణంబు
భూజాతమూలసమున్మూలనపటిష్ఠదంష్ట్రావిభూషితోద్దండపోత్ర
మమర నల్లదె యొక వరాహంబు సర్వ
చేతనభయావహంబు నిస్సీమవేగ
ధూర్వహంబయి కనుపట్టు దురమందు
(సంభ్రమముతో) నవునిటులె వచ్చుచుండె నేలా యుపేక్ష?

కోదండకాండతూణీ
రాదుల ధరియింతు నింక నాఁగిన వన మీ
భూదారమపాలై చెడుఁ
గాదన కిఁకఁ బూనవలసె క్షాత్రము నిపుడే.

(ధనుష్పాణియై నిలిచి)

చాపవిముక్త శాతశరసామ్యమునన్ రయమొప్ప ఘోణి యీ
దాపున కేగుదెంచె నికఁ దప్పక గాండివముక్తబాణధా
రాపతితం బొనర్చెద,—విరాగిని నాకు నధర్మ—మైననే
నేపగిదిన్ వృథామృతి సహింతుఁ బ్రతిక్రియ నేర్పియుండియున్

ఇదె విడిచితిఁ గోలముపైఁ
బ్రదరం బీదెబ్బతోడఁ బడి మృతిగను—న
ల్లదె వేఱొకబాణము నా
ప్రదరముతోఁబాటె యవలిప్రక్కను దాఁకెన్

ఇది యెటనుండి వచ్చెనొకో—(బాణమువచ్చినవంకఁదేఱిపాఱఁజూచి)

యెవ్వఁడో యొక్కకిరాతుఁ డట్ల య
ల్లదె కనుపట్టు—నౌ,శరశరాసనముల్ కయిఁబూని వచ్చుచుం
డె,దరిన యూర్పులూర్చుచు గణిల్లుగణిల్లని కంఠశృంఖలల్
రొదయొనరింపఁ గుక్కలవె రూక్షనిరీక్ష మొప్ప వచ్చెడున్

కూకలిడుచు మైకోకల
కాకులు ధరియించి కాకులటు గుంపయి, కా
లాకృతుల శబరసేన ల
వే కావంబిని హసించి యేతెంచు వడిన్

కాంతు లొకింత డీలుపడ ఘర్మజలంబులు ఫాలపట్టికా
క్రాంతములై కపోలములఁ గ్రమ్మఁగఁ బయ్యెద నొత్తుచున్, లలా
టంతపభానురోచి కకటా! కనువమ్ములు వాడుదేర, నా
చెంతనె యుస్సురుస్సురని చెంచిత వచ్చుచునుండె నల్లదే

వేఁటవు నీశబరుఁడు రా
నోటు సబలుఁ డగుచు, వీని నొటువడి నిరా
ఘాటజవంబున నీకిరి
నా టెంకికిఁ బాఱుదేర, నారస మేయున్

ఆయమ్మను, నాయమ్మను,
గాయమ్మనఁ జొచ్చి యసునికాయముఁ గొనఁగాఁ
గాయ మ్మిలపైఁ బడి కిరి
మాయమ్మైపోయె నేమిమాయయొ యవురా!

నిట్టూర్పులు దండడిగొనఁ
గట్టలయిక మాటరాక, గరమెత్తి, ననున్
గిట్టుగతి యలుకచూపుల
నుట్టిపడఁ గిరాతుఁ డేమియో వినఁబలుకున్

(యథోక్తరీతి శబరుఁడు ప్రవేశించును)

శబరుఁడు —

అవురా యెంతగఁ బోతరించితి మృగవ్యన్యాయ మూహింప, క
న్యవనాటకృతలక్ష్యజంతుహననవ్యాపారముం బూని తీ
యనివేఁట బెట నేర్చికొంటివి వరాహం బేమిగానీ! దుర
ధ్వనిహారిన్ నినుఁ దొల్తఁ గూల్చ నిదె చాపం బెక్కుడింపన్ జుమీ

శిరమునఁ గొంజడల్, మెయి నశేషమునన్ బసుమంబు, వల్కలాం
బరములుఁ దాల్చి మౌనిమహిమన్ గనుపట్టుచు, విల్లు దాల్చి, ని
ష్కరుణపు వ్యాధజీవితము గైకొని,యందును నీతితప్పి నా
శరమున కడ్డువచ్చెదవె? చంపకయుందునె యిట్టి నీచునిన్?

మూఁడునాలనుండి జలమున్ గొన కన్నము నిద్రలేక యీ
క్రోడము వెంబడిన్ గిరులుఁ గోనలుఁ గానలుఁ జొచ్చిచొచ్చి యీ
నాఁ డగపడ్డ సంతసిలి నాదొరసానికి దీని మాంసమున్
సూడిదసేయ నేయ, నెడఁజొచ్చితివే శ్రమమెల్ల వమ్ముగన్

భంగములేకపాయనము పట్టితినేని ననున్ స్వయంగ్రహా
లింగనలాలితున్ జలిపి లేమ మనంబు నొసంగనుండె నో
వెంగలి, యడ్డువచ్చితివి, వేయిపునర్జననంబు లెత్తినన్
సంగతమౌనె యిట్టితఱుఁనం,బెటు సైఁచెద నిట్టి నిన్నికన్.

అర్జు —(సక్రోధముగా)

దుర్మదవృత్తిఁ జిత్తమునఁ దోఁచినవైఖరిఁ బ్రేలుచుంటి మ
తాౢర్మిక మింతకున్ సయిచెఁగాని యిఁకన్ సహియింపనోప, దీ
దుర్ముఖతాప్తి మాని, తొలుదొల్త భవత్సతిగండపాలికా
నిర్మితపత్రభంగకమనీయతఁ గావికొనంగ నెంచుమా!

మాకును లక్ష్యలక్షణసమన్వితమే మృగయానయంబు, నేఁ
డీకడ మౌని నాచుఁ దపియించుట శత్రుకృతావమానమున్
బోకడవెట్ట నెంచి సుమి, పుట్టుక రాచకొలంబునందు, నీ
కూకలకే చలింతునొకొ కొమ్ము శరాసము పల్కలేటికిన్

ఎవఁడనటంచుఁ జిత్తమున నెంచితివో చతురర్ణవీపరీ
తవసుమతీంద్రమౌళిమణిధాగధగీపరిచుంబితాంఘ్రియున్
వివిధమహాధ్వరవ్రతపవిత్రితమూర్తియు నైన పాండుభూ
ధవుసుతుఁడన్ యుధిష్ఠిరుని తమ్ముఁడ ద్రోణుని ముఖ్యశిష్యుఁడన్.

ఖాండవ మగ్నికొసఁగి యీ
ఖండలముఖ్యామరేంద్రగణము నోడిచి యీ
గాండీవముఁ గొనిన మహో
ద్దండుఁడఁ బార్థుండ నన్నుఁ దాఁకెద వటరా

కానీరా భుజకండువున్ దొలఁచి చక్కన్ జేసెదన్ ధర్మజుం
డానాఁ డున్నతి రాజసూయమును జేయన్ బూన నానావనీ
జానివ్రాతము నొంచి విత్తములు మెచ్చన్ దెచ్చు శౌర్యాప్తియీ
బోనన్ డిందెనటంచు నెంచకుర లోలో రాజుచుండెన్ జుమా.

శబరుఁడ నీవు నీతియును జాతియు మాలిన మూర్ఖ వంతెకా
దబలను దేహమే నొసఁగునట్టి మనోజరుజాకరుండ వె
ట్లు బవరమందు నిల్తు? వనిలో నినుఁ జంప ఫలంబు సున్న, యీ
శబరి సుమంగలీత్వ మెడసల్పుటమాత్రమ తక్కు నిస్సిరో!

ఎఱుక యిసుమంత లేమిని
'నెఱి'కన వ్యతిరేకలక్షణేరితనామం
బిరవొందు నమంగళవా
ఙ్నరమునకును మంగళాన్య సమాఖ్యారీతుల్

శబరుఁడు —(మండిపడుచు)

న్యాయముతప్పి నాకు గుఱియైన వరాహముఁ గూలనేసియుం
బోయవు మూర్ఖవంచనెదు, మూర్ఖుఁ డెవండొ తలంచి చూడు, మీ
చాయవసింప నీకెవఁ డొసంగె ననుజ్ఞ? యిదాజ్ఞ లేకయే
యీయెడ నుంటెకాక, తగవీఁగుటెకా కిటు ప్రేలఁజొచ్చితే!

పాండుసుతుఁడవో లేక యాఖండలాత్మ
జుండవో యెవ్వఁడైన నొక్కండె నాకు
గాండివమొ వెండొ నాకేల? ఖండనమున
సర్వ మెఱుఁగంగ నగుఁగాదె క్షణములోన

"ఎఱుఁగక చేసినాఁడ క్షమియింపుము న"న్నని వేడ కిక్రియన్
బిరుసుదనంబు మానవు, విభీషికలన్ వినినంత భీతిమైఁ
దొలఁగుదునే నినున్ గఱకుఁదూపులకోపుల రూపుమాప, కె
ల్లెఱుకులరాజ నైతి నిటులే నినుఁబోఁటుల కోహటిల్లుచోన్

ర మ్మొకించుక పురుషకారము గలాఁడ
వేని ధను వందికొను మది యిపుడ తెలియుఁ
గాతరుఁడవేని యొకనమస్కార మంచి
చనుము 'శరణ'న్నఁ జంపమి శబరనీతి

(అని యిరువురును విండ్లెక్కిడి యుద్ధము సేయు చుందురు)

శబరి —

దిగ్దంతికర్ణబాధిర్యసంధాయక జ్యానినదక్రియాప్రచండారవంబు
పుంఖానుపుంఖవిముక్త బాణగణచ్ఛటాచ్ఛాదితాశావియత్తలంబు
తర్జనభర్జన దర్పవాచాట్టహాసాహోపురుషికాసమంచితంబు
నన్యోన్యసంప్రయుక్తాంబక దళనక్రియానఘులక్ష్యవిజ్ఞానయుతము

నైన యీవీరపురుషఘోరాహవంబు
నకట! దూరస్థలిని నిల్చి యరయు నాకు
నదరె గుండెలు, ప్రాణముల్ చెదిరె, భయము
ముదిరెఁ, జెమటలు గదిరె, సమ్మోహ మెసఁగె

అటునిటుపడు ఖండితాశుగంబులు దాఁకినిదురించు పులిపిండు బెదరిపాఱఁ
దప్పించుకొను సంపాతాఁకునఁగుంభికుంభములు భేదిల్లి ముత్యములురాలఁ
బాదాభిఘట్టనఁబడు వృక్షముల క్రిందనసుటుంబముగమృగీచయ మడంగఁ
బైకేఁగు తూపుల సోఁకొంది పక్షులు విలవిలఁ దన్నుకొం చిలను గూల

వెనుక ముందటఁ గ్రిందమీఁదను గనంగ
సర్వతోముఖముగ వనీస్థలము విలయ
భావపరిపాకమునఁ బొందె నీవిపత్తు
తలఁగఁజేయు సమర్థు లీధాత్రి గలరె

(ఖేదము సూచించుచు)

అయ్యయో! పార్థుఁడేసిన యంబకంబు
ఘాలమునఁ గాఁడి ప్రాలేయభాను మ్రింగ
వ్రేలు రాహువుచందాన వ్రేల నాథుఁ
డొఱఁగుచున్నాఁడు మూర్ఛిల్లి ధరణిమీఁద

అహహా! యంతటిలోన తేఱుకొని చండాస్త్రంబులన్ శాత్రవున్
నిహతుంజేసి తదంబకంబులను దూణీరంబులన్ శాంబరీ
పిహితం బౌనటు సేయ, డిల్లపడి కంపింపంగ దేహంబు, దు
స్సహకోపంబున వింటఁగొట్టెఁ బతిమస్తంబర్జునుం డయ్యయో.

(సంతోషముతో)

బెండువడక నాయకుఁ డ
గ్గాండీవము గంగపాలుగా మాయమొన
ర్పం, డీలుపడీయు నరుఁ డదె
ఖండాగొని మోదె నకట! కాంతుని తలపై

అబ్బురం! బల్ల కత్తి మాయంబొనర్చి
నామనోహరుఁ డదె చిఱునగవుతోడఁ
బలుకుచున్నాఁడు విస్మయభయదురంత
కోపఘూర్ణితహృదయుఁడౌ కుంతిసుతుని.

శబరుఁడు.—

దండమువెట్టి యిష్టయిన 'దాసుఁడ'నం చన వీడుపాఁడఁ గో
దండము మండలాగ్రము వృథాయగుటన్ గనియుంటి, వింకనున్
ఖండనవాంఛ డెందమునఁ బాయదయేని భుజాభుజిన్ సమి
త్కాండముఁ బూర్ణమున్ జలిపెదన్ గ్రహియింతువుగాక తద్రుచిన్

అర్జు —(తనలో)

నిర్జరనాథాదులకున్
దుర్జయమయి పెనుఁగు నా ధను స్సీశబరుం
డూర్జస్వియయి హరించెనె
యర్జునుఁ డిఁక బ్రదుకనేల యవనికి బరువై

(ప్రకాశముగా)

మాయలమారివై రణసమర్థత చాలక చాపఖడ్గముల్
మాయమొనర్చి నిన్ను నసమానమదీయభుజద్వయీఘుర
ట్టాయతయంత్రమార్ణితనిజాంగునిఁ జేయక వందనంబులన్
జేయుదునంచు నెంచితె వచించితె? రమ్మిఁకఁ జూతు వారుచిన్

శబరి —

ఉరములు పొంగ, బాహువుల నొక్కరవంబుగ నప్పళించుచున్
బెరిఁగి గభీరయానములఁ బృథ్వి చలింపఁగఁ, దానకంబులన్
వరలుచు, నొండొరున్ గదిసి, పాయుచుఁ, బట్టుచు, దోర్యుగంబులన్
బోరిఁబోరి నొంచుకొంచు, నదె పోరుచునుండిరి మల్లపద్ధతిన్











మహాత్ముఁడు:—1. విశాఖపట్టణము హరిజనవాడలో ఉపన్యాసము. 2. ఆంధ్రదేశసంచారము ముగించి హిందూపూరునుండి మైసూరునకు ప్రయాణము. 3. కారులో కూర్చొనియే ఉపన్యాసము. 4. మైసూరు ప్రయాణోద్యమము. 5. తూర్పుగోదావరిజిల్లా హరిజనసేవాసంఘ కార్యదర్శితో సభకు పయనము.



మహాత్ముడు —1 ఏలూరులో బహిరంగసభ 2 వాల్తేరుస్టేషనువద్ద స్వాగతము 3 గుడివాడతాలూకా సిద్ధాంతములో సభ
4 కూనూరు మౌంట్ ప్లెజంటులో ఉదయము వాహ్యాళి 5 గుంటూరుసభ, కొం॥ వెంకటప్పయ్యగారు వేలము పాడుచున్నారు

(నిదానించి చూచి)

జానువు క్రిందనుండి పెంచక గరమొక్కటి చొన్ని కంఠముక
బూరికొనాని, వేటొకట సున్దొడఁ బట్టి, నభంబునకై దిర
ఫ్రీనుఁగ నెత్తి త్రిప్పివయిచెక భువి నాహృదయేశు నీనరుం
డానన మెఱ్ఱవాఱి శ్వసితానిలదోహలుడయ్యె నయ్యయో!

భువిని గూలనేసి పాదిని వక్షస్స్థలం
బెక్కి యవయవంబు లుక్కుసెడఁగ
గాంతు మేను ముష్టిఘాతంబులను ముద్ద
గాఁగఁ బొడుచుచుండెఁ గరినరీతి.

(సంతసము నభినయించుచు)

కరమునఁ బార్థు ముష్టి యటఁగకై గ్రహియించి ప్రియుండు వహ్వారే
ధరపయిఁ ద్రోచి తాఁచి బెడిసంబుగ జానుల నొక్కిపట్టి ఫీ
కరగతిఁ జుట్టుకొన్న భుజగంబులనక వడిఁ జుట్టి బాహులకై
బొరిఁబొరిఁ జూర్ణితుక జలిపె ముక్కున వాత నసృక్కు గ్రక్కఁగన్

అర్జు —(నిస్సత్తువఁడై నిలిచి)

ఓ శివనంచు నెంచక ముహూర్తము తాళు మదిష్టదేవతక
వేడుకఁ బూజచేసికొని వెంబడి వచ్చెద నంతదాఁక నీ
నీడను విశ్రమించి తరుణీపరిచర్యల సేదదేఱుమా

(వినుట యభినయించి)

పాడిగణించి పొమ్మనెదవా? యిదె పోయెద నాశ్రమానకున్

(నడచుచుఁ దనలో)

ఇతఁడు కిరాతరూపము వహించిన యింద్రుఁడొ ద్వారకేంద్రుఁడో
శతధృతియో యముండొ మఱి సన్నిధి సేయు మదిష్టదాతయో
సతకరఖండశేఖరుఁడొ, చిత్రము! పుట్టినదాది యోడు టే
స్థితిని నెఱుంగనట్టి ననుఁ జేరికిఁగైకొనఁ డాహవమ్మునన్.

(ఆశ్రమము చేరి)

అలికియు ముగ్గువెట్టి కలశాంబులఁ జిల్కి సపర్య సేయు నీ
స్థలి శుచిగా నొనర్చి శివు ధ్యానము సేసెడువేళఁ బంది యా
కులగతి విఘ్నముక జలిపె, గొబ్బునఁ బార్థివలింగమూర్తి న
చ్చలమున భక్తిఁ గొల్చి కడసారి నమస్కృతిచేసి యేగెదన్

(అని పార్థివలింగమున కెదురుగాఁ గూరుచుండి)

ధ్యానావాహనరత్నపీఠములుఁ బాద్యంబర్ఘ్య మాచాంతియుక్
స్నానంబుక్ గొని నాకుఁ గూర్పవె కృతార్థత్వంబు జన్మాది యెం
డేనిక్ వీఁగని నా కిదేమి యభవా, యీవ్యాధుచేతక్ యశో
మానహ్రాసము గల్గెఁ; జూచుచు నసంభ్రాంతుండవౌటర్హమే?

(శబరునివంకఁ గాంచి)

అవుర! కిరాతుఁ డచ్చట విహారము సేయుచు నున్నవాఁడె! మై
దవిలిన నీటిబొట్లుగనఁ దాన మొనర్పఁగ నేటి కేగలే
దవలను నివ్వలక్ జలము లారయ, నియ్యది చోద్యమయ్యె—నా
హవము నొనర్ప రమ్మనుచు హస్తము వీచుచునుండెఁ బోయెదన్.

(కిరాతుని సమీపించి)

మునుపటికంటెఁ దీవ్రముగ ముల్కుల వ్యాధుఁడు గొట్టుచుండె నా
మనమున భక్తి చాలక యుమాపతి నన్ను నుపేక్ష సేసెనా?
మనసు చలించెనా? (చెవియొగ్గి విని)

యతఁడు మామకదీనతఁ గాంచి యొడ్డియో
యనియెడి, ప్రీతిఁబసు హృదంతర మక్కట! ప్రీలిపోవఁగన్,

శబరుఁడు —

దేహబలము లేక దేవుని సేవింప
ఫల మొకించుకేని గలుగునయ్య!
పౌరుషంబు తోడుపడఁగావలె నటంచు
నీతివిదులు పలుకురీతి వినవా

అని సేయం జనుదెంచి శాత్రవుని సేయక గర్త పీవుకు; రణా-
వని బ్రత్యర్థికృతావమానమున నొంపక గర్త దైవంబునా?
మను నీతిక్ గొని యోద్ధవై, యపజయంబుక్ గాంచి వేదాంతివై
తని నీభ్రష్టతఁ గాంచ నవ్వొదవు పోరా! మానివై యుండురా.

అర్జు —(నిఃస్పృహత నభినయించుచు)

నీవనుట నేను బసుటయు
నీవేళఁ దటస్థమయ్యె నేమందును ని
న్నోవనచర! నాదైవత
సేవముగింపకయ ప్రతివచింపఁగఁజాలన్

(సంభ్రమమున నుటజమున కరిగి)

దేవా, గంధము కుందెముక వసనముక దీపంబు దూపంబు నీ
నైవేద్యంబును గొమ్ము, శత్రువిజయానందంబు సంధింపుమా!
నీవే సర్వమటంచు నమ్మికొనఁగా నీచాత్మచేతక్ బరీ
భావమ్ముక్ గలిగింపఁగాఁదగునొకో భక్తార్తివిధ్వంసకా!

(శబరునివంకఁ గాంచి యాశ్చర్యపడుచు)

భక్తి నేనర్పించు పట్టాంబరము కిరాతకటీరమందుఁ గ్రొందళుకులీను
నాలేపనము సేసినట్టి చందన మల శబరు దేహమునఁ గాంచంగనయ్యెఁ
బార్థివలింగముపై నుంచుయజ్ఞసూత్రము బోయవక్షస్స్థలమున మెఱయు
నర్పించునైవేద్యమారగించుట నేమొ మృగయుండు గఱ్ఱని త్రేన్చుచుండెఁ

నవుర! నాయీశ్వరునకు సమర్పణంబు
సేయు సర్వోపచారముల్ చెందుకొని
పే నఁ గననయ్యె నీమాయ వీనిదొక్క
భవునిదో కాని మదికి దిగ్భ్రాంతి గలిగె

అరసెదఁగాక (కన్నులుమూసికొని పూలదండ చేతఁబూని)

శంకర, సమర్పణసేసెడు పూలమాల నీ
శిరమున గంగతోఁ సవతిచెల్వున వన్నెవహింపఁ దాల్పు, దు
ష్కరమగు నాతపంబు పరిపాకముగాంచ జయంబుగూర్పుమా
హరహర, భక్తుఁడన్ గనుల కందఁగఁజేయుము నీస్వరూపమున్.

(త్రుళ్లిపడి కన్నులు తెఱచి)

కన్నులుమూసి ధ్యానవిధి గైకొని మాల్యమొసంగ దూరమం
దున్న కిరాతుఁడే కరము నల్లనఁజాఁచి గ్రహించినట్టులై
కన్నులువిప్ప, నల్లదె నిగారపుకీలిని గూరుచుండి యా
క్రొన్ననదండ మాళి నిడికొంచును గాంతకుఁ జూపు దిద్దఁగన్.

(తటాలున లేచి)

ఎంతటి వెఱ్ఱినైతి శబరేంద్రుఁ డెవండొ యటంచు నెంచి వి
క్రాంతివహించి నొంచి, పదఘాతములన్ బడలించితిన్ శ్రమం
బంతయు వ్యర్థమయ్యెఁ దపమంతయు భస్మహుతాజ్య మయ్యెఁగా,

(అని పరుగుపరుగునవచ్చి శబరుని పాదములపైఁ బడి)

లాంతక, దేవదేవ, కరుణాభరణా, క్షమియించి ప్రోవవే.

మెత్తనిపూలపూజలకె మే నెట నొత్తునొ యంచు నిచ్చలుఁజి
త్తమునన్ దలంతు నను నిష్ఠురచిత్తు నొనర్చి వింటిచే
మొత్తఁగఁ గత్తినొత్తఁ బటుముష్టిపదాహతులన్ నలంప దే
వోత్తమ, మాయపన్ని నను నుత్తలపెట్టుట నీకు ధర్మమే!

లోకంబుల్ సకలంబు నీమహిమకున్ లోఁగంగ నే నెంత? మా
యాకైరాతతనూధరుండ వయి నన్నాడింపఁగా నీకదే
మో కౌతూహల ముప్పతిల్లెనె? నిజంబున్ జెప్పి నాదుఃఖమున్
బోకార్పంగదె యింక నీపదయుగంబున్ వీడలే నీశ్వరా!

నాతల్లిన్ శబరిన్ బొనర్చి మృగయానంతశ్రమం బిచ్చి యి
ట్లీతత్కాననవీథిఁ దెచ్చితివె తండ్రీ, సౌకుమార్యాబ్ధి, యా
శీతాద్రీంద్రు తపఃఫలం బుపనిషత్సీమంతసిందూరము
ద్రా తేజస్సమలంకృతాంఘ్రిగద! కార్కశ్యంబు సైరించునే!

(అని లేచి చూచి గడగడ వడఁకుచు)

అరచంద్రమామనుయ్యాలలూఁచెడువియద్గంగాతరంగముల్ పొంగుశిరసు
అయిదువేలుపుఁజెట్టులనఁగోరుకోర్కు లనించుచుండెడువక్త్రపంచకంబు
కటియందు వైయాఘ్రకమనీయకృత్తియునంసమం దార్ద్రగజాజినంబు
వక్షస్స్థలంబున వైచిన నాగేంద్రరూపమై యలరు యజ్ఞోపవీత.

మమరఁ బ్రత్యక్షమైన నాయమృతదాతఁ
గంటిఁ గన్నుల కానందకళికయైన
వానిఁ గనుఁగొంటిఁ దల్లి భవాని గంటిఁ
దండ్రి, నాజన్మ మన్వర్థతను వహించె.

శంకరుఁడు:— (అర్జునుని వెన్నునిమురుచు)

వింటిని నీతపంబు విధివిష్ణుముఖామరకోటి దెల్పఁగాఁ;
గంటి మదంబు, నీయునికిఁ గాంచి వరంబు లొసంగుబుద్ధి రా
నుంటిని; గౌరి నీరణసముద్ధతిఁ జూడఁగ వేఁడ, వెంట ర
మ్మంటిని; మూకదైత్యుఁ గిటియై చనుమంటిఁ బగన్ వహింపఁగన్.

జనకుని మేనఁ బ్రాఁకి తనుజాతుఁడు కాలనుగేలఁ గ్రుమ్మ నె
మ్మనమునఁ బొంగుఁగాని యణుమాత్రము క్లేశముగాంచు నయ్య, యి
ట్లనశనవృత్తి చిక్కి సగమైన నినున్ రుధిరంబు గ్రక్కఁగాం
చుచు బడనొంచు నాపనికిఁ జూఱ్ఱెనె డెందము భక్తశేఖరా!

ఇవె నీగాంఙీవఖడ్గముల్ గొనుము నా కేలా! విలాసార్థ మా
హవమందున్ హరియించి యెంతయును నాయాపంబు చేకూర్తు న
య్యవి యెల్లన్ మఱువన్ దగున్ భవదభీష్టార్థంబు వాఁగ్రుప్పుమా
యవిలంబంబుగఁ గాంచఁగాఁగలవు వత్సా, పాండురాజాత్మజా!

అర్జునుఁడు:— (దోసిలిపట్టి)

జన్మము ధన్యమయ్యె గిరిజాసహితంబుగవచ్చి ఖిన్నతా
తన్మయు నన్నుఁ దేల్చితివి తండ్రి, వరంబు లిఁకేల కోర, యు
ష్మన్మమతాశ్రయంబునకుఁ జాలునె యెవ్వియు; నైన శత్రుసం
పన్మథనార్థ మీయఁగదె పాశుపతాస్త్ర మొకండు శంకరా.

ఆపగేయసురప్రభృత్యస్త్రవేది
వలయితంబగు కౌరవబలము గెలువఁ
బాశుపత మున్నఁగాక యెప్పగిది నగును
గరుణగలదేని యదియ యొక్కండొసంగు.

శంకరుఁడు:—

రారమ్మ, దివిజాపగాసలిలపూరస్నాతవై, తీరమం
దారచ్ఛాయఁ గుశాసనస్థుఁడవయి యుండన్ సప్రయోగోపసం
హారప్రక్రమమైన పాశుపతదివ్యాస్త్రంబు నీ కిచ్చెదన్
వైరిన్ ద్రుంచి, యశంబుగాంచి, ధరణిన్ బాలింపు భద్రంబుగన్.

అన్న! నీకోరు పాశుపతాస్త్ర మిచ్చు
టంతియేకాదు, బ్రహ్మశిరోభిధాన
మైన యస్త్రంబు నొసఁగెద, నద్ది నీవు
కోరినది, యిద్ది నే నొసంగునది గొమ్ము.

అర్జు:—

నరమాత్రుఁడ నాలోపము
లరయకు నీయంతవాని నడుగుటసైతం
బెఱుఁగని నన్నేకరణిం
గరుణింపఁ దలంతొ యట్లె కావింపు శివా!

(అందఱును నిష్క్రమింతురు.)

# మధురానగరము ( Muttra )

కొ. నరసింహాచారి

మధురానగరము సంయుక్తరాష్ట్రములందు యమునా నదియొడ్డున ఆగ్రానగరమునకు ఉత్తరమున నుండు నొక పురాతననగరము. ఇది క్రీ. పూ. ప్రథమ శతాబ్దారంభమునుండి క్రీ. వె. నాలుగవశతాబ్దాంతము వఱకు ఉత్తరహిందూస్థానమునందు మిక్కిలి ప్రసిద్ధి జెందియుండెను. ఇందు క్రీ. శ. ౬౩౪ న యాత్రార్థము హ్యూయన్‌ట్సాన్‌గ్ వచ్చిననాటికిగూడ అయిదు బౌద్ధ దేవాలయములును, ౨౦౦౦ బౌద్ధసన్యాసులు నిరంతరావాస మొనర్చుచుండిన ఇరువది బౌద్ధసంఘారామములును ఉండినట్లు అతడు వ్రాసియుండెను. కీ. శ. ౪౦౨-వ సంవత్సరమున పాహియాన్ వచ్చిననాడు సంఘారామములందు మూఁడువేల భిక్షువులుండిరట.

మధురానగరముయొక్క ప్రాముఖ్యము మత సంబంధమని తెలియజేయుటకు అందలి బౌద్ధ, జైన, బ్రాహ్మణ శిల్పవిగ్రహములు సాక్షి. రాజకీయముగ గూడ నది ప్రసిద్ధివహించియుండిన దనుటకు అందలి యనేక ప్రసిద్ధ రాజశాసనములు సాక్షి. ఇట్టి ప్రాముఖ్యములవలననే మధురయందు శిల్పకళాభివృద్ధియు అనన్య నగరసామాన్యమయియుండెను. మధురకు సమీపముననే సిక్రి యనుచోట దొరకు ఇసుకరాయి ( Sand stone ) విగ్రహములు జేయుట కనుకూలమయియుండుటయు, మతగురువులయొక్కయు, భూపతులయొక్కయు నాదరణము మెండుగా నుండుటవలనను, అనేక శిల్పకళాప్రవీణులు ఇచ్చట జేరి నానాదేశభాగములకును కావలసిన విగ్రహములను మలిచిపంపుచుండెడివారు. అట్టి శిల్పకళాచతురులలో దిన్నుడు చాల నిపుణుడై, ఆకాలపు సుప్రసిద్ధనగరములకు బుద్ధవిగ్రహాదులను చేసిపంపువాడైయుండెను. ఈకారణమునుబట్టి మధుర 'Manufactory of statues' అనదగియుండెను. ఇందలి శిల్పకళయు నూతనవిధానము గలదై యుండుటంబట్టి 'Mathura school of sculpture' అను స్వతంత్రనామానువాదిత మయి యొప్పుచున్నది.

మధురానగరముయొక్కయుచ్చదశ నాలుగైదు శతాబ్దములపర్యంతమునుండి, అందు ఒక్కొక్క కాలమునను క్రమముగా బౌద్ధ, జైన, బ్రాహ్మణ మతసంబంధము లగు సంఘారామములును, ఆలయములును విశేషముగా వెలసియుండినవి. అశోకుడు, కనిష్కుడు మొదలగు బౌద్ధచక్రవర్తులకాలమున బౌద్ధసంఘారామములును, వర్ధమాన, మహావీరాది జైనభూపాలురకాలమున జైనదేవాలయములును, అటుతర్వాత బ్రాహ్మణదేవాలయములును విలసిల్లుచుండినవి. మతవైషమ్యములవలన నొకమతము ప్రబలియుండినకాలమున మఱియొక మతము తలమణగియుండవలసియుండెను. ఈకారణముననే తొలుదొలుత బౌద్ధసంఘారామ ముండినచోటనే దానిని ధ్వంసము చేసి బ్రాహ్మణులు విష్ణ్వాలయమును గట్టిరి. తర్వాత ఔరంగజేబుకాలమున నీ విష్ణ్వాలయము ధ్వంసము కావింపబడి యచ్చోటనే యొక మసీదు కట్టబడెను. ఇట్టి పరస్పరవైషమ్యములుకారణముగ కాలక్రమముగ క్షీణదశ నొందిన మధురా నగర చరిత్రదుఃఖకరము కాకమానదు.



చిత్రము ౧ —ఇది యొక స్తంభశిఖరమున నుండు శిల్పము, 3 అడుగులపొడవు, ౨ అడుగుల వెడల్పు, ౨ అడుగుల యెత్తును గలది. ఇందు రెండు సింహములును, రెండు వృషభములును నాలుగు దిక్కులను జూచుచున్నవి వృషభములకు మానవశిరము లున్నవి



చిత్రము ౨ —ఇది యొక బోధిసత్వ విగ్రహముయొక్క భాగము, విరిగినది. ఒక పేముకుర్చివంటి యాసనముపై కూర్చుండి కుడికాలిని ఎగమమోకాలిపై నిడికొనియుండవలెను కుడికాలి భాగము విరిగిపోయినది దాని పాదరక్షమాత్రము క్రింద నున్నది





చిత్రములు 3, ౪ —ఇవి రెండువిధము లగు స్తంభశిఖరములు సుందరమగు శిల్పములు

మధురయందు అశోకచక్రవర్తి సమకాలికుడగు ఉపగుప్తునిచే గట్టింపబడిన యుపగుప్త సంఘారామము మిగుల ఖ్యాతివహించినదైయుండెను.



చిత్రము ౫ —ఇది యొక ద్వారతోరణమునందలి శిల్పము పుష్పమాలికను మోసికొనిపోవుటను దెలుపుచున్నది



చిత్రము ౬ — ఇది యొక స్తంభముపై నుండు చిత్రము పంచతంత్రములోని కథను దెలుపుచున్నది ఒక తాబేటిని ఇద్దగు చంపుచున్నారు



చిత్రము ౪ —ఇది యొక ద్వార తోరణమునందలి శిల్పము

ఇది ౮౦౪ అడుగుల పొడవును, ౬౫3 అడుగుల వెడల్పును గలిగియుండెను బ్రాహ్మణమతప్రాబల్య కాలమున దీనిని నాశము నొందజేసి దీనిపునాదిపై ౨౫౦ అడుగులపొడవును, ౨౨ అడుగులవెడల్పును గల కేశవరాయదేవాలయమును గట్టిరి. ఆకాలమున హిందూదేశమునందలి ప్రసిద్ధవిష్ణ్వాలయములలో కేశవరాయాలయ మొకటియైయుండెను గజినీ మహమ్మదు క్రీ శ. ౧౦౧౮ నందు హిందూదేశ దండయాత్రపైవచ్చినపుడు మధురలో ౨౦ రోజులుండి నగరమునంతయు నానావిధముల ధ్వంసముచేసియు, కేశవరాయాలయమును మాత్ర మేలనో తన కోపానలమునకు గురిచేయింపడాయెను కాని యందలి విగ్రహములను, ధనమును మాత్రము నూఱులకొలది యొంటెలపై నెక్కించుకొని పోయెను ఇందు ౫ స్వర్ణవిగ్రహము లుండెను వాటి కన్నులలో పొదిగియుండిన మాణిక్యముల విలువమా



చిత్రము ౧ —ఇది యొక స్తంభముపైనుండు శిల్పము ఒక స్త్రీ సర్వాభరణాలంకృతయై చేత నొకబుట్టను దీసికొనిపోవుచున్నది ఈయమభుజముపై ఒకపక్షి కూర్చుండియున్నది



చిత్రము ౯ —ఇది యొక స్తంభముపైనుండెడి నర్తకియొక్క శిల్పము రెండు దృశ్యములు ఇందు చూపబడియున్నవి

త్రము మూడులక్షల రూప్యములై యుండెను. ఇవికాక మఱియొక స్వర్ణవిగ్రహము ౩౮౦ వీసెలభారము గలది యుండెనట దీనియందు ఒకవీశె కెక్కుడు భారముగల నీలమణి యుండెనట. మఱియు మహమ్మదీయాలయమునుండి నూఱు రజతవిగ్రహములనుగూడ దీసికొనిపోయెను ఇట్లు సుమారు ౩౦ లక్షలరూప్యముల విలువగల విగ్రహాదికముల నీ ప్రసిద్ధ వైష్ణవాలయమునుండి మహమ్మదు చూఱగొనిపోగలిగెను

తర్వాత మొగలుచక్రవర్తులలో నౌరంగజీబు ఈయాలయమును తుదముట్ట ధ్వంసము చేసి దానిపునాదిపై మసీదును గట్టించెను

మధురయందు పూర్వకాలమున ఉపగుప్తసంఘారామము కాక యశవిహారము, హువిష్కవిహారము, కుండ శుకవిహారము అను ఇతర విహారములును, బుద్ధుని ప్రధానశిష్యులగు శారిపుత్ర, ముద్గలపుత్ర, పూర్వ మైత్రేయపుత్ర, ఉపాలి, అనంతరాహుల, మంజుశ్రీ లను నేడుగురకు నేడు స్తూపము లుండినవి మధురానగరము నందలి వేనవేల శిల్పములలో కొన్ని మచ్చునకు ఇందు పొందుపఱుపబడియున్నవి



# కోఽర్థవాన్ కోదరిద్రః?

ఆంధ్రవిశారద, తాపీ ధర్మారావు, బి. ఏ.



బిచ్చగాఁడు

(ఎక్కడనో చూచుచు)

నాయనా, ఒక్కపైసా ఒక్కడబ్బు

అతఁడు

(నిలిచి చూచుచుండును)

బిచ్చగాఁడు

(క్రిందిచూపుతో)

బాబూ, ఒక్కడబ్బు! ఒక్కపైసా నాయనా

అతఁడు

(బిచ్చగానిఁ జూచుచు తనలో)

ఆనుదురు, ఆముక్కు, ఆ వ్రేళ్లు— బిచ్చగానిగా చేయుటకేనా? దేవునిలోపమా, కాక లోకులదోషమా?

బిచ్చగాఁడు

(దృష్టిని ఉత్తరీయమువఱకు నెత్తి)

నాయనా, ఒక్కపైసా—కాలినపొట్టల కొక్కడబ్బు

అతఁడు

(తలనూఁపుచు తనలో)

కావుననే అడుగఁగలిగెను. అడిగెను! "కో దేహీతివదేత్ స్వదగ్ధ జఠరస్యార్థే" *

పాపము! . .

బిచ్చగాఁడు

(దృష్టిని మఱికొంత యెత్తుచు)

బాబూ, మలమల మాడిపోవుచున్నారు.



అతఁడు

(చూపులేని చూపుతో తనలో)

నన్నా! అడుగుట!!

హుః!.......

గుడ్డలు చేసినమోసము ఇది......ఏమి చేయుట! ఛీ!...

బిచ్చగాఁడు

(ముఖము నెత్తుచు నొకింత బిగ్గఱగ)

బాబూ, ఒక్క ......

అతఁడు

(తనలో)

సాయము చేయలేని సానుభూతి! వట్టి బూటకము...మంచిగుణమా? మంటిగడ్డలు... శిరోవేదన! యమయాతన!...

బిచ్చగాఁడు

(అతని ముఖమును చూచి నివ్వెఱపడి తనలో)

అయ్యో! అయ్యో! పాపము! ఇతని కెంత బాధను గలిగించితిని. ఏమి యాతన నందుచున్నాఁడు!...చూడకయే యడుగుట తప్పు. తప్పు...మరల శాంతి నిచ్చు టెట్లు?...

(ఇంకొకని దూరమునఁ జూచినట్లు నటించి వడివడిగఁ బోవుచు బిగ్గఱగ)

నాయనా, ఒక్కడబ్బు—ఒక్క.........

---

* "దీనాదీనముఖైః సదైవ శిశుకై రాకృష్టజీర్ణాంబరా, క్రోశద్భిః క్షుధితై ర్నిరన్నవిధురా దృశ్యా నచేద్గేహినీ,
యాచ్ఞాభంగభయేన గద్గదగళత్త్రుట్యద్విలీనాక్షరం, కో దేహీతివదేత్ స్వదగ్ధజఠరస్యార్థే మనస్వీ పుమాన్." —భర్తృహరి











1 కార్వారకు 'దయావతి' స్టీమరులో ప్రయాణము 2 కన్యాకుమారివద్ద స్నానము, 3 సీతానగరాశ్రమమునకు గోదావరి స్టీములాంచిలో ప్రయాణము. 4. సీతానగరంచెంత వంగలపూడిగ్రామమున హరిజనులకు దేవాలయమును తెరచుట.
5. అనంతపురంజిల్లా పెదవడుగూరులో అమర్చిన పడవవంటి సభావేదిక.

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు



(షష్టిపూర్తి మహోత్సవము జరిగినది)

శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు



(సప్తతి పూర్తిమహోత్సవము జరిగినది)




1 సామి పూరత్తాళ్వారు శెట్టిగారు 2 వాళం రామలింగేశ్వర రావుగారు (చెన్నపురి దక్షిణ ఇండియా ఆర్యవైశ్యసంఘ కార్యదర్శులు)
3 అడ్డేపల్లి సత్యనారాయణమూర్తి జమీందారుగారు. 4 బొల్ల నరసింహమూర్తిగారు, పాలకొల్లు. 5 ఆర్. ఫౌర్సు. (స్థానికసంఘముల ప్రత్యేకాధికారి) 6. జలగం పెద్దసుబ్రహ్మణ్యం నాయుడుగారు 7. జలగం సుబ్రహ్మణ్యం నాయుడుగారు.



1 కె వి గోపాలస్వామిగారు
(ఆంధ్ర నాటకకళాపరిషదుపాధ్యక్షులు)

3 తేజోమూర్తుల కేశవరావుగారు





2 కవిశేఖర కాళ్లకూరి గోపాలరావుగారు



4. రావుసాహేబు గంగనపల్లి శంకరరావుగారు



5 శ్రీయస్ వి యస్ రామారావుగారు



6 యం హబీబుల్లాసాహెబ్ గారు
(కడప పత్రిక ప్రొప్రయిటరు)

# ఒకక్రొత్తశాసనము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

ఈక్రింద పొందుపఱిచిన శాసనపాఠము ఒకక్రొత్త తామ్ర శాసనమునుండి గ్రహింపబడినది అసలీశాసనపురేకులు హెచ్ ఇ హెచ్ నిజాముగారి కోశాగారమున నున్నవట హైదరాబాదులో నుండినకాలమున కేంబ్రిడ్జి సంస్కృతాధ్యాపకులయిన సి బెండాల్ (ఎమ్ ఏ, ఎమ్ ఆర్ ఏ ఎస్) గారు ఈశాసనమును ౧౮౯౯ లో నొకమాఱు తీసికొని ౧౯౦౩-వ సంవత్సరపు 'ఇండియన్ ఆంటిక్వేరీ' పత్రికయందు వివరణముతో గూడ ప్రకటించియున్నారు ఈదిగువ పొందుపఱిచిన శాసనపాఠము వారిచ్చినదే కుండలీకరణములం దిచ్చిన యక్షరములేమి, దిగువ నిచ్చిన 'ఫుట్ నో' ట్సేమి, వారిచ్చినవి ఇచ్చినట్లు తుచ తప్పకుండ వ్రాసియున్నాను శాసనభాగమునందును, వివరణలందును గూడ కొన్ని ప్రమాదము లున్నట్లు కనబడుచున్నది అసలుశాసనము నాయొద్ద లేనికారణమున నేనెట్టిసవరణలకును బూనుకొనలేదు. ఈశాసనము ఆంధ్రదేశచరిత్రమునకు కడుముఖ్యమయినదిగ దోచినది ఆంధ్రచరిత్రపాఠకులకు పెక్కుమందికి ఈశాసనపుటునికి తెలిసియుండదని ఈపాఠము నిందు ప్రకటింప సాహసించితిని పాఠకులిందుకు నన్ను మన్నింతురుగాక ఈ శాసనమునుగూర్చి క్రింద వ్రాయబోవు ప్రతివిషయమును బెండాల్ గారు వ్రాసినదే అందువలన ఈక్రింద వ్రాయబోవు విషయములందు తప్పు లున్నను ఒప్పులున్నను, అవి యన్నియు బెండాల్ గారికి చెందవలసినవే ఆంధ్రచరిత్రపాఠకలోకమునకు ఈశాసనవిషయము తెలియవలెనను నపేక్షచేత నేనొక లేఖకుడనుమాత్రమే యైనాను చాళుక్యులలోని యొకక్రొత్త శాఖవారిని నూతనముగ దెలియజేయుటచేత ఈశాసనము చాల ముఖ్యమయినది ఈశాసనమును బెండాల్ గారు ప్రతిబింబరహితముగ బ్రకటించియున్నారు శాసనమును మరల సంపాదించి సరియైన శాసనపాఠము నేర్పఱిచి సప్రతిబింబముగను, సవివరణముగను ప్రకటింపవలసిన బాధ్యత ఆంధ్రచరిత్రాభిమానులపై గలదని విన్నవించుచున్నాను

ఈశాసనమున అయిదురేకులు కలవు ఒక్కొకరేకు ౬$\frac{3}{8}$'' — 3$\frac{3}{8}$''లు మొదటిరేకునకు, చివరిరేకునకు ఒకవైపునమాత్రమే వ్రాత కలదు. ముఖ్యశాసనభాగము ముగిసినపిదప వేఱుదస్తూరితో కొన్ని తెలుగుపంక్తు లున్నవి అవి తక్క మిగిలినశాసనము సంస్కృతమున నున్నది ప్రతిరేకునకు నించుక అంచులు తీర్చియున్నవి ఈశాసనపు కడియము $\frac{3}{8}$'' మందముకలది, ౨''లు వ్యాసము కలది శాసనముద్రిక అరిగిపోయియున్నది ఇది కోలగ నున్నట్లు కన్పట్టును. ఈశాసనమునందలి యక్షరములు పదునొకండవశతాబ్ది ప్రాంతపువిగ కాని, ఇంచుక అంతకు తరువాతివిగ గాని కన్పట్టును

ఈశాసనమున నుదాహృతములయిన స్థలములను బెండాల్ గారు తాము గుర్తింపజాలమయితిమని వ్రాసినారు. కొండపల్లి మాత్రము బెజవాడయొద్ద నుండు నిప్పటి కొండపల్లి యగునని వారూహించిరి

శాసనవిషయమునుగురించి బెండాల్ గారు చెప్పినసంగతు లివి:

తాము చాళుక్యులతో సంబంధముగలవారమని చెప్పుకొన్న క్రొత్తశాఖప్రభువు లీశాసనమున నుదాహృతు లగుటయే పరమాకర్షకమయిన విషయము ఈశాఖవారు ముదుగొండకు జెందిన ముదుగొండ చలుక్యులను నామమున బరగుచున్నారు ఈవంశమునకు కొక్కిరాజు మూలపురుషుడు ఇతని సోదరుడు (పేరు తెలుపబడలేదు) చియ్యరాజును జయించెను శాసనము లోలుదోలుతటిభాగమున నుదాహృతులయిన పొలకేసి, రణమర్దు లనువారు ప్రాయికముగ రాజమాత ఆచిదేవి పూర్వులయి యుందురు. వీరి వంశవృక్ష మిది



కుసుమాయుధుడు కుత్సితగోత్రుడయిన దొనెయయను బ్రాహ్మణునికి మొగలుచుఱువులు అనుగ్రామమును సర్వకరపరిహారముగ నుత్తరాయణనిమిత్తమున దానము చేసినవిషయమును ఈశాసనము తెలుపుచున్నది సంవత్సరము తెలుపబడియుండలేదు

మూలము

మొదటిరేకు

౧ స్వస్తి శ్రీమతాం సకలభువనసంస్తూయమా౧
౨ మాన మానవ్యసగోత్రాణాం హారీతిపుత్రాణాం
౩. కౌశికీవరప్రసాదలబ్ధరాజ్యానా మ్మాతృ
౪ గణపరిపాలితానాం స్వామిమహాసేన
౫ పాదానుధ్యాతానాం భగవన్నారాయణా (౯)
౬. ప్రసాదసమాసాదితవరవర[రా]హలాం
౭. ఛనేక్షణక్షణవశీ(శీ)కృతారాతిమణ్డలానా మ
౮ శ్వమేధావభృత(థ)స్నానపవిత్రీకృతవపుషా మ్మదు
౯ ర్గొణ్డచలుక్యానాం కులమ[లం]కరిష్ణు[ర్*]ముదు ర్గొణ్డ

రెండవరేకు మొదటిపెడ

౧౦. రవ(వా)స్తవ్యః కోకిరాజానుజ [ః*] సేనానీ౨కృ౩
౧౧ త్య సక్షోణీం జగ్రోహ ప్రతిశాసనః [।*]
౧౨ చియ్యారాజం విన్నిర్జిత్య (వినిర్జిత్య) గృహీతం గరు
౧౩ డధ్వజం [।*] రావణోర్జితవేతా
౧౪ లధ్వజం చాస్మై (స్మై) ని(స్వ)వేదయత్ [॥*] అయోధ్య౪
౧౫ సింహాసనరాజ్యచిహ్నః పరైరయో
౧౬ ధ్యోవిజిగీషురాఢ్యః [।*] భ్రాతాప్యరక్షు

రెండవరేకు: రెండవపెడ

౧౭. న్నిఖిలాన్ధరిత్రీ న్నిష్కణ్టకీకృత్య స కోకిరాజః [॥*]
౧౮ పాలకేసిర ప్యవాదీ దనుజా న్ప్రతిబద్ధా(ద్ధ) పట్టమ
౧౯ వప్త మత్స్యా త్రపాత్రాణా మితి సామ న్తసన్నిధౌ [॥*]
౨౦ తత్రాన్వయే భూపతి రావిరాసీ ద్రణే
౨౧ షు రామో రణమర్దనామా [౯] యత్కన్యకాం
౨౨ చారుచలుక్యవంశో ధర్త్రే హిదివ్యాశ్రులదే
౨౩ వతాంచ [॥*] మంచికొణ్డ విషయ మ్మనోహరం కో
౨౪ ణ్డపల్లి మదక్ర మాగత స్తత్ర నవశాస
౨౫ నీకృతం(తాం) గ్రామసమ్పద మదా(ధా) న్న(సు)భుక్తవాన్ [॥*]

మూడవరేకు మొదటిపెడ

౨౬ కోకిరాజా వైరిణి న్నిర్జిత్య౭ తత్సుతానా[న*]న్య
౨౭ న్నిపవరః తత్సూనుః కుసుమాయుధః తథా
౨౮ త్మజో విజయుతః తత్సుతః కుసుమాయు
౨౯ ధో వినీతజనాశ్రయః తత్సుతో విజయా
౩౦ దిత్యః తత్సుతః కుసుమాయుధః
౩౧ తత్పితా మల్లదురాజః ౭a తదనుజో గోభచ
౩౨ న్ద్రక [ః*] [॥*] తస్యాగ్రజో జ్ఞియరాజనామా బభూవ

౩౩ వీరో ధృతభూమిభారం (౧౦ః) [।] యదంగ మాలోక్య స

మూడవరేకు: రెండవపెడ

౩౪ కామదేవో మన్యే స్వయం లజ్జితవానన [ం*] గః[॥*]
౩౫ అనేనరాజ్ఞా స్వయమాదిదేవ్యాం బభూవ
౩౬ వీరః కుసుమాయుధోయమ్ [।*] యధస్వరేణాం
౩౭ బికయాం౧౧ కుమారః కులద్వయే కీర్తి
౩౮ ధరో రణోగ్రః [॥*] లావన్య(ణ్య)వా నిన్దర —ద్య౧౧
౩౯. తేజా స్తథాపి భూపం కుసుమాయుధాఖ్యం [॥*] విశేష

౧ Read° స్తూయమానం

౨ Probably metrical (Sloka)

౩ Employed cofusedly for some word of subduing

౪ Metre Upajati

౫. Read probably న్వే.

౬. Metre· Rathoddhata In the second line achakram is an exceptional scansion in later sanskrit·

౭ Read వైరిణో నిర్జిత్య

౭ a So the Sanskrit, but ‹Son› must apparently be meant, Unless మల్లగురాజ be a title of విజయాదిత్య

౮ Metre Upajati

౯ Read యథేశ్వరేణ = ఈశ్వరేణ of course శివేన

౧౦ Here grammar is sacrificed to metre

౧౧ An akshara is missed, read probably అనింద్య

౪౦ తా (తో) నానుకరోతి నిత్యం పక్షుద్వయే ప్యక్షుర

౪౧ చారుకీర్తిః [ం *] [|| *] స కుసు [మా]* యుధః పరమ

నాలుగవరేకు మొదటిపెడ[౧౨]

౪౨ మ[౧౩] మహేశ్వరః పరమబ్రహ్మణ్యా[౧౪] మంచికొణ్డ

౪౩ విషయనివాసినో రాష్ట్రకూటప్రముఖమ్[౧౫]

౪౪ కుటుంజి(బి)న స్సమాహ్య(హూ)యేత్థ మాజ్ఞాపయతి [|]*

౪౫ కుత్సితగోత్రాయ దొనెయశర్మణ

౪౬ ః(శే) విదవ(ధ?)దాగ[౧౬] పారగాయ ఉత్త

౪౭ రాయణనిమిత్తే మొగలుచు (వు?)లువులు

౪౮ నామగ్రామ [ం *] సర్వకరపరిహారీకృత్య మ

౪౯ యా దత్తమ్ విదితమస్తు వః [| *]

నాలుగవరేకు. రెండవపెడ

౫౦. అస్యావధయః [| *] పూర్వతః మున్నపాకపాలమేర (రె)

౫౧ యర్జునవ్రి (వృ)క్షె అధోముఖె సీమసిలః[౧౭] [|] ఆగ్నేయతః క్రొ

౫౨ వ్వెలువులపాలమేర అశ్వత్త(త్థ)వ్రిక్షెన (?) కొపసీక్ష (మ)

౫౩ సిలః [|] దక్షిణతః కొరగిపాలముకారకు

౫౪ ణ్డ సీమసిలః [|] నైరృత్య[త*]ః ఓ(?) తై(?)లు క్షేత్ర [|]

౫౫ పశ్చిమతః ఝువ్వసీలసీమమ్ [|*] వాయవ్యతః పలూ

౫౬ ంరుం బాలుణ్డిసీమసిలః [|*] ఉత్తరతః తివిదిరి [|] ఈః

౫౭ శన్యత[ః] నావులమెట్టసీమసిలాః [|*] ఉత్తరాయన(ణ)

౫౮ నివి(మి)త్తమ్మునన దొనమయ్యమ్మప్పణ్డు

అయిదవరేకు మొదటిపెడ

౫౯ బ్రహ్మనులకు భరనః(?నమ్)బుగెసిరి మధ్వశజః పర

౬౦ మహీపతిజాశ్చ పాపాదపేతమనసా భువి చా(భా)వి

౬౧ భూపాః యే పాలయన్తి మమ ధర్మ్మ మిదం సమస్త [ం*] తేషా [ం*]

౬౨ మయా విరచితోంజలి రేషమ్మాదోః[౧౮] [|*] స్వదత్తాం పరదత్తాం

౬౩ వా యో హరేతి (త) వసుద్ధ (న్ధ) రాం షష్టిం వరాహసహస్రాణి[౧౯]

౬౪ విష్టా(ష్ఠా)యాం జ(జా)యతే క్రిమి [ః] భూమిం యః ప్రతిగ్రిహ్ణ(హ్ణా)తి

౬౫ యస్య భూమిం ప్రయచ్ఛతి [|] ఉభౌ తౌ పుణ్యకర్మాణౌ నియతౌ

౬౬ స్వర్గవాసినౌ సామాన్యోయం ధర్మసేతు[ర్] నృపన (ణా)ం కాలేకాలే

౬౭ పాలనీయో భవద్భిః సర్వా నేతాం(తా) బావినః పార్తివేన్ద్రః[౨౦]

౬౮ యో భూయో య(యా)చతే రామభద్రః యస్య యస్య యదాభూత [ం*] భూ

౬౯ తస్య తస్య సదా మ్ప(తదాఫ)లం [||] స్వ ద ౭ తె ఱ ల ణీ ౭ య ఖ భా

అయిదవరేకు' రెండవపెడ

౭౦ ర ణ దొనమయ్యరు మెజొవజులకొ

౭౧ లుకు భీమనకు శాసన జు క ణ్డ

౭౨ రి వి న న త్క సా ల త నం బు ను

౭౩. రి గు వు ట్టి లా (? అ) దూ పట్టువు ఊ (?) దు

౭౪ వ దు పట్టు రాజమాన వి

౭౫ చ్చె [|| *]

---

౧౨ The numbering of this plate is incorrect, the figure for '4' having been erroneously placed on the obverse side Possibly the mistake arose owing to the erroneous repetition of the syllable మ

౧౩. Erroneously repeated, Compare last note

౧౪. Read either ంణ్యో or ంణ్యాః.

౧౫. Possibly to be deciphered as అః; in any case to be understood as ఆః.

౧౬ A proper name or corrupt word (విదథ ?)

౧౭ Several other corruptions of సీమశిలా appear below

౧౮ ముదా ?

౧౯. వర్ష సహస్రాణి

౨౦ పార్థివేన్ద్రాః

# ఉగాదిపాట

**పూడిపెద్ది వెంకటరమణయ్య — (కవితాసమితి)**

౧

నిలుము నాకొర కొక్క
నిమిసమే! నిమిసమే!
కొలికిపూ సొక్కజే
కొరవడ్డ దీమాల
ఆ క్రొత్త వెలుఁగులో
రేకెత్తు విరులలో
గ్రుచ్చలే నీకౌతుకు
గొగ్గిపూసలదండ!
వేయలేనే మెడను
మాయపూదెలచేరు!
వన్నెలే కగ్గినవి
వరుసలే తప్పినవి
నిన్నటి వెలుఁగులో
నే చూచికొననైతి!
కట్టికొను నీ దండ
కంఠాన నురిత్రాడు,
కేలుగవ కిడ్డ సం
కెల కడెమ్ములజోడు
కుంచితమ్మౌ నెడఁదఁ
గ్రుక్కికొనుదాఁక
దళమైన ముసుఁగులో
దాఁచికొనుదాఁక
నిలుము నాకొర కొక్క
నిమిసమే! నిమిసమే!

౨

చాలు నిక్కడి కిది
ఏల నీడ్చెదు నన్ను
కలుష మంటని క్రొత్త
తొలిప్రొద్దు వెలుఁగునకు?
ఈ నీడమాలిన్య
మీయడుగు టడుసు
కడిగికొనలేదొక్క
కన్నీటి చినుకు
చిత్రింపలేనింక
సిగ్గువిడి వెతలు
ముద్రింప లేనింక
మునుపటి కతలు
కడనిమిసమే నాకు
విడచిపొమ్మోయి!
మరునిమిసమే నన్ను
మరచిపొమ్మోయి!

౩

కలకంఠ గీతమా
లల కొక్క చరణమ్ము
క్రొంజివురు మొగ్గల
కొనకొక్క జిలుఁగు
ఈ సాంధ్యరాగమున
కింకొక్క వన్నె
కాన్క పెట్టఁగలేను
గాది నాకేల!

౪

తీయగ నీ యుగా
దిని వీచుగాలిలో
వెనుకటివాసనల
వెగటుఁదనమే తోఁచు!
చల్లగ విరియు నీ
సంవత్సరాది నే
వెనుకటి నిట్టూర్పు
వేడి గాడ్పులె వీచు
తులకించు నీ యేటి
తొలిప్రొద్దు వెలుఁగులో
ఆనాఁటి కలుషంపు
క్రీనీడలే ప్రాకు
ప్రాఁదందనాలతో
బ్రతుగీడ్చు నాకు
క్రొందీవ శ్రుతు లేల?
క్రొక్కారు లేల?

౫

ముంగొంగు పేలికల
ముడిఁ జూచిచూచి
వడకెడు మునువ్రేళ్ల
పిడికిలిఁ జూచి
ఎరుసెరుంగని అమా
యికపు లోకమ్ము
ఆసించునేమొ ఉ
గాదికాన్కలకు
కలకండచిదురులే
కరవైన బ్రతుగు
తీయని ప్రొద్దులో
దిగిచిపోకోయి!
చిరుగడ్డిపూలేని
చేలేని బ్రతుగు
కమ్మనిప్రొద్దులోఁ
గలపిపోకోయి!

౬

నులిమికొను చేత్రులను
తొలిపూవుఁ బెట్టి
విరచికొను వ్రేళ్లలో
వీణియను బెట్టి

లాలింతువా?
పాట
లాలింతువా?

2

కోకిలములకు మున్న
క్రొత్తగీతులఁ బాడు
కుత్తుకలు
పల్లవములకు మున్న
పరిమళమ్ములఁ జిమ్ము
వాతెరలు
సుమదళములకుమున్న
జుంటితేనియలూరు
డెందాలు
తొలివెల్గునకు మున్న
జిలుఁగుచాయల నల్లు
నందాలు
కలవోయి వానికే
స్వర్ణాక్షరములతో
సంవత్సరాది.

---

"భావ" కవీ!

అక్షరములైరాలు భవదశ్రుకణములను
ఇంకిపోనీయకుము!
ఇగిరిపోనీయకుము!
చితిగిపోనీయకుము!
చెదరిపోనీయకుము!
కెంబెదవికవ వాని
చుంబింపఁగలదు-
చెంగావి ముంగొంగు
చేకొనఁగలదు-
కలవోయి

నిత్తెమల్లెలగుత్తి
ముత్తియమ్ములక్రోవ
విరిసెడు శిరము
మెరసెడు నురము!

ఈబొట్టు కడుపులో
నిమిడిన నిట్టూర్పు-
దీనికళుకునఁ బొల్చు
తీయనిపలుకు-
ఈవెచ్చదనములో
భావములపట్టు-
ఈపదనులోఁబొడ
సూపెడు రసము-
ఇదియె నీ జీవనము!
ఇదియె నీ జవ్వనము!

నీయూర్పుకరగలను
నిద్దురలేపి
పులకించు నీమేనఁ
బూవులుపూచి
చెమరించు చెక్కులఁ
జిత్రమ్ము వ్రాసి
అరమోడ్పు కనుసీడ
నమృతమ్ము చిలికి
హృదయమే
పదముగా
హృదయమే
భావముగ
హృదయమే
రాగముగ
హృదయమే
పాటగా

దెసల మెరసెడు వీణ
తీవియవు నీవు-
కడలవిరిసెడు నూత్న
గళరవ మ్మావు.
మోదమో లేక వి
షాదమో నీ గీత
పాదములు ఘల్లురన
నాదమున ఝల్లుమను
నామేను
నాయెడఁద
నీకావ్యమున కిదు
శ్రీకార మిదియె
నీగీతమున కెత్తు
రాగ మియ్యదియె
పలుకులే కలకండ
పలుకులై యమృతమ్ముఁ
జిలుకులే నీపాటఁ
గులుకులే జగము-
తలపులే పూఁదీవ
మెలపులై యారముల
వలచులే, పుల్కలే
మొలచులే జగతి-
నీవు కనువిచ్చిన
నిమిసమ్ము
నీవు పలువిచ్చిన
నిమిసమ్ము
నీవు గళమెత్తిన
నిమిసమ్ము
నీవు కలమెత్తిన
నిమిసమ్ము
అక్షయమ్మగును.
'ఉగాది'యై నగును.

---

# వేగిప్రొద్దు తలంపులు

గరిమెళ్ల సత్యనారాయణ

పూర్ణిమ మొన్ననే గడచిపోయెను నేఁడు తృతీయ చందురుం
డెన్నఁగ వెల్గి రేయిఁతటిఁ గెల్ల మనోహరరీతి, నిప్పుడే
వెన్నునుబోలు మబ్బుతెరవెన్కకుఁబోయి మొఱంగిరాఁడు ఆ
తెన్నును గాచుకో మనకుఁ దీరిక యిప్పుడు లేదు చూడదే!
సన్ననిదీప మొండు పలుచ న్వెలిగించినయట్లు, అందమౌ
మిన్నున భూమినుండి నునుమిణ్గురుపుర్వువబోలె కాంతి యొం
డన్నకవచ్చి అప్పటికి నప్పటికే మెయిపెంచి యొప్పనై
చెన్నగు లక్కలేపనము చేసెను తూరుపుటంచు నెల్లెడన్

ఎక్కడనుంచి తెచ్చితివి ఇట్టి మనోహరకాంతిపుంజ మో
తెక్కలికాలమా, రుచుల తీపులు, పేశపు మేలివాసనల్
ప్రక్కలరంగులుం జిగురు పల్లవజాలమునుండి చిల్కుచున్
లెక్కకు మీఱి, భ్రమరులకు లీలలు నించుచు, తోఁట నెల్లెడన్
చిక్కఁగ పండు నామ్రఫలసీమల యామనిగాని, మానవుల్
ముక్కులుమూసి కాళులకు మోకులుకట్టుక డిగ్గి యిర్దెసల్
రెక్కలు చాచుచుం దడవిరేవులు చేర్పకముందు చీకటుల్
పిక్కటిలంగనీక మెఱపించుచు వారినిధీగుహావళిన్
నిక్కపుజేవురు ల్నెరపు నెఱ్ఱనిరత్నము లేని, సంజెలన్
రక్కసిగొంగ దుర్గ మధురంబుగ నాథుని గూడి నాట్యముల్
ద్రొక్కెడివేళ, నారదుడు తుంబురుడు న్మరి భృంగి నందియున్
చక్కటి కింపురూడునటు చక్కఁగ బాడి మృదంగవాదనా
ఘక్కి గుహాంతరంబుల సొబంగు ప్రతిధ్వని నించువేళ, వెం
దిక్కున ధాతురాగములు దట్టముగా సవరించు నోషధుల్
నెక్కొను పశ్చిమాచలపు నిర్మలరేఖలుగాని, మాకు నీ
దృక్కమనీయత ల్గలుగజేయవటంచును జాటిచెప్పెదన్

ఇందునిభాస్యయైన శశి యీమధుమాసనవోదయంబునన్
చెందల నాథుకంటె మును పే తెలివింగొని, సెజ్జ వీడి, యే
సందడి లేనివేళ నొకసన్నని దీపము పెట్టి తూరుపుం
బందిరియందు, నెఱ్ఱనగు మంటల నీరము గ్రాగబెట్టి, మే
యం దలమంగ కుంకుమము లక్కడనక్కడ చక్కబెట్టి, బల్
చందురుకావిచీరయును సాంద్రపు కెంపుల భూషణంబు లిం
పొందగ నొక్కమూల మెఱపు ల్తులకింపగ బ్రోవుపెట్టి, ఈ
మందమరుత్కిశోరములు మాయముకాకయమున్న, వెల్తురుల్
చిందుచు దొంగప్రొద్దుతెర చించుక యించుక గాంచుమున్న, ని
ష్యందహిమంబుక్రింద దలనంటుకొనంగను బూని యేమొ యీ
చంద మొనర్చెనంచు దలచం గనువచ్చును మాకు నియ్యెడన్

ఈదిన మేమిపుణ్య మొనరించెనొ, ఉత్తమలగ్నయుక్తమో,
లేదొకొ వర్జ్య మొక్కటియు, లేమలు కోర్కెలు దీర్చు నోములన్
బ్రోడిగ జేయ సత్ఫలము పొందుట నిక్కవమొక్కొ? కానిచో
ఖేదము లేని యీవెలుగు క్రీడల వన్నె లవేడ? భూమిపై
నీడలు గ్రమ్మ నెఱ్ఱనగు నిర్మలమౌ ప్రతికాంతు, లాకుల
ల్లాడగ మెల్లమెల్లగ విహారమొనర్చెడి మందమారుత
క్రీడలు, వేఁప్రొద్దున జరించెడి పాంథుల చిత్తపద్మముల్
వీడి ప్రమోద మొందు వినువీథి ననూనప్రశాంత, మేడ?

ఈ

జాడలు గూడ "నీశ్వరుని సంస్తుతిసేయగ నిచ్చయున్నయో
బాడబులార, వేగ విరిపాన్పుల వీడ రదేమి! సంఘముల్
చీడలుపొంది లేమిడిలి చిందరవందరలై నశింపగా,
వీడులలో సనాతనపవిత్రములైన మనోజ్ఞకర్మముల్
పాడయి యాత్మగౌరవము భస్మముగాగ, పవిత్రజాహ్నవీ
తోయములందు స్నానము యథోచితరీతి నొనర్చి, ఆగమా
ధ్యాయముల న్మహేశ్వరుని ధ్యానమొనర్చి మనంబులందు ని
ల్చే యొఱుపైన రంగుల నటించెడి దివ్యదదీతి (?) గాంచగా
నాయతు లింక గం" డనుచు నాత్మహితంబుగ వీనుదోయిలో
కూయిడునట్టి యాప్రకృతి కొమ్మ వహించు రహస్యదీనకా
షాయకళాప్రకాశమని సారెకు దోచుచునుండు నెంతయున్

ఇయ్యెడ నీమనంబున రమించెడి మోహనభావమైనదో,
తొయ్యలి, యెల్లలుం గనుల తొంగలిరెప్పలు విప్ప నప్పుడే,
వియ్యములందుచుం గనుల వేకువనిద్దురలల్లునప్పుడే,
కయ్యములాడి సెజ్జల చొకాటముగా శయనించనీక, యీ
పయ్యరశైత్యము న్గలప బైపడి, చీకటిపట్టు లన్నిటిన్
వ్రయ్యలుచేసి, భాస్కరశిరఃప్రకిరీటమకీచివల్లికల్
చయ్యన భూతలంబున ప్రచారమొనర్చక యుండునప్పుడే,
ఇయ్యకలంకరూపము ధరించిన నేమఁటనమ్మ!

కొనలం

దియ్యగఁబాడుపిట్టల బుతి న్వినవోచిన కర్ణ మెయ్యదో;
కొయ్యల గొండల న్నదుల గూజితమైన రహస్యభాషకున్
ఇయ్యది యర్థమంచు వచియింపగనోర్చి నజ్ఞాన మెయ్యదో,
ప్రొయ్యని మంటబోలె తనుపుంజములందున డాగి, దృశ్యమై
ఉయ్యెలపోల్కి నూగెడి సముత్కటసృష్టికి నెల్ల మూలమై,
వియ్యమువిందు, కుంచితము విస్తృతము, న్మరణంబు జన్మమున్
కయ్యముపొందు, లేమియును కల్మియు, బాధ సుఖంబు, పుత్రకుం
డయ్యెయు, జీవి జీవితమునై యొకటై పలునై వెలుంగు నా
దయ్యముతత్త్వముం గను యథార్థసనాతనయోగి మెయ్యెవో
అయ్యది తక్క నీపలుకు లాత్మహితంబుగ విందు రెవ్వరో?

నీతల పెద్దయైన, రజనీహర కింశుకవర్ణినీ, మముం
బ్రీతుల జేయు చిట్టిలనె పెద్దగుప్రొద్దు వసింతువేని, మా

చేతుల నెత్తి వందనము చేయుచు క్రిందికి డించమమ్మ, ఓ
నాతిరో మేము మాచపలనై జమ్ముకొద్ది వచించుటంతె మా
కూతలు వందనంబు లొక కొంచెము లక్ష్యమె నీకు ? పేదవే ?
భూతలమందు నెందఱొకో పుణ్యులు ప్రత్యుపదాన మొల్లకే
నీతరుణంపురేఖలను నీక్షణచేసి నుతించినారు, నీ
పూతసరిజ్ఝరంబులను పొల్పుగ మున్గి తరించినారు, త్వత్
స్ఫీతవిధిక్రమంబును పవిత్రులరై తలదాల్చి ముక్తికాం
తాతిలకంబుతోడను నితాంతసుఖంబున దేలినారు మా
చేతలు నీకు జూడ నొకచింతనపాత్రములౌనొకో ? 'పొండొహో
ఘాతకులార' యంచు కుడికాలున దన్ని తొలంగినట్టులో
శీతకరాననా, యెఱుపు చిహ్నము లెల్ల నిటట్టు రాల్చి, క్రో
ధాతతదేహవైన వివిధంబుల నెఱ్ఱగ నొంట మాని, అ
య్యో ! తరుణంపు పెర్పుల నధోగతి గూల్చెదనట్టి బంగరుం
పూతల నెత్తియెత్తి, పసుపుంబులమై నలు పెక్కి యాతపో
ద్ధూతవ యైతి విట్టివ మతు ల్భ్రమియించినవారి చర్యకా

గట్టిగ నొప్పుకొందు లతికావిధికోమలదేహ, 'తూరుప్రం
బట్టను కట్టుకొమ్మనియు, బంధక మెట్టెది వచ్చెనేని నీ
పట్టును వీడవద్దనియు, పామరులైన మదీయసాదృశుల్
మట్టుగ మోదమంద సరళంబుగ బింబఫలంబుపోల్కి నీ
విట్టులనుంటె యొప్పనుచు నేను వచించుట మూర్ఖమంచు, బల్
కట్టిడి స్వార్థబుద్ధియలి, ఘాతుకమంచు, యథేచ్ఛ కాలమున్
నెట్టన వాహినీగతిని నేరుగ బోవగనీక త్రోవలో
గుట్టలు నానకట్టలును గూర్చిన ద్రోహ'మటంచు నైన నా
యట్టి డెవండొ మూర్ఖుడన 'యాగుము వేగని, నేను నిన్ను నా
చుట్టముపోల్కి జూచుచును సొంపులు నింపులు దాల్తు' నన్న, ఆ
మట్టున కోపమందుట భ్రమంబొ నిజంబొ వచింపజాల నీ
దెట్టులనైన నైజముగ నింతటి యందపుకత్తెవైన యో
బొట్టియ, నీవిటుల్ పసిడిభూషణము ల్ధరియించుబుద్ధి చే
పట్టిన, సుందరత్వము కపాకరణం బిక వేఱయున్నదే !

అందము లేకయున్న యెడ నాదటచంద మొకింత కల్గగా
కొందఱు పైడిభూష లొక కొన్నిటి దాల్చిన, మేలివాసనల్
పొందనిపూవుల న్సొగసుపుట్టగ తోరణగట్టి వాసికల్
విందుగ మీదమీద నొకవింతగ చందన మింత జల్లినన్,
మందులు గోతుగా మనసుమల్చి విమర్శనచేయకుంటచే
ముందటికంటె నందమును మోదముగుల్కు టొకింత నిక్కమే,
సందియ మేల ? ఐన, సహజంబగు నందము సౌరభంబు ని
ష్యందమునాదు చుట్టును ప్రచారముచేసెడి పూవ్రబోండ్లకున్,
కుందసరోజజాతిముఖకోమలసూనలతాచ్ఛపాళి, కా
నందముకల్గ భూషలు ఘనంబగు వాసన లల్ల గోరిరన్;
డెందము కింపుగూర్చెడి కడిందిమనోహరనైజరూపమే
కుందుట, తొంటివాసనకకాపికయాట యెఱుంగరాదొ ! ఆ
చందమయయ్యొ నీవరుస ! చక్కని యొఱ్ఱటనంబుతోడ తృ
ప్తిం దలదాల్చబోక పురవీథులబోవు వెలందులట్టులే
కుందనపున్మెలాము పయి గోరికపుట్టెను నీకు గావునన్
కెందలిరాకు బోడి ! కిలికించితత్వత్కమనీయదీధితుల్
చందురు పెండలంజిలక జాలక భూమిని, మాసిపోయి, యిం
దిందిరనీలికాంతులు మగించి పయిం బ్రవహించి, పద్మినీ
వందితుడైన భాస్కరుని పాళములం బడనయ్యొ నీ కమో !

ఎంతటివారి కెంతటికి నీడ్వదు కాంచనవాంఛ ! నిచ్చలున్
శాంతతపోవనంబులను సర్వసుపర్వులు మెచ్చుటంద వృ
త్రాంతకు డాత్మ గుంది సతతంబును నాకవిగాసినిపదా
క్రాంతుడె యొచు యోగగుణఘాతక దక్షకఠారయంత్రముల్
చింతలుచేయ, దేవతలు చెంతనె నిల్చి వరంబు లీయ, భూ
కాంతులు వారి యానములకై మడుగుల్ రచియింప, వారి సి
ద్ధాంతములన్నిటిం జనుల యాచరణంబుల కాజ్ఞలీయ, ని
శ్చింతగ సర్వసంగితులు చిత్తములం దిలకించు విప్రులన్
పంతముబట్టి యైహికపిపాసల కీడిచి, పావలాకు దే
వాంతనరాంతకార్యముల కాయతులం బొనరించి స్వార్థదే
శాంతరులైనవారల ప్రచండదయాయుతభిక్షకై చెయిం
గొంతుక జాచునట్టి చెనుగు ల్నిజదేశవిఘాతకు ల్నిజం
బింతయు లేని కల్లల గడించిన పుష్కలసమ్యక్కీర్తిసం
క్రాంతుల జేసి భూతలిని కల్మషరాసికి నెల్ల వీరలే
ప్రాంతములంచు నాగరకరాజ్యము లన్నిటియందుఁ జూపి కే
లింతలుచేసె, నింకను రచింపగజాలని దద్ది దానికిన్ ?

విక్రమసూచకంపు మగవెంట్రుక లూడగ, గొల్లభామకున్
వక్రముకాక బారెడు సొబంగున మించెడి యూచలట్టులన్
ఆక్రమణం బొనర్చి మొగమల్లయు గ్రమ్మెడి పేడిమీసముల్
చక్రములట్లు ద్రిప్పుకొని సారెకు వీథుల వ్రాలి మేమె మీ
యిక్కటులెల్ల బాపెడి యహీనపరాక్రమ మందువార మీ
దిక్కున పారబోయుడు మదిం బెరయోచన లెవ్వి లేక మీ
యొక్కఘనంపు వోటులని యూరక బల్లలు కొట్టి యార్చి; ఏ
యొక్క సమస్య పట్టియును నోడుటతప్ప యెఱుంగకుండ, అ
మ్మక్క ! శిరంబు వంచుక గృహంబుకు వచ్చుచుగూడ దృప్తితో
జక్కగ గూరుచోక, సరసంబుగ పొగలు పెట్టి యద్దముల్
ముక్కుల దిద్దుకొంచు, మొగమోటపు మోటరు లెక్కి, యింటిలో
గ్రుక్కెడు గంజి లేక సతి కుందుచునున్నను నున్న ద్రవ్యమున్
రెక్కలు చాచి జల్లుచు, హరీ యని కుష్కమనోరథంబులన్
సొక్కుచు సోలుచుండు గడుసుందనపుం దలలేని గౌరవం
బక్కఱలేని ద్రవ్యయుత యాచకపాళినిగా నొనర్చె నీ

చక్కని హిందుదేశమున శౌర్యముతో వసియించు పేడులన్
అక్కలకంటి కింక నహహా రచియింపగరాని దెద్దియో!

గొంతుకనొత్తి యిట్టి చెకుసుల్వదియించుట పాడిగాదు నా
యంటివాని, కమ్మ! చెవియల్లన నిచ్చుట పాడిగాదు నీ
యంతటి లోకమాతకు, సహాయముచేసి మరల్చలేని యీ
చింతలతో ప్రయోజనము చేరుట యెట్టుల! యూరకుండకున్
శాంతిములేక యున్కి విరసంబుగ ప్రేలితి, నిట్టివెల్ల నో
క్కంతయు నీకు క్రొత్తలా? ఎఱింగియుకూడను కాంచనంబుపై
సంతసమున్ బయల్పఱచి చయ్యన బల్కనరైతి, నిట్టిస
త్యాంతిపథంబులం గయికి దక్కిన పచ్చదనంబు నిచ్చలున్
జెంతనె యుండనంపు సరసీరుహలోచన, నిక్కువంబుగా
మంతనమందు నెంచితివె మాయయటంచు నెఱుంగనైతివే?

నల్లని మేఘమొక్కటి ఘనంబుగ గాచుకయుండునుసుమ్మహో
పల్లవపాణి, యోగ్యపథవర్తుడు కాని ధనాఢ్యు కొంపపై
నల్లుక యెల్లవేళలను నవ్యముగా నరుణంబుగా లతా
పల్లవశోభితంబుగ శుభప్రదకార్యకలాపమాధురీ
సల్లలితంబుగా, విమలసంతతు లింతులు వింతవింతలౌ
వెల్లువసౌరభంబుల స్రవించుచునున్నను దానికెప్పుడే
యల్లరివచ్చునో యెఱుయునాతడు లేడుసుమీ జగంబునన్

పుడమిని నిన్ను మించి ధనపూర్ణుడు శోభనవంతు డెవ్వడో!
ఎడపక నీకె యిట్టిగతి యీయెడ మూడిన, మూడకుండునే
చెడుగుల, కైన నీశ్వరుని చిత్రవిచిత్రపుటాటలన్ శుభం
బడరెడు మంచిపల్లు నని హానియె కూడును వేలుపట్ల నం
చడరక చెప్పజాలము సహాయమె తప్ప తలంప నెప్పుడే
బడుగునకైన, నీ కిపుడు పట్టిన దుస్థితి నాకు కన్నులం
బొడమగజేయు బాష్పములబొట్టులు, ఐనను మంచివారలన్
పిడుగులతోడ నీశ్వరుడు పిండియొనర్చునటంచు చెప్పుటల్
తప్పని యట్టులుండగ యథార్థము సుంతెయుకాదు ఈశ్వరుం
డెప్పగిదిం జరించునొకొ యించుకయైన నెఱుంగకుంట ఆ
యొప్పులకుప్ప చర్యలకు నొప్పగు టిప్పణమొండు వ్రాయగా
విప్పగ శక్తిలేమి వినువీథిని కొండొక మబ్బు నల్లగా
కప్పిననేమి? భాస్కరుని కాంతులు కమ్మగ గ్రమ్మ, నింగిపై
నిప్పటిదాక కన్గొనగనీగని నూతనస్వచ్ఛఘస్రమున్
విప్పి, మనోజ్ఞమైన హరివిల్లును ముందు దవిల్చి, ప్రాణముల్
తెప్పరిలంగ, జంతువులు తిన్నగ ప్రాకృతకర్మమత్తులై
యిచ్చ జరింప, సృష్టిసరసీరుహపాదయు నొక్కమెట్టు దా
వచ్చినయట్టు లొక్కతిథి వన్నెగ వెల్గుచునుంట కంట బల్
ముచ్చటకాదె యెట్టిగతి మూర్ఖునకైనను ఎల్లకాలమున్
కుచ్చులుగట్టి యొత్తిగను కూర్చొనెదన్ దొలిగట్టుచెట్లపై

పచ్చనికొమ్మ యూయెలల, బాపురె! పచ్చలు ల్పవేల? యీ
వచ్చెడి ప్రొద్దదేల వరవర్ణినిసై యొసగంగనేనె? ఈ
లచ్చియె మేలటంచు జటిలంబుగ నెంచుట భోగభాగ్యముల్
మ్రుచ్చిలగోరు మానవులమో స్తరుగాని, సుశీల! లీల! నీ
లక్షణ మింతకాదని బలంబుగ జాటెదసుమ్ము నమ్ముమీ!

దేవునివెన్క దేవుగతిం జరియించెడ వీవ కావె! నీ
చేవకు నింతయంతనుచు జెప్పగనేర్చినవార లేరి? నీ
సేవయె యెల్లప్రాణులకు సేవయొసంగును చిత్రవర్ణముల్
క్రోవలుదీసి యొయ్యొయల కోరకితంబగునేని, తీయనౌ
తావులు భూతలంబునను తాండవమాడుచునుండునేని, ఏ
రేవున, తోటలందు, నిబిరీసశశిద్యుతియందు శైత్యముల్
ప్రావమునొందునేని, చతురంబుగ బుట్టుచు బెద్దయౌచు, సం
ఖ్యావితతంబుగా ప్రసవగర్వము నందుచు, కాలపద్ధతి
త్రిప్పిధి ప్రాణముల్ దొరగి శీర్ణములై లయమందు లీనమై
జీవనబీజ మెల్లెడల జిందులు ద్రొక్కుచునుండునేని, ఈ
భోగమదెల్ల నోతలిరుబోడిరో నీయది కాదె! నీకుగా
త్యాగముచేయు నేనరుసు త్వత్కరుణాదరదత్తసత్వమున్,
రోగము వాని జూచిన తిరోహితమై చను సర్వశక్తులున్
స్వాగతమిచ్చి వాని శిరసావహితాజ్ఞుని జేయు కోరికన్
జాగరకస్థితి న్మెలగి సాగగ తగ్గగజాలియుండు ఏ
రాగముకాని ధర్మనగరంబున కడ్డము నిల్వకుండ, స్వే
చ్ఛాగమనంబు నాపెడి ప్రచండసుశృంఖల మౌను కష్టముల్
మూగియు వాని మోసమును ముట్టగజాలవు ఎట్టిసౌఖ్యముల్
లాగవు కేవలంబగు విలాసపు కూపములోని కిద్దెఘా
మీగురుగోళమందునను, మించుగ బోధనచేయుచున్న యు
ద్యోగము నీదియందు మది నూహయొనర్తును

మానవాళుల్
డేగలబోలు కోర్కుల కడింది నఖంబుల జిక్కుకొన్న, ఆ
భోగభవత్కపోలముల బోయెడి బాష్పము లప్పుడెప్డు కా
లాగురుధూపమేఘముల నల్లి, ధరాతలి జారి, జోరుగా
సాగరమున్ గనుంగొనగ సాగెడి వాహినులౌచు దోచెడున్

నేటికి గాకయున్న, తరుణీమణి, రేపటికైన నీపనుల్
నీటుగ దీరునంచును గుణింత మెఱింగినచో నెఱుంగనౌ
పోటరిబంటులై యెదురుపోరుటకాదుగదమ్మ నీకు, బా
హాటముగాగ నీదెసరయంబున మళ్లగ శక్తిలేమి పో
రాటమునం దశక్తికి పరాభవము న్విజయంబు శక్తికిన్
బాటిమొగాదె! లేనియెడ పావనశక్తికి శక్తి యేడ? ఈ
మాట నెఱింగిరేని, అనుమానము గల్గునె యేరికేని నీ
ధాటికి సర్వమంగళవిధానము కూడుటయందు సోదరీ!





(27) 1. తెనాలి మెడికల్ అసోసియేషన్ వార్షికోత్సవము. 2. అఖిలభారతఖాదీ, స్వదేశీప్రదర్శనసంఘము-కాకినాడ.





1 గోఖలేవర్ధంతి చెన్నపురి 2 టి ఆర్ వెంకటరామశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము

# దివంగత చల్లా శేషగిరిరావుగారు

ఆకుచాటున పిందె యణగియుండినరీతి, "నాగేశ్వరు"నిచెంత నడచితీవు!

మాలతీసుమమందు మధురవాసనరీతి "ఆంధ్రపత్రిక" సంస్థ నలరితీవు!

మేఘమండలియందు మెరుపు మెరసినరీతి, మెరపించి మరపించి మెలగినావు!

తల్లిచాటున పిల్ల తారియుండినరీతి, ప్రేమ భక్తిలతల పెంచినావు!

"ఆంధ్రపత్రిక" నీచేత నమరజేయ - రాచకీయంపు "లే దీగ" ప్రాకజేసి

దివికి బోయితె! నా మిత్ర ధీరవర్య! - సాధుసుజనవిధేయ! శేషగిరిరాయ!

చట్టి నరసింహారావు

* * * * * *

నలువదియెనిమిదేండ్లకే ఆంధ్రపత్రికా సంపాదకులు శ్రీ చల్లా శేషగిరిరావుగారికి నూరేడులు నిండిపోయినవి ఆంధ్రలోకమును విషాదమేఘము లలముకొని సానుభూతిధారల పెల్లుకురిసినవి. కాని ఆయన కొరకు దుఃఖింపబనిలేదు. ఆయన మృతజీవి.

ఆంధ్రుల భాగ్యాతిరేకమున పదునైదేడులనాడు శేషగిరిరావుగా రాంధ్రపత్రికకు సంపాదకు లయినారు, వారి సంపాదకత్వమున నాంధ్రపత్రిక యాంధ్రులను అన్నిత్రోవల ముందనకు దెచ్చినది

ఆంధ్రపత్రికా శేషగిరిరావుల కద్వైతభావ మబ్బినది అది పత్రికయదృష్టము, పత్రికాధిపతి యదృష్టము.

ఒడ్డుపొడవుల నొప్పారిన శేషగిరిరావుగారి యాకృతి సంపాదకత్వమునకు నిండుదనమును సంతరించునది వెడదనుదురు, బట్టతల ఆయన ఎరుకకలిమికి గురుతులు ఆయన రూపుగొనిన శాంతము. తొలిచూపునసే ఆయనయెడ చూపరకు గౌరవభావ ముప్పతిల్లెడిది

ఆయన దేశసేవాపరతంత్రుడగు జాతీయవాది; తత్త్వవేత్త యగు కర్మయోగి. దేశసేవ ఆయనకర్మయోగమునకు పరమలక్ష్యము. ఆయనదేశసేవాసక్తి ఒరుల నిర్బంధమువలన, స్వాహంకారమువలన, గృహచ్ఛిద్రములు కారణముగ, బ్రదుకుతెరువుగ, ప్రతిష్ఠకోసము అంకురించినది కాదు. నిరుపమానమగు దేశభక్తియే యందుకు కారణము. దేశసేవారూపమగు నాయన నిరంతరకర్మయోగమునకు దేశాభ్యుదయమే పరమమగు నాకాంక్ష్యము. ఆయనదేశసేవానిర్మాణమున కాంధ్రపత్రిక తెరచినహజారము.

ఆంధ్రపత్రిక కాయన సంపాదకుడయియున్న కాలమున భారతీయుల స్వాతంత్ర్యసంపాదన ప్రయత్నములమూలమున దేశపరిస్థితు లల్లకల్లోలము లయినవి. శాసనములు చెలరేగినవి. వాకట్టులు బిగిసినవి. పత్రిక లనేకములు పడిపోయినవి. కాని ఆంధ్రపత్రిక జాతీయపత్రికయయ్యును, ఏ యొదుదొడుకులక్కు లోనుగాక యొక్క-మొత్తుననే కొనసాగినది. ఇది ఆయన లోకజ్ఞతకు, సంపాదననిర్వహణకౌశలమునకు తెలివిడి.

శేషగిరిరావుగారి కలమునకు వాడి తక్కువయయ్యును అన్నివెంటల 'కాలము'లబడి పరువిడ నదివెనుదీయునది కాదు. సంపాదకధర్మమగు ననుశాసనము కంటె నది యనునయమునకే దారితీయునది, అసమ

మార్గమున గాక, సామాన్యమార్గమున నడచునది. ఆయనహృదయమువలెనే ఆయనరచనము మృదులము, సరళము

సౌజన్యము, మితభాషణము నాయన కలంకారములు.

ఆయనను రెండేడులనాడే విషమరోగము పయికొనినది, క్రమముగ ముదురజొచ్చినది. దానిని లెక్కించినవారుకా రాయన. దేశసేవాతత్పరత రోగము నునికిని, దాని ప్రాబల్యమును ఆయన యెరుకకు దెచ్చినదికాదు. శరీరపాతమువరకు దేశసేవచేసినారు, ధన్యజీవను లయినారు. దేశసేవపయిగలఆసక్తిపి ప్రాణములపయి నాయనకు లేకపోయినది. ఆయన యుత్తమదేశసేవాసక్తియే ఆయనకు ప్రాణాంతకముగా పరిణమించినది. ఇది సత్యము. ఈసత్యమును ఋజుహృదయము గుర్తింపగలదు.

శేషగిరిరావుగారు చిరస్మరణీయులగుటకు వారి పేర స్మారకచిహ్నమును నెలకొలుప తలపెట్టియున్నారాంధ్రులు. 'వార్తాపత్రికా విద్యార్థివేతనము' శేషగిరి రావుగారు వార్తాపత్రికాసంపాదనద్వారమున కావించిన యమూల్యమగు దేశసేవకు సముచితమగు స్మారకచిహ్నము కాగలదు. ఆంధ్రులకును పత్రికాసంపాదన నిర్వహణాదుల పరిచయము తక్కువ. ఈతీరు స్మారకచిహ్నము ఆంధ్రులకు పత్రికావిషయకవిజ్ఞానప్రాప్తికిని సాధనము కాగలదు. మరియు 'ద్వ్యర్థకరి' యగు 'ఏకక్రియ' సర్వధా ప్రశస్తము

గన్నవరపు సుబ్బరామయ్య



"విశ్రాంతి" —పి బ్రహ్మం, ఆర్ట్సు కళాశాల, మద్రాసు.

# శ్రీముఖ సంవత్సర విశేషములు

౧౯౩౩

మార్చి ౧౫ ఆర్ కే షణ్ముగంశెట్టిగారు భారతశాసనసభకు అధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి

,, ౧౮. శ్వేతపత్రము ప్రకటింపబడినది

ఏప్రిల్ ౧ షెంస్‌ఫర్డు ప్రభువు మృతి

,, ౩ మాలవ్యాగారి విడుదల

,, ౬ సేటు జమ్నాలాలుబజాజుగారి విడుదల

,, ౭ చటారి నవాబుగారు సంయుక్తరాష్ట్రముల గవర్నరయిరి

,, ౧౩ సరోజినిదేవిగారి విడుదల

,, ౧౫ నేషనల్ లిబరల్ ఫెడరేషన్ సమావేశము, కలకత్తా దివాన్ బహద్దూరు మోచర్ల రామచంద్రరావు పంతులుగా రధ్యక్షులు

,, ౧౬ అఖిలభారత గ్రంథాలయమహాసభా సమావేశము, బెజవాడ

,, ౧౯. హసన్ ఇమాంగారి మృతి

,, ౨౯ దేవమిత్ర ధమ్మపాల నిర్యాణము,

మే ౧ ఇంగ్లాండు ఇండియాలకు రేడియో టెలిఫోను సర్వీసు ప్రారంభము

,, ౮ గాంధీమహాత్ముని మూడు వారముల ఉపవాసము ఆరంభము, విడుదల

,, ౧౦. శ్రీమతి కస్తూరిబాయిగాంధి విడుదల

,, ౨౯ మహాత్ముని ఉపవాస పరిసమాప్తి

,, ౩౦ పర్ణకుటియందు కాంగ్రెసు నాయకుల సమావేశము

జూన్ ౪ ఆంధ్రరాష్ట్రీయ ప్రకృతిమహాసభ, బెజవాడ

,, ౧౨ ప్రపంచార్థిక మహాసభను శ్రీజార్జి చక్రవర్తిగారు ప్రారంభించిరి

,, ౧౩. బసవరాజు అప్పారావుగారి నిర్యాణము.

,, ౧౬ లక్ష్మి దేవదాసుగాంధీల వివాహము

,, ౨౪. సర్. కూర్మా వెంకటరెడ్డినాయడుగారికి శ్రీ జార్జి చక్రవర్తిగారు దర్శన మిచ్చిరి

జూన్ ౨౭ బొబ్బిలి రాజాగారి ఆంధ్రరాష్ట్రప్రతిఘటనము

,, ౨౯ కాంగ్రెసునాయకుల సమావేశము, ఆనీగారి ప్రకటన

జూలయి ౮ గుంటూరున ఆంధ్రనాయకుల సమావేశము

,, ౧౨ పూనా సమావేశ ప్రారంభము

,, ౧౫ సందర్శనమున కనుమతినిచ్చుటకయి రాజప్రతినిధికి మహాత్ముని తంతి

,, ౧౬ మహాత్ముని తంతికి దర్శన మొసంగజాలనని రాజప్రతినిధి బదులు తంతి

,, ౧౭ ఆంధ్రరాష్ట్రమునుగూర్చి బొబ్బిలిరాజావారి రెండవ ప్రకటనము

,, ౨౦ లార్డుబరన్‌హాం ("డెయిలీ టెలెగ్రాఫ్" పత్రికాధిపతి) గారి మృతి

,, ౨౨ సేనుగుప్త నిర్యాణము

,, ౨౬ 'సబర్మతి' ఆశ్రమమును ఎత్తివేయుట

,, ౩౧ మహాత్ముని అరెస్టు; వారి అనుచరులను ముప్పదిముగ్గురనుగూడ

ఆగస్టు ౪ మహాత్ముని విడుదల, మరల అరెస్టు, శిక్షలు

,, ౮ శ్రీమతి కస్తూరిబాయిగాంధి అరెస్టు

,, ౧౪ ఆనిగారి అరెస్టు

,, ౧౬ మహాత్ముని ఉపవాసప్రారంభము

,, ౧౮ సి యఫ్ ఆండ్రూసుగారు మహాత్ముని జైలున సందర్శించిరి

,, ౨౦ శ్రీమతి కస్తూరిబాయిగాంధి విడుదల

,, ౨౩ మహాత్ముని విడుదల

,, ౨౬ సర్ సి కే బోసుగారి శరీరత్యాగము

,, ౩౧ జవహరిలాల్ నెహ్రూగారి విడుదల

సెప్టంబరు ౪ మిడ్నపూరుజిల్లా మేజిస్ట్రేటుహత్య.

,, ౬ గ్రే ప్రభువు మరణము

,, ౯ పండిత జవహర్‌లాల్ నెహ్రూ, మహాత్మాగాంధిగార్ల సంభాషణము

,, ౧౨ అఖిలభారత గ్రంథాలయ మహాసభ, కలకత్తా

సెప్టెంబరు ౧౪ ఏడాదివరకు రాజకీయములయందు పాల్గొనవని మహాత్ముని ప్రకటన
,, ౧౫ డా॥ పట్టాభి సీతారామయ్యగారి విడుదల
,, ౨౦ డా॥ అనిబెసంటు నిర్యాణము.
,, ,, ఆంధ్రపత్రిక రజతోత్సవము
,, ౨౫ నానాజాతిసమితి పదునాలుగవ సమావేశము, జినివా
,, ౨౭ రాజా రామమోహనరాయిగారి నూరవ ఆబ్దికము
,, ౩౦ శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవము
అక్టోబరు ౨ మహాత్ముని జన్మదినోత్సవము
,, ౧౪ జర్మని ఆయుధవిసర్జనసభనుండి వీడిపోయినది
,, ౨౨ పటేలుగారి నిర్యాణము
,, ౩౦ పట్టాభి సీతారామయ్యగారి అరెస్టు, శిక్ష
నవంబరు ౪ ఆంధ్రరాష్ట్రమహిళాసభ
,, ౭ గాంధిమహాత్ముని హరిజనయాత్రా ప్రారంభము, మధ్యరాష్ట్రములలో
,, ౮ ఆఫ్ఘను అమీరు నాదిర్‌షా హత్య
,, ,, మైసూరు భీష్ముడు వెంకటకృష్ణయ్యగారి నిర్యాణము
,, ౨౦ రిజర్వుబ్యాంకు బిల్లుపయి జాయింటుకమిటీ రిపోర్టు ప్రకటనము
,, ౨౩ మాడపాటి సరోజినీదేవి (సుప్రసిద్ధనటి) నిర్యాణము
డిసంబరు ౫ అయ్యదేవర కాళేశ్వరరావు, కమలాదేవిగార్లకు ఏడాది శిక్ష
,, ౬ జబల్పూరులో కాంగ్రెసునాయకుల సమావేశము
,, ౭ అమెరికా సంయుక్తరాష్ట్రములయందు మద్యపాననిషేధము రద్దు
,, ౮ ఆంధ్రవిశ్వవిద్యాలయ నూతనభవన ప్రవేశోత్సవమును మదరాసు గవర్నరుగారు జరిపిరి
,, ౧౨ ఆంధ్ర విశ్వవిద్యాలయమున రవీంద్రునిరాక, ఉపన్యాసములు వగైరాలు
,, ౧౪ చెన్నపురమునకు రాజప్రతినిధిరాక
,, ౧౬ మహాత్ముని ఆంధ్రదేశసంచార ప్రారంభము
,, ౧౯. విశాఖపట్టణపు టోం రేవు ప్రారంభము రాజప్రతినిధిగారు కావించిరి.
,, ౨౦ చెన్నపురికి మహాత్మునిరాక
,, ౨౨ రిజర్వుబ్యాంకిబిల్లు ఆమోదింపబడెను
డిసంబరు ౨౪ ఆల్ ఇండియా ట్రేడు యూనియన్ కాంగ్రెసుసభ, కాన్పూరు
,, ౨౫ ఆంధ్రనాటకకళాపరిషత్తు, తృతీయ సమావేశము, చెన్నపురి అధ్యక్షుడు టి రాఘవాచార్యులుగారు
,, ౨౬. భారతజాతీయ మితవాదమహాసభ ౧౫-వసమావేశము, చెన్నపురి, అధ్యక్షులు జే యస్ బోసుగారు.
,, ౨౭ అఖిలభారత మహిళామహాసభ, కలకత్తా
,, ౨౯ రావుసాహెబు గిడుగు రామమూర్తిపంతులుగారి డెబ్బదవ జన్మదినమహోత్సవము, సమ్మానము
,, ,, అభినవాంధ్రకవిపండితసభ, ద్వితీయసమావేశము, రాజమండ్రి. అధ్యక్షుడు రాయప్రోలు సుబ్బరావుగారు
,, ,, అఖిలభారత సాంఘికమహాసభ, చెన్నపురి అధ్యక్షుడు జి కే దేవధరులుగారు

౧౯౩౪

జనవరి ౩ అఖిలభారతఆర్థికమహాసభాసమావేశము, చిదంబరము
,, ౪ ప్రత్తివ్యాపారమువిషయమున ఇండియా - జపానులకు ఒడంబడిక
,, ,, మహాత్ముని ఆంధ్రదేశసంచారము ముగింపు
,, ౧౧ మైసూరుమహారాజా, గాంధిమహాత్ముల సంభాషణము
,, ,, మదరాసు ప్రభుత్వమువారు భూమిశిస్తుల తగ్గింపు ప్రకటనము కావించిరి
,, ౧౨ అఖిలభారత స్వదేశీ ప్రదర్శన ప్రారంభము, కాకినాడ
,, ౧౫ ఉత్తరహిందూస్థానమున భూకంపము.
,, ౧౬ బాబు రాజేంద్రప్రసాదుగారి విడుదల
,, ౧౯ ఆంధ్రపత్రికా సంపాదకులుగనుండిన చల్లా శేషగిరిరావుగారి నిర్యాణము
,, ౨౯ రావుసాహెబు ఉన్నవ రామలింగంపంతులుగారి నిర్యాణము
ఫిబ్రవరి ౫ హిందూపత్రికా సంపాదకులు ఎ రంగస్వామయ్యంగారి నిర్యాణము
,, ౭ సి రాజగోపాలాచారిగారి విడుదల
,, ౧౫ దిగుమతి సుంకములబిల్లు ఆమోదింపబడుట
,, ౧౭ బెల్జియం రాజు ఆల్బర్టుమృతి
మార్చి ౧ తాలూకాబోర్డుల రద్దుచట్టమును చెన్నపురి శాసనసభ ఆమోదించెను
,, ౫ మూడవ అఖిలభారతదేశ విశ్వవిద్యాలయసభ, ఢిల్లీ.

# ఆంధ్రరాష్ట్రము జనాభా

## పట్టిక ౧. జిల్లా, తాలూకావారి వైశాల్యము—జనసంఖ్య

| తాలూకా | వైశాల్యము చదరపు మైళ్ళు | సంఖ్య పట్టణములు | సంఖ్య గ్రామములు | కాపురమున్న ఇండ్లు | జనసంఖ్య 1931 మొత్తము | 1931 పురుషులు | 1931 స్త్రీలు | 1921 మొత్తము | వ్యత్యాసపు పెర్సెంటేజి 1921 మొదలు 1931 వరకు | 1911 మొదలు 1921 వరకు | 1931 లో చదరపు మైలుకు జనసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| గంజాం— | | | | | | | | | | | |
| ఏజెన్సీ . .. | 3,583 | | 2,933 | 80,984 | 358,238 | 176,641 | 181,597 | 332,898 | 7.6* | — 5 0 | 100 |
| బల్లిగూడ | 1,669 | | 1,088 | 22,328 | 108,955 | 54,422 | 54,533 | 99,672 | 9 3 | — 8 3 | 65 |
| G ఉదయగిరి | 504 | | 547 | 21,429 | 85,188 | 41,895 | 43,293 | 78,013 | 9 2 | — 4 5 | 169 |
| పర్లాకిమిడి | 355 | | 455 | 16,181 | 69,681 | 33,769 | 35,912 | 65,281 | 6 8 | — 2 8 | 196 |
| రామగిరి | 953 | | 794 | 20,267 | 91,577 | 45,148 | 46,429 | 86,707 | 5 6 | — 3 0 | 96 |
| సూరాడ | 102 | | 49 | 779 | 2,837 | 1,407 | 1,430 | 3,275 | — 13 4 | — 8 3 | 28 |
| గంజాం— | | | | | | | | | | | |
| సమభూములు . | 4,799 | 9 | 4,045 | 429,080 | 2,053,381 | 941,187 | 1,112,194 | 1,835,562 | 11 9 | — 1.9 | 428 |
| ఆస్కా | 632 | 1 | 477 | 42 761 | 210,270 | 93,719 | 116,551 | 178,418 | 17 9 | — 6 9 | 333 |
| బరహంపురము | 571 | 2 | 424 | 58,553 | 305,909 | 139,722 | 166,187 | 275,454 | 11 1 | — 5 2 | 536 |
| ఛత్రపురము | 296 | | 276 | 29,059 | 187,165 | 84,800 | 102,365 | 159,580 | 17 3 | 11 5 | 632 |
| చికాకోల్ | 460 | 2 | 353 | 67,769 | 291,827 | 139,816 | 152,011 | 275,014 | 6 1 | 2 5 | 634 |
| గుంసూర్ | 821 | 1 | 388 | 88,507 | 180,615 | 79,275 | 101,340 | 161,962 | 11 5 | — 5 1 | 220 |
| ఇచ్ఛాపురము | 221 | | 269 | 17,292 | 80,300 | 35,946 | 44,354 | 74,566 | 7 7 | 3 9 | 363 |
| కొడాల | 531 | | 495 | 39,062 | 207,228 | 91,731 | 115 497 | 171,975 | 20 5 | — 9 8 | 390 |
| పర్లాకిమిడి | 618 | 1 | 657 | 70,532 | 293,319 | 141,959 | 151,360 | 274,034 | 7 0 | — 1 7 | 475 |
| సోంపేట | 274 | 1 | 252 | 27,736 | 120,635 | 53,168 | 67,467 | 109,369 | 10 3 | — 1 0 | 440 |
| సూరాడ | 136 | | 123 | 4,411 | 23,877 | 11,206 | 12,671 | 19,334 | 23 5 | — 10 0 | 176 |
| టెక్కలి | 239 | 1 | 331 | 33,398 | 152,236 | 69,845 | 82,391 | 135,856 | 12 1 | 1 6 | 637 |
| విశాఖపట్నం— | | | | | | | | | | | |
| ఏజెన్సీ ... | ...12,611 | 1 | 9,005 | 250,150 | 1,164,998 | 581,867 | 583,131 | 978,403 | 19 1 | — 4 1 | 92 |
| బిసంకటక్ . | 823 | | 757 | 16,711 | 64,755 | 32,362 | 32,393 | 61,844 | 4 7 | — 1 3 | 79 |
| గోల్కొండ | 40 | | 30 | 5,179 | 20,831 | 10,167 | 10,664 | 18,048 | 15 4 | 1 2 | 521 |
| గూడెం | 738 | | 278 | 4,846 | 23,547 | 11,697 | 11,850 | 21,779 | 8 1 | — 3 7 | 32 |
| గునుపూర్ | 966 | | 905 | 30,080 | 120,854 | 60,033 | 60,821 | 122,077 | — 1 0 | — 0 1 | 125 |
| జయపూర్ .. | 1,160 | 1 | 643 | 41,370 | 201,060 | 99,699 | 101,361 | 162,156 | 24 0 | — 6 8 | 173 |
| కోరాపుట్ | 706 | | 540 | 15,108 | 74,898 | 37,310 | 37,588 | 56,548 | 32 5 | 4 2 | 106 |
| మల్కనగిరి | 2,288 | | 593 | 14,684 | 76,246 | 37,892 | 38,354 | 53,731 | 41 9 | 32 5 | 33 |
| నౌరంగ్‌పూర్ | 2,093 | | 1,105 | 38,167 | 198,911 | 100,584 | 98,327 | 170,492 | 16 7 | — 5 8 | 95 |
| పాడ్వా . | 1,316 | | 1,866 | 25,254 | 129,580 | 65,064 | 64,516 | 86,726 | 49 4 | — 10 5 | 98 |
| పాలకొండ | 168 | | 101 | 3,133 | 13,918 | 7,052 | 6,866 | 8,140 | 71 0 | — 9 0 | 83 |
| పార్వతీపురము | 398 | | 258 | 10,442 | 42,651 | 21,109 | 21,542 | 41,609 | 2 5 | — 9 0 | 107 |
| పాట్టంగి | 800 | | 927 | 20,884 | 97,427 | 48,866 | 48,561 | 76,172 | 27 9 | — 2 3 | 122 |
| రాయగడ | 620 | | 754 | 21,361 | 83,412 | 41,542 | 41,870 | 79,248 | 5 3 | — 15 6 | 135 |
| సాలూరు | 200 | | 85 | 715 | 6,253 | 3,153 | 3,100 | 4,692 | 33 3 | — 2 3 | 31 |
| శృంగవరపుకోట | 164 | | 129 | 1,134 | 5,362 | 2,625 | 2,737 | 5,086 | 5 4 | — 10 5 | 33 |
| వీరవల్లి | 131 | | 54 | 1,082 | 5,293 | 2,712 | 2,581 | 10,055 | — 47 4 | — 10 5 | 40 |

* —ఈగుర్తు తగ్గుదలను సూచించును

## పట్టిక ౧. జిల్లా, తాలూకావారి వైశాల్యము—జనసంఖ్య

| తాలూకా | చదరపు మైళ్లలో వైశాల్యము | సంఖ్య: పట్టణములు | సంఖ్య: గ్రామములు | కాపురమున్న స్థలం | జనసంఖ్య 1931: మొత్తము | జనసంఖ్య 1931: పురుషులు | జనసంఖ్య 1931: స్త్రీలు | జనసంఖ్య 1921: మొత్తము | వ్యత్యాసపు పెర్ సెంటేజి: 1821 మొదలు 1931 వరకు | వ్యత్యాసపు పెర్ సెంటేజి: 1911 1921 | 1931 లో చదరపు మైలుకు జనసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| **విశాఖపట్నం—** | | | | | | | | | | | |
| సమభూములు | 4,575 | 16 | 2,542 | 584,525 | 2,442,950 | 1,191,218 | 1 251,732 | 2 213,826 | 10 3 | 2 0 | 534 |
| అనకాపల్లి | 301 | 1 | 144 | 47,974 | 182,546 | 85,440 | 97,106 | 167,710 | 8 8 | —1 2 | 606 |
| భీమునిపట్నం | 255 | 1 | 118 | 36,231 | 141,987 | 70,246 | 71,741 | 127,298 | 11 5 | — 2 4 | 557 |
| బొబ్బిలి | 268 | 1 | 173 | 41,264 | 172,097 | 84,623 | 87,474 | 157,488 | 9 3 | 10 4 | 642 |
| చీపురుపల్లి | 535 | | 267 | 49,355 | 207,391 | 102,196 | 105,195 | 186,788 | 11 0 | 7 8 | 388 |
| గజపతినగరము | 302 | | 207 | 35,797 | 163,997 | 81,210 | 82,787 | 149,361 | 9 8 | 5 0 | 543 |
| గోల్కొండ | 500 | 1 | 154 | 39,519 | 156,944 | 77,768 | 79,176 | 139,000 | 12 9 | 16 3 | 314 |
| పాల్కొండ | 334 | 3 | 323 | 57,408 | 242,618 | 119,724 | 122,894 | 228,355 | 6 2 | 5 1 | 726 |
| పార్వతీపురము | 401 | 2 | 207 | 30,057 | 132,581 | 65,238 | 67,343 | 122,085 | 8 6 | — 0 1 | 331 |
| సాలూరు | 180 | 1 | 125 | 23,231 | 99 621 | 48,344 | 51,277 | 92,268 | 8 0 | — 7 4 | 553 |
| సర్వసిద్ధి | 341 | 1 | 142 | 50,397 | 192,063 | 90,757 | 101,306 | 170,044 | 12 9 | 0 7 | 563 |
| శృంగవరపుకోట | 278 | 1 | 177 | 32,183 | 160,053 | 77,189 | 82,864 | 141,094 | 13 4 | — 1 0 | 576 |
| వీరవల్లి | 386 | 2 | 241 | 59,192 | 234,848 | 112,507 | 122,341 | 221,810 | 5 9 | — 0 3 | 608 |
| విశాఖపట్నం | 175 | 1 | 73 | 30,923 | 134,287 | 66,070 | 68,217 | 114,665 | 17 1 | 0 4 | 767 |
| విజయనగరము | 319 | 1 | 191 | 50,994 | 221,917 | 109,906 | 112,011 | 195,860 | 13 3 | 4 8 | 696 |
| **తూర్పు గోదావరి—** | | | | | | | | | | | |
| ఏజెన్సీ ... | . . 3,675 | | 1,114 | 50,571 | 240,529 | 120,795 | 119,734 | 203,105 | 18 4 | — 1 8 | 65 |
| భద్రాచలము | 911 | | 326 | 12,678 | 62,788 | 31,293 | 31,495 | 50,038 | 25 5 | — 10 6 | 69 |
| చోడవరము | 710 | | 230 | 7,074 | 32,428 | 16,321 | 16,107 | 28,051 | 15 6 | — 2 0 | 46 |
| నూగూరు | 593 | . | 134 | 4,976 | 25,345 | 12,784 | 12,561 | 20,068 | 26 3 | 0 5 | 43 |
| పోలవరము | 543 | | 120 | 16,205 | 75,702 | 38,104 | 37,598 | 66,994 | 13 0 | 1 9 | 136 |
| ఎల్లవరము | 919 | | 304 | 9,643 | 44,266 | 22,293 | 21,973 | 37,954 | 16 6 | 3 5 | 48 |
| **తూర్పు గోదావరి—** | | | | | | | | | | | |
| సమభూములు . | 2,544 | 11 | 806 | 331,244 | 1,680,053 | 828,489 | 851 564 | 1 470,863 | 14 2 | 1 7 | 660 |
| అమలాపురము | 367 | 1 | 104 | 50,909 | 259,089 | 126,019 | 133,070 | 226,661 | 14 3 | 5 1 | 706 |
| కాకినాడ .. | 297 | 2 | 104 | 50,867 | 263,572 | 131,285 | 132,287 | 229,151 | 15 0 | 0 3 | 887 |
| పెద్దాపురము | 604 | 1 | 201 | 46,538 | 213,761 | 106,690 | 107,071 | 182,300 | 17 3 | — 3 2 | 354 |
| పిఠాపురము | 193 | 1 | 48 | 21,903 | 107,410 | 53,510 | 53,900 | 92,566 | 16 0 | — 4 4 | 557 |
| రాజమండ్రి | 376 | 2 | 80 | 40,912 | 218,730 | 109,446 | 108,284 | 185,699 | 17 8 | — 1 9 | 582 |
| రామచంద్రపురము | 291 | 3 | 114 | 53,127 | 277,317 | 136,996 | 140,321 | 256,416 | 8 2 | 7 4 | 953 |
| రాజోలు | 291 | . | 107 | 48,939 | 257,774 | 123,739 | 134,035 | 226,744 | 13 7 | 4 0 | 886 |
| తుని | 126 | 1 | 48 | 18,049 | 82,400 | 40,804 | 41,596 | 71,326 | 15 5 | 0 8 | 654 |

## పట్టిక ౧. జిల్లా, తాలూకావారి వైశాల్యము—జనసంఖ్య

| తాలూకా | వైశాల్యము చదరపు మైళ్లు | సంఖ్య పట్టణములు | సంఖ్య గ్రామములు | కాపురమున్న ఇండ్లు | జనసంఖ్య 1931 మొత్తము | 1931 పురుషులు | 1931 స్త్రీలు | 1921 మొత్తము | వ్యత్యాసపు పెర్సెంటేజి 1921 మొదలు 1931 వంకు | 1911 మొదలు 1921 వంకు | 1931 లో చదరపు మైలుకు జనసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| పడమటి గోదావరి . | 2,361 | 10 | 716 | 232,892 | 1 223,056 | 602,327 | 620,729 | 1 051,442 | 16 3 | 7 3 | 518 |
| భీమవరం | 282 | 1 | 89 | 33,226 | 174,083 | 85,104 | 88,979 | 144,640 | 20 4 | 12 8 | 617 |
| చింతలపూడి | 527 | | 127 | 20,012 | 97,458 | 49,678 | 47,780 | 88,915 | 9 6 | 7 3 | 185 |
| ఏలూరు | 377 | 1 | 118 | 35,556 | 184,975 | 92,015 | 92,960 | 155,726 | 18 8 | 5 2 | 491 |
| కొవ్వూరు | 354 | 2 | 100 | 28,556 | 155,883 | 78,543 | 77,340 | 132,140 | 18 0 | — 2 2 | 440 |
| నర్సాపురము | 278 | 3 | 87 | 44,091 | 233,736 | 112,436 | 121,300 | 205,418 | 13 8 | 12 0 | 841 |
| తాడేపల్లిగూడెం | 342 | | 107 | 31,738 | 163,721 | 81,506 | 82,215 | 138,895 | 17 9 | 7 1 | 479 |
| తణుకు | 200 | 3 | 88 | 39,713 | 213,200 | 103,045 | 110,155 | 185,708 | 14 8 | 5 8 | 1,066 |
| కృష్ణా .. .. | 3,547 | 9 | 981 | 252,432 | 1,254 208 | 635,704 | 618,504 | 1,081,872 | 15 9 | 6 4 | 354 |
| బందరు | 281 | 2 | 104 | 30,088 | 155,962 | 78,889 | 77,073 | 126,703 | 23 1 | 9 7 | 555 |
| బెజవాడ | 423 | 3 | 106 | 35,763 | 190,007 | 98,085 | 91,922 | 159,806 | 18 9 | 8 5 | 449 |
| దివి | 459 | | 97 | 33,564 | 163,398 | 82,336 | 81,062 | 144,196 | 13 3 | 7 6 | 356 |
| గన్నవరము . | 290 | 1 | 95 | 25,049 | 120,158 | 60,409 | 59,749 | 104,999 | 14 4 | 6 4 | 414 |
| గుడివాడ . | 313 | 1 | 159 | 42,361 | 202,217 | 101,448 | 100,769 | 179,556 | 12 6 | 10 6 | 646 |
| కైకలూరు . | 381 | | 89 | 17,954 | 85,368 | 42,945 | 42,423 | 65,766 | 29 8 | 12 3 | 224 |
| నందిగామ | 678 | 1 | 168 | 35,287 | 173,608 | 87,689 | 85,919 | 155,981 | 11 3 | — 1 4 | 256 |
| నూజివీడు . | 297 | 1 | 73 | 15,131 | 73,194 | 37 483 | 35,711 | 65,077 | 12 5 | 2 5 | 246 |
| తిరువూరు | 425 | | 90 | 17,235 | 90,296 | 46,420 | 43,876 | 79,788 | 13 2 | 0 8 | 212 |
| గుంటూరు .. . | 5,757 | 20 | 926 | 416,530 | 2,035,660 | 1,028,993 | 1 600,667 | 1,809,574 | 12 5 | 6 6 | 354 |
| బాపట్ల | 688 | 5 | 110 | 62,922 | 298,869 | 151,761 | 147,108 | 261,512 | 14 3 | 8 1 | 434 |
| గుంటూరు | 502 | 2 | 109 | 57,302 | 297,835 | 151,225 | 146,610 | 254,923 | 16 8 | 10 4 | 593 |
| నర్సారావుపేట .. | 716 | 2 | 106 | 48,003 | 237,261 | 120,065 | 117,196 | 211,631 | 12 1 | 8 5 | 331 |
| ఒంగోలు . | 820 | 3 | 163 | 55,672 | 277 986 | 139,407 | 138,579 | 259,892 | 7 0 | 5 2 | 339 |
| పల్నాడు . | 1,041 | 1 | 88 | 37,409 | 167,994 | 83,382 | 84,612 | 156,958 | 7 0 | — 2 6 | 161 |
| రేపల్లె . | 345 | 2 | 68 | 38,233 | 178,824 | 90,317 | 88,507 | 150,389 | 18 9 | 7 6 | 518 |
| సత్తెనపల్లి | 706 | 1 | 131 | 44,357 | 215,885 | 109,557 | 106,328 | 188,310 | 14 6 | 2 1 | 306 |
| తెనాలి . | 295 | 3 | 79 | 51,476 | 256,627 | 130,571 | 126,056 | 225,348 | 13 9 | 10 9 | 870 |
| వినుకొండ . | 644 | 1 | 72 | 21,156 | 104,379 | 52,708 | 51,671 | 100,611 | 3 7 | 6 5 | 162 |

## పట్టిక ౧. జిల్లా, తాలూకావారి వైశాల్యము—జనసంఖ్య.

| తాలూకా | విస్తీర్ణము చదరపు మైళ్లు | సంఖ్య పట్టణములు | సంఖ్య గ్రామములు | కాపురమున్న ఇండ్లు | జనసంఖ్య 1931 మొత్తము | 1931 పురుషులు | 1931 స్త్రీలు | 1921 మొత్తము | వ్యత్యాసపు పెర్ సెంటేజి 1921 మొదలు 1931 వరకు | 1911 1921 | 1931 లో చదరపు మైలు ఒకటికి జనసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| నెల్లూరు ... | ... 7,949 | 9 | 1621 | 307,826 | 1,486,222 | 744,322 | 741,900 | 1 385,553 | 7.3 | 4.3 | 187 |
| ఆత్మకూరు ... | ... 639 | ... | 113 | 22,940 | 112,144 | 55,756 | 56,388 | 105,640 | 6.2 | 0.5 | 175 |
| దరిశి ... | ... 591 | ... | 119 | 19,420 | 99,980 | 50,477 | 49,503 | 94,047 | 6.3 | 1.7 | 169 |
| గూడూరు ... | ... 460 | 1 | 114 | 21,512 | 99,356 | 50,557 | 48,799 | 94,740 | 4.9 | 3.8 | 216 |
| కందుకూరు ... | ... 801 | 1 | 166 | 36,263 | 175,970 | 88,352 | 87,618 | 165,876 | 6.1 | 7.6 | 220 |
| కనిగిరి ... | ... 1,000 | 1 | 182 | 26,413 | 134,395 | 65,722 | 68,673 | 128,263 | 4.8 | 2.8 | 134 |
| కావలి ... | ... 548 | 1 | 78 | 22,996 | 112,038 | 55,326 | 56,712 | 101,667 | 10.2 | 9.6 | 204 |
| కోవూరు ... | ... 385 | 2 | 84 | 32,876 | 148,090 | 73,856 | 74,234 | 132,393 | 11.9 | 6.2 | 385 |
| నెల్లూరు ... | ... 505 | 1 | 119 | 41,437 | 190,534 | 95,436 | 95,098 | 172,779 | 10.3 | 3.3 | 377 |
| పొదిలె ... | ... 564 | ... | 110 | 14,625 | 75,632 | 37,964 | 37,668 | 72,761 | 3.9 | 5.3 | 134 |
| పోలూరు ... | ... 563 | 1 | 142 | 18,329 | 89,618 | 45,817 | 43,801 | 83,009 | 8.0 | 9.4 | 159 |
| రాపూరు ... | ... 594 | ... | 110 | 15,059 | 72,119 | 36,987 | 35,132 | 67,591 | 6.7 | 2 1 | 121 |
| ఉదయగిరి ... | ... 871 | ... | 132 | 21,110 | 101,928 | 50,143 | 51,785 | 97,088 | 5.0 | —1.3 | 117 |
| వెంకటగిరి ... | ... 427 | 1 | 152 | 14,846 | 74,418 | 37,929 | 36.489 | 69,699 | 6.8 | 6.6 | 174 |
| కడప ... | ... 5,919 | 8 | 889 | 197,526 | 949,397 | 483,914 | 465,483 | 887,929 | 6.9 | — 0.7 | 160 |
| బద్వేలు ... | ... 755 | 1 | 119 | 20,154 | 93,888 | 47,395 | 46,493 | 90,790 | 3.4 | — 5.8 | 124 |
| కడప ... | ... 509 | 1 | 93 | 23,951 | 108,035 | 54,998 | 53 037 | 102,132 | 5.8 | 1.6 | 212 |
| జమ్మలమడుగు | ... 612 | 1 | 127 | 21,411 | 102,910 | 51,986 | 50,924 | 98,572 | 4.4 | — 7.3 | 168 |
| కమలాపురము | ... 303 | 1 | 62 | 13,216 | 68,275 | 34,613 | 33.662 | 65,081 | 4.9 | 1.1 | 225 |
| ప్రొద్దుటూరు | ... 430 | 1 | 79 | 22,142 | 107,645 | 54,500 | 53,145 | 95,793 | 12.4 | — 0.6 | 250 |
| పులివెందల ... | ... 565 | 1 | 91 | 19.096 | 96,157 | 49,225 | 46,932 | 88,326 | 8.9 | — 5.6 | 170 |
| రాజంపేట ... | ... 1,035 | 1 | 130 | 32,946 | 158,356 | 80,734 | 77,622 | 151,380 | 4 6 | 4 2 | 153 |
| రాయచోటి | ... 1,103 | 1 | 111 | 31,483 | 150,962 | 78,099 | 72,863 | 134,798 | 12.0 | 5.8 | 137 |
| సిద్ధవటం ... | ... 606 | ... | 77 | 13,127 | 63,169 | 32,364 | 30,805 | 61,057 | 3.5 | — 5.1 | 104 |
| కర్నూలు ... | ... 7,581 | 2 | 796 | 211,415 | 1,024 961 | 520,238 | 504,723 | 914,890 | 1.20 | — 2.2 | 135 |
| కంబం ... | ... 1.060 | ... | 99 | 27,606 | 132,272 | 66,071 | 66,201 | 119,931 | 10.3 | — 4.5 | 125 |
| ద్రోణాచలము | ... 817 | ... | 76 | 21,749 | 108,101 | 56,180 | 51,921 | 88,828 | 21.7 | — 7.2 | 132 |
| కోయిలకుంట్ల | ... 572 | ... | 85 | 19,429 | 87,034 | 44,119 | 42,915 | 83,440 | 4.3 | — 8 6 | 152 |
| కర్నూలు ... | ... 640 | 1 | 95 | 30,858 | 155,528 | 79,244 | 76,284 | 139,135 | 11.8 | — 0.8 | 243 |
| మార్కాపురము | ... 1,140 | ... | 98 | 22,034 | 108,712 | 54,972 | 53,740 | 106,974 | 1.6 | 8 0 | 95 |
| నందికొట్కూరు | ... 1,308 | ... | 99 | 24,755 | 117,007 | 58,778 | 58,229 | 104,882 | 11.6 | 4.3 | 89 |
| నంద్యాల ... | ... 679 | 1 | 77 | 21 603 | 101,028 | 51,289 | 49,739 | 92,328 | 9.4 | 1.1 | 149 |
| పత్తికొండ ... | ... 747 | ... | 70 | 24,916 | 122.436 | 62,512 | 59,924 | 101,403 | 20.7 | — 9.1 | 164 |
| సిరువేల్ ... | ... 617 | ... | 97 | 18,465 | 92,843 | 47,073 | 45,770 | 77,969 | 19.1 | — 2 6 | 150 |



బాపట్ల యువజనసంఘ వార్షికోత్సవము, విందు



తిరువాంకూరి మహారాజుసోదరి పరిణయోత్సవము

## పట్టిక ౧. జిల్లా, తాలూకావారి వైశాల్యము—జనసంఖ్య.

| తాలూకా. | చదరపు మైళ్ళ వైశాల్యము | సంఖ్య: పట్టణములు | సంఖ్య: గ్రామములు | కాపురమున్న ఇండ్లు | జనసంఖ్య 1931: మొత్తము | జనసంఖ్య 1931: పురుషులు | జనసంఖ్య 1931: స్త్రీలు | జనసంఖ్య 1921: మొత్తము | వ్యత్యాసపు పెర్సెంటేజి: 1921 మొదలు 1931 వరకు | వ్యత్యాసపు పెర్సెంటేజి: 1911 మొదలు 1921 | 1931 లో చదరపు మైలు 1కి జనసంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 |
| బళ్లారి ... ... | 5,713 | 10 | 908 | 198,410 | 969,774 | 493,018 | 476,756 | 862,370 | 12.5 | — 11.0 | 170 |
| ఆదోని ... ... | 766 | 3 | 164 | 37,755 | 193,200 | 97,894 | 95,306 | 168,842 | 14.4 | — 6.1 | 252 |
| ఆలూరు ... ... | 613 | ... | 94 | 21,105 | 105,400 | 53,073 | 52,327 | 97,667 | 7.9 | — 10 2 | 172 |
| బళ్లారి ... ... | 6?2 | 1 | 102 | 26,212 | 132,133 | 67,374 | 64,759 | 114,680 | 15.2 | — 11.2 | 203 |
| హడగల్లి ... ... | 587 | ... | 87 | 18,600 | 86,292 | 43,060 | 43,232 | 77,495 | 11.4 | — 16.6 | 147 |
| హర్పనహల్లి ... | 611 | 1 | 81 | 19,706 | 100,039 | 51,776 | 48,263 | 84,974 | 17.7 | — 13.4 | 164 |
| హాస్పేటు ... ... | 537 | 2 | 106 | 19,661 | 89,511 | 45,944 | 43,567 | 85,256 | 5.0 | — 7.5 | 167 |
| కూడ్లిగి ... ... | 863 | 1 | 114 | 22,901 | 108,283 | 55,326 | 52,957 | 92,991 | 16.4 | — 15.5 | 125 |
| రాయదుర్గము ... | 681 | 1 | 80 | 18,636 | 92 484 | 47,383 | 45,101 | 84,163 | 9.9 | — 5.6 | 136 |
| సిరుగుప్ప ... ... | 403 | 1 | 80 | 13,834 | 62,432 | 31,188 | 31,244 | 56,802 | 10.9 | — 20.9 | 155 |
| అనంతపురము ... | 6,741 | 12 | 853 | 215,487 | 1,050,411 | 539,534 | 510,877 | 955,917 | 9.9 | — 0.8 | 156 |
| అనంతపురము ... | 926 | 1 | 114 | 23,668 | 116,958 | 61,049 | 55,909 | 111,825 | 4.6 | 5.4 | 126 |
| ధర్మవరము ... ... | 736 | 1 | 63 | 18,888 | 90,024 | 46,496 | 43,528 | 88,668 | 1.5 | — 1.3 | 122 |
| గుత్తి ... ... | 896 | 4 | 132 | 31,569 | 159,640 | 81,476 | 78,164 | 13?,355 | 18 8 | — 9.3 | 178 |
| హిందూపురము ... | 431 | 1 | 77 | 23,507 | 110,194 | 56,785 | 53,409 | 100,490 | 9.7 | 3 9 | 256 |
| కదిరి ... ... | 1,162 | 1 | 141 | 35,867 | 173,254 | 89,600 | 83,654 | 150,352 | 15 2 | 2.0 | 149 |
| కల్యాణదుర్గము ... | 821 | 1 | 74 | 17,590 | 87,447 | 45,236 | 42,211 | 80,164 | 9.1 | — 3.9 | 107 |
| మడకసిర ... ... | 446 | 1 | 57 | 19,160 | 97,081 | 49,273 | 47,808 | 85,595 | 13.4 | 4.2 | 218 |
| పెనుకొండ... ... | 682 | 1 | 98 | 21,399 | 98,498 | 50,246 | 48,252 | 92,918 | 6.0 | — 1.0 | 144 |
| తాడిపత్రి ... ... | 641 | 1 | 97 | 23,839 | 117,315 | 59,373 | 57,942 | 111,550 | 5.2 | — 2.4 | 183 |
| చిత్తూరు ... ... | 5,901 | 7 | 2,254 | 273,726 | 1,447,103 | 738,325 | 708,778 | 1,322,664 | 9.4 | 2.0 | 245 |
| చంద్రగిరి ... ... | 548 | 1 | 222 | 27,135 | 132,459 | 64,797 | 64,662 | 122,208 | 8.4 | 4.1 | 242 |
| చిత్తూరు ... ... | 786 | 1 | 344 | 46,612 | 258,100 | 131,095 | 127,005 | 237,737 | 8.6 | 2.1 | 328 |
| [illegible]హస్తి ... ... | 622 | 1 | 341 | 22,479 | 118,031 | 60,290 | 57,741 | 109,177 | 8.1 | 7.9 | 190 |
| [illegible] ... ... | 305 | 1 | 250 | 12,879 | 6?,367 | 30,822 | 30,545 | 53,507 | 14 7 | — 7.8 | 201 |
| మదనపల్లి ... ... | 836 | 1 | 104 | 32,310 | 153,618 | 79,430 | 74,188 | 141,310 | 8.7 | 2 8 | 184 |
| పల్మనేరు ... ... | 411 | ... | 87 | 11,835 | 59,567 | 30,452 | 29,115 | 50,434 | 18.1 | 0.7 | 145 |
| పుంగనూరు ... ... | 648 | 1 | 105 | 23,729 | 122,271 | 62,602 | 59,669 | 109,391 | 11.8 | 2.2 | 189 |
| పుత్తూరు ... ... | 542 | ... | 347 | 34,978 | 196,111 | 99,577 | 96,534 | 181,820 | 7.8 | 1.6 | 362 |
| తిరుత్తణి ... ... | 401 | 1 | 329 | 32,175 | 198,455 | 100,767 | 97,688 | 184,755 | 7.4 | — 0.9 | 495 |
| వాయల్పాడు ... | 802 | ... | 125 | 29,594 | 147,124 | 75:498 | 71,631 | 132,325 | 11.2 | 4.5 | 183 |

# ఆంధ్రరాష్ట్రము జనాభా

## పట్టిక ౨. మత, విద్యానుసారము జిల్లా, తాలూకాలవారి—జనసంఖ్య



| జిల్లా, తాలూకా. | హిందువులు. బ్రాహ్మణులు. మొత్తము. | | బ్రాహ్మణులు. చదువుకొన్నవారు. | | ఇతరహిందువులు. మొత్తము. | | ఇతరహిందువులు. చదువుకొన్నవారు. | | నిమ్న జాతి. మొత్తము. | | నిమ్న జాతి. చదువుకొన్నవారు. | | జైనులు. మొత్తము. | | జైనులు. చదువుకొన్నవారు. | | సిక్కులు. మొత్తము. | | సిక్కులు. చదివిన వారు. | | మహమ్మదీయులు. మొత్తము | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పు. | స్త్రీ. | పు. | స్త్రీ. | పురుషులు. | స్త్రీలు. |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 |
| గంజాం ఏజెన్సీ... | 757 | 498 | 388 | 22 | 57,349 | 60,824 | 4,398 | 143 | 32,071 | 30,872 | 316 | 5 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 56 | 39 |
| బల్లిగూడ ... | 250 | 180 | 81 | 16 | 18,842 | 19,355 | 1,121 | 14 | 11,818 | 11,433 | 105 | 5 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 9 | 4 |
| G. ఉదయగిరి ... | 244 | 112 | 163 | 1 | 12,788 | 18,808 | 1,354 | 47 | 10,785 | 10,554 | 117 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 41 | 33 |
| పర్లాకిమిడి ... | 101 | 101 | 56 | 2 | 6,665 | 7,187 | 351 | 7 | 2,131 | 2,294 | 41 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 5 | ... |
| రామగిరి ... | 114 | 73 | 65 | 2 | 17,700 | 19,083 | 1,317 | 64 | 7,334 | 6,590 | 51 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 1 | 2 |
| సూరాడ ... | 28 | 32 | 22 | 1 | 1,354 | 1,381 | 245 | 11 | 3 | 1 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| గంజాం సమభూములు ... | 72,750 | 80.944 | 33,421 | 3,996 | 741,758 | 878,853 | 73,603 | 4425 | 108,805 | 136 239 | 2,816 | 65 | 1 | 1 | 1 | ... | ... | ... | ... | ... | 2,849 | 2,636 |
| అస్కా ... | 12.876 | 14,486 | 5,726 | 417 | 68,944 | 86,426 | 8,251 | 485 | 11,074 | 14,790 | 541 | 5 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 290 | 236 |
| బరహంపురము ... | 13,359 | 13,969 | 6,270 | 992 | 108,977 | 131,116 | 13,292 | 711 | 15,759 | 19,501 | 537 | 14 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 907 | 817 |
| ఛత్రపూర్ పురము.. | 12,904 | 14,895 | 5,255 | 399 | 61,572 | 74,830 | 6,692 | 412 | 10,158 | 12,503 | 323 | 16 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 147 | 92 |
| చికాకోల్ ... | 2,764 | 2,876 | 1,779 | 493 | 123,595 | 138,091 | 10,081 | 695 | 12,770 | 15,419 | 81 | 3 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 510 | 471 |
| గంజాం ... | 6,190 | 7,828 | 3,429 | 258 | 60,758 | 79,118 | 8,508 | 615 | 9,847 | 13,999 | 471 | 15 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 298 | 309 |
| ఇచ్ఛాపురము ... | 3,654 | 4,147 | 1,716 | 112 | 27,579 | 33,546 | 2,411 | 153 | 4,565 | 6,489 | 112 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 29 | 25 |
| కోడాల ... | 9,401 | 10,726 | 3,998 | 193 | 71,372 | 90,702 | 7,505 | 469 | 10,548 | 13,088 | 348 | 5 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 212 | 214 |
| పర్లాకిమిడి ... | 5,757 | 6,021 | 2,690 | 725 | 104,712 | 111,238 | 8,181 | 444 | 20,504 | 23,314 | 144 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 233 | 253 |
| సోంపేట ... | 1,973 | 2,392 | 1,013 | 175 | 45,747 | 57,778 | 3,537 | 151 | 4,331 | 6,171 | 72 | 3 | 1 | 1 | 1 | ... | ... | ... | ... | ... | 68 | 75 |
| సూరాడ ... | 1,167 | 1,325 | 471 | 44 | 8,434 | 9,579 | 989 | 55 | 1,504 | 1,763 | 69 | 3 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 1 |
| టెక్కలి ... | 2,105 | 2,279 | 1,074 | 188 | 60,113 | 71,339 | 4,106 | 235 | 7,270 | 8,799 | 118 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 155 | 143 |

విశాఖపట్నము

| | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ఏజెన్సీ ... | 5,429 | 5,569 | 2,830 | 299 | 435,152 | 435,594 | 10,887 | 630 | 60,635 | 61,069 | 279 | 10 | ... | ... | ... | ... | 9 | 7 | ... | ... | 1,184 | 1,066 |
| బిసంకటక ... | 204 | 213 | 66 | ... | 21,603 | 21,561 | 475 | 7 | 5,055 | 5,157 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 27 | 18 |
| గొలుగొండ ... | 81 | 89 | 54 | 7 | 8,333 | 8,812 | 368 | 9 | 1,593 | 1,531 | 7 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 109 | 94 |
| గూడెం ... | 6 | ... | 4 | ... | 10,063 | 10,203 | 68 | ... | 1,615 | 1,537 | 37 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 4 | 4 |
| గుణుపురము ... | 1,636 | 1,688 | 844 | 89 | 41,445 | 41,723 | 2,598 | 123 | 5,180 | 5,430 | 49 | 6 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 37 | 18 |
| జయపురము ... | 2,041 | 2,116 | 1,132 | 125 | 71,549 | 72,950 | 2,705 | 202 | 14,552 | 14,574 | 60 | ... | ... | ... | ... | ... | 6 | 5 | ... | ... | 314 | 281 |
| కొరాపుట్టి ... | 142 | 98 | 115 | 1 | 24,221 | 24,389 | 840 | 16 | 4,128 | 4,175 | 20 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 36 | 39 |
| మల్కనగిరి ... | 25 | 19 | 16 | 9 | 31,597 | 31,974 | 335 | 28 | 2,259 | 2,341 | 17 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 92 | 84 |
| నౌరంగపురము ... | 748 | 821 | 359 | 34 | 87,026 | 84,919 | 1,620 | 95 | 9,236 | 9,068 | 35 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 224 | 221 |
| పాడ్వా ... | 25 | 15 | 11 | 3 | 48,788 | 48,310 | 185 | 27 | 6,566 | 6,576 | 3 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 39 | 30 |
| పాలకొండ ... | 1 | ... | 1 | ... | 6,970 | 6,778 | 17 | ... | 81 | 88 | ... | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| పార్వతీపురము ... | 45 | 38 | 27 | ... | 15,085 | 15,506 | 267 | 5 | 1,296 | 1,251 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 10 | 9 |
| పొట్టంగి ... | 59 | 51 | 44 | 5 | 35,133 | 34,712 | 568 | 15 | 4,408 | 4,591 | 22 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 174 | 195 |
| రాయగడ ... | 413 | 420 | 156 | 25 | 28,826 | 29,255 | 828 | 103 | 3,504 | 3,390 | 28 | 3 | ... | ... | ... | ... | 3 | 2 | ... | ... | 114 | 76 |
| సాలూరు ... | ... | ... | ... | ... | 649 | 549 | 1 | ... | 33 | 25 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| శృంగవరపుకోట ... | 3 | 1 | 1 | 1 | 2,275 | 2,364 | 12 | ... | 327 | 358 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| వీరవల్లి ... | ... | ... | ... | ... | 1,589 | 1,489 | ... | ... | 702 | 677 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 4 | ... |

విశాఖపట్నం

| | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సమభూములు | 27,297 | 27,814 | 17,968 | 4,706 | 1,025,266 | 1,076,456 | 59,074 | 4,109 | 115,505 | 125,136 | 966 | 34 | 5 | 2 | 3 | 1 | 4 | ... | 2 | ... | 11,740 | 11,944 |
| అనకాపల్లి ... | 1,699 | 1,866 | 1,106 | 251 | 78,076 | 88,034 | 3,678 | 341 | 4,929 | 6,414 | 59 | 2 | 3 | ... | 3 | ... | ... | ... | ... | ... | 680 | 726 |
| భీమునిపట్నం ... | 894 | 825 | 592 | 176 | 62,962 | 64,379 | 2,781 | 204 | 5,518 | 5,881 | 44 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 553 | 478 |
| బొబ్బిలి ... | 2,117 | 2,236 | 1,307 | 373 | 71,741 | 74,600 | 4,810 | 179 | 9,244 | 9,189 | 79 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 308 | 276 |
| చీపురుపల్లి .. | 1,374 | 1,387 | 877 | 171 | 89,186 | 91,951 | 3,993 | 81 | 11,277 | 11,498 | 23 | 3 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 300 | 296 |
| గజపతినగరం ... | 1,198 | 1,246 | 707 | 114 | 70,695 | 71,937 | 1,991 | 97 | 7,881 | 8,143 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 392 | 404 |
| గొలుగొండ ... | 1,058 | 1,262 | 616 | 175 | 67,601 | 68,391 | 2,793 | 102 | 8,329 | 8,847 | 28 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 555 | 574 |
| పాలకొండ ... | 2,603 | 2,731 | 1,544 | 230 | 99,792 | 102,248 | 6,145 | 273 | 15,768 | 16,659 | 52 | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 161 | 144 |
| పార్వతీపురము ... | 1,460 | 1,582 | 956 | 194 | 55,912 | 57,763 | 4,391 | 186 | 6,467 | 6,595 | 55 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 318 | 291 |
| సాలూరు ... | 671 | 700 | 371 | 56 | 40,895 | 44,141 | 2,640 | 134 | 5,220 | 5,245 | 15 | 2 | ... | ... | ... | ... | 2 | ... | ... | ... | 267 | 276 |
| సర్వసిద్ధి ... | 1,818 | 1,931 | 1,174 | 277 | 77,508 | 85,965 | 4,015 | 178 | 9,021 | 10,566 | 20 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 2,154 | 2,569 |
| శృంగవరపుకోట ... | 1,541 | 1,738 | 957 | 146 | 67,685 | 72,201 | 2,862 | 98 | 7,072 | 8,028 | 13 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 691 | 736 |
| వీరవల్లి ... | 2,087 | 2,127 | 1,309 | 338 | 98,882 | 107,056 | 4,487 | 224 | 8,654 | 10,272 | 53 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 913 | 922 |
| విశాఖపట్నం ... | 3,753 | 3,327 | 2,681 | 1,196 | 52,954 | 54,633 | 7,262 | 1,132 | 5,086 | 6,067 | 309 | 13 | 2 | 2 | ... | 1 | 2 | ... | 2 | ... | 2,719 | 2,685 |
| విజయనగరం ... | 5,074 | 4,856 | 3,771 | 1,009 | 91,377 | 93,157 | 7,226 | 880 | 11,039 | 11,732 | 215 | 10 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 1,729 | 1,567 |

## పట్టిక ౨. మత, విద్యానుసారము, జిల్లా, తాలూకాలవారి—జనసంఖ్య.

| తాలూకా | మహమ్మదీయ (అనుబంధము) చదువుకొన్నవారు. | | క్రైస్తవులు. | | | | జాతులు. | | | | ఇతరులు. | | | | చదువుకొన్న వారు. | | | | | | | | రిమార్కులు. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | జనసంఖ్య. | | చదువుకొన్నవారు. | | జనసంఖ్య. | | చదువుకొన్నవారు. | | జనసంఖ్య. | | చదివినవారు. | | 0—15 సం. ఈడువారు. | | 15—20 సం. ఈడువారు. | | 20 సంవత్సరము పైవారు. | | ఇంగ్లీషు చదివినవారు. | | |
| | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | పురుషులు. | స్త్రీలు. | |
| | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 32 | 33 | 34 | 35 | 36 | 37 | 38 | 39 | 40 | 41 | 42 | 43 | 44 | 45 | 46 |
| **గంజాం** | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| ఏజెన్సీ... | 24 | 2 | 2,998 | 2,895 | 458 | 35 | 83,430 | 86,469 | 782 | 25 | ... | ... | ... | ... | 1,083 | 43 | 1,068 | 45 | 4,215 | 144 | 256 | 5 | |
| బల్లిగూడ ... | 7 | ... | 266 | 242 | 71 | 1 | 25,237 | 23,309 | 192 | ... | ... | ... | ... | ... | 313 | 4 | 239 | 6 | 1,026 | 27 | 93 | ... | |
| G. ఉదయగిరి | 15 | 1 | 487 | 376 | 96 | 3 | 17,550 | 18,410 | 286 | 2 | ... | ... | ... | ... | 413 | 7 | 390 | 13 | 1,227 | 33 | 83 | ... | |
| పర్లాకిమిడి ... | 1 | ... | 1,009 | 1,019 | 116 | 15 | 23,858 | 25,311 | 39 | ... | ... | ... | ... | ... | 72 | 5 | 120 | 7 | 422 | 17 | 42 | 5 | |
| రామగిరి ... | 1 | ... | 1,212 | 1,244 | 168 | 16 | 18,785 | 19,439 | 265 | 23 | ... | ... | ... | ... | 245 | 23 | 277 | 16 | 1,346 | 67 | 34 | ... | |
| సూరాడ ... | ... | 1 | 22 | 16 | 8 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 40 | 4 | 42 | 3 | 194 | 5 | 4 | ... | పు. స్త్రీ. |
| **గంజాం సతు భూములు** | 973 | 113 | 1,352 | 1,339 | 673 | 562 | 13,620 | 12,140 | 10 | 1 | †52 | †42 | 2 | 1 | 16,624 | 21,63 | 15,759 | 1,736 | 79,066 | 5,264 | 11,236 | 451 | †బౌద్ధులు 52 42 |
| ఆస్కా ... | 92 | 5 | 174 | 156 | 78 | 18 | 381 | 457 | 1 | ... | ... | ... | ... | ... | 2,081 | 215 | 1,539 | 161 | 11,069 | 554 | 711 | 4 | |
| బరహంపురము | 320 | 49 | 403 | 441 | 273 | 299 | 302 | 334 | ... | 1 | 15 | 9 | 2 | 1 | 3,124 | 521 | 2,811 | 315 | 14,759 | 1,231 | 3,476 | 183 | |
| ఛత్రపురము... | 28 | 4 | 41 | 45 | 24 | 25 | 3 | ... | ... | ... | ... | ... | ... | ... | 1,665 | 221 | 1,568 | 167 | 9,089 | 468 | 660 | 43 | |
| చికాకోల్ ... | 174 | 19 | 152 | 137 | 61 | 52 | ... | ... | ... | ... | 25 | 17 | ... | ... | 1,741 | 289 | 1,628 | 237 | 8,807 | 736 | 1,722 | 44 | |
| గుమసూర్ ... | 122 | 19 | 84 | 86 | 64 | 61 | 1,503 | ... | ... | ... | ... | ... | ... | ... | 2,045 | 249 | 1,834 | 163 | 8,815 | 556 | 851 | 23 | |
| ఇచ్ఛాపురము | 5 | ... | 19 | 17 | 2 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 701 | 66 | 665 | 56 | 2,880 | 143 | 205 | ... | |
| కోడాల ... | 58 | 10 | 20 | 16 | 14 | 9 | 98 | 91 | ... | ... | ... | ... | ... | ... | 1,803 | 116 | 1,877 | 155 | 8,243 | 415 | 449 | 10 | |
| పర్లాకిమిడి ... | 59 | 5 | 329 | 298 | 103 | 52 | 10,324 | 10,236 | 7 | ... | ... | ... | ... | ... | 1,867 | 292 | 2,300 | 341 | 6,967 | 594 | 1,910 | 95 | |
| సోంపేట ... | 24 | ... | 33 | 31 | 21 | 20 | 1,003 | 1,003 | 2 | ... | 12 | 16 | ... | ... | 692 | 64 | 593 | 61 | 3,385 | 224 | 591 | 18 | |
| సూరాడ ... | ... | ... | 1 | ... | 1 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 188 | 29 | 199 | 12 | 1,143 | 61 | 30 | ... | |
| టెక్కలి ... | 41 | 2 | 96 | 112 | 32 | 26 | 6 | 19 | ... | ... | ... | ... | ... | ... | 717 | 101 | 745 | 68 | 3,909 | 282 | 631 | 31 | |

